# బారిష్టర్ పార్వతీశం

మొక్కపాటి నరసింహశాస్త్రి

అభినందన పబ్లిషర్స్

28-10-1 కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-520 002

# Baristar Parvatheesam

– Mokkapati Narasimha Sastry

**Abhinandana Publishers**
Karl Marx Road,
Vijayawada - 520 002.

DIRECTOR OF PUBLISHING
**B. Babjee**

FIRST EDITION - 1924.
THIRD COMBINED EDITION : 1995

PRICE : Paperback Rs.100/-
Delux Hard Bound Rs.150/-

COVER AND INSIDE ILLUSTRATIONS:
BAPU

TYPE SETTING :
AKSHARAMALA, VIJAYAWADA -520 002

PRINTED AT
JAYA PROCESS
HYDERABAD

COVER PRINTED AT :
KALA JYOTHI PROCESS Pvt Ltd ,
Hyderabad - 500 020

ALSO COPIES CAN BE HAD FROM
**NEW STUDENTS BOOK CENTRE**
ARUNDLEPET, GUNTUR - 2

ISBN 81-85591-08-3 PAPER BACK

# బారిష్టర్ పార్వతీశం

- మొక్కపాటి నరసింహశాస్త్రి

అభినందన పబ్లిషర్స్,
కార్ల్‌మార్క్సు రోడ్,
విజయవాడ - 520 002

డైరెక్టర్ ఆఫ్ పబ్లిషింగ్
బి బాబ్జి

మొదటి ముద్రణ 1924
మూడు భాగములు కలిపిన మూడవ ముద్రణ 1995

వెల . పేపర్ బాక్ రూ.100/-
డీలక్స్ హార్డ్ బౌండ్ రూ.150/-

ముఖచిత్రం మరియు లోపల చిత్రాలు
బాపు

టైప్ సెట్టింగ్
అక్షరమాల, విజయవాడ - 520 002

ముద్రణ
జయప్రాసెస్,
హైదరాబాద్

ముఖచిత్ర ముద్రణ .
కళాజ్యోతి ప్రాసెస్ (ప్రై). లిమిటెడ్.,
హైదరాబాద్ - 500 020

న్యూ స్టూడెంట్సు బుక్ సెంటర్
అరండల్‌పేట, గుంటూరు - 2
కాపీలు కూడ లభిస్తాయి

ISBN 81-85591-09-1 HARD BOUND

**జనవరి 1వ తేదీన 6వ విజయవాడ పుస్తక మహోత్సవ ప్రారంభోత్సవ సభలో బారిస్టరు పార్వతీశం, పుస్తకం ఆవిష్కరణ చేస్తూ శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ చేసిన ప్రసంగం**

---

గోదావరీ, గోరింటాకూ, గోంగూరా, గిరీశం, కచటతపలూ గసడదవలూ బారిస్టరు పార్వతీశం, పదహారణాలూ. ఇవి అసలు సిసలు తెలుగుదినుసులు తెలుగుతనపు జెండాలు.

బారిస్టరు పార్వతీశం మనని పొట్ట చెక్కలయ్యేలా నవ్వించడం మొదలుపెట్టి 70 ఏళ్ళు అయింది. ఇంకా నూటాడెబ్భయ్యేళ్ళయినా నవ్విస్తూనే వుంటాడు.

అమాయకత్వం పొంగిపొరలే గడుసుతనం, గడుసుతనం తొంగిచూసే అమాయకత్వం కలబోసి పోతపోసిన బంగారుతండ్రి పార్వతీశం.

మొక్కపాటి వారి 'అబ్బాయి'గా మన ముందుకొచ్చిన చిరంజీవి పార్వతీశం త్రివిక్రముడిలా పెరిగి పెద్దవాడై - ఆయన మొక్కపాటి నరసింహశాస్త్రిగారు - మన బారిస్టరు పార్వతీశం కన్నతండ్రి అని పరిచయం చేసే స్థితి వచ్చింది. ఈ సంగతి ఒకప్పుడు శాస్త్రిగారే సగర్వంగా చెప్పుకున్నారు.

ఈ విధంగా నిజంగా అక్షరాలా కీర్తిశేషులయిన చిరంజీవి మొక్కపాటి వారికి నా జోహార్లు. వారు కన్న చిరంజీవి పార్వతీశానికి జిందాబాదులు. మళ్ళీ మళ్ళీ చదవాలనిపించే ఈ పుస్తకాన్ని ఇలాంటి పుస్తకాలనూ మళ్ళీ ప్రచురించి నవతరాన్ని నవ్విస్తున్న అభినందన బాబ్జీ గార్కి అభినందనాలు. ఇలాంటి గొప్ప పనులు మళ్ళీ మళ్ళీ మళ్ళీ చేస్తూండాలని ఆకాంక్షిస్తున్నాను.

టీవీ ప్రేక్షకులు కూడా ఈ పుస్తకాన్ని నిర్భయంగా కొనేసి చదువుతే - టీవీలో కన్న గొప్ప చిత్రాలు కనిపిస్తాయనీ కరెంటు కరువుండదనీ గారంటీ ఇస్తున్నాను. మహారాజశ్రీ టీవీవారు కూడా ఇప్పటి ప్రోగ్రాములనే మళ్ళీమళ్ళీ వేస్తూ స్థాయి మారకుండా చూస్తూ బుక్కిండస్ట్రీ అభివృద్ధికి సాయపడాలని కోరుకుంటున్నాను. మళ్ళీ మళ్ళీ కోరుకుంటున్నాను. అప్పుడే చప్పట్లు కొట్టకండి.

టీవీ వాళ్ళకి ఇంకో పెద్ద ఎట్రాక్షన్! ఇందులో వందన్నర బొమ్మలున్నాయి - బాపు బొమ్మలున్నాయి. అవి 70MM 6 Track Stenophonic Sound తో వున్నాయి. ఇటు జోకులూ అటు బాపు-లూ మహాప్రభో! ఇహ చెప్పలేను! ఇప్పుడు కొట్టండి చప్పట్లు!

పూజ్యులు, ఆదర్శమూర్తి, మా అన్నగారు

మొక్కపాటి సుబ్బారాయుడు గారికి,

భక్తితో, ఈ నా ప్రథమకృతి సమర్పితము

## కృతజ్ఞతలు

ఈ కథను అంతనూ, కనుమరుగవుతున్న సమయంలో పైకిలాగి, ధారావాహికంగా 'ఆంధ్రజ్యోతి వారపత్రిక'లో ప్రచురించి, నేటి తరం యువ హృదయాలను ఆనంద భరితం చేయబూనిన ఉదారులూ, సహృదయులూ, రసజ్ఞులూ, బహు గ్రంథకర్తలూ, విశేషించి నా కాష్ఠమిత్రులూ, అయిన శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారికి నా కృతజ్ఞతలు ఎలా చెప్పాలో తెలియకుండా ఉన్నది. వారూహించుకో గలరు. దీనికి ప్రాణం పోసినట్లు చిత్ర రచన చేసిన శ్రీ బాబు గారికి కూడా నా కృతజ్ఞతలు

ముఖచిత్రం ముచ్చటగా రూపొందించిన సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ బాపు గారికి మరీ కృతజ్ఞుడను

పుస్తకం రెండు మూడు భాగములు వ్రాయడానికి, నా కుడిచేయిగా వ్యవహరించిన చిరంజీవులు ఇంద్రగంటి శ్రీకాంత శర్మకు, కుమారి కప్పగంతుల రాజరాజేశ్వరికి అనేక ఆశీస్సులు

-- మొక్కపాటి నరసింహశాస్త్రి

ఎన్ని సార్లు చదివినా మళ్ళీ మళ్ళీదవాలని పించేలా హాస్యం పుట్టిపడేలా బారిష్టరు పార్వతీశాన్ని కీ శే మొక్కపాటి నరసింహశాస్త్రిగారు రచించి 1924 లో ప్రచురించారు

తర్వాత రెండు మూడు భాగాలు 'ఆంధ్రజ్యోతి వార పత్రిక'లో సీరియల్‌గా వెలువడ్డాయి ఆరవ ముద్రణలో ఈ భాగాలను చేర్చి బాబుగారి చిత్రాలతో శాస్త్రిగారే ప్రచురించారు 1971 లో.

శాస్త్రిగారి అనంతరం ఈ గ్రంథం చదువరులకు లభ్యం కావటం లేదు ఈ పుస్తకాన్ని తిరిగి ప్రచురించాలని, బాపుగారి చిత్రాలతో పాఠకులకి అందచేయాలని అనుకున్నాం. ముఖచిత్రంతో పాటు, లోపలి వ్యంగ్య చిత్రాలను వీలైనన్ని వేయవలసినదిగా బాపుగారిని మేము కోరాము వారు తమ అమూల్య కాలాన్ని వెచ్చించి ఎన్నో వ్యంగ్య చిత్రాలను కథలోని సంఘటనల ఆధారంగా చిత్రించారు దీనికి మేము ఎంతగానో కృతజ్ఞులం

ఈ ముద్రణ ఈ రూపంలో పాఠకులకు అందచేసే అవకాశం కలిగినందుకు సంతోషిస్తున్నాం

# ప్రకాశకీయం

మా సోదర సంస్థ న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్, విజయవాడ ద్వారా ఇప్పటివరకు ఎన్నో విజ్ఞానదాయకమైన పుస్తకాలు ప్రచురించి అందించిన మా నూతన సంస్థ అభినందన పబ్లిషర్స్.

1924 డిసెంబరు 24వ తారీకున తెనాలిలో సాహితీ సమితి ప్రథమ సమావేశంలో పుస్తక రూపంలో అవతరించిన బారిష్టరు పార్వతీశం వయస్సు ఈ 1994 డిసెంబరు 24 నాటికి 70 ఏళ్ళు. అయినా ఎన్నటికీ వసివాడని పాత్రగా పార్వతీశం ఆధునిక తెలుగు సాహిత్యంలో నిలిచాడు.

ఆ పాత్రను రూపొందించిన మొక్కపాటి నరసింహశాస్త్రిగారు 1974నాటికి మరో రెండు భాగాలతో అతని చరిత్రను సమగ్రమైన నవలగా రచించారు

1924-1974 మధ్య 50 ఏళ్ళు గడిచాయి. కనుక శాస్త్రి గారికి పార్వతీశం పాత్ర పట్ల ప్రేమ కూడా గాఢంగా పెరిగింది. అందువల్ల మొట్టమొదట ఆయన వ్రాసినప్పుడనుకున్న ఆ పాత్ర స్వభావానికీ, రెండు, మూడు భాగాలు వ్రాసే నాటికా పాత్ర స్వభావానికీ మౌలికంగానే మార్పు కనిపిస్తుంది. ఇది ఆయన కూడా గమనించి తమ తుది పలుకుల్లో సమర్థించుకున్నారు కూడా.

శాస్త్రిగారు ప్రధానంగా - నవల మూడు భాగాలూ వెలువరించే సందర్భంగా, పార్వతీశం బాల్యాన్ని విపులంగా తెలియచెప్పే ఉద్దేశంతో, మొదటి భాగం ప్రారంభంలో తొలి ఏడు ప్రకరణాలను అదనంగా కలిపారు. అలా కలిపిన వారు, 8వ ప్రకరణం మొదలు "నర్సాపురం దగ్గిర మొగలి తుర్రు మా కాపుర స్థలం.. " అనే వాక్యం నుంచి (50వ పేజీ) " . . ఇంటి దగ్గర చెప్పి బయలుదేరాను" అనే (51వ పేజీ) వాక్యం వరకూ ముద్రణలో తొలగించి ఉండవలసింది కాని, ఎందుచేతనో ఆయన ఆ పని చెయ్యలేదు. అలా చెయ్యకపోవడం వల్ల, పార్వతీశం స్వభావం, అతని తండ్రి స్వభావం తెలియచెప్పే రెండు రకాల "నవల ప్రారంభాలు" తటస్థించాయి. ఇవి విరుద్ధంగా కూడా పాఠకులకు తోచవచ్చు. అందుకే ఈ ముద్రణలో ఆ వాక్య భాగాలను బ్రాకెట్లలో వుంచాము. రచయిత చేయని మార్పును .. అంటే పూర్తిగా తొలగించటాన్ని .. మేము చేయటం భావ్యం కాదు కదా! –

ఎప్పటిలాగే పాఠకులు ఈ నవలను ఆదరించగలరని విశ్వసిస్తూ సమర్పిస్తున్నాము

విజయవాడ.
జనవరి, 1995

ఇట్లు
బి. బాల్జీ
డైరక్టర్ ఆఫ్ పబ్లిషింగ్
అభినందన పబ్లిషర్స్

# బారిష్టరు పార్వతీశం

## మొదటి భాగము

## పార్వతీశం పుట్టుపూర్వోత్తరాలు

పార్వతీశం పుస్తకం చదివినవాళ్ళు చాలామంది, "ఈ అసామి ఎవరండీ" అనో, "ఎవరిమీద రాశారండీ" అనో, "అసలిలా రాయాలని మీకు ఎలా తోచిందండీ" అనో, నన్ను తరచు అడుగుతూండడం కద్దు. అలాగే ఆ మధ్య రేడియోవారు కూడా "వాడి, అనగా పార్వతీశం పుట్టుపూర్వోత్తరాలు ఏమిటో, నాలుగు ముక్కలు చెప్పండి" అన్నారు. వారికి చెప్పిన సమాధానాలూ, దరిమిలా నన్ను ప్రశ్నించే వారికందరికీ నేను తరచు చెప్పిన సమాధానాల సారాంశం, ఈ క్రింది సమాచారం.

దేనికైనా పెట్టి పుట్టాలంటారు మనవాళ్లు; లేదా ముఖాన్ని రాసి ఉండాలంటారు. ఒక్కొక్క ముఖం చూస్తే ముద్దు పెట్టుకో బుద్ధి పుడుతుంది. అన్నప్పుడూ అందరికీ అది సాధ్యం కాకపోయినా మరోమాటు ఆ ముఖం చూడాలనీ, ఆ ముఖం గలవారిని పరిచయం చేసుకోవాలనీ అనిపిస్తుంది. కొన్ని ముఖాలు చూస్తే మొత్తబుద్ధి పుడుతుంది, జన్మలో ఆ ముఖం కనపడకుండా ఉంటే బాగుండుననిపిస్తుంది. అలాగే కొందరి పేరు వినగానే ఆయన పుట్టుపూర్వోత్తరాలేమిటో తెలుసుకోవలెననే కుతూహలం కలుగుతుంది. అలాంటి అదృష్టవంతుడు మా పార్వతీశం. అతని ముఖారవిందం, అందలి వికాసం అతని జన్మ నక్షత్రఫలం, అదంతాను. లేకపోతే ఎందరికో అతని పేరు తెలియడమేమి? నా పేరు తెలియక పోవడమేమి? అతని పరిచయం కోసం, అతని సంగతి తెలుసుకోడం కోసం, అందరూ కుతూహలపడడం ; కుతూహలమే కాదు తహతహా

డడం, ఎందుకు? మా వాడి పేరు తెలిసిన వాళ్ళలో శతాంశానికేనా నా పేరు తెలియక పోవడమేమి? ఒక్కరూ నన్ను తెలిసిన వాళ్ళలో నీ సంగతి సందర్భాలూ, పుట్టుపూర్వోత్తరాలూ ఏమిటి బాబూ అని ఏ ఒక్కరూ అడగరేమి? ఇది నాకు కొంచెం బాధగానే వుంటుంది. అప్పుడప్పుడు, ముఖ్యంగా నా స్నేహితులెవరేనా వారి స్నేహితులకో, లేదా ఏదేనా సభ లోనో నన్ను పరిచయం చేసేటపప్పుడు వీరు ఫలానా నరసింహశాస్త్రిగారు అంటే, అయితే ఏమంటావు అనే ప్రశ్నార్థక ముఖాలు చూడడం. వెంటనే "వారు పార్వతీశం సృష్టికర్త" అనగానే, ఓహో అలా చెప్పండి - అయితే కొంతవరకూ ఈయన్ను సహించవచ్చుననే తృప్తి వారిలో కనపడడం చూచినప్పుడు కొంచెం కష్టంగా ఉండే మాట వాస్తవమే! పుత్రాదిచ్ఛేత్ పరాజయం అంటారు కాని, ఏమో చెప్పలేను. ఆ పరజయాన్ని - ఎంత పుత్రునివల్లనైనా అంగీకరించడం కూడా గొప్పేనంటాను. నా మట్టుకు నేను గొప్పవాడినని కాదు కాని - నా పేరు ఎవ్వరూ ఎరక్కపోయినా ఇదే బాగుందని నా మనస్సుకు సమాధానం చాలాకాలం క్రితమే చెప్పు కున్నాను. నా అహమిక్కకు స్వస్తి చెప్పాను. మైనారిటీ వెళ్లని వాడికింద లెక్కవేసుకున్నాను నా మట్టుకు నేను. ఏమంటే పెద్దవాళ్ళంతా నన్ను సుబ్బారాయుడిగారి తమ్ముడు అంటారు. మరోచోట శివశంకరశాస్త్రిగారి వియ్యంకులనీ, తీర్థులుగారి మామగారనీ, అనిపించుకోడం బాగా అలవాటు యింది. అందుచేతను ఎవరైనా ఈయన పార్వతీశం రచయిత అనగానే అవతలవాడు ఓ పెద్ద నవ్వు నవ్వి, "అలాగటండీ! అలా చెప్పండి?" అని పైకి, అందుకనే ఆయన మొహం అలా వుందని లోపల, అనుకుం టున్నాడని తెలిసినా నాకేమీ ఇబ్బంది కలగడం లేదు. అంతే కాదు ; సంతోషంగా ఉంటోంది. ఈ మధ్యను. ఎందుచేతనంటే యేనకేనాప్యుపా యేనా, నలుగురి నోళ్ళాపడడం, నలుగురిచేతా నాలుగూ అనిపించుకోడం, మంచిదే అనుకోండి. సంతోషించతగ్గ విషయం. గర్వించతగ్గ విషయం అని చాలామంది అభిప్రాయం.

సరే నా మాటెవరికి కావాలి! పార్వతీశం సంగతి కదా మీకు కావలసింది. అతని పుట్టుపూర్వోత్తరాలు నేను మట్టుకు ఏం చెప్పను. అతను చెప్పకున్న దానికంటే, అతను అయోనిజుడు, స్వయంభువు బ్రహ్మ మానసపుత్రుల జాతిలోని వాడు.

పార్వతీశం తన నివాసం మొగలితుర్రు అని అని వ్రాసుకున్నా యదార్థం చేతను అతని పుట్టుక మాత్రం నర్సాపురం తాలూకా గుమ్ము

లూర్లు అనే గ్రామంలో మనలో మనమాట ఆ వూరులో పార్వతీశం ఎందుకు పుట్టవలసి వచ్చింది అంటే, అది మా అత్తవారి వూరు. అందు చేతను నాకు ఆ వూరు మీద అభిమానం యెక్కువ.

ఆ రోజులలో అక్కడకు ప్రయాణం యెంతో కష్టంగా వుండేది. ఆ వూరికి ఎటువైపునా రోడ్డులేదు. మట్టిరోడ్డు కూడా సరిగా వుండేది కాదు. వర్షం కురిస్తే బాటసారుల పాట్లు పరమేశ్వరుని కెరుక, అయినా నాకక్కడకు వెళ్ళడం సరదాగా వుండేది.

ఒకసారి దీపావళికి మంచి వర్షాలు పడుతున్న రోజులలో, పడుతూ లేస్తూ ఒక్కడుగు ముందుకి వేయబోతే రెండడుగులు ముందుకి జారుతూ నానాయాతనా పడి, గుమ్మలూరు చేరుకున్నాను. అప్పుడు మామూలుగా మా బావమరుదులూ, మరదళ్ళూ పక్కింటి వారబ్బాయీ మొదలైన వాళ్ళంతా నా చుట్టూ చేరారు. వీళ్ళంతా నన్నొక నాయకుణ్ణి చూసినట్లు భక్తిభావంతో చూస్తూండేవారు. ఉబుసుపోకకు, వాళ్ళకు ఆ కబురూ, ఈ కబురూ చెప్పడంలో ఆనాటి పడవ ప్రయాణంలో వుండే కష్టాలూ, తమాషాలూ, అనుభవాలు కొన్ని చెప్పుకొచ్చాను. వాళ్లు చాలా సంతోషించారు. వాళ్ళంతా నన్ను ఏకగ్రీవంగా అదో కథలా వ్రాయమన్నారు. నాకప్పటికీ పుస్తకం రాద్దామని సంకల్పం ఎంతమాత్రమూలేదు. సరికదా వ్రాయగలననే ధైర్యం కూడా సుతరామూ లేదు. నేనప్పటికి వ్రాసినదల్లా మూడుకథలు మాత్రమే. "పిలక", "నేను మా ఆవిడ", అనేవి సాహితిలోనూ, లక్ష్మి, భారతి పత్రికలోనూ తరువాత అచ్చుపడ్డాయి. సాహిత్యరంగంలో అతిచౌకగా ఖ్యాతి సంపాదించిన వాళ్ళలో అగ్రగణ్యుడను నేను. పిలక, లక్ష్మి అనేవి రెండూ చాలామంది దృష్టిని ఆకర్షించాయి, చాలామంది అభిమానాన్ని పొందినాయి. కాని నాకు తెలుసు కనుకను ఇకముందు నేనేమీ వ్రాయకుండా వుంటే మర్యాదగా వుంటుంది అనుకుంటూండగా ఈ సమావేశం తటస్థమయింది. "బాలవాక్యం బ్రహ్మవాక్యం" అన్నారు పెద్దలు. మా కుర్రాళ్లు అడగగానే యెందుకో నాకూ వ్రాయవలెనని ఉత్సాహం కలిగింది. కాగితం మీద శ్రీరామ చుట్టి ప్రారంభించి, ఒక కుర్రవాడిని నర్సాపురం నుంచి నిడదవోలుదాకా తీసుకువెళ్ళాను అక్కడ వాడిని ఏమి చెయ్యాలో తోచక మద్రాసు తీసుకువెళ్ళాను. అప్పటికి కుర్రవాడికి నామకరణం చెయ్యలేదు. ఇంగ్లండు పంపిద్దామని అనుకోనూ లేదు. ఆ వ్రాసినంతవరకూ మా కుర్రవాళ్ళకు చదివి వినిపించాను. వాళ్లు చాలా బాగుందని ఏకగ్రీవంగా నాకు సర్టిఫికెట్ ఇచ్చారు. ఆ కుర్రవాళ్ళ

సంతోషం నాకెంతో ఉత్సాహం కలిగించింది. ఈ కుర్రవాడు మద్రాసులో వుండిపోయాడే, వాడిని మళ్ళీ యిల్లు చేర్చవద్దా అనుకున్నాను. కథకు ఆది మధ్యాంతాలు సరిగా వుంటేనేకాని నాకు తృప్తిగా వుండదు. అందు చేతను ఆ కుర్రవాని సంగతి తేల్చక తప్పింది కాదు. అప్పుడు హటాత్తుగా తోచింది. ఇలాంటివాడిని దేశాంతరాలకు తీసుకువెడితే యెలా వుంటుందా అని, చాలా తమాషాగా వుంటుందనిపించింది, సరే ఎంత ఖర్చయినా, యెంత శ్రమయినా వీడిని ఇంగ్లండు పంపించవలసినదే ననుకున్నాను. ఆ రోజులలో ఇంగ్లండు వెళ్ళడమన్నా బారిష్టరు చదవడమన్నా చాలా గొప్ప.

ఈ కుర్రవాడి భవిష్యత్తు ఎప్పుడైతే నిశ్చయయిందో, ఆ తక్షణం అతని జన్మస్థానం పేరూ, ఇంటిపేరూ, చదువూ వగైరా అవసరమైన పూర్వరంగం వ్రాశాను. అంతవరకే. నా బాధ్యత తరువాత కథంతా పార్వతీశమే చెప్పుకుపోయాడు. మన పురాణకర్తలు సూతుడు, శౌనకాది మహామునుల కిట్లనియె; అనో, దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. అనో కథ అందుకునేవారు. అప్పుడు దానంతటది కొంతదూరము సాగిపోయేది. డబ్ల్యు.డబ్ల్యు జేకబ్స్ అనే సుప్రసిద్ధ ఆంగ్ల హాస్య రచయిత వుండేవాడు. అతను నౌకా జీవితం యెన్ని రకాలుగానో, యెంతో హాస్య జనకంగానో, వర్ణిస్తూ అనేక కథలు వ్రాశాడు. అతని కథలన్నీ, దినైట్ వాచ్‌మన్ డెక్ మీద కూర్చుని ఇలా అన్నాడు, అని ప్రారంభిస్తేగాని అతనికి కథ నడిచేదికాదట.



అలాగే మాది మొగలితుర్రు మా ఇంటిపేరు వేమూరువ్వారు. అని స్వీయచరిత్ర మాదిరిగా ప్రారంభించే సరికి తరువాయి చరిత్ర అంతా నా ప్రయోజకత్వం లేకుండానే నడిచిపోయింది.

మొదటి నుంచీ నా బుద్ధికి మల్లేనే నా కాళ్ళకు కూడా స్థిరత్వం తక్కువ తరుచు ఎక్కడికో ఒక చోటికి తిరుగుతూంటేనే గాని తోచేది కాదు. ఈ కుర్రవాడిని మద్రాసులోనే ఉంచి, నేను గుమ్మలూరు నుంచి గుంటూరుకు ప్రయాణం కట్టాను. అక్కడ మా మిత్రులను కొందరిని తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి, నోరి నరసింహాశాస్త్రి, వఝ్ఝు బాబూరావు, శ్రీనివాస శిరోమణి ప్రభృతులను కూర్చోబెట్టి, బాలకవులు తరుము కాత్తపట్టి, తమ పద్యాలు విని పెంచినట్లు, నా కథ వినిపించాను. వారి ఆనందానికి మేర లేదు. ఇది చాలా పాప్యులర్ అవుతుందని వారు ఆశీర్వాదించారు. ఇది యూనిక్ వర్క్ అవుతుందనీ బ్రహ్మాండమైన జనాదరణ పొందుతుందనీ నోరి నరసింహశాస్త్రి గారు అన్నారు. తక్కిన మిత్రులంతా అనేక రకాలుగా నన్ను స్తోత్రం చేశారు. నేను ఊరికే సమయస్ఫూర్తిగా మాటలాడేవాడినా, హాస్యమొలిస్తున్నా, అని సందేహిస్తున్న మిత్రులు ఒకరిద్దరు నేను హాస్యమొలిస్తునే అని నిర్ధారణ చేశారు.



నీ కర్మమింతే, నువ్విలా హ్యూమరిస్ట్ స్టోరీస్ వ్రాసుకుని కాలక్షేపం చేసుకోవలసిందేనని నాలుగు అక్షింతలు నామీద చల్లారు. ఏది ఎలా వున్నా ఈ కధ, ఇక్కడ కూర్చుని పూర్తి చేయవలసిందే నన్నారు సభాపతిగారు. ఎలాగూ? నేను తొందరగా వ్రాయలేనన్నాను. 'అందుకని కథ అడ్డుతుందా స్వామీ! తమకు తోచినప్పుడల్లా డిక్టేట్ చెయ్యండి, ఈ లేఖకాధముడు వ్రాశాడు.....' అని శ్రీనివాస శిరోమణి అభయమిచ్చాడు. ఆయన ధర్మమా అని ఆ కధంతా వారం రోజులలో పూర్తి చేయ కలిగాను మిత్రులకు విని పించాను. వారందరూ చాలా బావుందన్నారు. బారిష్టరు పార్వతీశం అంటే బాగుంటుందని మా సభాపతి శివశంకరశాస్త్రిగారు అప్పుడే నామకరణం చేశారు.



ఇది 1924 డిశంబరు మొదటివారంలో జరిగిన విషయం. రెండవ వారాంతానికి పుస్తకం వెంటనే పూర్తి అయింది. పుస్తకం బెజవాడలో శారదా ప్రెస్‌లో అచ్చుకిచ్చాను వారు పాపం నెల రోజుల లోపుననే

మొక్కపాటి నరసింహశాస్త్రిగారి బారిష్టరు పార్వతీశం. ఈ పాత్రను ఎరుగనివారు తెలుగునాట లేరు. ఇటీవల వెండి తెరకెక్కిన కథ. లండను వెళ్ళి బారిష్టరు ప్యాసవుదామని ఉబలాటం, ఉత్సాహంకల ఆంధ్ర సనాతన బ్రాహ్మణ కుటుంబానికి చెందిన యువకుడె పార్వతీశం.

ఆంగ్లేయ విద్యతో పాటు అబ్బవలసిన అనేక రకాలయిన సుగుణాలు ఆనాటికి ఇతనిలో కొరత పడినాయి. నేటి నాగరికత అంతా అతనికి కొత్త. యెన్నడూ రైలెక్కి కూడా ఎరుగని ఈ వ్యక్తికి, యిల్లు బయలుదేరినది మొదలు అడుగడునా విపరీత పరిస్థితులే తారసిల్లి ఎక్కడికక్కడే అతనిని మూర్ఖుడుగా చేసి ప్రపంచమే తలక్రిందులైనట్లు అతనిచేత భావింపచేస్తాయి. రైలులో అతడు నడచిన నడత, మద్రాసులో అతను పడిన యిబ్బందులు స్టీమరులో అతను పడిన అవస్థలు, క్రొత్త ప్రదేశాలలో అతడు పడిన చిక్కులు. అన్నీ చదివి తీరవలసినవే కాని వ్రాయడానికి అలవికావు. కడుపు చెక్కలయ్యేటంతగా నవ్వించే ఈ ఘట్టాన్ని మించి మరో ఘట్టాన్ని హాస్యప్రదంగా చిత్రించి ఈ రచయిత తెలుగులో అనుపమానమైన హాస్య రచనగా ఈ కథ మలచిందెం చాడు. మన మెరుగిరి వస్తు వలేనైనా మనచేత పడినప్పుడు దాన్నెలా పట్టుకోవాలో, దానికి తల ఏదో తోక ఏదో తెలియక మనమొకప్పుడు కాకపోతే ఇంకొక



ప్పుడు అయినా నవ్వుల పాలయి విచారిస్తాం.

ఇదే సూత్రం పార్వతీశం కథలో ఆద్యంతమూ యిమడ్చబడి హాస్యాన్ని పోషించింది. అంతా అసహజంగానే కన్పించి అత్యంత సహజమని ఆఖరికి తెలుస్తూ ఉంటుంది.



పొరపాటు మరో పొరపాటుకి మూలమై వికృతులు ఒకదానికొకటి గుదిగ్రుచ్చినట్లు పెనవేసుకొన్నట్లు చూపించి, ఊహకందని వంపులోకి కథను ఈడుస్తాయి. పాత్ర స్వభావతః మూర్ఖుడు కాదు. పరిస్థితులతనిని మూర్ఖునిగా చేసి, వెక్కిరిస్తూ వుంటాయి. ఈ పార్వతీశాన్ని మించి నవ్వుల పాలైన అవస్థలు మనం కూడా జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు అనుభవించి ఎరిగినవే. అందుకే ఈ పాత్ర అంటే మనకి మమత్వం. అభిమానం సానుభూతి అన్నీ కలిగాయి. ఇది మన జాతీయమైన సొత్తుగా తయారయిన పాత్ర. గిరీశాన్ని మనం సహించలేము. కానీ పార్వతీశాన్ని

విడిచి ఉండలేము. పార్వతీశము ఈ క్షేత్రంలో ఏకైక హాస్యపాత్రగా నిల్వ గలగేడంటే తప్పులేదు. ఈ రచయిత అనేక హాస్య వ్యాసాలూ, కథలూ కూడా వ్రాశారు. అంతటా సరసమైన హాస్యాన్నే అందించాడు. హాస్యపు పాత్రను సృష్టించడంలో ఇతనిలో గల విశిష్టత. ఈ పాత్రలు కూడా మన ప్రేమకు పాత్రమై వుంటాయి.'

ఈ రీతిగా ఆధునిక సాహిత్య సమీక్ష చేసిన వారందరూ తమతమ వ్యాసములలోనూ, ఉపన్యాసములలోనూ, రేడియో ప్రసంగములలోనూ, పార్వతీశాన్ని ప్రశంసిస్తూనే వచ్చారు. వారి నెవ్వరినీ నేను వెళ్ళి ఈ ప్రశంసలు చేయమని కోరలేదనీ, అవి వారి వారి అభిప్రాయములనీ, న్నేను వేరే చెప్పనక్కర లేదనుకుంటాను. ఇంతకూ, ఇంతవరకూ ఎందుకు చెప్పవలసిన వచ్చినదంటే "లోకోభిన్నరుచి" అని అన్నారు కదా? ఎవరి సంస్కారమునుబట్టి వారికి సాహిత్యము రకరకాలుగా అర్థమవుతూంటుంది. అని చెప్పడానికి మాత్రమే! ఇది మూడో రకం విమర్శ.

ఒక వ్యక్తి కాని, సంఘంకాని, ఆధ్యాత్మికంగానూ, మానసికంగానూ, ఒక పరిణతి పొంది ఉంటే తప్ప, సరియైన హాస్యాన్ని సరిగా అర్థం చేసు కోవడం కష్టం. అందుకనే హాస్య ప్రశంసా, ప్రసంగమూ, సజాతీయుల మధ్యనూ, సమాన సంస్కారము కలవారి నడుమునూ రాణించినట్లు, సర్వత్రా రాణించలేకపోవచ్చు.

ఇక నాలుగో రకం వారు, మొదట ఈ కథ విని తమరు చదివీ, చాలా బాగుందన్న పెద్ద మనుష్యులు కొందరు. నాలుగురోజులు పోయిన తరువాత, తమ చుట్టూ తరుచు పార్వతీశాన్ని గురించిన ప్రశంసలు తమ చెవిన పడుతూంటే, అది భరించలేక ఆయన బొంద ఇదో పెద్ద ఇదే మిటి, ఏ డాన్‌క్విక్సోటో చదివి కాపీ కొట్టాడు. ఈయన తెలివితేటలేమి ఏడిసెనాయి అన్నారు.

ఇది సామాన్యంగా ప్రతి ఆంధ్రుడూ చేసే విమర్శ. ఒక చక్కని పుస్తకం వ్రాయడం కాని, ఒక చక్కని చిత్తరువును చిత్రించడం కాని,. ఎవడేనా మనవాడు చేశాడంటే, మనవాళ్ళు చచ్చినా ఒప్పుకోరు. ఏమంటే బుద్ధికుశలత గల ఏపని గాని, ఏ ఆంధ్రుడూ చేయలేడని, ప్రతి ఆంధ్రు డికి ఒక గట్టి నమ్మకం. అందుకని అటువంటి అపురూపమైన రచన ఏదైనా కనపడితే ఇది ఎక్కడో చేతి దెబ్బ కొట్టాడని అనుకుని మనవాళ్ళు తృప్తి పడతారు. అలా అనుకోకపోతే ఆ పూట వాళ్లకు భోజనం చేసినట్లుండదు పాపం. పోనీలెండి ఏం చేస్తాం, టాగూరంతటి విశ్వ

కవికే తప్ప లేదు ఈ అపవాదు. ఇంక అస్మదాదుల మెంత. సరే, ఎవరు ఏమన్నా, అనాలోచిత సంకల్పంలో ప్రభవించిన పార్వతీశం అందరి అభిమానాల చేతా, విశాల విఖ్యాతయశుడు అయ్యాడు. అది నాకానంద హేతువు. ఎందుచేతనంటే అతని యశోదీధితులు కొన్ని ప్రత్యక్షంగానూ కొన్ని పరోక్షంగానూ, నామీద కూడా పడి నన్ను గిలిగింతలు పెడుతూ ఉంటాయి. అప్పుడప్పుడు - ఇప్పటికి కూడాను.

కాని ఈ ఆనందంతోపాటు నాకు కొన్ని సందేహాలు బాధించగా, కొంత ఆత్మ పరీక్ష చేసుకోవలసి వచ్చింది. నేను గొప్ప పుస్తకం వ్రాసి అందరనూ గొప్పగా ఆనందపరవశులను చెయ్యవలెనని కాని అందుకు నేను తగినవాడనని కాని ఎప్పుడూ అనుకోలేదు. కానీ, కొందరు కాదన్నా నేను వద్దన్నా, ఇది గొప్ప పుస్తకమే అయింది. అఖండ ఖ్యాతి నార్జించింది. ఆ పేరు మీదనే నేను నేటికీ చెలామణి అవుతున్నాను. అందుచేతను నాలో లేని శక్తి యేదో ఉన్నట్లు ప్రజలను భ్రమపెట్టి ఆ రీతిగా వారిని మోసగించటం లేదు కదా అనే సందేహం ఎప్పుడూ నన్ను బాధిస్తూ ఉంటుంది ;

అది అలా ఉండగా పార్వతీశం విశిష్టత యేమిటో, ఎందుకింతమం దికి ప్రేమ పాత్రుడయ్యాడో, ఇతన్ని చూచి ఎందుకు జనం విరగబడి నవ్వుతున్నారో, అనే ప్రశ్న పరంపర నాలో బయలుదేరుతూ ఉంటుంది. మనం ఏదో వ్రాశాం. వాళ్లు నవ్వుతున్నారు. సంతోషిస్తున్నారు. ఇంకను ఈ వెర్రి సందేహాలు నాకెందుకు అని ఒక ప్రక్క సమాధానం వచ్చినా, దానితో తృప్తిపడే స్వభావం కాదు కనుక మరికొంచెం తరచి చూచాను. దానపైన అసలు ఎదుటి వాళ్లను చూచి మనం ఎందుకు నవ్వుతాం. వాళ్లలో యే లక్షణాలు మనల్ని నవ్విస్తాయి అనే ఆలోచన కలిగింది.

ఇది చాలా పెద్ద ప్రశ్న సమాధానం సరిగా చెప్పతలుస్తే, సవాలక్ష గ్రంధం అవుతుంది. అందుకని సూక్ష్మంగా మనవి చేస్తాను. మనుష్యుల రూపురేఖా విలాసాదులలోనూ, వేష భాషలలోనూ, మనకంటికి చెవికి అల వాటైన వాటికంటే హెచ్చు తగ్గులేమాత్రం ఉన్నా మనకు నవ్వు వస్తుంది. ఎదటివాడు యెక్కువ యెత్తరి అయినా, కురచ అయినా, లావైనా, సన్న మైనా, పెద్దముక్కున్నా, అసలు లేకపోయినా కండ్లు ఎగుడు దిగుడుగా ఉన్నా, మెల్ల ఉన్నా, ఇటువంటి తేడాలు యేమి కనుపించినా, నవ్వుతాం అంటే మామూలు ప్రమాణాలకంటే హెచ్చు తగ్గులేమున్నా మనకు వికా రంగా తోచి నవ్వుతాం. యిదిగాక ప్రతి మనిషిలోనూ కొంత కదలికా,

చురుకూ, వివేకం వగైరా లక్షణాలు విడిగా ఉంటాయనుకుంటాను. అవి ఏ మనిషిలోనైనా లోపిస్తే ఆ మనిషి అనాగరికుడుగా మనకు కనపడి, మనం నవ్వుతాం. .అందుచేత, కథా రచనలో నాయకుడి మాటల్లోనూ, చేష్టల్లోనూ, వేషంలోనూ ఇటువంటి వ్యత్యాసాలు చూపించగలిగితే పారకులు నవ్వుకుంటారని తేలింది. మనకంటే ఆంగ్లేయులు




చాలా విషయాల్లో చాలా నాగరికులనీ, వారి వేషభాషలు చాలా అందంగానూ, నాజూకుగానూ వుంటాయని అందరూ అనుకుంటారు కదా! ఆ పద్ధతులూ, ఆ వేషమూ మనం సాధ్యమైనంతవరకూ అనుకరిస్తాం కదా. అటువంటప్పుడు ఈ పార్వతీశం కచికా తాటాకులూ, బొంత యెర్ర శాలువా, గులాబిరంగు సిల్కు కండువా, బంతిపువ్వు రంగు పెట్టె వగయిరా సామగ్రితో బయలుదేరుతున్నాడంటే ఇంత వెర్రి ముండాకొడుకేమిటా అని అందరూ నవ్వుకుంటారనుకుంటాను.

అలాగే ఆడవాళ్ళ టోపి కొన్నప్పుడు భోజనశాల దగ్గర కత్తికటారులుపయోగించడం చేత కానప్పుడు ఫ్రాన్సులో షాపులో తివాసి మీద నడవకూడదే మోననుకొని మైనం నునుపు పెట్టిన చెక్కలమీద నవడబోయి పడినప్పుడూ ఇంత చేతకాని తనం వుంటుందా అని నవ్వు కున్నారు. యదార్ధం చేత నవ్వవలసిన పనిలేదు. యేమం టారా, ఈ నవ్వేవారందరూ ఆ పరిస్థితుల్లో, ఆ సన్నివే శాల్లో, ఆ సందర్భాల్లో సరిగా పార్వతీశం లాగానో, అంత కంటే కొంచెం తెలివితక్కు వగానో ప్రవర్తించేవారని ధైర్య ముగా చెప్పగలను ఒక పెద్ద మనిషి బి.యల్. చదవడా నికి మద్రాసు వచ్చినప్పుడు,



క్షురశాలలో పార్వతీశానికి కలిగిన సందేహమే తనకూ కలిగిందని రహస్యంగా నాతో చెప్పాడు. ఇంగ్లండు వెళ్ళి డాక్టరు పరీక్షలో ఉత్తీర్ణుడయి వచ్చిన పెద్దమనిషి, తనూ ఒక షాపులో తివాసీ మీద నడవకూడదను కుని, తలక్రిందుగా బోల్తాపడ్డ సంగతి చెప్పి నా సంగతి నీకెలా తెలిసిందని అడిగాడు.

మానవుడు చాలా విషయాల్లో అజ్ఞానుడు, అందుచేత అజ్ఞానజనిత మైన అపచారాలు చాలా వుంటాయి. ఇటువంటివి కొన్ని చేర్చి ఒక వ్యక్తిలో చూపించడం కొంతవరకు అతిశయోక్తిలా కనిపించినా, తప్పక హాస్యజనకంగా వుంటుందని తేలింది.




ఈ అజ్ఞాన కృతాపరాధములకు తోడు, తన తప్పు ఒప్పుకోకుండా అదేదో తను తెలిసే చేసినట్లు నటించడం మనలో చాలామందికి అలవాటు. పార్వతీశం ఆడటోపీ తెలియక కొని వాళ్ళు నవ్వగానే తన స్నేహితురాలి కోసం కొన్నానని డబాయించినట్లు మనలో చాలామందికి జబ్బు వున్నది. ఇది కూడా అజ్ఞానలక్షణమే, పర్యవసానమేమిటంటే మనలో అజ్ఞాతంగా ఉన్న అజ్ఞానమూ, అవకతవకలూ, అస్తవ్యస్తాలూ, డాబూలూ, దర్పాలూ, ఎదుటివాడిలో ప్రదర్శితమయితే మనకు నవ్వైనా వస్తుంది.



లేక కోపమైనా వస్తుంది. ఎందుకు నవ్వు అనే దానికి ఒక్క సమాధానం చెప్పవచ్చుననుకుంటాను. ఏ మనిషి తన తప్పుతా నెరుగడు సరికదా! ఎదుటివారికా తప్పు ఆరోపిస్తాడు కూడాను. "మనం చెయ్యని తప్పు ఎదుటివాడు చేశాడు. వాడొట్టి మూర్ఖుడు. నేనే అయితేనా" అని తన వీపు తను తట్టుకొని సంతోషిస్తాడు. మా పార్వతీశం విషయంలో అంతే జరిగింది మనలో ఉండే తెలివితక్కువలన్నీ పార్వతీశంలో చూచి ఆ వెర్రికుంక గనక అలా చేశాడు.

కాని నేనైతేనా అని ఎవరిమట్టుకు వారు ఆత్మ సంతృప్తితో పార్వతీశాన్ని చూచి నవ్వుతున్నారు. దీనినే ఇంగ్లీషులో ఒక తత్వవేత్త "సుపీరియర్ ఎడాప్టేషన్" అన్నాడు. అనగా అది ఒకరకమైన అహంకార వికారమన్న మాట. కారణం ఏమైనా పార్వతీశం ఆంధ్ర హృదయంలో స్థిరనివాసము ఏర్పరచుకున్నాడు. అతనిలో ఆలంకారికులు చెప్పిన ధీరోదాత్తాది లక్షణాలు లేకపోవచ్చు. అందుచేత మహానాయకుడు కాడు. పోనీ నాటకాల్లో ప్రసిద్ధుడైన ప్రతి నాయకుడూ కాడు. ఏది కాకపోయినా అతను మనలాంటి మానవుడు. మనలో అతనే మనం. అందుకనే మన ప్రతి ఒక్కరిలోనూ ఒకడు కాగలిగాడు ఈ పార్వతీశం.

ఎవడు ఎంతనవ్వినా, పార్వతీశం ఏమీ అనుకోడు, వాళ్ళకు సామాన్య ధర్మాలైన సాహసం, వుద్రేకం, దురాలోచన, అజ్ఞానం, అహంకారం, కార్యావసరమైన సాధన సంపత్తి చేకూర్చుకునే ఓపికలేకపోవడం ఇలాటివన్నీ మూర్తీభవించిన మూర్తి మా పార్వతీశం అని నా అభిప్రాయం. మీరేమంటారు!

ఇలా నిర్మొగమాటంగా మాట్లాడానని ఏమీ అనుకోరనుకుంటాను. ఏమంటే సత్యవ్రతం హాస్య రచయితలకు ప్రధానలక్ష్యమూ, ధర్మమూను.

ఇప్పటివలెనే ఎప్పటికినీ ఆంధ్రుల అల్లారుముద్దు బిడ్డగా, పార్వతీశం చిరంజీవిగా, వర్ధిల్లాలని మీరు ఆశీర్వదించండి.

\- మొక్కపాటి నరసింహశాస్త్రి 1971

# బారిష్టరు పార్వతీశం

మాది మొగల్తుర్రులెండి. మొగల్తుర్రు అంటే ఏమనుకుంటున్నారో! చరిత్రలో చాలా ప్రసిద్ధికెక్కిన మహానగరం. అక్కడ కోట బురుజులూ, విశాలమైన గోడలూ చూస్తేనే అది ఎంత పెద్ద పట్టణమో, ఎంత ప్రసిద్ధమైనదో, ఎన్ని యుద్ధాలు చూసిందో, ఎన్ని శత్రు సైన్యాలను సంహరించిందో తెలుసుకొని రాసినవాడు ఎవ్వడూ లేడుగానీ, నిజంగా మంచి చరిత్రకారులెవరన్నా ఇక్కడ కూర్చుని ఈ చరిత్రే వ్రాసి ఉంటే, ఎన్ని రహస్యాలు బయటపడేవో. మాటుపడిన చరిత్ర రహస్యాలు ఎన్ని వెలుగులోకి వచ్చేవో. ఇవన్నీ సరిగా అవగాహన చేసుకొని వ్రాసివుంటే, మన ఆంధ్రుల చరిత్ర, మొగల్తుర్రు రాజుల పరాక్రమం, వారి రాజ్యాంగ పద్ధతులూ, వారు చేసిన దాన ధర్మములు, ఎన్నెన్ని బైటపడేవో! మా నర్సాపురం తాలూకా అంతా ఎంత సంతోషించి ఉండేదో! నేటికీ, మా రాజులు అంతర్వేదికి వెళ్ళి రధోత్సవం నాడు, రధం లాగడానికి ఆ గొలుసులు మీద చెయ్యి వేస్తేనేగాని ఎన్నివేలమంది ప్రయత్నం చేసినా ఆ రధం కదలదు తెలుసునా? అలాటి మహత్తు ఈనాటికీ వారి చేతులలో ఉంది అంటే ఆనాడు వారెంతటి వారో ఊహించుకోవచ్చు. ఆ ఊళ్ళో జన్మించడం నాకు చాలా గర్వకారణము. మా ఇంటిపేరు వేమూరివారు. వేమూరివారు కూడా మొగల్తుర్రు పరిపాలకులతో పుట్టినవారే.



ఆ ఆస్థానములో పేరు గన్న విద్వత్కుటుంబము మాది. ఆ రాజ్యాన్ని తీర్చిదిద్దడంలో, ప్రభువు లందరినీ మంచి మార్గాన నడిపించడములో వారిచేత దానధర్మాలు చేయించడంలో, బీదసాదలను కనిపెట్టడంలో మావాళ్ళు చాలా సాయ పడ్డవారు. ఇప్పటికీ వారి మీద మాకూ, మామీద వారికీ ఎంతో గౌరవమూ, అభిమానమూ, ఆదరమూనూ. వారికి ఏ విషయంలో, శాస్త్రంలో కానివ్వండి.

లౌక్యంలో కానివ్వండి, ఏ సందేహం వచ్చినా తిన్నగా గుఱ్ఱంబండి వేసుకొని మా తాతగారు వద్దకు వచ్చి ఎంతో భయభక్తులతో వారి సమక్షమందు కూర్చుని వారి సందేహాలు విన్నవించుకొని, నివృత్తి చేసుకొని, శెలవు తీసుకొని వెళ్ళేవారని చాలామంది చెప్పగా విన్నాను. అలాగే మా నాన్నగారిని కూడా గౌరవించేవారు. ఇంక నేను పెద్దవాడినైతే నాకూ అటువంటి గౌరవమర్యాదలే జరుగుతాయని నా తోటివాళ్ళంతా అంటూ వుండేవారు. సరే దానికేంలెండి. ఇది ఎపుడో జరగబోయే సంగతి.

నేను చిన్నప్పుడు 5, 6 క్లాసుల వరకూ అక్కడే చదువుకున్నాను. మా గురువుగారికి అక్కడ అంతమంది పిల్లలున్నా నేనంటే ఎంతో ముద్దు. నన్ను దగ్గర కూర్చోబెట్టుకొని, ఎంతో సరదాగా నాచేత అక్షరాలు దిద్దించడం నాకు బాగా జ్ఞాపకం. నాలుగో క్లాసు అయిన తర్వాత నన్ను చదువుకి నర్సాపురం పంపవలెనని మా నాన్న ప్రయత్నం చేస్తోంటే, నన్ను విడిచివుండలేక, అంతదూరం పంపవద్దని నాకు భోజన సదుపాయము బాగుండదనీ మా అమ్మ పట్టుబట్టటం చేతను, మరో రెండేళ్ళు మొగల్తుర్రులోనే కాలక్షేపం చేశాను. మా అమ్మ మాట ఎలా ఉన్నా, ఆ వూరు విడిచి పెట్టటమంటే నాకు ఏదో బెంగ, భయమూ, అనిపించేది నాకు ఇక్కడ బోలెడంతమంది స్నేహితులు. వాళ్ళందరికీ నేనంటే యింతింతని చెప్పలేని

అభిమానం. "ఏంరా పార్వతీశం! నువ్వెళ్ళిపోతే ఎలాగురా? నిన్ను విడిచి మేముండలేమురా? మేమూ నీతోటే వొచ్చేస్తాం!" అనేవారు. నేను నవ్వుతూ 'ఏడిశారులెండి. నోరుమూసుకు చదువుకోండి ఇక్కడేను. వెర్రి వెర్రి వేషాలేయకండి. నేను నర్సాపురం నుంచి పై చదువులకి ఏ రాజ మండ్రియో, మద్రాసో వెళతాననుకోండి అక్కడికి మీరు ఎలా రాగలరు. ఎవరుండే చోట వాళ్ళుండాలిగానీ, అందరూ అన్ని చోట్లకి వెళ్ళగలరేమిటి' అంటే "ఏం ఎందుకు రాలేవేమిటి?" అని ఒక మిత్రుడు ప్రశ్నించాడు. "నీ మొహం! ఏ మాత్రం వస్తావో చూస్తాను. నేను అమాంతం ఈ కాలవలో దూకి, ఈ పక్కనుంచి ఆ పక్కకి ఈదుకెడతాను చేతనయితే నన్ను పట్టుకో. చూద్దాం" అంటూ కాలవవైపు పరుగెత్తాను. "వద్దురా బాబూ! వెళ్ళకురా! వాడు వూరికినే అన్నాడుగాని నీతోటి పందెం వేసి ఎవరు గెలవగలర్రా" అన్నా వినిపించుకోకుండా నేను కాలవ దగ్గరికి పరుగెత్తాను. వాళ్ళందరూ నా వెనకాలే పరుగెత్తుకొచ్చి నేను నీళ్ళలో దిగబోతుంటే నన్ను గట్టిగా పట్టుకొని "వద్దురా బాబూ! నీతో మాకు పందెమేమిటి? నీ సంగతి వేరు, నీ సందర్భమే వేరు. ఈ పందెం కోసం నువ్వు నీళ్ళలో దిగితే మీ నాన్న మమ్మల్నందర్నీ చంపేస్తాడు. ఇంక ఊళ్ళో బతకనివ్వడు. రా పోదాం. యింటి"కని నన్నేదో గొప్పగా ఊరే గించి తీసికెళ్ళినట్టు నవ్వుతూ, కేరింతాలు కొడుతూ, సరదాగా తీసికెళ్ళి మా ఇంటి దగ్గిర దిగబెట్టారు. వాళ్ళందరికీ నేనంటే అంత అభిమానం.

వాళ్ళకేకాదు. వూళ్ళో అశేషజనానికీ ఎందుకో నేనంటే ఎంతో అభిమానం. ఏ ఆటల్లో కెళ్ళినా నేను గెలుస్తుండేవా డిని. ఏ జామితోటల్లోకో, ఏ మామిడి తోటల్లోకో వెళ్ళినా అక్కడ యజమానులున్నా, నౌక ర్లున్నా నాకు బోలెడన్ని కాయలు కోసియిచ్చేవారు. నాతోటి కుర్ర వాళ్ళెవరైనా పొరపాటున ఒక కాయ కోసుకోబోతే హడలగొట్టి పంపేవారు.



ఇలా మగాళ్ళేకాదు, ఆడవాళ్ళందరికి కూడా నేనంటే ఎంత ముద్దో.

యిప్పటికి తల్చుకుంటే ఎంతో సిగ్గుగా వుంటుంది. నా పుట్టినరోజు వచ్చిందంటే చుట్టుపట్లవున్న ఆడవాళ్ళందరూ పేరంటానికి వచ్చి వెళ్ళేటప్పుడు అందరూ నన్ను ముద్దెట్టుకొని మరీ వెళ్ళేవారు. నాకెంతో అసహ్యంగానూ, చిరాగ్గానూ ఉండేది. నేనొకసారి మా అమ్మతోటి గట్టిగా అన్నాను కూడాను "ఏమిటమ్మా! అసహ్యంగానూ, వీళ్ళందరూ నన్ను ఇల్లాంగ ముద్దులెట్టుకోవడం వొళ్ళు మండి పోతూనూ. నేనేమన్నా ఆడపిల్ల ననుకున్నారేమిటి? ఇలా అయితే-ఇంక నేనసలు వచ్చేయేడు పుట్టనే పుట్టను. నువ్వు పుట్టినరోజు చెయ్యవద్దు. నాకెంత చిన్నతనంగా వుందో తెలుసా! అందులోనూ మరే ఈ వెధవ వాళ్ళంతా కూడా ముద్దెట్టుకుంటారేమిటంట. వాళ్ళు అలా ముద్దెట్టుకో వచ్చటే అమ్మా? వాళ్ళు వెధవ్వాళ్ళు గదా! మడిగా వుండద్దూ" అన్నానోసారి. మా అమ్మా వాళ్ళు విరగబడి తెగ నవ్వి మరీ మరీ ముద్దెట్టుకున్నారు. నా చిన్నతనంలో అలా ఎంతో సరదాగా అన్నీ జరుగుతూండేవి.

# 2

ఆ వూరు విడిచి పెట్టడం నాకూ, నన్ను విడిచిపెట్టడం మా అమ్మకి, ఎంత కష్టంగా వున్నాకానీ నా చదువుకి నర్సాపురం వెళ్ళక తప్పలేదు. ఈ వూళ్ళో ఎన్నాళ్ళున్నా లాభంలేదని వాళ్ళు నిశ్చయించి మంచి రోజు చూసి నన్ను నర్సాపురం తీసుకువెళ్ళి మా మేనత్త గారింట్లో వప్పజెప్పి అక్కడ టైలరు హైస్కూల్లో నన్ను ఫస్టుఫారంలో జేర్పించారు.

అప్పటికి మాకెంత దగ్గరైనా నేను నర్సాపురం ఎప్పుడూ చూళ్ళేదు. అక్కడ ఇల్లు, మేడలు, కోర్టు, హైస్కూలు, కాలవ, గోదావరి అన్నీ చూసేటప్పటికీ హడలెత్తింది. నర్సాపురమే ఇలా వుంటే ఇంకా రాజమండ్రి అవీ ఎలా వుంటాయో అనుకున్నాను కాని నా ఊహకేమీ అందలేదు. అక్కడ స్కూలూ, మాష్టార్లూ పద్ధతులు చూస్తే కొన్నాళ్ళు బెదురుగా ఉండేది. ఏ మేష్టరూ నామీద ప్రత్యేకాభిమానం చూపెంచలేదు. మా వూళ్ళోకి మల్లేనూ భుజం మీద చెయ్యివేసి దగ్గరగా కూర్చోబెట్టుకోనూ లేదు. ఇదేం మావూరారా! ఇదేం వీధిబడా! పెద్ద పాఠశాలాయను. అని కొన్నాళ్ళు సరిపెట్టుకున్నాను. ఇక్కడ పిల్లలంతా మా వూళ్ళోకి మల్లే అరుగుల మీద చాపలూ, చదరలూ వేసుక్కూర్చోవడం గాక బల్లమీద కూర్చోవడం

మేష్టరుగారు దూరంగా కుర్చీమీద కూర్చోవడం అందుచేతను మా పల్లెటూరు బడిలో ఉండే సామీప్యంపోయి మాకు మధ్యను అనగా మేష్టరికీ, పిల్లలకీ ఎంతో దూరం ఉన్నట్లు అనిపించేది. అయినా ఇక్కడ మేష్టార్లూ చాలా మంచి వారే. కుర్ర వాళ్లెవరూ అల్లరి చేయకుండా ఆయన చెప్పినది శ్రద్ధగా వింటున్నారా లేదా అని వెయ్యికళ్ళతో కనిపెడుతూనే యుండేవారు. ఆయన ఎంత జాగ్రత్తగా చూస్తున్నా అల్లరి చేసేవాళ్ళు చేస్తూనే ఉండేవారు. ఆమూలా, ఈమూలా గణగణ లాడుతూ చప్పుడు చేస్తూనే ఉండేవారు. బడి విడిచి పెట్టేటప్పటికి గొల్లుమని ఈల వేసుకుంటూ పిల్లలందరూ బయటికి వచ్చేవారు.

బైటికి రావడంతోనే ఎవ్వాళ్ళదారిన వాళ్ళు యిళ్ళకు పోకుండా గుంపులు గుంపులుగా కేకలేస్తూ, పరుగులెడుతూ, ఒకళ్ళ నొకళ్ళు సరదాకి కిందకి తోసివేస్తూ అల్లరి చేసేవాళ్ళు కొందరు. మరికొందరు ఉప్పట్టి, చెడుగుడు మొదలైన ఆటలు ఆడుకొనేవారు. ఇలా కొందరు బంతి ఆడుకొనేవారు. ఇలా రకరకాలుగా యెంతో సరదాగా నవ్వుకుంటూ కేకలేసుకుంటూ ఆడుకుంటూ వుంటే నాకు చాలా కులాసాగా వుండేది. కొన్నాళ్ళు నేను యే మురాలోనూ జేరకుండా వో ప్రక్కగా నుంచునో అరుగుమీద కూర్చునో ఈ వేడుక చేస్తూ. ఆనందించే వాడిని. కాని అట్టే రోజులు ఆ పిల్లలంతా నన్ను కూర్చో నివ్వలేదు, నన్ను కూడా బలవంతాన్ని లాక్కొని వెళ్ళేవారు. ఒకడు బంతి పుచ్చుకొని నన్ను కొట్టేవాడు. నేను తప్పనిసరిగా ఆ బంతి మళ్ళీ వాడిమీదకు విసరవలసి వచ్చేది అలా విసిరి పారిపోతూంటే మళ్ళీ బంతి వచ్చి నా వీపుకు తగిలేది. ఇలా తప్పనిసరిగా బంతిఆట ఆడవలసి వచ్చేది. ఈ వేళ ఈ బంతి ఆట అయితే మరొకరోజున ఉప్పట్టిలోకి లాక్కుపోయేవారు. ఇలా వారం రోజులు గడిచేసరికి ఎవరూ పిలవకుండానే నేను ఆటలకి తయారయ్యేవాడిని. అన్నిట్లోకీ నాకు చెడుగుడే అంటేనే యెక్కువ సరదాగా ఉండేది. అందుచేతను ప్రతిరోజూ నేను చెడుగుడు గుంపులోనే చేరి రెండు మూడు మాసములయ్యేసరికి మంచి చెడుగుడే ఆటగానిగా తయారయ్యాను.

గమ్మత్తు యేమిటంటే మా వూళ్ళోనూ, అక్కడ బడిలోనూ ఎరుగని కొత్తవింత ఇక్కడ కనిపెట్టాను. సంవత్సరమంతా అయిపోయి డిసెంబరులో సెలవు లిచ్చే ముందు క్లాసు పరీక్షలతో పాటు కొంచెం ముందు వెనుకలను ఈ ఆటలన్నిటిలోనూ పోటీలు జరిపేవారు. గెలుపొందిన జట్టుకే బహుమతులిచ్చేవారు. ఆ జట్టులో కూడా మరీ మంచి

ఆటగాడికి ప్రత్యేక బహూమతి ఇచ్చేవాళ్ళు.

నేను చేరిన సంవత్సరం మా జట్టు గెలవడమే గాకుండా అందులో మొదటి బహూమతి నాకు వచ్చింది. ఇలా వస్తుందని నేనెన్నడూ అనుకో లేదు. ఈ బహూమతి ప్రదానానికి స్కూలు పిల్లలందరినీ పరీక్ష హాలులో కూర్చోబెట్టి సభజరిపి మా జిల్లా కలెక్టర్ గారిని పిలిపించి వారిచేత బహూ మతులు ఇప్పించేరు. ఒక్కొక్కళ్ళ పేరే చదువుతూంటే, ఆ కుర్రవాళ్ళు కలెక్టర్‌గారి దగ్గరికి వెళ్ళడం వారిచ్చిన బహూమతి అందుకోడం, వారికొక నమస్కారం చేసి వెనక్కు తిరిగి రావడం, ఇదీ ఏర్పాటు. ఈ క్రమం అంతా రెండు రోజులు ముందుగానే మా మాష్టరుగారు మాకునేర్పారు. అందుచేతను అక్కడ ఏమీ కంగారు పడకుండా సహజంగానే జరిగిపోయింది. యెటొచ్చీ ఆ పిల్లవాళ్ళ పేర్లు చదివినప్పుడు వాడు బహూమతి అందు కొంటున్నప్పుడు హాలంతా దద్దరిల్లేటట్లు అక్కడ చేరిన విద్యార్థులంతా చప్పట్లు కొట్టేవారు.

తక్కిన వాళ్ళందరికీ ఎలా ఉండేదో కాని నా పేరు పిలవగానే నేను లేచివెడుతుంటే

ఆ చప్పట్లు ధ్వనికి నేను ఎంతో పొంగిపోయి గాలిలో తేలి పోతున్నట్లే కలెక్టరు గారి దగ్గ రికి వెళ్ళేను. అక్కడా నేల మీద నడిచాననే నమ్మకం ఇప్ప టికీ లేదు. ఆ పైన కలెక్టరు గారు నాకేసి చూసి మందహాసం చేసి గుడ్‌బాయ్ అని నా వీపు తట్టేరు. దానితో సంతోషం పట్టలేక నేను పరవశుణ్ణయి ఈ మాటు మరీ గాలిలో తేలిపోతూ నేను కూర్చున్నచోటులో గభీమని చతికిల పడ్డాను.



నాపక్కనున్న కుర్రవాళ్ళంతా నన్నక్కడే కౌగలించుకున్నారు. కొంచెము చెప్పడానికి సిగ్గువేస్తున్నది కాని అయినా చెప్పకతప్పదు. ఆ సంవత్సరం ఆటల్లోనే కాకుండా చదువులో కూడా నాకు మొదటి బహూమతి వచ్చి

నది. ఆ సంగతి నాకు అప్పటివరకూ తెలియనే తెలియదు. ఇంక ఆ రోజు నాకు మరీ ఆనందము కలిగించిన విషయం మరొకటి జరిగింది. ఆ సభలోకి మా వూరినుంచి మానాన్న, ఆ వూరు మేష్టరుగారూ ఎపుడొచ్చారో తెలియదుగానీ, సభ ముగిసి అందరూ లేవగానే మానాన్న, మావూరు మేష్టరుగారూ పక్కవాళ్ళ నందరినీ తప్పించుకొని నా దగ్గర కొచ్చి నన్నెత్తుకొని ముద్దాడేరు దాంతో దగ్గరున్న పిల్లలంతా చప్పట్లు కొడుతూ నవ్వుతుంటే నాకెంతో సిగ్గొచ్చి ఆనందంతో కళ్ళనీళ్ళు కూడా వచ్చినవి. ఇలా ఎంతో సంతోషంగా రెండు, మూడు సంవత్సరాలు గడి చిపోయినాయి.

నేను మూడవఫారములో ఉండగా ఒక తమాషా జరిగింది. సంవ త్సరం ఆఖరు కావస్తుండగానే స్కూళ్ళ ఇనస్పెక్టరుగారు మా స్కూలు పరీక్ష చేయడానికి వచ్చారు. అంతకుముందు రోజున మమ్మల్నందర్నీ మంచిబట్టలు కట్టుకు రమ్మని, తల దువ్వుకొని రమ్మనమనీ మా మేష్టరు గారు మరీ మరీ చెప్పారు. ఆ రోజు మేష్టర్లందరూ కూడా చాకలి తెచ్చిన బట్టలు కట్టుకుని మర్చిపోకుండా తలగుడ్డలతో వచ్చారు. స్కూలంతా ఎంతో నిశ్శబ్దంగా వుంది, మాకు తుమ్మడానికీ, దగ్గడానికీ కూడా భయంగా వుంది. మా మేష్టరుగారు ఎంతో గంభీరంగా మాక్లాసులో ఇటూ అటూ తిరుగుతూ మమ్మల్ని జాగ్రత్తగా వుండమనీ, అడిగిన ప్రశ్నకు భయపడకుండా సమాధానము చెప్పమనీ మమ్మల్ని పదేపదే హెచ్చరిస్తూ వుండగా, ఇనస్పెక్టరు నెమ్మదిగా క్లాసులో కొచ్చాకు. మా మేష్టరుగారు గబుక్కున వారి దగ్గరకు వెళ్ళి నమస్కరించి, నెమ్మదిగా కుర్చీ దగ్గరకు తీసుకొచ్చి, దయచేయమన్నారు ఇనస్పెక్టరుగారు రావడంతోనే మా మేష్ట రుగారు చెప్పినట్లు క్లాసు పిల్లలమందరమూ లేచి, వారికి నమస్కారం చేస్తూ నిలబడ్డాము. ఇనస్పెక్టరు గారు వారి కూర్చీమీద కూర్చొని 'సెట్ డౌన్ బాయిన్' అని మమ్మల్ని ఆజ్ఞాపించారు. మేమందరం కూర్చున్నాం వారికేసి చూస్తూ ఆయన బాగా పెద్దవారూ ముసలివారులా కూడా కన పడ్డారు. కుర్చీమీద బాసినపట్లా వేసుకొని కూర్చుని నెత్తిమీద తలగుడ్డ తీసి బల్లమీద పెట్టారు, పక్కనే భయపడుతూ నిలబడ్డ మా మేష్టారితో ఏదో మాట్లాడుతూ రెండు నిముషాలయిన తర్వాత పిల్లవాళ్ళను ప్రశ్నలు

వేయడం మొదలుపెట్టారు.

ఆయన బాగా నలుపు కొంచెం లావు. ఆయన శరీరం నలుపుతో సంతోషపడక నల్లకోటు కూడా తొడుక్కొచ్చేరు. ముఖం మీద తిర గలి గంట్లు లాగ అమ్మవారు పోసిన మచ్చలు ఉన్నాయి. చాలనట్లు ఓ కన్ను బాగా మెల్ల. ఆయన క్లాసు కేసి చూస్తుంటే ఎటువైపు చూస్తున్నదీ మాకర్థం కాలేదు, మాక్కొంచెము నవ్వొస్తున్నా బలవంతాన ఆపుకొని భయభక్తులతో కూర్చున్నాం. ఆయన ఒక కుర్రవాడి వైపు తిరిగి సైన్సు పాఠములో ఏదో ప్రశ్న వేశారు. ఆయన ఎవర్నడిగింది తెలియక పక్కనున్న కుర్రవాడు గబుక్కున లేచి నుంచుని సమాధానము చెప్పాడు ఆయనకు విపరీతమైన కోపము వచ్చి అటు తిరిగి వెధవా! నిన్నెవరడిగా రన్నారు. వాడు గజగజలాడుతూ చతికిలపడుతుండగా, ఆ పక్కవాడు నిలబడి చేతులు కట్టుకొని ఒణికిపోతూ 'నేను అసలు కిక్కురుమనలేదండి' అన్నాడు దాంతో క్లాసంతా విరగబడి నవ్వడం మొదలెట్టారు. మా మేష్ట రుగారికి కోపం, భయం ఎక్కువై బెత్తము పుట్టుకొని, 'నోరుముయ్యండ్రా' అని పళ్ళు కొరుకుతూ క్లాసు మధ్యకు వచ్చారు, ఇనస్పెక్టరు మండి పోతూ లేచి నుంచుని బల్లగుద్ది సైలెన్సు అని వురిమేరు. ఆ వురుముకి మేమంతా హడలిపోయి మాట్లాడక కూర్చున్నాం. ఇన్‌స్పెక్టర్‌గారు ఆ కోపం తోనే మరికొన్ని ప్రశ్నలు వేశారు. మళ్ళీ కుర్రాళ్ళు కంగారు పడకుండా వారి ప్రశ్నలు వేసిన కుర్రాడి పేరు మేష్టరుగారు పిలవడంతో పొరపాటు లేకుండా సరియైన వాడే సరియైన సమాధానము చెబుతూ వచ్చాడు. దానితో వారు కొంచెము శాంతించి ప్రసన్నులై ఇంకా ఏదో ప్రశ్నలు వేస్తూ, నాకేసి తిరిగి, నన్ను ఓ ప్రశ్నడిగేరు. నేను కొంచెం పరాగ్గా చూస్తూ కూర్చున్నాను. ఇంతలో మేష్టరుగారు నా పరాకు చూసి 'ఏం పార్వతీశం నిన్నే వారేదో అడుగుతున్నారు చెప్పమన్నారు. నేను గబుక్కున చేతులు కట్టుకొని లేచి నిలబడ్డాను. వారి ప్రశ్న వినిపించుకోలేదు. ఇంతలో ఇనస్పెక్టరుగారు మందహాసం చేస్తూ 'చూడమ్మ అబ్బాయీ, ఎటువంటి వస్తువుమీదను కాంతికిరణం పడితే పరావర్తనం చెందుతుంది? అంటే, అది వెనక్కి తిరుగుతుంది' అన్నారు. నాకింకా పరధ్యానం పోలేదు. ఇందాక చెప్పటం మర్చిపోయాను. వారిది బట్టతల, సన్నగా మెరిసిపోతుంది.



ఆ క్షణంలో మా క్లాసు పాక కప్పులో నుంచి సూర్యకిరణం వారి నెత్తినపడి పరావర్తనమైంది కాబోలు. ఇనస్పెక్టరు గారి వారి ప్రశ్న మళ్ళీ చెప్పగా నేనేమీ ఆలోచించకుండా 'బట్టతలండి' అన్నాను క్లాసు గొల్లుమన్నారు. మా మేష్టరుగారు మొహం మొత్తుకున్నారు. ఇనస్పెక్టరుగారు ఒళ్ళుమండి తలగుడ్డ నెత్తిమీద పెట్టుకొని క్లాసులోంచి వెళ్ళిపోయారు. క్లాసంతా నిశ్శబ్దం.

ఇనస్పెక్టరు ఖాళీ చేసిన కుర్చీలో మా మేష్టరుగారు చతికిలబడి, ఎదురుబల్లమీద మోచేతులానించి, రెండు చేతులూ నెత్తిన పెట్టుకుని, పార్వతీశం నా కొంప తీశావురా! నీకిలాటి దుర్బుద్ధి పుట్టిందేవిరా ఈవేళ. నీవేదో తెలివైన వాడివని ఇన్నాళ్లూ మురిసిపోతుంటే ఇలా చెప్పాలని ఎలా తోచిందిరా నీకూ. ఇంతకీ నా ఖర్మం కాలింది. నారోజులు బాగా లేవు అని విచారిస్తుంటే మాకందరికీ కూడా ఏడుపొచ్చినంత పనయింది. ఇంతలో భోజన సమయం అయిందని గంట మ్రోగింది, మా మేష్టరు గారు దిగాలు పడి అలాగే కూర్చున్నారు. మేమెంతో నిశ్శబ్దంగా బైటికి జారేం.

# 3

ఇలా ఆటలు పాటలతోటే కాలక్షేపం చేసుకుంటూ ఫోర్తుఫారంలోకి వచ్చాను స్కూలు జీవితం చాలా సుఖంగా వుంది. చదువులో కూడా తెలివిగా వుంటున్నానని మేష్టర్లు చెప్పేవారు. తెలివిగా వున్నాననీ అయితే సహవాసాలెక్కువై చదువుమీద శ్రద్ధ తగ్గుతున్నదనీ మా నాన్నకి వర్తమానాలు అందినట్లు చూచాయిగా తెలిసింది. ఆ మాటా నిజమే, కాదనటానికి వీలులేదు. ఏమంటే పిల్లలందరకూ నామీద నిర్హేతుకమైన ఆదరం, గౌరవము ఏర్పడ్డాయి. చెడుగుడులోనూ, వుప్పటిలోనూ ఏటేటా నాకు బహుమ

తులు వస్తూనే వున్నాయి. అలాగే క్లాసులో కూడా మొదటివాణ్ణిగానో, రెండోవాణ్ణిగానో వుంటూ బహుమతులందుకుంటూండడం, విద్యార్థులందరికీ నామీద గౌరవ కారణమయింది. ఇటు ఉపాధ్యాయుల అభిమానమూ అటు నానాటికీ పెరుగుతున్న స్నేహ సముదాయం, వాళ్ళు నాయెడల చూపే ఆదరభిమానాలు తలచుకుని పోతుంటే నాలో కొంత అహంకారం ఎక్కువై పెంకితనం, పట్టుదలా, వ్యక్తులు యెడలా, చదువులోనూ కూడా కొంచెము నిర్లక్ష్యము బయలుదేరడము మాట వాస్తవమేనని ఒప్పుకొనక తప్పదు. అందుకని ఉపాధ్యాయులకు నామీద మునుపటి అభిమానం తగ్గి కొంచెం ఆగ్రహం ఎక్కువ కాజొచ్చింది.

సాయంకాలం స్కూలులో ఆటలూ, అల్లరీ చాలక ఊళ్ళో ఒక వస్తాదు దగ్గిర దండాలూ, బస్కీలూ వగైరా వ్యాయామం కొంత కుస్తీ కూడా నేర్చుకోవడం ప్రారంభించాను. ఇంక ఊళ్ళో తరచు సభలు, ఉపన్యాసాలు, హరికథలు, భజనలు వగైరా సాయంకాలము దీపాలు పెట్టిన తరువాతను యెన్నెన్నో జరుగుతూండేవి, వాటన్నిటికీ సరదాగా నా సహాధ్యాయులతో తప్పక హాజరవుతుండేవాడిని. ఇన్ని వ్యాపకాల మధ్య చదువుకొంచెం సన్నగిల్లిందంటే నిజమేననుకోక తప్పదు. ఇది ఇలా వుండగా నాకపుడే ఎక్కడెక్కడ నుంచో పెళ్ళి సంబంధాలు రావడం మొదలెట్టాయి, మా అమ్మకు చాలా సంతోషంగా ఉంది. నాకు త్వరగా పెళ్ళి చేయాలనీ, చిన్నకోడలు నట్టింట తిరుగుతూంటే చూడాలనీ, ఆవిడ ముచ్చట పడుతోంది. ఆ ముచ్చట్లు తీర్చడానికి నావెనకా ముందూ ఎవరూ లేరాయ మరి. అవన్నీ నావలననే తీరక తప్పదు గదా?

అందుకని వివాహానికి తొలిమెట్టుగా మానాన్న నాకు వెంటనే ఉపనయనం తలపెట్టాడు. ఆ శుభముహూర్తానికి మా బంధువులంతా ఎక్కడెక్కడివాళ్ళూ వచ్చారు, ఇద్దరు ముగ్గురు మా ఉపాధ్యాయులూ, పాతిక, ముప్పైమంది నా సహాధ్యాయులూ కూడా వచ్చారు. నా మిత్రబృందం, వాళ్ళు నా ఎడల ప్రదర్శించే ఆదరాభిమానాలు చూచి మా అమ్మ ఎంత పొంగిపోయిందో లెక్కలేదు. వాళ్ళందరినీ ప్రత్యేకంగా ఆదరించి పంపించింది. నాకు కౌపీనం పెట్టి పంచశిఖలు పెట్టి మెడలో యజ్ఞోపవీతం చేతులో దండం ఇంకో తోలుజంధ్యం చేతిలో భిక్షాపాత్ర చూచి నా సహచరులూ, బంధువులలో కుర్రకారూ అంతా చేరి, చేసిన అల్లరి ఇంతా అంతా కాదు. వచ్చిన బంధువులందరూ కూడా నన్ను చూచి ఎంతో ముచ్చటపడ్డారు. ఇంట్లో శుభం జరగడం ఇంతమంది బంధువులు రావడం నేనెరుగున్నం

తవరకూ ఇదే మొదలు. వూరిలో అన్ని వర్ణాలవవారూ మా ఇంట్లో నాలుగు రోజులు విందులారగిస్తూ కులాసాగా కాలక్షేపం చేయడం నాకు యెంతో వుత్సాహంగా వుంది. ఇలా మనవాళ్ళల్లోనేనా! ఇతరత్రా అంతా కూడా శుభకార్యాలు ఇంత వైభవంగా సంతోషముగా జరుగుతాయా! అని అనుకున్నాను.

ఈ నాలుగురోజులు అయిపోయి బంధువులంతా ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోగా మా యిల్లంతా నిర్జనమై ఎంతో చిన్నపోయినట్టుంది. నేను మళ్ళీ నర్సాపురం చేరుకున్నాను. మా స్నేహితులు మా యింట్లో జరిగిన గౌరవానికే వాళ్ళు ఎంతో సంతోషించి తోటి విద్యార్థులందరిలోనూ ఎంతో ప్రచారం చేశారు. ఆ రోజున నేను స్కూలుకి వచ్చేటప్పటికి అక్కడున్న విద్యార్థి సమూహమంతా నన్ను చూచి చప్పట్లు కొడుతూ స్వాగతం చెప్పారు. ఇద్దరు కుర్రవాళ్ళు నన్ను గంజి కావిడవేసి తీసుకువెళ్ళి అక్కడొక కుర్చీ మీద కూర్చోబెట్టారు. కొందరు కుర్రవాళ్ళు స్కూలులో వున్న పూలమొక్కల పూవుల్ని తీసుకువచ్చి నా మీద పుష్ప వర్షం కురిపించారు. అప్పుడు ఒకడు వాడి యిష్టమొచ్చినట్లు పది నిముషలు పెద్ద గంభీరోపన్యాసము చేశాడు. వాడి అసందర్భ ప్రలాపాలకు కుర్రవాళ్ళు పొంగిపోతూ కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వుతూ జయజయ ధ్వానాలు చేశారు. ఇది పూర్తయ్యేసరికి మరొకడు ముందుకొచ్చి నామీద పద్యాలు చెబుతానని చెప్పి వాడికొచ్చిన పద్యాలు తప్పులతోనూ, కొన్ని ఒప్పులతోనూ ఎలాగో కొన్ని చదివేశాడు - పాడేశాడు. ఇది కాగానే మరొక యిద్దరు కుర్రవాళ్ళు ముందుకు వచ్చి మేము అష్టావధానం చేస్తామన్నారు. అంతకు రెండు మూడు నెలలక్రితమే మా వూళ్ళో ఇద్దరు జంటకవులొచ్చి ఆశుకవిత్వము, అష్టావధానం చేశారు. దాంతో కొంత మంది కుర్రవాళ్ళకు అష్టావధానం చేయాలని సరదా పుట్టింది. ఈ శుభ సమయంలో అది ఆచరణలో పెట్టాలనీ వీళ్ళు ముందుకొచ్చారు. సభికులంతా పొంగి పొర్లుతున్న ఉత్సాహముతో ఉండగా వాళ్ళిద్దరూ ముందుకీ వెనక్కీ పచార్లు చేస్తూ వచ్చీ రానీ పద్యాలేవో ఇద్దరూ చెరో పాదము చెప్పడం ఆరంభించారు. అక్కడ వున్నవాళ్ళలో ఎవడో ఒకడు ప్రశ్న అడగడం దానితో నిమిత్తం లేకుండా వీళ్ళు యిష్టమొచ్చినట్లు జ్ఞాపకమొచ్చినట్లు సమాధానం చెప్పడం ఈ కార్యక్రమం యిలా బ్రహ్మాండంగా జరుగుతూండగా మా మేష్టర్లు కొందరు వారి వెనుక హెడ్మాష్టరూ వచ్చి నిలబడ్డం మొదటెవరూ గమనించకపోయినా తెలుసుకున్న ఉత్తరక్షణంలో పిల్లలందరూ హడలిపోయి చెల్లాచెదురుగా పరుగు పరుగులెత్తారు.

ఏమిటోయ్! పార్వతీశం ఈ హడావిడి అన్నారు. నాకేం తెలియదండి నాకు ఒడుగు అయి ఈవేళే బడికి వచ్చానండి. రావడంతోటే కుర్రవాళ్ళందరూ సరదాగా నాకు జేజేలు కొడుతూ ఇక్కడ కూర్చోపెట్టి ఒక రుపన్యాస మిచ్చి మరొకరెవరో పద్యములు చదివీ వీళ్ళిప్పుడు అష్టావధానము చేస్తామనీ ఆరంభించారండి. ఆఁ బాగుంది. చాలా సంతోషం అయితే నీ సత్కారము వాళ్ళవధానం మధ్యలో ఆగిపోయాయన్న మాట మామూలన.



పోనీలే మరోమారెప్పుడైనా సావకాశంగా ఏర్పాటు చేసుకుందువుగాని అని ఆదరంతో నా వీపుతట్టి నా బోడి తల మీద రెండు మొట్టికాయలు మొట్టి, ఈ వేళకు ఈ సత్కారంతో సంతోషించు' అని వెళ్ళిపోయారు. నవ్వుకుంటూ నా దారిని నేను చక్కాపోయాను.

# 4

ఊళ్ళో వ్యవహారాలు ఎక్కువ కావడంతో స్కూల్‌లో చదువు వెనకపడ్డది. మా ఉపాధ్యాయులకు నామీద పూర్వముండే సదభిప్రాయం మారిపోయింది. నాకెలాగైనా గుణపాఠం నేర్పాలని పట్టుదలతో నన్ను అయిదవ ఫారంలోనే ఉంచేశారు. ఏ క్లాసూ రెండవ సంవత్సరం కూడా చదవడం నాకిదే మొదటిసారి. నాకెంతో సిగ్గుగా, భయంగా ఉన్నది. మానాన్న ఈ శుభ వర్తమానం విని నన్ను నానా చివాట్లూ వేసి 'చదువూ వద్దు సంధ్యా వద్దు. నాలుగేళ్ళు నర్సాపురంలో చదువు వెలిగించి

చేసిన నిర్వాకం చాలు, ఇంటి దగ్గరుండి వ్యవసాయం చూసుకుంటే నాకు తోడుగానూ ఉంటుంది. భూములూ అక్కరకు వస్తాయి. ఆపైన నాలుగు సంస్కృత ముక్కలు, నాకొచ్చినవి చెబుతాను. ఎందుకైనా పనికొస్తాయి. అంచేత నర్సాపురం వెళ్ళి నీ పెట్టీ, బేడా తెచ్చుకో' అన్నారు. 'నేనీ ఏడు ఎలాగైనా కష్టపడి మీదటికి మెట్రిక్యులేషన్ కూడా అయిందనిపించుకొని మానేస్తాను. ఇంక జాగ్రత్తగా ఉంటాను' అని అనేక విధాల బ్రతిమాలాను, మా అమ్మ కూడా నా పక్షం వహించి 'ఏదో వెర్రివాడు సహవాసాల వల్ల ఇలా అయ్యాడు కాని, వాడికేం తెలివితేటలు లేవా? ముక్క రానివాడా? ఇక్కడ కూర్చుని చేసే నిర్వాకమేముంది? వాడన్నట్టు ఆ మెటుక్లాసు ఏదో అయ్యేదాకా చదువుకోనీండి, తరువాత సంగతి ఆలోచిద్దాం.' అంటూ నెమ్మదిగా మా నాన్నకు నచ్చచెప్పింది. ఆయన ఏమీ అనలేక మౌనంగా కూర్చున్నారు.

మా అమ్మ నన్ను వెళ్ళమని సౌంజ్ఞ చేసింది. నేనిదే సందని ఒక్క ఉజాములో బైటపడి ఏకాఏకి నర్సాపురం పరుగెత్తాను. వచ్చానే కాని స్కూల్లోకి వెళ్ళడానికీ మళ్ళీ అదే క్లాసులో కూర్చోవడానికీ ఎంతో సిగ్గువేసింది. కానయితే నిరుడు నాతో చదివినవాళ్ళు మరికొంతమంది ఈ ఏడు కూడా లేకపోలేదు. అది కొంత ధైర్యం, మేష్టరుగారు నన్నాట్టే మందలించకుండా ఏమిరా పార్వతీశం ఈ ఏడయినా, బుద్ధి తెచ్చుకొని ఊళ్ళో వ్యవహారాలకు స్వస్తి చెప్పి శ్రద్ధగా చదువుకుంటావా, నీవు లేనంత మాత్రన అక్కడ సభలూ, కార్యక్రమాలూ ఆగిపోవు. అవి ప్రతినిత్యం ఎవరున్నా లేకపోయినా జరుగుతూనే ఉంటాయి. దానివల్ల మీకు లాభం ఏమీ లేకపోవడమేగాక యిక్కడ చదువు సన్నగిల్లుతోందన్న సంగతి నీవు తెలుసుకున్నావు గదా? ఉపన్యాసాలూ, హరికథలు కావు బాబూ పైకి రావలసినవాడవు, తెలివైన వాడవును. ఇక ముందైనా జాగ్రత్తగా నీ పని నువ్వు చూసుకో అని హితబోధ చేశారు. బ్రతుకు జీవుడా అనుకున్నాను 'చిత్తం' అండి అని నమస్కారంచేశాను.

నేను మళ్ళీ బడికి రావడం ఇంటిదగ్గర మా నాన్న కెంతమాత్రం ఇష్టం లేకపోయింది. మా అమ్మమాట కాదనలేక నన్ను తిట్టలేక, కొట్ట లేక అప్పటి కూరుకున్న అస్తమానం నన్ను గురించి, నా భవిష్యత్తును గురించే ఆలోచిస్తున్నాడు కాబోలు. ఆలోచించగా ఆలోచించగా ఒడుగెలాగు అయింది గనుక పెళ్ళి కూడా చేస్తే నాకు ఉత్సాహంగానూ ఉంటుంది. ఆపైన నా బాధ్యత గుర్తుంచుకొని, జాగ్రత్తగా చదువుకోవడమో, లేకపోతే

మానేసి ఇంటి దగ్గరుండడమో, నేనే నిర్ణయించుకుంటానని ఊహించేడను కుంటాను. ఈ సంగతి ఇద్దరి ముగ్గురి చెవిని పడేసి ఉంటాడు. అక్కడ నుంచి ఆయన ప్రయత్నమేమీ లేకుండానే సంబంధాలు రాసాగినవి. మంచి రోజనుకున్నప్పుడల్లా ఎవరో పెళ్ళి వారొచ్చారనీ ఇంటికోమాటు రమ్మని మానాన్న కబురుచేయడం, నేను వెళ్ళడం, నన్నువారు చూడడం, వారు చేటంత మాట్లాడ్డం జరుగుతూండేవి. తరువాత జరిగినదేమిటో నాకు తెలియదుగాని, ఏ సంబంధమూ మానాన్న నిశ్చయం చేయలేకపోయే వాడు. పెళ్ళికొడుకు పెళ్ళివారికి నచ్చిన మాట నిశ్చయమే. ఎందుకు నచ్చడు, పండులాంటి కుఱ్ఱవాడు, ఆస్తిపరుడు, ఆ ఆస్తిని పంచుకోడా నికి మరెవ్వరూ లేనివాడు. పైన అయిదో ఫారమ్ చదువుతున్నవాడు, బుద్ధిమంతుడు, తెలివైనవాడు నేను నచ్చకపోవడమంటూ ఉండదని నాకు తెలుసు. అవతల పిల్ల బాగా లేకపోవటమో, కులశీలాదులు నచ్చకనో, కట్నకానుకలు దగ్గిర పట్టింపో, ఏమైతేనేమి నెలకైదారు సార్లు ఎవరో వచ్చి తిరుగుతుండడం, కొన్ని మాసాలపాటు సాగింది. ఇది బాగుంది కాదు అనుకుని ఇది ఎలాగైనా మానిపించాలని నేను పెండ్లి చేసుకోక తప్పని సరైతే ఆ పిల్ల నాకంటిక్కూడా నచ్చాలనీ, అందుకని పెళ్ళి కూతురిని నేను చూస్తేనేకాని వీలులేదని పట్టుబట్టాను. మా అమ్మ కూడా ఇదే బాగుందన్నది!

ఆఖరికెలాగైతేనేమి మా జిల్లాలోనే అదేదో పల్లెటూరు నుంచి ఒక పెళ్ళివారొచ్చారు. మానాన్నకు వాకబు చేయగా వారి సంగతి సంద ర్భాలు నచ్చినాయి కట్నకానుకలు బాగానే ముట్టచెబుతామన్నారుట. జాత కాలు కూడా అనుకూలంగా వున్నవట, అందుకని కబురుచేసి నన్నూ, మా అమ్మనూ, మా మామయ్యనూ వెళ్ళి పిల్లను చూసి రమ్మని పంపించారు. మేము అక్కడికి పడవమీద కొంతదూరం, బండిమీద కొంతదూరం ప్రయాణము చేసి సూర్యాస్తమయానికి గాని ఆ వూరు చేరుకోలేకపోయాం, పెళ్లి వారిల్లు తెలుసుకుని తిన్నగా వారింటికెళ్ళాం. మేం వస్తున్నామని వారికి ముందు కబురందిందోలేదో అందినా వచ్చి నవాళ్ళం ఎక్కడికి పోతామని నిర్లక్ష్యంతోనో పెళ్ళి కూతురి తండ్రి ఏదో కోర్టు వ్యవహారం మీదను ఏలూరో ఎక్కడికో వెళ్ళినట్లు తెలిసింది. ఇది ఇలా జరగడం అమ్మకు అపశకునంగా తోచింది. మమ్మల్ని యింట్లో కూర్చోపెట్టి, మా మామయ్య ఒకమాటు వీధిలోకి వెళ్ళి వీర్ని గురించి కొంత వాకబు చేసుకొచ్చాడు. పిల్ల తల్లి ఇంటి ఎదురుగుండా వున్న పిల్ల మేనమామ, పిల్ల మేనత్త వీరందరూ మమ్మల్ని గౌరవంగా కూర్చోబెట్టి,

పిల్ల తండ్రి కొంచెం ఆలస్యమయినా రాత్రికి తప్పక వస్తాడనీ, ఈలోగా మేం పిల్లను చూడానికేమీ అభ్యంతరంలేదనీ నచ్చజెప్పి ఒక్క పావుగంటలో కన్య నలంకరించి తీసుకొచ్చి, వాకిట్లో కూర్చోబెట్టారు. పిల్లను చూచే వారికి మాకు నవనాడులూ కుంగిపోయాయి. పిల్ల సన్నగా రివటలా పొడుగ్గా వున్నది, మంచినిగారింపుతో కూడుకున్న నలుపు, చింతాకుల కంటే చూపువాసి చిన్నవిగా వున్న కన్నులు. ఈ పక్కనూ ఆ పక్కనూ చెవుల నందుకోవలసిన నేత్రద్వయం లేకపోయినా ముఖం చిన్నబోకుండా సువిశాలమైన నోరు, అందులో సగ భాగము మాత్రమే ఉన్న నాశికా పుటాలూ, శరీరచ్ఛాయతో తులతూగే నల్లని పరికిణీ, కోటు ఇంతవరకూ చూచేవారికి సర్వసేనా మూర్ఛయన్నట్లు ఆ పిల్ల మేనమామ ఒక ఆర్మోనియం తీసుకొచ్చి ఆ పిల్ల ముందుంచి పాడమని హెచ్చరించాడు. ఆ పిల్ల చాలా ధైర్యంగా నదురు బెదురు లేకుండా ఖంగుమని కంఠమెత్తి 'ఈ విరహము సైపజాలరా' అని జావళి అందుకొంది.

బాబోయ్ అందా మనుకున్నంత వుద్రేకమొచ్చి గబుక్కున చేత్తో నోరు మూసుకున్నాం మామయ్య కొయ్య బారి పోయాడు. మా అమ్మ మాట చెప్పనే అక్కరలేదు. రెండు నిముషాలు ఒక యుగం అనిపించినంత భారంతో, మోతతో గడిచిన తర్వాత మా అమ్మ ఎప్పుడూ మాట్లాడని మనిషి బాగుంది బాబు, ఇంక ఆ అమ్మాయిని శ్రమ పెట్టకండి. నాకు సంగీతాలు, సాహిత్యాలు ఏమన్నా తెలుసుగనుకనా!





నాయనా ఇకవెళదామా? అంది. చటుక్కున ఆ పిల్ల మేనమామ ఇప్పుడు వెళ్లడమేమిటి? బావగారు రాత్రికి వస్తారు. చూచి వెడుదురుగాని, ఈలోపున మీరు భోంచేసి విశ్రమిద్దురుగాని పొద్దున్ననగా ఎప్పుడు భోంచేశారో, లేవండన్నాడు.

మా మామయ్య, బావగారూ, కతుకుతే అతకదన్న సంగతి మర్చిపోయారేమిటి అన్నాడు నవ్వుతూ. మర్చిపోలేదండీ అందుకనే తమకు మా ఇంట్లో ఏర్పాటు చేశాను, దయచేయండి లేవండి ఇంక ఆలస్యం చేయకండీ. అని ఎదురుగుండా ఉన్నవారింటికీ తీసుకువెళ్ళి పాద ప్రక్షాళనకు నీళ్ళు వగైరా అందించారు. మేము కాళ్ళు కడుక్కునేలోపునే వడ్డనయిందని పిలుపొచ్చింది. మేమూ మా పంక్తిని ఇంటి యజమానీ కూర్చున్నాం. ఆయన భోజనం చేయలేదు, విస్తర్లో చేయి పెడుదుం గదా అన్నం, కూరలు చల్లారిపోయి ఉన్నాయి. మేం ఒకరి ముఖాలొకరు చూసుకున్నాం. ఆ సంగతి గ్రహించి ఇంటి యజమాని కోపంగా భార్యకేసి చూసి మాఇంట్లో వంటా, వార్పు చాలా పెందలాడే అవుతుంది అందుచేత పదార్థాలు చల్లగా వున్నాయి కాబోలు, మీరేమీ అనుకోకండి అన్నాడు. మామయ్య విస్తట్లో వడ్డించిన పసనకాయకూర, అరటికాయకూర అల్లప్పచ్చడి వగైరాలు చవిచూచి తలవొంచుకుని కిక్కురుమనకుండా భోజనానికుపక్రమించాడు. సగం భోజనం అయేసరికి లోపలినుంచి ఒక ముసలామె ఏమే వాళ్ళకు పాపం రెండు అరిసెలు వడ్డించకపోయినావులే, అన్నీ ఇలాటి పనులు చేస్తావేం, పెళ్ళి చూపులకు వచ్చిన వాళ్ళను తీపితినిపించవద్దా అని కోడల్ని హెచ్చరించటం మాకు వినపడ్డది. నాకునూ పచ్చడి చాలా యిష్టం. ఉంటే అది కాస్త కొంచెం వేయండి అందామనుకొని నోటి చివరదాకా వచ్చిన మాటను పైకి రానివ్వకుండా ఓ పెద్దముద్ద నోట్లో పెట్టుకున్నాను. దాంతో నాకుక్కిరి బిక్కిరై కంగారు చేసింది. మా అమ్మ ఏమిరా నాయనా అంటూ వీపు రాసింది. ఒక రెప్పపాట్లో కంగారు సర్దుకుంది, ఎలాగో విస్తళ్ళ దగ్గర్నుంచి లేచి బైటపడ్డాము. మాకు పెళ్ళివారింట్లో పక్క యేర్పాటు చేశారు. ఇంత వివరంగా భోజన విషయం ఎందుకు చెప్పానో మీరు గ్రహించే వుంటారు. ఇందులో రహస్యమేమిటంటే ఆనాడు మాకు అన్నదానం చేసిన వారింట్లో యజమాని తండ్రి ఆబ్దికం. మేము అనుకోకుండా వచ్చేసరికి ఇంటివారి కోడలు మేము గ్రహించలేమనుకొని మధ్యాహ్నం మిగిలిన తద్దినపు వంట వడ్డించింది. గారెలు మినహాయించి, అది ఎంత అమంగళమో ఆవిడకు తెలియనేలేదో, మాకు తెలియదనే అనుకుందో, ఏమయితేనేం పర్యవసానం యిది.

రాత్రి ఎంత గడచినా పెళ్ళి కూతురు తండ్రి రానేలేదు. మేము తెల్లవారు జామున లేచి మా యింటికి ప్రయాణమయ్యాం. వారేమీ అనలేకపోయారు. మధ్యాహ్నం సుమారు రెండు జాములకు మొగల్తుర్రు చేరుకున్నాం. దారి పొడుగునా ఈ సంఘటన తల్చుకొని విరగబడి నవ్వు కున్నాం. మా నాన్న జరిగిందంతా విని ఉగ్రుడై వారిని శపించడానికి ఆ ఊరు వెళ్లడానికి ప్రయాణమవుతుంటే బలవంతాన మేము ఆపుజేశాం.

ఇక నా పెళ్ళి వారెప్పుడూ మాకుత్తరమన్నా వ్రాయలేదు. నేను మా నాన్నతో మా అమ్మ, మావయ్యల అండచూచుకొని నేనింకో నాలు గేళ్ళు దాకా పెండ్లి చేసుకోను. మీరేమనుకున్నా సరే. ఆ ప్రయత్నం మీరు విరమించకపోతే నాకు చాలా కష్టంగా ఉంటుంది అన్నాను ధైర్యంగా. మా నాన్న కూడా అదే మంచిదనుకున్నాడేమో మాట్లాడకూరుకున్నాడు. మర్నాడు నేను నర్సాపురం వెళ్ళాను.

# 5

ఈ సంవత్సరం పరీక్ష తన్నేసింది. నాకు ఇంకిక్కడ ఉండడం, మళ్ళీ ఆ క్లాసులోనే కూర్చోడం మేష్టర్లు వేళాకోళం చేయడం, ఇవన్నీ తల్చుకొని చదువుకింక స్వస్తి చెబితే బాగుంటుందనే నిశ్చయానికి వచ్చాను. మా నాన్నకూడా నాతో సంప్రదించకుండానే అదే నిశ్చయానికి వచ్చినట్టు తోచింది. స్కూలు తెరవగానే వెళ్ళడమా, మానడమా, అనుకుంటూ ఓ రోజు పొద్దున్న కూర్చున్నాను. 'నాయనా పార్వతీశం' అన్న మా నాన్న పిలుపు విని సావిట్లోకి వచ్చాను. 'ఏం జేస్తున్నా'వన్నారు! 'స్కూలు తెరిచేరు కదా అని పెట్టె సర్దుకుంటున్నాను.

చూడు ఒక్కమాట చెపుతాను. నువ్వు చదువుకుంటావు. ఆ చదు వుతో పైకి వచ్చి బాగుపడాతవనుకున్నాను. మొదట వున్న చురుకు ఎందుకో మందగించింది. అందుచేతను ప్రస్తుతం ఈ సంవత్సరం మానేసెయి. మరొకప్పుడు చదువుకోవలెననే వాంఛ బలీయమైనపుడు మళ్ళీ ప్రారంభించవచ్చు, నేనొద్దన్ను, ఈ ఏటికి మట్టుకు మానేసెయి. అలా అని గాడిదలా తిరగమని నా ఉద్దేశ్యం కాదు. ఈ సంవత్సరం సంస్కృతం రెండు ముక్కలు ఎలాగో నేర్చుకో, తెలుగుకూడా బాగా చదువుకో, ఆ తరువాత సంగతి చూద్దాం. ఈ వేళ నువ్వు బి.ఏ. ప్యాసయి ఏ మేష్ట రీయో చేస్తేనేగాని గడవదన్న బాధ లేదుకదా, ఓపికున్నప్పుడు ఓమాటు

పొలంకేసి వస్తూ నాకు కొంచెము సహాయముగా వుండి ఆపనీ చూసు కుంటూండవచ్చు' అన్నాడు మా నాన్న. నా వూహ గ్రహించినట్టు నేను కొంచెంసేపు తటపటాయిస్తూ ఏమాటా చెప్పలేక, ఏ నిర్ణయానికీ రాలేక సందేహిస్తూంటే, ఒక్క మాటలా పొలంలోకి వెళ్ళు. ఈ వేళ కుప్ప నూర్పిద్దామనుకుంటున్నాను. మన దూడలు కాక, మరొలంకె, రెండు లంకెలో చూడమని చెప్పాను వెంకడితోటి. వాడేం చేస్తున్నాడో చూసిరా అన్నాడు మా నాన్న. నేను ఆలోచించవలసిన అవసరం లేకుండా నా కార్యక్రమం నిర్ణయమైందని తెలిసికొని మాట్లాడకుండా పొలము వెళ్ళాను.

ఇలా రెండు మూడు నెలలు కొంచెం మందంగా ప్రశాంతంగా గడిచింది. నాకేమీ తోచక, ఉబుసుపోక, మధ్యమధ్య కొంచెం చిరాగ్గా ఉంటూంది. అక్కడికీ సాయంకాలం వేళ నర్సాపురం ఉడాయిస్తూనే ఉండేవాడిని కాస్సేపు. ఏదీ లేకపోతే మా పూర్వపు స్నేహితులతో కాస్సేపు షికారు తిరిగి, కొంచెం సేపు గోదావరి గట్టున కూర్చుని, దీపాలు పెట్టగానే యింటికి చేరుకునేవాడిని. కాని ఇలా అట్టే రోజులు గడవకుండానే నర్సాపురంలోనూ, పాలకొల్లులోనూ రోజురోజుకు సభలూ, ఉపన్యాసాలు ఎక్కువైనాయి. నాపూర్వపు మిత్రులూ, కొందరు పెద్దలూ, ఒకరోజున పొద్దున్నే మొగల్తుర్రు మాయింటికి చక్కా వచ్చారు. నా అదృష్టం బాగుండి నాన్నింట్లో లేడా సమయానికి. ఆ వచ్చినవారిలో ఒక మధ్య వయస్సు ప్లీడరుగారు, "ఏం పార్వతీశం, కులాసాగా ఉన్నావా? బొత్తిగా కనపడ్డం మానేశావేమిటి ఉద్యోగం విరమించుకున్న ఉద్యోగిలాగనో, కొత్తగా సన్యాసం పుచ్చుకున్న గృహస్తులాగానో, మాకందరికీ దూరమై ప్రజాజీవి తానికి దూరమైతే ఎలాగోయి. నీబోటి యువకులూ, ఉత్సాహవంతులూ చేయవలసిన పని బోలెడంతున్నది. నీలాటి భావిపౌరులంతా ఒకచోట చేరి మీ శక్తి సామర్థ్యాలను కూడగట్టుకొని, కార్యరంగంలోకి రావలసిన తరుణం రానేవచ్చింది. పరిస్థితులు మనకెంతో అనుకూలంగా ఉన్నాయి. స్వరాజ్య సంచలనము బెంగాల్‌లో ఉవ్వెత్తుగా లేచి దేశంమీద పడుతోంది. బిపిన్ చంద్రపాల్ లాంటి మహానాయకులంతా మన సహాయాన్ని అర్థించడానికి మనదగ్గరికి రాబోతున్నారు. ఇక్కడ మన పెద్దలంతా బోడె నారాయ ణరావు మొదలైన వాళ్ళంతా వారిని ఉచితరీతిని సత్కరించడానికి తగిన వాతావరణం కల్పించడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు. ఊరూరా ప్రచా రానికి సభలూ ఏర్పాటు చేస్తున్నారు. అందుకని నీబోటి వాళ్ళ సహాయం ఉంటేనే కాని ఈ పనులు జరగవు కదా! ఈ మహత్కార్యమంతా కబు ర్లతో జరిగేది కాదు కదా! ఇదంతా మీ భవిష్యత్తుని తీర్చిదిద్దడానికే, మీ

జీవితాలు సుఖమయం చేయడానికే కాని, మాకోసం కాదుకదా! మారోజులు అయిపోవచ్చినాయి, ఇక వచ్చేవి మీ రోజులు, మీకోసం, మీ సుఖం కోసం, దేశ సౌభాగ్యం కోసం మీరు నలుగురు కలిస్తే మీ వెనకవుండి, మిమ్ములను ముందుకి తీసుకొని, వెళ్ళాలని మాకందరికీ కుతూహలంగా ఉంది. నారాయణరావుగారి లాంటి నాయకులందరూ నీపేరు ఎలా తెలిసిందో తెలిసింది. వారు ప్రత్యేకించి నిన్ను బ్రతిమాలి నీ సహాయంతో నీ నాయకత్వాన ఒక స్వచ్ఛంద సేవాదళం అధమం వందమందితోనైనా నా వెంటనే ఏర్పాటు చెయ్యమని వాళ్లందరికీ నీచేత ఒక నెల రోజులు శిక్షణ యిప్పించమనీ మాకు వర్తమానం చేశారు. ఇంక నువ్వు ఏదో వంక కల్పించి తప్పుకు తిరగడానికి వీల్లేదు. నీకోసమని ఇక్కడకి పనిగట్టుకు వచ్చానంటే ఇది ఎంత తొందరపనో ఊహించుకో. సాయంకాలం నాలుగు గంటలకు నర్సాపురం వస్తే మనం కలుసుకొని మనకార్యం ఎలా .సాధించవలెనో ఆలోచించి, దానికి తగిన ఏర్పాట్లు చేసుకుందాం. వస్తామింక నేను ఇంక రెండు, మూడు రోజులలో వెళ్ళాలి'' అని లేచారాయన. ఆయనతో వచ్చిన అయిదారుగురూ లేచారు. నాకు ఏమనాలో, ఏం చెప్పాలో, అంగీకారం తెల్పాలో అక్కర్లేదో కూడా ఏమీ తోచలేదు. నేను అమాంతం పెరిగిపోతున్నట్టూ, గాలిలో తేలిపోతున్నట్టూ అనిపించింది. వారితో పాటు నేనూ నుంచుని, మౌనంగా ఒకక నమస్కారం చేసి, ఊరుకున్నాను. వారు మందహాసముతో నా భుజం మీద చెయ్యి వేసి, వీధి గుమ్మందాకా తీసుకెళ్ళి, "సాయంత్రం సరిగ్గా నాలుగ్గంటలకు రావాలి సుమా. ఆలస్యం కావడానికి వీలులేదు. మనం మొట్టమొదట నేర్చుకోవలసింది, అనుకున్న వేళకు ఒక్క క్షణం కూడా తేడా లేకుండా కళ్యాణ ముహూర్తంలా అనుకుని ప్రతికార్యం ప్రారంభించాలి'' అని బండెక్కారు. నేను సుమారు ఐదు నిముషముల సేపు పరధ్యానంగా, నిశ్చలంగా ఏ ఆలోచనా కూడా లేకుండా అలా వెడుతూ కనుమరుగవుతున్న జట్కా బండిని చూస్తూ నిలబడిపోయాను. లోపలనుంచి మా అమ్మ కేక వినపడే సరికి తెలివి తెచ్చుకొని ఆకాశంలోనుంచి మళ్ళీ మా యింట్లో కొచ్చాను.

తరువాత మూడు రోజులు వరసాగ్గా సాయం సమయమందు నర్సాపురం వెళ్ళి ప్లీడరు రమణారావుగారిని కలుసుకుంటూండే వాడిని, ప్రతి రోజూ నే వెళ్ళేవేళకు పది పదిహేనుగురు పెద్దలూ, పిన్నలూ వారి దగ్గర కూర్చుని వారు చెప్పిన విషయాలూ, చేసే ప్రబోధాలు చాలా శ్రద్ధగా వింటూండేవారు. నేను వెళ్ళి కూర్చుని వాళ్ళు చెప్పేవి వింటూంటే నా మనసు గాలిలా తేలిపోయి ఆకాశమంతా వ్యాపించినట్టు అనిపించేది కొన్ని

మాటలు గిలిగింతలు పెట్టేవి. మరికొన్ని కథల్చెప్పి నవ్వించేవారు. చాల పెద్దలు అనుకొనే వ్యక్తులను అవహేళన చేసేవారు. ఆయన చెప్పే వివిధ విషయాలను గూర్చి వింటూంటే ఇంత విజ్ఞానం సంపాదించడానికి ఒక జీవితకాలం పట్టవలసింది కొద్ది సంవత్సరాల్లో ఎలా సంపాదించాడా అనుకొని, ఆశ్చర్యపడుతుండేవాడిని. ఆయనెంతసేపూ చారిత్రక విశేషాలూ, దేశభక్తి ప్రబోధాలు, ఎక్కువగా చేస్తూండేవారు.

మన సంస్కృతి మరువకూడదనేవారు. వేషభాషల్లో పాశ్చాత్యులను గుడ్డిగా అనుకరించరాదనేవారు. దేశ సౌభాగ్యానికి మూలం విదేశ వస్తు బహిష్కరణ, స్వదేశి వస్తువు మీద అభిమానం, ఆదరణ పెరగాలి అని ఎంతో ఉద్రేకంతో చెబుతూండేవారు. ఒకరోజు నన్నూ మరో పది మంది నా వయస్సు కుర్రవాళ్ళను కూర్చోపెట్టి 'ఒక సేవాదళం ఏర్పాటు చెయ్యాలనీ దీనిలో జీతభత్యాలేవి వుండవనీ, బలవంతమేమీ వుండదనీ యిష్టమైనవాళ్ళు దేశసేవ చేయాలనీ దృఢ సంకల్పము కలవారూ,



కార్యదీక్షపూని తిరుగ కలగినవారూ, స్వేచ్ఛగా వచ్చి మనదళంలో చేరి

పనిచేస్తే స్వరాజ్య సౌధానికి మీరు మొదటి మెట్టు కట్టినవారవుతారు. మీరు కష్టపడవలసిన పని అట్టే ఉండదు, తరుచుగా ఈ ఊళ్ళోను, సమీప గ్రామాల్లోను సభలు సాగించే యేర్పాటు చేస్తూ అవి జయప్రదంగా జరిగేటట్టు చూచే బాధ్యత మీ మొదటి పని. ఆ సభలకు ఎవరెవరిని పిలవాలో ఎవరిచేత ఉపన్యాసాలిప్పించాలో అదంతా నే చూసుకుంటాను, మీరు నాతో వున్నారంటే నాకు కొండంత బలం వస్తుంది. మన మాహ్వానించే పెద్దల ఉపన్యాసాలు మీరు శ్రద్ధగా వింటూంటే మీకు బోలెడంత దేశాభిమానం, కొంత విజ్ఞానం కలుగుతుంది. తరువాతను అక్కడక్కడ వీధిబడులు, రాత్రివేళగాని, పగలుగాని ఏర్పాటు చేసి చదువుకోవలెననే కుతూహలం కలవారికి పెద్దలకూ, పిల్లలకూ మీరు వుచితంగా చదువులు చెబుతూండాలి. దానికయ్యే ఖర్చంతా నేనందించే ఏర్పాటు చేస్తాను. రేపు మనం బయల్దేరి పది ఊళ్ళు తిరిగి మరికొంత మంది యువకులను మన దళంలోకి చేర్చుకుందాం. రేపు బందరు నుంచి బోడె నారాయణరావుగారు వస్తారు. ఇక్కడ ఉపన్యాసమిస్తారు. అందుచేత మీరంతా రేపు మధ్యాహ్నం భోజనం చేసి పెందలాడే ఇక్కడకొస్తే సభకు కావలసిన ఏర్పాట్లు చూసుకుందాం. వెళ్ళిరండి. దూరం వెళ్ళాలి కాబోలు' అని మాకు సెలవిచ్చారు.

మర్నాడు మధ్యాహ్నానికల్లా మేము 10, 15గురం ప్లీడరుగారింటికి వెళ్ళాం. కొన్ని ఆహ్వానపత్రికలు నలుగురైదుగురి చేతికిచ్చి వూళ్ళో పంచి పెట్టమని పంపించారు. మిగతా వాళ్ళను సభకు జరిగే చోటికి కొన్ని కుర్చీలు, బల్లలూ చేరవేయించమనీ కొన్ని చాపలు కూడా తెమ్మనీ, మాకు నలుగురు కూలీలను వప్పజెప్పి ఆ ఏర్పాట్లన్నీ జాగ్రత్తగా చూడమనీ పంపించారు.

మేము సాయంకాలం నాలుగు గంటలయ్యేసరికే సభ జరిగే చోట నాలుగు బిందెల నీళ్ళు చల్లించి, కుర్చీలు, వాటి వెనక బల్లలూ ఒక పక్కనూ, రెండవ పక్కను రెండు పెద్ద బరకాలు పరిచి, చాపలు వేయించాము. వేదికకు పది బల్లలు దగ్గరగా ఏర్పాటు చేసి దానిపైన ప్లీడరుగారు చెప్పినట్టు ఐదారు కుర్చీలు, ఒక మేజాబల్లా, రెండు గాస్‌లైట్లూ తీసుకొచ్చి పెట్టాం. ఐదుగంటలనుంచి జనంరాసాగారు. రవణరావుగారు ఈ ఏర్పాట్లన్నీ చూచి చాలా సంతోషించి, 'పార్వతీశం బాగుందోయి. నాకు తెలుసు నువ్విలా చేయగలవని, అందుకనే నిన్ను చూడగానే నీ సామర్థ్యం ఊహించి ఈ దళానికి నువ్వే ప్రథముడుగా ఉండాలని కోరేను. నా వూహా సరియైనదేనని ఇప్పుడు రుజువైంది. భవిష్యత్తులో నువ్వేదో పెద్ద నాయకుడు

వయ్యే లక్షణాలన్నీ నీలో కనబడుతున్నాయి. పరమేశ్వరుడు నిన్ను అను గ్రహించుగాక' అని నా రెండు భుజాలమీద చేతులు వేసి ఒక్క మాటు వూపి సమ్మోహనాస్త్రంలాగ ఓ నవ్వు నవ్వి చక్కాపోయారు. ఇక నేను ఆనందం పట్టలేక, పరవశణ్ణయి చేష్టలుడిగి అలాగే నిలబడి ఆయన ఇలా అన్నారేమిటి? ఆయన నాలో ఏం చూచి ఇలా అన్నారు. ఆయన వూరికే నన్ను ఉత్సాహపరచడానికన్నారా; లేక ఆయనకు ఏదన్నా దివ్య దృష్టి ఉండి నా భవిష్యత్తు చూడగలిగి అన్నారా! అనుకుంటూ కొన్ని క్షణాలు అలా అక్కడే నిలబడి వుంటే, జనం రావడం రద్దీ ఎక్కువ కావడంతో, వాళ్ళ మాటల శబ్దం విని తెలివి తెచ్చుకుని నేనక్కడనుంచి కదిలేను.

ఇంతలోనే బందరునుంచి వస్తారనుకున్న నారాయణరావు పంతులు గారు ఏభై అరవైమంది అనుచరులతో రానే వచ్చారు. రవణారావుగారూ మరికొందరు పెద్దలూ, మరికొంతమందినీ వేదికమీద కూర్చుండబెట్టి వారికి సభాపతిగా ఎన్నికైన మరొకరికి ప్రజల కరతాళధ్వనుల మధ్య పూలదం డలు వేశారు. అందరూ అక్కడ కూర్చోగానే సభలో సందడి కొంత సద్దుమణిగిన తరువాత, రవణారావుగారు వేదికమీదకెక్కి ఉపన్యాసకులను వచ్చిన వారందరికీ పరిచయం చేసి సభ ప్రారంభమవుతున్నదనీ అందరూ నిశ్శబ్దంగా శ్రద్ధగా పంతులుగారి ఉపన్యాసము విని వారు చేసే బోధలు తలకెక్కించుకొని ఆ ప్రకారం మనం నడుచుకోగల్గినట్లయితే దేశానికి బాగా ఉజ్జ్వల భవిషత్తు ఉంటుందని చెప్పి వేదిక మీద నుంచి దిగారు.

వేదపఠనంలో సభ ప్రారంభమైంది. నారాయణరావుగారు దిక్కులు పిక్కటిలేటట్లు వూరంతా కూడా వినపడేటట్టు, గంభీరోపన్యాసము రెండు గంటలకు పైగా చేశారు. సభికులంతా మూర్ఛపోయినట్లు చీమ చిటుక్కుమన్నా వినపడేటంత నిశ్శబ్దంతో ఉపన్యాసం విని సముద్రఘో షంత చప్పుడుతో కరతాళ ధ్వనులు చేశారు. నాటితో సభ ముగిసింది, ఇక నేనేమి చేస్తున్నానో తెలియలేదు. మళ్ళీ పదిమంది కుర్రవాళ్ళనూ కూలీలనూ కేకేసి ఈ బల్లలనూ, కూర్చీలను వగైరా సామానులను ఎవరి కివారికి వప్పచెప్పి సుమారు తొమ్మిదిగంటలకు ఇంటికి చేరాను, నేను ఎలా వెళ్ళానో, బండిమీదనో, నడిచో కళ్ళు తెరిచో, మూసుకునో, నిద్రలో నడు స్తున్నట్టూ గాలిలో తేలినట్టూ, యోగులు ఆకాశంలో ఎగిరినట్టూ యింటికి వచ్చాను. నేనేమయ్యానా, యెందుకు రాలేదా అనుకుంటూ అమ్మా, నాన్న నాకోసం కనిపెట్టుకున్నారు. నన్ను చూడగానే ఎంతో సంతోషంతో ఏంరా నాయనా ఇంత ఆలస్యమైంది అన్నది అమ్మ. మా నాన్న ఏమీ

మాట్లాడలేదు, నేను నర్సాపురంలో జరిగిన సభ సంగతి అక్కడ ఉపన్యాస సారాంశమూ చెప్పాను. మా నాన్న ఊఁఆఁ అనేనా అనకుండా అన్నీ విని లేచి వెళ్ళి పడుకున్నాడు. నేను భోజనానికి వెళ్ళాను, ఇంత పొద్దు పోయేదాకా సభలు యివన్నీ ఎందుకు నాయనా ఇంటిపట్టు నుండి నువ్వేదో చదువుకోడమో, పొలంపని చూసుకోడమో, మీ నాన్నకు సాయం చెయ్యడమో చెయ్యాలి కాని అని అన్నది, నేను భోంచేస్తుంటే. ఇవి మానాన్న అభిప్రాయాలయ్యుంటాయని నేనూహించుకొని త్వరగా భోజనం ముగించి మాట్లాడకుండా వెళ్ళి పడుకున్నాను. ఆనాటి విశేషాలన్నీ తలుచుకుంటూ ప్రతీదీ జ్ఞాపకం చేసుకుంటూ ఆలోచిస్తూ మెలకువో, నిద్రో, స్వప్నమో తెలియకుండానే తెల్లవారింది.

# 6

రాత్రంతా ఏవేవో ఆలోచనలతో, కలలతో నిద్ర పట్టిందోలేదో తెలియని స్థితిలో ఉండగా తెల్లవారింది. నేను లేచి కాలకృత్యాలు తీర్చుకునేటప్పటికే, మా నాన్న స్నానం చేసి, జపానికి కూర్చోబోతున్నాడు. నన్ను చూచి నాయనా లేచావా, చూడు ఒక మాటు పొలం వెళ్ళి అని నాకు పదిహేను రోజులవరకు ఊపిరి తీసుకోవడానికైనా, తీరిక లేకుండా ఏవేవో పనులు పురమాయించాడు. ఇకనుంచి నేను సభలూ, సందర్భాలూ మానుకుని ఇంటి పట్టున ఉండమనీ దీని భావం అయివుంటుంది, అని వూహించాను. నేనేమీ మాట్లాడలేదు. అయన మౌనంగా జపానికి కూర్చున్నాడు. నేను చద్దన్నానికి కూర్చుని అది కాగానే పొలానికి బయలుదేరాను. పొలం వెళ్ళేనన్నమాటే గాని అక్కడ ఏ పనిమీద మనస్సు పోలేదు. నా శరీరం మట్టుకు పొలంలో వున్నా బుర్ర నర్సాపురంలోనే ఉండిపోయింది. అక్కడేవేవో పనులు పని వాళ్ళకు పురమాయిస్తూ చూస్తూ కూర్చునో, నిన్నటి ఉపన్యాసాలమీదనో నాయకుల మీదనో నిలిచిపోయింది మనసు. ఇది ఒదుల్చుకుందామన్నా ఒదిలేటట్టు కనబడలేదు.

ఇలా వారం రోజులైనా గడవకుండా రమణారావుగారు ఒకసారి వచ్చి కనపడమనీ, బిపిన్‌చంద్రపాల్ అనే మహానాయకుడు బెంగాల్ నుంచి వస్తున్నాడనీ, పెద్ద ఎత్తున మనం సభకు ఏర్పాట్లు చేయాలనీ, అధమం పదివేలయినా జనం సభకు వచ్చే సూచనలున్నాయనీ కాబట్టి నీవు వచ్చి దగ్గిర ఉండి ఈ ఏర్పాట్లన్నీ జరిపిస్తేనే సభగాని, లేకపోతే అభాసవుతుందనీ కబురు చేశారు. పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్టయింది. వెళ్ళడమా?

మానడమా? వెడితే ఎలాగు, వెళ్ళకపోతే ఎలాగు. వెడితే ఇక్కడ పనులన్నీ పాడవడం మానాన్నకు కోపం రావడం తప్పదు. వెళ్ళకపోతే నామీద ఎంతో నమ్మకంతోనూ, ఆశతోనూ ఎదురుచూస్తున్న రవణారావుగార్కి ఆశాభం గమవుతుంది. ఆశాభంగం మాట ఎలా ఉన్నా యదార్థం చేతను నేను వెళ్ళకపోతే అక్కడ ఏర్పాట్లన్నీ శ్రద్ధగా జరిపించేవాడు మరొకడు లేడేమోన నిపించింది. ఇలా ఆలోచిస్తూ ఒకరోజు ఉదయాన్నే పొలం పనులన్నీ మనిషికి పురమాయించి, పెందలాడే భోజనంచేసి ఎవరితోటీ చెప్పకుండా నేను నర్సాపురం చేరుకున్నాను. రవణారావుగారిని కలుసుకొని, ఇంటి దగ్గిర నా యిబ్బందులు మనవి చేసుకున్నాను. వారెంతో సానుభూతితో ఆలకించి, నాయనా ఇటువంటి కార్యక్రమాల్లో ప్రవేశించిన తరువాతను ఎంతసేపు ముందంజవేయడమేగాని వెనుకకు దిగజారడం ఎంతమాత్రం ఉండకూడదు. తతిమ్మా విషయాలు మనం సావకాశంగా ఆలోచించుకుందాం. ఈ సభ మట్టుకు మీరు పూనుకుంటేనే కాని జయప్రదం జరగదు. కాబట్టి ఎలా గైనా వచ్చి నీ బాధ్యత నిర్వహించక తప్పదు. అటువంటిబ్బందులు వస్తూనే వుంటాయి. ఈ పూటకు వెళ్ళి వ్యవధి అట్టే లేదు కనుక రోజూ ఏదో వేళప్పుడు కలుసుకొని తగిన ఏర్పాట్లు చేసుకుందాం. వెళ్ళిరా అని నన్ను వీపు తట్టి పంపించారు. నేనే ఉత్సాహంలో మనము ఎన్ని ఆటంకాలైనా ఎదుర్కొని కార్యభారం వహించకపోతే దేశమే నాశనమవు తుందన్నంత భావోద్రేకంతో, భయంతో తొందరగా ఇంటికి వెళ్ళాను.

అక్కడనుంచి రోజూ ఏదో సమయంలో, నేను నర్సాపురం వెడుతూ, రవణారావుగారితో సంప్రదిస్తూ, అక్కడ ఏర్పాట్లు చేస్తూనే వున్నాను. మా నాన్న ఇవన్నీ ఓ కంట కనిపెడుతూనేయున్నాడు. కాని ఒక్కనాడూ ఇదేమిటని నన్నడగనూ లేదు. నేను చెప్పనూలేదు.

ఆఖరికి సభరోజు రానేవచ్చింది. ఆ రోజు ఉదయాన్నే చద్దన్నం తిని రాత్రిదాకా యింటికి రానని మా అమ్మతో చెప్పి ఆవిడ ఏదో అంటూంటే వినిపించుకోకుండా నర్సాపురం పరుగెత్తుకెళ్ళాను. ఆదరాబా దరా నర్సాపురం చేరుకొని రవణారావుగారూ, నేనూ, మాదళం సభ్యులూ సాయంత్రం వరకూ సతమతమై బ్రహ్మాండమైన యేర్పాట్లు చేశాం. మధ్యాహ్నం రవణారావుగారితో పాటే వాళ్ళింట్లోనే రెండు మెతుకులు తిన్నాను. మళ్ళీ సభాస్థలికి వచ్చి అక్కడ ఏర్పాట్లు పూర్తి చేసుకొనేటప్పి టికి సుమారు 5 గంటలు అయింది. ఊపిరి తీసుకోవడానికైనా వ్యవధి లేకుండా పనిచేయవలసి వచ్చింది. ఎలాగైతేనేం ఏర్పాట్లన్నీ ఎంతో సంతృ ప్తికరంగా పూర్తి చేసుకున్నాను.

సుమారు ఆరుగంటలకు వస్తారనుకున్న నాయకుడు వచ్చి సభ ప్రారంభించేసరికి ఏడు గంటలయింది. రవణారావుగారు సభకు పదివేలుకు పైగా వస్తారన్న అంచనా దాయిపోయింది. ఏభై వేలో, లక్షో వచ్చారన్నట్లుగా కనుచూపు మేరేవరకూ ఇసుక వేస్తే రాలకుండా జన సమూహంతో ఆ మైదానమంతా నిండిపోయింది. బ్రహ్మాండమైన ఉపన్యాసమిచ్చారు పాల్ గారు. నా జన్మలో ఎప్పుడూ అటువంటి ఉపన్యాసం వినలేదు సరికదా! ముందు కూడా వింటానని నమ్మకం లేదు. నాకు జీవితాంతం వరకూ ఆ ఉపన్యాసం నా చెవుల్లో గింగురుమని మారుమ్రోగుతూనే ఉంటుందనిపించింది. సుమారు రెండు గంటలసేపు జనసమూహానికి తెలియని భాషలో ఆయన ఉపన్యాసం యిచ్చినా మరొక తెలుగు నాయకుడు అది తర్జుమా చేస్తున్నా ఒక్కరూ కదలకుడా, కిక్కురుమనకుండా, ఊపిరి విడవకుండా గంభీరమైన శబ్దంతో ఇన్ని వేలమంది ఆ వుపన్యాసం వింటూ కూర్చోడం నా జన్మలో మరపురాని మరువలేని దృశ్యం. సుమారు పది నిమిషాల వరకూ ఆకాశం దద్దరిల్లేటట్లు ప్రజలు చేసిన కరతాళ ధ్వనులతో సభ ముగిసింది.

నేను ఇంటికి చేరుకునేసరికి సుమారు పదిగంటలైంది. మా అమ్మ నాకోసం ఎదురుతెన్నులు చూస్తూ వీధి గుమ్మంలోనే కూర్చుంది. నేను వస్తూంటే నా వెనకనే వస్తున్న జనాన్ని చూచి మా ఊరు ఊరంతా సభకు వచ్చిందా అనిపించింది. నేను యింటికి వచ్చి స్నానం చేసి మౌనంగా మా అమ్మ ఎన్నడిగినా సమాధానం చెప్పకుండా భోంచేసి వెళ్ళిపడుకున్నాను. అప్పటివరకూ మెలకువగానే పడుకున్న మా నాన్న లేచి యివతలకు రాలేదు. నన్ను పలుకరించలేదు. ఉరుములు, పిడుగులు, తుఫాను తెల్లవారింతర్వాత కాని రావని నిశ్చయం చేసుకొని హాయిగా పడుకున్నాను.

# 7

తెల్లవారింది నేను లేచి స్నానాదికం చేసుకొని, చద్దిఅన్నం తినేసరికి మా నాన్న జపం పూర్తి చేసుకొని నాకోసం సిద్ధంగా కనిపెట్టుకున్నాడు. అంతా ప్రశాంతంగానే ఉన్నా ఆయన ముఖంలో గాంభీర్యం మట్టుకు చాలా భయంకరంగానే ఉంది. నెమ్మదిగా మామూలు ధోరణిలోనే, 'నిన్న అంతా కనపడలేదు ఎక్కడి కెళ్ళావురా' అన్నాడు. 'నర్సాపురం వెళ్ళాన'న్నాను, 'ఎందుకన్నాడు' ఇక ఆయనకు చెప్పక తప్పేట్టు లేదని, రెండు మూడు

సంవత్సరాలనుంచి నర్సాపురంలో రవణారావుగారి ఆధ్వర్యాన జరుగుతున్న సభలూ, సందర్భాలూ టూకీగా చెప్పాను. ఆపైన నాకూ, ఆయనకూ కలిగిన పరిచయం వారికి నామీద నున్న అభిమానం, వారు నాకిచ్చిన ప్రోత్సాహం, ఈ సభా సందర్భంలో నే చేస్తున్న పని, ఏమీ దాపరికం లేకుండా నిర్మోహమాటంగా చెప్పేను.

మా నాన్న అంతా విని ఒక క్షణం ఊరుకొని 'నీవు బాగా ఆలోచించుకొనే చేస్తున్నావా ఈ పని. దీనివల్ల నీకొచ్చే లాభమేమిటి? నష్టం కనబడుతూనే ఉంది కదా. నీ చదువు చంకనాకిపోయింది. ఇంటిదగ్గరయినా సుఖంగా కూర్చొకుండా సొంత పనులు చూసుకోకుండా, ఈ సభలు ఏర్పాట్లు చేస్తూ కూర్చుంటే నీ కొరిగేదేమీ లేదన్న సంగతి ఇప్పుడైనా తెలుసుకోడం మంచిది. వారు నిన్ను కొంచెం స్తోత్రం చేయడంతోటే, నువ్వు వుబ్బితబ్బిబ్బై, వారాడించినట్టల్లా ఆడుతున్నావు. ఎన్ని సంవత్సరాలిలా వారి వెనక తిరిగినా, నువ్వు బల్లలూ, కుర్చీలూ సర్దడానికి తప్ప ఇంకెందుకూ పనికిపోవు, ముందు వెనకలేమాత్రం ఆలోచించినా, ఈ రహస్యం నీకిదివరకే తెలిసుండేది.



అందుకని యిప్పుడైనా తెలివితెచ్చుకొని గత మూడు సంవత్సరాల్లో నీవు చేసిన పనులన్నీ ఆలోచించుకుంటే నేను చెప్పిన ప్రతి అక్షరం నిజమేనని నీకు తెలియకపోదు. దేశం కోసం పాటుపడ్డం, దేశాన్ని ఉద్ధరించడం



ఇటువంటి పెద్ద విషయాలన్నీ గొప్ప ఆదర్శాలే కాదనను. ఎటొచ్చీ దానికింకాస్త పెద్ద చదువులూ, పెద్ద బుర్రలూ, పెద్ద వూహాలూ కొంత వెనకస్తోమతూ, ఉంటేనే గాని ఎంత చిన్నకార్యమైనా సాధించడము అసాధ్యమవుతుంది.

నీవు ఉద్యోగం చేసుకోవాలన్నా దేశసేవ చేయాలనుకున్నా ఇది ఏదీ గాక వూరికేనా విజ్ఞానాన్ని పెంచుకోవాలన్నా విద్య చాలా అవసరం అన్న సంగతి మరిచిపోకు, ఈ సత్యాన్నెప్పటికైనా నీవే తెలుసుకోగలవని నేనిన్నాళ్లూ వూరుకున్నాను. నువ్వింకా ఇలాగే తిరుగుతూంటే, ఎప్పటికీ తెలుసుకోలేవని నేను నీకింతా విడమర్చి చెబుతున్నాను.ఇప్పుడైనా మేల్కొని నీకు ఏరకమైన విద్యకావాలో నీవే నిర్ణయించుకొని, ఆ విద్యనభ్యసించే ప్రయత్నం చేయి.

నీవు ప్రాజ్ఞుడువవుతున్నావు. ఇంతకంటే ఎక్కువ చెప్పడం అనవసరం.'' అని మా నాన్న మారుమాట లేకుండా, నీ అభిప్రాయమేమిటని నన్నడక్కుండా, తిన్నగా పొలం వెళ్లిపోయారు. నేను బైటకి వెళదామనుకున్నది మానేసి ఇంట్లోనే కూర్చుని ఆలోచిస్తూ ఏ పుస్తకం చదువబుద్ధి కాలేదు. మళ్ళీ మానాన్న కంటపడలేదు. అలాగే యోచిస్తూ కూర్చుని నాలుగోరోజు సాయంత్రం నర్సాపురం రవణారావుగారి దగ్గరకు వెళ్ళాను.

"ఏం పార్వతీశం ఏమిటి విశేషాలు, మొన్న అంతటి సభ అంత జయప్రదంగా జరగడానికి నీవే సుమా నీ ముఖస్తుతి కోసం చెప్పటంలేదీ మాట. నీవు పడ్డ పాటంతా గమనిస్తూనే వున్నాను. చాలా అలిసి, చిక్కి సగమయ్యేవు'' అన్నారు. "ఇంకా ఏమిటి విశేషాలు? అంత మవునంగా ఉన్నావేమిటి? ఏదో మాట్లాడు'' అన్నారు నవ్వుతూ.

నేను యింటిదగ్గర జరిగిన సంగతంతా వారికి విన్నవించి మీ సలహా ఏమిటన్నాను. ఆయన ఒక్క క్షణం ఊరుకుని 'మీనాన్నగారు చెప్పిందంతా నిజమే, కాదని నేనెలానగలను విద్యలేందే విజ్ఞానమెలా వస్తుంది గనుక, ఆ సంగతులు నీకు నేను ఒక రోజున సావకాశంగా, హితవుగా చెబుదామనుకున్నాను. ఆశ్రమ నాకు తప్పించారు మీ నాన్నగారు. ఆయన పెద్దలు, పండితులు, వివిధ విషయాలూ తెలిసినవారు. చదువు అత్యవసరమన్నది నిర్వివాదం. ఏ చదువు అన్నది ప్రశ్న. నా ఉద్దేశ్యం నువ్వు మళ్ళీ హైస్కూల్లో చేరి చదవడమనేది మంచిది కాదంటాను. కాబట్టే ఇంటి దగ్గిర నీవు కొంత సంస్కృతం, తెనుగూ చదువుకో తరువాత కొన్ని పుస్తకాలు సాంఘిక, రాజకీయాలకు సంబంధించినవి నేనిస్తూ ఉంటాను. అవీ చదవచ్చు తరువాత నెమ్మదిగా యితర విషయాల సంగతి ఆలోచిద్దాం

అన్నారు. కొంచెంసేపు ఈమాటా ఆమాటా చెప్పి నాకు సెలవిచ్చారు. నేనింటికి చేరుకొని వారు చెప్పిందంతా ఆలోచించుకుంటే, మానాన్న కూడా ఎంత దూరాలోచనతో చెప్పాడో నాకర్థమైంది. వారుభయులూ చెప్పిన పద్ధతినే, నేను కొత్త చదువు ప్రారంభించాను. తరుచు నర్సాపురం వెడుతూ రవణారావుగారినీ యితర స్నేహితులనూ కలుసుకుంటూ కొత్త విషయాలు తెలుసుకుంటూండేవాడిని. రవణారావుగారిచ్చిన అనేక రకాల పుస్తకాలు చదువగల్గాను. అనేక విషయాలు అదివరకు తెలియనివి ఊహించనివి తెలుసుకో గలిగాను. కలిగిన సందేహాలు అనేకం రవణారావుగారు తీర్చేవారు. ఈ పుస్తకాలన్నీ రాజకీయలూ, సాంఘికాలూ చదువుతుంటే అశాంతి ఎక్కువైయింది. మతాన్ని గురించి కొన్ని పుస్తకాలు చదువుతుంటే ఇతర మతముల మీద కొంత సహనం బయలుదేరినా, కొంత ఆగ్రహం కూడా వచ్చేది. మాకు నర్సాపురంలోనూ, పరిసర గ్రామాలలోనూ క్రైస్తవ ప్రబోధం చాలా ఎక్కువగానూ అసహ్యంగానూ వుండేవి. వారనేమాటలూ, చెప్పే విషయాలూ, చేసే ప్రభోధాలు ఎంతో బాధాకరంగా ఉండేవి. ఇటువంటివే ఎన్నో చిన్నవి పెద్దవి కలిసి నాలో అశాంతి రేకెత్తించి రోజు రోజుకీ మనోవ్యధ ఎక్కువవుతూండేది. ఇలా సుమారు ఒకటి, రెండు సంవత్సరములు గడిచింది. నాలుగైదుసార్లు రవణారావు గారి దగ్గరకెళ్ళినప్పుడు గుంటూరునుంచి అక్కడకు వచ్చిన నలుగైదుగురు పెద్ద మనుష్యులను సందర్శించడం వారి పరిచయం కలగడం కూడా జరిగింది. వారివల్ల ప్రధమంగా విదేశయానం, అక్కడ చదువూ దానివల్ల ప్రయోజనాలు వగైరా లెన్నో విని ఆలోచిస్తూండేవాడిని. ఆఖరు కొకసారి, రవణారావుగారింట్లోనే ఒక ప్లీడరుగారి దర్శనమైంది. వారితో మాట్లాడిన తరువాత వారి సలహామీద లండను వెళ్ళి బారిష్టరు చదవాలని నిశ్చయం చేసుకున్నాను, నాటినుంచి నా సంకల్పం రోజు రోజూ బలీయమవుతూ వచ్చింది. ఆఖరుకు తెగించి ఒకనాడు బయలుదేరడానికి సుముహూర్తం ఏర్పాటు చేసుకున్నాను.

# 8

[నర్సాపురం దగ్గిర మొగలితుర్రు మా కాపురస్థలం. మాఇంటిపేరు వేమూరువారు, నాపేరు పార్వతీశం, నేను టెయిలర్ హైస్కూలులో అయిదో ఫారము దాకా చదువుకున్నాను. ఒకటి రెండేళ్ళు అక్లాసు లోనే కారణాంతరాల చేత గడపవలసి వచ్చింది. ఆ పెమ్మట ఇక్కడ

పాఠశాలలో విద్య ఏమీ బాగుంది కాదనీ, ఉపాధ్యాయులకు తాము చెప్పే సంగతులేమిటో అవగాహన కావడము లేదనీ, నా అభిప్రాయము అందు చేత వృధాగా ధనవ్యయము కాలవ్యయమూ కాలయాపనా ఎందుకని నేను చదువు మానివేసి మా పెద్దలు సంపాదించి ఆస్తి కొంత ఉన్నది గనుక సుఖంగా నిర్వ్యాపారంగా, ఇంటిదగ్గిర కూర్చొని, దేశ కాలవైపరీత్యాలను గురించి ఆలోచిస్తూ ఉండేవాడిని.

ఇలా ఉండగా ఒక రోజున మా స్నేహితుడొకడు వచ్చి మాటల మధ్య ఇంగ్లండు వెళ్ళి చదువుకోమని హితోపదేశము చేశాడు. అతడు వెళ్ళిపోయిన తరువాత ఇంగ్లాండు ప్రయాణమును గురించి చాలాసేపు ఆలోచించి అందులో మంచి చెడ్డలూ, కష్టసుఖాలూ, నాలో నేను తర్కించుకొని అన్ని విధములచేతనూ దేశాటనము శ్రేయస్కారమనీ, పైగా మన అధికారుల దేశము వెళ్ళి, వాళ్ళ ఆచార వ్యవహారాలు చూచి, గుట్టూమట్టూ తెలుసుకుంటే స్వరాజ్య సంపాదనకు వీలుగా ఉంటుందనీ ఆలోచించి, అక్కడకు వెళ్ళి బారిష్టరు చదువుదామని నిశ్చయము చేసుకున్నాను:

మా తండ్రి వ్యవసాయదారుడు ; ఏమీ చదువుకున్నవాడు కాదు ; వట్టి అనాగరికుడు. అందుచేత ఇటువంటి విషయము ఆయనతో చెపితే దీని సారస్యము గ్రహించలేడని ఆయనతో చెప్పకుండా ఒక స్నేహితుని దగ్గర కొంత సొమ్ము బదులు పుచ్చుకొని నర్సాపురము వెళ్ళి నాల్గు రోజులలో వస్తానని ఇంటి దగ్గర చెప్పి బయలుదేరాను.]

ఇంగ్లాండు ప్రయాణమని చిన్నప్పుడు పుస్తకములో చదివిన పాఠము వల్లా, తరువాత చదివిన భూగోళశాస్త్రమువల్లా, ఆ దేశానికి వెళ్ళే మార్గము నాకు తెలుసును. కాని అక్కడకు తీసుకొని వెళ్ళవలసిన సాధన సామగ్రియేమిటో, అక్కడ ఎలా నడుచుకోవాలో, తెలుసుకుందామంటే చెప్పడానికి ఎరిగివున్న వాళ్ళు ఎవ్వరూ లేకపోయినారు. నరసాపురములో ఉన్న దొరల నెవరినైనా అడుగుదామూ అంటే నా అజ్ఞానాన్ని చూచి వాళ్ళు నవ్వుతారేమోనని వాళ్ళ నడగడము మానివేసి నా సహజ సూక్ష్మబుద్ధి ఉపయోగించి నాకు తోచిన వస్తువులు కొన్ని ఇక్కడ నుంచి తీసుకువెళ్ళితే ఇంకా కావలసినవి త్రోవలోనో, అక్కడకు వెళ్ళిన తరువాతనో కొనుక్కోవచ్చుననుకున్నాను. అందుకని అనవసరంగా విశేషంగా డబ్బు ఇక్కడ ఖర్చు పెట్టకూడదనుకొని, సూక్ష్మములో తేల్చవలెనని కావలసినవి ఏమిటా అని జాగ్రత్తగా ఆలోచించాను.

ఎంతసేపు ఆలోచించినా సరిగా ఏమీ తోచలేదు. ఏదో ఒక చివర నుంచి ఆరంభిస్తే కావలసినవన్నీ తేలుతవికదా అనుకున్నాను. అందుకని నిద్ర లేవడముతోనే కావలసిన సామాన్లు జాబితా వ్రాసుకున్నాను. దంతధావనానికి పది కచ్చికలు నలిపిన పొడుమూ, నాలుక గీసుకోవడానికి కాసిని తాటాకు ముక్కలూ, ఇత్తడి చెంబూ, దంతధావనమైన తరువాత స్నానము కదా అనుకున్నాను.

అందుకవసరమైనవి ఒళ్ళు తుడుచుకోడానికి రెండు అంగవస్త్రాలు; స్నానంతరము తలకు రాసుకోడానికి సీసాలో పోసిన కొంచెము కొబ్బరినూనె; తల దువ్వుకోడానికి దేశవాళీ దువ్వెన్న, బొట్టు పెట్టుకోడానికి కొబ్బరిచిప్పలో కొంచెము చాదు; ముఖము చూచుకోవడానికి పావలా పెట్టి చిన్న అద్దము, తరువాత ఆలోచించవలసినది దుస్తుల విషయం కదా! అందుకు నాకవసరమని తోచినవి నాలుగు ట్విల్ షర్ట్లూ ; రెడు షైలూ ; రెండు మేజోళ్ళ జతలూ (నూలువి) ; మూడున్నర పెట్టి బూట్సు జోడు ;



అక్కడ సూట్సు అవసరము గనుకనూ, చలిదేశము గనుకనూ, పదిహేను రూపాయలు ఖర్చుపెట్టినా, గుడ్డ కొంచెం బాగుండడము చేత కుట్టువాడు తన అవసరానికి కొంత మిగుల్చుకోవడం వల్ల నాకు చాలీ చాలకుండా తయారైన స్లాకులు సూట్లు రెండు, ఇంగ్లండు వెళ్ళితే మట్టుకు మన వేషము పూర్తిగా ఎందుకు మానవలెనని సాధ్యమైనంతవరకూ స్వదేశ పద్ధతి అవలంబింతామని తలగుడ్డగా ఉపయోగించడానికి ఎనిమిది గజములు ఎర్రని జపాను సిల్కు, ఇంకా ధరించవలసిన దుస్తులయిన తరువాత ఆలోచించవలసినది భోజనం కదా అనుకున్నాను. అందుకవసరమైనది ముందు మంచినీళ్ళు తాగడానికి మరచెంబు, అక్కడకి వెళ్ళిన తరువాత వాళ్ళచేత మాలకూడు తినకుండా మనమే స్వయంపాకం చేసుకుంటే బాగుంటుంది కదా అనుకున్నాను.

అక్కడ గూడ అన్నమెలాగా దొరకదుకదా! రొట్టెలు కాల్చుకు తినవలసిందే గనుక కొంత గోధుమపిండీ, కొంచెం నెయ్యి, రొట్టెలో నంచుకోవడానికి కొంచెం ఆవకాయ, రొట్టెలు కాల్చుకోడానికి చిన్న అట్లపెనము, స్టవ్, స్టవ్‌లో పోసుకోవడానికి కిరసనాయిలు, చిన్నసీసాలో స్పిరిటూ, భోజన సామగ్రి అయిన తరువాత పడకకు కావలసిన సామాన్లను గురించి ఆలోచించాను వెళ్ళేది చలిదేశం కదా! కింద పడుకోడానికి కష్టముగా ఉంటుందని నర్సారావుపేట మడత మంచము, దానిమీద పక్కకి నేను మామూలుగా ఉపయోగించుకొనే బొంత - ఇంట్లో కుట్టినది - కప్పుకోడానికి నారింజపండు రంగు శాలువ.

ఇవిగాక యింకా ఏమి అవసరముంటవని ఆలోచించగా మామూలుగా పగలు కూర్చోడానికి తుంగచాప తీసుకు వెళ్ళితే బాగుంటుందని తోచింది. అక్కడికి వెళ్ళి నా హిందూధర్మ విరుద్ధంగా ప్రవర్తించదలుచుకోలేదు గనుక అక్కడ దొరకవనే భయంతో ఆరు యజ్ఞోపవీతాల జతలూ, మూడు పట్టు మొలత్రాళ్ళు కూడా తీసుకొని వెళ్ళడము చాలా అవసరమని తోచింది. ఇంక ఎంతసేపు ఆలోచించినా తీసుకొని వెళ్ళవలసినవేవీ కనపడలేదు. ఇదంతా చూసి కొందరికి చాదస్తముగా కనపడవచ్చు, కాని వెళ్ళేది దూరదేశము. ఏ చిన్నవస్తువు మరచిపోయినా అక్కడ యిబ్బంది పడవలసి వస్తుందని, మొట్టమొదటనుంచి ఎక్కువ జాగ్రత్త కలవాడిని కనుక చాలా దూరాలోచన చేసి ఇవన్నీ తీసుకొని వెళ్ళాను. ఇక ఈ వస్తువులన్నీ పెట్టుకోవడానికి ఎక్కడయినా కూలివాడు దొరికినా దొరకకపోయినా, నేను తీసుకువెళ్ళడానికి తేలికగా ఉంటుందని చిన్న సీనారేకు పెట్టె చేయించి బంతిపూవు

రంగు వేయించాను. ఈ సామాగ్రి అంతా జాగ్రత్తగా పెట్టెలో వసరించు కొని, శుభదినము నిశ్చయించుకొని, వర్జ్యము లేకుండా కూడా చూచుకొని, శకునము మంచిదయ్యేవరకూ వాకిట్లో కూర్చుని బండి ఎక్కి పడవల రేవుకు వెళ్ళాను.

మొగలితుర్రు, నర్సాపురము, ఇంకా చుట్టుపట్ల గ్రామములు రెండు మూడు తప్ప ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళిన వాడిని కాను, ఇంతకాలము నర్సాపురములో ఉన్నా ఎప్పుడూ పడవలైనా ఎక్కవలసిన అవసరము లేక పోయింది. ఇవ్వాళ పడవలో కూర్చుని వెళ్ళుతూ ఉంటే మహాసరదాగా వుంది. స్టీమరు మీద వెళ్ళడమన్నా యింతే కదా అనుకున్నాను. రాత్రి దారిలో మినపరొట్టె, సాతాళించిన సెనగలూ, కొనుక్కు తింటూ ఇంగ్లం డులో మినపరొట్టె ఉంటుందా, ఉండదా అని ఆలోచిస్తూ ఇంగ్లండునుంచి తిరిగి వచ్చిన తరువాత ఏ విధంగా దేశోపకారము చేద్దామా అనుకుంటూ, నిద్రపోయినాను, తెల్లవారేసరికి పడవ నిడదవోలు చేరింది.

మెళుకువ రావడముతోటే నేను తలపెట్టిన మహాత్కార్యము జ్ఞప్తికి తెచ్చుకొని దీర్ఘ నిశ్వాసము విడిచి పడవ దిగి త్వరగా స్టేషనుకు వెళ్ళి అక్కడ నిలబడ్డ ఒక పెద్దమనిషిని సంబోధించి టిక్కెట్టు ఇవ్వండి త్వరగా అన్నాను.

'ఏమిటా హడావిడి! ఎక్కడికి? ఏ రైలుకు?' అని ఆరంభించాడు ఆయన.

నేనెక్కడికి వెళ్ళితే ఎందుకాయనకు? నా వ్యవహారమంతా ఆయన తోటి చెప్పితే గుట్టు బయటపడుతుందని -

'సరే అదంతా యెందుకు లెండి ఇప్పుడు - టిక్కెట్టు త్వరగా ఇప్పించండి' అన్నాను.

నన్ను ఎగాదిగా చూసి 'టిక్కెట్టు ఇచ్చే ఆయన ఇంకా రాలేదు. కాస్సేపు ఉండమన్నాడు.'

కొంచెం సేపైన తరువాత ఆయన వచ్చినట్లు తెలుసుకొని వెళ్ళి టిక్కెట్టు ఇమ్మన్నాను. ఆయనకూడా 'ఎక్కడికి' అన్నాడు.

"చెపుతాలెండి, టిక్కెట్టు ఇవ్వండి"

"ఏమయ్యా ఈ అళవు! యా వూరు పోతావయ్యా?"

దగ్గిర ఉన్నవాళ్ళందరూ నవ్వడము మొదలుపెట్టారు.

"ఇది ఎక్కడయ్యా! వట్టి నాటుపురము మాదిరి ఉండావే! నీవు పూడ్చేదీ చెప్పకపోతే టిక్కెట్లు ఎష్టదా ఇచ్చేదయ్యా! పో అయ్యా బుద్ధి లేదువలె ఉంది. వాండ్లంతా కాచుకున్నారు" అని కేకలు వేశాడు.

దగ్గిర ఉన్నవాళ్ళంతా నన్ను మందలించారు.

"ఈ రైలు చాలా దూరము వెడుతుందండి. చాలా చోట్ల ఆగుతుంది. అందుచేత ఏ వూరు మీరు వెళ్ళాలో చెపితే ఆ వూరుకే టిక్కెట్టు ఇస్తారు" అని ఒక పెద్ద మనిషి నిమ్మళంగా హితోపదేశము చేశాడు.

ఆయన చెప్పిన మాటలు నాకు సబబుగానే ఉన్నట్లు తోచింది. అందుచేత టిక్కెట్టు యిచ్చే ఆయనతోటి "చెన్నపట్టణము వెళ్లాలి" అని చెప్పాను.

అనేసరికి కండ్లెర్రజేసి "ఎన్న అయ్యా ఇది, ఈ పొద్దు ఎక్కడ వచ్చావయ్యా, వట్టి జంతువల్లె వుండావు! పో య్యా! జల్దీ పో అయ్యా! వాళ్ళంతా కాసుకొన్నారు. పొమ్మంటే ఏందయ్యా అట్లా మూతి పెట్టి చూస్తావు? పట్నం బండి సాయంకాలం వరకూ రాదయ్యా. అప్పుడుదాకా యెక్కడనైనా పండుకొని తూంగు అయ్యా' అన్నాడు.

నా దగ్గిరి వాళ్ళంతా నన్నవతలకి తోసేశారు. పోని కొంచెము సమ్మర్దము తగ్గిన తరువాత మళ్ళీ వద్దామని వెళ్ళాను రైలు కాబోలు గంట కొట్టారు. అప్పుడు మళ్ళీ "పట్నంబండి ఎప్పుడు వస్తుందండీ" అన్నాను.

"సాయంకాలము" అన్నాడు ఆయన.

"అలాగా, సాయంత్రము దాకా వుండాలా! నాకు తొందర పని వుందే!"

అప్పుడు నా మొఖము కేసి చూసి "ఓ! తిరిగి వస్తివా! తొందర పని ఉంటే నడచిపో" అని కిటికీ తలుపు వేసుకుని చక్కా పోయినాడు మాష్టరు, నా మీద కోపముచేత ఇలా అంటున్నాడేమో, ఈసారి నెమ్మదిగా అడిగి నిజం తెలుసుకొందామని ముందుకెళ్ళి ఎదురుగా నిలబడి మాట్లాడుదామని నోరు తెరిచేసరికి ఆయనే "వస్తివా పట్నంబండి ఎప్పుడు వచ్చేది తెలుసుకొనే దానికి వస్తివా! ఒకసారి చెపితే" నీకు బుద్ధిలేదూ!" అని ఆరంభించాడు అసలే అరవవాళ్ళంటే నాకు కోపం అందులో ఆయన ముఖం స్ఫోటకం మచ్చలతోటి నల్లగా మరీ అసహ్యంగా వున్నది, నే నూరికే తెలియని

విషయము నెమ్మదిగా అడుగుతూ ఉంటే ఆయన అంత మర్యాద తెలి యకుండా మాట్లాడుతాడేమని నాకు కోపం వచ్చింది, "నేను ఇంగ్లండు వెడుతున్నాను. జాగ్రత్త!" అని చెపుదామనుకొన్నాను. కాని ఆయనను ఇంతకంటే ఏడిపిస్తే బాగుండదని తోచింది.



అందుకని "అబ్బే నేను రైలు సంగతి అడగడానికి రాలేదండి. మిమ్మల్ని చూస్తే ఏమి జ్ఞాపకము వస్తుందో చెప్ప డానికి వచ్చానండి" అన్నాను.

"ఏం జ్ఞాపకము వస్తున్నది!"

"మీ మొహము చూస్తే ఉలి ఆడిన తిరగటిరాయీ, మీ తలకాయ చూస్తే సున్నపు పిడతా జ్ఞాపకము వస్తున్న" వన్నాను.

అక్కడ వున్న నౌకరులు ఏకంగా పక్కున నవ్వారు ఆయనకు ఉడుకుమోతుతనము వచ్చి నన్ను కొట్టటానికి వచ్చాడు నేను పారిపోయాను.

అక్కడ నుంచి తిన్నగా దగ్గిర వున్న హోటలుకు వెళ్ళి భోజనము చేసి కాసేపు పడుకున్నాను. లేచి ఒకసారి బజారు చూసి వద్దామని వెళ్ళాను అక్కడ అటుయిటూ తిరుగుతూ ఉండగా అవసరమైన వస్తువులు రెండు మరిచిపోయినట్లు జ్ఞాపకము వచ్చింది. అవేమిటంటే గదికి తాళము వేసుకోవడానికి చిన్న యిత్తడి తాళమూ, స్నానానంతరము బట్టలు ఆర వేసుకోవడానికి కొబ్బరిపీచు చేంతాడు బట్టలు తగిలించుకోవడానికి నాలుగు పెద్ద మేకులూ, ఈ మూడు వస్తువులూ కొనుక్కుని మళ్ళీ బసకు చేరుకుని సాయంకాలము కాగానే పెందలాడే భోజనము చేసి స్టేషనుకు వచ్చాను. టిక్కెట్ల వేళ అయింది.

నేను మళ్ళీ చెన్నపట్నానికి టిక్కెట్టు పుచ్చుకున్నాను. ఇవతలకు వచ్చేటప్పటికి ఒక రైలు వచ్చింది. అక్కడ నౌకరు వుంటే అతన్ని ఈ రైలు ఎక్కవచ్చునా? అన్నాను.

"మీ రేవూరు వెడతారు?" అన్నాడు వాడు.

"నీ కెందుకా ప్రశంస!" అని చక్కాపోయాను.

అక్కడొక పెద్ద మనిషి ఉంటే, ఆయన్ని అడిగాను - ఈ రైలు ఎక్కవచ్చునా? అని ఆయనా అదే ప్రశ్న వేశాడు మీరే వూరికి వెళ్లుతా రని, నాకు ఒళ్ళుమండి మాట్లాడకుండా తిన్నగా స్టేషను మాష్టరుగారి దగ్గరకు వెళ్ళి ఆయన్ని అడిగాను. ఆయనకూడా "ఎక్కడికి వెళ్ళా" అన్నారు. టిక్కెట్టు ఇవ్వడానికంటే వూరుపేరు చెప్పితే కాని ఇవ్వడా నికి వీలులేదంటే చెప్పాను. టిక్కెట్టు కొన్న తరువాత కూడా వీళ్ళకి పరీక్షలన్నీ ఎందుకూ? వీళ్ళ రోగం కుదురుద్దామని 'రాజమహేంద్రవరా నికి' అన్నాను అయితే 'ఎక్కవచ్చు'నన్నాడు. ఎక్కాను రైలు కదలబోతూ ఉన్నది. స్టేషను మాష్టరు అక్కడే వున్నాడు రైలు కదిలింది.

ఆయన్ని పిలిచి 'ఏమండోయ్, మీకు తగినశాస్తి చేశాలెండి. నేను రాజమహేంద్రవరము వెళ్ళడము లేదు. చెన్నపట్నం వెడుతున్నాను' అని నవ్వుతూ చెప్పాను.

ఆయన ఆ పళంగా ఈలవేసి రైలు ఆపి నన్ను దిగమన్నాడు నేను దిగనన్నాను.

"త్వరగా దిగవయ్యా ఆలస్యమవుతున్నది"

"నేనెందుకు దిగాలి"

"ఈ రైలు చెన్నపట్నం వెళ్ళదు. వేరే వస్తుంది. వట్టి ఫూల్ లాగా ఉన్నావు. దిగు"

"ఫూల్ గీల్ అని మాటలు మిగలకండి. నేను దిగను" అంటే రైలులో వాళ్ళంతా నవ్వడము మొదలుపెట్టారు. ఇంతలోకే గార్డు వచ్చాడు నన్ను బలవంతంగా దించాడు. రైలు వెళ్ళిపోయింది. నా కళ్ళ వెంబడి నీళ్ళు వచ్చినవి. స్టేషను మాష్టరు కొంచెం జాలి వేసి పట్నం బండి యింకొక పావు గంటలో వస్తుందని ధైర్యము చెప్పాడు.

కొంచెం యించుమించులో ఆయన చెప్పినట్టుగానే రైలు వచ్చింది. ఆగీ, ఆగడముతో ఎదురుగుండా ఉన్న పెట్టెలోకి నా సామాను నెత్తిన

పెట్టుకుని ఎక్కబోయాను. ఒక మెట్టు ఎక్కి రెండవ మెట్టుమీద కాలు వెయ్యబోతూ ఉంటే వెనక నుంచి ఎవరో తోశారు. ఆ అదురుకు నానెత్తి మీద ఉన్న సామాను, నా వెనుక ఉన్నవాడి నెత్తిమీద పడి అక్కడైనా ఆగకుండా కింద ఎవళ్ళ కాళ్ళమీదో దభీమని పడ్డది. నేను సామానుకో సము వెనక్కి తిరిగి చూశాను. ఆ పళంగా చెయ్యిజారి నా వెనుక వాడి మీద నేనూ, నా వెనుకవాడు నా సహితంగా వాడి వెనుక వాళ్ళ మీద విరుచుకుపడ్డాము. మేము కిందపడ్డామని జాలిపడడానికి బదులు మమ్మల్ని తిట్టడము మొదలుపెట్టారు. కొందరు మామీద నుంచి నడిచిపోయి రైలె క్కారు. నేను లేచి నిమ్మళంగా సామాను సర్దుకుని ఎక్కడెక్కడ దెబ్బలు తగిలినవో సావకాశంగా రైలు ఎక్కిన తరువాత చూసుకోవచ్చునని ముందు రైలెక్కాను.

రైలెక్కి సామానుపైన పెట్టుకొంటున్నాను. హఠాత్తుగా రైలు కదిలింది. నా వెనుక బల్లమీద కూర్చున్న ఆడమనిషి ఒళ్ళో పడ్డాను. ఆవిడ నాలుగు ఆశీర్వచనముల తోటి ముందుకు గెంటింది. నా ఎదుటబల్ల మీద సుఖంగా చుట్ట కాల్చుకుంటూ, అరమోడ్పు కన్నులతో ఆనందపరవశుడై ఉన్న కాపుమీద పడ్డాను, ఆ చుట్ట నా బుగ్గకు తగిలి చురుక్కుమన్నది. నేను మొర్రో అన్నాను. ఆనంద సమాధిలో నుంచి కొంచెము మెలకువ తెచ్చుకుని, అతను ఆనందము ఇంత బరువెక్కిందేమా అని చూశాడు కాబోలు, కెవ్వుమని కేకవేసి ఏ పామో మీదపడితే తోసివేసినట్టు నన్ను తోసివేశాడు. ఎదుట ఉన్న చంటిపిల్లపైన పడబోయి ఆ పిల్ల నలిగిపోతుందేమోనన్న భయముతో ఎలాగో తప్పించుకుని తల్లి మీద పడ్డాను. మళ్ళీ ఆవిడా తోసెయ్యపోతుంటే గట్టిగా ఆవిడ మెడ పెట్టుకొన్నాను. రైలులో వాళ్ళంతా కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వడము ఆరంభించారు. ఆ అమ్మాయి పెనిమిటి పక్కనే ఉన్నాడు.

ఉగ్రుడై లేచి నన్నూ తన భార్యనీ ఎవళ్ళకి వాళ్ళని ప్రత్యేకంగ విడదీసి నన్ను తిట్టడం మొదలుపెట్టాడు. నా తప్పు ఏమీ లేదనీ, ఆతని భార్య అన్న సంగతి నాకు తెలియదనీ, ఇంకెప్పుడూ చెయ్యననీ, గజగజ వణకుతూ చేతులు జోడించి క్షమాపణ చెప్పాను. తక్కిన వాళ్ళంతా కూడా నన్ను చూచి జాలిపడి, నేను కౌగిలించుకొన్న అమ్మాయి భర్తను మందలించి నా తప్పు ఏమీ లేదని, పొరపాటున కౌగిలించుకొన్నాననీ, పొరపాటెవళ్ళకయినా వస్తుందనీ, ఇవ్వాళ ఈయన అయినాడు, రేపు ఇంకొకళ్ళు కౌగిలించుకోవచ్చు (పొరపాటున) ననీ, ఈ మాత్రము దాని

కాయన అంత కోపపడవలసిన పనిలేదనీ ఇత్యాది కోపోపశమన వాక్యాలతో ఆ పెద్ద మనిషిని శాంతింపజేశారు.

ఇంకా నేను నిలబడి ఉంటే ఎవళ్ళని కౌగిలించుకొంటానో అని భయపడి నాకు కూర్చోడానికి కొంచెము స్థలము ఇచ్చారు. పై బల్లమీద పెట్టె పెట్టి దానిమీద మడత మంచమూ, చాపా, పెట్టి ఇవన్నీ కలిపి పైన గొలుసు కనబడితే, దానికీ వీట్లకీ, సాయంత్రం కొన్న చేంతాడు వేసి, లాగి బిగించి కట్టాను. ఇంక సామాన్లకి ఫరవాలేదు గదా అని సుఖంగా కూర్చున్నాను.

ఇంతట్లోకే ఎందుకో రైలు ఆగింది. అంతా తొంగిచూశారు. ఇంకొక క్షణా నికి గార్డులు ఇద్దరూ మా పెట్టె లోకి వచ్చి గొలుసు ఎవరూ లాగా రన్నారు. ఎవ్వరూ మాట్లాడలేదు. పైకి చూశారు నా సామాను కేసి చూపించి "ఈ సామానెవరిది" అన్నారు. మళ్ళీ ఏమి పుట్టి ముని గిందో అని హడలుపోతూ, "నాదేను" అన్నాను.




"ఎందుకలా గొలుసుకు కట్టావు?"

"సామాను రైలు కుదుపుకు కింద పడిపోకుండాను. జాగ్రత్తగా ఉంటుందని అలా కట్టా"

పెట్టెలో వాళ్ళంతా ఊరికే నవ్వ డమారంభించారు. గార్డు యాభై రూపాయలు జరిమానా ఇవ్వమ న్నాడు. "నా దగ్గిరేమీ లేదు, ఇచ్చుకో లేను క్షమించమని" ప్రాధేయపడ్డాను. ఆఖరుకు ఎలాగైతేనేమి నాసామా నునీ గొలుసునీ విప్పి వేయమని వాళ్ళు చక్కాపోయినారు.

వాళ్లు వెళ్ళిన తరువాత నా అపరాధమేమిటని పక్కన ఉన్నవాళ్ళ

నడిగి తెలుసుకన్నాను. అక్కడ గొలుసుకాస్త లాగితే రైలు ఆలా ఆగుతుందా అనుకున్నాను. యింక కాస్సేపటికి రైలు మళ్ళీ ఆగింది. నాపెట్టెలో కొందరు దిగారు. మరి కొందరెక్కారు. కాస్సేపు ఉండి మళ్ళీ బండి బయలుదేరింది. నా పక్కన ఒక బ్రాహ్మణ వితంతువు సుమారు నలభై సంవత్సరముల మనిషి నావైపు వీపుపెట్టి, కాళ్ళు బల్లమీదికి చాచుకొని కూర్చుంది. కొంతసేపటికి కునికిపాట్లు పడడము మొదలుపెట్టింది. మన దేశ దారిద్ర్యము, ప్రజల అజ్ఞానము, వితంతువుల దుర్భర అవస్థ, ఇత్యాది విషయాలను గురించి ఆలోచిస్తూ, ఈ దేశము ఎప్పుడూ ఏ రీతిని బాగు పడుతుందా అనుకుంటూ - అయినా మంచికాలము సమీపిస్తున్నది. నేను మూడు నాలుగు సంవత్సరములలో స్వదేశానికి తిరిగివచ్చి ఈ కష్టాలను తొలగన్తానుకొంటూ నేనూ నిద్రపోయినాను. రకరకాల కలలు వచ్చినవి.

కొంతసేపటికి మెళుకువ వచ్చింది. నా పక్కన ఉన్న బ్రాహ్మణ వితంతువు వీపున జార్లబడి ఇంతసేపూ నిద్రపోయినట్లు తెలుసుకున్నాను. ఆవిడ ఇంకా నిద్రపోతూ ఉన్నది కాబోలు, ఆ సంగతి నాకేమి తెలుసు? నేను లేవడము తోటే వెనుకకు ఆవిడ నా ఒళ్ళో పడ్డది ఆవిడ "గోవింద, గోవిందా" అని లేవబోయి మళ్ళీ వెనకకు పడ్డది ఆవిడ లేవడానికి పునః ప్రయత్నము చేస్తూ ఉంటే, పాపము మళ్ళీ పడుతుందేమోనని నా చెయ్యి ఆవిడ వీపుకు బోటుపెట్టి కొంచెము తీశాను.



లేచి నా సహాయమువల్ల లేచాను గదా అని సంతోషించడానికి బదులు, కోపంగా "అదేమి అబ్బాయి కొంచెము దూరంగా కూర్చోకూడదూ, ఊరికే మీదికి రాకపోతే? నీకు తోడబుట్టిన వాళ్ళు లేరూ? ఇల్లు బయలుదేరి రావడమే చాలునే ఒక్కతెనూ; నా బ్రతుకు అంతా ఇలాగనే వెళ్ళుతున్నది దారిలో యెరిగున్న వాళ్ళెవరైనా కనబడకపోతారా అని నేటికి తెగించి తిరుపతి వెడదామని బయలుదేరినందుకు ఈ అవస్థలన్నీ పడవలసి

వచ్చింది. ఆ మహారాజు వుంటే ఇంత అవస్థ లేకపోయేది సరికదా! చచ్చి స్వర్గాన ఉన్నారు.

యెప్పుడు రాత్రిళ్ళు రైలులో ప్రయాణం చేసినా, ఒసేవ్ నీకు మేలుకుంటే జబ్బు చేస్తుంది. యెలాగో కాస్త సందు చేసుకొని నడ్డి వాల్చ మనేవారు" అని ఒకమాటు కళ్ళద్దుకొని ఒకమాటు ముక్కు తుడుచుకుని మళ్ళీ ఆవిడ కునికిపాట్లు పడడము మొదలుపెట్టింది.

నేను లఘుశంకకు వెళ్ళవలసి వచ్చింది. ఎక్కడికి వెళ్ళడానికి, ఏమి చెయ్యడానికి తోచింది కాదు. ఒక్కమాటు రైలు ఆగితే బాగుండును. దిగి వెళ్ళి రావచ్చు ననుకొన్నాను.

గొలుసు లాగుదామా అనుకొని, ఏభైరూపాయలు జరిమానా మాట జ్ఞాపకం వచ్చి తిన్నగా కిటికీ దగ్గరికి వెళ్ళి రైలు ఒక్కమాటు ఆపమని గార్డు గారిని కేకవేశాను. నా కేకే ఎవళ్ళకి వినపడలేదు, కడుపు ఉబ్బుకు వస్తోంది. ఏమీ తోచిందికాదు.

అక్కడ కూర్చున్న పెద్దమనిషి నొకాయన పలకరించి, నా అవస్థ చెప్పి "ఇలా కేకవేశాను ఎవళ్ళూ పలకలేదు, ఎలాగు" అని అడిగాను. ఆయన నవ్వి "అబ్బాయీ, వట్టి వెర్రివాడివలె వున్నావు. మనకు కావ లసివచ్చిన చోటల్లా రైలాపరు ఇక్కడే గది ఉంది. ఒకటికి వెళ్ళవలసి వచ్చినా, రెంటికి వెళ్ళవలసి వచ్చినా, ఆ గదిలోనికి వెళ్ళవచ్చునని' ' చెప్పి గది చూపించారు.

వెళ్ళి వచ్చి కూర్చుని కాస్సేపు కునికిపాట్లు పడేసరికి తెల్లవారింది. చక్కగా రైలు ప్రతిస్టేషనులోనూ ఆగడమూ, ఎక్కే జనానికి దిగే జనా నికి తగిన సౌకర్యము రైలులో కూర్చున్న వాళ్ళు మళ్ళీ దిగనక్కరలేకుండా అందులోనే పాయఖానా, ప్రతి స్టేషనులోనూ జనానికి అత్యవసరమైన పదార్థాలన్నీ అమ్మ రావడమూ, అన్ని ఏర్పాట్లూ బహు బాగున్నవనుకు న్నాను. అందుకనే ఇంగ్లీషువాళ్ళు అంత గొప్పవాళ్ళయినారనిపించింది.

ఇలా ఉండగా ఉదయము తొమ్మిది గంటలయ్యే సరికి బేసిన్ బ్రిడ్జి అనే స్టేషను వచ్చింది. నేను స్టే,నులో దిగే జనాన్ని చూస్తూ నిల బడ్డాను. ఒకాయన నల్లదొర నాదగ్గరికి వచ్చి టిక్కెట్టు ఇమ్మన్నాడు. ఇచ్చాను. చూచి మాట్లాడకుండా జేబులో వేసుకున్నాడు. ఇదేమిటిరా టిక్కెట్టు తీసుకుపోతున్నాడు. ఏమన్నా గట్టిగా అడగడానికైనా - నల్లగా ఉన్నా-దొర కూడాను! నా సంగతి ఏమికాను! ఎలాగని హడలిపోయి వాడి వెంబడిబడ్డాను నా టిక్కెట్టు నాకిమ్మని ప్రాధేయపడ్డాను వాడు

నన్ను కోపముతో పొమ్మన్నాడు. వాడు పొమ్మన్నంత మాత్రాన ఎంత అభిమానముగా ఉన్నా ఎలాపోను టిక్కెట్టు వాడి చేతిలో చిక్కుపడి పోయింది. అందుకని అభిమానము చంపుకొని వాడిని వెంబడించాను" ఆఖరుకు రైలు కదిలే వేళయింది. ఇంకొక నలుగురైదుగురు నల్లదొరలు చేరారు. "దయచేసి నా టిక్కెట్టు ఇప్పించండి" అన్నాను.

"Get away man, you seem to be a fool" అన్నాడు.

"అయ్యా నా టిక్కెట్టు యిప్పించి మీరెన్ని తిట్టినా పడతాను, నా టిక్కెట్టు యివ్వరు. పైగా తిడతారేమండీ" అన్నాను ఒళ్ళుమండి. రైలు కూసింది.

'Get in man - You have no bloody fear, Nobody will ask you' అని నన్ను రైలులోకి తోశాడు.




రైలు కదిలింది ఏమి చెయ్యడానికి గత్యంతరము తోచలేదు. స్టేషనులో ఆ దొరలంతా కడుపు పట్టుకొని నవ్వుకుంటున్నారు - నేను దిగుదామని ప్రయత్నం చేశాను - నాపక్కనున్నాయన నన్ను ఆపి, ఏమిటి సంగతి అని అడిగాడు -

ఆయనతోటి చెప్పాను ఇలా టిక్కెట్టు తీసుకుపోయి ఇవ్వలేదని, అప్పుడాయన నవ్వి, వచ్చే స్టేషనే చెన్నపట్నము, అక్కడే అంతా దిగిపోవడం అందుకని అక్కడ కంగారుగా వుంటుందని, టిక్కెట్లన్నీ ఇక్కడే వసూలు చేస్తారు.

నీకే భయము లేదని అభయమిచ్చాడు. సరే ఎటుపోయి ఎటు వచ్చినా అందరి దగ్గిరా కూడా టిక్కెట్లు పుచ్చుకున్నారని చెప్పారు గనుక వారికి లేని భయము నాకేందుకని ధైర్యము తెచ్చుకుని కూర్చున్నాను. ఇంతలోనే చెన్నపట్నము చేరాము.

# 9

రైలు ఆగీ ఆగడముతో వందమంది కూలీలు సామాను ఏమన్నా ఉందా అంటూ రైలులోకి వచ్చి పడ్డారు. పెట్టె నెత్తిన బెట్టుకొని నేనూ దిగాను. నా చుట్టూ ఇరవైమంది కూలీలు చేరి, నేను తీసుకువస్తానంటే నేను తీసుకు వస్తానని నా నెత్తిమీదివి లాక్కుని వాళ్ళల్లో వాళ్ళు దెబ్బ లాడుకుని ఆఖరుకు ఒకడా సామాను పుచ్చుకొని పరుగెత్తాడు. సామాను తీసుకొని పారిపోతాడేమోనని గబగబా పరుగెత్తి వాడినందుకున్నాను. ఆగ మంటే ఆగడు యెంత ఇవ్వాలంటే మాట్లాడడు. తిన్నగా బండ్లదగ్గిరికి తీసుకువెళ్ళి దింపాడు.

ఒక పాతికమంది బండ్లవాళ్ళు నా చుట్టూ మూగారు. 'ఎక్కడ పోవాలె సామీ! రండిమీ, నేనుదా జల్దీగా కొంచుపోతా' నంటూ రెక్క పట్టుకులాగేవాళ్ళు సామాను లాక్కుపొయ్యే వాళ్ళూను. ఎక్కడికి వెళ్ళడా నికీ తోచదు. నేనెవళ్ళనీ ఎరుగను. పోనీ ఏ హోటలుకైనా వెడదామూ అంటే హోటలు పేరుగాని, వీధిపేరుగాని తెలియదు. ముందు వీళ్ళ గోల వదిలితే నయమని, 'నేనెక్కడికీ వెళ్ళను, నాకు బండి అక్కరలే దని' నా పెట్టె మీద కూర్చున్నాను, అయినా కానీ నాకెలాగూ బండి కావాలని వాళ్ళూహించినట్లున్నారు. వాళ్ళు మట్టుకు నన్ను విడిచిపోలేదు. 'ఎందుకు సామీ అంత కోపము చేస్తావు. మీ యిష్టము వచ్చిన బండిదా చేసుకొని పోండిమీ. ఈ ఎండలో ఎష్టదా పోతావు, మేము భద్రముగా కొంచుపోతాము సామీ, అని అక్కడే నిలబడ్డారు. సామాను మోసుకు వచ్చినవాడు కూలి ఇమ్మని తొందరపెట్టేడు.'

"ఏమీ యివ్వాలి?"

"ఏమి సామీ, మీరు నన్నడుగుతారే, మీకు తెలియదా?"

"నాకు తెలియదన్నాను"

"ఏమి సామీ, తమాషా చేస్తారు. ఇచ్చేయండి పోవాలి."

అర్ధణా అణా యిస్తే బాగుండదని రెండు అణాలు తీసి పుచ్చుకో మన్నాను. నాకేసి ఒకమాటు డబ్బులకేసి ఒకమాటు చూచి వాడు,

ఏమి సామీ, ఏమది, నేను ముష్టివాడనుకొంటివా ఏమీ? బిచ్చము వేసినట్లు రెండు అణాదా తీసుకోమంటువే?" అన్నాను.

నేను నిర్ఘాంతపోయి 'పోనీ అని ఎక్కువ యిస్తే ముష్టి అంటాడే మిటీ? ఈ ఊళ్ళో ముష్టి వాళ్ళకి అంతా బేడాలూ పావలాలూ యిస్తారా ఏమిటి చెపుమా' అనుకుని.

"మరి అయితే ఎంత యిమ్మంటావు?" అన్నాడు.

"ఒక రూపాయ"

నా గుండె బద్దలైంది; సరే తీసుకుపొమ్మని ఇంకో రెండు అణాలు తీసి చేతిలో పెట్టాను, వాడది నామీదకి గిరవాటు వేసి రూపాయకు ఒక దమ్మిడీ తక్కువైనా పుచ్చుకోనన్నాడు. పుచ్చుకోకపోతే మానివెయ్య మన్నాను, అంత దర్జాకు పోయినవాడు పుచ్చుకోకుండా పోతాడేమోనను కున్నాను - పోలేదు, నన్ను తిట్టటము ఆరంభించాడు. చుట్టూ నిలబడ్డ బండివాళ్ళు తీర్పు తీర్చడము మొదలుపెట్టారు. సరే వీడితో పేచీ ఎందుకని యింకొక పావలా కూడా యిచ్చాను. ముందు అది కూడా పుచ్చుకోనని నన్నూ, నా మొహాన్నీ, నా ముక్కునూ, నామూతిని, నాధర్మగుణాన్నీ తక్కిన ఆంధ్రులనీ, ఆంధ్రదేశాన్నీ కలిపి ఏకంగా తిట్టి ఆ అర్ధరూపాయి తీసుకొని చక్కా పోయినాడు.

ఒక దరిద్రము వదిలిందికదా అని సంతోషించాను. ఇంక వూళ్ళోకి వెళ్ళడము సంగతి ఎలాగా అనుకున్నాను, బండ్లవాళ్ళు ఇంకా కొంతమంది చుట్టూ నిలబడ్డారు. "ఈ ఊళ్ళో బస చేయడానికి వీలుగా ఏదైనా హోటలైన సత్రమైనా ఉందా" అన్నాను వాళ్ళతో.

"ఉంది సామీ, కిట్టనే రామసామి మొదలి సత్రము ఉంది సామి"

"అక్కడ గదులూ అవీ ఉంటవా, స్నానానికి దానికి వీలుగా ఉంటుందా?"

"అంతా ఉండును సామీ నిండా సౌక్యముగా ఉండును సామీ."

"మరి భోజనం సంగతి ఏలాగు?"

"దుడ్డు తీసుకుని అక్కడే వేస్తురు"

భోజనం సంగతి అడిగితే డుడ్డు తీసుకుని వేస్తానంటాడేమిటా? అనుకొని "అది కాదు భోజన హోటలు కూడా సత్రానికి దగ్గరలో వుందా?" అన్నా



"అదిదా సామి చెప్పితిని. సత్రములోదా అన్నము కూడా వేస్తురు. దుడ్డు మాత్రము తీసుకొందురు.

అని అభినయరూపంగా వ్యాఖ్యానము చేసి నాబోటి అజ్ఞానులకు అర్థమయ్యేటట్టు చెప్పాడు. అయితే బండికేమి యివ్వాలన్నాను.

"మూణు రూపాయ"

"ఇక్కడి కెంతదూరము ఉంటుంది?"

"రెండు మైలు సుమారు ఉండును"

"అయితే రెండు మైళ్ళకి మూడు రూపాయలెవరిస్తారు? నేనివ్వను"

"మీ దయ సామీ మా మామూలు మేము చెప్పాము, నీవేమి ఇస్తావో చెప్పూ"

"ఒక్క రూపాయి ఇస్తా"

"ఏమి సామీ, అట్లా చెపుతారు. ఇది నాటు పురమనుకొంటివా నాటువండి అనుకొంటివా. సారూ సామీ, అది కుదరెవండి. గుఱ్ఱము సూస్తివా నిండు బాగాపోను."

ఇంకా మనకు బోలెడు పని ఉంది, పోనీ, త్వరగా పోదామని ఇంకో అర్ధరూపాయి ఎక్కువిస్తానన్నాను.

"ఏమి సామీ, ఒక్క పెట్టి రైలులో నుంచి ఇక్కడ పెట్టేందుకే అర్ధ రూపాయి యిస్తివే? రెండు మైలుదా పోవాలె. నేనూ గుఱ్ఱమూ బతకాలె

ఎట్లా సామీ! ఊం. మీతో బేరమెందుకు సామీ, మీకు తెలియదా రెండు రూపాయి ఇచ్చెయ్యండి. ఎక్కండి"

నేను ఇవ్వనందామనుకొంటూ ఉంటేనే పెట్టి బండిలో పెట్టి నన్నెక్కమన్నాడు. వాడు చెప్పింది సబబుగానే ఉందని ఆలోచించి, మాట్లాడకుండా బండి ఎక్కాను, ఎక్కగానే తక్కిన బండ్ల వాళ్ళంతా రూపాయిన్నరకే బండ్లు కడతామన్నారు. వీడు మోసము చేశాడు పోనీ దిగుదామా అనుకొంటూ ఉంటే వాళ్ళందరినీ తిడుతూ వాళ్ళనెప్పుడూ నమ్మవద్దని నాకు హితోపదేశము చేస్తూ నా బండివాడు గబగబ బండి తోలాడు. తోవ పొడుక్కి కష్టము చాలదని ఆ రోజున ఉదయము నుంచీ బేరములేక పోవడాన్నుంచీ, తక్కినవాళ్ళు కట్టివేస్తారేమోననే ఆదుర్దా కొద్దీ కట్టాననీ కష్ట మాలోచించి ఇమ్మనీ ప్రాధేయపడుతూ, పది నిమిషాల్లో సత్రము దగ్గిర దింపాడు.

అప్పుడే రెండు మైళ్ళు వచ్చామా అనుకుంటూ, అయినా పట్నవాసములో దూరము అట్టే తెలియదని సమాధానము చెప్పుకొని, గుర్రము, బహుత్వరలో వచ్చిందని సంతోషించి బండివాడికి రెండుంబేడ ఇచ్చి వేశాను. ఇంకో బేడ యిమ్మని చాలాసేపు బతిమాలి, కోపపడి, తిట్టి చక్కాపోయినాడు.

సత్రములో జనము కిటకిటలాడుతున్నారు. ఇంతమంది పోరుగూరు జనమిక్కడి కెందుకు వచ్చారా అనుకున్నాను. లోపలికి వెళ్ళాను, గూడ కట్టు కట్టుకుని అది మోకాలుపైకి మణిచి, జుట్టు కొప్పెట్టుకుని, నెత్తిమీద నుంచి చమురు మొహము మీదికి కారుతూ, నల్లగా లావుగా శిలావిగ్రహములాగా ఒక మనిషి కనపడ్డాడు. కాళ్ళు ఎడముగా పెట్టుకుని నిలబడి నాకేసి ఎగాదిగా చూసి "ఎన్నా వేణుం" అన్నాడు,

"మీరన్నదేమిటో నాకు తెలియదు కాని నాకొకగది కావాలి ముందు."

"ఓ అప్పనా! నీవు ఎవరు బ్రాహ్మణుడా కాదా? మీది యావూరు? ఎన్నిదినాలుండబోతావు? ఎక్కడ పోతావు? ఈ వూరెందుకు కొచ్చావు?" అని ఆరంభించాడు.

"మేము బ్రాహ్మణులమేను. ఇక తక్కిన సంగతంతా మీకెందుకూ? గది వుంటే ఇవ్వండి, మీకు తెలియకపోతే ఎవరిని అడగాలో చెప్పండి."

"నిండా గట్టివాడుగా వున్నావే? ఎన్ని దినములుండేది చెప్పకపోతే ఎష్టగా గది యస్తును? మూడు దినాలు కంటే వుండేదానికి లేదు"

"నేను మూడు రోజులు కూడా ఉండను. మళ్ళీ ఈ రోజు సాయంత్రమో రేపో వెళ్ళిపోతాను."

"అయితే సరే. ఈ గదిలో ఉండవచ్చు"నని ఒక గది చూపించాడు.

నేనా గదిలో ప్రవేశించి సామానక్కడ భద్రపరచుకొని బయటికి వచ్చి స్నానంచేసి పట్టుబట్ట కట్టుకొని మొహాన్ని బొట్టుపెట్టుకొని చెంబు తీసుకొని భోజనాల సావిడిలోకి వచ్చాను. అక్కడంతా చొక్కాలతోటే, కోట్లతోటే భోజనాలు చేస్తున్నారు. కొందరు వడ్డించేవాళ్ళు కూడా బనియన్ తొడుక్కొని వడ్డిస్తున్నారు. ఈ అనాచారమంతా చూసి అక్కడ భోజనము చెయ్య బుద్ధి అయింది కాదు. అయినా గత్యంతరము లేక ఖాళీగా ఉన్న విస్తరి దగ్గరికి వెళ్ళి కూర్చున్నాను. భోజనము చేస్తున్నవాళ్ళూ వడ్డించే వాళ్ళు కూడా నన్ను చూసి లోపల నవ్వుకోడము మొదలుపెట్టారు. వాళ్ళ తోటి మనకెందుకని యథావిధిగా పరిషించి భోజనానికి కూర్చున్నాను.

ఇంకా వడ్డన అవుతుండగానే నా పంక్తిని కూర్చున్న, అరవవాళ్ళు కూర ముక్కలు పట్టి నోటినే తినివెయ్యడము మొదలుపెట్టారు. వడ్డన అయ్యే అవడముతోటే గబా గబా నెయ్యి, మనిషికి రెండు గరిటెల చొప్పున ఒకాయన వడ్డించుకు వెళ్ళాడు. నా పక్కని కూర్చున్న అరవవాళ్ళు కొంత మంది చెయ్యిపట్టి ఆ నెయ్యి దాహము పుచ్చుకున్నారు. ఏమిటా ఇలా పుచ్చుకుంటున్నారనుకొన్నాను, కొందరు ఒక ముద్దలో వేసుకొని ఆ పట్టి నెయ్యీ అన్నమూ తిన్నారు! నేనూ వేయించుకొన్నాను. నెయ్యి పాడు వాసన ఈ నెయ్యే తాగుతున్నారు మొగము వాచినట్లు ; అప్పుడు కాచిన ఇంటి నెయ్యి లభ్యమయితే వీళ్ళు చెంబులతోటి మంచినీళ్ళవలె దాహము పుచ్చుకుంటారు కాబోలుననుకున్నాను.

నేతి వడ్డన అవుతుండగానే ఇంకొకాయన పులుసు తీసుకువచ్చాడు ప్రతివాళ్ళూ, ఒక పప్పు కలుపుకోడము లేదు. కూర కలుపుకోడము లేదు. పచ్చడి కలుపుకోడము లేదు ; ఏమీ లేదు. ముందుగా పులుసు పోసుకున్నారు అందులో పప్పు కలుపుకున్నారు. నెయ్యి లేకుండా పట్టి అన్నమూ తింటూ అందులోనే కూరా, పచ్చడీ నంజుకున్నారు. ఏమిటీ అడివి తిండి, పాపము, వీళ్ళు తిండి తినడము కూడా ఎరగరే అని జాలిపడ్డాను. నేను శుభ్రముగా పప్పు కలుపుకున్నాను ; పులుసు వద్దనేసరికి అంతా తెల్లబోయి నాకేసి చూశారు. కాకులకు కోకిలరూపు చాలా అందవికారముగానూ, కంఠము కఠోరముగానూ ఉంటుందట. అలాగే ఈ అరవవాళ్ళ కళ్ళకి

నేను వట్టి అనాగరికుడుగా కనబడ్డాను ఆశ్చర్యమేమిటి! పిచ్చివాడికి ప్రపంచమంతా పిచ్చిగా కనపడుతుంది.

తరువాత నేను కూర కలుపుకున్నాను. కలుపుకుని నెయ్యి తీసుకురమ్మన్నాను. ఏ కుళ్ళు నెయ్యి అయినా వేసుకోవడము తప్పుతుంది గనకనా! తీసుకువచ్చి "అది ఏక్స్ట్రా సార్!" అన్నాడు.

"ఈ నెయ్యి"

"ఎక్స్ట్రా ఏమిటీ నీ పిండాకూడు!"

"ఇప్పుడు మళ్ళీ వేసుకుంటిరే ఒక స్పూన్, అది ఒక కాలణా అవును సార్?"

"అయితే ఏమంటావు?"

"వేసేదా సార్?"

"వెయ్యి మరి వెయ్యడానికి కాకపోతే నీ సౌందర్యాతిశయము చూసి ఆనందించడానికి పిలిచాననుకున్నావా?" నేనన్నది వాడికి పూర్తిగా అర్థము కాలేదు. పాపము కొంచెము నవ్వుకుని, "ఏమి సార్, అష్టా గేలి చేస్తారు?" అన్నాడు.

తన్నేదో స్తోత్రము చేశాననుకున్నాడు కాబోలు పాపము, వెనుకటికి ఒక డిప్టీకలక్టరుగారు ఒక అమాయకపు కరణాన్ని ఏదో సందర్భంలో, నువ్వు వట్టి బుద్ధిహీనుడులాగా ఉన్నావే అన్నారట. ఆ కరణము తన్నేదో మెచ్చుకుంటున్నారనుకుని "చిత్తం మహాప్రభో, ఏలినవారి కటాక్షము! తమ బోటి పెద్దలందరిచేతా అలాగే అనిపించుకుంటున్నా" అన్నాడట. అలాగ్గా ఉంది ఈ వడ్డనవాడి సంగతి.

తక్కినవాళ్ళంతా పులుసూ అన్నమూ తినగానే చారు వడ్డించుకున్నారు. నాకు ఊరికే నవ్వు వచ్చింది వాళ్ళ తిండి వరస చూసి, పులుసో చారో, ఏదో ఒకటి కాని, రెండూ ఏమిటి వీళ్ళ తలకాయనుకొన్నాను. సరే! వీళ్లిలా తింటే నాకెందుకని త్వరగా రెండు మెతుకులు నోట్లో వేసుకుని లేచి వచ్చాను. అక్కడ వరసంతా చూస్తే భోజనం చేసినట్లే లేదు నాకు. అంతా అనాచారమే. అన్నము చేత్తోటే నేతి మజ్జిగలు ముట్టుకోడము. ఆ చేత్తోటే మంచినీళ్ళు ఇవ్వడము. చేతులు కడుక్కునే చోటంతా మెతుకుల మయము, అంత అనాచారముగా ఉంటారు; వీళ్ళ కసహ్యము ఎలా లేదా అనుకున్నాను.

భోజనము చేసి నాగదికి వచ్చి కాస్సేపు విశ్రమించి చొక్కా తొడుక్కుని ఊళ్ళోకి బయలుదేరాను. నాకు జుట్టు ముడీ, గిరజాలూ ఉండేవి. తీసివేయించి దొరటోపి ఒకటి కొనుక్కుని తరువాత రైలు సంగతి కనుక్కుని వద్దామని ఉద్దేశం.

వీధిలోకి రాగానే నడిరోడ్డు మీద ఇంజన్ లేకుండా రైళ్ళు పరుగెడుతున్నవి. పొద్దున బండివాడిని అవేమిటని అడిగితే ట్రాంకార్లు అని చెప్పాడు. వాట్లకు స్టేషనులూ అవీ అక్కరలేదట. ఎక్కడ పడితే అక్కడ ఆగడమేను. ఈ ఏర్పాటు చాలా బాగుందనుకున్నాను.

అక్కడొక పెద్ద మనిషిని పిలిచి 'మంచి షాపులెక్కడుంటా'యన్నాను. మౌంటురోడ్డులో పుంటాయన్నాడు. 'అయితే అక్కడికి వెళ్ళడమెలాగ' అన్నాడు 'అక్కడ ట్రాము యెక్కితే నేరుగా పూడ్చు'నన్నాడు. ఇలా మాట్లాడుతుండగానే ట్రాము కారొకటి వచ్చింది. దానిమీద రాయపురమని వ్రాసివుంది. అక్కడ ఆగకుండా అది వెళ్ళిపోతున్నది. అయ్యో పోతున్నదే అని ఆదుర్దాకొద్దీ నాతో మాట్లాడుతున్నాయన మాట పూర్తిగా వినిపించుకోకుండానే, 'ఆపండి, ఆపండి' అని కేకలు వేస్తూ పరుగెత్తాను. బండి కొంతదూరాన ఆగింది. సరే నా కేక వినపడి ఆపారుగదా, వెళ్ళేదాకా ఆగుతుందనుకుని పరుగు కొంచెము తగ్గించాను. బండీ మళ్ళీ బయలుదేరింది 'ఆపండోయ్' అని మళ్ళీ కేకలు వేస్తూ పరుగెత్తాను. ఓ మాటు ఆగినట్టే ఆగడము, మళ్ళీ పరుగెత్తడము ఈలాగ సుమారు మైలు పరుగెత్తడము ఈలాగ సుమారు మైలు పరుగెత్తి ఆఖరుకు ఎలాగైతే నేమి అందుకున్నాను. యెక్కి ఒక్క క్షణము ఆయాసము తీర్చుకునే లోపలనే ఏరంగో కూడా తెలియని అలుకుగడ్డలాంటి కోటూ, యిజారూ, తొడుక్కుని జుట్టు ముడిమీద టోపీ పెట్టుకుని, మెళ్ళో తోలుసంచీ ఒకటి తగిలించుకుని 'టీకాయట్ సర్ టికాయట్ సార్, యెక్కడ పోవాలా' అని ఒకడు వచ్చాడు. ఒక పావలా అతని చేతిలో పెట్టి మౌంట్ రోడ్డన్నాను, ఏందయ్యా, యిందుకా యింతదూరము పోడివస్తివి? నిండా గట్టివాడు యెందుకయ్యా. దిగు దిగు జిల్లి బండి వస్తుంది. అందులో పోవాలయ్యా అన్నాడు అంటుండగానే యెదురుగా ట్రాముకారు యింకొకటి వచ్చింది. అది తప్పిపోకుండా అందుకుందాము; యిప్పటికే చాలా ఆలస్యమైందని బండి ఆట్టే త్వరగా పోవడము లేదు కదా అనీ టిక్కెట్టు యిచ్చే అతను ఆగమంటున్నా వినక కింద కురికాను. వురకడములో మొహము బద్దలయ్యేటట్టు ముందికిపడ్డాను. ట్రాముకా

ఆపి వాళ్ళు వచ్చి లేవదీసి అంత తొందరపడి దిగినందుకు నాలుగు చీవాట్లువేసి వాళ్ళుదారిన వాళ్ళు చక్కాపోయినారు. వీధిలోకి వచ్చేటప్పుడు, ఆ పొద్దుటి ఆ నల్లటి అరవాయన యెదురుగుండా వచ్చాడు. అందుకనే యిలాటి అవస్థలు వచ్చినాయి అనుకున్నాను.

ఇవ్వాళ మరి ట్రాముకారు ఎక్కకూడదనుకొని నిమ్మళంగా బండి ఏదైనా చేసుకువెళితే సావకాశంగా అన్నీ చూస్తూ వెళ్ళవచ్చుననుకుని ఒంటెద్దుబండి ఒకటి కుదుర్చుకుని బయలుదేరాను.

చెన్నపట్నము మొత్తము మీద చాలా పెద్ద ఊరూ, అందమైన ఊరూను. ఆరోడ్ల వైశాల్యము, షాపుల సౌందర్యము, అంతా చూసి చాలా సంతోషించాను. ఓహో ఎంత పట్టణమనుకున్నాను, ఇంగ్లండులో ఇంత గొప్ప పట్టణాలుంటాయా? లండనింతకంటే పెద్దదా? చిన్నదా? అని ఆలోచించాను. అయినా పెద్దదెలా అవుతుంది? ఇంగ్లండంతా చిన్న ద్వీపముకదా, ఇంగ్లండంతా కలిసి చెన్నపట్నమంత ఉంటుందేమో అని ఇలా తర్కించుకుంటూ నిమ్మళంగా బండిలో వూగిసలాడుతూ వెడుతుండగా ఒకచోట 'పేరిజియన్ హేర్ కట్టింగ్ సెలూన్' అని కనపడ్డది. పుట్టు వెంట్రుకలు తీయించుకోవలసిన అవసరం వుంది కదా అనుకుని బండి ఆపమని దిగాను. దిగి గుమ్మము దగ్గిర నిలుచుని లోపలికి తొంగిచూశాను. కాళ్ళు ముందుకు సాగలేదు. గుండెలు గబగబా కొట్టుకోడమారంభించినయి. ఇదివరకెప్పుడూ, నేను భోజనానంతరము చేయించుకోలేదు. నేటికది సంప్రాప్తమయింది. పైగా ఈ బట్టలతోటి చేయించుకోడము స్నానమైనా చేయకుండా అన్నీ ముట్టుకోడము. ఇదంతా. మనసుకు చాలా కష్టముగా తోచింది. ఏమి చెయ్యను. తప్పుతుందా, ఇదంతా ఊరికే తుంటరితనము కోసము కాదుకదా, దేశోపకారము కోసము కదా యింత తలపెట్టింది. ఇటువంటి కష్టములెన్ని లేకుండా కార్యసాధన అవుతుందా అని మనసుకు సమాధానము చెప్పుకున్నాను.

లోపలికి తొంగిచూస్తే నాకు బహు ఆశ్చర్యము వేసింది. గదంతా పరిశుభ్రముగా అద్దములాగా ఉంది. పైన ఎలక్ట్రిక్ దీపాలు. గోడలో కమర్చి తెల్లని పెద్ద పింగాణీ గిన్నెలూ, వాట్లలో చిన్న కుళాయిలు. వాట్ల పైన నిలువుటద్దాలు, వాట్లముందు మంచి పరుపులు కుర్చీలూ వున్నాయి. గుమ్మము దగ్గిర ఒకాయన కుర్చీ వేసుకుని మేజామీద ఏదో వ్రాసుకుంటూ కూర్చున్నాడు. ఒక పెద్ద బీరువానిండా ఏవో సీసాలూ చిన్న అట్టపెట్టెలూ, రకరకాలు కనబడ్డాయి. వీధి గుమ్మానికెదురుగుండా గోడకొక

చక్కని రంగుల అద్దకపు గుడ్డతెర కట్టివుంది. ఒకగోడని బట్టలు తగిలించుకునే వంకెలున్నవి. నాకిదంతా చూసేసరికి మంగలి దుకాణమవునా కాదా అనే సందేహము తోచింది. పొరపాటున ఏద్దైనా ఆఫీసులోకి రాలేదుకదా అనుకున్నాను. లేకపోతే ఇది ఏదో పెద్ద మందులషాషపై వుండవచ్చు. అయితే పైన బల్ల అలా కట్టడానికి కారణమేమిటి? చెప్మా అనుకొని ఒకవేళ మేడమీద ఉందేమో మంగలి దుకామము అనుకుని మళ్ళీ వాకిట్లో వున్న బల్లకేసి చూశాను. చూస్తే మేడమీదే కనుపించలేదు, ఆ బల్ల దీనికి సంబంధించినట్లే తోచింది. ఇది మంగలిదూకాణమవునా కాదా అని అక్కడ కూర్చున్న మనిషిని అడిగి తెలుకుందామనీ అనుకుంటూ వుంటే, నా అవస్థ గ్రహించి కాబోలును. అతనే నన్ను పలకరించాడు.

నాకింగ్లీషు రాదనుకున్నాడు కాబోలు. అరవాన్ని మాట్లాడాడు. నాకరవమురాదన్నాను. 'ఒరాదా; తెలుగువాడామీరు. రండిఏంకావాలా? షేవ్ కావాల్నా? ఎందుకిక్కడనేనిలుస్తారు? లోనరండివీ' అన్నాడు

దాని తోటె అది మంగలి దుకాణమేనని నిశ్చయపరుచుకుని ఆశ్చర్యపోతూనా కాళ్ళమట్టి అంటుకుని నేలమురికి అవుతుందేమోనని భయపడుతూ లోపలికి వెళ్ళి నిలబడ్డాను. 'కూర్చోండి' అని ఒక అద్దం ఎదురున్న కూర్చీకేసి చూపించాడు హడలిపోతూ దాని మీద కూర్చున్నాను.



లనూ మంట కలపవలెనని ప్రయత్నించిన బ్రహ్మసామాజికుల మీద కాని మరో మతాంతరుల మీద కాని నేనెప్పుడూ కోపం తెచ్చుకోలేదు. ఇలా సరిపెట్టుకునే నేను ఏనాడూ దేనికీ సమాధానం చెప్పేవాడిని కాదు. చెప్ప ప్రయత్నించను కూడా లేదు. ఈనాటికి నేను 30 సం॥ లు పైగా చేస్తున్న కృషి ఫలితంగా హాస్యరస స్వరూపాన్ని గురించి నా అభిప్రాయం కొంచెం చెప్పడం సమంజసమని తోచి ఈ తుదిపలుకులో చేరుస్తున్నాను.

నాడు శ్రీ వీరేశలింగంగారి ప్రహసనాలను గురించి ముందొక్క మాట, ప్రహసనం చూచినప్పుడు కలిగిన హాస్యంకాని, తుష్టికాని, హాస్యరసానికి సంబంధించినది కాదు. దీనిని ఆంగ్లంలో Satire అంటారు. అనగా ఎత్తిపొడుపు అన్నమాట. సంఘంలో ఉండే దురాచారాలనూ, అత్యాచారాలనూ, ఎత్తి పొడుపు ధోరణిలో ప్రసహనంగా వ్రాసి, సంఘం సంస్కరించవలెననే సదుద్దేశము కలవారు చేసే ప్రయత్నం ఇది.

Comedy is lifted above the plane of amusement and sensation and becomes an intellectual experience.

One laughs, but having detachment of mind he sees his potential self in the object of his laughter, and thereby he is laughed at as well laughing.

Thus laughter must be finely tempored, searching corrective, yet always humane, if it is to rise to the noble pretensions of a spiritual theraupetic, and comedy be realised to the highest.

Only when an individual or society has become emancipated morally and intellectually can he or it withstand the fusillade of that laughter with remedial effect-

ఈ పై వాక్యాలు George Meredith ఏనాడో వ్రాసినవి. దాని భావమేమిటంటే సంఘ సంస్కరణకు ఉద్దేశింపబడిన హాస్యము నాజూకుగానూ, సరిదిద్దేదిగానూ ముఖ్యంగ కరుణా సమన్వితంగానూ వుండవలెను. లేనిచో సంఘసంస్కరణకు ప్రహసనమును ప్రయోగించవలెనన్న భావమే వృధా అవుతుంది. ఒక వ్యక్తిగాని సంఘంకాని నైతికంగానూ, మానసికం

గాను ఒక స్థాయిని అందుకున్న నాడే ప్రహసన ప్రదర్శనాలూ, వాని వలన ప్రజలనుంచి వచ్చే అవహేళనతో కూడుకున్న నవ్వును భరించడం సాధ్యం అవుతుంది. శ్రీ పంతులుగారి ప్రహసనాలలో అసహ్యం, క్రోధం, క్రౌర్యమూ ఎక్కువపాలులో ప్రత్యక్షమవుతాయి. అందుచేతను ప్రహసము నకు మానవత్వమనే ప్రధాన లక్షణం లోపించిందని నా భావం. హాస్య రచయితకు జీవితాన్నంతనూ ప్రశాంతంగా సౌమ్య దృష్టితో చూసే శక్తి ఉండవలెనని పాశ్చాత్య తత్త్వవేత్తల ఉద్దేశం. ఇది మన రచయితలలో ఎంతవరకు ఉన్నదో చదువరులే నిర్ణయించుకోగలరు.

చాలామంది పార్వతీశాన్నీ, గిరీశాన్నీ, గణపతినీ ఒకే రకమైన హాస్యపాత్రలని నిర్ణయించినట్లు అనిపిస్తుంది. దీనికి ఏమనాలో తోచకుండా వుంది. గిరీశం నాటకంలో విలన్ కాని, అనగా దుర్మార్గుడు కాని సన్మార్గుడు కాదు. జీవితంలోని ఈలాంటి కొద్దిమందికి ఇతను ప్రతినిధి. హాస్యమునకు మానవ సామాన్యత్వం ప్రధాన లక్షణం. గిరీశం లక్షణాలు సర్వమానవ సహజములనీ, సామాన్యములనీ, నేను ఒప్పుకోలేను. అందుచేతను గిరీశం లాంటివాళ్ళు ఎప్పుడూ సంఘంలో బహు కొద్దిమందే ఉంటారు. అయినా అతను సజీవుడనీ చిరంజీవనీ అన్ని కాలములలోనూ, మారువేషంలో ఉన్నా, మనలో ఉంటాడనీ ఒప్పుకోక తప్పదు.

ఇక గణపతి మరోరకమైన వ్యక్తి. ఇతను ప్రత్యేకం ఒక శాఖకు సంబంధించినవాడు, విద్యా, విహీనుడు, దరిద్రుడు, జీవనోపాధి సంపాదించుకొనుటకు ఏ విధమైన అర్హతా లేనివాడు, అంతకన్నా దౌర్భాగ్యము కూలీనాలీ చేసుకోవడం కూడా చేతకాని బ్రహ్మణ జన్మ ఎత్తినవాడు. అయినా బ్రతక్క తప్పదు కదా! అలాగే నానాతంటాలూపడి, విదూషకుడుగా కొన్నాళ్ళు, గ్రామపాచకుడుగా కొన్నాళ్ళూ, శవవాహకుడుగా కొన్నాళ్ళూ, ఈలా అనేక అవతారాలలో ప్రత్యక్షమై జీవయాత్ర సాగించుకున్న నిర్భాగ్యుడు, ఇత నేనాటికి హాస్య నిలయుడని నేనొప్పుకోలేను. అందరి దయకూ, ధర్మానికీ, కరుణకూ పాత్రుడు కావలసిన మనిషికి, శ్రీ లక్ష్మీనరసింహంగారు, ఆనాడు ప్రజలలో చెప్పుకునే కొన్ని హాస్యోక్తులనూ, సంఘటనలనూ ఇతని జీవితంలో చొప్పించి, గణపతి నొక హాస్య పాత్రగా సృష్టించారు. ఇతరుల కష్టములు మన కరుణకేగాని హాస్యమునకు స్థాయి కాకూడదు, అని నా నమ్మకం. ఇది పెద్దల మాట కూడాను.

ఇంక స్వవిషయం. మా పార్వతీశాన్ని గురించి నేనేం చెప్పను. ఏ కొద్దిమందో తప్ప అఖిలాంధ్రానికి ఆదరణ పాత్రుడయ్యాడు. నిత్య స్మరణీయుడయ్యాడు. ఆబాలగోపాలమూ ఏదో సందర్భంలో ఇతని నుదహరిస్తుంటారు. శ్రీ ముట్నూరి సంగమేశంగారు వారి 'తెలుగులో హాస్యమనే' పుస్తకంలో గిరీశాన్ని మనం సహించలేము. పార్వతీశాన్ని మనం విడిచి ఉండలేము అని వ్రాసినది జనవాక్యం అనుకుంటాను.

నవ్వేశక్తి దానికి కారణం ఊహించగల శక్తి మానవుడి కొక్కడికే పరమేశ్వరుడు ప్రసాదించాడు. సాధారణంగా మనమెందుకు నవ్వుతామంటే వికృతాకార, వికార వేషభాషలు ఏవైనా మనకంట కాని, చెవిని కాని పడితే మనం నవ్వుతామని మన అలంకారికులు నిర్వచనం చేశారు. అంటే వికృతమైన నూతనత్వాన్ని మన కన్నులూ, చెవులూ అంగీకరించకపోతే చేసేదేమీ లేక నవ్వి వూరుకుంటామన్న మాట.

పాశ్చాత్యులు ఇంతకంటే మరో మెట్టు పైకి వెళ్ళి శబ్దము, రూపము, వికృతి పొందినప్పుడే కాకుండా జీవితమంటా స్థూలంగానూ, సూక్ష్మంగానూ పరిశీలిస్తే ఎన్నో హాస్య జనకమైన సంఘటనలు ప్రతినిత్యమూ ప్రతి విషయంలోనూ కనపడుతూనే ఉంటాయి అన్నారు. ఎటొచ్చీ మనం చూచి, ఆ వికృతిని తెలుసుకుని యదార్థాన్ని వూహించుకుని, ఆనందించగలిగే శక్తి మనకుంటే చాలునన్నారు. సాధారణంగా మానవుని డాబూ, దర్పం, అహంకారం, అవివేకం, అజ్ఞానం, కామం, రాగం, ద్వేషం వగైరా మానవ సహజమైన దౌర్బల్యాలు హాస్యజనకములవుతాయి. వాటినాధారం చేసుకొని అనేక గాధలూ, ప్రహసనాలూ, సనాతన అధునాతన సాహిత్యంలో ఎన్నో ఉన్నవి. ముందుముందుకూడా ఈ విషయములే రూపాంతరంలో ఉండగల్గవనీ మీరు గ్రహించే ఉంటారు.

మానవుడు సహజంగా దురహంకారి. అందుచేతను మానవజాతి కంతకూ తను అతీతుడన్నట్లు సంచరించే మహానీయులు హాస్యాస్పదులవుతారు. తమ లోపాలను తాము కాదనలేక, వాటిని ఎదుటివారిలో ఉన్నట్లు భ్రమపడి వారి నవహేళన చేయబోయి, తమరే నవ్వులపాలవుతారని 'ఏంధో నీలుడో విచీ' అనే ఆయన అన్నాడు, ఇదేదీ కాదు. అహంకారమూకాదు, వల్లకాడూ కాదు. మానవుడు తనలో ఉండే దౌర్బల్యాలకు లొంగిపోయి ఏమూలనో తనలో మాటుమణిగివున్న ఆధ్యాత్మిక, ఔన్నత్యాన్ని గ్రహించలేక

సంచరించేవాడు హాస్యాస్పదుడు కాక ఏమవుతున్నాడన్నాడు 'ఛస్టర్‌టన్'. అంటే స్వస్వరూపజ్ఞానం, తదవసరమైన కృషీ లేకనే మానవుడు హాస్యాస్పదుడవుతాడన్నమాట.ఇవన్నీ అటుంచి హాస్యానికి కారణం ఒక్కటేనన్నారు మరి కొందరు. అదేమిటంటే విషాదం. మానవుడొక్కడే కష్టములసారమెరిగినవాడూ, అంతులేని ఆవేదన అనుభవించేవాడూ, బాధపడేవాడూనూ, ఇది మరచిపోవడానికి అతనే హాస్యం కనిపెట్టేడన్నాడు 'నాచే' అనే జర్మను తత్వజ్ఞుడు. ఎవరు ఏమి చెప్పినా హాస్యం మానవుని సొత్తు, మానవుని విడిచి మనలేదు. హాస్యం మానవజీవితాన్ని చూచి అర్థం చేసుకునే ఒక దృక్పథం అదే అతని జీవితానికి వ్యాఖ్య కూడాను.

కవులో కథకులో ఒక సజీవ పాత్రను - సజీవమేకాదు నిత్యజీవన - పాత్ర సృష్టించి ఆ పాత్రమీద ఆ రచయితకు అపారమైన సానుభూతి ఉండి, చదువరుల సానుభూతిని కూడా పూర్తిగా పొందగలిగితే అది కొంతవరకూ రసస్థాయిని అందుకొన్నది అవుతుంది. నిగమశర్మ, గిరీశం, పార్వతీశం లాంటి పాత్రలు ఈ జాతిలోనివేనని అంగీకరించవచ్చును. వాళ్ల నీతినియమాలతోనూ పుణ్యాపాపములతోనూ నిమిత్తము లేకుండానే ఆ వ్యక్తులమీద నెందుకో మనకు మమకారమేర్పడుతుంది. అందుకని వీరు చిరంజీవుల జాతిలో చేరిన వారవుతారు.

ఇంకను ఇంతకంటే చెప్పవలసిన దేమున్నది? ఇంకను విశేషంగా హాస్యాన్ని గూర్చిన ప్రసంగం అప్రస్తుతం కాగలదనే భీతితో ఈ తుదిపలుకు ముగిస్తున్నాను.

లోకాస్సమస్తా స్సుఖినోభవంతు.

-- మొక్కపాటి నరసింహశాస్త్రి

సాహితీ సమితి, పిఠాపురం.

1971.

# బారిష్టరు పార్వతీశం

## రెండవ భాగము

ఎలాగైతేనేమి, ఇంగ్లండులో అడుగు పెట్టానని చెప్పాను కాదూ! మరచిపోకుండా, ఎలాగో జ్ఞాపకం పెట్టుకుని కుడికాలే పెట్టాను కూడాను. నేను ఇంత శ్రద్ధగా ఇంతశాస్త్రయుక్తంగా కుడికాలే పెట్టినా, లండను మట్టుకి విషయమేమీ గమనించినట్లు కనుపించలేదు. సిడ సిడ లాడుతూ మొగం మాడ్చుకుంటూ, అరిపోయిన హారతి పళ్ళెం పట్టుకు నిలుచున్నట్ల నిపించింది. ఇంతకూ అదృష్టం బాగుంటే ఏకాలు పెట్టినా ఇబ్బంది లేదు. బాగుండకపోతే ఏ కాలు పెట్టినా ఒకటే.

ఇక్కడ దిగగానే నాలో ఉత్సాహం సగం చచ్చిన దనను కాని చల్లా రిందని చెప్పక తప్పదు. కారణమేమిటంటే నేను చెప్పలేను. లండనులో అడుగు పెట్టేసరికి బరామీటరు మరీ దిగిపోయినట్లయింది. నెమ్మదిగా సామాను దింపుకుని Platform మీద నిలబడ్డాను. ఏమి చెయ్యడా నికీ తోచలేదు. ఎటు వెళ్ళాలో మొదలే తెలియదు కదా! అంతా అయోమయంగా ఉన్నది. ఇదే మొగల్తుర్రు అయితేనా! స్కూలునుంచి ఇంటికిరాగానే, నేనేదో చాలా దూరప్రయాణంచేసి వచ్చినట్లు, మా ఇంట్లో వాళ్ళూ, చుట్టుపక్కలిళ్ళల్లో కుర్రవాళ్ళూ బోలెడంత మంది పరుగెత్తు కొచ్చి నా చుట్టూ మూగి, ఎంతో సేపు నాతో కులాసాగా ఆడుకునేవారు. మా అమ్మ సంగతి చెప్పనే అక్కరలేదు. "వచ్చావురా నాయనా ముందు కాళ్ళూ మొహం కడుక్కో కళ్ళు దెంచుకుపోయి బుగ్గలు పీక్కు పోయి ఎలా వున్నావురా నాయనా! "లే" అని నన్ను తొందర పెట్టి, కాళ్ళు కడుక్కున్న తరువాత ఏదో కొంత ఫలహారము పెట్టేది. ఒక్కొక్కప్పుడు నాకు దిష్టి కూడా తీస్తుండేది. నాకెంతో సిగ్గుగా ఉండేది. ఏమిటమ్మా నీ చాదస్తముః నువ్వూనూ. ఇంకా ఎన్నాళ్ళేమిటి ఈ దిష్టి అదీని.

నేనింకా చిన్న కూచమ్మ ననుకుంటున్నావా ఏమిటి'' అనే వాడిని, కొంచెం కోపం అభినయిస్తూ. ఇదంతా జ్ఞాపకము వచ్చి, ఒక్క మాటు దుఃఖం వచ్చింది. కళ్ళు వొత్తుకుంటూ చలికి గజగజ లాడుతూ పక్కచుట్టలో శాలువా తీసుకుని కప్పుకుందామా అని ఆలోచిస్తుండగా పాతాళంలోనుంచి ఎవరో తన్నుతే పైకుబికినట్లు, కుక్ కంపెనీ వారి అసామీ పాతాళంలో నుంచి వచ్చినట్లు తోచినా, నా పాలిటికి దివి నుండి దిగి వచ్చిన దేవతలా ప్రత్యక్షమయ్యాడు. నన్ను ఒక్కసారి ఎగాదిగా చూచి, Ha Ha! Ah! Good evening. What is your name? Ah! Let me see. you are the Great Mr. Parvatesam aren't you? Fine we were hearing a lot about you good fine day. Bit chilly what?" (ఆహాఁ నమస్కారము తమ పేరు - అఁ - అన్నట్టు మీరే కాదూ ఆ మహానుభావులు పార్వతీశంగారు. తమ సంగతి అబ్బో బోలెడంత విన్నాము. అఁ బాగుంది కొంచెము - శీతలం తిరిగింది కాదూ) అంటూ చిరునవ్వుతో నన్ను పలకరించే సరికి నా ప్రాణం లేచి వచ్చినట్లయింది. కాని నన్ను "Great Parvatesam" అన్నాడు.



నా గురించి చాలా విన్నానంటాడు. చాలా చిత్రంగా ఉన్నదే, నేను గొప్పవాడి నని వాడెలా కనిపెట్టగలిగాడు? నన్ను గురించి అప్పుడే లండన్‌లో అడుగు పెట్టి ఇంకా అరగంటేనా కాకుండా - ఎలా విన్నాడు? చాలా చిత్రంగా ఉన్నదే అని ఆశ్చర్యపోతూ, వాడికంటే మనమేమీ తీసిపోకూడదనుకుంటూ "Yes Sir, I Parvatesam, how you know me Cookగారూ" అన్నాను ఇంగ్లీషులో. నాకు కూడా ఇంగ్లీషు వచ్చు సుమా, అట్టే పిచ్చి వేషాలేమన్నా వేస్తే నా దగ్గర సాగవని హెచ్చరించడానికి. "Good, lad clever Aren't you? Come, Hurry" అంటూ నా చెయ్యి పట్టుకుని లాక్కుపోవడం మొదలు పెట్టాడు. yes coming, my Samans sir' అంటుంటే వినిపించుకోడు. ఈ చెవిటి మాలోకమేమిటి బాబూ అనుకుని, ఒక్క వూపుతో నా చెయ్యి విదిలించి "My Saman there, I go and get saman and come" అన్నాను. వెనక్కి తిరిగి సామాన్లు చూపిస్తూ (ఏమిటయ్యా, ఈ హడావిడి. నా సామాన్లు ఉండవయ్యా! నా సామాన్లు తీసుకుని వస్తాను Oh Oh! you and your bloody saman what do you mean saman (ఏమిటయ్యా నీ వెధవ సామానూ నువ్వూనూ అసలు సామానంటే ఏమిటి అన్నాడు. 'My box sir and bed sir' (నా పెట్టే పరుపూనండీ) అన్నాను వాటికేసి చూపిస్తూ 'Oh, that' (అదా) అని ఓ పెద్ద నవ్వు నవ్వి సామాన్, సామాన్ అని నాలుగు సార్లు అనుకుని ఫరవాలేదు, నీ సామాను ఎక్కడికీ పోదు వాటిని తీసు కురమ్మని ఒకమనిషితో చెప్పాను. తీసుకు వస్తాడు. మనం తొందరగా వెళ్ళి ఆ రైలు ఎక్కాలి అన్నాడు. అక్కడున్న రైలుకేసి చూపిస్తూ. స్టీమరులో నుంచి దిగిన జనమంతా ఆ రైలు కేసి హడావిడిగా వెళ్ళి అందులో ఎక్కుతున్నారు.

"మనం ఇంగ్లండు వచ్చాం కదా; మళ్ళీ ఈ రైలు ఎందుకు ఇంకా ఎక్కడికి వెళ్ళా"లన్నాను. ఇది ఇంగ్లండే, నిజమే అయితే, ఇంగ్లండు కిది మొదలన్నమాట. లండను ఇక్కడికి కొన్ని మైళ్ళ దూరముంది. మూడుగంటల ప్రయాణం చేస్తే సుమారు ఎనిమిదింటికి అక్కడకు చేరు కుంటాము. నిన్నక్కడకు చేరుస్తే, మాబాధ్యత వదిలిపోతుంది. తరువాత నీ దారి నువ్వు చూసుకోవలసినదే. అన్నాడు తొందరగా నడుస్తూ. అంత సేపూ నా చెయ్యి వదలలేదు పాపం. ఈ సంభాషణంతా ఆంగ్లంలోనే జరిగింది సుమండీ, వాడికి తెలుగెలా వచ్చిందనుకునేరు. చస్తే వాడికి తెలుగురాదు. ఎన్ని వేలేళ్ళు తపస్సుచేసినా, ఒక్క తెలుగుముక్క వాడి చేత పలికించలేము, తెలుగుదేశంలో పుట్టి పెరిగిన నాకే యింకా బోలెడన్ని

అర్థంకాని, స్వచ్ఛంగా పలుకలేని మాటలున్నాయంటే, వాడికెలా వస్తుంది చెప్పండి. అదేం చచ్చు ఇంగ్లీషా. ఎవడు పడితే వాడు ఏడాదిలోనో, రెండేళ్ళల్లోనో నేర్చుకోడానికి! మేము రైలు దగ్గరకు వచ్చి, ఒక పెట్టెలో ఎక్కబోయేసరికి, ఎవడు తెచ్చాడో, ఎప్పుడు తెచ్చాడో, తెలియదు కాని, నాపెట్టే, పరుపూ అప్పుడే అందులో వున్నాయి. "ఇదుగో బాబూ - మీ మీ అదేమిటో అన్నావు......" వాడిని చూచి నేనూ నవ్వాను. ఎటొచ్చీ వాడొకందుకు నవ్వితే నేను మరొకందుకు నవ్వాను.

అప్పటికి అయిదో, అయిదున్నర గంటలో అయినా, బాగా చీకటి పడిపోయింది. పొగో, పొగమంచో తెలియకుండా పది అడుగులలో ఉన్న మనుష్యులు కూడా కనబడనంత వత్తుగా, దట్టమైన తెరలా మమ్మల్ని కమ్మేసింది. విపరీతమైన చలిగా ఉంది. ఇంత గాఢాంధకారంలోనూ రైలు వెడుతుందా అనే సందేహం కలిగింది నాకు. సందేహం కలగడం తడవుగా, ఈ కటిక చీకట్లో రైలు వెడుతుందా భయంలేకుండా నన్నాను. యధాలాపంగా నా లోపలి ఊహల్ని పైకి అన్నట్టుగా - అతని తోటి చెప్పినట్టు గాకుండా, అతనొక్కసారి నా కేసి నిదానంగా చూసి, "ఏం భయం లేదు - మనకూ భయంలేదూ - దానికీ భయం లేదు, ఒక జోడా మనుష్యులు లాంతర్లు పట్టుకుని, రైలు పట్టాలు తప్పిపోకుండా దాని ఎదుట నడుస్తారు" అన్నాడు చాలా గంభీరంగా.

అయినా వాడేదో నన్ను వేళాకోళం చేస్తున్నాడనుకొన్నాను. నేను నాకు కలిగిన సందేహాన్ని పైకి అనడం పొరపాటేననుకున్నాను. అప్పుడు నిడదవోలునుంచి నేనెక్కిన రైలు మద్రాసు వరకూ రాత్రి ప్రయాణము చేసిన సంగతీ, తరువాత మద్రాసునుంచి మళ్ళీ రాత్రి చేసిన ప్రయాణం స్ఫురణకొచ్చి, నా తెలివితక్కువ తనానికి నవ్వుకున్నాను. అయితేమట్టుకీ మాత్రం దానికి వాడు నన్ను చూచి నవ్వుతాడా అని కొంచెం కోపం వచ్చిన మాట వాస్తవమే. అయినా నాలో నేను సముదాయించుకుని, ఒకటి రెండుసార్లు వాడేదో చెప్పబోతే నేను వినీ విననట్లు సమాధానం చెప్పకుండా ఊరుకున్నాను. లండన్ చేరేవరకూ నా మౌనం నేను విడవలేదు. ఏ అవాంతరం లేకుండా మేము లండన్ క్షేమంగా చేరాము దైవానుగ్రహం వల్ల. లండన్ స్టేషన్ రాగానే రైలు స్టేషన్‌లోకి కాక ఏదో ఇంట్లోకి వెళుతున్నట్టు అనిపించింది. ఎందు చేతనో తెలియదు. నాతో కూడా ఉన్న ఆసామీ నడుగుదామంటే, మళ్ళీ అతను ఏమి వేళాకోళం చేస్తాడో అని సందేహించి ఊరుకున్నాను.

రైలు ఆగి ఆగడంతో బిల బిల లాడుతూ, రైలులో యావన్మందీ కన్నాల్లోంచి ఎలుకల్లా హడావిడిగా బైటకు వెళ్ళటం ప్రారంభించారు. నేనూ, నాతోవున్న ఆసామీ దిగడానికి లేచాము. నేనొకసారి నా సామాను కేసి చూశాను. అది అతను కనిపెట్టి "దాని సంగతి నేను చూస్తాను దిగ మన్నాడు. మేమిద్దరం దిగడంతోనే, అతని సంజ్ఞకు, ఒక మనిషి లోపలికి వెళ్ళి, సామాను బయటకు తీసుకువచ్చాడు. అతన్ని చూస్తే మామూలు దొరలాగే వున్నాడుగాని, కూలీలనుకోలేదు. మనవ్వాళ్ళల్లో అయితే, కూలీ ఇట్టే దొరికిపోతాడు. వాణ్ణి చచ్చినా "ఏమండీ" అని మనం అనలేము. అసలెందుకనాలి?



బయటకు రావడంతోనే, నాలుగు వైపులా ఆశ్చర్యంతో చూశాను. నేను మద్రాసులాంటి స్టేషన్లు చాలా చూచానుగాని, ఇంత పెద్ద స్టేషను నాకెక్కడా కనబడలేదు. ఇది కొన్ని మైళ్ళు పొడుగుంటుందా అనిపించింది. అధమం ఒక మైలేనా వెడల్పు ఉండాలనుకున్నాను. ఇందాక రైలు, స్టేషనుకు కాక ఇంట్లోకి వెడుతోంది అని అనిపించడానికి కారణం, ఇప్పుడు తెలిసింది. ఇంత వెడల్పూ, పొడుగూ ఉన్న స్టేషను అంతటికీ గాజుకప్పు, పైభాగాన కనిపించింది. ఇంత గాజు ఎలా దొరికిందా వీళ్ళకు అనుకున్నాను. అసలు గాజెందుకు వేశారు. అనే సందేహం కూడా కలిగింది. ఒకవేళ ఏ కొబ్బరికాయేనా దానిమీద పడితేనో, లేక, పక్కఇంటి కుర్రాళ్లె వళ్ళయినా, ఆటల్లో వాళ్ళ లక్కపిడతలో, పెంకు ముక్కలో, దానిమీద విసురుతేనో, ఇంత స్టేషనూ ఏమవుతుందనిపించింది. అయినా దానికి సమాధానం ఏదో మనమే వూహించి తెలుసుకోవాలిగాని, ఇలాటి మోటుమనుషులను అడుగుతే వాళ్లు అతి తెలివిగా మాట్లాడామనుకొని, నన్ను అవహేళన చేస్తారు. ఎందుకొచ్చినదీ బాధ. ఇంతకూ స్టేషను కప్పు ఎలా పోతే నా కెందుకు అని అప్పటికి సమాధానం చెప్పకున్నాను.

ఇంతలో నా ప్రక్కనున్న కుక్ - అనగా వంటమనిషి కాదు - కుక్ కంపెనీ మనిషి బయటకు వెళదాం రండని చెయ్యి పట్టుకుని ముందుకి తీసుకువెళ్ళాడు. పది బారలు నడవగానే, ప్లాట్ ఫారంలో మధ్యభాగం కొంత దానంతటదే పరుగెడుతోంది, దానిమీద కొందరు మనుష్యులు నిలబడి ఉన్నారు. దాని దారిన అది, దానితోపాటు దానిమీద మనుష్యులూ, ముందుకు సాగిపోతున్నారు. ఇది లోపలినించి ఎక్కడనుంచి వస్తోందో, దానికీ అంతు ఉందో, లేదో, తెలియదు. నేను ఈ ఆలోచనలో వుండగా నా పక్కనున్నతను నాచెయ్యి పట్టుకుని, తనతోపాటు నన్ను కూడా దానిమీదకు లాగాడు. అతను మేకులా, అలాగే నిలబడ్డాడుగాని, నేను మట్టుకు వెనక్కుపడబోయాను. అతను నావీపు వెనక చెయ్యి అసరాయిచ్చి నేను పడిపోకుండా అపు చేశాడు. మేము నిలబడ్డది కదిలే ప్లాట్‌ఫారం. అది ముందుకు సాగుతూనే వుంది. అది చాలా చిత్రంగా కనపడ్డది. ఇలా కొంతదూరం వెళ్ళిన తరువాత ఎదట మేడమెట్లులాకనపడ్డాయి. దానిమీదకు కూడా, ఇది పరుగెడుతూనే వుంది. జనం పడకుండా అలా నిలబడే వున్నారు. వాళ్ళు పడకుండా ఎలా ఆగారా అని ఆలోచిస్తోంటే, మేము నిలుచున్న భాగం కూడా, మొదటి మెట్టు ఎక్కడం. నేను వెనక్కుపడిపోబోవడం, మళ్ళీ ఆయన ఆసరాతో నిలబడ్డం. మేడమెట్లు ఎక్కినట్లు నన్ను కూడా ఎక్కమని తనెక్కుతూ చెప్పడం, తగుదునమ్మా అని నేనా

విద్య నేర్చుకుని, క్షణంలో ఆమెట్లు ఏ ప్రమాదం లేకుండా ఎక్కడం, అన్నీ రెప్పపాటులో జరిగిపోయినాయి. మరికొంత దూరం సాదా ప్రదేశం మీద నుంచి ఇది నడుస్తుండగా, నా స్నేహితుడు పక్కకు తప్పుకుంటూ నన్ను కూడా తనతోపాటు పక్కకు లాగేశాడు. ఆ ప్లాట్‌ఫారం దారి దానిది అదోసెలయేరులా పోతూనేవుంది.

మేము మరో పది బారలు నడిచి, ఒక పెద్దగది దగ్గర ఆగాము. అతను తలుపు తీయగా లోపల ప్రవేశించాను. నా సామానప్పుడే అక్కడికి ఎలా చేరిందో చేరింది, అక్కడ పది మంది, బల్లల ఎదుట కుర్చీల మీద కూర్చుని, అక్కడకు వచ్చిన జనాభా సామానులు పెట్టెల్లోంచి తీయించి పరీక్షచేసి, ఓ చీటి యిచ్చి, వెలుపలకు పంపిస్తున్నారు.

నాపెట్టెలు చూడ్డానికి సిద్ధంగా ఉన్న మనిషి, నన్నెగా దిగా చూసి, నా స్నేహితుడితో అర్ధోక్తిలో "Who is this darke?" అన్నాడు. నా స్నేహితుడు "ఇష్" అని నోరు ముయ్యమన్నట్లు, పెదవుల మీద వేలు పెట్టుకుని సంజ్ఞచేశాడు. This young prince is my friend from India, come to study here" (ఈ పిల్ల జమిందారు నా స్నేహితుడు. ఇండియా నుంచి వచ్చాడు ఇక్కడ చదువుకోసం.) అని సామాను త్వరగా చూడమని సంజ్ఞచేశాడు.

వాడు పెట్టెతీసి, ఒక్కొక్క వస్తువే మునివేళ్ళతో యెత్తి దూరంగా క్రింద పడేస్తున్నాడు. నాకు చాలాకోపం వచ్చింది. నేనేదో అనబో తున్నానని నామిత్రుడు గ్రహించి, నాచెయ్యి గట్టిగా అదిమాడు, ఏమీ మాట్లాడవద్దన్నట్లు. తరువాత నా పరుపు చుట్ట విప్పాడు. అందులో నా నారింజపండు రంగు శాలువా చూసి, నిర్ఘాంతపోయి గుండెల మీద చెయ్యివేసుకుని, కళ్ళు మూసుకుని కుర్చీలో వెనక్కు జార్లపడిపోయాడు. ఇదేమిటో వాడిలా పడిపోయాడు కొంపతీసి మన కళ్ళ ఎదటనే "హరి" అనడుగదా అని హడలిపోయాను. క్షణంలో తేరుకున్నట్టు కళ్ళు తెరచి, "What is this?" (ఏమిటిది.) అన్నాడు. My shawl అన్నాడు. "your what" (నీదేమిటి?) అన్నాడు "My శాలువా" అన్నాను.

వాడెంతో జాలిగా, నాకేసి చూసి "can't you speak English my lad" (ఇంగ్లీషు మాట్లాడ లేవా నాయనా!) అన్నాడు.

నేను సమాధానం చెప్పబోతుంటే, నా మిత్రుడు "ఆయన ఇంగ్లీషు మాట్లాడ లేక పోవడ మేమిటి? చాలా చక్కగా మాట్లాడుతాడు. రైల్లో

దారి పొడుగునా నాతో మాట్లాడుతూనే ఉన్నాడు. ఇది వాళ్ళ దేశంలో ఉపయోగించే రగ్గు" అన్నాడు అక్కడ ఉన్న ఆసామీ "ఓహో అలాగా, చాలా బాగుంది. పోనీ ఇది అమ్ముతాడేమో కనుక్కో" అని అడగగా నా స్నేహితుడు "ఇంకచాల్లే ఊరుకో" అన్నట్టు సంజ్ఞచేశాడు. అదికాదయ్యా యీ పసివాడికి ఇది అమ్మే ఉద్దేశం ఉంటే, గవర్నమెంటుచేత కొని పించి బ్రిటిషు మ్యూజియంలో పెట్టిద్దామని గాని, నాకోసం కాదు. అతనికి లాభంగా ఉంటుంది. పోన్లే ఇంతకీ నా కెందుకు? అని తక్కిన వన్నీ కూడా చూడడం పూర్తిచేసి, ముగించబోతుంటే, నా కచికలూ, తటాకులూ ఉన్న పొట్లం వాడి కంటపడింది. అది విప్పి, "ఇదేమైన తినేదా, అన్నాడు. లేకపోతే మందా? అన్నాడు. ఇదేం విషం కాదుగదా" అన్నాడు. మావాడు విరగబడి నవ్వుతున్నాడు. పైకుబుకుతున్న, నా ఉద్రేకం తగ్గించుకుని, "అలాంటిదేం కాదు. ఈచూర్ణం నా పండ్లు తోముకోవడానికి. ఈ ఆకులు నాలుక గీసుకోడానికి అని చెప్పాను. వాడికేమీ పూర్తిగా అర్థం కాలేదు. "సరే, మీ కర్మ" అన్నట్టు గబగబా మాకు బయటకు వెళ్ళడానికి అనుమతి రాసియిచ్చి లేచిపోయాడు. నేను చచ్చినట్టు అవన్నీ మడిచి మళ్ళీ లోపల సర్దుకున్నాను.

## 2

మేము బయటికి వచ్చాము, మావెనుకనే నాసామానూ వచ్చింది. బైటికి రావడంతోటే, వీధిలో విపరీతమైన జన సమూహం అన్ని వైపులకూ ఎంతో తొందరగా. నడిచిపోతున్నారు. ట్రాము కార్లు, మోటారు. కార్లు, గుర్రంబళ్లు వేలాది సంఖ్యలో దౌడు తీస్తున్నాయి. ఇంత హడావిడి ఏమిటో ఎక్కడికి పోతున్నారో వీళ్ళంతా అనుకున్నా నొక్కమాటు. ఇక్కణ్ణించి ఎక్కడకు వెళ్ళడమా. ఇంకను ఈ కుక్ మనిషి నన్నిక్కడ విడిచిపోతాడు కాబోలు. ఎలాగా అనుకుంటూ నన్నెక్కడికేని హోటలుకి చిన్నదైతే సరిపోతుంది పంపుతావా! అన్నాను అంటే అతను "హోటలుకి వద్దు. మీకంతా కొత్తగా వుంటుంది. మీకే సలహా చెప్పేవాళ్లు వుండరు. ఇక్కడ 'ఇండియా హౌస్' అని ఒకటి గవర్నమెంటువారు ఏర్పాటుచేసిన వసతి గృహం వున్నది అందులో అందరూ మీ దేశస్థులుంటారు. నిన్నక్కడ దిగబెడతాను, అక్కడ నుండి నీ తరువాత ఏర్పాట్లు చేసుకో" అని ఓ గుర్రబ్బండి పిల్చి, నన్నందులోకి ఎక్కమని, తనూ నాతో కూర్చుని, కాయ్‌వెల్ రోడ్డుకు పోనిమ్మని *బండివానితో చెప్పి, చలిగాలి తగలకుండా

తలుపులు బిగించాడు. పావు గంటలోనో, అరగంటలోనో, ఇండియా హౌస్ దగ్గర బండి ఆగింది. మేము దిగి లోపలికి వెళ్ళాము. అక్కడున్న వసతి యజమానికి కాబోలు నా స్నేహితుడు నన్ను పరిచయంచేశాడు. నా బాధ్యత అతనికిఒప్పగించి, అతని కరచాలనం చేసి "Good bye and goodluck young man, I wish you well అని చరచరా బయటికి వెళ్ళిపోయాడు. నా సామాను లోపలికి రావడం నేను చూడనేలేదు. నా వెనుకనే వున్నది. ఆ యజమాని నన్నొకసారి నిదానంగా చూచి "ఇండియాలో ఏ ప్రాంతం నుంచి వచ్చావు" అన్నాడు. "మెడ్రాస్" అన్నాను దర్జాగా.

నన్ను కూర్చోమని సంజ్ఞ చేశాడు. నే కూర్చున్నాను. "ఇక్కడి కెందుకు వచ్చా" వన్నాడు. "ఎందుకొచ్చావేమిటి వెధవ ప్రశ్న? అంత దూరము నుంచి, తన ముఖారవిందము చూడటానికి వచ్చాననుకున్నాడు కాబోలును. నేను చదువుకోవడానికి వ చ్చాను." అన్నాను. "ఏం చదువు తావు" అన్నాడు. "చదవడానికి కేమివుంది - బారిష్టరు తప్ప మరేం చదవనని నా అభిప్రాయము." "ఈవూళ్లోనేనా?" అన్నాడు. "బహుశా ఎడింబరో అనుకుంటున్నాను" అన్నాను. "అయితే ఇక్కడ ఎన్నాళ్ళుం టావు" అన్నాడు. "ఒక్కరోజుకంటే తప్పితే రెండు రోజులుకంటే ఉండ నన్నాను" "నీవు భోజనము చెయ్యలేదు కదా!" అన్నాడు "లే"దన్నాను. అయితే "నీవు భోజనాల గదిలోకి వెళ్ళి అక్కడ భోంచెయ్యి. ఈ లోపున నీకు గది ఏర్పాటు చేస్తాను" అన్నాడు.

భోజనాల గది ఎక్కడ వున్నదా అని నేను ఆలోచించే లోపున నా ఊహ కనిపెట్టినట్టు ఆ క్షణంలోనే అక్కడకు వచ్చిన, ఒక మనిషిని చూపించి "ఇతను నిన్నక్కడకు తీసుకువెడతాడు. నీవు భోజనానికి ఏమి కావలెనో చెప్పితే ఏర్పాటు చేస్తాడు." అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఈ కొత్త మనిషి - అక్కడ నౌకరు కాబోలు నన్నెంతో గౌర వంతో లోపలికి తీసుకు వెళ్ళాడు. అదొక పెద్ద గది. ఎంతో విశాలంగా వుంది. గదిమధ్యను నిలువునా ఈ చివరి నుంచి ఆ చివరి వరకు పెద్ద బల్ల, దాని చుట్టూ కుర్చీలూ, అప్పుడే భోజనాలు చేసి ఒక పంక్తి లేచింది కాబోలు బల్లనిండా పళ్ళాలు, వాటినిండా భుక్తశేషం. మంచినీళ్ళగ్లాసులు, చెంచాలు, కత్తులు వగైరా సామాగ్రి అంతా పరచి వున్నాయి. కొందరు యువకులు మగవాళ్లు అక్కడే గుంపులు గుంపులుగా నిలబడి మాట్లాడుకుంటున్నారు. వాళ్ళందరూ ఒక్కసారి నాకేసి తిరిగి, నన్నోకొత్త జంతువును చూసినట్లు చూశారు. వారప్పటికే పెద్ద నాగరి

కులైనట్లూ, నేనో పల్లెటూరి బచ్చా నైనట్లూ! ఒక్కరూ నా దగ్గరకు రాలేదు. ఒక్కరూ నన్ను పలకరించలేదు. ఏమిటీ వాళ్ళవింత ప్రవర్తన, కొత్తవాడు కనపడటంతోటే, మీదే వూరు ఎందాకా వెడతారు. ఏం పని మీద వెడుతున్నారు. పొద్దు పోయినట్టుంది. మీరిక్కడ భోంచేసి వెళ్ళండి అంటూ ఏదో ఆ కొత్త మనిషిని పలకరించి, పరిచయం చేసుకొని, అతనికేమీ ఇబ్బందిలేకుండా పంపించడం మన సంప్రదాయం కదా. ఇదే మిటి? వీళ్లందరికీ ఒక్క మాటు వాగ్బంధనం అయినట్లు. ఒక్కడూ మాట్లాడడేమి? పలుకరిస్తే ముత్యాలు రాలిపోతాయా? పరాయి మనిషితో మాట్లాడితేనే, గౌరవ భంగమని. నేనేమైనా తమరిని అడుగుతానా? ఏ సహాయమేనా అర్థిస్తానేమోనని భయమా? ఏమిటో నా కంతా వింతగా వుంది.

ఇంతలో నన్ను లోపలకు తీసుకు వచ్చినమనిషి అక్కడ బల్లపై సామానులు కొన్ని తప్పించి, ఖాళీ చేసి నన్ను దయచేసి అక్కడ కూర్చీ మీద కూర్చోమన్నాడు. "తమకేం కావాలి?" అని అడిగాడు. ఇంతలో, అక్కడ వున్న సమూహంలో ఒక పెద్దమనిషి నామీద దయదలిచి కాబోలు నెమ్మదిగా నా దగ్గరికి వచ్చి నా ప్రక్కన కూర్చుని "మీరు ఎక్కడనించి వచ్చారు? ఈ వూరు ఎప్పుడు వచ్చారు?" అన్నాడు. "నేను మద్రాసులో గోదావరిజిల్లానుంచి వచ్చాను. నేను తెలుగువాడిని" ఆ మాటలువిని అక్కడ సమూహంలో వున్న మరొకతన్ని పిలిచి, మీ జిల్లా నుంచి వచ్చాడయ్య ఈయన పాపం అతనికేం కావాలో కనుక్కుంటావా? "అన్నాడు. నేనా యన ఎవరో ఎరుగను. ఎప్పుడూ చూడలేదు. నాకెవరూ పరిచయమూ చేయలేదు. నేనెలా మాట్లాడను." అన్నాడు.. నా పక్క నున్న పెద్దమ నిషి నవ్వుకుని "అవును నిజమే సుమా - నాకు ఎవ్వరూ పరిచయం చెయ్యకపోయినా, నేను మరిచిపోయి మాట్లాడేస్తున్నాను. అయినా పాపం ఈయనేమీ అనుకోలేదు." అంటూండగా, అవతల పెద్దమనిషి గబుక్కున తిరిగి వెళ్ళిపోయాడు.

నా పక్కనున్న పెద్దమనిషి - అయ్యా మీరేమి తీసుకుంటారు. మీరు శాకాహారులా? మాంసాహారులా? అన్నాడు. "నేను కేవం శాకాహారిని అన్నాను. నన్ను లోపలికి తీసుకు వచ్చి, వెనుకనే నిలబడి వున్న నౌకరుతో, నాకు శాకాహార భోజనం ఏర్పాటు చెయ్యమనిచెప్పాడు. అతను కొంచెం అన్నం, కొంచం కూరలాంటిది తీసుక వచ్చి, పెట్టాడు. తరువాతను కొంత రొట్టె, వెన్న ఏదో జామ్మట అది పెట్టాడు. ఆకలిమీద ఉన్నాను గనుకను,

ఆకలి రుచి ఎరగదన్నట్లు, మాట్లాడకుండా రెండు ముద్దల్లో, అదంతా ఊదేశాను.



తరువాత పుడ్డింగుట సగ్గుబియ్యం పరవాన్నం - గట్టిగా ముద్దలా వున్నది తీసుకు వచ్చి, ధానిలో పోసుకోడానికి వేడిపాలూ, కొంత పంచ దార కూడా తీసుకవచ్చి అక్కడ పెట్టాడు, అదీ తీసుకుని లేచాను, నా గదికి తీసుకు వెడతానన్నాడా నౌకరు. రేప్పొద్దున మిమ్మల్ని కలుసు కుంటాను. మీకేమైనా సలహా కావలిస్తే చెపుతాను. అన్నాడు మా నూతన పరిచయస్థుడు, తనపేరు మీనన్ అని చెప్పాడు. "గుడ్‌నైట్" అని చక్కాపోయాడు.

నౌకరు నన్నొక చిన్న గదిలో ప్రవేశపెట్టి, నాకు కావలసిన సదు

పాయాలన్నీ ఏర్పాటుచేసి "గుడ్‌నైట్ సర్" సౌండ్‌స్లీప్ అని చెప్పి చక్కాపోయాడు.

నా సామాను అదివరకే గదిలోకి వచ్చివుంది. నేను మంచం మీద కూర్చుని కోటు తీసేసి, నెమ్మదిగా బూట్లు, మేజోళ్లు విప్పుకుంటూంటే, అప్పుడు హటాత్తుగా భోజనం ముందు కాళ్ళూ, చేతులూ కడుక్కోలేదన్న విషయం స్ఫురణకు వచ్చింది. ఈ దేశంలో ఉన్నప్పుడు ఆచారం పాటిం చవలసిన అవసరం ఉండదు కాబోలనుకున్నాను. కాళ్ళూచేతులూ కడు క్కోకుండా "ఆ మూల గుడ్డలతోటే, తింటావా ఏమిట్రా" అన్న మా అమ్మ మందలింపులు జ్ఞాపకానికి వచ్చాయి. నా షరాయి కూడా విడిచి పంచెకట్టుకుని మంచం మీద వెన్ను వాల్చాను. ఇంక భవిష్యత్తేమిటి? అని అనుకుంటూ ఉన్న ఉత్తర క్షణములోనే నిద్రాదేవి నన్నావహించింది.

ఇంటి దగ్గర అలవాటు చొప్పున ఉదయాన్నే అనగా, ఆరుగంటల లోపుననే మెలకువ వచ్చింది. లేచి కిటికీ తెర తొలగించి, గాజుతలుపులలో నుంచి బయటికి చూస్తే అంతా అంధకారంగా ఉంది. ఈ వసతి గృహంలో కూడా సంచలనము అట్టే ఉన్నట్టు కనపడలేదు.

ఈ మేడలూ, ఇక్కడ కట్టుబడి, ప్రతి చోటా యీ కుర్చీలూ, సోఫాలూ, నడవడానికి నేలమీద తివాసీలూ, అన్నీ చూస్తుంటే, చాలా ఆశ్చర్యమని పించింది. నేను పుట్టిన తరువాత ఇన్ని సంవత్సరాలలోనూ, ఎక్కడా ఇటువంటివి చూడలేదు. ప్రతీ తలుపుకీ, కిటికీలకూ కూడా అందమైన బోలెడంత ఖరీదైన తెరలు కూడాను.

ఎందుకో, వాటి ఉపయోగ మేమిటో నాకేమీ అర్థం కాలేదు. హాయిగా గాలి చొరకుండా, ఊపిరాడకుండా ఇంత బందోబస్తు ఎందుకో ఊహించ లేక పోతున్నాను. తరువాత ఫ్రాన్సులోనూ, ఇక్కడా కూడా ఇళ్ళకూ, షాపులకూ, అన్నిటికీ కూడా అద్దపు తలుపులే. వాళ్ళకిక్కడ దొంగల భయము వుండదు కాబోలు. తమాషాకు ఇళ్ళమీద రాళ్ళు విసిరే, అల్లరిపి ల్లలు ఉండరు కాబోలు ననుకున్నాను. ఇలా ఆలోచిస్తూ, మళ్ళీ కాసేపు మంచం మీద పడుకున్నాను. ఇంకా ఇంత చీకటేమిటి? తెల్లవారక పోవడము ఏమిటి? సూర్యుడేమన్నా లేవడం మరచిపోయాడా? ఇక్కడ జనం అంతా లేవడం ఎప్పుడు? మొహాలు కడుక్కోవడం, వగైరా నిత్యకృ త్యాలన్నీ ఎప్పుడు? వాళ్ళ పని పాటలు చూచుకోవడం ఎప్పుడు? ఆడా, మగా కూడా బారెడు ప్రొద్దెక్కిన తరువాత లేస్తే వంటా, వార్పూ ఎప్పుడూ? అనుకుంటూ ఆలోచిస్తూంటే, మళ్ళీ ఓ మబ్బుతెర వచ్చింది.

కునుకు పట్టింది. మరో గంటవరకూ మెలకువ రాలేదు.

అప్పుడు లేచి తొందరగా ముఖం కడుక్కుందాం అనుకుంటే ఎక్కడికి వెళ్ళాలో తెలియలేదు. తలుపుతీసి చూస్తే, బయట ఎవరూ కనబడ లేదు. మళ్ళీ లోపలకు వెళ్ళి ఎలాగా అని ఆలోచిస్తుంటే గోడమీద ఒక చోట "Press Button - Servant" అని ఉన్నది. ఇదేమిటో చూద్దామని వాళ్ళు వ్రాసినట్లుగానే ఆ బొత్తాము నొక్కాను. ఉత్తరక్షణములో గాలిలో నుంచి వచ్చినట్లు ఒక మనిషి తలుపు తీసుకుని లోపలకు వచ్చాడు. వాడి వేషం, నిలబడ్డ రీవి అన్నీ చూస్తూ వీడెవడేనా పెద్ద ఉద్యోగా? అనుకున్నాను. వాడికేసి తెల్లబోయి చూస్తుంటే వాడే కొంచెం ముందుకు శిరస్సు వంచి చిరునవ్వు నవ్వుతూ "గుడ్ మార్నింగ్ సర్, హేడ్ సౌండ్ స్లీప్?" అన్నాడు. తరువాత అరి వాడిల్లు బంగారంగాను అందులోనూ పెద్ద ఉద్యోగిలా వేషం వేసుకొని కూడాను, అనుకుని ఆశ్చర్యంతో ఏమి చెప్పాలో! అని ఆలోచిస్తూంటే, మళ్ళీ వాడే "వాట్ కెనైడూ ఫర్ యూ సర్" అన్నాడు. అప్పటికి నా మందబుద్ధికి వాడు నౌకరు కాబోలు అని తోచింది. ఆ గోడమీద కూడా "ప్రెస్ బటన్ - సర్వెంట్ అన్న వ్రాత" జ్ఞాపకం వచ్చింది.

అప్పుడు నేనూ దర్జాగా లేచి నుంచుని - వాళ్ళ దేశాచారంగదా, అని కరచాలనానికి చెయ్యి జాపాను. వాడు నవ్వుకుంటూ, "థాంక్ యూ సార్" అని నా చెయ్యి ముట్టీ ముట్టనట్టు అందుకుని విడిచి పెట్టాడు. ' I want to - Lavatory where, అన్నాను. "Oh this way sir" అని రాజుముందు నౌఖరులా నడుస్తూ ప్రక్కనున్న గదికి దారితీశాడు. తలుపు తీసి "you can wash - here sir" అని గోడనున్న ఒక పింగాణీ పళ్ళెం, అందులోకి వున్న కుళాయీ, చూపించాడు. ఓ పెద్ద పింగాణీ తొట్టి చూపించి, "you can have your bath here sir - hot or cold" అని అందులోకి ఉన్న రెండు కుళాయిలూ, ఒక్కమాటు తిప్పి చూపించాడు. ఒకదాంట్లో నుంచి పొగలు చిమ్ముతూ వేడినీళ్ళూ, రెండో దాంట్లోనుంచి జివ్వుమనే చల్లని నీళ్ళూ వచ్చాయి. తరువాతను పక్కనున్న ఇంకొక గోడను చూపించి "Meet you later sir" అని చక్కాపోయాడు. ఏది చూచినా అంతా వింతగానే కనపడింది. మన దేశానికీ, ఈ దేశానికీ ఏ విషయములోనూ సాపత్యము కనబడలేదు. ఆ గదిలో నా కాలకృత్యాలు తీర్చుకోవడానికి ఎంతసేపు పట్టిందో, ఎలా తెములుచ్చుకుని బయటపడ్డానో, చెప్పుకుంటూ పోతే, చాలాసేపు పట్టడం, కొంచెం విసుగుదలగా ఉండడం తప్ప మరేమీ ప్రయోజనం ఉండదుగదా! కానీ, ఒక్క మాట మట్టుకు

చెప్పక తప్పదు, ఏదయినా, కొత్త పద్ధతులు కనపడ్డప్పుడు వాటి సంగతి సందర్భాలు, మంచి చెడ్డలూ, ఉపయోగాలూ, ఇట్టే ఊహించుకుని ఉపయోగించ గలిగేవాళ్ళు తప్ప, తక్కిన వాళ్ళకు అనగా - సామాన్యులకు ఇదో పరీక్షా సమయమే అవుతుంది. చాలా ఇబ్బంది పడతారు.

ఇంకొక్క సంగతి ఇక్కడ చెప్పాలి. నేను ముందు నా గదిలోకి వెళ్ళి తువ్వాలు అదీ తెచ్చుకోవాలనుకున్నాను. ఇంతలోకే ఎదురుగుండా వున్న చాకలి తెచ్చిన తువ్వాలుమడత, సబ్బు, కనబడితే ఇవెందుకున్నాయి ఇక్కడ? మన కోసమేనా? నాకోసమే అయితే, నా ఒక్కడికే యీ మర్యాద చూపించారా? లేక కొత్తగా వచ్చిన ప్రతి వాళ్ళకూ తలొక తువ్వాలూ వాళ్ళే ఇస్తుంటారా? అనే సందేహం కలక్కపోలేదు. అయినా, మల్లె పువ్వులా ఉన్న ఆ తవ్వాలు చూచి విడవబుద్ధి కాలేదు. ముందు ఉపయోగించుకొంటే నా సందేహం తరవాత తీర్చుకోవచ్చు ననుకున్నాను. గదిలోకి వచ్చిన తరువాత కూడా ప్రతిచోటా పరుపులూ, దిండ్లూ, దుప్పట్లూ అన్నీ వాళ్లే అందించడం నా పక్క వేసుకోవలసిన అవసరం లేకపోవడం స్ఫురణకు వచ్చింది.

ఇంతలోనే తలుపు మీద ఎవరో కొట్టిన శబ్దం అయింది. తలుపు తీశాను ఇంతక్రితం వచ్చిన నౌఖరే ఒక పెద్దపళ్ళెంలో టీ, కొన్ని రొట్టె ముక్కలు, వెన్న, పంచదార, పాలు వగైరా తీసుకువచ్చి బల్లమీద పెట్టి నిశ్శబ్దంగా నిష్క్రమించాడు, ఏమిటీ మర్యాద? ఈ రాజలాంఛనాలు? అనుకుంటూ ఫలహారం చేసి ఇకనేమిటి చెయ్యడము, ఎక్కడికి వెళ్ళడము, ఎవరిని అడిగి తెలుసుకోవడము, అని ఆలోచిస్తూ కూర్చుండగా కొంత సేపటికి రాత్రి నాకు పరిచయమైన మీనన్ అనే పెద్దమనిషి నెమ్మదిగా పై నుంచి తలుపు కొట్టి నేను తలుపు తియ్యగానే, నవ్వుతూ లోపలకువచ్చి "గుడ్ మార్నింగ్ సర్, రాత్రి సుఖంగా నిద్రపోయారా! ప్రొద్దున్న టీ వగైరా అందినాయా?" నేను సమాధానం చెప్పకుండటానే అదిగో అన్నీ అయినట్టున్నాయే!" అన్నాడు బల్లమీద వున్న టీ కప్పు వగైరా సామగ్రి చూచి.

నన్నొకసారి వూళ్ళోకి తీసుకువెళ్ళి ఊరు చూపిస్తారా! అని అడుగుదామనుకుంటూ వుంటే తనే "మీరీ వేళ ఉంటారు కదా ఇక్కడ? ఏం చేస్తారు? మీరెక్కడికేనా వెళ్ళవలె ననుకుంటున్నారా! లేకపోతే, నాతోవస్తే ఒక్క సారి ఊళ్ళో తిప్పి తీసుకువస్తాను. కొంత ఉత్సాహంగా ఉంటుంది మీకు" అన్నాడు.

నా ఊహ ఇట్టే కనిపెట్టినట్లు అన్న ఈ మాటలకు ఎంతో సంతోషించి "మీరు చాలా మంచివారండీ. నేనే మిమ్మల్నే ఒకసారి ఊళ్ళోకి తీసుకవెళ్ళమని అడుగుదామనుకుంటున్నాను. నా ఊహ మీరు గ్రహించినట్లు, మీరే తీసుకు వెడతామంటున్నారు. చాలా సంతోషం - అయితే వెంటనే బయలు దేరుదామా" అన్నాను. "లేవండి వెడదాం - మీరొక మాటు తలదువ్వుకోండి, మనం ముందు భోజనాల హాలులోకి వెళ్ళి అక్కడ కొంచెం ఫలహారం చేసి, బయటకు పోదాం" అన్నాడు.

"ఫలహారం ఇప్పుడయింది కదా" అన్నాను అబ్బే ఇది చాలదు లెండి - ఇది ఊరికే మన దినచర్యకి ఉత్సాహం కల్పించడం వరకే దాని ప్రయోజనం మరికొంత ఘనంగా, పూటుగా కడుపులో పడితేనే తప్ప, మధ్యాహ్నం మళ్ళీ ఒంటిగంట వరకూ మన బండి నడవదు అంటూ నన్ను భోజనాల హాలులోకి తీసుకు వెళ్ళాడు.

రాత్రి చూచిన హాలే అది. బల్లనిండా పళ్ళాలూ, సాసర్లూ, కత్తులూ, కరార్లూ వగైరా సామానులన్నీ అమర్చివున్నాయి. కొంతమంది అప్పుడే ఫలహారాలు చేస్తున్నారు. నిన్న రాత్రి కనబడ్డ తెలుగు ఆయన మమ్మల్ని చూసి "గుడ్ మార్నింగ్" అని తలవూచి తన ఫలహారంలో నిమగ్నుడయ్యాడు.

# 3

ఖాళీగా వున్నచోట మేమిద్దరం కూర్చున్నాము. "మీరు బ్రాహ్మణులు కదా!" అన్నాడు మీనన్. వాడెలా తెలుసుకున్నాడా! అని అనుకుంటూంటే "మీరు శాకాహారి కదా? అందుకడిగాను" నా సమాధానం వినకుండానే మా వెనక నిలబడ్డ నౌకరుతో నాకు శాకాహారం, తనకు మామూలువీ ఇమ్మని చెప్పాడు. అతను వెంటనే, నాకో పళ్ళెం నిండా చక్కని జావలాటి పదార్థం, పాలూ, పంచదారా, రొట్టె, వెన్నా వగైరాలు అమర్చాడు. మీనన్‌కు మరొకటేదో పెట్టాడు. ఒక్కక్షణం ఇటువంటి వస్తువులు తినేవాడి పక్కన కూర్చుని ఆ వాసన భరిస్తూ నేను భోజనం చెయ్యవలసి వచ్చిందే అని, అదోలా అనిపించింది. ఈ సంగతి మా అమ్మకీ, నాన్నకీ తెలుస్తే వాళ్ళేమంటారా, అని ఆలోచిస్తూండగా, మీనన్ వెంటనే "కానివ్వండి త్వరగా బయటకు పోదాం." అని హెచ్చరించాడు. మేము ఉభయులమూ మా ఫలహారం ముగించి, బయట పడ్డాము.

వీధిలో అడుగు పెట్టడంతోటే, అప్పటికి పది గంటలేనా కాకపోయినా వీధినిండా, గబగబ నడిచివెళ్ళే జనం, గుర్రపు బళ్ళూ, మోటారు కారులూ, ట్రాంకారులూ కనబడ్డాయి. ఎంతో సందడీ, హడావిడీని.

ఇక్కడ రోడ్లు మామూలు చదునుగా కాకుండా ఇటికల లాటి రాళ్ళతో తాపటం చెయ్యబడి ఉన్నాయి. అందుచేత బండి గుర్రాల డెక్కల చప్పుళ్ళూ, ట్రాంకార్ల చప్పుళ్ళూ, విశేషంగా చెవులు తడికలు కట్టేటట్టు వినిపించినాయి. నా స్నేహితుడు నాకేసి చూచి, నా ఊహ గ్రహించి నట్లు - రెండు మూడు రోజులుంటే ఈ ధ్వనికి మీరూ అలవాటు పడతారులెండి. అన్నాడు నెమ్మదిగా, ఓ ట్రాము దగ్గరకు తీసుకువెళ్ళి ఎక్కించాడు. అక్కడనుంచి, లండను నగర సందర్శనం ప్రారంభించాము.

ఎటు చూసినా నాలుగంతస్తులకు తక్కువలేని మేడలూ, వాటన్నిటికీ వీధివైపు కిటికీలకు పెద్దపెద్ద అద్దాల తలుపులూ, వాటి వెనుక తెరలు, అందులోంచి తొంగిచూసే జనమూ, కింద భాగాల్లో చాలావరకూ పెద్ద పెద్ద దుకాణాలూ, రోడ్డు కిరువైపులా ఉన్న చప్టాలమీద గబగబా నడిచి వెళ్ళే స్త్రీ పురుష సందోహం చూస్తూంటే అదో తమాషాగా వుంది, ఆడా, మగా అందరూ కూడా కాళ్ళకు బూట్లు తొడుక్కున్నవాళ్ళే. అందరికి ఒకటే హడావిడి తెల్లవారే సరికి. ఇన్ని వేల జనం, ఇంత హడావిడిగా ఎక్కడికి పోతుంటారా? అనుకుంటూ కూర్చున్నాను. పక్కనున్న స్నేహితుడు ఏవేవో చెబుతూనే వున్నాడు. కొన్ని తలకు తగులుతున్నాయి. కొన్ని తగలడం లేదు.

ఇంతలో ఊరి మధ్యనుంచి ప్రవహిస్తున్న నదీ దాని మీద వంతెనా కనబడ్డాయి. 'చూడు, చూడు ఇదే థేమ్సునది' అన్నాడు నా స్నేహితుడు. ఈ వంతెనే వాటర్ లూ బ్రిడ్జి అన్నాడు. చాలా చరిత్ర ప్రసిద్ధమైనది. ఆ పక్కనున్నవి చిత్రంగా కనబడ్డ పెద్ద భవనం పార్లమెంటు హౌస్ అన్నాడు. ట్రాములో కూర్చుని చూసినా ఎంతో బ్రహ్మాండంగా కనబడ్డది. నది, మన గోదావరిలా పెద్దది కాకపోయినా. ఎంతో ప్రముఖమైనదనీ, ఈ నదీ ముఖంలోనుంచి ప్రపంచవ్యాప్తంగా అందులో ముఖ్యంగా మన దేశానికి మన నిత్యావసరానికి సమస్త సామాగ్రి ఎగుమతి అవుతూ వుంటుందని నామిత్రుడు చెప్పకుపోతున్నాడు. ఈనదీ, నదిలో ఓడలూ పక్కనున్న పార్లమెంట్ హౌసూ, ఇవన్నీ చిన్నప్పుడు జాగ్రఫీలో చూచిన బొమ్మల్లాగానే వున్నాయి. ఏమీ తేడాలేదు. అతను చెప్పకపోతే, నేనే అడిగేవాడిని. ఇది పార్లమెంటు కాదా అని ఇంకా అతనేదో చెప్పకు పోతున్నాడు. నా ఊహ

ఎక్కడికో పోయింది. వర్తమానం దాటి వెనకటి కెక్కడికో ఏ కాలంలోకో "ఇవన్నీ నేనిదివరకూ చూచాననే, నేనిక్కడచాలాసార్లు తిరిగాననే భావం కలిగింది. ఇలాగనే ఫ్రాన్సులో కూడా ఒక్కసారి ఆ వూహవచ్చింది. మా మిత్రుడు చెబుతున్నదేదీ వినపడడంలేదు. నా స్మృతి గతములోకి ఎక్కడకో పోయింది.



నేను నిజంగా ఎప్పుడేనా పూర్వజన్మలో ఇక్కడకు వచ్చానా? అనిపించిందికూడాను. నాస్నేహితుడు తను చెప్పేది నేను వినడంలేదని. తెలుసుకుని కాబోలు నా భుజంమీద చెయ్యివేసి, ఏమండి నిద్రపోతున్నారా! ఏమైనా కలలు కంటున్నారా?" అన్నాడు నవ్వుతూ "కలలేనండీ మేలుకొని వుండగానే నా వూహ దేశమూ, కాలమూ, దాటి ఎక్కడికో తీసుకుపోతున్నది. నేనిదివరకు వీటినన్నటినీ చూచిన భావన కలుగుతోంది. చాలా చిత్రముగా వుంది" అన్నాను. నా మిత్రుడు ఒక్కసారి నామొఖం

కేసి దీర్ఘంగా చూచి, రెండు నిముషముల వరకూ ఏమి మాట్లాడలేదు. ఇలాగ సుమారు ఒంటి గంట వరకూ ట్రాములో కూర్చునే ఎన్నో భవనాలు చూచాము. కొన్ని నాటకశాలలు చూశాము. కొన్ని ప్రసిద్ధమైన చర్చీలు చూశాము. కాని, ఎక్కడా దిగడానికి, ఏదీ పరిక్షగా చూడటానికి వీలు కాలేదు ఒకటొకటే సావకాశంగా చూడాలంటే కొన్ని మాసములుపడుతుంది సుమండీ అని నా స్నేహితుడు చెప్పాడు. అందుచే తను అంతటితో తృప్తిపడక తప్పిందికాదు.

ఒంటి గంట ఎక్కడో కొట్టింది. ఇంకను మనం దిగుదామని నా స్నేహితుడు చెప్పి, నన్ను కిందకు తీసుకువెళ్ళాడు.

"మీకేమన్నా - ప్రయాసగా వుందా? ఇక్కడెక్కడేనా లఘువుగా భోజనం చేసి మళ్ళీ తిరుగుదామా? లేకపోతే మన బసకు వెళ్ళి అక్కడ భోజనం చేసి కొంచం విశ్రమించి మళ్ళీ వూరు మీద పడదామా!" అన్నాడు నవ్వుతూ.

ట్రాములో కూర్చున్నాము కదా ఉదయం నుంచీ శ్రమేమున్నది. ఇక్కడెక్కడేనా మీరన్నట్లు భోజనం చేసి మళ్ళీ మన చాంద్రాయణం సాగిద్దాము. రేపెలాగూ నేను వెళ్ళవలె ననుకుంటున్నాను అన్నాను. "సరే రండి అయితేను" అని ఒక చిన్న హోటలుకి దారితీశాము.

మేము వెళ్ళేటప్పటికి కొన్ని వేలమంది ఆ చిన్న హోటల్లో కూర్చున్నట్టు అనిపించింది. ఇంత చిన్నహోటలు అయినా ఇక్కడికి ఇంత మంది వస్తున్నారంటే ఇదొక రకంగా మంచి హోటలే అయివుండాలి అనుకున్నాను. మేము గది నాలుగు మూలలూ తిరిగి ఓ రెండు కుర్చీలు సంపాదించ గలిగాము. మేము కుర్చీల మీద పూర్తిగా కూర్చోకుండానే ఒక నౌకరు వచ్చి నాటి వంటకాలు వ్రాసి ఉన్న కార్డు ఒకటి నా స్నేహితుడి చేతికి అందించాడు. అతను తీసుకుని, తనకు కావలసినది ఏదో పురమాయించి నేను శాకహారిననీ, నా కనుకూలమైన వేవో తీసుకురమ్మనమనీ చెప్పాడు. "ఆ కార్డేమి"టని మా స్నేహితుడిని అడిగాను. అంటే "ప్రతి హోటల్లోనూ అక్కడ లభ్యమయ్యే భోజన పదార్థాల జాబితా ఒకటి అచ్చు వేయించి వుంచుతారని, అక్కడకు వచ్చిన అతిధులకు అందిస్తే, వారికి కావలసినవి చెప్పి తెప్పించుకోవడానికి వీలుగా వుంటుందనీ ఇక్కడీ ఏర్పాటు చేశారనీ, ఏ హోటల్లోనయినా ఇదే పద్ధతనీ చెప్పాడు. మదరాసు హోటల్లో ఏమున్నాయని మనము అడగడమూ, ఇడ్లీ సాంబార్, వడై అని ఎదో పెద్ద గొంతుకతో ఏకరువు పెట్టడం, వన్నీ మనకు వినపడక

ఏవో ఒకటి తెప్పించుకోవడం. తిన్న తరువాతను ఎంతయిందీ మనతో చెప్పకుండా వెనకాలే అంజే కాలణా" అని కేక వెయ్యడడం జ్ఞాపకము వచ్చి ఈ యేర్పాటు చాలా బాగున్నదని అనుకుంటూండగా, మా స్నేహితుడి ఎదుట ఒక ప్లేటూ, నా ఎదుట ఒక ప్లేటూ తీసుకువచ్చి ఆ నౌకరు ఉంచాడు. నా ప్లేటు చూసేటప్పటికి నా కంటికి - పొరపాటు - గుప్పున వాసన నా ముక్కుకు తగిలింది. చూసేటప్పటికి చక్కగా పచనమైన మత్స్యావతారము కనబడింది. ఇహను వరసాగ్గా దశావతారాలూ తెస్తాడా యేమిటా అని భయపడుతూ "ఇదేమిట" న్నాను. "చేపండీ" అన్నాడు నౌకరు. "నేను శాకాహారిని కదా?" అన్నాను. "మరి ఇది కూడా శాకాహారము కాదా?" అన్నాడు వాడు. 'ఇది శాకాహారమేమిటి' అన్నాను. "కాదండి సార్ దాన్ని చంపుతే ఎఱ్ఱని రక్తంరాదు. ఎఱ్ఱని రక్తం కార్చే జంతువు మాంసమే మాంసాహారమవుతుందని" నిర్వచనం చేశాడు. అయినా సరే, ఇది నాకు పనికిరాదన్నాను. వెంటనే వాడది తీసుకవెళ్ళి ఉడకబెట్టిన కోడిగ్రుడ్డో, బాతుగ్రుడ్డో తీసుకువచ్చాడు. "ఇదేమిటోయి ఈ గాడిద గుడ్డు?" అన్నాను. వాడికి అదేమిటో అర్థంకాక "కోడిగుడ్డండి" అన్నాడు.



"ఇది శాకాహారమేనా యేమిటి?" అన్నాను. "ఔనండి, అందు లోనూ చాలా ప్రశస్తమైనది" అన్నాడు. "ఇదీ నాకు వ"ద్దాను.

"మరింకా శాకాహార మంటే ఏమిటండీ సార్" అన్నాడు.

"చేపా పనికిరాక, గ్రుడ్డూ తినక మరింకేం తింటారండి సార్" అన్నాడు. అప్పుడు మా స్నేహితుడు కలుగజేసుకుని "వారికి కొంచెం అన్నం బంగాళా దుంపకాని, కాబేజీకాని, అలాంటిదేదైనా మరొకటి తీసు కురా" అన్నాడు. ఆ మాటలు విని వాడు నిర్ఘాంతపోయి ఇలాటిది తిని వీళ్ళెలా బ్రతుకుతారా, అనుకున్నాడు కాబోలు నాకేసి ఒకసారి జాలిగా చూసి "ఈ వరసేమీ బాగాలేద"న్నట్లు తల ఇటూ, అటూ వూపి, రెండు నిముషాలలో ఒక ప్లేటులో గుప్పెడు అన్నమూ ఇంకో రెండు ప్లేట్లలో రెండు కూరలూ, తీసుక వచ్చి నా ఎదుట పెట్టాడు. బ్రతుకు జీవుడా అనుకుని "కాలే కడుపుకి దక్కిందే కబళం" అన్నట్లు అదితిన్నాను. వెంటనే ఆ ప్లేటు తీసుకుపోయి యింకొక ప్లేటులో చిక్కని సగ్గుబియ్యం పరమాన్నమూ పాలూ, తీసుకు వచ్చి మా కుభయులకూ అందించాడు. పోనీ యిదేనా హితవుగా ఉన్నదనుకుని అది ముగించి, పోనీ మరో ప్లేటు తెమ్మందాం అనుకుంటూంటే, నా స్నేహితుడు నా వూహ గ్రహించి నట్టున్నాడు. అదేమీ వద్దని సంజ్ఞ చేశాడు. మా భోజనం పూర్తి అయ్యీ అవకుండాకే నౌకరు ఒక ప్లేటులో బిల్లు తీసుకు వచ్చాడు అతను బిల్లు మొత్తం చెల్లించి, అదనంగా రెండుషిల్లింగులు కాబోలు యిచ్చాడు. వాడది సంతోషముతో స్వీకరించి వెళ్ళిపోయాడు. మేము బయటకు వచ్చాము.

అక్కడనుంచి మళ్ళీ మరో ట్రాంమెక్కి నగర సంచారానికి ఉప క్రమించాము, చాలా పెద్దపెద్ద షాపులూ, వ్యాపారసంస్థలూ, పత్రికా కార్యాలయాలూ, పుస్తకాల షాపులూ, ఎన్నెన్నో కనబడ్డాయి. ఏ షాపులో చూసినా అక్కడ దొరికే వస్తువులన్నీ ఎంతో ముచ్చటగా అలంకరింపబడి వుంటాయి. కాని ఒక్కచోట మట్టుకు, చూచిన షాపు భయంకరంగానూ, జుగుప్సాకరంగానూ వుండి, కడుపులో కెలికినట్లయి, వాంతి వచ్చేటంత పనయింది. ఆషాపులో గోవుల కళేబరాలూ, గొర్రె, మేక కళేబరాలూ, పందుల కళేబరాలూ, వగైరా చర్మములు లేకుండా, కడుపుచీల్చి, లోనున్న పేగులు తీసేసి నిలువునా వేళాడుతూ కనపడ్డాయి. తలుచుకుంటే ఇప్ప టికీ నాకు ఒళ్ళు గరిపొడుస్తుంది. మాంసము తింటేమటుకు బొమికలు మెడలో వేసుకోవడము ఎందుకు అంటారు మనవాళ్ళు. అలాగ్గా, ఈ భీకర ప్రదర్శనము లేకపోతేనేమా అనుకున్నాను. ఒక్కమాటు దిగి, ఆ

దుకాణములోనికి వెళ్ళి ఆయజమానిని ఇదేంపని అని మందలిద్దామని కూడా అనుకున్నాను. సిగ్గులేదా అని నాలుగూ దులిపేద్దామనుకున్నాను. ఇంతలోకే ఆ కొట్లు దాటిపోయాయి. ఆ దృశ్యం మరుగుపడగానే, నా ఆవేశము తగ్గి అదేం మన వూరా! మన దేశమా! మనం చెబితే వాళ్ళు వింటారా? అనే ఆలోచన తోచి "నయము తొందరపడి గొడవపడ్డాను కాను" అనుకొని సంతోషించాను.

తరువాతను 'Trafalgarsquare' అని ఓ ప్రదేశం, అందులో మధ్యను నెల్సన్ శిలా ప్రతిమ చూపించాడు. ఆ తరువాతను ఏదో పికడల్లీ సర్కస్ అన్నాడు. అయితే ఇక్కడకూడా సర్కస్ కంపెనీలు ఉంటాయా అన్నాను. ఉంటే చూడవచ్చనే ఉద్దేశంతో అతను నవ్వి, "మనకు వీధిలో కనబడే జంతువులు తప్ప, మరో జంతువులుండే సర్కస్ కంపెనీలు ఏమీ లేవిక్కడ." ఈ ప్రదేశం పేరు సర్కస్ అంటారు. ఆ పేరెందుకొచ్చిందో మట్టుకు నాకు తెలియదన్నాడు.

# 4

అప్పటికి సాయంత్రం నాలుగ్గంటలవుతుంది. మళ్ళీ ఒకచోట ట్రాము దిగుదామన్నాడు. మీనన్ నన్ను దింపి, దగ్గరున్న మరో చిన్న హోటలుకు తీసుకు వెళ్ళి, అక్కడా మళ్ళీ, టీ, ఫలహారాలూ, వగైరా ఏర్పాటుచే శాడు. ఫలహారాలంటే, మనకు పకోడీలూ, పుణుకులూ, మిరాయి వుండల వంటివి లేవు. రొట్టే దానికి అనుపానం వెన్న, పండ్లతో తయారయిన అదేదో "జామ్"ట అదీ, కొన్ని తియ్యని కేకులూను, యివీ ఫలహారవ స్తువులు.

లఘువుగా ఫలహారం కానిచ్చి మళ్ళీ బయటపడ్డాము. ఈసారి ట్రాం ఎక్కకుండా కొంతదూరము షాపులకేసి చూస్తూ, ఎంతో ఆనందముతో నడిచాము. అక్కడ ఒక పిక్చర్ హౌస్ అనేది ఉన్నది. అక్కడ నా మిత్రుడు ఆగాడు. పైన పెద్దపెద్ద అట్టలమీద, చిత్రమైన స్త్రీ, పురుషుల బొమ్మలు కనబడ్డాయి. "యిదేమి"టన్నాను. "రండి లోపలకు పోదాము యిది చూపించడానికే, మిమ్మల్ని యిక్కడికి తీసుకువచ్చాను. లోపల ఒక తెర మీద కదిలే బొమ్మల నాటకం మనకు కనిపిస్తుంది. చాలా బాగుంటుంది." అని లోపలకు దారితీసి, చెరొక టిక్కెట్టుకొని, లోపలికి తీసుకువెళ్ళాడు. లోపలంతా చీకటిగా వున్నది. ఒకతను మాకు దీపము

చూపించి, మేము కూర్చోవలసిన చోటు చూపించాడు, మేము కూర్చు న్నాము. మా ప్రక్కన ఎవరున్నారో, లోపల ఎంతమంది వున్నారో ఏమీ కనపడలేదు. మాకు ఎదురుగా ఒక పెద్ద తెర తెల్లనిది దానిమీదను స్త్రీ, పురుష ఛాయలు హావభావములతో కదిలిపోతున్నాయి. కొంత సేపటికి ఇది ఒక నాటకము, ఈ రూములో ప్రదర్శితమవుతున్నదని తెలుసుకున్నాను.

ఆశ్చర్యచకితుణ్ణి అయినాను. ఓ మాటా మంతీ లేకుండా, ఏ శబ్దమూ వినపడకుండా, మనిషి కనపడకుండా, ఆ మనుష్యుల నీడతోనే సుమారు రెండు గంటలసేపు మనకు నాటకము ప్రదర్శించగలిగారంటే, ఎంతో అద్భుతము అనిపించింది. ఏమనడానికి మాటలు కనబడలేదు, మధ్యను మట్టుకు ఒకటి రెండుసారులు వెలుతురు వచ్చింది. ప్రదర్శనశాల అంతా కనపడ్డది. అది చాలా పెద్దది. అధమపక్షం వెయ్యిమంది పైగా స్త్రీ పురు షాదులంతా కూర్చొని వున్నారు. ఇందులో తరతమ బేధము ఉన్నదేమో, అప్పుడు తెలియలేదు. ఇంతమందినీ ఏ అల్లరీ లేకుండా, ఈ ఛాయా నాటకం ఆకట్టుకోగలిగిందంటే, ప్రదర్శకులు ఎంత ప్రజ్ఞావంతులో అనిపిం చింది. మేము నాటకము చూడటము పూర్తికాగానే, నెమ్మదిగా లేచి, బయటకు వచ్చాము. తెరమీద ప్రదర్శన సాగుతూనే వుంది. వచ్చేవాళ్లు వస్తూనే ఉన్నారు. వెళ్లేవాళ్లు వెళుతూనే ఉన్నారు. మన వూళ్లోకి మల్లే నాటకం పూర్తికావడం, జనం పెద్దగోల చేసుకుంటూ ఒకళ్ళ నొకళ్లు తోసుకుంటూ బయటకు రావటం పద్ధతి లేదు ఇక్కడ. ఒక ప్రదర్శనం కావడం తోటే, ఆపకుండా మళ్ళీ ఒక ప్రదర్శన ప్రారంభము అవుతుంది. అందుచేత ఎవరికి తీరిక అయినప్పుడు వారు వచ్చి లోపల కూర్చొని, వారు ఏ రంగము దగ్గర నుంచి ప్రదర్శన చూశారో, మళ్ళీ ఆ రంగము వచ్చేవ రకూ కూర్చుని బయటకు వెళ్ళిపోతారు. అంతేగాని, మొదటినుంచీ మళ్ళీ చూదామని ఎవ్వరూ అక్కడ కూర్చుండిపోరు. ప్రదర్శన జరుగుతున్నం తసేపూ హాలంతా ఎంతో నిశ్శబ్దము, మన దేశములో ఇలా వుండడము సాధ్యమా! న్యాయముగా తమరు చూడడము అయిపోవడము తోటే మన వాళ్ళు బయటకు వెళ్ళిపోతారనీ, కొత్తగా వచ్చిన వాళ్ళకు చోటు ఇస్తారనీ, నేను నమ్మలేకపోయాను. వెంటనే వెళ్ళకపోతే మట్టుకు అడిగేవాడెవడు మనను! నాటకము బాగుంటే మరోమాటు చూడవచ్చుకదా! ఇంతమం దిలో మననెవరూ అనమాలు పట్టలేరు కదా! నాటకశాల యజమానికి ఇంతట్లో పోయేదేముంది అనుకునే స్వభావము మనది అనుకుంటాను.

అప్పటికి, సుమారు రాత్రి యెనిమిది గంటలవుతుంది. మేము రోడ్డు

మీదకు వచ్చాము. "ఏమండీ, ఈ పూటకు ఈ పర్యటన ముగించి, బసకు చేరుకుందామా." అన్నాడు, మా స్నేహితుడు. అదే మంచిదన్నాను రోజంతా ట్రాములో కూర్చున్నా, కొంచెము శరీరానికి ఇబ్బందే కలిగింది. బసకు చేరుకుని, ఆ పూటకు భోజనాదికములు ముగించుకొని, గుడ్‌నైట్ చెప్పుకుని, యెవరి గదికి వారు చేరుకున్నాము. నాగదిలో బట్టలు మార్చుకుని, సుఖంగా పడుకుని, నాటి దినచర్య అంతా ఒకమాటు సమీక్ష చేసుకుని నా స్నేహితుడు యెంత మంచివాడు! తెలుగువాడైనవాడు నన్ను పలకరించనైనా లేదే! ఇతడు పాపము నామీద దయతలచి, ఒక రోజు అంతా నాతో తిరిగి, తనకు ఏ ఇబ్బంది లేనట్టు, కాలక్షేపం చేశాడు. మన వాళ్ళు కూడా ఇలా యెందుకుండలేరో, అనుకుంటూ నాకు తెలియకుండానే ఏరు దాటాను. అనగా నిద్రాదేవత వడిలోనికి ఒరిగానన్నమాట.

ఉదయం లేచి నా నిత్యకృత్యములన్నీ తీర్చుకుని, డ్రెస్సు వేసుకునేసరికి. మా స్నేహితుడు మీనన్ మళ్ళీ వచ్చాడు. నవ్వుతూ గుడ్‌మార్నింగ్ చెప్పి కూర్చుని, నీకు రాత్రి బాగా నిద్రపట్టిందా! అని, ఏమీ అలసటగా లేదుకదా! అని, యోగక్షేమం కనుక్కున్నాడు. "మీరీ వేళ ఉంటారా? ఇక్కడనుంచి యెక్కడకు వెళ్ళుతారు? మీరు ఏర్పాటు చేసుకున్న కార్యక్రమం ఏమిటి?" అన్నాడు. నాకు యే యేర్పాటూ లేదనీ యేం చేయాలో తోచటంలేదనీ, ఇంటిదగ్గర ఏమీ ఆలోచించకుండా, యే నిర్ణయాలూ చేసుకోకుండా, యెవరితో చెప్పకుండా వచ్చాననీ, నా రహస్యం బయటపెట్టాను. అతను నవ్వి, "నీ వాలకం చూస్తే, ఇలాటి పని యేదో చేశావని ఊహించానులే నీలాటివాళ్ళు మీ ప్రాంతం నుంచి, ఇప్పుడిప్పుడే రావడము మొదలుపెట్టారు. అయితే నీవు యేమి చదువుదామని అనుకుని వచ్చావు? - డబ్బు సరిపడ్డవున్నదా? మీవాళ్ళు పంపిస్తారా! లేకపోతే ఇక్కడినుంచి వెనక్కి వెళ్ళిపోతావా?" అన్నాడు.

నేను కొలంబో నుంచి, మావాళ్ళుకు ఉత్తరం రాశాననీ, వాళ్ళు నాకు మార్సేల్స్‌కు డబ్బు పంపించారనీ నన్ను ఇంటికి రమ్మని బ్రతిమాలుతూ, ఉత్తరం రాశారనీ, కాని, అలా వెళ్ళిపోవడం నాకెంత మాత్రమూ ఇష్టం లేదనీ, ఎలాగో శ్రమపడి మా వాళ్ళు డబ్బు పంపించగలరనీ, అందుచేత ఎక్కడో ఒకచోట, చదువులో ప్రవేశించాలని నా నిర్ణయమనీ చెప్పాను. నేను ఎక్కడ చేరితే బాగుంటుందో, ఎక్కువ ఖర్చుకాకుండా ఉంటుందో, నేనక్కడకు ఎలా వెళ్ళాలో మీ సలహా ఇస్తే సంతోషిస్తాను, నాకు బారిష్టరు పరీక్షకు చదవాలని ఉన్నది. నేను ఇంటి దగ్గర, హైస్కూలు

చదువుతో ఆగిపోయాను. ఇంక నేనేమి చేయాలో చెప్పండి అన్నాను.

"బాగుంది, చాలా సంతోషం, నీవు అన్నమాట, నీవు చేసిన పని, దాపరికము లేకుండా చెప్పావు నన్ను నమ్మి. నిన్ను చూస్తే, చాలా పసివాడవనీ, అమాయకుడవనీ తెలిసింది. నీమీద నాకొక సోదరభావము కలిగింది. నీవు ఇలాంటిచోట్ల, నెగ్గుకురావడం కష్టము. స్కాట్ లండ్‌లో ఎడింబరో పట్టణమునకు నువ్వు వెడితే, అక్కడ వుండి చదువుకోవచ్చును. అక్కడ ఉండడానికి, ఇక్కడి కంటే ,సుఖంగా ఉంటుంది. డబ్బు చాలా తక్కువ అవుతుంది. మన దేశస్థులు, చాలామందే ఉన్నారక్కడ. ఊరు ఇంతకంటే, చాలా చిన్నది కావడము మూలాన, తరుచు మన వాళ్ళందరునూ కలుసుకునే అవకాశము ఎక్కువ ఉంటుంది. నీవు హైస్కూలు చదువుతో ఇంటి దగ్గర ముగించానన్నావు కనుక, ఇక్కడ ఎంట్రన్స్ పరీక్షకు కూర్చోవలసి ఉంటుంది. మూడు నాలుగు మాసములు అక్కడే ఎవరిచేతనో ప్రైవేటు చెప్పించుకుని పరీక్షకు వెళ్ళవచ్చును. ఆ తరువాత నీవనుకున్న బారిష్టరు పరీక్షకు చదవచ్చును. నీకు ఓపిక ఉంటే, ఎం.ఏ పరీక్షకు కూడా ఏక కాలమందు చదవవచ్చును. ఏమంటావు?" అన్నాడతను "నేను అనడానికీ ఏమి ఉన్నది? మీరేమి చెప్పినా, దానికి తథాస్తు అనడమే నా పని" అన్నాను.

అయితే, ఈ వేళ నేను నీతో రావడానికి తీరుబడిలేదు. ఈ ఇండియా హౌస్ సంస్థను నడపడానికి, ఇక్కడ ఒకావిడ మేనేజరుగా ఉన్నది. ఆమె మధ్యాహ్నము నీవలె కొత్తగా వచ్చిన వాళ్ళను కొందరిని జంతు ప్రదర్శన శాలకు తీసుకువెళ్ళవలెనని అనుకుంటున్నది, నిన్ను ఆమెకు పరిచయము చేస్తానిప్పుడు. ఆమెతో కూడా వెళ్ళు. మీరు సాయంత్రము నాలుగైదు గంటలకు ఇక్కడకు తిరిగి వస్తారు. అప్పటికి నేనూ రావడానికి ప్రయత్నము చేస్తాను. మనం ఇప్పుడు ఫలహారము ముగించి అవిడను కలసుకుందాము. ఆ తరువాతను నా దారిన నేను వెళ్ళుతాను. అటూ, భోజనశాలవైపు దారితీశాడు. అక్కడ మా పని ముగించుకుని, ఆ మేనేజరు దగ్గరకు వెళ్ళాము. ఆమె నవ్వుతూ నుమ్మల్ని ఆహ్వానము చేసినా, ఆమెను చూస్తే మట్టుకు నాకు కొంచెము భయ మనిపించింది. గుండె ఒక్కసారి దడదడలాడింది. ఆమె సుమారు ఏభయ్యేళ్ళవయస్సు మనిషి. బాగా లావుగా, పొడుగ్గా, గంభీరముగా కనపడ్డది, నా స్నేహితుడు, నేను ఫలానా అనీ, నిన్నరాత్రే కొత్తగా వచ్చాననీ, ఇవాళో రేపో వెళ్ళిపోతాననీ, పరిచయము చేశాడు.

ఆమె కరచాలనకు చేయి జాపి, మిమ్మల్ని కలుసుకోవటము చాలా సంతోషం. మీకు తొందర పనిలేకపోతే, ఇంకొక నాలుగురోజు లున్నా యిబ్బంది లేదు. ఈ వూరు అందాలన్నీ చూడవచ్చు, లేక ఇక్కడనే వుండి చదువుకున్నా చదువుకోవచ్చును. అంది. నా స్నేహితుడు, ఆమె దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. ఆమె నన్ను కూర్చోమని, నా ఊరూ, పేరూ అన్నీ అడిగింది. మరో రెండు నిముషాల ఆ మాటా, ఈ మాటాచెప్పి మధ్యాహ్నం భోజనము కాగానే, జంతు ప్రదర్శనశాలకు కొందరు మిత్రులు, మీ దేశము నుంచి కొత్తగా వచ్చిన వారిని తీసుకు వెళ్ళాలను కుంటున్నాను. నీవు కూడా వస్తావా! అని అడిగింది. "తప్ప కుండా, సంతోషంతో వస్తా" నన్నాను. "అయితే రెండు గంటలకు కలుసుకుందాం" అన్నది. నేను లేచి, గుడ్ మార్నింగ్ చెప్పి, నా గదికి వచ్చేశాను.

# 5

నేను మధ్యాహ్నం భోజనం ముగించుకొని, యెప్పుడు రమ్మని పిలు స్తారో అని, ఒంటిగంటన్నర కల్లా సిద్ధమై కూర్చున్నాను. జంతు ప్రదర్శనశాల యేమిటా? యిలాటిది యెందుకు యేర్పాటు చేశారు? అది చూసేదేమిటి? యెక్కడబడితే అక్కడ మనకు అన్ని రకాల జంతు వులూ కంటికీ, కాలికీ తగులుతూనే వుంటాయికదా! యిందులో యేమైనా పులులూ, సింహాలూ, సర్కసులోకి మల్లే వుంటాయా! అని ఆలోచిస్తూ, కూర్చుండగా సరిగ్గా రెండు నిమిషాలు వుందనగా, బయటి వెళ్ళడానికి సిద్ధంగా వుంటే రమ్మనమని ఒకమనిషి వచ్చి చెప్పాడు. నేను రెడీయే అంటూ లేచి, అతని వెనుక బయటికి వచ్చాను. ముందు హాలులో పదిప దిహేనుగురు మన దేశస్థులు, నాకంటే కొద్దిగా పెద్దవారు, అక్కడ నిలబడి వున్నారు. వాళ్ళ మొహాలకేసి చూస్తే అంగ:లో ఒక్కడూ తెలుగువాడి లాగా కనబడలేదు. నేనా ముఖపరీక్ష చేస్తూండగానే, గడియారము రెండు కొడుతూ వుండగా, వుదయము నాతో మాట్లాడిన మేనేజరు అమ్మ గారు డ్రెస్సు వేసుకుని నెత్తిమీద యేవో రకమైన యీకలు వున్న టోపి ధరించి, పైన పాదాల వరకూ వుండే పెద్ద కోటు తొడుక్కుని. చేతిలో కర్ర పుచ్చుకుని, ప్రవేశించింది. ఆ కోటు చూసిన తరువాతను యిలాటిది అందరూ వేసుకోవాలి కాబోలు అనుకున్నాను. నేను తక్కినవాళ్ళను కూడా చూస్తే వాళ్ళందరూ కూడా తొడుక్కునే వున్నారు. అందరి

కళ్ళూ నామీద పడ్డాయి. అది గ్రహించుకుని, నేనిప్పుడే వస్తానండీ అని గబగబా నా గదిలోకి పరుగెత్తి, నేనూ ఆ కోటు తొడుక్కుని వచ్చాను. వెంటనే బయలుదేరాను.




వీధిలోకి వచ్చేసరికి పది పదిహేనుమంది కూర్చోడానికి సరిపడే కారు ఒకటి సిద్ధంగా వున్నది. మేమందులో కూర్చోగానే బయలుదేరి, ఊరంతా తప్పి తిన్నగా ప్రదర్శన శాలకు తీసుకు వెళ్ళింది. మేమంతా అక్కడ దిగి లోపలకు వెళ్ళాము. లోపల ప్రవేశించడానికి టిక్కెట్లు కూడా కొనుక్కోవాలి. మా అందరి బదులు మానేజరు అమ్మగారే టిక్కెట్లు కొన్నారు. లోపలకు వెళ్ళుదుముగదా, అదేదో మన పెద్ద పశువుల శాలలా వుటున్నద నుకున్నది, అలాకాకుండా, యేదో కొన్నివందల యకరాలు వ్యాపించినట్టు కనిపించింది, అందులో కొంతభాగము కటకటాలు కట్టేన యిళ్ళలాంటె వాట్లలో కొన్ని జంతువులు - జంతువలంటే నేను ఆవులూ, గేదలూ, యెద్లూ, పోతులూ, మేకలూ, గొర్రెలూ, గాడిదలూ, గుర్రాలూ, యింకా కావలిస్తే యేనుగులు, లొట్టిపిట్టలు తప్ప మరేమి వుంటాయనుకున్నాను.

యివి లేనేలేవు అసలు - అక్కడ లేళ్లు, దుప్పులు, కొన్నిరకాల గుర్రాలు, కొన్ని రకాల కంచర గాడిదలు, ఆఫ్రికానుంచి వచ్చాయట. అవేవో జీబ్రా లట గుర్రాల లాగనే వున్నాయి. యెటొచ్చీ ఒంటినిండా పెద్దచారలు పెద్దపులి చారలు లాటివి - కావడం పెద్దపులిని నేను చూడలేదుగాని, పెద్దపులికి చారలుంటాయని పెద్దలుచెప్పడం, అదికాకుండా, మావూళ్ళో పీర్ల పండుగలో పెద్దపులి వేషాలు వేసేవాళ్ళు, ఈ చారలు వేసుకో వడం ప్రత్యక్షంగా చూశాను. యిక్కడే చారలున్న గుర్రాలలాంటి జీబ్రాలు, చాలా అందముగా కనపడ్డాయి. యింటికి వెళ్ళిన తరువాతను అవసర మైతే ఆఫ్రికా మీదుగా వెళ్ళి ఓ జత జీబ్రాలు కొనుక్కుని రెండుగుర్రాలు బండి లాంటి దానికి, వీట్లని కట్టి, ఏ మద్రాసో తీసుకువెళ్ళినా, జనము అంతా విరగబడి చూసి సంతోషిస్తారు. యేమైనాసరే, వాట్లను తీసుకు వెళ్ళాలసినదే ననుకున్నాను.

పందులు దేశవాళివీ, అడవి పందులూ, ఇవికూడా, మామూలు వాటిలా ఉన్నా నోట్లో పైకి కనపడుతూ రెండు పెద్దకోరలతో ఉన్నాయి. వీటికంటే చాలా చిత్రమైనది, అందమైనది భయంకరమైనది. పందిజాతి కంతకీ శిరోభూషణమైనదీ, ఆ జాతికంతలోనూ చిన్నదీ, ముళ్ళపంది కన పడ్డది! ఏమిచిత్రంగా ఉన్నది! దాని ఒంటినిండా, నలుపు, తెలుగు రంగులో, ఆరంగుళాలో, ఏడంగుళాలో, పొడవుగల వాడియైన ముళ్ళు సూది మోప డానికి వీలులేకుండా శరీరం నిండా ఉన్నాయి. ముఖం మీద తప్ప, ఇవన్నీ పుట్టుకతోటే వుంటాయా, లేకపోతే, తరువాతను యిలా మొలుస్తాయా, లేకపోతే చూచే వాళ్ళను గమ్మత్తు చెయ్యడానికి ప్రదర్శనశాల వాళ్ళు ఈ ముళ్ళ తొడుగు ఏదయినా తొడుగుతారా! అని ఆలోచిస్తుండగా, మాతో కూడా ఉన్న ప్రదర్శనశాల తాలూకు మనిషి కటకటాల మధ్యనుంచి కర్రతో ఒక దానిని పొడిచాడు. దానికి ఒళ్ళుమండి, "అమ్మ వెధవా! ఉండూ నీ పని చెబుతాను" అన్నట్లు ఒక విధమైన శబ్దముచేసి, వాడి మీదకి ఉరక బోయింది. చిత్రమేమిటంటే, ఆ క్షణములో మనకు గగిరపా డిచి నప్పుడు, మనశరీరము మీద రోమములు నిలబడినట్లు ఈ పంది మీద ముళ్ళన్నీని టాక్కున లేచాయి. ఆస్థితిలో, యిది ఎవరి మీదనైనా పడితే యింకేమైనా ఉందా, అని అనుకుంటూ ఉంటే అప్పుడామనిషి, ఉపన్యాస ధోరణిలో వీని సంగతి అంతా చెప్పకు వచ్చాడు. శత్రు బారినుండి తప్పిం చుకుని బయట పడడానికి, ఆత్మ సంరక్షణ కోసము, పరమాత్ముని మహా ప్రసాదం యిది అని నాకేసి తిరిగాడు. నేను అనాలోచితంగా, మరి తక్కిన జంతువులకో అన్నాను. వాడొక్కసారి నాకేసి, తీక్షణంగాను,

తరువాత కొంచెం జాలిగాను చూసి "యే జంతువుకు తగిన, అవసరమైన రక్షణ శక్తిని వాటికి తగ్గ రీతిగా దైవం ఏర్పాటు చేస్తాడు" అన్నాడు. మా మానేజరమ్మగారి ముఖంలో మందహాసము కనిపించింది. మేము ముందుకు సాగాము.

ఇక కోతులూ, కొండముచ్చులూ ఉండేచోటుకు వెళ్ళాము. చిన్నా, పెద్దా కొన్ని వందల రకాలు కిచకిచలాడుతూ, పళ్ళు యికిలిస్తూ, మాకేసి తమాషాగా చూస్తూ, యెగురుతూ వూచలు పట్టుకుని పైకి యెక్కుతూ, మళ్ళీ కిందకు దిగుతూ, వాటిలో అవి ఆడుకుంటూ, ఎంతో తమాషాగా కనబడ్డాయి. యితరచోట్ల అన్నిటికంటే, ఈ కోతులదగ్గరే జనము ఎక్కువగా మూగారు. వచ్చిన వాళ్ళందరూ ఆడా, మగా, పిన్నా, పెద్దా అందరూ కూడా వాటికోసమని ఏవేవో కాయలూ, గింజలూ, పళ్ళూ కొని కూడా తెచ్చుకున్నారు. అవి లోపలికి వేస్తూంటే వాటిలో అవి దెబ్బలాడుకుంటూ ఒకదానిచేతిలోది మరొకటి లాక్కుంటూ, తింటూ మమ్మల్ని చూచి పళ్ళికిలిస్తూ, మరికొన్ని యిమ్మని చేతులు జాపుతూ ఉంటే, ఎంతో వింతగానూ, సంతోషముగానూ వున్నది. వచ్చిన వాళ్ళెవళ్ళూ ఓ పట్టాన కదలి పోవడములేదు. కొందరు ఆడవాళ్ళు, పిల్లలు, ఈ పళ్లు వగైరా తమచేతిలో వాటిని, వాటికి అందించి, అవి తీసుకుంటూంటే సంతోషిస్తూ ఆడుకుంటున్నారు. ఒక అమ్మాయి చెయ్యి జాపి అది అందుకో బోతుంటే దాన్ని ఏడిపించటానికి చటుక్కున చెయ్యి వెనక్కు లాక్కుంది. అది కోపంగా చూస్తూ ఊరుకుంది. ఈ అమ్మాయి రెండవసారి వూరుకోక మళ్ళీ చెయ్యి చాపింది. రెప్పపాటులో ఆకోతి, ఈఅమ్మాయి మొర్రోమని అరుస్తూ వుంటే, అది పళ్ళికిలిస్తూ చెయ్యి విడిచిపెట్టలేదు. ఇంతలోనే అక్కడ నౌకరు వచ్చి ఆ కోతిని మందలించి, కొడతానని బెదిరించే సరికి అది విడిచి పెట్టింది. ఈ గందరగోళము చూడటానికి జనము చాలామంది గుమిగూడారు. వాళ్ళల్లో వాళ్లు నవ్వుకున్నారు. ఈ అమ్మాయికి సానుభూతి చూపించారు కొందరు. కొందరు వెళ్ళిపోతూ ఉన్నా, మరికొందరు స్త్రీలు అక్కడే నిలబడి, లోకాభిరామాయణము చెప్పుకుంటున్నారు. పంజరానికి దగ్గరలో ఒక లావాటి మనిషి - కొంచెం వయస్సు మళ్ళినదే తలా, చేతులు వూపుతూ ఏదో ఉత్సాహంగా కబుర్లు చెపుతోంది. మేమింకా ముందుకు వెళ్ళదామని బయలుదేరాము పంజరం వూచలు పట్టుకొని లోపల వున్న ఒక కోతి చాలా సేపటి నుంచీ ఈవిడ అభినయము చూస్తూ ఉపన్యాసము వింటూ పళ్ళికిలిస్తూన్నధి. ఈవిడ సంభాషణ హడావిడిలో చూసుకోకుండా తనకు

తెలియకుండా పంజరానికి దగ్గరగా జరిగింది. ఆ కోతి రెప్పపాటులో ఈ విడనెత్తిమీద టోపీ అందుకుని లాగింది. మొర్రో మంది ఈవిడ. అందరూ నిర్ఘాంతపోయి చూస్తున్నారు. ఆ టోపీతో పాటు ఆవిడ నెత్తి మీద నున్న కృత్రిమ కేశాలంకరణము కూడా వూడివచ్చింది! ఆవిడకు ఆపుకోలేని దుఃఖము వచ్చింది. ఒళ్ళుమండి తన చేతిలో వున్న కర్రతో ఆ కోతిని కొట్టబోయింది. కోతి నవ్వుతూ, లోపలికి తప్పుకుంది.



యెటొచ్చీ కటకటాలలో నుంచి, ఈటోపీ లాగలేక అక్కడే విడిచిపెట్టింది. ఈవిడ దాన్ని తీసుకుని ఇంతమందిలోనూ ఇది నెత్తిమీద యెలా పెట్టుకోవడమా అని ఆలోచిస్తుండగా అక్కడకొక నౌకరు పరుగెత్తుకు వచ్చి కోతిని కొప్పడి ఈమెను పరామర్శించి ఆమె చెయ్యి పట్టుకుని

దగ్గరలోనే అలంకరించుకోవడానికి స్త్రీల కేర్పాటైన ఒక గదిలోనికి తీసుకుని వెళ్ళాడు ఆమెను. చూస్తే యెంతో జాలి వేసింది. నాకు ఆ కోతి కొంటెతనము చూస్తే నవ్వు వచ్చింది. అందుకనే కాబోలు యిళ్ళల్లో అల్లరి చేస్తూంటే కోతి గుణాలు, అంటుంటారు. అనుకున్నాను.

ఆ తరువాతను నేననుకున్నట్లుగానే కొన్ని ఏనుగులు ఉన్నాయి. అక్కడ సర్కసులోకి మల్లేనే మచ్చిక చేసిన ఏనుగులు రెండు మూడిటిని తీసుకువచ్చి పిల్లలను వాటి మీద ఎక్కించి తిప్పి తీసుకు వస్తున్నారు అక్కడ ఉన్న కాపలా వాళ్లు. వాటికి యే అడ్డూ లేకుండా ఆరు బయటనే స్వేచ్ఛగా తిరుగుతున్నాయి. అంత జంతువూ చాలా నిరపాయమైనదట. ఎవ్వరినీ ఏమీ చెయ్యదు. ఎవ్వరు ఏది యిచ్చినా తొండముతో తీసుకుని నోట్లో వేసుకుంటుంది. అక్కడ ఎక్కువసేపు నిలబడవలసిన అవసరము లేకపోయింది. ఆ పక్కనే లొట్టిపిట్టలూ కనపడ్డాయి. వాటిని బొమ్మలలోనే గాని ఇదివర కెప్పుడూ చూడలేదు. వాటి పొడుగాటి మెడలూ, మూపురాలూ, ఆ ముఖాలూ. చూస్తే మొత్తముమీద జంతుకోటి కంత లోకి యిదే అందవికారమైన జంతువు అనిపించింది.

అక్కడ నిలబడలేకపోయాను నేను. ఇంకొక పదిబారలు ముందుకు వెళ్ళేసరిగి ఆఫ్రికా దేశమునుంచి వచ్చిన మరో చిత్రమైన జంతువు జిరాఫీ కనబడ్డది. దాని పొడుగాటి కాళ్ళూ, కుదిమట్టమైన శరీరమూ, ఒక రకముగా బాగానేవుంది గాని, దానిమెడ యెంత పొడుగో చెప్పలేను. తాటిచెట్టు చిగురు కూడా అమాంతము అందుకోగలదని అనుకున్నాను. ఇదీ ఆకూ అలమూ తింటూ, బ్రతుకుతుందట. అందుకని ఎంత ఎత్తయిన కొమ్మలనూ అందుకొని భుక్తిగడుపు కోవడానికి సృష్టికర్త చేసిన యేర్పాటు అని మాతో వస్తూవున్న నౌకరు చెప్పాడు. అంత పొడుగు మెడవున్నా చూడ్డానికి కొంత ముచ్చటగానే వుంది. దాని ముఖం లేడి ముఖంలాగా ఎంతో అమాయకముగానూ, భీరువుగానూ కనపడ్డది. రెండు నిముషాలు దగ్గర నిలుచుని మా వాళ్ళను అనుసరించి ఇంకొంచెం ముందుకు వెళ్ళాను. అక్కడొక పెద్ద బావీ దానిచుట్టూ ఎత్తయినగోడ, అందులో ఒక జంతువు కనపడ్డది. దాని ఖడ్గమృగమన్నారు. దాని ముక్కు మీద బలిష్టమైన కొమ్ము కనపడ్డది. దానిఖడ్గమట అది. ఎటువంటి శత్రువు ఎదురుపడ్డా ఆకొమ్ముతో చీల్చేస్తుందట అది. దాని చర్మము కూడా ఇనుపరేకులా ఎంతో దళసరి. బల్లెము కూడా దూరేటట్లు లేదు. అది కొంతసేపు నీళ్ళలోనూ కొంతసేపు నేలమీదా తిరుగుతుందట. ఇదీ ఆఫ్రికా దేశమునుంచే వచ్చిందని విన్నాను మన వేపున కనపడే పెద్ద

బొబ్బిలి పోతు అంతవుంది. కొంత భయంకరముగానే కనపడ్డది. ఇంక తరువాతను పులులూ, సింహాలూ చూశాము. వాటినీ స్వేచ్ఛగా విడిచి పెట్టినా ఎంతో పెద్ద ఆవరణకు చాలా ఎత్తుగా ఇనపబల్లాలతో అడ్డుక ట్టారు అందులో అవి స్వేచ్ఛగా తిరుగుతుంటాయి. పులిపిల్లలు చిన్నవి కూడా వున్నాయి. అవి చాలాముద్దుగా ఉన్నాయి. సింహాలూ దర్జాగానూ భయంకరముగాను ఉన్నాయి. కాని ఇంత అందముగా కనపడలేదు. కొన్ని చిరుతపులులూ ఉన్నాయి. అవీ చాలా అందముగా ఉన్నాయి. ఇంకా యిలాంటి జంతువులు ఎన్నెన్నో కనపడ్డాయి. తరువాత మేము జంతుజా లాన్ని విడిచిపెట్టి పక్షిజాతిని చూడటానికి వెళ్ళాము. ఈ ప క్షిజాతిలో యెన్ని రకాలో! యెన్ని రంగులో? యెన్ని రూపాలో యెన్ని ధ్వనులో వర్ణించడానికి శక్యముకాకుండా వుంది.

వీటిలో మనకు పరిచయమైన కాకులూ, గ్రద్దలూ, కొంగలు, చిరు తలు వున్నాయి. ఈ చిలకలలో యెర్రని చిలకలు కూడా వున్నాయి. ఒక రకము చిలక, మనమామూలు చిలకల కంటే, సుమారు పదిరెట్లు ఉంటుంది. దానితోక మూడు నాలుగు అడుగుల పొడుగు వుంటుంది. అది జపాను నుంచో! యెక్కడ నుంచో, వచ్చినదన్నారు. ఆ తరువాత పక్షి జాతికంతకీ అలంకారమూ, అందమూ తెచ్చిన నెమళ్ళు కనబడ్డాయి. వీనికంటే చిత్రం, మనము యెన్నడూ కనీవినీ యెరగని నిప్పుకోళ్లు కన పడ్డాయి. అవి బాగా యెత్తుగా ఉంటాయి. బలిష్టంగానూ ఉంటాయి. వేడివేడి మండుతున్న బొగ్గులు కూడా తింటాయట. వాటి రెక్కలలో వుండే యీకలు, చాలా అందముగా ఉంటాయనీ అక్కడి స్త్రీలు వాటిని తమ టోపీలు వగైరా అలంకరణకు ఉపయోగిస్తారనీ చెప్పాడు. మాతో ఉన్న మనిషి,

ఇంక మనదేశములో, హిమవత్పర్వతాలలో ఉంటాయనుకునే హంసలు, అనేక రకాల బాతులు, కొంగలు కనపడ్డాయి. బర్మా నుంచి కాబోలు, వచ్చిన తెల్లని చిలకలు కనపడ్డాయి. ఇలా ప్రపంచములో యెన్ని వందల రకాల పక్షు లనో తీసుకువచ్చి, మన ఆనందముకోసమూ, విజ్ఞానము కోసమూ ఇక్కడ బంధించి అట్టే పెట్టారు. అసలిన్ని రకాలు ఉన్నాయని యెలా తెలు సుకున్నారో! వాటి నన్నిటినీ యెలా పట్టుకు తీసుకురాగలిగారో నాకు చాలా ఆశ్చర్యము వేసింది. ఇంకా ఏవేవో ఇలా చూస్తూ, హఠాత్తుగా ఒక పెద్దహాలులాంటి దానిలోకి ప్రవేశించాము. దాని నిండా బీరువాలలో తీగల తలుపుల వెనకాల, రకరకాల పాములు కనపడ్డాయి. వాటిలో కూడా ఇన్ని రకాలు ఉన్నవని యెప్పుడూ ఎరగను నేను. వినలేదు. కూడాను.

వాటిని చూస్తూనే ఒళ్లు జలదరించి భయమువేసింది. కాని నిదానముగా చూస్తూంటే, వాటిలో కూడా ఏదో కొంత సౌందర్యము ఉన్నట్టు అని పించింది. చాలా చిత్రమే. ఈ సౌందర్యముతో పాటు విషమూ వికార ఆకారము యెందుకు కూర్చాడా భగవంతుడు! మరికొంచెము సేపు ఇంకా ఏవేవో రకాలు చూస్తూ, కాళ్లు పడిపోతుంటే, రెండుమూడు గంటల సేపు అలాగే ఓపికగా తిరిగి ఇంకా ఏవేవో చూడవలసినవి ఉన్న వన్నా అంతటితో ఆ పూటకు ముగించి, వెనక్కు మళ్ళాము. మా మానేజిరమ్మగారు మా మీద దయతలిచి, ఒక టీ దుకాణము దగ్గరకు తీసుకవెళ్ళి టీలు, ఫలహారాలు ఇప్పించ్చింది.

# 6

ఫలహారాలు ముగించుకుని, బయటకు వచ్చి, మా కారులో కూర్చు న్నాము. ఇక బసకుజేరి జోళ్ళు విప్పేస్తేనేగాని, అడుగు కింద పెట్టలేక పోతున్నాను. కాని నా దురదృష్టము కొద్దీ యీ తిప్పట చాలదన్నట్టు అవ్వాళ్లో వున్న పెద్ద పార్కుట - హైడ్ పార్కు అనే ఉద్యానవనానికి తీసుకువెళ్ళి కొంతసేపు అక్కడా తిప్పింది మా మేనేజరమ్మ.

ఇక్కడ వృక్షజాతులు పుష్పజాతులు, వింతయైన రంగు రంగుల ఆకుల మొక్కలు అనేకములు యెంతో అందముగా అమర్చబడి, అక్కడ అక్కడా కనపడ్డాయి. ఈ పార్కులో విహారానికి, బళ్ళమీదనూ, గుర్రాల మీదనూ కూడా, గొప్పగొప్ప వాళ్ళందరూ వస్తారట! ఇది పూర్తిగా చూడవలె నంటే ఓపూటో, రెండుపూటలో పడుతుందనిపించింది. యీ వూళ్లో యిన్ని చూడవలసిన ప్రదేశాలు ఉంటే ఒక్కొక్కటి చూడటానికి రోజులు తరబడి పడుతూంటే, ప్రత్యేకముగా యీ లండను నగరము ఈ చివర నుంచి ఆ చివరవరకు చూడటానికే, ఒక సంవత్సరము సరిపోయేటట్టు వున్నదనుకున్నాను. అందుచేతను యింక యీ నగరం సావకాశముగా మరో మాటెప్పుడో చూడవలసినదే ననుకున్నాను. ఈ వూహాలతో కాళ్ళీడ్చుకుంటూ నెమ్మదిగా నడుస్తూవుంటే, మా అవిడ - పొరపాటు - మామేనేజరమ్మగారు, నెమ్మదిగా నా దగ్గిరకు వచ్చి ఏమి? కష్టముగా ఉన్నదా నాయనా ! కాళ్లు నెప్పులు పుడుతున్నాయా? నడవటానికి ఇబ్బం దిగా వుందా! నీ ముఖం కూడా, చాలా అలిసిపోయి వాడిపోయినట్లు కనబడుతోంది. పోనీలే యీ పూటకు ఇంతటితో ముగించి ఇంటికి వెడదాము అంది. నా భుజంమీద చెయ్యి వేసి, నాకేసి జాలిగా చూస్తూ.

ఆవిడ ఆదరణకు, నాకెందుకో ఇట్టే దుఃఖము వచ్చింది. పైకి గంభీరముగా "ఫరవాలేదులెండి, మనతో వచ్చినవాళ్ళందరకూ ఇంకా చూడ వలెనని వుంటే, చూపించండి, నేను కాస్సేపు ఇక్కడ కూర్చుంటాను" అన్నాను సిగ్గుపడుతూ.

"అబ్బేబ్బే - యెంతమాట - నాకూ పని వున్నది ఈ వేళకి చూచింది చాలు. మరొకప్పుడు తరవాత చూడవచ్చును. బసకే వెడదాముర౦ా" అని కారుదగ్గరికి దారితీసింది. కారులో కూర్చుని ఒక అరగంటలో బసకు చేరుకున్నాము.

అక్కడ నాకోసమే మా మిత్రుడు మీనన్ నిరీక్షిస్తూ కూర్చున్నాడు. నన్ను చూచి నవ్వి, నెమ్మదిగా నాతో నాగదిలోకి వచ్చాడు. గదిలో ప్రవేశించగానే ముందు నా కాలిజోళ్లు ఊడిదీసి, అవతల గిరవాటుపెట్టి, మేజోళ్లు కూడా తీసేశాను. నా బాధ గ్రహించి స్నానాల గదిలోకి వెళ్ళి, వేడినీళ్ళతో పాదాలు కడుక్కుని కాసేపు ఆ వేడినీళ్ళలోనే వుంచుతే, యీ నొప్పి లాగేస్తుందనీ, నేను వచ్చేదాకా తను కూర్చుంటానని, ముందాపని చేసుకోమని, సలహా యిచ్చాడు.

సరేనని, అడుగుతీసి అడుగు వెయ్యలేక నెమ్మదిగా స్నానాల గది చేరుకుని, అక్కడ మీనన్ చెప్పినట్లు, వేడినీళ్ళలో సుమారు పావుగంట సేపు కాళ్లు పెట్టుకుని కూర్చునే సరికి, శమనగా హాయిగా వుండి, నొప్పి చాలా భాగం చేత్తొటి తీసేసినట్టు పోయింది. కాళ్లు తుడుచుకుని నా గదిలోకి వచ్చాను. "ఏమండీ కాళ్లు ఏలాగా వున్నాయి. యిప్పుడేమైనా సుఖముగా ఉందా? - నొప్పేమన్నా తిరిందా అన్నాడు మీనన్, మీ దయ వల్ల చాలా భాగం బాధ తగ్గింది. ఈరాత్రి విశ్రాంతి తీసుకుంటే, రేపటికి బాగా తగ్గుతుంది. అనుకుంటున్నాను. కాని, మరి యీరాత్రే ప్రయాణం అనుకున్నాను కదా? "అన్నాను. యింకొకటి రెండు రోజులు ఆలస్యమయినా, మునిగిపోయేది ఏమీలేదు. మీరు కాలేజీలో చేరడానికి యింకా కొంత వ్యవధి వున్నది. అందుచేత తొందరపడకండి రేపు వెళ్ళ వచ్చు. మీకు యింకేమయినా యిక్కడ కొనుక్కోవలసినవి వుంటాయేమో ఆలోచిద్దాము, కూర్చోండి" అన్నాడు. నేను కూర్చున్న తరువాత రెండు నిమిషములూరుకుని "అయితే మీకు దుస్తులు సరిపడ్డన్ని వున్నవా! యీ చలికిమీరు ఆగగలుతున్నారా? యిబ్బంది పడడము లేదుకదా?" అన్నాడు.

"చలియెక్కువగానే వున్నదండీ. భరించడము కష్టముగానే ఉంది" అన్నాను. "మీబట్టలు ఏమి ఉన్నాయని నేను అడుగుతున్నానని ఏమి

అనుకోక చెప్పండి మీరు వేసుకున్న సూటు ఇండియాలో కుట్టించినదా! అలాగనే ఉన్నది చూస్తే. యిక్కడికి పనికిరాదు. చలిమాట యెలా ఉన్నా ఈ కుట్టూ యీ పద్ధతి చూస్తే యిక్కడ అందరూ నవ్వు తారు. తరువాత సూట్ అడుగున అండర్ ఉందా!" అని అడిగాడు. అదేమిటో నాకు అర్థం కాలేదు. నేను తెల్లబోయి అతనికేసి ప్రశ్నార్థ కంగా చూశాను. "వూరికే సూటు తొడుక్కున్నారా! దాని అడుగున యింకేమీ లేదా! అన్నాడు" యింకేమీ లేదన్నాను. అతను నిర్ఘాంతపోయి చాలా పొరపాటు చేశారు. యిటువంటి దేశములో చాలా ప్రమాదము. అడుగున కూడా వున్నితో తయారైనవి చర్మాన్ని అంటిపెట్టుకుని, ఉండే బనియన్ లాంటివి. కాళ్ళకూ ఒంటికీ కూడా తొడుక్కుని ఉండాలి. లేక పోతే చాలా ప్రమాదం అందుచేతను, ముందు యీ దుస్తులు సంగతి యేదో చూడాలి. రేపు ఉదయాన్నే నేను వచ్చి మిమ్మల్ని బజారుకు తీసుకు వెళ్ళుతాను. మీకు కావలసినవి మీరు కొనుక్కుందురుగాని, రేపు గాని, తప్పితే యెల్లుండిగాని, వెడుదురుగాని, పెందలాడే భోజనము చేసి, సుఖముగా పడుకుంటే, హాయిగా నిద్రపడుతుంది. ఈ బడలిక తగ్గుతుంది. ఉదయాన్నే వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను. "గుడ్‌నైట్" అని వెళ్ళి పోయాడు. అతను చెప్పినట్లుగానే నేను వెంటనే భోజనము చేశాను, వచ్చిపడుకున్నాను. కూర్చోటానికి కూడా ఓపిక లేకపోయింది. రేపు మళ్ళీ యేమికొనాలో, ఏమిటో? మళ్ళీ ఎంత ఖర్చవుతుందో? అని ఆలోచనలో పడ్డాను. ఇప్పటికి ఏ రోజుకారోజు అయిన ఖర్చులో నావంతు నేను మీన న్‌కి ఇచ్చేస్తున్నాను. అతను చిరునవ్వుతో థాంక్స్ అని తీసుకునేవాడు. ఇవేళ ఖర్చంతా మానేజరమ్మ పెట్టింది. యెవళ్ళనీ ఒక కానీ అడగలేదు. యెవరూయివ్వనూలేదు. ఇదంతా ఆఖరున బిల్లులో చేరుస్తుందో, లేకపోతే గవర్నమెంటువారు చేసిన వుచిత ఏర్పాటో తెలియలేదు. యిది యేమి తడిసి మోపెడు అవుతుందో అనే ఆలోచన పూర్తికాకుండానే నాకు తెలి యకుండానే నిద్రలో పడ్డాను.

ఉదయాన్నే లేచి దంతధావనాధికము పూర్తి చేసుకునేసరికి, మీనన్ మిత్రుడు వచ్చాడు.

"ఏమి సోదరా బయలుదేరుదాము సిద్ధముగావున్నావా?" అన్నాడు.

మేమిద్దరమూ భోజనాల హాలులోకి వెళ్ళి టీ ఫలహారాదులు ముగించి వీధిలోకి వచ్చాము. సుమారు ఒక ఫర్లాంగు నడిచి, ప్రక్కకు తప్పుకొని, ఒక పెద్ద గేటు దాటి లోపలకు వెళ్ళాము. రెండు నిమిషాలలో మీనన్

రెండు టిక్కట్లు తీసుకువచ్చాడు.

"ఇప్పుడే టిక్కట్లేమిటి!"

అని అడిగేలోపునే, నన్ను రెక్కపట్టుకుని మరో గేటులోనుండి లోపలకు లాక్కుని వెళ్ళాడు. మేము లోపల అడుగు పెట్టడమూ ఆ గేటు దభీమని మూసుకోవడమూ, రపీమని మేము పాతాళములోనికి దిగిపోవడమూ అన్నీ "కూ" అనే లోపున అయిపోయినాయి. నేను కెవ్వుమందామని అనుకుని అనేలోపలే మళ్ళీ తెరిచిన చప్పుడు కావడము, మీనన్ నన్ను రెక్కపట్టుకుని వెలుపలకు తీసుకెళ్ళడమూ "ఏమిటిది?" అనే లోపుననే రైలు రావడమూ, మేము అందులో కూర్చోవడమూ జరిగిపోయాయి. అప్పుడు మీనన్ నా వీపు తట్టి, ఏమీ భయములేదులే. యిందాక చాలా కంగారుపడ్డావు కదూ! అక్కడ మాట్లాడటానికి దేనికీ వ్యవధిలేకపోయింది. యిందాక మనము టిక్కట్టు తీసుకుని గేటులో నుంచి వచ్చామే అది "లిఫ్ట్" అన్నమాట. అంటే. అందులో నుంచుని, తలుపు మూసేసి ఒకమరనొక్కితే, అది మనుష్యుల్ని కిందకుగాని, పైకి గాని తీసుకువెళుతూ వుంటుంది. ఈ వూళ్ళో ఈ రెండు రోజులనుంచీ చూస్తున్నావు కదూ? వీధులెంత సమ్మర్ధంగా వుంటాయో! అందు కని ఆ సమ్మర్దం తగ్గించడానికి, ప్రజలు ఒక చోటనుంచి, ఒకచోటుకు వెళ్ళడానికి, త్వరగా తిరిగిరావడానికి వీలుగా ఉండేట్టు భూమికి కొంత లోతున ఈ రైలు ఏర్పాటు చేశారు. అతని వాక్యం పూర్తి అయ్యే సరికి రైలు ఆగడమూ, నన్ను మళ్ళీ మాట్లాడకుండా మీనన్ చెయ్యి పట్టుకుని, రైలులోనుంచి బయటకి అక్కడ నుంచి లిఫ్టులోనూ, తీసుకువె ళ్ళడం, లిఫ్టు యీ మాటు పైకి వెళ్ళడం, మేము మళ్ళీ అందులోనుంచి బయటపడడం, అన్నీ, ఓదేముడా! అవడానికి కూడా వ్యవధి లేకుండా జరిగిపోయింది. ఇంకను మళ్ళీ మీనన్ ఏమీ మాట్లాడకుండా ముందుకు తీసుకు వెళ్ళాడు. మనస్సులో యెన్నో ఆలోచనలూ, సందేహాలూ, బయలు దేరినాయి. మొదటి పాతాళంలో పడినప్పుడు, గుండె ఆగిపోయిందనే అను కున్నాను. మళ్ళీ లిఫ్టులో నుంచి పైకి వచ్చాటప్పుడు కూడా గుండె పట్టేసినట్టయింది. అలాంటప్పుడు యీ ఏర్పాట్లవల్ల పిన్నలకీ పెద్దలకీ కూడా ప్రాణాపాయము కదా! అనుకున్నాను. అలా అయితే యీ యేర్పాట్లు యెందుకు జరిగాయి? అనుకున్నాను. అప్పుడు మార్సెల్స్‌లో గాని, ఈనాడు ఇక్కడగాని, కావడం యెవరూ "హరీ అనలేదు. అంతా నిరపాయముగానే బయటపడ్డారు. తరువాతను భూమి అడుగున ఇంత

లోతున ఇలా సొరంగాలు యెలాచేశారో! యెంతో ప్రమాదము కదూ? ఇది అమాంతంయే భూకంపమో వచ్చి, కూలిపోతే యేమవుతుంది? తరువాతను, లోపలకు వెలుతురూ, గాలీ యెలా వస్తున్నాయో? కాని మా మిత్రుడిని అడగడానికి వ్యవధిలేకపోయింది. అతడు సమాధానం చెప్పే స్థితిలో ఉన్నట్టు కూడా కనబడలేదు.

మేము తొందర తొందరగా, నడుస్తూ ఒక బట్టల షాపులో ప్రవేశించాము. అక్కడ అద్దాల బీరువాలో ఎన్నో రకా సూట్లు తయారయినవి సిద్ధముగా ఉన్నాయి. ఇవన్నీ ఎవరో కుట్టించుకున్నారు కాబోలును అనుకున్నాను. మేము లోపలకు అడుగుపెట్టగా, నా దృష్టి ఈ బీరువాలమీదనే లగ్నము కావడము మూలాన్ని వాటికేసి చూస్తూ నిలబడ్డాను. లోపల ఒకాయన, మీనన్ దగ్గరికి వచ్చి, మాట్లాడడము నేను గమనించనేలేదు. ఇలా నాలుగైదు నిమిషాలు కావడముతోనే, ఆ ఆసామి నాదగ్గరకు వచ్చినా పొడవూ కై వారమూ,వగైరా కొలతలన్నీ తీసుకోవడము మొదలుపెట్టాడు, ఓహో బట్టలు కుట్టడానికి కదా అవి,



"ఈ సాయంత్రానికి ఇచ్చేస్తాడా?" అన్నాను. "నేనివాళ వెళ్ళక తప్పదు సుమా!" అన్నాను.

"మీ కేం భయము లేదు అయిదు నిమిషాలలో ఇచ్చేస్తాడు ఏటాచ్చీ ఇక్కడ ఉన్న వాటిలో మీకేది నచ్చినదో చూపించండి" అన్నాడు.

మనలో మనమాట, నాకేమి తెలుస్తుంది, ఆగుడ్డ నాణ్యం గాని, విలువగాని, నేను తెలుసుకోలేను గదా! అక్కడ బేరమాటడానికి వీలవుతుందో కాదో, ఎంత చెడ్డా, వాడు బట్టలమ్ముకునే కోమటి అయినా, దొర అయెను!

యీ బాధ అంతా ఎందుకనుకుని దర్జాగా "మీనన్ సోదరా, నీకంటే, నా కెక్కువ తెలుసా నువ్వే చూచి ఏర్పాటు చేయించు వాటి మంచి చెడ్డలు నాకంటే నీకే తెలుసు" అన్నాను. మీనన్ సంతోషించాడు. సరే ఇటు రమ్మని ఇంకొక బల్లదగ్గిరికి తీసుకువెళ్ళి నాలుగైదు రకాల మెడ పట్టీలు, అనగా టైలన్నమాట చూపించాడు. ఇక్కడందరు మగవాళ్ళూ, మెడకి వురేసుకున్నట్లు ఇదొకటి కట్టుకోక తప్పదట! ఎందుకో నాకు అర్థం కాలేదు. ఏమీ అడగటానికి తెలుసుకోడానికీ వీలులేదాయె. ఇక్కడిదో చావొచ్చి పడింది.

తరువాతను ఒక అరడజను కాలర్లు తెప్పించాడు. ఆ తరువాతను సూటు లోపల తొడుక్కోవడానికి వొంటి నంటి పెట్టుకుని ఉండే బనీనులు, అటువంటివే షరాయిలు, రెండు జతలు తెప్పించాడు. ఇంకొక రెండు జతలు మేజోళ్లు తెప్పించాడు. ఇవన్నీ చూస్తుంటే, నా గుండె ఆగి పోయినంత పని జరిగింది. ఏమిటి మీనన్‌గారు, తనేదో జమీందారైనట్టూ, నేనంతకంటే జమీందారునైనట్టూ, కళ్ళుమూసుకుని, ఒకదాని తరువాతను ఒకటి తెప్పిస్తున్నాడు. వీటన్నిటికీ డబ్బెవడిస్తాడు? వాడుగాని, వాడి అబ్బగాని యివ్వడు కదా! నా బోటి వాటికి ధర్మం చెయ్యడానికి యీ దుకాణము పెట్టబడలేదుగదా! అయినా యీ మేజోళ్ళూ, యీ వురితాళ్ళూ యిన్నెందుకు? ఒకటో, రెండో ఉంటే మాసిపోయినప్పుడు, రాత్రిళ్ళు ఉతికి ఆరేసుకుంటే తెల్లవారేటప్పటికి శుభ్రముగా ఉండవా? వాటన్నిటికీ వందో, రెండువందలో అయిందంటే, నే నిప్పుడు యెక్కడ నుంచి తేను! లేదని చెప్పడమెలాగ అని అనుకుంటుండగానే, మేము యెన్నుకున్నవన్నీ, అక్కడ మనిషి లోపలకు తీసుకువెళ్ళి వాటిని చిన్న అందమైన అట్టల పెట్టెలో అమర్చడమూ, సూటు యింకొక పెట్టెలో అమర్చడమూ, వాటిని చక్కగా అందమైన రిబ్బనులాంటి దానితో కట్టడమూ, తీసుకువచ్చి నా ఎదుట పెట్టడమూ, జరిగిపోయింది.

మీనన్ బిల్లు నాచేతికి ఇచ్చాడు. నేను రాబోతున్న కన్నీటిని మందలించిలించి వెనక్కి పంపించి డబ్బు కిక్కురు మనకుండా మీనన్ చేతిలో పెట్టాను. యెంతయిందని అడగకుండా. వింటే మీరు హడలిపోతారు. అవి చంకన పెట్టుకుని బయటకు వచ్చాను.

ఒక క్షణం బయట నిలబడి, "ఇంక కొనవలసినవేమీ లేవు కదా" అన్నాను. యింకా బోలెడన్ని వున్నాయి. అంటాడేమోనని ఒక్క క్షణం ఊపిరి బిగబట్టుకుని, నిలబడ్డాను. మీనన్ ఒక్క క్షణం నా మొహం

కేసిచూసి అక్కడ కనపడ్డభయ, సందేహాలు చూచి, నవ్వుతూ ఇవ్వాళకి ఇంతవరకు చాలులే అన్నాడు. "అంటే రేపు మళ్ళీ అక్షింతలు వెనకేసు కొని బయలుదేరవలసిందేనా?" అన్నాను. నేనన్నది అతనికి అర్థమైనట్లు కనిపించలేదు. "ఏమీ అక్కరలేదు. ఇవేళ నువ్వు వెళ్ళిపోతున్నావుకదా! ప్రస్తుతానికి ఇంకేమి నాకు అవసరంలేదు." అన్నాడు. చిల్లర సామానులు ఏమైనా కావలిసినవి. యెడింబరో వెళ్ళిన తరువాత అక్కడ యెవరినైనా సాయం తీసుకొని కొనుక్కోవచ్చు నన్నాడు. అక్కడితో ఆ పూట కార్య క్రమం ముగించుకుని వెంటనే మా బసకు బయలుదేరాము. ఈ మాటు అడుగురైలూ, కాక పై ట్రాములూ కాక, గుర్రబ్బండీ చేసుకుని బసకు చేరుకు న్నాము. మనకు వాహన యోగము పట్టిందేమి టన్నాను. యిప్పుడు మంచి తొందర సమయం. ఈ వూళ్ళో నూటికి తొంభయిమంది జనాభా, వాళ్ళ వాళ్ళ పనులమీద తిరుగుతుంటారు. రైళ్లలోనూ ట్రాముల్లోనూ కూడా చాలా యిరకాటముగా వుంటుంది. యిలా అయితే ఒకళ్ళ ప్రమేయం లేకుండా, నాలుగు డబ్బులు యెక్కువయినా త్వరగా బసకు చేరుకోవ చ్చుననీ, సమాధానము చెప్పాడు. ఈకబుర్లు పూర్తయేసరికి మా బసకు రానే వచ్చాము. "రా తొందరగా" అని అక్కడ నిలబడి ముందుకూ, వెనక్కూ పరుగెత్తే జనాభాని చూస్తున్నవాణ్ణి బసలోకి లాక్కుపోయాడు.

"యింకా నాకు పనివుంది. నేను ఊళ్ళోకి వెళ్ళాలి. నువ్వుసా యంత్రము దాకా యెలగో కాలక్షేపం చేసుకో. నేను సాయంత్రము వచ్చి, నిన్ను కలుసుకుని రాత్రి రైలు యెక్కిస్తాను."

అంటూ, నా కృతజ్ఞతా వచనాలు వినకుండానే, తన గదికి వెళ్ళి పోయాడు.

నేను నా గదిలోకి వెళ్ళి కొన్న సామానులన్నీ మంచంమీద పెట్టుకు కూర్చుని! ఒకటొకటే విప్పి, వాటినిచూసుకుని మురిసిపోతూ, వెధవడబ్బు పోతేపోయిందిగాని యిలాంటి వస్తువులు మనకి యెక్కడ దొరుకుతాయి? అనుకున్నాను.

వస్తువులు, వాటి నాణ్యం యెలా వున్నా కొన్న ప్రతివాడికీ, యిలా యింత చక్కని పెట్టెలలో అందముగా కట్టి యిస్తారు? లేక నాబోటి విదేశీయులకి వాళ్ళేదో పెద్ద వాళ్ళనుకొని యిలా అందముగా అమర్చి యిస్తారా? అనుకున్నాను. ఏమైనా యిక్కడి యేర్పాట్లూ పద్ధతులూ, ఏది చూసినా చాలా అందముగాను, హుందాగాను, కనబడ్డాయి. వాళ్ళ నాగరికత అంటే, యిదే కాబోలు అనుకున్నాను. వాటన్నిటె మాటా

అటుంచి, ఆ సూటు అయిదు నిమిషాలలో వాడెలా కుట్టి యిచ్చాడో నాకు అర్థముకాలేదు. లేక అక్కడ వున్న వాటిల్లో మరెవళ్లకో కుట్టింది, నాకు సరిపోతే నాకు తొందరగా ఉన్నదిగదా అని అవతలి వాళ్ళకి మరో కటి కుట్టి యివ్వవచ్చు గదా అనే ధీమాతో నాకు ఇచ్చాడా! అనే సందేహముకూడా కలిగింది సరే వాడెలాయేడుస్తే నాకెందుకనీ, నాపని నాకు జరిగిందిగదా అని సంతోషించి, అవన్నీ మడిచి, జాగ్రత్తగా మళ్ళీ ఆ పెట్టెలో పెట్టి భద్రపరుచుకున్నాను, కొంచెం సేపు విశ్రమించి, ఒంటిగంటకు లేచి, మధ్యాహ్న భోజనానికి తయారయ్యాను. ఆవేళప్పుడు, భోజనాల హాలులోను తప్ప మరెవ్వరూ కనబడలేదు.

# 7

ఇక్కడ వాళ్లంతా, వాళ్ళ వాళ్ళ పనుల మీద వెళ్ళి ఏ హోటల్లోనో తింటారు కాబోలు అనుకున్నాను. అక్కడ మనిషి వెంటనే నాకు ఫలహారములు అమర్చాడు. నేను ఫలహారము ముగించి నాగదిలోకి వెళ్ళి పడుకున్నాను. ఆ పడక పడక నాలుగు గంటలకుగాని, మెలకువ రాలేదు. ఇంత వెర్రి నిద్రపట్టినదేమా అనుకున్నాను. లేచి ముఖం కడుక్కొని కాసేపు అటూ, ఇటూ తిరిగి వద్దామని వీధిలోకి వచ్చాను. ఎక్కడికేనా వెడితే దారి తప్పిపోతాననే భయముతో ఆ వీధిలోనే ఉన్న షాపులనూ, దారే పోయే జనాన్ని, హడావిడిగా పరుగులెత్తే, వివిధ వాహనాలనూ, చూస్తుంటే ఇట్టే నాకు తెలియకుండానే ఆరు గంటలయిపోయింది. నేను వెంటనే బసకు చేరుకున్నాను. ఇంతలో మీనన్ రానే వచ్చాడు.

"సవరణ అంతా అయిందా? ఈ పూట ప్రయాణమే కదా!" అన్నాడు.

"నా ఆలస్యమేమీ లేదు. ఈపూట ప్రయాణమే" అన్నాను.

"అయితే భోజనం చేద్దాం రమ్మన్నాడు. పావుగంటలో భోజనము ముగించుకుని, నాగదిలోకి వచ్చాము.

"సామానులన్నీ జాగ్రత్తగా సర్దుకున్నావా!" అన్నాడు మీనన్, "అన్నీ సర్దుకున్నాను" అన్నాను "బట్టలు బాగున్నాయా" అన్నాడు, "నువ్వు కొనడం, అవి బాగుండక పోవడమూనా?" అన్నాను. కాని నా కొక్క సంగతి చెప్పుబాబూ! వాడు సూటు అంత త్వరగా ఎలా కుట్టాడో తెలియక చస్తున్నాను అన్నాను. అతను పకపక నవ్వి వాళ్ళు కొన్ని ఎప్పుడో

కుట్టి అట్టే పెడతారు. అవి వచ్చిన వాళ్ళకి ఎవరికి సరిపోయినది వారికి ఇస్తారు.

సాధారణముగా యిన్ని అడుగుల పొడవుఉన్న మనిషికి చేతులు యింత పొడవుంటాయి, చాతీ యింత వెడల్పు ఉంటుంది. మెడ యింత పొడవుంటాయి, చాతీ యింత వెడల్పు ఉంటుంది. మెడ యింత, నడుము యింత, కాళ్లు పొడుగు యింత, అనే లెక్క ఉంటుంది. ఆ ప్రకారం కుట్టి పెడతారు. ఎక్కడో నూటికి తప్ప సాధారణంగా ఏరకం మనుషులకి ఆ రకం సరిపోతూనే ఉంటాయి. అని చెప్పి నా సందేహము తీర్చాడు.



"నువ్వు లోపల తొడుక్కునే బనీను లాంటిది ఉదయాన కొన్నవి తొడుక్కున్నావా!" అన్నాడు.

"లేదు" అన్నాను "మరి కొన్నదిఎందుకయ్యా, తొడుక్కోవడానికా, పెట్లో పెట్టుకోవడానికా? రాత్రి ప్రయాణము కూడాను. చలి ఎక్కువగా ఉంటుంది. ముందు అవి తొడుక్కో" అన్నాడు, పైబనీను ఒక్కటే సరిపోతుందా? లేకపోతే షరాయిలాంటిది కూడా తొడుక్కో వాలా! అన్నాను. "రెండూ తొడుక్కోవాలి" అన్నాడు "చచ్చేమురా!" అని కట్టినవన్నీ మళ్ళీ విప్పి, అందులోవి తొడుక్కోవడానికి ప్రయత్నం చేశాను. ఓపట్టాన ఎక్కలేదు. కాలి మేజోడు లాగానే

ఎంతో బిగువుగా ఉన్నాయి, కొంచెం ఒంటికి గుచ్చుకుంటున్నట్టు ఉంది కూడాను. "ఇదేమిటి? ఇంత బిగుతువి ఇచ్చా" డన్నాను. అది అంతే అలాగే ఉండాలి. రెండు రోజులు తొడుక్కుంటే, అవే వదులవుతాయి, అవి ఒంటిని అంటిపెట్టుకుని ఉంటే! ఎంత వెచ్చగా, హాయిగా ఉంటుందో నీకే తెలుస్తుంది. ఆడవాళ్ళను ఆలింగనము చేసుకున్నంత సుఖంగా ఉంటుంది. అన్నాడు నవ్వుతూ. "ఏడిసినట్టే వుంది వెధవ కబుర్లూ వీడూను. అస్త మానం ఆడవాళ్ళను ఆలింగనం చేసుకుంటూ కూర్చుంటాడు కాబోలు" అనుకుంటూ కొంచెం సిగ్గుపడ్డాను.

ఇవన్నీ నెమ్మదిమీద తెలుస్తాయిలే. అంటూ "బయలుదేరుదాం" అన్నాడు. నేను త్వరగా దుస్తులు తొడుక్కోవడం ముగించుకుని, మళ్ళీ సామాను కట్టేసుకుని, బయటకు వచ్చాను. అక్కడ ఉండే నౌఖరుని మీనన్ పిలిచాడు. వాడు సామాను తెచ్చి వీధిలో పెట్టాడు. మేము హాలులోకొచ్చి, అక్కడ మహంకాళి మేనేజరమ్మ దగ్గరకు వెళ్ళి, నేనిప్పుడు ఎడింబరో వెడు తున్నానండి. నా బిల్లు ఎంతయిందో చెపితే, చెల్లించుకుంటాను అన్నాను. బిల్లు అప్పుడే, ఎప్పుడు సిద్ధమైందో అక్కడకు అప్పుడే ఎలా వచ్చిందో తెలి యదుగాని, బల్లమీద ఉన్న కాగితం నాకు అందించింది. వెంటనే సొమ్ము చెల్లించాను. ఆవిడ మందహాసం చేస్తూ రసీదు నాకు అందించింది. "విష్ యూ గుడ్ లక్" అని నా రకచాలనం చేస్తు "గుడ్ బై" అని నాకు సెలవు ఇచ్చింది. నేను వీధిలోకి వచ్చేసరికి మీనన్ గుర్రబ్బండి పిలిచి సామాను అందులో పెట్టించి, నన్ను అందులో ఎక్కమన్నాడు.

స్టేషనుకు వచ్చాము. మీనన్ టిక్కెట్టుకొనిపెట్టాడు. రైలెక్కిం చాడు. ఈ రైలులోకూడా అన్ని పెట్టెలలోనూ పరుపులు వున్న బల్లలే. నేను సామాను బల్లకింద పెట్టి నా పక్కచుట్ట తీసి విప్పపోతుంటే, మీనన్ నన్ను వారించి, "అదేమి విప్పకప్పుడు" అన్నాడు. "మరెలా! రాత్రి చలిగదా! నా శాలువేనా తీసుకోనా" అన్నాను.

"అక్కరలేదు. చూస్తూవుండు నేను గారడీచేసి, నీకు తలకిందకు తలగడాలు. కప్పుకోడానికి రెండు రగ్గులు తెప్పిస్తాను." అన్నాడు.

అతని మాటలు పూర్తి కాకుండానే, రైల్వే పోర్టరు ఒకతను తెల్లని చాకలి తెచ్చిన గలీబులు తొడిగిన రెండు తలగడలు, కప్పు కోవడానికి నా అంత బరువున్న రెండు రగ్గులూ, తెచ్చి బల్లమీద పట్టాడు. మీనన్ వాడిచేతిలో ఒక షిల్లింగు పెట్టాడు. నేను వెర్రిమొగం వేసుకొని చూస్తు న్నాను. ఇవి తెచ్చిన నౌకరు వెళ్ళిపోయాడు. రైలులోకి జనం వస్తున్నారు,

మీనన్ నన్ను చూసి నవ్వుతూ.

"ఈ దేశం రైల్వే కంపెనీవాళ్లు ప్రతిరోజూ, ప్రతిమినిషికి, రాత్రులు యివి అద్దెకు యిస్తారు. మనం దిగి వెళ్ళేటప్పుడు వాటిని రైలులో విడిచిపెట్టి వెళితే, వాళ్లు తీసి జాగ్రత్తపెట్టుకుంటారు. ఎప్పటికప్పుడు వాటిని శుభ్రముగా వుంచుతారు." అన్నాడు.

"మరి అందరూ, మనకిమల్లే న్యాయంగా వుండి. యివి కొట్టెయ్యకుండా వుంటారన్నమాటేమి" టని అన్నాను.

అతను నవ్వుతూ "ఇది మనదేశం కాదుగదా! ఈ దేశంలో అలాంటి పని యెవ్వడూ చెయ్యడు. యిలాంటి కక్కుర్తిపనులు యిక్కడికి వచ్చిన మనవాళ్ళూ చెయ్యరు" అన్నాడు మీనన్.

"నువ్వేమీ భయపడవద్దు. జనసమ్మర్దం లేకపోతే, నీవు సుఖంగా పడుకో, లేకపోతే యీ రగ్గులు కప్పుకుని నీచోటులో నువ్వు విశాలంగా కూర్చో, యెంతరద్దీ అయినా, బల్లకు ముగ్గురుకంటే కూర్చోరు. ఇంతకంటే నాలుగోవాడు రాడు. సుఖంగా వెళ్ళు. నీవక్కడ క్షేమంగా చేరినట్లు తక్కిన యేర్పాటులన్నీ నీవు చేసుకోగలిగిన సంగతీ, నాకు సావకాశంగా ఉత్తరము వ్రాయి, నేను వెడతాను. మరింక" అన్నాడు.

ఈ రెండు రోజులనుంచీ అతడు నాకు చూపిన ఆదరం, నాకు చేసిన ఉపకారం, తలుచుకుంటే, నాకు కళ్ళనీళ్లు వచ్చాయి ఈ దూర దేశంలో ముక్కూ మొహం తెలియని నాకు యితనింత ఉపకారము, ఇంత అవ్యాజమైన ఆదరము చూపించడము, యెంత గొప్ప! యెంత విశాల హృదయము! అనుకుని, నమస్కారం చేస్తూ, కొంచెం వణుకుతున్న కంఠంతో, బయటకు వచ్చిన కన్నీటితో నాకృతజ్ఞత అతనికి ముక్తసరిగా రెండు మాటలలో చెప్పగలిగాను. యింతలో రైలు కూత వేసింది. అతను నన్నొక్కమాటు ఆలింగనము చేసుకుని. భయములేదు తమ్ముడూ అన్నీ వాటంతటవే సవ్యంగా జరుగుతాయి. బెంగ పెట్టుకోకు, హాయిగా వుండు.

పరమేశ్వరానుగ్రహం వుంటుంది - అని కరచాలనము చేసి, గబుక్కున రైలు దిగాడు. అతను నాకు చెయ్యి వూపుతుంటే, రైలు కదిలింది. నిలబడ్డ వాణ్ణి నా స్థానములో చతికిల బడ్డాను, రైలులోనూ, బయటా, వున్న జనం వస్తువులూ, ఒక్క క్షణం ఏమీ కనపడలేదు. కళ్ళు తుడుచుకుని కూర్చున్నాను. నా ఎదుట బల్ల మీద వున్న ఇద్దరూ నాకేసి, అర్థగితతో చూశారు.

"నువ్వు కొత్తగా వచ్చావా!" అన్నాడు అందులో ఒకడు, నోట మాటరాక, తలవూపాను.

నీకేమీ భయం లేదులే, ఇక్కడ హాయిగా వుంటుంది. పడుకుని సుఖంగా నిద్రపో అన్నాడు.

"థేంక్‌యూ" అన్నాను, రైలు వేగం అందుకుంది. నా మనస్సు అంతకంటే వేగంగా స్వదేశానికి వెళ్ళింది.

మీనన్ చెప్పినట్లు రైలు ఖాళీగా వున్నదిగదా అని తలగడలు వేసుకుని, రగ్గులు కప్పుకుని, సుఖంగా పడుకున్నాను. ఒక్కక్షణం ఈ సూటు వగైరా మార్చాలా! అనే సందేహం కలిగింది. రైలులో ఈ బాధంతా ఎందుకని అలాగే పడుకుంటే, తీరిపోతుందనుకున్నాను. కాలిజోళ్ళు, మేజోళ్ళు మటుకు తీస్తేగాని వీల్లేదనిపించింది, తలగడాలు బహూమెత్తగా, హాయిగా వున్నాయి. ఇంత మెత్తని తలగడాలు నేనెక్కడా చూడలేదు. నిజం చెప్పాలంటే, మా యింట్లో తలగడాలు రాళ్లలా వుండేవి. ఇటిక బొంత తలకింతపెట్టి, దానిపైన దుప్పటి కప్పితే, మా యింట్లో తలగడాయే అనుకునేవాణ్ని. ఈ దేశంలో దూది, ఇంతమెత్తగా వుంటుంది కాబోలు! అనుకుంటూ కళ్లు ముయ్యబోతుంటే, ఇంతసేపూ, నాకేసే నిదానంగా చూస్తున్న ఎదరబల్లమీద మనిషి, చిరునవ్వుతో గుడ్‌నైట్ సర్, సౌండ్ స్లీప్. ప్లెజంట్ డ్రీమ్స్ అన్నాడు.✓

నేనూ Thankyou అని నవ్వి కళ్లు మూసుకున్నాను. కళ్లు మూయడం తడవుగా నిద్రపట్టింది కాబోలు నాకేమీ తెలియలేదింక. కొంచెం మెలకువ వస్తునట్లు ఉండగా, రైలులో సంచలనం బయలుదేరింది. రైలు అగినట్లు తెలుసుకున్నాను. నా కెదురుగా వున్న సోదరులు మాయమయ్యారు, ఎక్కడ దిగాలో తెలియలేదు. సామానుఏమైనాకూడా మాయమయ్యిందేమోనని అనుమానంతో అడుగున చూశాను. బల్లకింద సామానులు అలాగే మైమరచి నిద్రపోతున్నాయి. రైలు ఆగింది. అందరూ దిగిపోతున్నారు "ఇదేనా ఎడింబరో" అని ఒక అసామీని అడిగాను. "ఔను" అన్నాడు. మీనన్ చెప్పినట్లు రగ్గులు మడిచేసి, తలగడాల మీద పెట్టి సామానుతో సహా దిగాను. ఇప్పుడేమి చెయ్యడమా! అని ఆలోచిస్తుండగా ఒక రైలు బంట్రోతు వచ్చి నవ్వుతూ "మార్నింగ్ సర్" అన్నాడు తన నెత్తిమీద టోపీ ముట్టుకొని.

"హేడ్ సౌండ్ స్లీప్ సర్" (బాగా నిద్ర పట్టినదాండీ) వేరార్ యు

గోయింగ్ సర్. కెన్ ఐ హెల్ప్ యూ సర్ (తమరు ఎక్కడకు వెళ్ళుతారు. నేను చెయ్య గలిగినది ఏమయినా ఉన్నదా) అన్నాడు వినయంతో వాడి వినయ విధేయతలు చూస్తే నాకు ఎంతో ముచ్చటవేసింది. నేను ఎక్కడికి వెళ్ళాలో తెలీదు. ఊళ్ళోకి వెళ్ళి గది ఏదైనా చూసుకునే వరకూ ఏమి చెయ్యడమా అని ఆలోచిస్తున్నాను. "ఈ స్టేషనులోనే గదులుంటాయండీ. ఈ సామాను అందులో పెడతాను. మీరు సావకాశంగా ఫలహారము అదీ చేసి, ఊళ్ళోకి వెళ్ళవచ్చును. సామాను ఇక్కడ జాగ్రత్తగా ఉంటుంది అవసరమైతే ఒకటి, రెండు రోజులు ఆ గదిలోనే కొద్దిపాటి అద్దె యిచ్చి ఉండవచ్చును." అన్నాడు.

బ్రతుకు జీవుడా అనుకొని, "థాంక్ యూ అన్నాను. వాడు నా సామాను సహితముగా నన్నో గదిలోకి తీసుకువెళ్ళి. సామాను అక్కడ పెట్టి పక్కనున్న చిన్నగది మరొకటి చూపించి," అందులో మీరు కాల కృత్యాలు తీర్చుకోవచ్చును. అక్కడ గోడనున్న బొత్తాములాటిదినొక్కితే మనిషివచ్చి మీకు ఫలాహారము వగైరా తెచ్చి పెడతాడు అని నాకో సలాము పెట్టి నెమ్మదిగా గది తలుపు తన వెనకాల మూసుకుని బయటకు వెళ్ళిపోయాడు. చాలా ఆశ్చర్య మనిపించింది. సరే ఏకంగా వెళ్ళేటప్పుడు ఏదేనా ఇవ్వవచ్చు ననుకున్నాను. నేనుకోటు వగైరా దుస్తులు తీసివేసి కాల కృత్యాలు తీర్చుకుని ఒక అరగంటలో మళ్ళీ డ్రస్సు వేసుకుని వాడు చెప్పిన బొత్తాము నొక్కాను. అర నిమిషంలో భూమిలోంచి వచ్చినట్లు ఒక మనిషి ఎదురుగుండా వచ్చి నిలుచుని, గుడ్‌మార్నింగ్ సర్ అని "తమకేమి కావాలి?" అని ఎంతో భయభక్తులతో అడిగాడు. నాకు ఫలహారమూ, టీ తెచ్చి పెట్టమన్నాను. ఈ నాలుగైదు రోజులలోనూ ఈ పద్ధతులన్నీ బాగా అలవాటు అయినాయి. "క్షణంలో తీసుకువస్తానండి" అని అతను బయటకు వెళ్ళి అన్నట్టుగానే మరుక్షణంలో అన్నీ తీసుకు వచ్చి బల్లమీదను అమర్చి, మళ్ళీ ఏమైనా కావలిస్తే ఆబొత్తాము నొక్కండి. అని చెప్పి తలుపు మూసుకుని వెళ్ళిపోయాడు.

నేను సుఖముగా ఫలహారము చేసి బయటకు వెళ్ళే ప్రయత్నములో ఆ బొత్తాము నొక్కాను. ఇందాకటి మనిషి మళ్ళీ వచ్చాడు. "నాకీ వూరు కొత్త. నే నెప్పుడూ యీ వూరు రాలేదు. ఇక్కడ చదువుకోడానికి వచ్చాను. కొంత కాలముపాటు ఇక్కడే ఉండాలి కదా! ఉండడానికి ఒక గది కావాలి. ఎక్కడ దొరుకుతుంది? యెలా వెళ్ళాలి? యెలా ప్రయత్నము చెయ్యాలి? " అని నిర్మోహమాటముగా, అడిగాను, నేను

నిలబడేఉన్నాను. అతనూ నిలబడే వున్నాడు. నేను చెబుతాను తమరు దయచెయ్యండి, అని కుర్చీ చూపించాడు. తను మాత్రము నిలబడే ఉన్నాడు. తమకు యూనివర్సిటీకి దగ్గరగా ఉంటే, వీలుగా ఉంటుంది కదా! ఇక్కడ " ఈ ట్రాము ఎక్కి నే చెప్పే వీధి దగ్గర అపమంటే ఆపుతాడు. అవన్నీ నివాస గృహాలుండేచోటు, అక్కడయేవీధిలో చూసినా 'Room to let' (గదులు అద్దెకివ్వబడును) అని అట్టల మీద వ్రాసి, కిటికీలకు కట్టి వుంటాయి. మీరు గుమ్మానికి కుడిపక్కనో ఎడమపక్కనో ఉండే బొత్తా ములలో ఒకదానిని నొక్కితే, తలుపు తీస్తారు. గుమ్మానికి ఎడమవైపున ఈ అట్ట కనబడితే, ఎడమవైపు బొత్తాము. కుడిప్రక్కను కనబడితే కుడి వైపు బొత్తాము నొక్కాలి. క్రింద భాగంలో అయితే క్రింద బొత్తాము, పై అంతస్తులలో అయితే, ఆ అంతస్తు బొత్తాము నొక్కాలి. అప్పుడు మీకు వీలయిన గది, వీలయిన వీధిలో, వీలయిన అద్దెలో, ఎన్నుకోవచ్చును" అన్నాడు.ఎంతో ఓపికగా ఎంతో సావకాశముగా, ఎంతో వినయముగా, చెప్పాడీ సమాచారమంతా. నేను "థేంక్‌యూ"అని బయటికి వచ్చాను. నా వెనక అతను లోపలున్న, నేను ఫలహారము చేసిన పళ్లాలు వగైరా తీసు కుని, తలుపు మూసి, బయటకు రావడము గమనించాను. రోడ్డు మీదకు వస్తుంటే, చాలామంది నాకేసి తేరిపార చూడడం ఒకరిద్దరు మందహాసము చేయడం గమనించాను. నవ్వితే నాకేమి? వాళ్ళమూతే వంకర పోతుంది అనుకుని ట్రాము నిలిచే చోటు తెలుసుకుని అక్కడకు వెళ్ళి నిలబడ్డాను. స్టేషనులో అతను చెప్పిన నెంబరు ట్రాము రావడముతోనే అదెక్కి అతను చెప్పినచోట దిగాను.

# 8

అక్కడొక చిన్న పార్కు వున్నది. యెంతో మంది పిల్లలు, కొందరు వంటరిగానూ, కొందరు తల్లులతోటి వచ్చి అందులో ఆడుకుంటున్నారు. నాకు వాళ్ళను చూస్తే యెంతో ముద్దు వచ్చింది, ఒక క్షణం వాళ్ళ ఆటలు చూస్తూ అలా నిలబడిపోయాను. నాకు తెలియకుండానే నాము ఖంలోకి చిరునవ్వు వచ్చింది. కొందరు పిల్లలు నన్ను చూచి దూరముగా తొలగిపోయారు. ఒకరిద్దరు సాహసించి నా దగ్గరకు వచ్చి కళ్లు పెద్దవిచేసి, భయముతోనూ, ఆశ్చర్యముతోనూ, నన్ను చూస్తూ నిలబడిపోయారు.

నా వెనుకను కొంచెము దూరములో ఒకళ్ళిద్దరు పిల్లలు, నన్ను చూచి పరుగెత్తుకువెళ్ళి తల్లులను కౌగలించుకుని "మమ్మీ, మమ్మీ, దేర్

ఈజ్ బ్లాక్ మమ్మీ (నల్లని మనిషి అమ్మా)" అన్నారు. ఇంకొకడు "అమ్మా ఆ నల్లటాయన పిల్లల్ని యెత్తుకుపోతాడా" అన్నాడు. "యింకొకడు అమ్మా అతనెప్పుడు స్నానము చేయడా" అన్నాడు. వాళ్ళ తల్లులు వాళ్ళ నోళ్లు నొక్కి "తప్పు అలా అనకూడదు. ఇంకనెప్పుడైనా అలా అంటే దెబ్బలు తగులుతాయి జాగ్రత్త" అని భయపెట్టారు. నా దగ్గరకు వచ్చిన పిల్లలను చూచి వాళ్ళ ధైర్యానికి సంతోషించి "హలో" అని వాళ్ళను పలకరించపోయాను.

వాళ్లు హడిలిపోయి పారిపోయారు. నవ్వుకుంటూ నా దారిన నేను ముందుకు సాగాను. యెంతో దూరము వెళ్ళనక్కర లేకుండానే ఒకవీధిలో స్టేషనులో అసామీ చెప్పినట్లు "గదులు అద్దెకివ్వబడును" అనే బల్లలు కనపడ్డాయి. అలాంటి ఒక ఇంటి ముందుకు వెళ్ళి గుమ్మానికి ఉన్న బొత్తాయి నొక్కి నిలబడ్డాను. ఒక ముసలమ్మ తలుపుతీసి నా ముఖంకేసి చూచి యెంతో అసహ్యముతో "ఓహ్" అని భళ్లున తలుపు వేసుకుని చక్కా పోయింది. నవ్వుకుంటూ నేను మరో యింటికి వెళ్ళాను. అక్కడ ఒక నడివయస్సావిడ తలుపుతీసి నన్ను యెగాదిగాచూస్తూ "ఏం కావాలి" అన్నది. "గది కావాలన్నాను" "గదులు ఖాళీ లేవండీ, వెరి సారీ" అని మర్యాదగా అబద్ధమాడి వెళ్ళిపోయింది. మరొక చోటకు వెళ్ళితే ఆ యింటి ఆవిడ నా బోంట్లకు తమ గది అద్దెకివ్వడం ఇష్టము లేనట్లు ముఖములో ప్రకటిస్తూ బోలెడంత అద్దె చెప్పింది. ఆవిడ భావం గ్రహించుకుని బయట పడ్డాను.

ఇంకొక యింటి దగ్గర ఒక ముసలమ్మ తలుపుతీసి, ఏదేశం మీది ఆఫ్రికా దేశమా? అన్నది. "కాదు ఇండియా" అన్నాను. "ఓహో! ఇండియా. చాలా సంతోషం. అక్కడ యెవరైనా మహారాజుబిడ్డవా" అంది. నేను నవ్వుతూ కాదన్నాను. "నేను మహారాజునేమీ కాదు మామూలు వాడినే ఇక్కడ చదువుకోడానికి వచ్చాను. గది కావాలి" అన్నాను.

నవ్వుతూ, విచారం వ్యక్తం చేస్తూ, "ప్రస్తుతం ఖాళీలేదు. ఒక వారము రోజులలో ఒక గది ఖాళీ అవుతుంది. అప్పుడు వస్తే యిస్తానంది ఆ మాటకే సంతోషించి మరికొంత దూరము ముందుకు వ వెడుతుండగా మన దేశస్థుడు ఒకతను నా కెదురుగుండా వస్తున్నాడు. నా ప్రాణం లేచివచ్చినట్టయింది. రక్షించావు నాయనా అనుకున్నాను. అతనిని ఆపి గుడ్ మార్నింగ్" అని నా అవస్థ చెప్పి, ఏం చెయ్యాలో నాకు సలహా యివ్వమన్నాను. "సరే నాతోటిరా" అనికొంచెం సమీపములో ఉన్న

ఇండియన్ అసోసియేషన్ అని బల్ల కట్టబడిన ఒక పెద్ద యింటిలోనికి తీసుకువెళ్ళి, అక్కడ హాలులో నన్ను కూర్చోపెట్టి తనూ నాకెదురుగుండా కూర్చుని "ఇక చెప్పు నీ సంగతి" అన్నాడు ఇంగ్లీషులో.

అక్కడికి చాలా మంది మన దేశస్థులు లోపలికివచ్చే వాళ్ళూ. పోయే వాళ్ళూ కనపడ్డారు. నేను నా సంగతంతా చెప్పాను. అతను సావకాశముగా విన్నాడు. తను బెంగాలీ వాడినని చెప్పాడు. ఇంకా యేదో చెప్పబోతుంటే చూడగానే తెలుగువాడిలా కనబడే వ్యక్తి ఒకరు లోపలికి వచ్చాడు. నా యెదుటనున్న బెంగాలీ అతను "హలో రాజా, కమ్‌హియర్" అనిపిలిచాడు. అతను వచ్చి నిలబడ్డాడు. కూర్చో ఇతను మీవాడు. మీ ప్రాంతము నుంచి వచ్చాడు. గదికోసం తిరుగుతున్నాడట. నువ్వు అతనికి ఏదయినా గది చూపించి యెక్కడో ఒకచోట ప్రవేశపెట్టు పాపం.



లేకపోతే చాలా యిబ్బంది పడతాడు. మనం ఒకళ్ళకొకళ్ళం చేదోడు వాదోడుగా ఉండకపోతే, ఇక్కడ యెలా బ్రతుకుతాం, ఏమంటావు - అన్నాడు మందహాసంతో

ఓ తప్పకుండా, అలాగే నేను చూస్తాలే. నువ్వువెళ్ళు అన్నాడు రాజు. అతను లేచి "అబ్బాయీ మనం మళ్ళీ కలుసుకుందాము. ఈ రాజు మీ ప్రాంతమువాడే. చాలా మంచివాడు, మీకు కావలసిన సహాయం అతను చేస్తాడు. నాకు పని వుంది. నేను వెళ్ళుతున్నాను." అని నాక రచాలనంచేసి వెళ్ళిపోయడు. అతను ఖాళీ చేసిన కుర్చీలోకి రాజు వచ్చి కూర్చుని "ఏం బాబూ! మీదేవూరు, ఎక్కడ నుంచి వచ్చావు. ఎప్పుడు వచ్చావు. సంగతి సందర్భాలు అన్నీ చెప్ప నాయనా అంటూ, తనది భీమవరమనీ, అందుచేత తెలుగువాడిననీ, క్షత్రియుడననీ చెప్పకొని, ఇంకచెప్ప నీ సంగతి" అన్నాడు. టూకీగా - ఒక్క అక్షరం కూడా పొల్లు పోకుండా, అప్పటి వరకూ జరిగిన వృత్తాంత మంతా చెప్పాను. "నీ సామానూ అదీ యెక్కడ ఉందన్నాడు." "స్టేషనులోనేపెట్టాను" అన్నాను "సరే అయితే లే. వెళుదాము. నీ సామాను తీసుకొని నాగదికి చేరుద్దాము నీకు గదిదొరకే వరకూ నా దగ్గర ఉందువుగాని నీకేమీ ఇబ్బంది ఉండదు. సుఖంగానే ఉంటుందిలే" అన్నాడు. నేను బయలుదేరి స్టేషనుకు వెళ్ళి సామాను తీసుకొని అక్కడ నౌకర్లకు మామూలు చెల్లించుకుని రాజు గదికి చేరుకున్నాను.

# 9

నేను కొంతసేపు సుఖంగా అక్కడ విశ్రయించాను. సాయంత్రము నాలుగ్గంటలకు నేనేమీ చెప్పకుండానే, ఇంటి ఆవిడ నాకు టీ రొట్టెవగైరా తీసుకువచ్చి బల్లమీద అమర్చింది. నేను అది ఆరగించి, ఆ గదిలో పుస్తకాలు తిరగవేస్తూ, కాస్సేపు కూర్చునేసరికి రాజు కాలేజీ నుంచి వచ్చాడు. "ఏమండీ సావకాశంగా విశ్రాంతి తీసుకున్నారా? టీ తీసుకున్నారా?" అని అడిగాడు. "ఆహా అన్నీ అయినాయి. ప్రాణం యెంతో హాయిగా ఉన్న దిక్కడ" అన్నాను. రాజు పుస్తకాలక్కడపడేసి స్నానాల గదిలోకి వెళ్ళి ముఖప్రక్షాళణ చేసుకుని వచ్చేసరికి, యింటి ఆవిడ మళ్ళీ అతనికి, నాకూ టీ ఫలహారాలూ, తీసుకు వచ్చింది. "నాకేమీ వద్ద"న్నాను. అప్పుడు తను నాకు నేర్పిన ప్రధమ పాఠము ఏమిటంటే "ఇక్కడ ఏ వేళప్పుడు యెవరు

ఇచ్చినా టీ మట్టుకు వద్దన కూడదు. మనదేశంలో కాళ్ళుకడుక్కోవడానికి నీళ్ళూ, సేద తీర్చుకోడానికి చల్లని మంచినీళ్ళూ, గుమ్మంలోనికి రాగానే ఇచ్చినట్లు ఈ దేశంలో అన్ని వేళలా కష్టములోనూ, సుఖములోనూ కూడా, ముందు టీ యిస్తారు. అది వద్దన కూడదు.'' అన్నాడు రాజు.

టీ తీసుకున్న తరువాతను నా చరిత్ర సవిస్తరంగా చెప్పమని రాజు అడిగాడు. ''అసలుమీది ఏ వూరు'' అన్నాడు? నేను ''మొగల్తుర్రు'' అన్నాను ''ఏమిటి! మొగల్తుర్రే! మాకు దగ్గర వాడవేవన్నమాట. ఆ వూళ్ళో మా బంధువులు కూడా చాలామంది వున్నారు. మాది పూర్వం పోడూరులే'' అన్నాడు. తరువాత నా సంగతంగా వివరముగా నే చెప్పగా సావధానముగా విన్నాడు. నాకేదైనా గది చూసిపెట్టి కాలేజీలో చేర్పించి సహాయం చెయ్యమని కోరాను. ''అలాగే తప్పకుండా చేస్తాను. యిదో పెద్ద సహాయం ఏమిటి? పరదేశంలో మనం ఒకళ్ళ కొకళ్ళు సహాయం చేసుకోకపోతే, పరాయివాళ్లు యెవరు ఏమి చేస్తారు?'' ఈ పూట కాసేపు బయటకు వెళ్ళి పార్కులో కూర్చుని కబుల్లు చెప్పకుందాము. రేపు వుదయాన్నే గది చూద్దాం అని అన్నాడు. మేమిద్దరమూ బయలుదేరి దగ్గరలోనే వున్న పార్కులో వెళ్ళి కూర్చున్నాము. అప్పటికి సుమారు ఆరు గంటలయింది. బాగా చీకటి పడిపోయింది. అయినా జనం కిటకిటలాడుతున్నారు. ఆడా, మగా యెంత మందో! అదివరకు అక్కడ ఆడుకుంటున్న పిల్లలందరూ బిలబిల్లాడుతూ, తొందర తొందరగా యిళ్ళకు పరుగులు పెడుతున్నారు. పార్కులోకి వచ్చినవాళ్ళలో చాలా మంది యువతీ యువకులు జంటలు జంటలుగా బల్లమీద కొందరూ, కిందవున్న గడ్డిమీద కొందరూ కూర్చునీ పడుకునీ నవ్వుకుంటూ, కబుర్లు చెప్పకుంటూ, మధ్య - మధ్య ఊపిరాడకుండా, గాఢాలింగన చుంబనాదులు కావిస్తూ ఈ ప్రపంచం మరచి మరో ప్రపంచంలో వుండిపోయారు. అందుచేతను, మాకేసి చూసిన వాళ్ళే ఎవరూ కనపడలేదు. తమరు తప్ప ఆపార్కులో ఇంకెవరూ లేనట్టుగానే భావించుకుని ఆనందిస్తున్నారు. అందుచేతను మేమూ హాయిగా, గడ్డిమీదనే ఒకచోట సుఖంగా కూర్చున్నాము.

''బాబూ! మీ పేరేమిట''న్నాడు రాజు. ''నన్ను పార్వతీశం అంటారు. మా యింటిపేరు వేమూరివారు'' అన్నాను. సరేబాగుంది కాని, ఇక్కడ సంగతి సందర్భాలూ, ఆచార వ్యవహారాలూ, కొన్ని టూకీగానైనా మీకు చెప్పాలి. ఆ పద్ధతులు మీరు తెలుసుకుంటే, వాటికి అనుకూ

లంగా మనం ప్రవర్తిస్తే మనకాట్టే యిబ్బందులు వుండవు. మొదటి సంగతి ఏమిటంటే మీపేరు ఏమిటని ఎవరేనా అడుగుతే, పార్వతీశం అని చెపితే చాలు. అంటారు. కంటారు, వింటారు లాటివి ఏమీ చేర్చక్కరలేదు ఇంటిపేరు వాళ్ల కవసరం లేదు.

ఇక తరువాత సంగతి. ఇక్కడ గదులు అద్దెకు తీసుకోవడము విషయము మీకు చెప్పాలి. ఇక్కడ గదులు అద్దెకు యిచ్చేవాళ్లను అందరినీ "లోయర్ మిడిల్ క్లాస్" అంటారు. అంటే మనబోటి మధ్య తరగతి కుటుంబాలలో తక్కువ స్థితి గలవాళ్లు అన్నమాట. సాధారణంగా వితంతువులు. కాని, వివాహమే ఎరుగని వృద్ధ కన్యలు కాని, సంపాదన తక్కువగా ఉన్న భార్యాభర్తలు కాని, తమకు అవసరమైన వాటికంటే ఒకటి రెండు గదులు ఎక్కువగా ఉండే ఇళ్లు అద్దెకు తీసుకొని, వాటిలో వారికి అవసరములేని గదులు రెండు అద్దెకు యిస్తారు. ఆ గది కుర్చీలు సోఫాలు వగైరాలతో అలంకరణ చేసి కూడా ఉంటుంది. అంటే మూడు నాలుగు కుర్చీలు, ఒక సోఫా, ఒక టేబులూ, ఒక మంచం, పరుపూ, దానిమీద తలగడలూ, పక్క దుప్పటీ, కప్పుకోవడానికి రగ్గులూ, తుడుచుకోవడానికి తువ్వాళ్లూ కూడా ఉంటవన్న మాట. గది అద్దె వాటన్నిటికీ కలుపుకునే నన్నమాట. అంతే కాదు తువ్వాళ్లూ, సబ్బులూ కూడా వాళ్లే యిస్తారు. తరువాత ప్రతి గదిలోనూ - నా గదిలో నీవు చూసే వుంటావనుకుంటాను. ఫైర్ ప్లేస్ అనేది ఒకటి ఉంటుంది. గోడలో ఒక పొయ్యి అమర్చి అందులో బొగ్గులు పేర్చి నిప్పవేస్తారు పొగ గదిలోకి రాకుండా పైకి పోయేటట్లు ఒక గొట్టము ఉంటుంది. ఇది సంవత్సరములో ఏడే నిమిది మాసములు అహర్నిశంధులు రావణాసురుడి కాష్టంలా రాజుతూనే ఉంటుంది. ముఖ్యంగా శీతాకాలంలో ఆ పొయ్యి దగ్గరనే కుర్చీలు వేసుకుని కూర్చుంటారు. గదిఅంతా వెచ్చగా ఉంటుంది మీ రీపాటికే అది కనిపెట్టేఉంటారు.

ఇక్కడ ఒక చిదంబర రహస్యం వుంది. ఈదేశస్థులు, ముఖ్యంగా తక్కువ జాతివారు. మొహమూ అదీ కడుక్కోరు. అన్నాడు. నేను నిర్ఘాంతపోయి "అదీ కడుక్కోరా?" అన్నాను. అది ఎవ్వళ్ళూ కడుక్కోరు. అన్నాడు. "మరయితే" అన్నాను. మనం బయటకు వెళ్ళేచోట, పక్కను కాగితాల చుట్టవుంటుంది. అందులో కాగితం చుట్ట తీసుకుని దానితో తుడిచేసుకుని మల విసర్జన చేసిన కమ్మోడ్ అనే పింగాణీ దాంట్లో పారవేస్తారు. అక్కడ కనపడే గొలుసు లాగుతే అందులోకి నీరు

విశేషంగా వచ్చి ఈ మలాన్నంతనీ శుభ్రంగా కడిగేసి అడుగుకు ఎక్కడికో తీసుకుపోతుంది. ఇది శీతల దేశం గనుక అంత త్వరగా దుర్గంధము పైకి రాదు. మొహమే కడుక్కోని వాళ్ళూ, రోజూ స్నానమే చెయ్యరన్నమాట వేరే చెప్పడమెందుకు? అన్నాడు. మరయితే మనమో అన్నాను. మీ కిష్టమైతే మీరూ మానేయవచ్చునన్నాడు. "అదేమిటండీ అలా అంటారు. నేను బ్రాహ్మణ్ణి, అందులోనూ వైదీకిని. సంధ్యా వందనాదులే కుదరక మానేస్తున్నందుకు విచారిస్తుంటే, స్నానం కూడా ఎలా మాననండీ' - అలా అయితే, ఇక్కడొక్క క్షణము ఉండనండోయి. మీరేమన్నాసరేపోనీ, ఒక మాటు దేశము చూశావనుకుని చక్కా పోతానుగాని యింత మరీ అనాచారముగా, అప్రాచ్యముగా ఉండడము నావల్లకాదు సుమండీ. తరువాతను మీ యిష్టం" అన్నాను. "సరే లెండి. నా యిష్టా యిష్టాలతోటి, పనేమి ఉన్నదిగాని మిమ్మల్ని మానమని చెప్పలేదు. స్నానానికి వేడి నీళ్ళు కావాలంటే ఇంటి వారితోటి చెబితే వారు సప్లయి చేస్తారు. మరేమీ ఫరవాలేదు" అన్నాడు.

"ఇది ఒకందుకు మంచిదే" అని నేను "దంత ధావనానికి కచికలూ, తాటాకులూ, తెచ్చుకోవడము మంచిదే అయిన దన్నమాట!" అన్నాను.

అతను తెల్లబోయి, ఏమిటి కచికలూ, తాటాకులూ, తెచ్చారా? ఇన్నాళ్ళూను. మనలో మనమాట. మరేమీ తీసుకురాలేదా? ఇక్కడ దేశాచారము అక్షరాలా పాటిస్తున్నారా యేమిటి కొంపతీసి అన్నాను. "అయితే మీరు వచ్చేటప్పుడు ఎవ్వరినీ సలహా అడగలేదా!" అన్నాడు.

"నాకు సలహా చెప్పదగ్గవారు ఉన్నారండీ మొగలి తుర్రులో, మీరు ఎరుగరా?" అన్నాను.

ఒక్కమాటు నాకేసి నిదానంగా చూసి, "అవునులెండి. ఆ మాటా నిజమే. ఆ మాత్రము వాళ్ళు అక్కడే కాదు. ఆ చుట్టు ప్రక్కల ఎక్కడావుండి వుండరు. సరే, పోనీలెండి చెయ్యడము మంచిపని చేశారు గాని, అవి పాడయిపోయే వస్తువులు కావు గనక జాగ్రత్తగా పెట్టుకోండి. వెళ్ళేటప్పుడూ ఉపయోగించుకుందురుగాని - మనము గదికి వెళ్ళేటప్పుడు మీకు దంతధావన సామాగ్రి, ఇక్కడ ఉపయోగించేని కొనిపెడతాను" అన్నాడు పాపం అతను.

తరువాత భోజనానికి మనము ఎక్కడకూ హోటలుకు వెళ్ళనక్కర లేదు. ఇంటివాళ్ళే మనకు ఏమి కావాలో చెబితే ఆ ప్రకారము చేసిపెడ

తారు. దానికి వాళ్ళు కొంత డబ్బు తీసుకుంటారు. యెంత తీసుకున్నా హోటలు భోజనముకంటె తక్కువ ఖర్చే అవుతుంది. మీరు బ్రాహ్మణులూ, వైదికులూ ఆయెను నేను తినే మాంసమూ, చేపా, వగైరా మీరు ముట్టుకోరుగా, యింటివారితోటి మీరు శాకాహారినని చెప్పి, బియ్యమూ, వుప్పూ వగైరా కావలసిన సామగ్రి చెబితే వాళ్ళే తీసుకు వస్తారు. అది యెలా వండాలో మీకు తెలిస్తే వాళ్ళకు చెప్పండి. లేకపోతే వాళ్లు చేసి నట్లు తినవలసి వుంటుంది. పది రోజులు పోతే, అన్నీ మీకే అలవాటు అవుతాయి. అన్నాడు. "అబ్బో అదేమీ అక్కరలేదండి. నాకు ఇవన్నీ బాగా అలవాటే మా యింటి దగ్గర మా అమ్మ బయట వున్నప్పుడు, మా నాన్న పొలము వెళ్ళినా, పొరుగూరు వెళ్ళినా నేనే చెయ్యి కాల్చుకో వలసివచ్చేది. చాలా బాగా చేశానని మా అమ్మ మెచ్చుకొనేదికూడాను. ఉండండి నేను ఎక్కడో ఒకచోట స్థిరపడ్డ తరువాతను నాచేతి భోజనము మీకు రుచి చూపిస్తాను. ఒక రోజున" అన్నాను. "చాలా సంతోషమండీ, అంతకంటేనా మళ్ళీ ఓమాటు మాయింటికి వెళ్ళి వచ్చినట్టు వుంటుంది కూడా" అన్నాడు నవ్వుతూ.

ఇంక అక్కడనుంచి లేచి నెమ్మదిగా గదికి చేరుకున్నాము. అక్కడ ఆయనకు మామూలు భోజనము. నాకుకొద్దిగా అన్నమూ, బంగాళాదుంపల కూరా, పాలూ ఇచ్చారు. కూరంటే ఊరకే దుంపలు ఉడకవేసి అది మెత్తగా కుమ్మి పెట్టారన్నమాట. నాకు కావలసిన వుప్పూ, పచ్చి కారమూ, దానిమీద చల్లుకోవాలని మా మిత్రుడు చెప్పాడు. "యీ ధర్మ సూక్ష్మము ఇదివరకే గ్రహించాను" అన్నాను.

భోజనము అయిన తరువాతను అక్కడ సోఫామీద రెండు తలగడలూ, రెండురగ్గులూ, రైలులోకిమల్లే ఇంటావిడ తీసుకువచ్చి పడవేసింది. అతను మర్యాదగా "నేనీ పూటకు సోఫామీద పడుకుంటాను. మీరు నా మంచం మీద పడుకోండి" అన్నాడు. "అబ్బెబ్బే యెంతమాట. నేను సోఫామీద పడుకోగలను. నాకు బాగా అలవాటే" అన్నాను. నా జీవితంలో చాలాభాగం సోఫాల మీదనే పడుకోవడము అలవాటైనట్లు అతను మరి కొంచెము బలవంతము చేసినా నేను ఒప్పుకోలేదు. సోఫామీద కూడా యెంతో సుఖముగానే వుంది. మరి కొంచెము సేపు పిచ్చాపాటీ మాట్లాడుకుని నేను సోఫామీదా అతను మంచం మీదా ఒరిగాము. "ఎడింబరో"లో మొదటి రాత్రి సుఖ స్వప్నాలు కంటూ గడిపాను.

ఆ రాత్రి రాజింట్లో సుఖంగా నిద్రపట్టింది. యెన్నెన్నో చిత్ర

విచిత్రమైన కలలొచ్చాయి. యెక్కడికెక్కడకో తేలిపోతున్నట్లనిపించింది. ఆకాశంలో పెద్ద చేపల్లాంటి వేవో యెగురుతున్నట్టు కనపడింది. నక్షత్రా లెంతో దగ్గరగా కనపడ్డాయి. యింకేవిటో వింతలు అనేకం కనబడ్డాయి. మెళుకువ వచ్చేటప్పటికి యేమీ లేదు. ఆ కనపడ్డవి లేకపోవడం సరికదా వాటిని గురించి ఎవరికైనా చెబుదామంటే జ్ఞాపకాలైనా మిగల్లేదు. ఇంటి దగ్గర అలవాటు చొప్పున బాగా పెందలాడే మెళుకువ వచ్చింది. రాజు గాఢనిద్రలో వున్నాడు లేపుదామా అనుకున్నాను. కాని పడుకున్న వాడిని యిపుడు లేపి చేసేది మట్టుకు ఏమున్నదని లేపలేదు. కిటికీ దగ్గరకు వెళ్ళి బయటకు చూస్తే ఇంకా జన సంచారమేమీలేదు. చీకటిగానే వుంది. అందుకని నేను మళ్ళీ వచ్చి పడుకున్నాను. ఈ మాటు నిద్రరాలేదు. కాని ఏ వేవో ఊహలు కలలుగా అస్పష్టంగా తలలో తిరగడం మొదలెట్టినాయి. ఈ దేశమేమిటో, ఇక్కడ మనుష్యులేమిటో, వాళ్ళ ఆచారవ్యవహారము లేమిటో, యేమీ తెలుసుకోకుండా గుడ్డెద్దు చేనబడినట్టు ఏ ఆలోచనా లేకుండా బయలు దేరి చక్కా వచ్చాను. వచ్చి అప్పుడే వారం రోజులయినా ఇంత వరకేమీ అంతుపట్టలేదు. నేను కొత్తవాణ్ణ యినా, చిన్న వాడినయినా అంతా "సర్" అంటూ యెంతో గౌరవంగా మాట్లాడుతున్నారు.

ఇక్కడ పురుషులకంటే స్త్రీ జనం యెక్కడ చూసినా యెక్కువగా కనపడుతున్నారు. వాళ్ళకేమీ నదురూ, బెదురూ ఉన్నట్టు కనపడలేదు. నడివీధులంటా, షాపుల్లోనూ, రైళ్ళలోనూ, ఒళ్ళు విరుచుకొని అందరినీ, ఆ తోసుకు తిరిగడం చూస్తే నాకు భయంగానూ, వింతగానూ వున్నది. రేపొద్దున నేను వీధిలోకెళ్ళినా, స్కూల్లో చేరినా, వీళ్లు కూడా అక్కడ తయారవుతారు కాబోలు, దూరాన్నించి చూస్తేనే కొంత బెదురుగానూ, కొంత సిగ్గుగానూ వుంటే, వాళ్ళస్తమానం మీదమీదకి వస్తే, క్లాసులో ఈ ప్రక్కనీ, ఆప్రక్కనీ, వీళ్ళే తయారవుతే, మేష్టర్లు చెప్పేది వినడమెలాగ? ఆ విన్నది తలలో నిలుపుకోవడమెలాగ! ఈ ఆడవాళ్ళతోటి యెలా గైనా కొంత చిక్కు వచ్చేటట్టు వున్నది. చూద్దాం ఏం జరుగుతుందో తినబోతూ రుచి అడగడమెందుకు? పైన భగవంతుడెలాగూ వున్నాడు. ఈ వేళయినా గది దొరుకుతుందో దొరకదా! లేకపోతేయెలాగ! రాజు నెత్తిన యెన్నాళ్లు కూర్చోవడం? అయినా దొరక్కేం చేస్తుంది. ఇంత పెద్ద పట్నంలో ఇన్ని భవంతుల్లో ఈ బ్రహ్మచారికి దొరక్కపోతుందా? యెటొచ్చీ బ్రహ్మచారులను తీసుకోమంటే తప్ప అయినా ఇక్కడేమీ అటు వంటిబ్బంది వుంటుందనుకోను.

ఇలా ఏవేవో వెర్రి ఆలోచనలతో సతమతమవుతుంటే, బాగా వెల్తురొచ్చింది. మా గది తలుపుమీద నెమ్మదిగా యెవరో కొట్టిన చప్పుడైంది. నేను ఈ దేశంలో వున్న సంగతి మరచిపోయి "ఆ వస్తున్నా" అని యింటి దగ్గర కేకేసినట్టు కేకేశాను. దాంతో రాజు ఉలిక్కిపడిలేచి, "ఏమండి ఏమిటి కలవరిస్తున్నారు" అన్నాడు నవ్వుతూ, "కలవరింత కాదండి అవతల నుంచి యెవరో తలుపుకొట్టిన చప్పుడైతే అలవాటు చొప్పున వస్తున్నానని కేకవేశాను" మీకు నిద్రాభంగమైనట్టుంది అన్నాను. "మరేం ఫరవాలేదులెండి. ఏలాగూ తెల్లవారిందికదా. మనల్ని లేపడానికే ఇంటి ఆవిడ అలా తలుపు కొట్టింది. అది ఆవిడకు మామూలు, ఇపుడావిడేకాదు. ఇక్కడాచారమేమిటంటే యింట్లో వాళ్ళయినా, పరాయి వాళ్ళయినా తలుపు దబదబా బాదకుండా వేళ్ళతోటి నెమ్మదిగా టక్‌టక్‌మని రెండుసార్లు కొడతారు. మనం అప్పుడు "యస్" అని గాని, "కమిన్" అని గాని ఇంట్లో వాళ్ళయితే అనాలి. పైవాళ్ళెవరైనా వచ్చారనుకుంటే "కమిన్‌ప్లీజ్" అనాలి. దయచేసి లోపలికి రండి అన్నమాట. ప్రతిదానికి యెదుటివాళ్ళు పిన్నలైనా, పెద్దలైనా, వయస్సుతో నిమిత్తం లేకుండా అందర్నీ అన్నిటికి ప్లీజ్ అనీ థేంక్యూ అనీ అనడం యిక్కడమర్యాద. ఆ మాటతో వాళ్ళెంతో సంతోషిస్తారు. మనం చాలా మర్యాదస్తులంగా చెలామణీ అవుతాం" అని చెప్పి "లేవండి ముఖాలు కడుగుదాం" అన్నాడు.

నేను రాత్రి సరిగా చూడలేదు కాని రాజు ఓ పొడుగైన చార్లషరాయీ, అలాంటి చార్లదే ఓ కోటు తొడుక్కున్నాడు. ఇప్పుడు లేవడంతోటే పాదాల వరకూ ఉండే పెద్ద కోటొకటి తొడుక్కున్నాడు. దానికి బొత్తాములు లేవు. నడుముకు ఓ పట్టు కుచ్చులతాడు బిగించాడు. అది వింతగాతోచింది. అలా ఆశ్చర్యంతో చూస్తూంటే "దీన్ని డ్రెస్సింగ్ గౌను అంటారు. లోపల వేసుకున్న షరాయి. చొక్కాని "పైజామా" అంటారు. మనం సూటుతోటే రాత్రుళ్లు కూడా ఉంటే మనకంత సుఖంగానూ ఉండదు. పైగా అది నలిగిపోతుంది కూడాను. ఇక్కడ సూట్లు అస్తమానం తడపడానికి దానికి వీలుండదు. మనలాంటి వాళ్ళకు ఒకటో రెండో సూట్లు చలికాలానికీ,. ఒకటి రెండు సూట్లు వేసవి కాలానికీ కుట్టించుకుంటే ఒకటి, రెండు సంవత్సరాలు గడపవచ్చు. ఇంటి దగ్గర ఉన్నంతసేపు రాత్రిగాని, పగలుగాని ఈ పైజమాలు వేసుకుంటే మనం ఎలా కూర్చున్నా, ఎలా పడుకున్నా యిబ్బంది ఉండదు. సూట్లు ఊలువి, పైజామాలు నూలువి. మన యిష్టమొచ్చినప్పుడు తడుపుకోవచ్చు. లేదా చాకలికి వేయవచ్చు. మీరు కూడా రెండు జతలు ఇలాంటివి కొనుక్కో

వాలి. ఇవి కొనుక్కున్నప్పుడు ఇంట్లో వాళ్ళయినా, పై వాళ్ళయినా, ఆడవాళ్ళు వస్తే ఈ పైజామాలతో కనబడకూడదు. వాళ్ళు పై నుంచి తలుపుకొట్టగానే చటుక్కున ఈ డ్రెసింగ్ గౌను తీసుకొని నడుంబిగించు కొని మరీ తలుపు తియ్యాలి. ఇంకో సంగతి. ఇంట్లో ఉన్నంతసేపూ మేజోళ్ళూ జోళ్ళూ తొడగనక్కరలేదు. కాని జపాన్ శాండల్స్ అనగా ఓ మోస్తరు మన ఆకు చెప్పులు లాంటివి, పలుచనివి, తేలికవి. వెచ్చగా ఉండేవి అమ్ముతారు. ఇంట్లోనైనా అవి లేనిదే తిరగకూడదు. ఇక్కడ మర్యాదలివి" ఇలా కబుర్లు చెప్పుకుంటూనే మేము దంతధావనము చేసే లోపునే, ఒక పనిపిల్ల - పిల్లంటే పిల్ల కాదులెండి - ఓ ఇరవై ఏళ్ళుంటాయి.




లోపలకు వచ్చి నేను సోఫా మీద వేసుకున్న పక్క తీసేసి రాజు పడుకున్న మంచంమీద దుప్పటి తీసి, దులిపి మళ్ళీ వేసింది. గది అంతా తుడిచేసింది. తుడవడం కూడా వింతగానే ఉంది చీపురు పుచ్చుకొవడం, వంగుని తుడవడం, పద్ధతిలేదు. నాలుగైదడుగుల కర్రకి అడుగున బ్రష్‌లాంటిది దాంతోటి నిలబడే తుడవడం. చిత్రమేమిటంటే ఊరికే మర్యాదకు

తుడిచిందన్న మాటే కాని, ఎక్కడా దుమ్మేలేదు. మన ఊళ్ళలో అయితే రోజుకు మూడుమూట్లు తుడిచినా కావలసినంత దుమ్ము. ఎక్కడ నుంచి వస్తోందో తెలియదు. తరువాత ఇంకొక పది నిమిషాలలో మేము ఏమీ చెప్పకుండానే మాకుభయులకూ ఫలహారాలూ, టీలు తెచ్చి యిచ్చింది. మేము ఆ కార్యక్రమం ముగించుకొని వీధిలో కెళ్ళే దుస్తులు ధరించి బైటకొచ్చాం. వచ్చేటప్పుడు తలుపులు దగ్గరగా వేసే వచ్చాడు. రాజు వీధిలోకొచ్చిన తర్వాత నెమ్మదిగా రాజు నడిగాను "తలుపు తాళం వెయ్యకుండా వస్తున్నావే" అని.

"ఏం ఫరవాలేదు. ఇక్కడ తలుపు తాళం వేసిపెడితే చాలాతప్పుగా భావిస్తారు. ఇంటి వాళ్ళమీద మనకు నమ్మకం లేదనీ వాళ్ళని అగౌరవ పరుస్తున్నామనీ ఇక్కడ వాళ్ళనుకుంటారు. అందుచేత ఎప్పుడూ తాళం వేయనక్కర్లేదు. ఇక్కడ తాళం వేయవలసిందల్లా సాధ్యమైనంత వరకూ నోటికేగాని గదికి అవసరంలేదు."

# 10

ఇక నా నివాసానికి అన్వేషణకు బయలుదేరాం. యెక్కే గుమ్మం దిగే గుమ్మం "టు లెట్" అని బోర్డు కట్టిన వాళ్ళు కూడా మమ్మల్నిచూచి ఖాళీ లేవండి, వెరీసారీ! చాలా విచారిస్తున్నాను. అనేవారు. ఏ యింటికి వెళ్ళినా తలుపుతీసేవాళ్ళు పలకరించేవాళ్ళు, సమాధానాలు చెప్పేవాళ్ళూ, ఆడవాళ్ళే. అప్పటికప్పుడే మగవాళ్ళు బైటికి వెళ్లుంటారు కాబోలు. అనుకు న్నాను. కొన్నిచోట్ల గది మరీ చిన్నదిగానూ, యిరుకుగానూ వుండడం చేత నచ్చలేదు, కొన్నిచోట్ల ఇల్లూ, ఇల్లాలూ కూడా చాలా అసహ్యంగా వుండి అక్కడనిలవబుద్ధిపుట్టలేదు. ఒకటి రెండుచోట్ల అంతాబాగున్నా అద్దె చాలా యెక్కువన్నాడు రాజు. ఇలా ఒంటిగంటవరకూ తిరిగి తిరిగి కాళ్ళు బరువు లెక్కిపోయి, అడుగుతీసి అడుగు పెట్టలేనిస్థితిలో భోజనం వేళకు యింటికి చేరుకున్నాం. గది దొరకదేమో అని నిరుత్సాహపడ్డాను. రాజు పాపం అది గ్రహించి మీరేం మొహమాటపడకండి, తొందరపడకండి, ఈ వేళ కాకపోతే రేపు దొరుకుతుంది, రేపుకాకపోతే ఎల్లుండి దొరకుతుంది? వారం రోజు లదాకా మీరు నాతో వుండవచ్చు. "మీకిబ్బందేమోనని సందేహిస్తున్నాను తప్ప మరేం లేదు. "నాకేమీ యిబ్బందిలేదు. మీకు యింకొ మంచము లేకపోవడం ఒక్కటే "లోటన్నాడు" రాజు "మరేం ఫరవాలేదు. లెండి,

మిమ్మల్ని శ్రమపెట్టడం జరుగుతోందని బాధ పడుతున్నాను" అన్నాను. యింటికి చేరుకుని భోజనాలు ముగించుకొని కాసేపు విశ్రమించాం.

ఇలా రెండు మూడు రోజులు తిరగ్గా ఎలాగైతేనేం ఒకగది దొరికింది, బాగానే వుంది కూడాను. కూర్చునే గదికి చేర్చి ఒక చిన్నపడక గదికూడా ఉన్నది. అందులో పెద్ద మంచం దానిమీద రెండు పరుపులు, రెండుమూడు రగ్గులు, దుప్పట్లు, తుడుచుకోవడానికి రెండు తువ్వాళ్లు, సమస్తం అక్కడే వున్నాయి. కూర్చునే గదిలో ఒక సోఫా, రెండు పరుపుల కుర్చీలు, భోజనానికి టేబులు, దానిదగ్గర రెండు మూడు కుర్చీలు, పక్కన పుస్తకాలు వగైరా పెట్టుకోవడానికి చిన్న అల్మారా లాంటిది. ఒక గోడలోకి అమర్చిన చలికాచుకునే పొయ్యి వగైరాలన్నీ యెంతో అందంగా ఉన్నాయి. మనదేశంలో ధనికులేనా ఎరుగని ఈ పరుపులు, సోఫాలు, కుర్చీలు యిక్కడ ప్రతి సామాన్యుని గృహములోనూ ఉండడం చాలా ఆశ్చర్యమనిపించింది.

ఇంటి యజమానురాలుకు ఇద్దరు కూతుళ్లు, కొంచెం పెద్దవాళ్ళే ఉన్నారు. నేను వెంటనే రాజు సహాయంతో నా సామాను తెచ్చుకొని నూతన గృహ ప్రవేశం చేశాను! ఈ దేశానికివచ్చి వారంరోజులే అయినా అప్పడే నాలో కొన్ని మార్పులు వస్తూండడం గమనించాను. కొత్త యింట్లో ప్రవేశించడానికి ఈ వేళ మంచిరోజు అవునా కాదా అని తెలుసుకోవడం మరచిపోయాను. తరువాత జ్ఞాపకం వచ్చినా యిక్కడ ఎవర్ని అడుగుతాం. యెవరు చెబుతారు. యెవర్నడిగినా అందరూ నవ్వుతారు కూడాను. పైగా ఈ దేశములో పంచాంగాలూ గట్రా ఏమీ వున్నట్టు తోచదు, అందు చేత యిక్కడ అందరికి మల్లేనే, అన్ని విషయాల్లోనూ సర్దుకుపోవలసిందే. ఈ గొడవ మానాన్నకు తెలిస్తే యెంత హంగామా చేసేవాడో. ఏ దేశంలో వున్నప్పుడు ఆదేశాచారాలు అవసరమైనంత వరకూ అనుసరించ కపోతే లాభంలేదు. అని నాలో నేనే నవ్వుకున్నాను. నా పడకచుట్ట విప్పవద్దనీ దాని అవసరం ఈ దేశంలో ఉన్నన్నాళ్ళూ వుండదనీ రాజు సలహా చెప్పాడు తనే పాపం బజారుకి తీసుకు వెళ్ళి పడకదుస్తులు రెండు పైజామాలూ, ఆకుచెప్పులు, డ్రెస్సింగ్ గౌనూ కొని పెట్టేడు. "పైన ఎలాగూ డ్రెస్సింగు గౌను వేసుకోకతప్పనప్పుడు, లోపల మామూలుగా పంచె కట్టుకుంటే ఏమి" అన్నాను. "పోనిద్దురూ! ఈ బాధ మనకెందుకు! పంచె రోజూ మనం తడిపి ఆరేసుకోడానికి ఇక్కడ వీలుండదుకదా? చాకలికివేస్తే ఇది ఏమిటో ఎలావుతకాలో, ఏం చెయ్యాలో తెలియక వాడూ కంగారు

పడతాడు. అందుకని ఇక్కడ స్థితే అవలంబిస్తే తీరిపోతుంద''న్నాడు రాజు.

ఆ పూట నుంచే కొత్త సంసారం ప్రారంభమైంది ఇంటి ఆవిడకు నేను మాంసాహారిని కాననీ అందుకని నాకు కావలసిన బియ్యం, పప్పు, కొంచెం చింతపండు, మిరపకాయలు వగైరా సామాన్లన్నీ రాజూ, నేనూ కలిసి ఒక జాబితా తయారుచేసి యిచ్చాం. ఆవిడ ఆ జాబితా చూసి తెల్లబోయింది. కొంచెం స దేహిస్తూ "ఇవన్నీ ఏం చెయ్యాలండి" అన్నది. మీరు తీసుకొస్తే మా స్నేహితుడు అన్నీ చెపుతాడు. ఎలా చెయ్యాలో అతనే మీకు చేసి చూపిస్తాడు. మా వంట చూద్దురుగాని, కాస్త రుచికూడా చూద్దురుగాని అన్నాడు రాజు నవ్వుతూ. ఆవిడ వెళ్ళిపోయింది మా రాజు కూడా లేచి "ఇక నేను వెళతాను. మీకేం కావలసినా నన్నడగండి. నే చెబుతా''నన్నాడు. ఇక నే వెళతాను. గుడ్‌లక్ మీకు శుభమవుగాక అని కరచాలనం చేసి వెళ్ళిపోయాడు.

ఇంటి ఆవిడ సామాన్లన్నీ తెచ్చి ఇవి "ఏం చేయాలో చెప్పం'' డని అడిగింది "అన్నంవండగలవా'' అన్నాను. "ఫరవాలేదు వండగల'' నంది. "అయితే పప్పుకూడా కొద్దిగా నీళ్ళుపోసి ఉడకబెట్టి బాగా వుడికిన తరువాత దాన్ని మెత్తగా కుమ్మి అందులో కొంచెం వుప్పు వెయ్యాల''ని చెప్పాను. తరువాత కూరతరిగి వుడకబెట్టిన తరువాతను, పోపు వెయ్యడం యెలాగో చెబుతానన్నాను. కాని పోపు అనే మాటకి ఇంగ్లీషులో ఎలా చెప్పాలో తెలియలేదు. ఎన్ని విధాల ప్రయత్నం చేసినా ఆవిడకు తెలియలేదు. తరువాత పులుసంటే ఏమనాలో ఇంగ్లిషులో ఎలా చెప్పాలో తెలియలేదు. ఎన్ని విధాల ప్రయత్నం చేసినా ఆవిడకు తెలియలేదు. "నీళ్ళలో రెండు రకాల ముక్కలువేసి ఉడకబెట్టా'' లన్నాను. "ఓ, యూమీన్ సూప్'' అంది ఇంతేకదా అది నేను చేయగలనంది. సరే కానీ తర్వాత చూస్తాను అన్నాను. మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఆవిడ నాకు భోజనం తీసుకు వచ్చింది. పోపు వెయ్యడానికి నన్నుపిలవడం మరిచిపోయింది. పప్పు ఏ బద్ద కాబద్ద విడిగానే వుంది. పులుసులో చింతపండు వేయడం మరిచి పోయింది. యిది యెలాగు భగవంతుడా! తినడమనుకున్నాను. "నెయ్యి ఏది అన్నాను.'' "నెయ్యేమి''టంది. "నాబొంద'' అన్నాను. ఏమిటిఏమిటంది. మరేంలేదులే సారీ అని కొంచెం వెన్న తీసుకొచ్చి పెట్టమన్నాను ఆపూటకు అవి అక్కడ బల్లమీద పెట్టి పుడ్డింగ్ అనబడేపాయసం కూడా పెట్టి ఆవిడ వెళ్ళిపోయింది. అన్నం కొంచెం లైపిండిలా తయారైంది. పప్పు పిప్పిలా ఉంది. కూరలోనూ, పులుసులోనూ కూడా ఆవిడ వుప్పు

వేయలేదు. కడుపు మండుతుంటే యేంజేయను అదే యెలాగోమింగేను,

ఆ సాయంత్రం టీ తీసుకుంటుండగా రాజు వచ్చాడు, ఏమండి మీ సంసారం యెలాగుంది అన్నాడు నవ్వుతూ "కొత్తకాపురం" కదండీ ఇంటి ఆవిడకు అన్నీ మొదట నుంచి క్రమేణా చెప్పాలి అన్నాను. "అన్నీ వద్దులెండి వంటవరకూ చెప్పతే చాలు" అన్నాడు రాజు. కాస్సేపు బైటికి వెళ్ళి కాలేజి ఉన్నచోట చూసి దగ్గిర్లోనే ఒక పార్కుంటే అందులో వెళ్ళి కూర్చున్నాం కబుర్ల మధ్యను "మీ చదువు విషయమేమి"టన్నాడు. "మీసలహా ఏమి"టని నే నెదురడిగాను. "మీకు ఇంగ్లీషు భాషాజ్ఞానం బొత్తిగా తక్కువగా ఉన్నది కనుక ఇక్కడ ముందు ఒక ప్రయివేటు మాష్టరుని పెట్టుకొని మూడు, నాల్గు మాసములు చదువుకొని వేసవి సెలవలు తరువాత, ఎంట్రెన్స్ పరీక్షని ఉంటుంది. దానికి కూర్చుని ప్యాసయితే వెంటనే M.Aలో చేరవచ్చు. ఆతరువాత మీ ఓపికనుబట్టి "లా" పరీక్ష కూడా అనగా బారిష్టరు పరీక్ష కూడా చదవవచ్చు" అన్నాడు.

మర్నాడు మాయింటావిడకి వంటా - వార్పూ నేర్పడానికి ప్రయత్నం ప్రారంభించాను. నేను దగ్గిర కూర్చుని మన పద్ధతిలో వంట ఎలా ఉంటుందో తెలిసీ తెలియని విషయాలను, వచ్చీరాని భాషలో చెబుతూంటే ఆవిడా, కూతుర్నూ కూర్చుని, ఒక్కటే నవ్వుకోడం మొదలెట్టారు. నవ్వుతే వాళ్ళమూతే వంకరపోతుంది. నా కేమని నాపారం సాగించాను. అన్నం సరిగా అత్తెసరు పదునుగా వండడ మెలాగో నేర్పాను. ముద్ద పప్పు చెయ్యడ మెలాగో చేసి చూపించాను. అది మన గోదావరి జిల్లా వాళ్ళ జన్మహక్కు తరువాత బంగాళా దుంపలకూర వండించాను. ఉడికిన తరువాత, పోపు వేద్దామని మిరపకాయలు తుంపి ఆవాలు అవీ జాగ్రత్త చేసుకొని చూసేటప్పటికి నూనే లేదు. "మరి నూనె లేకపోతే ఎలాగ" అన్నాను. ఇక్కడ కొవ్వేగాని మామూలు నూనెలు ఏవీ దొరకవండీ అంది. సరే! రేపటి సంగతి ఆలోచిద్దామని ఆ పూట కొంచెం వెన్నకాచి, సామెత చెప్పినట్టు అప్పుడు కాచిన నేతితో తిరగమోత వేయించాను. ఆ ఘాటుకి వాళ్లు తట్టుకోలేక, ఉక్కిరిబిక్కిరయ్యారు. తరువాత, పులుసు ముక్కలు ఉడకపెట్టి అందులోకి చింతపండు నీళ్లుపోసి, పిసుకుతుంటే వాళ్ళకు వింతగా కనబడింది. చేత్తోటి పిసక్కుండా చెంచాతో నొక్కి ఆ రసంతీసుకోకూడదా అని అడిగింది ఇంటావిడ. "తీసుకోవచ్చు కాని పూర్తిగా అందులో రసం అలా తీయడం కష్టం ఇది సుళువైన మార్గం" అని చెప్పినా వాళ్ళకు అట్టే నచ్చలేదు. ఏదీ ముఖ్యంగా తినే వంటకా లేవీ

సాధ్యమైనంత వరకు చేతితో తాకకుండానే చెయ్యవలెనని వాళ్ళుద్దేశ్యం సరే, ఎలాగో ఆపూటకు వంట అయిందనిపించి ఆ వంటకాలు మీరు కూడా రుచి చూడండని పప్పు, కూరా, పులుసూ, వాళ్ళకూ కూడా కొంచెం యిచ్చి నాగదిలో సాపాటు నే చేశాను. తరువాత క్రమేణా ఆవిడే ఏదో ఓ రకంగా చేసి పెట్టడం నేర్చుకుంది. "మన పప్పు చాలా



బాగుంటుందన్నది. పులుసు కూడా బాగానే ఉంది కాని ఆ కారం మేము తినలేమంది. తరువాత అంత చింతపండు కూడా ఇక్కడ తినడం మంచిది కాదంది. కావలిస్తే మాకు మళ్లేనే పల్చగా సూపు చేసుకుని అందులో కొంచెం నిమ్మరసం వేసుకోవచ్చు నంది. ఆ సలహా బాగానే ఉందనుకున్నాను. కొన్నాళ్లు ఎలాగో యిలా తంటాలు పడ్డా మనం అన్ని రుచులకూ అలవాటు పడ్డ వాళ్ళం కనుక మన ఊరగాయల మీదికి దృష్టి పోయింది. మా రాజుని సలహా అడిగాను దీనికి ఏదన్నా ఉపాయం చెప్పమని. నేను అప్పుడప్పుడు ఇంటికి రాసి తెప్పించు కుంటుంటాను. ఈ వేళో రేపో రావాలి. రాగానే మీకు కొంత వాటా ఇస్తాను అన్నాడు.

క్రొత్తగా నేర్చుకున్న విద్య జ్ఞాపకం వచ్చి థేంక్యూ" అన్నాను. రాజు నవ్వి వూరు కున్నాడు.

తరువాత నేను, రాజు మర్నాడుకాబోలు వూళ్ళోకెళ్ళి యూనివర్సిటీ, చూసి వచ్చాము. అది చూసి నేను ముగ్ధుడనై పోయాను. నోటమాట రాలేదు. యేదో మహత్తరమైన పవిత్ర భావములాంటిదేదో కలిగి స్తంభించిపోయాను. రెండు నిమిషాల్లో తెలివి తెచ్చుకుని లోపలికి వెళ్ళి రాజు సహాయంతో క్లాసు గదులూ, లైబ్రరీ, పరీక్షాహాలూ, సభ జరిపే చోట్లూ, అధికారుల కచేరి గదులూ, అన్నీ చూస్తూంటే ఒకదానికంటే ఒకటి యెంతో గొప్పగా కనిపించాయి. ఈ ఆశ్చర్యంతో తలమునకలై యింటికి చేరుకున్నాను. ఆ సాయంకాలము నెమ్మదిగా రాజు నాకు ప్రయివేటు మాష్టరును కుదిర్చి పెట్టాడు. ఆయన నాతో యెంతో సావకాశంగా, నెమ్మదిగా మాట్లాడారు. సాధ్యమైనంత వరకూ యెంట్రన్సు ప్యాసయ్యేటట్టు చేస్తానని అభయమిచ్చాడు. ముందు నీకు ఆంగ్లభాషాజ్ఞానం బాగా కలుగుతే తక్కినవన్నీ సులువుగా వస్తాయన్నాడు. అలాగనే రోజుకు రెండుమూడు గంటలు ప్రత్యేకం యింగ్లీషే చెప్పేవాడు. తక్కిన పాఠాలన్నీ ఓ రోజు కొన్ని, ఓ రోజు కొన్ని చెబుతూండేవాడు. యిలా ప్రారంభించిన చదువు మంచి ముహూర్తం చూసుకోకపోయినా బాగానే సాగింది.

రెండ్రోజుల తర్వాతను ఒక ఉదయాన్నే రాజు నవ్వుతూ వచ్చి "గుడ్ మార్నింగ్ మిష్టర్ పార్వతీశం. మీకీ వేళ ఈ సుప్రభాతంతోటి, ఒక శుభ వార్తకూడా అందించ దలచుకున్నాను. ఇంటిదగ్గరనుంచి నిన్ననే ఊరగాయల బంగీ వచ్చింది. మీ వాటా ఈ సీసాలో ఆవకాయ, ఈ సీసాలో తొక్కుడుపచ్చడి తీసుకొచ్చాను. హాయిగా తినండి" అని చక్కాపోయాడు. వాటిని యెంతో ఆప్యాయతతో చూస్తూ కూర్చుని ఈవేళయెలాగైనా వీటిపని పట్టించాలని నిశ్చయించాను.

ఆ రోజు స్పెషల్‌గా వంట ప్రయత్నం కోసం నేనూ వంటగదిలోకి వెళ్ళాను. మీరొచ్చారేమిటీ వేళ మిష్టర్ సేమ్ అంది ఇంటావిడ. నేను చెప్పడం మర్చిపోయాను. నా పేరు ఆవిడ ఉచ్చరించలేక సౌలభ్యం కోసం సేం అని పిలవడం మొదలెట్టింది. పోనీలెండి మీ ఇష్టం ఎలా పిలిచినా సంతోషం అన్నాను. ఆ రోజున అప్పటి నుంచి ఆ యింట్లో అందరికీ నేను సేంనై ఊరుకున్నాను.

"ఈ వేళ మా వూరినుంచి కొత్తగా వూరగాయలొచ్చినాయి. అందుకని వచ్చాను." తరువాత కొంత వెన్న కరిగించమని చెప్పాను. ఆవిడ వంట

చేస్తోంటే నేను నెయ్యి కాచేను. వంటంతా అయిన తరువాత ఆవిడ అన్నీ తీసుకువచ్చి నా గదిలో అమర్చి వెళ్ళిపోతుంటే ఆవిడను వెనక్కు పిలిచి కొంచెం ఆవపిండి ఒకచిన్న ప్లేటులోపెట్టి "ఇది మాదేశంలో ప్రసిద్ధ మైన ఊరగాయ. మీరు రొట్టెమీద బాగా వెన్నరాచి దానిపైన జాంలాగా రాసుకు చూడండి. కొంచెం కారంగా వున్నా చాల బాగుంటుంది. అట్టే వుపయోగించకండి అని హెచ్చరిక చేశాను కూడాను. ఆవిడ సంతోషించి తీసుకు వెళ్ళింది."

ఆ పూట భోజనం హాయిగా మన పద్ధతిని చేద్దామనిపించింది. ఈ చెంచాలు, కత్తులూ, ఫోర్కులుతోటి మన భోజనం చేయడానికి అట్టే వీలుగా వుండడంలేదు. అందుకని ఒక పూటన్నా మన పవిత్ర భారతదేశాన్ని తలచుకొని, మన ఆచారము అనుసరణీయమని నిశ్చయం చేసుకొని స్పూన్లు, ఫోర్కులు వగైరా పక్కకు పెట్టేసి సుఖంగా చేత్తో కలుపుకొని భోజనం ప్రారంభించాను. పప్పు అన్నం తినడమైంది. రెండో వాయి ఆవకాయ కలుపుతుండగా అవతలనుంచి కెవ్వున కేక వినబడింది. ఏమిటో అను కుంటూంటే "ఓ మిష్టర్ సేం, అని పిలుపు వినబడ్డది. ఏం కొంప మునిగిందా అనుకొని కలిపిన ముద్ద నోట్లో పెట్టుకొని లేద్దామను కుంటూంటె ఒక్క ఊపులో "ఓ సేం, అంటూ ఏడుస్తూ ఇంటావిడా, ఆవిడ వెనకనే ఆవిడ కూతుళ్ళూ గదిలో చొరబడ్డారు. "ఏమిటమ్మా! ఏం జరిగింది" అన్నాను. ఆవిడ ఏదో చెబుదామనుకుంటూ నాకంచం కేసి చూసింది. ఆవిడ సమాధానం కోసం నిరీక్షిస్తూ నేను కలుపుకున్న ఆవకాయ చేయి నాకుతున్నాను. ఆవిడ అదివరకు పడ్డ బాధేమిటో తెలి యదుకాని ఇప్పుడు మట్టుకు నాచెయ్యి చూసి ఓ, ఓ, ఓ, అని ఓ వెర్రి కేకవేసి, వెనక్కు విరుచుకొని మూర్ఛ వచ్చినట్లు కుర్చీలో కూలబడ్డది. అంత వరకూ నన్ను చూచి ఇకిలిస్తూ సకిలిస్తూ వున్న కూతళ్ళిద్దరూ ఆ వుద్యమం మానుకుని, రెండు కన్నీటి చుక్కలు బలవంతాన తెచ్చుకొని, తల్లి సంరక్షణ కోసం ఆవిడ దగ్గరజేరి, ఒకరు మంచినీళ్ళందించి ఒకరు ఆవిడ ముఖంమీద కాసిని నీళ్లు చిలకరించాడు. ఆవిడ నెమ్మదిగా కళ్లుతెరచి నాకేసి వేలుతో చూపిస్తూ వెక్కిళ్ళతో "సేం, సేం యూ" అంటూ మళ్ళీ మూర్ఛ పోవడానికి వుద్యుక్తురాలవుతుంటే, నేను కూడా ఆవిడ దగ్గర కెళ్ళి "ఫరవాలేదండి, మీరెందుకు అలా కంగారు పడ్డారు. మీకేం భయం లేదు. అసలేం జరిగిందో చెప్పండి" అంటూ మెల్లగా అనున యిస్తూ ఆవకాయ కలుపుకున్నా నన్న మాట మరచి ఆ చేత్తోటే ఆవిడ కళ్లు తుడిచాను. యింకేముంది మళ్ళీ కొంపలంటుకున్నంత పని జరిగింది.

ఆవిడ కళ్ళూ బుగ్గలూ భగ్గున మండడం ప్రారంభించాయి. "ఓ సేం నన్ను చంపేసేవ్" అని గొల్లుమంది. "ఫరవాలేదు, ఫరవాలేదు.



క్షమించండి" అని ఒక్క పరుగున వెళ్ళి నా చేతులు శుభ్రంగా కడుక్కొని తడి తువ్వాలుతో ఆవిడ కళ్ళూ బుగ్గలూ. వత్తి, బుగ్గలకు కొంచెం నేనుపయోగించే స్నో రాశాను. ఇదంతా చూస్తూ నవ్వుతే తల్లికి కోపం వస్తుందని ఏడవాలన్నా ఏడవలేక, నవ్వలేక నాకేసి గుడ్లప్పజెప్పి ఆపిల్లలు నిశ్చేష్టులై చూస్తూ నిలబడ్డారు. సుమారు ఒక పావుగంట సేపు నాకు తోచిన శైత్యోపచారాలన్నీ చేసేసరికి ముసలావిడ ఉద్రేకం, కళ్ళూ, ముఖంతో పాటు చల్లబడి నన్ను చూచి "ఓ సేం, సేం యూ ఆర్ ఏ బేడ్ బాయ్ యూ రియల్లీ కిల్డ్ మీ. నువ్వు చాలా చెడ్డవాడవు నన్ను

చంపినంతపని చేశావు” అంటూ చిన్న హాసం ముఖంలోకి తెచ్చుకుంది.

ఔనండీ! నేనేం చేశాను. ఇంతవరకూ మీకేం జరిగిందో ఎందుకలా భయపడ్డారో నేను చేసిన తప్పేమిటో చెప్పేరు కాదు. నావల్ల తప్పంటే మన్నించండి - అన్నాను నమ్రతతో! అదికాదునాయనా ఇందులో నీత ప్పేమీ లేదు. నామీద అభిమానంతో నువ్వు సరదాగా మీ ఊరగాయ రుచి చూడమనిచ్చావు. నువ్వు చెప్పిన మాటలు పూర్తిగా గ్రహించుకోక నీకు భోజనం పెట్టగానే, ఓ రొట్టె ముక్కకు కాస్త వెన్నా ఆవకాయా పట్టించి నోట్లో పెట్టేసరికి నసాళం అంటింది. ' ఆబాధలో ఏంచెయాలో తోచక నీ గదిలో కొచ్చేసరిగి నువ్వు అన్నం చేత్తో కలుపుకు తినడమే కాక, ఆ చెయ్యి నాకుతుంటే నాకు మూర్ఛవచ్చినంత పనయింది. ఈ పద్ధతులు మా కలవాటు లేక చూడగనే నాకు చైతన్యం పోయింది. అంతకంటే మరేంలేదు. నిన్నూరికే కంగారు పెట్టాను. నువ్వేమీ అనుకోకు నన్ను మన్నించు - అంటూ ఆవిడ బైటకు వెళ్ళిపోయింది. వెనకాలే కూతుళ్ళూ ఆవిడననుసరించి గుమ్మం దగ్గర ఆగి వెనక్కి తిరిగి నన్ను చూచి ఒక్క నవ్వు నవ్వి పరుగుతీశారు.

మర్నాడు ఇక్కడ ఆవకాయ గొడవా, అది చేసిన హంగామా, మా ఇంటావిడ పడిన బాధా, అంతా కధ కింద రాజుతోటి చెప్పేసరికి రాజు విరగబడి ఒకటే నవ్వు - ఆరోజస్తమానం తల్చుకు తల్చుకుని మేమిద్దరం ఒకటే నవ్వుకోడం. ఈ కధ రాజున్న యింటి ఆవిడకు కూడా చెప్పాం. వాళ్ళూ తెగ నవ్వుకున్నారు. అక్కడనుంచి రాజు మిత్రబృందాని కంద రికి వారం రోజుల వరకూ ఈ కధ చెప్పి అందర్నీ నవ్విస్తూ ఆనంద పరవశుల్ని చేశాడు.

నాకు పాఠాలు బాగా సాగుతున్నాయి. ఇంగ్లీషు నాకు చాలా తొంద రగా, బాగా వస్తోందని మా మేష్టరు హృదయపూర్వకంగా నన్నభినందిం చారు. మా రాజు కూడా ఈ శుభవార్త విని చాలా సంతోషించాడు. రోజూ కాస్సేపు ఇండియన్ అసోసియేషన్‌కు వెళ్ళడం, అక్కడ ఓ గంటో రెండు గంటలో కూర్చుని ఏవైనా పుస్తకాలూ, పత్రికలూ, చదువుకోడం అలవాటు చేసుకున్నాను. అలా బాగాకాలక్షేపం అవుతుండేది. తరువాత అక్కడి కొచ్చే ఇతర సభ్యులు తెలుగువాళ్ళే కాక అరవలు, మళయా ళీలు, ఒకరిద్దరు కన్నడీలు, బెంగాలీలు, పంజాబీలు మొదలైన విద్యార్థులతో, క్రమేణా పరిచయం కలుగుతూ వచ్చింది. ఇంతమంది విదేశీయులతో ఇలా [illegible] [illegible] వాళ్ళందరూ నాతో సమాన స్థాయిలో సరదాగా

మాట్లాడ్డం నాకెంతో ఉత్సాహంగా ఉంది.

ఒక రోజున మా రాజు నా గదికి వచ్చి "రేపు ఈ వూళ్ళో ఒక దొరసాని స్థితిపరురాలు, పెద్ద ఇంటిది, విద్యావతి ఆమె మన దేశ స్థులంటే చాలా అభిమానంతో చూస్తుంది. ఆవిడ అప్పుడప్పుడు అనగా సంవత్సరానికి రెండుమూడుసార్లు మనవాళ్ళని కొందరిని ఇక్కడ వాళ్ళని కొందరినీ యువతీ యువకులను ఆహ్వానించి వాళ్ళకో చిన్న పార్టీ ఇస్తూం టుంది. అటువంటి పార్టీ ఒకటి రేపు ఏర్పాటు చేసింది. దానికి నిన్ను కూడా తీసుకురమ్మని వర్తమానం చేసింది. అందుకని మనం వెళ్ళుదాం. సిద్ధంగా వుండు" అన్నాడు రాజు. "పార్టీ అంటే అదేమన్నా మీటింగూ ఉపన్యాసాలూ ఇలాంటిదేమన్నానా లేక ఇంకేమన్నా ఉంటుందా? ఇక్కడ పద్ధతులేమిటో జరగబోయేదేమిటో ముందు తెలుసుకోవడం కోసం మిమ్మల్ని అడుగుతున్నాను" అన్నాను. "అబ్బే! సభా, ఉపన్యాసాలూ అల్లాటి గొడవ ఏమీ ఉండదు. పది మందిని కలుసుకోడం, కులాసాగా కబుర్లు చెప్పుకోడం, టీ, ఫలహారాలూ సేవించటం. మళ్ళీ కాస్సేపు కబుర్లు చెప్పు కోడం ఎవరైనా పాడే వాళ్ళుంటే పాటలు పాడడం, ఒక్కొక్కప్పుడు ఇన్‌డోర్ గేమ్స్ అనగా, యింట్లోనే ఆడుకునే ఆటలేవన్నా వ్యవధి వుంటే ఆడుకోవడం. తరువాత ఎవరి దారిన వాళ్ళు చక్కా పోవడమున్నూ, యిదీ పద్ధతి యింతకంటే మరేమీ లేదు" అన్నాడు.

మన మామూలు డ్రెస్సూ పైన ఓవర్ కోటూ నెత్తిమీద హేటూ పెట్టుకొని బయలుదేరి అక్కడికి వెళ్ళడం. అక్కడ వీధి తలుపుకు అమర్చి ఉన్న ఒక గొలుసు లాంటిది లాగితే లోపల గంట మోగు తుంది. అప్పుడు ఆ యింటి బట్లరు వచ్చి తలుపు తీస్తాడు. తలుపు తీయగానే మన్ని "గుడ్ ఆఫ్టర్ నూన్ సర్" అని మన ఓవరుకోటూ, టోపీ తీసుకుని భద్రపరుస్తాడు. మనల్ని లోపలిహాల్లోకి తీసుకువెడతాడు. అక్కడ యజమానురాలు వచ్చి మనల్ని పలకరించి కరచాలనానికి చెయ్యి అందిస్తూ "హౌ డూయూడూ" అంటుంది. అంటే కులాసాగా ఉన్నావా అన్నమాట. తరువాత మనల్ని తీసుకెళ్ళి అక్కడ వున్న వాళ్ళందరకూ పరిచయం చేస్తుంది. ఆతరువాత కార్యక్రమం యిందాకనే చెప్పినట్లుగానే కబుర్లతో ప్రారంభమవుతుంది - అన్నాడు. సరే యిక్కడ వేడుకచూద్ద మని అలాగే వస్తాననీ "నీవు కూడా ఉంటావు కదా నాకు సందేహం, భయం ఏముంటుంది?" అన్నాను. "నేను వచ్చి నిన్ను తీసుకునే వెడ తాననుకో. ఏ కారణం చేతనైనా నేను రాలేకపోతే వెళ్ళవలసినచోటు

చిరునామా, ఎలా వెళ్ళాలో అన్నీ వివరంగా రాసి నీకిస్తాను. నాకోసం మూడున్నరవరకూ చూడు. అప్పటికీ నేను రాలేకపోతే, నేను రాసిచ్చిన ప్రకారం వచ్చే సేయి. నీకేం భయంలేదు, ఎక్కడా తప్పిపోవు" అని చెప్పి ఒక కాగితం మీదను అన్నీ వివరంగా రాసి ఒక ప్లాను గూడా వేసి యిచ్చాడు. పాపం. యింక నేను వెడతానని బయలుదేరుతుంటే, అన్నట్టు యింకొక్క ముఖ్యవిషయం చెప్పడం మరచిపోయాను. "మనం వెళ్ళగానే అక్కడ నౌకరుగాని యజమానురాలుగాని, మామూలు గుడీవినింగ్ అయిన తర్వాతను, "వుడ్ యూలైక్ టుహేవ్ ఏ వాష్ అండ్ బ్రషప్" అని అడుగుతారు. అంటే నీ ముఖం చేతులూ కడుక్కోవడంగాని, తల దువ్వుకోడంగాని, అల్పాచమానం చేసుకోవలసిన అవసరం కాని వుంటే "నో థేంక్యూ" అంటే తీరిపోతుంది. యిది మరచిపోక జ్ఞాపకం పెట్టుకో"అన్నాడు. సరేననియింటికి బయలుదేరి వచ్చి రాత్రి భోజనం చేసి కాస్సేపు మా యింటి యజమానురాలితో ఈ కబురూ, ఆ కబురూ చెప్పి, కొంచెంసేపు చదువుకొని పడుకున్నాను.

# 11

మర్నాడు భోజనం, చదువు వగైరాలన్నీ మూడుగంటలకే ముగించుకొని, ముఖం గట్రా కడుక్కొని, రాజు రాక కెదురు చూస్తూ కూర్చున్నాను. అతనెంతకూ రాలేదు. మూడున్నర కూడా దాటింది. ఇంకనూ ఆలస్యం చేస్తే అక్కడికి సకాలంలో వెళ్ళలేనేమోనని బయలుదేరి రాజు రాసిచ్చిన చీటి జేబులో పెట్టుకొని, బయలుదేరి కొంతదూరం ట్రామ్ మీద వెళ్ళి, ఆఖరున కొంచెం దూరం నడవవలసినమేర ఒక సందులోనుంచి వెళ్ళాను. యేమీ యిబ్బంది లేకుండానే యెవర్నీ అడక్కుండానే ఆ సందు తెలుసుకోగలిగాను. ఇంకను వారింటికి ఒకఫర్లాంగుందనగా మనం అక్కడికి వెళ్ళిన తరువాత వాళ్ళేదో అడగడం, మనం వాళ్ళ స్నానాల గదిలోకి వెళ్ళడం యెందుకని ఆ సందు నిర్జనంగావుండి అప్పటికే మసక చీకటిగా వుందని ఆ రోడ్డువారను లఘుశంక కానిచ్చి వారింటికి వెళ్ళాను. అదే యిల్లని నిశ్చయం చేసుకొని గొలుసులాగాక నౌఖరొచ్చి తలుపు తీశాడు.



నన్ను పలకరించి నాకోటూ, టోపీ అడిగి తీసుకొని హాలులో వున్న వంకీలు స్టాండుకి తగిలించాడు. నన్ను లోపలికి తీసుకువెడుతుంటే గబగబా తొందరగా రాజు వచ్చాడు. మేమిద్దరమూ కలిసి హాలులోకి వెళ్ళాం. యజమానురాలు యెంతో సంతోషం ముఖంలో వ్యక్తపరుస్తూ, యెవరితోనో మాట్లాడుతున్నావిడ మా దగ్గరకొచ్చి రాజును పలకరించి యోగక్షేమములు విచారించి నాకేసి చూపిస్తూ ఈజ్ దిస్ జంటిల్‌మన్ యువర్ న్యూ ఫ్రండ్? అని అడిగింది. ఔనండని నాపేరు చెప్పి నన్ను పరిచయం చేశాడు. ఆవిడ నన్ను మందహాసముతో యెగాదిగా చూచి వెరి ప్లీజ్‌డ్ టు మీట్ యు మిష్టర్ పార్ ... బా ... టిసెం అని కరచాలనం చేస్తూ "హౌడుయుడూ" అంది. ఆ యింటి వైభవం, అక్కడ మనుష్యులను యజమానురాలి సౌందర్యాన్ని చాకచక్యాన్ని చూచి ముగ్ధుడనై పరధ్యానంగా రాజు చెప్పిందంతా మరచిపోయి హౌడూయుడూ అని అనగానే యేం చెప్పాలో తోచక "యాజ్ యూజువల్ లైక్ ఆల్ పీపుల్" అని యింకా

యేదో అనబోతుంటే ఆవిడి కొంచెం నవ్వడం, రాజు నా చెయ్యి నొక్కడం యేకకాలమందు జరిగాయి. యేదో పొరపాటు జరిగిపోయిందని హడలిపోతూ యికనైనా జాగ్రత్తగా వుండవలెననుకుంటుంటే "వుడ్ యూ లైక్ టు హేవ్ యే వాష్" అంది ఇల్లాలు. అలవాటు చొప్పున నేను మళ్ళీ పప్పులో కాలు వేయబోయి తెలివి తెచ్చుకుని రాజు చెప్పిన మాట జ్ఞాపకం తెచ్చుకొని, "నో థేంక్యూ" అని అంతటితో వూరుకోక, అబద్ధమాడడం అలవాటు లేక "ఐ డిడిట్ యెట్ ది కార్నర్ ఆఫ్ ది స్ట్రీట్" "వీధి చివర కానిచ్చే వచ్చాలెండి" అన్నాను. యింకేముంది! పిడుగుపడ్డంత పనైంది. ఆవిడ నిర్ఘాంతపోయింది. కొంచెం యెడంగా నిలుచుని మాట్లాడుతున్న వాళ్ళంతా నా మాట వినబడినంతవరకూ స్థంభించిపోయారు.

కొంచెం దూరంలో వున్న బట్లరు గబుక్కున యేదో వాంతి వస్తున్నట్లు నోటికి చేయి అడ్డుపెట్టుకొని అవతలికి పరుగెత్తాడు. వాతావరణం అంతా హఠాత్తుగా చల్లబడిపోయినట్లనిపించింది. ఏంరా భగవంతుడా! నేనన్న మాటలో తప్పేముంది. వాళ్ళెందుకిలా గడ్డకట్టుకుపోయారు. అని గజగజలాడుతూ కళ్ళనీళ్ళ పర్యంతమై గుడ్లప్పజెప్పి చూస్తుంటే, యజమానురాలే ముందు తేరుకొని, తేలివి తెచ్చుకొని అందరికేసి ఒకసారిచూచి, ఒక చిరునవ్వుతో వాళ్ళందరకూ చైతన్యం కలిగించి "వెరీగుడ్ మిష్టర్, మిష్టర్ సేం వెరీగుడ్ కం ఎలాంగ్" బాగున్నదండి చాలాబాగుంది. రండి అని నన్నక్కడ అందరికీ రాజు సహాయంతో పరిచయం చేసింది. కొద్ది క్షణాల్లో అందరూ మామూలు ధోరణిలో పడ్డారు. కాని నా బెదురు మట్టుకు వదలలేదు. యెలాగో ఫలహారాలయేదాకా కూర్చున్నాను. తరువాత తరుణం కనిపెట్టి "నాకు చదువుకోవలసిన పనున్నది. నేనింక వెడతానన్నాను." "బాగా చీకటి పడ్డది ఒక్కడవూ వెళ్ళగలవా లేకపోతే నేను సాయం రానా" అన్నాడు రాజు. అబ్బేబ్బే అక్కర్లేదు, నేను నెమ్మదిగా వెడతాను. ఫరవాలేదు. అని బైటకి వచ్చేసి నా బసకు చేరుకుని అక్కడ జరిగిన విశేషాలు యేమిటని మా యింటి ఆవిడ అడుగుతే మరేమీ లేవని పరధ్యానంగా సమాధానం చెప్పి పుస్తకం తీసుక్కూర్చున్నాను. నామనస్సు సరిగాలేదని గ్రహించి ఆవిడ ఏమీ మాట్లాడకుండా చక్కాపోయింది. వెళ్ళినచోట ఏదో అభాసు చేశానని తెలుసుకున్నాను. అది యేమిటో మటుకు తెలియలేదు. రాజు పాపం యిదేదో తన తప్పు యినట్టు చాలా బాధపడినట్టు కనబడ్డది. సరే యేం చేస్తాం అనుకొని చదువుకుందామని ప్రయత్నిస్తే చదువు సాగక దీన్ని గురించే ఆలోచిస్తూ

యెంతోసేపు కూర్చున్నాను. ఇంక పడుకుందామని ఆలోచిస్తూండగా రాజు చక్కావచ్చాడు. రావడంతోటే "మహానుభావా! పార్వతీశం కొంప తీసేవయ్యా! నేనిన్ని విధాలా చెపుతే, ఆఖరికిలా చేసే నేమి"టన్నాడు. నేనక్కడ దృశ్యాలు ఆ యింటి శుభ్రతా, యేర్పాట్లూ, యజమానురాలి రూపురేఖా విలాసాలూ చూస్తూ మీరు చెప్పినవన్నీ మరచిపోయాను బాబూ నేచేసిన పొరపాటేదో యిప్పటికీ తెలియరాలేదని యేదో పెద్ద పొరపాటే చేసివుంటానని మాత్రం తెలుసుకున్నాను. యేం చెయ్యను మన్నించు - అన్నాను. ఫరవాలేదులే, నీవు కొత్తవాడివని, చిన్నవాడివనీ ఇక్కడ పద్ధతులింకా నీకు తెలియవనీ వాళ్ళు గ్రహించుకున్నారులే మరేం ఫరవాలేదు. వుడ్ యూ లైక్ టు హేవ్ యే వాష్ అంటే నో థేంక్యూ అన్నావు బాగానే వుంది. అంతటితో వూరుకోక వీధిమొగని కానిచ్చానని చెప్పడమెందుకయ్యా! నువ్వెక్కడ చేశావో, ఎలా చేశావో, నుంచునా, కూర్చునా అని యేమన్నా నిన్నడిగింది కనకనా! ఇలాంటివన్నీ యిక్కడ సంఘంలో చాలా అసభ్యాలుగా పరిగణించుతారు. అంతకంటే యేమీ కొంప మునిగిందేమీ లేదు. ఫరవాలేదులే. దాని కోసం యేం బెంగ పెట్టుకోకు - అన్నాడు రాజు.

"ఆలస్యమైంది. పోతాను మళ్ళీ రేపు కలుసుకుందాం." అని చక్కాపోయాడు.

నేను వెళ్ళిన మొదటి టీ పార్టీ ఇంత గమ్మత్తుగా నడిచింది కదా అని నేనూ నవ్వుకుంటూ మంచంమీద వాలేను.

మర్నాడు పొద్దున గతరాత్రి జరిగిన సంగతంతా రాత్రే మరచిపోయాను. నా ఆవశిష్టాలు తీర్చుకుచేసరికి, మామూలు పద్ధతిని ఇంటిఆవిడ (మిసెస్ థామ్సన్) కాక, ఆమె చిన్న కూతురు నాకు ఫలహారం అమరుస్తోంది బల్లమీద. నేను ఇదేమిటా అనుకున్నాను. ఆ అమ్మాయి కూడా కొంచెము నన్ను చూసి సిగ్గుపడుతూ తల వంచుకుని, చిరునవ్వుతో "Good morning, mr Sam" మా అమ్మకివాళ్ళ కొంచెము బద్ధకంగా వుంది. అందుచేత మీ ఫలహారం నేను తీసుకువచ్చాను. మీరేమీ అనుకోరనుకుంటాను.టట అంది. నేను నవ్వుతూ "అయ్యో వెర్రిదానా, అనుకోవడానికేమి వుంది యిందులో - చాలా సంతోషం - అంటే మీ అమ్మకు బద్ధకంగా వున్నందుకు కాదు - సుమా నువ్వు తీసుకు వచ్చినందుకు సంతోషం" అన్నాను.

"అలాగాండి, నేను తెస్తేనందుకు సంతోషమెందుకు!" అంది యేమీ

యెరగనట్టు.

"అబ్బే మరేమీలేదు నువ్వూ మీ అక్కాకూడా, నన్ను చూసి బెదురు బెదురుగా దూరం దూరంగా వుంటే నాకు అదో మోస్తరుగా వుంది. మనం అంతా చిన్నవాళ్ళముగదా నన్ను చూసి భయపడినట్టు యెడము యెడముగా వుండటము నాకు అట్టే అంత నచ్చలేదు" అన్నాను.

"మాకు అటువంటి యిదేమీలేదు. మేము తరచు మీతోటి మాట్లా డుతూంటే, యేమిటంత చొరవ అని మీరు అనుకుంటారేమోనని కొంచెం సందేహిస్తూ వచ్చాము మా అమ్మకూడా కొంచెం జాగ్రత్తగా వుండమని హెచ్చరిస్తూ వచ్చింది. అంతకంటే మరేమీ లేదు" అంది.

ఆ తరువాత వెళ్ళిపోయింది.

నా ఫలహారము అయిన తరువాతను చెల్లెలుతో పాటు అప్పగారు కూడా మందహాసముతో వచ్చి Good morning చెప్పి "యేమండి కులాసాగా వున్నారా? రాత్రి బాగా నిద్రపట్టిందా" అని సంభాషణ ప్రారంభించింది. "కూర్చోవమ్మా నిలబడే వున్నావేమి" అని కుర్చీ చూపించాను. ఈ లోపున చెల్లెలు బల్లమీద వున్న ఫలహారపు సామానులు తీసుకువెళ్ళి, లోపల పెట్టేసి మళ్ళీ వచ్చి బల్లమీద గుడ్డదులిపి సరిగా వేసి వెళ్ళనా, వద్దా అని సందేహిస్తున్నట్టుగా అక్కడే నిలబడితే నీకు తొందరపని లేకపోతే నువ్వుకూడా కూర్చోరాదా! అన్నాను. కూర్చోమని అప్పగారు కంటితో సంజ్ఞచెయ్యడం నేను గమనించాను. "మీరిప్పుడు యెక్కడకూ బయటకు వెళ్ళరా అంది చిన్నమ్మాయి. ఇప్పుడప్పుడే యెక్కడకూ వెళ్ళను కూర్చో" మన్నాను.

వాళ్ళిద్దరూ నాతో నిమ్మళముగా సంభాషణకు ఉపక్రమించారు. "మాయిల్లు ఎలా ఉన్నదండీ!" అన్నది పెద్దమ్మాయి. "చాలా బాగుంది. ఇల్లూ - మీ ఇంట్లో వారూ కూడా!" అన్నాను. "ఓ!" అంది నవ్వుతూ ఆ అమ్మాయి. "మీకు అన్ని సదుపాయాలూ జరుగుతున్నాయా? మీకేమీ ఇబ్బందిగా లేదు కదా ఇక్కడ" అన్నది మళ్ళీ. "ఆ అన్నీ బాగానే ఉన్నాయి. ఏ విధమైన ఇబ్బందీ లేదు. చాలా సుఖంగా ఉంది. ఎటొచ్చీ మధ్యమధ్యన ఏమీ కాలక్షేపముకాక, ఒంటరి తనము చేతనో ఏదో మా ఊరూ, ఇల్లూ, జ్ఞాపకము వస్తూ వుంటుంది. అప్పుడు మటుకు మనస్సు కొంచెము వికలము అవుతూ ఉంటుంది." అన్నాను.

"మరి ఎప్పుడూ ఆ మాట చెప్పారుకారేమి? మేమువచ్చి కూర్చుని

ఏవో కబుర్లు చెపుతూ వుండే వాళ్ళము. మీకు కాలక్షేపముగానూ, బెంగ లేకుండానూ ఉండేది కదా!" అన్నది చిన్నమ్మాయి.

"మీకు తీరికైనప్పుడు, సరదాగా ఉన్నప్పుడూ ఊరు చూడడానికి, లేకపోతే పిక్చరు హౌసుకో తీసుకు వెడతాము మేము కావలిస్తేను" అన్నది పెద్దమ్మాయి బెదురు తీరినట్టు.

"ఓహో అదీ సంగతి!" అనుకున్నానునేను. వాళ్ళకు చనువిస్తే అస్తమానమూ ఇక్కడే కూర్చునేటట్లున్నారు. నా చదువు చంకనాకినట్టే ఉంటుంది. అనుకున్నాను.

"అలాగా, చాలా సంతోషము. మీకు తీరకైనప్పుడు తప్పకుండా వెళ్ళుదాము. నాకీ పరీక్ష అయ్యేవరకూ కొంచెము హడావిడిగా ఉంటుంది" అన్నాను. అంతటితోటి వాళ్లు అవతలకు వెళ్లుతారేమో అనుకున్నాను. అలా కదిలే సూచనలేమీ కనపడలేదు.

"నిన్న సాయంత్రము ఎక్కడకు వెళ్ళారండీ ఏదైనా పిక్చరుకా" అంది పెద్దమ్మాయి.

"పిక్చరూ లేదు, గిక్చరూ లేదు. పార్టీకి వెళ్లాను వారెవరో పిలిచారని, మా స్నేహితుడు తీసుకు వెళ్ళాడు" అన్నాను.

"పార్టీకే - అమ్మ దొంగా ... చెప్పారుకారు" అంది కళ్లు పెద్దవి చేసి చిన్నమ్మాయి.

"నువ్వు అప్పుడు యెందుకు అడగలేదు - అడిగితే అప్పుడే చెప్పే వాడిని" అన్నాను. నవ్వుతూ - ఇంతలో, "అక్కడేమి జరిగిందండీ. యేమిటి విశేషాలు - చెప్పరూ? అంది బ్రతిమాలుతున్న ధోరణిలో పెద్ద మ్మాయి." చెప్పడానికేమి వున్నది. నాకు అంతా కొత్తవూరు. మనుష్యులు పద్ధతులు అన్నీ కొత్త, అందుచేతను నేనుచెయ్యకూడని పనులు ఒకటి రెండు చేశాను. పార్టీలో అనకూడని మాటలు తెలియక అన్నాను. అయినా పాపం మమ్మల్ని ఆహ్వానించిన ఇల్లాలు చాలామర్యాదగా నేనేమీ చెయ్యనట్టుగా సర్దేసి నా బెదురు తీర్చింది. తక్కిన వాళ్ళందరూ కూడా నాతో కులాసాగా మాట్లాడారు."

"అలాగటండీ యెంతపని జరిగింది? మేము కూడా వుంటే మీకు అన్నీ చెప్పి వుండేవాళ్ళము ఇటువంటి యిబ్బందులేమీ కలగక వుండేవి" అంది పెద్దమ్మాయి నవ్వుతూ.

"నిజమే - మీరు కూడా వుంటే నేను వీధిలో ఆ పని చెయ్యకనే పోయేవాడిని" అనుకున్నాను. లోపల.

"అసలింతకీ యేమి జరిగిందో చెపుదురూ యేదో ఒక చిన్న పొర పాటు వస్తే మాత్రము మీరు అంత సిగ్గుపడాలా యేమిటి? చెబుదురూ అసలేమి జరిగిందో" అంది లాలనగా -

"యెందుకూ అక్కడ జరిగిన పరాభవము చాలక, మీదగ్గరకూడా చెప్పాలా యేమిటి" అన్నాను.

"చెప్పాలి తప్పదు మాకు వినాలని సరదాగా వుంది." అంది చిన్నగా తన కుర్చీ లాక్కుని

యేం చెయ్యను? యేమిటీ పిల్లల హంగామా? అనుకుని ఒక్కక్షణం మౌనంగా కూర్చున్నాను.

"అలా సిగ్గుపడక్కరలేదండీ నిఘు చెప్పండి ఫరవాలేదు" అంది చిన్న మ్మాయి మళ్ళీ.

"ఇదెక్కడి గొడవరా భగవంతుడా, అనుకుని చెప్పకపోతే వాళ్లు నిఀ వనివ్వరు, చెపితే అసలు బ్రతకనివ్వరు అని హడలిపోతూ నెమ్మదిగా తు.చా. తప్పకుండి యింటి దగ్గర నుంచి బయలుదేరినది మొదలు మళ్ళీ తిరిగి వచ్చేదాకా జరగిన గాధ అంతా తల వంచుకొని చెప్పాను.

వాళ్ళిద్దరూ విరగబడి ఒకటే నవ్వు. యిక్కడి వాళ్లు యింత గట్టిగా నవ్వడం, నేను యెప్పుడూ వినలేదు. వాళ్ళలాగ వూగిపోతూ నవ్వుతుండగా తల్లి చక్కావచ్చి గది తలుపు తట్టింది. చటుక్కున నేను వెళ్ళి తలుపుతీ శాను. వాళ్ళీ తలుపు చప్పుడు వినినట్టుగాని, నేను తలుపు తీయడంగాని చూసినట్టు లేదు. అప్ప చెల్లెళ్ళిద్దరూ ఒకరి మీద ఒకరు పడి ఆనంద బాష్పాలు చెక్కిళ్ళమీద కారుతూంటే వూరికే ఊగిపోతూ నవ్వుకుంటు న్నారు. తల్లి వాళ్ళను చూసి, తనూ మందహాసం చేస్తూ ఏమిటండి సేమ్‌గారూ, వాళ్ళకేమైనా మతులు పోయినాయా! మీరేమైనా కథలు చెప్పారా వాళ్ళకు" అని నాతోటి అంటూ ఆ యిద్దరి పిల్ల చెవులూ పట్టుకుని లేవదీస్తూ "మీకేమైనా బుద్ధివున్నదా? లేదా! ఆ పెద్దమనిషి యెదుటయేమిటీ అసభ్య ప్రవర్తన" అంది కొంచెము కోపంగా అన్నట్టు. "Oh mother, mother" అంటూనే తల్లి చేతిలోనుంచి విడిపించుకుని, నవ్వుతూనే పారిపోయారు పిల్లలిద్దరూ. ఆవిడకూడా చిరునవ్వుతో "మీరే మన్నా మంచి కథలు చెప్పారేమిటండీ? మా పిల్లలు అంతగా నవ్వుతు

న్నారు. చిన్నతనం వాళ్ళ యీ ప్రవర్తనకు మీరేమీ అనుకోకండి. నేను కోపడతాను లెండి" అంటూ బయటకు వెళ్ళిపోయింది.



పాపము మీరు లేచి వొచ్చారు. మీకు వంట్లో బద్ధకముగా ఉన్న దన్నారు. మీ అమ్మాయిలు. "యెలా వున్న"దన్నాను. మరేమీ ఫరావాలేదండి, యేదో మామూలే. కాస్త వొళ్ళు నొప్పులూ అదీనీ, పెద్దతనము కదా! పని ఎక్కువ వాళ్ళిద్దరు వున్నారన్నమాటేగాని, తిని కూర్చోవటం వూరంతా తిరగడమే తప్ప నాకు కాస్తయే పనికి సహాయ పడరుకదా! అంటూ వెళ్ళిపోయింది. నేను ఒక్కక్షణము వాళ్ళనవ్వు తల్లికి వినపడి వచ్చిందా లేక కూతుళ్లు ఇంతసేపు ఇక్కడేమి చేస్తున్నారు: అని సందేహము కలిగివచ్చిందా! అని ఆలోచన పోయింది నాక్కు. [illegible] కారణమేదైతే మటుకు నాకేమి, గుంటలు మట్టుకు చురుకైనవాళ్ళే సిసింద్రీలలాంటి వాళ్లు అనుకున్నాను. యింకనేదైనా చదువుకుందామా అని పుస్తకము తీయబోతుంటే వంట యింట్లోనుంచి యేదో పెద్ద శబ్దమైనట్లు వినబడింది. యేమిటని నేను పరిగెత్తుకుని వెళ్ళి తలుపు తట్టాను.

నవ్వుతూాందో, యేడుస్తుందో తెలీని కన్నీటి ముఖంతో ముసలావిడ వచ్చి తలుపు తీసి నన్ను చూడడముతో సముదాయించుకుని "Oh! Mr. Sam, Sam" అని నన్ను అమాంతం కౌగలించుకుంది.

నవ్వే గ్రామఫోను రికార్డు హఠాత్తుగా ఆపేసినట్టు అదివరకు నవ్వుతున్న పిల్లలిద్దరూ, మూతులు బిగించుకుని, బలవంతాన నవ్వాపుకుని లేచి నిలబడ్డారు.

"ఎంతపని జరిగింది మిష్టర్ సేమ్. ముందు మాతోటి కాస్తంత పార్టీకి వెడుతున్నానన్న విషయం చెప్పి ఉంటే, నేను మీకు సలహా ఇచ్చి ఉండే దానిని కదా! అయినా ఫరవాలేదులెండి, మీరేమీ అనుకోకండి" అంది కౌగిట్లోంచి విడిచిపెట్టి వీపు తట్టుతూ

నేనేమీ అనుకోవడం లేదులెండి అని మాట్లాకుండా గబుక్కున నాగదిలోకి చక్కావచ్చాను. సోఫాలో చతికిలబడి ఈ ఘురముండలు నేను చెప్పినదంతా చిలవలూ, పలవలూ, చేర్చి చెప్పారు కాబోలు. ముగ్గురూ నవ్వుకుంటున్నారు. అనుకున్నాను. ఇంతలోనే వాళ్ళు ముగ్గురూ మళ్ళీ వచ్చి "సేమ్‌గారూ మా తెలివితక్కువ ప్రవర్తనకు మన్నించండి. మేము అట్లానవ్వడము పొరపాటు. మీరేమీ అనుకోకండి" అని క్షమాపణ చెప్పుకున్నారు. "నేనేమీ అనుకోలేదండి దీనికి క్షమాపణ కూడా ఎందుకు?" అన్నాను.

"థేంక్యూ" అని వాళ్ళు తలవొంచుకొని చక్కాపోయారు. వీళ్ళకు చెప్పడం చాలా పొరపాటే ఇది వాళ్లు ఎరుగున్నంతవరకూ స్నేహితులందరకూ ప్రచారం చేస్తారు కాబోలు అనుకొని పోనీ! మునిగిపోయిన దేముంది? అని నేనూ నవ్వుకున్నాను.

# 12

వాళ్ళ మీద నాకు ముందుకొంచెం కోపం వచ్చినా, తల్లీ, పిల్లలూ వెర్రి మొహాలు వేసుకుని, భయంగా నాకేసి చూస్తూ - అందులో ఆ చిన్న పిల్ల మరీను - క్షమాపణ చెప్పుకునేటప్పటికి నాకు జాలివేసింది. వాళ్లు వెళ్ళిన తరువాతను ఇదంతా పునరాలోచన చేసుకుంటూ వుంటే వాళ్లత ప్పేమట్టుకు యేముంది ఇందులో, తప్పు చేసినవాణ్ణి నేను. అది విన్నవాళ్లు ఎవరయినా నవ్వుతారు. నవ్వకుండా ఎలా వుండగలరు! ఇప్పుడు సావకాశ

ముగా ఆలోచిస్తే నాకే నవ్వొస్తుందిగదా! తెలివి తక్కువ తెలివితక్కువే. అది తెలివితక్కువ అన్నారనిగానీ, మరొకళ్లు అనుకున్నారనిగాని బాధపడడమూ, వాళ్ళమీదను కినుకు తెచ్చుకోవడమూ, మరో తెలివి తక్కువ కాదుమరీ!

అందుకని మనస్ఫూర్తిగానే వాళ్ళను క్షమించాను. నా తెలివి తక్కువ మాట ఎలాగ వున్నా, వాళ్ళ వెర్రి మొఖాలు చూస్తేమట్టుకు నాకు జాలి వేసింది నవ్వూ వచ్చింది చిత్రముగా లేదిదీ!

ఈ విషయము మరిచిపోయి మళ్ళీ చదువు ప్రారంభిద్దాము అనుకునేసరికి యెందుకో మళ్ళీ యిల్లు జ్ఞాపకము వచ్చింది. మా అమ్మ ఎలా వున్నదో, నాకోసము యెంత బెంగపెట్టుకుందో యేమిటో. మా నాన్న కఠినంగా వున్నా, లోపల ఆయనకీ నామీద ఎంతో అభిమానం లేకపోలేదు. కానీ, ఆయన ఎప్పుడూ దానిని పైకి పొక్కనివ్వడు. యిప్పుడు కూడా మా అమ్మకు ఏవో ఆమాట, యీ మాట చెప్పి, మరిపించటము బదులు, ఆవిడను కోపపడుతూ, మరింతె బెంగటిల్లేట్లు చేస్తున్నాడేమో? ఏం చేస్తేమటుకు నేను ఏమీ చెయగలను ఇప్పుడు? నేను రాసిన ఉత్తరాలు అందాయో లేదో? అయినా అందకుండా ఏలాగ వుంటాయి? ఇదేమీ మనదేశము గనుకనా? ఉత్తరాలూ, టెలిగ్రాములూ, మనియార్డరులూ, హరించుకుపోవడానికి? నాన్న యెందుకు జవాబు వ్రాయలేదు? నేనిక్కడ వున్నన్నాళ్ళూ ఆయన దగ్గిరనుండి జవాబు రాదాయేమిటి చెప్మా? రాకపోతే నేను బ్రతకడము ఎలాగ? ఈ చదువుకు సున్నాచుట్టి ఇంటికి పోవలసిన గతి పడుతుందా ఏమిటి భగవంతుడా? అప్పుడెంత హాస్యాస్పదముగా వుంటుంది నా బ్రతుకు? పోనీ ఒక టెలిగ్రాము యిస్తేనో? దానికి బోలుడంత అవుతుంది గదా? యిక నేమి చెయ్యడం అని పుస్తకము చేతితో పట్టుకొని ఆలోచిస్తూ కూర్చున్నాను.

ఎంతసేపు అలా కూర్చున్నానో తెలియదుగాని తలుపు కొట్టిన చప్పుడై ఉలికిపడి, రండి లోపలకు అన్నాను నెమ్మదిగా తలుపు తీసుకుని థామ్సన్ దొరసాని లోపలకు వచ్చింది. మళ్ళీ ఏమీ వచ్చిందా ఈవిడకు? అనుకుంటూంటే "మీకు ఉత్తరము వచ్చిందండీ సేమ్‌గారూ!" అని "బహుశా మీ ఇంటి దగ్గర నుంచేమో" అంటూ మందహాసముతో ఆ ఉత్తరము నాకు అందించి చక్కాపోయింది.

ఉత్తరము చేతిలోకి తీసుకోగానే ఇంటి దగ్గరనుంచేనని తెలుసుకున్నాను. ఎందుకో కొంచెము దడవచ్చింది. కళ్లనీళ్లు వచ్చాయి. సంతోషమో,

విచారమో తెలియలేదు. రెండుమూడు నిముషాలవరకూ ఉత్తరము తెరవలేకపోయాను. తుదకెలాగయితేనేమీ నన్ను నేను సముదాయించుకుని ఉత్తరము తెరిచాను. మా నాన్న దస్తూరీ కనపడే సరికి ప్రాణము లేచి వచ్చింది.

ఉత్తరము చదువుతూంటే, నాలో మొట్టమొదట బయలు దేరిన భయసందేహాలు తొలగిపోయి, కరుణాపూర్ణమైన ఆయన అక్షరాలు కంటికి ఎంతో చల్లగా తగిలి, హృదయములో ఆనందమూ, ఆశ్చర్యమూ మొదలైన భావాలు సమ్మిళితమైనన్నొక్కసారి ముంచెత్తి, ఉక్కిరిబిక్కిరి చేసినాయి. మా నాన్నకున్న సహజమైన బాహ్య కాఠిన్యము ఎక్కడా ఒక్క పంక్తిలో గాని, ఒక్క అక్షరములోగాని కనుపించలేదు. మనుష్యులు దూరమైన కొద్దీ మమతలు ఎక్కువవుతాయి కాబోలు! ప్రతి పంక్తి ఎంత అప్యాయతతోటి రాశాడో ఆయన! మా అమ్మ పడుతున్న బాధ, అమెను సముదాయించలేక తనుపడుతున్న బాధ, చదువుతుంటే, ఎంత దుఃఖము వచ్చిందో చెప్పలేను. వెంటనే నా పుస్తకాలు అక్కడ పారేసి, చదువుకు స్వస్తి చెప్పి, రెక్కలు కట్టుకొని యింటికి పోదామన్నంత ఉద్రేకము కలిగింది.

ఎలాగో ఆ ఉత్తరము చదవడము ముగించాను. కళ్లనీళ్లు గోదావరి వరదలా పొంగి బయటకు వస్తున్నాయి. ఎంత ప్రయత్నము చేసినా ఆగడములేదు. "నాయనా ఎందుకు విచారిస్తావు? ఎందుకిలా బాధ పడుతున్నావు" అనేవాళ్లుగాని "దీనికి నువ్విలాగ బాధపడగూడదు. మీ నాన్నకు ఇలా సమాధానం రాస్తే సరిపోతుంది." అని సలహా యిచ్చేవాళ్లు ఒకళ్లు గూడా లేరుకదా! పైగా యిదంతా విని నవ్వేవాళ్ళేగాని - అనుకుంటూ వుత్తరము ఆమూలాగ్రముగా మళ్ళీ చదివాను. ఈ మాటు అంత బాధపడకుండా చదువుకోగలిగాను. ఇలా మళ్ళీ మళ్ళీ అయిదుసార్లు చదివేసరికి మొదలు వచ్చిన ఉద్రిక్తత, విషాదమూ, తగ్గి ప్రశాంతతకలిగి నాన్న రాసినదంతా నిజమూ, సహజమూకదా! వాళ్లు బాధపడతారని మొదట తెలిసే బయలుదేరాను కదా! ఇప్పుడింత బాధపడడములో అర్థము లేదు. నెమ్మదిగా నాన్నకు పెద్ద ఉత్తరము రాయాలి. అని అనుకుంటూ, ఉత్తరము చేతితో పట్టుకుని అలాగే పరధ్యానముగా ఎంతసేపో కూర్చున్నాను. మా ఇల్లూ, మా అమ్మా, మా నాన్న, మా పొలాలు, మొదలైనవన్నీ నాడు లండన్‌లో పిక్చర్ హౌస్‌లో చూచిన బొమ్మల్లా నిర్విరామముగా కళ్ళ యెదుట తిరగడము మొదలు పెట్టేయి. ఆ చిత్ర భ్రమణము చూస్తూ మైమరచి ఉండగా, తలుపు కొట్టిన చప్పుడు అయింది.

"రండి లోపలకు" అన్నాను. ఇంటి ఆవిడ ఒక కప్పు టీ పట్టుకని నవ్వుతూ లోపలకు వచ్చి, అది నా బల్ల మీద పెట్టి, మామూలు ప్రకారము వెంటనే బయటకు వెళ్ళక ఒక కుర్చీ నాకు దగ్గరగా లాగుకుని కూర్చుంది. "ఏమిటి సేమ్‌గారూ, ఉత్తరము మీ యింటిదగ్గరముంచేనా! మీ అమ్మా, నాన్నా కులాగా ఉన్నారా? నిన్ను రమ్మని రాశారా! నీకే మైనా బాధ కలిగించిందా ఉత్తరం అటువంటిదేదో జరిగి వుంటుందని ఊహించి ఒక కప్పు టీ తాగుతే, కొంత స్తిమితం కలుగుతుందని తీసుకువచ్చాను. ముందు ఇది తీసుకోండి తరువాత మాట్లాడుదాము" అని నన్ను బలవంతపెట్టింది. ఆవిడ మాట తీసెయ్యలేక, ఈవిడ ఇవన్నీ యెలాగ ఊహించింది, తనవాణ్ణి కాదు, యెక్కణ్ణించో వచ్చాను, పరాయి దేశస్తుణ్ణి. యీవిడకు నామీద ఇంత అభిమానము యెందుకో! పిల్లగన్న తల్లి గనక మా అమ్మబాధ ఆవిడ గ్రహించ గలిగిందేమో - అనుకుంటూ టీ పుచ్చుకుని బల్లమీద కప్పు పెట్టేశాను. ఆవిడ తీసుకుని వెళ్ళిపోతుందేమో అనుకుంటే ఆవిడ వెళ్ళలేదు.

"ఏమండీ! మాట్లాడకుండా అల్లాగే కూర్చున్నారేమీ! మీ వాళ్ళంతా కులాసాగా ఉన్నారా! మీ అమ్మగారు నిమ్మళంగా ఉన్నారా! పాపం మీ అమ్మకోసం చాలా బెంగ పెట్టుకున్నారు కాబోలును! సహజమే కదా అది! ఆవిడ బాధ కొంత నేను అర్థము చేసుకోగలను. మీరు గాక - ఇంటి దగ్గర కొంచెం ధైర్యంగా ఉంటుంది - ఆవిడ కడుపున బుట్టిన వాళ్ళు మీరు ఎంత మందండీ" అన్నది.



దాంతో నాకు మళ్ళీ ఎంతో దుఃఖం వచ్చింది. ఒక్క క్షణము సముదాయించుకుని, గద్గద కంఠంతోనే "నాకు మరెవ్వరూలేరండీ, నేనొక్కడినే మా అమ్మకూ, నాన్నకూ, నేనొక్కడినేనండీ. ఇంకెవళ్ళూలేరు. వాళ్ళ నోదార్చేవాళ్లు లేరు. మరిపించే వాళ్లూ లేరు. ఆపని చెయ్యవలసిన నేను ఇంతదూరంలో ఇక్కడ ఉండిపోయాను. మా అమ్మ ఈ యెడబాటు

భరించకలేక ఉందండీ. నేను - నేను - నేను" అనియింకేమీచెప్పలేక పిల్లవాడికి మల్లే బావురుమన్నాను. ఆవిడ గబుక్కున లేచి, నా కుర్చీ దగ్గరకు వచ్చి నిలబడి నన్ను తన గుండెకు హత్తుకుని, నాతల నిమురుతూ, "అలా విచారించకండి సేవ్‌గారూ! మీరేమీ బెంగపెట్టుకోవద్దు. మీకేమీ భయంలేదు. మీరు తొందరపడి ఇంటికి వెళ్ళవలెనను కుంటున్నారేమో! ఆపని చెయ్యకండి. యింతవరకూ మీకైన ఖర్చంతా వృథాగా సముద్రములో పోసినట్టవుతుంది. ఇక్కడ క్షేమంగా ఉన్నాననీ, సుఖంగా ఉన్నాననీ, ఏ లోటూ లేదనీ, వాళ్ళను బెంగ పెట్టుకోవద్దనీ, పెద్ద ఉత్తరము వ్రాయండి. అక్కడ మట్టుకు మీ ఊళ్ళో లేని పై చదువులకు వారుగూరు వెళ్తారా? వెళ్ళరా! ఇల్లూ, వాకిలీ విడిచిపెట్టి మీ అమ్మగారు మీ వెంట వస్తారా అక్కడ మట్టుకు! ఇది ఎటొచ్చీ మరికొంచెం దూరం అన్నమాట గాని, మరేమీ ఇబ్బందీ, భయమూ లేదని రాయండి. కొన్నాళ్ళకు వారు ఈవియోగానికి అలవాటుపడి ధైర్యంగా ఉంటారు." అని ఎంతో సానుభూతితో చెపుతున్న మాటలు అమృత వర్షములా నా చెవిన పడి మనస్సు కెంతో హాయినిచ్చాయి. అంతటితో ఆవిడ నన్ను విడిచి "మీరు ధైర్యముగా ఉంటే, వాళ్ళకూ ధైర్యము వస్తుంది. ఇంక మీరు బెంగ పెట్టుకోనని ఒట్టు పెట్టుకోండి. నేను వెడుతున్నాను. లేకపోతే మీకు మళ్ళీ భోజనానికి ఆలస్యమవుతుంది." అని నెమ్మదిగా బయటకు వెళ్ళి పోయింది.

ఓహో యీావిడకు కూడా ఏ సంబంధమూ లేని నా మీద యెంత జాలో! కష్టము వచ్చేటప్పటికి మానవులంతా ఒకటేనేమో! అందులో ఆ మానవత స్త్రీలలో మరీ యెక్కువేమో! అనుకుంటూ, కాస్సేపు అలాగే కూర్చున్నాను.

# 13

ఈ మధ్యను రాజు బొత్తిగా కనబడడము మానేశాడు. కారణమేమిటో తెలియులేదు. నామీదను ఏమయినా కోపము వచ్చిందా అనుకున్నాను. కోపము రావలసిన అగత్యమేమీ అగుపించలేదు. నేను వెళ్ళడానికి చదువుతో ఇక్కడా ఊపిరి ఆడక, తీరిక లేకపోయింది. పాఠాలు చాలా బాగా జరుగుతున్నాయి. ప్రైవేటు మాష్టారు నా యెడల ప్రత్యేక అభిమానమూ, శ్రద్ధా చూపించి, పాఠాలు చెబుతుండేవాడు. ఈపద్ధతికీ, మనదేశపు పద్ధతికీ ఎంతో తేడా కనబడ్డది. ఆయన చెప్పే ప్రతి విషయమూ, నాకు భాషా పరిజ్ఞానము తక్కువయినా ఇట్టే అర్థమయ్యేటట్లు చెప్పేవాడు. నేను అర్థము చేసుకుని తలకు పట్టించుకుంటున్నాని తెలుసుకుని, ఆయన చాలా సంతోషించేవాడు. నా చదువూ, అందులో నా ప్రగతీ, నాకెంతో తృప్తి కలిగించినాయి. ఒక రోజున ఏమీ తోచక రాజు దగ్గరకు వెళ్ళాను. అతనూ ఎక్కడికో బయలుదేరబోతున్నాడు.

"అరే ఏమిటిది ఇలా వచ్చావు. ఇన్నాళ్ళనుంచీ ఏమయ్యావు! అప్పుడే నన్ను మరచిపోయావా! లేకపోతే మరపించే వాళ్ళెవళ్ళన్నా దొరికేరా?" అన్నాడు నవ్వుతూ.

"యింకా అలాంటివాళ్ళను సంపాదించడానికి నాకెక్కడా తీరిక లేకుండా ఉన్నదయ్యా. నా చదువుతోటే సరిపోతోంది! నీకేమి వచ్చింది. నువ్వెందుకు రావడం మానేశావు? ఏమీ తోచక ఎలాగున్నావో అని చూడడానికి వచ్చాను." అన్నాను.

అతను నవ్వుతూ "నువ్వు నమ్ముతావో నమ్మవోగాని, నేనూ నీ బసకు రావాలనే బయలుదేరాను. ఎంత వొట్టుపెడితే అంత వొట్టు. నాకూ ఈ మధ్యను కొన్ని పరీక్షలూ అవీ అయి, రాలేకపోయాను. నిన్నటితోటే అన్నీ పూర్తి అయినాయి. అందుకనే యీ వేళ నీ కోసము బయలుదేరాను. సరే, నువ్వే వచ్చావు గనుక మనం హాయిగా ఎక్కడైనా లంచ్ తీసుకుని సాయంత్రందాకా ఊరంతా బలాదూరు తిరుగుదాము. కాస్త మన బడలికంతా తీరి, మళ్ళీ కొంత నూతనోత్సాహము వస్తుంది. నువ్వీ మధ్యను ఎక్కడికన్నా వెళ్ళేవా? ఏదేనా పిక్చరూ గట్రా చూసేవా!" అన్నాడు మేము బయటకు వస్తూంటే.

"ఏమీ లేదు ఎక్కడకూ కదలలేదు. జరిగిన విశేషమల్లా ఒక్కటే.

అది మా యింటి దగ్గరనుంచి వచ్చిన ఉత్తరము" అన్నాను.

"ఏమిటేమిటి విశేషాలు, మీ అమ్మా, నాన్నా, కులాసాగా వున్నారా" అన్నాడు భుజం మీద చెయ్యివేసి.

"కులాసాగానే వున్నారు." అని ప్రారంభించి, ఆ ఉత్తరము వచ్చిన నాటి గాథంతా చెప్పి, మా ఇంటావిడ కనబరచిన ఆదరమూ, పలికిన సాంత్వన వచనాలూ చెప్పి "మా నాన్న నన్ను యింటికి వచ్చెయ్యమని గట్టిగా రాశాడు. నాకేమీ తోచలేదు నేను నీ దగ్గరకు పరిగెత్తుకు వచ్చి నీ సలహా ఆడుగుదామనుకున్నాను కూడాను. మా లాండ్ లేడీ చెప్పిన మాటలతోటే కొంత ధైర్యం తెచ్చుకొని మళ్ళీ యింటికి ఉత్తరము కూడ రాసేశాను." అన్నాను.

"మంచిపని చేశావు. ఇంత శ్రమపడి, ఇంత సాహసించి, ఇంత ఖర్చుచేసి ఇంతదూరము వచ్చి ఏమీ చూడకుండా, నేర్వకుండా తిరిగి వెళ్ళడము అంత మంచిపని కాదు. చాలా హాస్యాస్పదముగా కూడా వుంటుంది. పైగా మనమేదో పెద్ద పెద్ద ఆదర్శాలూ, కబుర్లూ, వయస్సుకు మించినవి చెప్తుంటే, నువ్విలా నీళ్ళు కారిపోయి అమ్మకోసము బెంగపెట్టుకుని ఇంటికి పరుగెత్తడమేమీ బాగుండదు. నీ ఆదర్శాలన్నీ అడుగంటి నువ్వూ కొన్ని వందల కోట్ల భారతీయులలో ఒకడివై ఊరుకుంటావు. రానని రాయడం చాలా మంచిపని చేశావు. నిన్ను నేను అభినందిస్తున్నాను. ఇంకను యివన్నీ మర్చిపోదాము. లంచ్ తీసుకుని, ఓ పిక్చరు హౌసుకి వెళ్ళుదాము"అన్నాడు రాజు.

"ఇదేమిటయ్యా, ఇప్పుడు పిక్చరు హౌసేమిటి? అర్థరాత్రి అంకమ్మ శివాలు అన్నట్టు పట్టపగలు పిక్చరేమిటయ్యా! ఏం బాగుంటుంది"అన్నాను.

"భేషుగ్గా వుంటుంది. ఎందుకు బాగుండదూ. నీ చేతనే అనిపిస్తాను. కదా బావుందని..." అని పందెం వేసినంత ధీమాగా ముందుకు లాక్కుని పోయాడు.

"ఈ దేశములో రోజూ మధ్యాహ్నము 2 గంటల నుంచి, రాత్రి 10 గంటల వరకూ నిర్విరామంగా పిక్చర్ షో జరుగుతుందన్న మాట మరచిపోయావా బాబూ. అందుచేత మనం సుఖముగా పిక్చరు చూడవచ్చు. యెంజాయ్ చెయ్యనూవచ్చు."అంటూ -

మాకు యెదురుగా వున్న ఒక చిన్న రెష్టారెంటులోకి దారి తీశాడు. అక్కడ మామూలు లాంఛనము ప్రకారము ఒక వెయిటర్ మమ్మల్ని ఆహ్వా

నించడమూ, ఖాళీగా వున్న బల్లదగ్గర కూర్చోపెట్టడమూ, మాకు కావలసిన తినుబండారాలు తీసుకువచ్చి అమర్చడమూ, మేము వాటిని నిశ్శబ్దముగా గారడీ చేసినట్లు మాయము చెయ్యడమూ క్షణాల మీద జరిగిపోయింది.

మేము లేచి బిల్లుచెల్లించి, వెయిటరుకు మామూలు ముట్టచెప్పి ఆ వీధిలోనే సమీపములో ఉన్న పిక్చరు హౌసుకి ఎగబడ్డాము.

సరే, పిక్చరు తమాషాగా, ఉత్సాహముగా, బాగానే వుంది - అనివేరే చెప్పడము ఎందుకు! ఎటొచ్చీ అందులో ఒక్క చెప్పదగ్గ విశేషమేమి టంటే, ఎక్కడో జరుగుతున్న ఆటల పోటీలు బ్యాడ్‌మింటన్, (దాన్నీ దేశంలో షటిల్‌కాక్ అంటారు) తరువాతను టెన్నీసు, క్రికెట్టు వగైరా పోటీల తాలూకు బొమ్మలు చూపించారు. చాలా ఉత్సాహ జనకముగా కనపడ్డాయవి. బయటుకు వచ్చిన తరువాతను ఇక్కడ క్రీడా విశేషాలను గురించి ఎన్నో ప్రశ్నలు అడిగాను రాజుని. అన్నిటికీ ఎంతో ఓపికగా సమాధానం చెబుతూ "ఈ గొడవంతా నేను చెప్పడము ఎందుకూ. నీకు ప్రత్యక్షముగా ఇక్కడ క్రీడా విశేషాలు కొన్ని చూపిస్తానుండు. ఇప్పుడు అయినదల్లా నాలుగో, నాలుగున్నరో కదా! రాత్రి తొమ్మిది గంటలకు గాని చీకటి పడదు కదా. ఈ తమాషాలు చూడవచ్చు అన్నట్టు చెప్పడము మరిచపోయాను. నువ్వీపాటికి తెలుసుకునే ఉంటావు. ఇక్కడ వేసంగు లలో రాత్రి తొమ్మిది పదింటికి కాని చీకటి పడదు. అంతవరకూ బయట కూర్చుని, చదువుకోవచ్చును కూడాను. అంత వెలుతురు ఉంటుంది. మళ్ళీ తెల్లవారు జామున మూడుగంటలకే అరుణోదయము అవుతుంది. మళ్ళీ ఋతువు మారిన తరువాతను, దినకరుడి ప్రభావం క్రమేణా తగ్గి, ఉదయము తొమ్మిది గంటలకు ఉదయించి, మళ్ళీ మధ్యాహ్నము మూడు గంటలకే అస్తమిస్తాడు. శీతాకాలములో ఉత్తర రష్యాలోనూ, సైబీరియా లోనూ మరి చిత్రముగా ఉంటుంది. సంవత్సరానికి రెండే ఋతువుల వాళ్ళకు. ఆ రెండు ఋతువులలోనూ ఆరునెలలు 24 గంటలు వెలు తురూ, మిగతా ఆరునెలలూ 24 గంటలు చీకటీనీ. అనేటప్పటికి నేను నిశ్చేష్టుణ్ని అయి "మరయితే ఆరునెలలు మెలకువ, ఆరు నెలలు నిద్రానా ఏమిటి? ఆదేశస్థులకు" అన్నాను. అతను నవ్వుతూ "అబ్బెబ్బే అలాం టిదేమీ లేదు. వాళ్లూ మనకు మల్లేనే వెల్తురు రోజుల్లో పనిచేసే వేళ పనిచేసి, పడుకునే వేళ పడుకుంటారు. అలాగే చీకటి రాత్రులలో పడుకునే వేళ పడుకుని, పని చెయ్యవలసిన వేళ పనిచేసుకుంటారు"అన్నాడు.

"హారి వీళ్ళిల్లు బంగారంకానూ"అన్నాను. మేము ముందు నిమ్మళ

ముగా ఊరుబయటకు దారితీశాము. అక్కడ ఒక చిన్న క్లబ్బు లాంటిది ఉంది. అందులో యెవరయినా కొంత డబ్బు చెల్లించి స్నేహితులతో టెన్నీసు ఆడుకోవచ్చును. అక్కడ టెన్నీసు కోర్టులు చాలా అందంగా రెండు రకాలుగా ఉన్నాయి. కొన్ని కోర్టులు మన దేశంలో లాగినే ఉన్నాయి. మరికొన్ని దగ్గరగా అంటకత్తెర వేసిన పచ్చగడ్డితో నిండి ఉన్నాయి. అది చాలా అందముగా కనబడ్డది నాకు. ఇక్కడబంతి యెలా తూలుతుందా అనుకుంటూ రాజును అడిగాను కూడాను.



"తూల్తుందో లేదో చూస్తూ ఉండు" అన్నాడు. అక్కడకు ఇంత లోనే ఇద్దరు ఆడ, ఇద్దరు మొగ వచ్చి ఆట ప్రారంభించారు.

బంతి మామూలుగానే తూలింది. ఇక్కడ అట్టే అంత మామూలు కోర్టులోకి మల్లే యెక్కువగా తూలదు. కొంచెము గట్టిగా కూడా దెబ్బ

కొట్టవలసి వస్తుంది. అంతకంటే తేడా ఏమీ లేదు. అన్నాడు రాజు. అక్కడొక పావుగంట ఆట చూచి, మేము మరొక చోటకు వెళ్ళాము. అక్కడ క్రికెట్ ఆటసాగుతోంది. క్రికెట్ అనే పేరు వినడమూ, చదవడమే కాని ఇదివరకు యెప్పుడూ ఆట చూడలేదు. ఒక అరగంట పైగా అక్కడ కూర్చుని చూశాను. నాకేమిటో తమాషాగా ఉన్నట్టున్నది. యెవడో ఒకడు బంతి విసరడము, బేటు పుచ్చుకుని ఒకడు దానిని కొట్ట డము బయట పదిమంది స్తంభాల్లా నిలబడి ఆ యెగిరి వచ్చే బంతిని పట్టుకోడానికి విశ్వ ప్రయత్నము చెయ్యడము ఇదో అటేమిటి నాబొంద! నా చిన్నతనములో సంకురాత్రి పండుగకు మా వూళ్ళో ఆడే కుండ బంతి జ్ఞాపకము వచ్చింది. యెటొచ్చీ ఇది అంతకంటే అందముగానూ, నాజూకు గానూ ఉందనుకోండి. అయినా ఇందులో వ్యాయామముగాని, ప్రేక్షకులకు ఉత్సాహముగాని కలిగించేది ఏమి ఉంటుందా అనుకుని అలాగే అరగంట పైగానే చూస్తూ కూర్చున్నాము.

"ఈమాటు మేచ్ జరిగినప్పుడు చూడ్దుగాని దాని తమాషా, ప్రేక్ష కులు యెంత వెర్రెత్తిపోయి కేకలూ యీలలు వేస్తారో చూడవచ్చు, దానినిబట్టి ప్రజానీకానికి దానిమీద యెంత అభిమానము వుంటుందో తెలు స్తుంది" అని చెబుతూన్న రాజు నెమ్మదిగా బయటకు తీసుకు వచ్చాడు.

అక్కడ నుంచి ట్రాము యెక్కి ఊరికి మరోవైపున పొలిమేరలలో ఉన్న కొండ దగ్గరకు వెళ్ళాము. దానిని బ్రెయిడ్ హిల్స్ అని కాబోలు అంటారు. ఆ కొండమీదను ఒక చిన్న క్లబ్బులాంటిది ఉంది. అక్కడ కొంత సమప్రదేశము మళ్ళీ కొంత యెత్తు. తరువాతను మళ్ళీ పల్లము యిలా రకరకాలుగా యెంతో దూరము వ్యాపించి ఉంది. ఆ దారి పొడు గునా గడ్డి అంతా. అక్కడ టెన్నిస్ కోర్టులాగానే అంటకత్తెర వేసి ఉన్నది. "ఇక్కడో తమాషా ఆట చూడాలి మనం. మనదేశంలోకి యింకా దిగు బడి కాలేదది"అన్నాడు రాజు. మేము క్లబ్బు దగ్గరకు వెళ్ళి, ఆ క్లబ్బు చూచి, అక్కడ నుంచి ముందుకు సాగాము.

మా ముందు ఒక్కొక్కళ్ళు విడిగానూ, జంటలుగానూ, చేతిలోవంకీ కర్రలాంటి వేవో పుచ్చుకుని నడుస్తున్నారు. వాళ్ళ వెనకనే ఒక్కొక్క ళ్ళకు ఒక్కొక్క కుర్రవాడు. ఓ పొడుగాటి సంచిలో ఇటువంటి కర్రలు రకరకాలివి తీసుకుని, వాళ్ళవెంట మోసుకు వస్తున్నాడు.

"దానిని గాల్ఫ్ (Golf) అంటారోయ్ పార్వతీశం. దీని తమాషా చూస్తూండు" అంటూండగానే మా ముందొక అసాది చిన్న తెల్లనిబంతి

నేలమీద పెట్టి చేతి కర్రలాంటి దానితో సూటి చూసి కొట్టాడు. అది ఎక్కడ పడ్డదో, జాగ్రత్తగా కనిపెట్టి, ఆ చోటుకి అతనూ, ఆ వెనకాల ఈకర్రలు తెచ్చే కుర్రాడూ నడిచారు. అక్కడకు వెళ్ళి ఆబంతిని మళ్ళీ కొట్టి, పైకి వాడు సాగిన తరువాత, మళ్ళీ మొదటి చోట ఇంకొకళ్ళు యెవరో ఆరంభించారు. మేమిద్దరమూ, కొంచెము యెడముగా వాళ్ళను అనుసరించాము.

మొదటివాడు రెండుమూడు దెబ్బలు కొట్టిన తరువాతన ఒక చిన్న చతురంగా వుండే ప్రదేశానికి వెళ్ళి అక్కడున్న బంతిని యెంతో నేర్పుతో ఆ ప్రదేశ మధ్యమందున్న బిలంలో పడేటట్లు కొట్టాడు. ఇటువంటివి 18 బిలాలు వుంటాయట. ఇన్నిటిలోకి బంతిని కొడుతూ వెళ్ళడమే ఈ ఆట. ఒక్కడూ ఆడుకోవచ్చు. లేదా యెంతమంది కావలిస్తే అంతమంది ఆడవచ్చు. దీనికి పోటీలుంటాయట. దానిలో యెవడు యెన్ని తక్కువ దెబ్బలతో బంతిని యీ 18 బిలాలలోనూ పడయ్యగలడో వాడు గెలిచినట్లు లెక్క.



ఈ ఆటలో కూడా టెన్నిసు లాగానే ఆడా మగాకూడా ఆడవచ్చు. కాని యీ ఆటలో సొగసేమిటో, ఎందుకాడతారో, నాకేమి అర్థముకా లేదు. ఆనాడు దుఃఖ భారములో ఉన్నవారు ఎన్నడైనా, ఆ విషాద బాధ తగ్గించు కోడానికి ఆడుకునే ఆటలా అనిపించింది నాకు.

ఈ మాటే అంటే, రాజు విరగబడి నవ్వి. "భలే అయిడియాస్ వస్తాయోయ్ నీకు" అన్నాడు.

అక్కడ నుంచి మేము తిన్నగా ఊళ్ళోకివచ్చి, మరో క్లబ్బుకి వెళ్లాము. అక్కడ నాలుగైదు గదుల్లో పెద్ద పెద్ద టేబుల్సు. వాటిపైన ముఖమల్ గుడ్డలాంటి గుడ్డ అతికించో, కుట్టో ఉన్నది. దానికి నాలుగు మూలలా నాలుగు రంధ్రాలూ దానికి అడుగున చిక్కాలు అతికించివున్నాయి. బల్లమీద దంతంలో చేసిన బంతి నొకదానిని పెట్టి ఒక పొడుగాటి చివ రకు మొనదేలిన కర్రతో కొడతారు. బల్లమీద మరో ఎర్రబంతీ, మరో తెల్లబంతీ వుంటాయి. ఆడేవాడి చేతిలోదికూడా తెల్లబంతే. యీ ఆట కొంతసేపటికిగాని నాకు అర్థము కాలేదు. తెలుసుకున్న తరువాతను అందమైన ఆటలాగా, చాలా ప్రావీణ్యమూ, సూక్ష్మదృష్టీ కావలసిన ఆట లాగా తోచింది. యెంతసేపు చూచినా, యిందులో ఉద్రేకము కలిగించేదేమి లేకపోయినా, విడిచి వెళ్ళబుద్ధిపుట్టలేదు. అలా సుమారు ఒక గంటసేపు చూసి నెమ్మదిగా యింటికి దారితీశాము.

అక్కడ నుంచి ఊరికి మరోవైపున. వున్న మరో కొండమీదకు వెళ్ళాము. అది కొంచెము ఇంచుమించుగా ఊరికి మధ్యను, కొంత సమీపముగా వుంది. మా బసకు మరీ దగ్గర అని తరువాత తెలుసుకు న్నాను. ఇక్కడా జన సమ్మర్దం, వ్యాహ్యాళికి వచ్చినవాళ్లు స్త్రీ పురుషాదులు చాలా మంది వున్నారు. అందరూ చాలావరకూ యువతీ యువకులే. జంటలు, జంటలుగా యెవరిమట్టుకువారు తలో చెట్టుచాటునో, పుట్టమూ లనో, ఒదిగి కూర్చుని, యెవళ్ల ధోరణిలో వాళ్లు పై ప్రపంచాన్ని మరిచిపోయి వున్నారనిపించింది. కొంచెం దూరములో మనవాళ్లంతా సుమారు పదిప న్నెండుగురుంటారు. అందరూ తెలుగువాళ్ళే, కూర్చుని గట్టిగా కబుర్లు చెప్పకుంటున్నారు. మేము వుభయులమూ అక్కడకు చేరేసరికి, వాళ్ళం దరూ సంతోషముతో మమ్మల్ని ఆహ్వానించారు. కాసేపు ఈ కబుర్లూ, ఆకబుర్లూ చెప్పకున్నాము. అందులో ఒకతను "మనం అంతా ఇక్కడ చెడుగుడి గాని, వుప్పట్టిగాని ఆడుకుందాము" అన్నాడు. "భలే అయి డియా ఇచ్చావోయ్! రెండూ ఆడుదాము" అన్నాడు ఇంకొకడు. భలే

అంటే భలే అని అందరూ లేచారు.

మేము రెండు జట్లుగా విడిపోయి, ఓ జట్టు చెడుగుడు, ఓ జట్టు ఉప్పట్టే ఆడడానికి ఉపక్రమించాము. రెండు నిమిషాలలో చుట్టుపట్ల ఉన్న వాళ్ళు, ఆ దేశస్థులు పదిపదిహేనుగురు చేరారు. ఇంకో రెండునిమిషాలలో యెక్కడనుంచో పరిగెత్తుకుంటూ మరో పాతికముప్పయిమంది వచ్చారు. మరో అయిదు నిమిషాలలో వందమంది పైగా అక్కడున్న యువతీ యువకులు కూడా తమ శృంగార కలాపాలు కట్టిపెట్టి మాచుట్టూ మూగారు. వాళ్ళందర్నీ చూచి, మేము మరీ వుత్సాహముతో మా ఆటలు సాగించాము. నేను చెడుగుడి జట్టుకి అనుకోకుండా నాయకుణ్ణి అయినాను. నాకా ఆట చిన్నప్పటి నుంచీ అలవాటయిన కారణము చేతనూ ప్రేక్షకులు చప్పట్లు కొడుతూ, హూరే హూరే, అంటూ మాకు ప్రోత్సాహం కల్పిస్తూ వచ్చారు. ఆట ముగియగానే, అందులో కొందరు నా దగ్గరకు వచ్చి, నన్ను మెచ్చుకుని, నాతో కరచాలనము చేసి, "ఈ ఆట యెలా ఆడతారు? దాని నిబంధనలు ఏమిటి?" అని నన్ను గుచ్చిగుచ్చి అడిగి చెడుగుడి వివరాలు ఉప్పట్టే వివరాలు వాళ్ళకు తెలియజెప్పేవరకు నన్ను విడిచిపెట్టలేదు. "రేపు మమ్మల్ని కూడా ఆడనిస్తారా మీతోటి" అన్నారు కొంచెము భయపడుతూ.

"తప్పకుండా రండి రేపు ఆడుకుందాము. ఆట పాటలకు జాతి మత బేధాలు లేవుగదా" అన్నాను నేను చాలా గొప్పగా. వాళ్ళందరు చాలా సంతోషించి, యెవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు. మా దారిన మేము వచ్చాము. నేనేదో మన దేశము సంగతి చాలాగొప్పగా వాళ్ళకు నేర్పినట్లు అనుకుని గంభీరంగా నడుస్తుంటే, మా రాజు నన్ను వీపుతట్టి, చాలా అభినందించాడు.

# 14

మొన్నటి నుంచి ఈనెలరోజులూ ఎక్కడా ఊపిరి సలపలేదంటే మీరు నమ్మాలి. ఊళ్ళోషికార్లు కొట్టడం మిత్రులతో బాతాఖానీలు, వాదోపవాదాల తోటి అనుకుంటారేమో! అదేమీ కాదు బాబూ పరీక్ష. ఎంట్రన్సు పరీక్ష కారుమేఘంలా భయంకరముగా వచ్చి ఏ క్షణములో విరుచుకు పడుతుందో అనే భయముతో హడలిపోతూ నాగదికి, కుర్చీకి అంటుకుపోయి, తిన్నానో లేదో, ఏమి తిన్నానో తెలియకుండా నూతన వైధవ్యము పొందిన వితం

తువులా, వీధి మొగమైనా చూడకుండా, కళ్ళు పుస్తకాల మీద నుంచి తియ్యకుండా అలా యమగా చదివేశానన్నమాట.

మా లాండ్ లేడీ, ఆమె కూతుళ్లూ కూడా నా దీక్షా, పట్టుదలా చూచి నేనేమైపోతానో నని చాలా కంగారుపడ్డారు. లాండ్ లేడీ నాలు గైదు సార్లు నాదగ్గరకు వచ్చి, కొంత విశ్రాంతి తీసుకోవాలనీ, అంత దీక్ష కూడదనీ, దీని వల్లను ఆరోగ్యము దెబ్బతినగలదనీ, అప్పుడు పరీక్షకు అసలే వెళ్ళలేవేమోననీ ఎంతో అప్యాయతతో నన్ను హెచ్చరిక చేస్తూ వచ్చింది. కూతుళ్ళు కూడాను. అందులో ముఖ్యముగా రెండోది - మరీ అల్లరిపిల్ల - బెదురు బెదురుగా తలుపేనా తట్టకుండా, వేళాపాళా లేకుండా, నా గదిలోకి వస్తూండడము, నేను తనకేసి చూడకపోయినా అక్కడ కూర్చుని ఆ పుస్తకాలూ, ఈ పుస్తకాలూ తిరగేస్తూ ఏదో తనలో తను నవ్వుకున్నట్లు, పత్రికలో వార్తేదో చదివి భయపడ్డట్టు, చప్పుడయ్యేటట్టు పుస్తకమో, మరొకటో కిందపడేసి "Oh sorry Sam" మిమ్మల్ని మీ చదువు మధ్యను మీ దీక్షను భంగపరుస్తున్నట్టున్నాను. మన్నించండి అనేది. నాకు ఒళ్ళుమండి "నువ్వు కాస్సేపు అవతలకు వెళ్లు. మీ అమ్మ కేమికావాలో కనుక్కో. ఇక్కడ నాతో నీకేమి పని దయచెయ్యి" అనేవాడిని.

ఆ అమ్మాయి కోపగించుకోవడానికి బదులు కిలకిలా నవ్వుతూ చక్కాపోయేది. ఇలా నాలుగైదు సార్లు జరిగిన తరువాతను, పరీక్షలు నాలుగైదు రోజులున్నవనగా నేను మంచి దీక్షలో ఉన్నప్పుడు, ఈ అమ్మాయి వచ్చి కూర్చుని మామూలు అల్లరి ఆరంభించింది. చాలాసేపు సహించి వూరుకున్నాను. నాకు ఒక్క పంక్తి ముందుకు సాగడము లేదు. ఇలా ఓ ఆడ అమ్మాయి వచ్చి కూర్చుని అల్లరి చేస్తోంటే, ఎవ్వరికైతే మట్టుకు పుస్తకము మీద మనస్సు ఎలా నిలుస్తుంది చెప్పండి. మన మహర్షులకే కొందరికి ఇటువంటి సందర్భాలలో వాళ్ళ తపస్సు మీదనుంచే మనస్సు మరలిపోయింది కదా!

నాకు మట్టుకు మహా చెడ్డ కోపం వచ్చింది. సాగదీసి లెంపకాయ కొడదామనుకున్నాను. అంత కోపమూ, సరదా చంపుకుని, ఆ అమ్మాయిని రెక్క పట్టుకు లేవదీశాను. బయటకు నెట్టేద్దామనే ఉద్దేశ్యంతో. కొంచెం భయపడ్డది. కొంచెం వణికిపోతూ "Sorry Mr. Sam" నన్ను కొట్టకండి ఈ మాటుకు విడిచి పెట్టండి ఇక నెప్పుడూ ఇలా రాను లెండి. మీ ఆరోగ్యము చెడిపోతుందనీ, మీకు కొంత విరామము కలిగించాలనీ వచ్చాను గానీ, మరో దురుద్దేశమేమీ లేదు. నమ్మండి. వెళ్ళిపోతున్నాను

లెండి అని వెనక్కు మళ్ళింది. ఆఖరు మాటలో కంఠంలో కొంచెం గద్గదిక, కంట వెంట నీరు కూడా వచ్చింది - గాలి మేఘములాగ నాకోపము ఇట్టే ఎగిరిపోయింది.

వెళ్ళడానికి అడుగు ముందుకు వేసిన అమ్మాయిని రెండు బుజాలు పట్టుకుని, నాకేసి తిప్పుకుని "I am sorry Dear" అని ఒక్క ముద్దు పెట్టుకున్నాను. ఆ అమ్మాయి కన్నీరు చూస్తే నాకంత జాలి వేసింది. ఆ అమ్మాయి ఏమనుకుందో నాకు తెలియదు గాని, వెళ్ళిపోతుందనుకున్న అమ్మాయి అక్కడే నిలబడి, కన్నీరును తుడుచుకుంటూ, నా ముఖం కేసి చిరునవ్వుతో చూస్తూ నిలబడ్డది.



ఓహో, ఈ ట్రీట్‌మెంట్ ప్రమాదించేటట్లున్నది. అనుకుని జబ్బ పట్టుకుని, నెమ్మదిగా తలుపు దగ్గరకు తీసుకు వెళ్ళి గది గుమ్మము అవతలకు నడిపించి మళ్ళీ వెనక్కి ఎక్కడకు వస్తుందోనని, గభీమని తలుపువేసి, తాళము కూడా బిగించాను. పాపము దానిధర్మమా అని మళ్ళీ రాలేదు. భోజన పదార్థాలు తీసుకు రావడానికో, భోజనానంతరము పళ్ళాలు తీసుకురావడానికో వస్తుందని అనుకున్నాను గాని ఎందుచేతనో రాలేదు.

ఇక నా మాట మరచిపోయి, మళ్ళీ చదువు ధోరణిలో, ఎలాగైతే నేమి చదవలసినదంతా పూర్తి చేశాను. అఖరు రోజన నామిత్రుడు రాజును నాతోకూడా రమ్మనమని బ్రతిమలాడి పరీక్ష అయ్యేచోటుకి వెళ్ళాను. మూడు రోజులు పరీక్ష మొదట కొంచెము దడగా వున్నా, నిర్భయ

ముగా, నిస్పందేహముగా అన్ని పేపరులూ నాకు తెలిసినట్లు జాగ్రత్తగానే వ్రాశాను. పులి నోటినుంచి బయటు పడ్డట్టు మూడవ రోజు సాయంకాలము బయటపడి ఒక్క ఉడ్డాములో ఇంటికి వచ్చి, గదిలో ప్రవేశిస్తూనే "ధావ్పునమ్మగారూ, అర్జంటు టీ ఫలహారాలూ, ఓ పదిమందికి సరిపడ్డని తీసుకురావాల" న్నాను. ఆవిడ హడలిపోయి, ఏమిటి! అంది "మరేమీ లేదు నాకు విపరీతమైన ఆకలి వేస్తోంది. నెల రోజులనుంచీ నేను ఉపవాసము చేస్తూ, పచ్చి మంచినీళ్ళేనా తాగకుండా ఉన్న సంగతి మీకు తెలుసుగదా!" అన్నాను.

"తెలియకేమి నాయనా, తెలుసు - గమనిస్తూనే వున్నాను. అయినా నువ్వెంత ఉపవాసము చేసినదీ యింకొంచెము సేపటిలో ఇవ్వబోయే బిల్లు రుజువు చేస్తుంది." అందావిడ నవ్వుతూ.

పిల్లలిద్దరూ పంత - పాటకాదు - నవ్వు నవ్వారు. నేను గది లోకి వెళ్ళి ఒక అయిదు నిమిషాలు కూర్చుని స్నానాల గదిలోకి వెళ్ళి, ముఖప్రక్షాళ నాదికము ముగించుకుని రూములోకి వచ్చేటప్పటికి, అప్ప చెల్లెళ్ళిద్దరూ నా బల్లమీద ముగ్గురికి ఫలహారాలు ప్లేట్లలో పెట్టి అక్కడ నిలబడ్డారు. "అదేమిటి మూడు ప్లేట్లు ఏమిటి?"అన్నాను.

"మీరు పది మందికి తెమ్మన్నారుకదా? ముగ్గురికే సిద్దముగా వున్న దని, మా అమ్మ ఇవి ఇచ్చి రమ్మన్నది."

"సరే అయితే వెళ్ళండి" అన్నాను.

"వెళతాము లెండి. యివి మీరెలాగు తినలేరు గనుక, మీకు కొంచెము సహాయము చెయ్యమని మమ్మల్ని పంపించింది మా అమ్మ." అన్నారు.

"అయినా మహ చెడ్డ అల్లరి పిల్లలు లెండి. ఇహ నేను చిరుకోపము నటిస్తూ. "దయచేయండి అయితే"అన్నాను. ఫలహారాలయి ప్లేట్లు తీసుకుని వాళ్ళు వెళ్ళబోతుంటే," ఇంతవరవకూ మీ అమ్మ చెప్పినట్టు విన్నారు గనుక బుద్దిమంతుల్లాగ ఇక నేను చెప్పినట్టు విని, పది నిమిషాలలో మీరు డ్రస్సు వేసుకుని తయారయి నన్ను మీరుభయులూ చెరో రెక్క పట్టుకుని సినిమాకు తీసుకువెళ్ళాలి అన్నాను. "అయ్యబాబోయ్! మావల్ల కాదండీ" అంది చిన్నమ్మాయి.

"నీ వల్ల కాదన్న సంగతి నాకు తెలుసు. నీవల్ల ఏమవుతుందో కూడా తెలుసు. అందుకనే మన ఉభయులకూ క్షేమమని మీ అక్కయ్యను కూడా రమ్మంటున్నాను" అన్నాను.

"సరేలెండి ఒక్క అరగంటలో తయారవుతా" మని పెద్దమ్మాయి లోపలకు వెళ్ళింది. చిన్నది దాని వెంటనే బయలుదేరి తలుపు దగ్గిర ఆగి, ఒక్కక్షణం వెనక్కి తిరిగి "మాటవరసకు అరగంటని మా అక్కయ్య అన్నా గంటలో తప్పకుండా తయారవుతాములెండి" అని నాలుకచాపి నన్ను వెక్కిరించి, నేను లేవబోతుంటే, ఒక్క అంగలో ఎంటంట్లోకే వెళ్ళి పోయింది.

వారము రోజులు కూడా కాకుండానే మా పరీక్షాఫలితాలు తెలిసి, మా ప్రయివేటు మాష్టరుగారు యెంతో సంతోషంగా, ఆశ్చర్యముతో విప్పారిన మొహముతో నేను సెకండ్ క్లాసులో పాసయ్యానని నన్ను అభినందిస్తూ ఒక్కమాటు కౌగిలించుకున్నారు. నేను నా కృతజ్ఞత ఎంతో నమ్రతతో తెలియపరచుకుని, ఆయనకు అక్కడ కొంచెము టీ, ఫలహారాలూ, ఇప్పించి పంపించాను. ఆయన ఎంతో సంతోషించి వెళ్ళాడు. మళ్ళీ ఒకమాటు నాకు కనబడతావు కదా? అన్నాడు. తప్పకుండా అన్నాను. "ఇంతటితో మీపని అయిపోలేదు. నన్ను యూనివర్సిటీలో చేర్పించడమూ, అక్కడ కూడా నేను దారిన పడేవరకూ, కొన్నాళ్ళు మీరు సహాయము చెయ్యక తప్పదు" అన్నాను. ష్యూర్, ష్యూర్ అని నవ్వుకుంటూ ఆయన వెళ్ళి పోయారు.

# 15

ఎడింబరో రావటముతోటే, ఈ ఊళ్ళో ఇండియన్ అసోసియేషన్ అంటూ ఒకటి ఉన్నదని తెలుసుకుని, మొదటిరోజునే ఆ అసోసియేషన్‌కు ఒకసారి వెళ్ళాను. కాని, మళ్ళీ వెళ్ళలేదు. ఈ మధ్యనే రాజును ఒక మాటు తీసుకుని అక్కడకు వెళ్ళాను, రాజు నన్ను అందులో సభ్యుడుగా చేరమని సలహా యిచ్చాడు. సరే అన్నాను. ఆ అసోసియేషను ఓరకంగా పెద్దదిగానే కనపడ్డది. అందులో సుమారు మనదేశము నలుమూలలనుంచీ వచ్చిన వారు 100-150 మంది దాకా, మెంబర్లున్నారు. ప్రతిరోజూ యూనివర్శిటీకి వెళ్ళేప్పుడూ, సాయంకాలము తిరిగి వెళ్ళేప్పుడూ లేక మధ్య ఒకటి రెండు గంటలు క్లాసుకు మధ్య విరామము వచ్చినప్పుడూ ఇక్కడకు వచ్చి కూర్చోవడము, లైబ్రరీ పుస్తకాలు చదువుకోవడము, లేక పేపర్లు చదువుకోవడము చేస్తుంటారు విద్యార్థులందరూ. మన తెలుగు వాళ్ళే ప్రత్యేకమూ ముప్పైనలభై మంది దాకా ఉన్నారు. ఇంత మంది

అదివరకెప్పుడూ మెంబర్లుగా లేరట. ఇదేదో గాలిపాటు లాగా మన తెలుగు వాళ్ళందరికీ, ఒక్కసారి ఇక్కడకు వచ్చి చదువుకోవాలనే బుద్ధిపుట్టి చాలా మంది చక్కా రావడము సంభవించింది. ఇక్కడ కాలక్షేపానికి ఈ లైబ్రరీ ఒక్కటే గాని, మరొక ఆటలూ, పాటలూ ఏర్పాటు లేమీ లేవు. కాని, అప్పుడప్పుడు ఎవరేనా మన దేశస్థులనీ, ఆ దేశస్థులనీ, మహాకవులనూ, విద్వాంసులనూ, పిలిచి ఉపన్యాసాలు ఏర్పాటు చేయడము జరుగుతూ ఉంటుందట. ఒకసారి ఇలాగే మనదేశములో జిల్లాకలెక్టరు చేసి తరువాతను ఏదో రెవిన్యూబోర్డు మెంబరూ అదీ చేసి, ఉద్యోగ విరమణ చేసిన ఒకాయనను పిలిచి, ఉపన్యాసము ఇప్పించారు. ఎందుచేతనో ఆయన ఉపన్యాసము ఎవరికీ నచ్చలేదు. ఆయన ఇప్పటికీ ఇంకా తను కలెక్టరు హోదాలో ఉన్నాననీ, సామాన్య మానవులందరికంటే తను ఉన్నతుడననే భావం, ఉద్యోగ విరమణలో వదులుకోవలసింది వదులుకోలేక పోయినట్లు అనిపించింది. తన హోదా, తన ఔన్నత్యము అక్కడ ఉన్నంతసేపేగాని ఇక్కడ పని చెయ్యదని ఇక్కడ అందరూ సమానులేననీ, ఇక్కడ ఉన్నవాళ్ళలో కూడా ఏ కొద్ది మంది అయినా కొద్దిమాసాలలోనో రెండు మూడు సంవత్సరాలలోనో, అటువంటికాని అంతకంటే పెద్ద ఉద్యోగాలుగాని చేసే వాళ్ళుండవచ్చుననీ ఆయన గమనించలేకపోవడము విచారకరము. ఉపన్యాసము ముగించిన తరువాత తనిక్కడ జనాన్ని ఆకర్షించలేక పోయానని ఆయన గ్రహించినట్లుంది. ఉపన్యాసము అఖరున వందన సమర్పణ చాలా లాంఛన ప్రాయముగా జరిగింది. ఆయన వెళ్ళే టప్పుడు మా అసోసియేషన్ సభాపతీ, కార్యదర్శి మరొకరిద్దరు మట్టుకు ఆయనతో కరచాలనం చేసి టాక్సీ వరకూ సాగనంపారు.

ఇదిలాగ అయిందా మరో నెలరోజులుకు మన దేశమునుంచి శ్రీమతి సరోజినీ దేవి అనే మహాకవయిత్రి ఒకామె ఈఅసోసియేషన్‌కు వచ్చి ఉపన్యాసము ఇచ్చింది. ఆవిడ అంత గొప్ప కవయిత్రి అని చాలా పుస్తకాలు దేశభాషలో కాదుసుమండీ ఇంగ్లీషులో వ్రాసిందని, నేనెప్పుడూ విననైనా లేదు. ఆవిడ గంభీర గాత్రము, ఉపన్యాసధోరణీ ఈ రెంటినీ మించి ఆవిడ చేసిన కవితాగానమూ, మమ్ములనందరినీ ముగ్ధులనుచేసింది. సుమారు రెండు గంటలసేపు చీమ చిటుక్కుమన్నా వినపడేంత నిశ్శబ్దముతో, శిలా ప్రతిమల్లాగ కూర్చుని విని ఆనందించాము. మాలో ప్రతి ఒకరి దగ్గరకూ వచ్చి సభానంతరము సరోజనీ దేవి కరచాలనము చేసి మేము ఎక్కడ నుంచి వచ్చినదీ, ఏమి చదువుతున్నదీ వగైరా విశేషాలు అడుగుతూ, నవ్వుతూ, ఏవేవో ఛలోక్తులు విసురుతూ, మరో అరగంట

కాలక్షేపము చేసి బయలు దేరుతుంటే. అక్కడ ఉన్న యావన్మందీ కూడా వీధిలోకి వచ్చి, ఆవిడను కారులో ఎక్కించి, కరతాళ ధ్వనులతో జయజయ ధ్వానాలతో సాగనంపేము.

ఆ తరువాత నొకసారి W. B Yeats అనే సుప్రసిద్ధ ఐర్లండు కవి వచ్చి, ఆయన ఒక ముప్పావుగంట సేపు ఆధునిక కవితారీతులను గురించి ఉపన్యసించి, ఆయన రచనలు కూడా కొన్ని చదివి వినిపించారు. ఆయన చెప్పేది, ఆయన చెప్పినది, ఆయన పద్యాలలో విశిష్టత. ఎంత మందికి అర్థమైనదో తెలియదుగాని, ఆ ఉపన్యాసము కూడా ఎంతో శ్రద్ధగా విన్నాము. ఏవో చాలా గొప్ప విషయములు చెప్పాడు. ఈయన మహాకవి అనే భావము మా కందరకూ కలిగింది.

తరువాతను కొన్నాళ్ళకు మరొక చిత్రమైన సభ జరిగింది. డాక్టరు అనంత కుమారస్వామి అనే మహానుభావుడు మన దేశస్థుడే కేవలము కాకపోయినా, సింహళ ద్వీపవాసిట ఆయన సతీ సమేతముగా వచ్చి, భారతీయ చిత్రకళ. శిల్ప సౌందర్యాది కళా విశేషాలను గురించి వుప న్యసించారు. ఇందలో తమాషా ఏమిటంటే, మేజిక్ లాంటరన్ అంటూ ఒక చిన్న పెట్టెలాంటి యంత్రము తీసుకువచ్చి, ఆ హాలులోనే ఒక బుల్లి తెర యేర్పాటు చేయించుకుని, ఈ యంత్రములో ఒక్కొక్క గాజు ప్లేటు లాంటిది పెడితే ఆ తెరమీదను పిక్చరు హౌసులోకి మల్లే, అనేక చిత్రాలు శిల్పాలూ కనపడడము మొదలు పెట్టినాయి. ఇలా వాటిని చూపిస్తూ వాటిని గురించి విపులముగా వ్యాఖ్యానిస్తూ, సుమారు ఒక గంటసేపు ఆయన చేసిన ఉపన్యాసము ఈనాటికీ మరువలేకుండా వున్నాను. నాడే నాలో ఏదో ఒక సౌందర్యతృష్ణ ప్రవేశించినది అనుకుంటాను. నాటినుంచీ చిత్రకళను గురించి శిల్పాలను గురించి తెలుసుకోవాలనే పిపాసా, కుతూహ లమూ, పెరుగుతూ వచ్చాయి. ఆయన ఉపన్యాసము అయిన తరువాతను ఆయన సతీమణి - ఆమె ఆంగ్ల వనిత. కొంతసేపు హిందుస్తానీ నృత్య విధానాలు ప్రదర్శించి చూపించింది. అటువంటి సంగీతము వినడమూ, అటువంటి నృత్యము చూడడమూ, నాకదే మొదటిసారి. అందులో ఆంగ్లేయవనిత ఈ విద్యలో ఇంత ప్రావీణ్యము ఎలా సంపాదించగలిగిందా అని ఆశ్చర్యపోయాను. ఆ తరువాత, శ్రీ కుమారస్వామి గారి కోరికపైన మా కార్యదర్శి ఒక్కొక్క రాష్ట్రమునుంచి వచ్చిన ఒక్కొక్కరిని పిలిచి వారి భాషలో ఏవేనా చక్కని పద్యాలు ఒకటి రెండు చదవమని ఆదేశిం చారు. బెంగాలీ, హిందీ, మహారాష్ట్ర, మళయాళం, పంజాబు భాషలలో

చదివారు, ఆయా రాష్ట్రాలనుంచి వచ్చిన యువకులు. తెలుగునుంచి వచ్చినవారిని యెవరిని చదవమన్నా, ఏ కారణముచేతనో ఎవరూ ముందుకి రాలేదు. కార్యదర్శి మన తెలుగువాడే. ఎవరనుకుంటున్నారో - మహానుభావుడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు. అతను చటుక్కున లేచి, ఏమండి ఇంతమంది తెలుగువాళ్లు ఇక్కడ కూర్చుని, ఇతర రాష్ట్రాలనుంచి వచ్చిన వాళ్ళందరూ వారివారి కవితలు వినిపిస్తూంటే, మన తెలుగులో ఒక పద్యము, సుమతీ శతకములో నుంచైనా చదవ గలిగిన వారెవ్వరూ లేరా యిక్కడ? మన కెంత అవమానము? నేను చదవలేక కాదు. మీకీ అవకాశము ముందు యిద్దామనుకున్నాను. అని, వెంటనే కంఠమెత్తి హాలంతా ఖంగుమనేటట్టు ఒక సంస్కృతశ్లోకము, యెంతో చక్కగా, అర్థవంతముగా గానము చేశారు.

ఆ శ్లోకము పూర్తి కావడముతోటే మళ్ళీ ఒకసారి "ఏమయ్యా యెవరూ లేరా, ఇప్పటికీ చదివేవారు" అంటూ, పార్వతీశం నువ్వు కొత్తగా వచ్చినవాడివి. ఇంకా తెలుగు మరచి పోయి వుండవు. ఏమైనాసరే నువ్వు లేచి వాళ్ళందరకూ సిగ్గు వచ్చేటట్టు ఒక్క పద్యము చదివి మన గౌరవం కాపాడాలి. అన్నాడు సమ్మోహనంగా ఒక్క నవ్వునవ్వి. ఏ వుత్సాహమో, ఉద్రేకమో, ఆయన మాటల్లో నన్ను ప్రేరేపింపగా నేను లేచి నుంచున్నాను. కాళ్లు కొంచెము దడదడలాడిన మాట వాస్తవమే.



లేవగానే పద్యము అందుకోలేకపోయాను. గోపాలకృష్ణయ్య అది కనిపెట్టి నట్టు భేష్ కానీ యింక నీ యిష్టము. ఏ పద్యమైనా సరే అన్నాడు.

అప్పటికి నాకు వాక్కు విడివడి "అరవిందంబులకంటె కోమలములై అందంబులై యొప్పు నీ చరణంబుల్, కఠినంబులై మొరయు, మా చన్నుంగవల్ (మోవగా, నెఱియంబోలు నటంచు పొక్కెదము, ఈ కర్కశారణ్యచ భూపరి సంచారము కృష్ణ మీ ప్రియలకున్ ప్రాణవ్యథల్ చేయదే" అని చదివాను. యెందుకో ఈ పద్యము జ్ఞాపకము వచ్చింది. నాకు. సంగీతం రాకపోయినా, నిర్దుష్టముగా, సుబోధకముగా వుండేటట్టు పద్యము చదివేసరికి పద్యము పూర్తికాకుండానే భేష్, భేష్ అన్నాడు గోపాలకృష్ణయ్య ఆనందభరితుడై. ఆనంద కుమార స్వామిగారు మంద హాసం చేస్తూ, యెక్కడిదీ పద్యం ఏమిటి దాని భావము అని అడిగారు గోపాలకృష్ణయ్యను. అతడు సంతోషముతో "ఇది భాగవతములోనిదండి. శ్రీకృష్ణుడు అరణ్య సంచారము చేసి వచ్చినప్పుడు గోపికలన్న మాటలివి" అని ఇంగ్లీషులో ఆ పద్యభావమును తర్జుమా చేసి చెప్పేటప్పటికి, కుమార స్వామిగారు చాలా సంతోషించి, లేచి కృష్ణావతార తత్వాన్ని గురించి, ఒక అయిదు నిమిషాలు వ్యాఖ్యానము చేసి, ఇంకో పద్యము ఏదయినా వస్తే చదవమన్నారు, సభ యావన్మందీ నాకేసి చూశారు. నాకు వుత్సాహ ముతో, ఆనందముతో ఒడలు కంపించింది. నేను లేచి భయపడుతూ, ఆ ఘట్టములోదే "నీవడవిన్ పగల్ తిరుగ, నీకుటిలాలక లాలితాస్య మిచ్ఛావిధి జూపకున్న నిముషంబులు మాకు యుగంబులై జనున్ .." అనే పద్యము కూడా చదివాను. ఇది కూడా గోపాలకృష్ణయ్యను పరవశుణ్ణి చేసింది. అతను ఇంగ్లీషు తర్జుమా చెప్పగానే, ఆనంద కుమారస్వామిగారూ అంత కంటే పరవశుడై, ఎంత అద్భుతమైన పద్యాలు చదివాడండీ కుర్రాడు అని నన్ను ప్రశంసిస్తూ మరో రెండు నిమిషాలు ఆ భావాన్ని విపులీక రిస్తూ నాలుగు మాటలు చెప్పారు. తరువాత తమిళములో ఒకరూ, మళయాళంలో ఒకరూ చదివారు.

హాలు దద్దరిల్లేటట్టు కరతాళ ధ్వనులతో సభ ముగిసింది. అందరూ నన్ను ప్రశంసించడానికి నాచుట్టూ మూగారు. గోపాలకృష్ణయ్య వచ్చి రెక్క పట్టుకుని, కుమారస్వామి గారిదగ్గరకు తీసుకువెళ్ళి, ఆయనకూ, ఆయన సతీమణికి నన్ను పరిచయము చేశాడు. ఆనందకుమారస్వామిగారు నన్ను దగ్గరకు తీసుకుని, భుజం మీద చెయ్యివేసి, ఆశీర్వచనము చేశారు. నా ఆనందానికి అవధులు లేకపోయినాయి నేను అక్కడనే కూలి పోతా

నేమో అన్నంత నిస్త్రాణ వచ్చింది. ఎలాగో తేరుకుని అందరితోటి పాటూ నేనూ అతిధులను సాగనంపి, మళ్ళీ లోపలకు వచ్చి కూర్చున్నాను. మనవాళ్ళంతా నన్ను చుట్టుముట్టి "చిన్న వాడవయినా, మన మర్యాదకా పాడావు" అని నన్ను ప్రశంసించారు. చిన్నవాణ్ణి గనకనే అంత సాహసము చెయ్యగలిగానని నేను సమాధానము చెప్పాను. చాలా సేపు అక్కడ కులాసాగా కబుర్లు చెప్పుకుని, యెవళ్ళు యిళ్ళకు వాళ్లు బయలుదేరాము. రాజు సంతోషము పట్టలేకపోయాడు. ఇంతసేపు మౌనముగా కూర్చుని బయటకు రాగానే నన్నొక్కసారిగా గట్టిగా కౌగలించుకుని, "భలేపని చేశావు పార్వతీశం నాకెంత సంతోషముగా వుందో చెప్పలేను. ఇప్పుడు మనము బసకు వెళ్ళవద్దు, ఇక్కడ మంచి హోటల్లో భోజనం చేసి, మనము పిక్చరు హౌసుకు వెళ్ళాల్సిందే" అని లాక్కుపోయాడు.

నేను ఒకరోజున బయలుదేరి రాజింటికి వెళ్ళి అతనిని కూడా తీసు కుని మా ప్రైవేటు మాష్టరుగారింటికి వెళ్ళాను. ఆయన ఇంట్లో తీరికగానే కూర్చుని ఏదో పుస్తకము చదువుకొంటున్నారు. ఆయన ఒమ్మర్ల్ని చూసి యెంతో సంతోషించి, యెంతో అప్యాయతతో కూర్చోపెట్టి కొన్ని రకాల కేకులూ, బిస్కట్లూ, బ్రెడ్డు వగైరా ఫలహారాలూ, టీలూ అందించారు. యెంతో కులాసాగా కబుర్లు ప్రారంభించాడు. "మీ పనికేమీ మేము అడ్డు రాలేదు కదా?" అన్నాడు రాజు మర్యాదకు. "నాకు ప్రస్తుతము పని ఏమీ లేదు. పనిఉన్నా మీరు వచ్చారంటే యెంత పనైనా మానుకుని మీతో కాస్సేపు కాలక్షేపము చెయ్యాలనే ఉంటుంది నాకు" అంటూ ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెపుతూ "ఏమిటి ఇకముందు ఏమిచేస్తావు?" అన్నాడు నాతో.

"నేను మీ సలహా కోసమే వచ్చాను. యూనివర్సిటీలో చేరవలసిన సమయము వచ్చింది కదా! నేనేమి చేయాలో, ఏమిచదవాలో నాకేమీ తోచలేదు. మీరు సలహా యిచ్చి నన్ను సరియైన దారిలో పెడితేనేగాని వీలుపడదు. నే నిక్కడ ఉన్నన్నాళ్ళూ నాకీ గౌరవ గార్డియన్ గిరీ మీకు తప్పదు సుమండీ. మీరు వద్దనడానికి వీలుపడదు. వద్దన్నా నేను వదిలే వాణ్ణికాను" అన్నాను.

"పొరపాటు సేమ్, నువ్వు ఏకారణము చేతనన్నా వదిలించుకుందా మని చూచినా నేను మట్టుకు నిన్ను వదలనబ్బాయ్. మీయింటి దగ్గరనుంచి పారిపోయి వచ్చినంత సుళువుగా నా చేతుల్లోంచి తప్పించుకు పారిపోలేవు. అలాంటి ప్లాను లేమి వెయ్యకు!" అన్నాడు నవ్వుతూ - "సరే లెండ

అయితే ఏమి చేస్తాము? రోగి కోరిన పథ్యం వైద్యుడు చెప్పే పథ్యం రెండూ ఒకటైతే బాధలేదు" అన్నాను నవ్వుతూ.

"అయితే నీకు ఏం చదువుదామని ఉంది? ఎంత కాలము ఇక్కడుండడానికి అవకాశముంటుంది నీకు? అన్నాడు.

"నాకు యెంత కాలమైనా వుండాలనే వున్నది. మా వాళ్ళు యింటి దగ్గర నాకోసం చాలా బెంగ పెట్టుకున్నారు. మాతల్లి దండ్రులకు నేను ఒక్కడినే సంతానము. వెంటనే చదువుమాని వచ్చెయ్యమని వ్రాశారు గాని, నాకది యిష్టములేక యిక్కడ వుండి యేదో పరీక్ష పూర్తి చేసుకుని వెళ్లుదామనే నిశ్చయముతోటి ఉండిపోయాను. అందుచేత రెండు మూడు సంవత్సరములలో ముగించుకునే పద్ధతిని యేదేనా ఆలోచించి చెప్పాలి. నేనిక్కడకు వచ్చేటప్పుడు, నన్నిక్కడకు వెళ్ళమని చెప్పిన మిత్రుడు బారిష్టరు చదవమని సలహా యిచ్చి పంపించాడు. ఇంక మీ సలహా యేమిటో చెపితే సంతోషిస్తాను" అన్నాను.

"సరే బాగానే వుంది బారిష్టరు చదువుకు మధ్య మధ్యను లండన్ వెడుతూ వస్తూ వుండాలి. అందుకని ముందు ఇక్కడ ఎం.ఏ, లో చేరు" అన్నాడాయన అంటే నేను తెల్లబోయి "ఏం.ఏ.లో నాండి?" అన్నాను.

"అవును మరిలేకపోతే ఏమిటి అనుకుంటున్నావు! అంత కంగారు పడతావేమి? మీ దేశములో అయితే ఏమిచేస్తారు మరి ఎంట్రన్సు అయిన తరువతను" అన్నాడు.

"అబ్బో మా దేశంలో కావలసినంత మారణహోమము వుందండి దానికి" అనగానే వాట్ .. వాట్ .. వాటీజ్ దట్ ఓ మయ్‌గాడ్ అన్నాడు నవ్వుతూ.

"మరేం లేదండి అదేదో మా దేశంలో సామెత. మా దేశములో ఈ యెంట్రన్సుని స్కూల్ ఫైనల్ అంటారు. అది కాగానే ఇంటర్ మీడియట్ అని రెండేళ్లు చదవాలి. ఆతరువాత బి.ఏ., మరో రెండేళ్లు చదవాలి ఆ పైన ఓపిక వుంటే, ఇతర సాధన సంపత్తికూడా వుండే, ఎం.ఏ. మరో రెండేళ్లు, బి.ఏ. లోనూ ఎం.ఏ. లోనూ ఏ విషయంతో పూర్తి చెయ్యాలనుకుంటామో దానికి సంబంధించిన విషయాలు ప్రాథమికముగా ఇంటర్ మీడియట్‌లోనే ప్రారంభిస్తారు" అన్నాను.

"అబ్బా! చాలా గొడవ వుందే! ఆ బాధయేమీ ఇక్కడ లేదయ్యా ఎంట్రన్సు కావడముతోటే మధ్యమెట్టేమీ అక్కరలేకుండా ఎం.ఏ.లో చేర

డమే. నేను నీకు చెప్పిన చదువంతా మీ ఇంటర్ మీడియట్ కోర్సు అయి వుంటుంది. అందుచేతను, ఎం.ఏ.లో చేరు. నీకు సైన్సు చదవాలని ఉందో, ఆర్ట్సు చదవాలని వుందో తేల్చుకోవాలి. నువ్వు బారిష్టరు చదవాలని అనుకుంటున్నావు కనుక సైన్సు తలపెట్టవద్దు. ఆర్ట్సు సబ్జక్టు తీసుకోవాలి. ఇందులో అనేక భాషా శాస్త్రాలు కావలిస్తే చదవవచ్చు. హిస్టరీ, పొలిటిక్సు, యెకనమిక్సు, ఆర్టు, లిటరేచరు, ఫిలాసఫీ మొదలైన సబ్జక్ట్స్ సన్నిహితముగా వుండేవి. పన్నెండు విషయాలు యెన్నుకుని సంవత్సరానికి నాలుగు చొప్పున మూడేళ్ళలో పూర్తి చేసుకోవాలి. అప్పుడు ఎం. ఏ. డిగ్రీ యిస్తారు" అన్నారాయన.

అయితే మూడేళ్ళ తరవాతనే పరీక్షలన్నమాట అన్నాను. "అదీ నీ యిష్టం, నీ ఓపిక" అన్నారు.

"అంటే అన్ని సబ్జక్ట్సు క్షుణ్ణంగా చదువుకుని ఏ సంవత్సరము చదివిన విషయాలు ఆ సంవత్సరంలోనే పూర్తి అయిపోతాయి కదా! మళ్ళీ వాటి ప్రసక్తి వుండదు గనుక, ఏ సంవత్సరములో చదివినని ఆసంవత్సరం నాలుగు విషయాలలోనూ పరీక్షకు కూర్చోవడం ఒక సుళువైన పద్ధతి. లేదన్నావూ అన్ని జ్ఞాపకము పెట్టుకుని మూడవ సంవత్సరము అఖరున యీ పన్నెండింటికి కూర్చోవచ్చును. అది కొంచెము కష్టమైనా, ఎక్కువ బాగుంటుంది. దానిని ఎం. ఏ. (ఆనర్సు) అంటారు అందుచేత నీ శక్తి సామర్ధ్యాలు నిర్ణయించుకోవలసిన వాడవు నువ్వు. ఆపైన బారిష్టరు బెడద ఒకటి వుంటుందాయెను. నీకు, ఈ రెంటికీ తూగగలవా? లేకపోతే ఏయేటి కాయేడు పరీక్షకు కూర్చుంటావా? ఏదో నిర్ణయము చేసుకుని రేపో, యెల్లుండో యూనివర్శిటికి వెళ్ళు. అక్కడొక దరఖాస్తు ఫారము తీసుకుని అందులో ప్రశ్నలకు సమాధానములు వ్రాసి డబ్బు చెల్లించు ఇది మొట్టమొదట చెయ్యవలసిన పని నీ నిర్ణయము రేపో ఎప్పుడో చెప్పు" అన్నాడు ఆయన.

"సరేనండి. అలాగే చాలా సంతోషము. మిమ్మల్ని శ్రమపెట్టాను. చీటికి మాటికి ఇలాగే వచ్చి మిమ్మల్ని శ్రమపెడుతూ వుంటాను. అని హామీకూడా యిస్తున్నాను. సెలవు" అని మా బసకు మేము వచ్చేశాము.

# 16

ఈ మధ్యను మాయింట్లో - అనగా ఎడింబరో ఇంట్లో జరిగిన

సంగతి చాలా ఆశ్చర్యము అనిపించింది. మానవస్వభావము ఎక్కడ ఉన్నా కొన్ని కొన్ని సందర్భాలలో ఒకటిగానే ఉంటుంది. అందులో ముఖ్యముగా వంటవాళ్ళ గుణం మరీను.

మొదట వచ్చిన కొత్తలో ఇక్కడ మనుష్యుల శరీరం ఎంత తెల్లగా ఉంటుందో, వాళ్ళ చర్యలు కూడా అంత స్వచ్ఛముగానూ, నిష్కళంకముగానూ ఉంటాయనుకున్నాను, ఇది కేవలము నిజము కాదేమోనని, నా ఊహాజనితమేమోనని అనుమానం కొంచెము కలిగింది. నేనీ దేశంలో కాదు - ఎడింబరోలో అడుగు పెట్టినప్పటినుంచీ రాజు సలహా ననుసరించి నేను తెచ్చుకున్న తాటాకుల కట్ట ఉపయోగించడము మానేశాను. దానికి ప్రత్యామ్నాయముగా ఒక విశ్వకర్మ దగ్గరకు వెళ్ళి, గంటసేపు వాడికి బోధించి రెండు వెండి తటాకులు నాలిక గీసుకోవడానికి చేయించుకుని తెచ్చుకున్నాను. ఒకటి పెట్టెలో భద్రపరచుకుని రెండోది ఉపయోగిస్తూ, దంతధావనము అయిన తరువాత నేను పేస్టు, బ్రష్షుతోపాటు స్నానాల గదిలో విడిచి వస్తూ ఉండేవాడిని. కొన్నాళ్ళు అయిన తరువాతను, ఒక రోజున అది కనుపించలేదు. ఎంతోసేపో వెతుకుకున్నాను. దొరకలేదు. ఏమై ఉంటుందా అనుకుంటూ, ఆ పూటకు తాటాకుతోటి కాలక్షేపము చేసి ఆ తాటాకు లాండ్ లేడీ చూడకుండా శుభ్రముగా కడిగేసి, చిన్నచిన్న ముక్కల క్రింద కత్తిరించేసి, వీధిలోకి గిరవాటేశాను.

రెండురోజులు దాని సంగతి ఏమీ తేలలేదు. ఏమైందని నెమ్మదిగా మా లాండ్‌లేడీని అడిగాను. తనకేమీ తెలియదని, అదేమిటో ఎప్పుడూ చూడనేలేదనీ, మొదట బుకాయించింది. మళ్ళీ కొంతసేపు ఆవిడకు వర్ణించి చెప్పాను. అది వెండిదనీ, ఖరీదైనదనీని. "వెండా, సేమ్‌గారూ. నిజంగా వెండే - అయ్యో పాపము ఏమైపోతుంది! ఇక్కడ కెవ్వరూ రారే" అంది - ఆశ్చర్యాన్ని అభినయిస్తూ "ఇక్కడకెవ్వరూ రారని నాకూ తెలుసును. అందుకనే మిమ్మల్ని అడుగుతున్నానన్నాను." -"అబ్బెబ్బే నాకేమీ తెలియదండీ సేమ్‌గారూ, నేను అలాంటిదాన్ని కాదు. నాకేమి ఉపయోగమది! మా దేశంలో నాలిక గీసుకోవడము అలవాటు లేదు" అంది. "అవును, మీ దేశములో నాలికాగీసుకోరు, మొహమూకడుక్కోరు. మీ దేశములో మొహమే కాదు, ఏదీ కడుక్కోవడము అలవాటు లేదుకదా!" అన్నాను. అందులో వుండే అతరార్థము ఆ యిల్లాలుకు అర్థము కాలేదు.

సరే యీావిడే ఏదో చేతిదెబ్బ కొట్టేసిందని అనుమానము గట్టిగా తగిలింది నాకు.

"సరే ఏమిచేస్తాము! చూదాము" అనుకుని పెట్టెలో దాచుకున్న రెండవ వెండాకు పైకి తీశాను. మామూలుగా స్నానాల గదిలోనే పెడుతూ వచ్చాను. ఒకరోజున మామూలుగా నాకు భోజనము తీసుకు వచ్చిన పుడు యధాలాపంగా అన్నట్టు "ఏమండీ నువ్వడిగిన వస్తువు దొరికినట్లుందే అక్కడే ఉంది" అంది.

"వెండి బంగారాలు పోనేకూడదుగాని, పోతే దొరకడము ఎక్కడో, ఎన్నడోగాని ఉండదు. నేను మళ్ళీ కొత్తది చేయించుకున్నాను." అన్నాను. పదిపదిహేనురోజులు అయిన తర్వాతను ఇదికూడా మళ్ళీ మాయమయింది.

"ఈ నాలుగబద్ద మళ్ళీ మాయమయిందండీ" అని ఆవిడతో సవిన యముగా మనవి చేసుకున్నాను. ఆవిడ కొంచెము కోపము అభినయిస్తూ "ఇదేమిటండీ! ఇక్కడ ఏ వస్తువూ ఎప్పుడూ పోవిదే ఇదొక్కటీ మట్టుకు ఎలా పోతుంది? మీరే ఎక్కడో పారేసుకుని ఉంటా"రంది.

"ఇదేమీ దొడ్లోకి, వీధిలోకి తీసుకువెళ్ళి ఉపయోగించి, పారేసే వస్తువు కాదుకదా! ఇక్కడే పోయి ఉండా"లన్నాను. "అయితే నేను తీశానంటారా?" అంది కోపముగా. నేను కళ్ళతోటి చూడనిదే ఆమాట ఎలా అనను! పోవడము మట్టుకు ఇక్కడే పోయింది అన్నాను.

ఆవిడకు చాలా కోపం వచ్చినట్టుంది. విసవసా నాయెదుట నుంచి వెళ్ళిపోయింది. తరువాత క్రమేణా ఇంకొక అనుమానం తగిలింది నాకు వారం వారం నాకు కొన్న బియ్యం వగైరా భోజన పదార్థాలకు బిల్లు పెరుగుతుండడము గమనించాను. పోనీ, నేనేమయినా ఎక్కువ తింటు న్నానా? అని కూడా ఆలోచించుకున్నాను. ఎంత ఎక్కువ తిన్నా బిల్లు ఇంత పెరగవలసిన అవసరం లేదని అనిపించి, మా రాజు దగ్గర ఈ ప్రస్తా వన చేశాను.

"మనం కొంచెం జాగ్రత్తగా ఉండడం మంచిది. ఇటువంటి చిల్లర విషయాలలో కొంచెం హస్తలాఘవము ప్రదర్శించే స్వభావం ఈ లాండ్ లేడీల జాతికంతకీ ఉం"దన్నాడు. ఓహో, అనుకున్నాను. అతను చెప్పిన దాంట్లో అనృతమూ, అతిశయోక్తి లేదని, మరో విషయములో రుజువ యింది.

నాలుగైదుసార్లు రాజుపంపినవీ, అయిదారుసార్లు నేను కొనుక్కున్నవి కొన్ని మన దేశపు పిండివంటలు - మినప సున్ని లడ్డు లాంటివి ఇక్కడ దొరికే కేకులు చాక్‌లెట్లు లాంటివీ. నేను తెచ్చి సీసాలలో పెట్టుకునే

వాడిని, మనదేశపు పిండివంటలు ఒకటిరెండుసార్లు ఇంటివాళ్ళకు రుచి చూపించాను కూడాను. అవి రుచి మరిగారు కాబోలు. అలాటివి ఎప్పుడు తీసుకువచ్చినా వారం పదిరోజులు నేను ఉపయోగించుకునేవి, ఒకటి రెండు రోజులలోనే హారతి కర్పూరము లాగ హరించి పోయేవి. "ఇదేమిటి సీసా తరుగు" అని లాండ్ లేడీని అడిగాను కూడాను వుండబట్టలేక. ఆవిడ చాలా కోపం వచ్చినట్లు అభినయిస్తూ "మేము చేసే పనులూ, మా యింట్లో మీకు వసతి బాగా లేకపోతే, మీరింకొకచోటుకు వెళ్ళవచ్చును గాని, మాకిలాంటి చిల్లర దొంగతనాలు అంటగట్టడము న్యాయము కాదంది." కొంచెము కన్నీరు కూడా కళ్ళలోంచి పైకి లాగడానికి ప్రయత్నించి, విఫలురాలై జేబురుమాలు తోటి కళ్ళు, ముక్కు ఎఱ్ఱబడేటట్లు నలుపుకుని నా గదిలో నుంచి అవతలకు దాటింది.

నేను రాజుతో మళ్ళీ యీ సంగతులన్నీ చెప్పాను. "నువ్వేమీ అక్కడ నుంచి కదిలే ప్రయత్నం చెయ్యకు. ఎక్కడకు వెళ్ళినా యిటు వంటివి తప్పవు. ఇక్కడ మనకు యూనివర్సిటీ దగ్గరగా వుంటుంది. ఇల్లూ శుభ్రముగా వుంటుంది. తక్కిన అన్ని విషయాలలోనూ ఆవిడ మంచి మనిషే వున్నవాళ్ళలో. సరే కూతుళ్ళు మంచి చెడ్డలు యీ పాటికి నువ్వు గ్రహించే వుంటావు" అన్నాడు కొంటెగా. "ఓ గమ్మత్తుచేసి, ఆ ముండని ఏడిపిద్దాము ఆ దెబ్బతో ఇక జన్మలో ఎప్పుడూ ఇలాంటి పని చెయ్యదు" అన్నాడు. ఏమిటి అన్నాను. "నీతోటి ఇప్పుడు చెప్పనులే! నీకే తెలుస్తుంది" అన్నాడు.

రెండురోజుల తర్వాతను ఒక చక్కని పేకెట్ పైన నాపేరు, చిరునామా వ్రాసి, నా చేతికిచ్చి "నువ్వు పై తాడు విప్పేసి నీ గదిలో పెట్టుకో తరువాత ఏమి జరుగుతుందో చూదాము" అన్నాడు.

పేకెట్టు కొంచెం బరువుగానే వుంది. సరే ఇదేమిటో చూదామని అతను చెప్పినట్టు చేసి, సాయంత్రం అతనూ, నేనూ షికారు వెళ్ళినా మామూలు వేళకంటే కొంచెం ఆలస్యముగా రాజుతో సహా యింటికి వచ్చాము.

లోపల ప్రవేశించేటప్పటికీ యింటావిడ రోదనలూ, కూతుళ్ల ఓదార్పులూ వినబడి, మేమిద్దరమూ వంటయింట్లోకి వెళ్ళి ఏమిటేమిటని కంగారుగా అడిగాము. నన్ను చూచి ఆవిడ మరీ ఏడవడము మొదలు పెట్టింది. "ఏమిటమ్మా ఏమి జరిగింద"ని పిల్లల నడిగాను

"ఏమీ లేదండి మీ గది తుడుస్తూ, సవరిస్తూ అక్కడేదో పేకెట్టు కనపడితే, వుంచేదో, పారేసేదోనని మా అమ్మ విప్పి చూసింది. అందులో పా... పా... పాము కనపడ్డది. మా అమ్మకు దాన్ని చూచిన భయముతో మూర్ఛవచ్చింది." అని పెద్దమ్మాయి ఏడుస్తూ జరిగిన సంగతి చెప్పింది.



నేను నిర్ఘాంతపోయి రాజు మొహముకేసి చూశాను.
లఘుగా యెంతో సానుభూతితో మాట్లాడుతున్నట్లు, "అరెరే ఎంత పొరపాటు జరిగింది. అది జాగ్రత్తగా ఉంచు సుమీ, ఎవ్వరినీ ముట్టుకోనివ్వద్దు" అని మా పార్వతీశముతో చెప్పాను కూడాను. "ఇది ఈ దేశంలో దొరికే కొత్తరకము పాము. ఇది మా దేశంలో దొరకదు. అందుకని మా కాలేజీ మ్యూజియంకు పంపించవలెనని, యెంతో కష్టపడి సంపాదించి మా ఫ్రెండు చేతికిచ్చాను. అతను తెలివితక్కువగా మీకు అందుబాటులో ఉంచినట్టున్నాడు. ఇంతకూ అది చచ్చిన పామేగనక ఇంక చచ్చినా మనను కరవదు. ఈ పొరపాటుకు మేము చాలా విచారిస్తున్నాము. మీరేమీ అనుకోకండి. మీ అమ్మగారికి ఏమీ భయం లేదని ధైర్యం చెప్పండి." అని నా గదిలోకి చక్కా వచ్చి మేమిద్దరమూ యెంతోసేపు చచ్చేటట్టు

నవ్వుకున్నాము. "యింక నీ వస్తువుకేమీ భయం లేదోయి" అన్నాడు రాజు.

"భలేవాడవోయి, అద్భుతమైన చికిత్స చేశావు. మా ఇంటి ఆవిడకు ఈ జన్మలో ఈ తెగులు పుట్టదింక " అన్నాను.

ఆలస్యమౌతోందని రాజు వెళ్ళిపోయాడు. నేనేమీ యెరగనట్టు మళ్ళీ వంటగదిలోకి వెళ్ళి మంచం మీద పడుకున్న లాండ్ లేడీ దగ్గరకు వెళ్ళి పక్కన కూర్చుని, మీద చెయ్యి వేసి, చాలాసేపు సముదాయించి, మళ్ళీ వో సారి క్షమపణ చెప్పి వచ్చేటప్పుడు ఆమెను బుగ్గమీద ఒకసారి ముద్దు పెట్టుకుని మంచం మీదనుంచి దిగాను. దానితో ఆవిడ కెక్కడలేని సంతోషమూ వచ్చి, ఉన్న కోపమంతా పోయి, "నాయనా సేమ్, ఎంత భయపడ్డాననుకున్నావు. అమాంతం అక్కడే ప్రాణం పోతుందనుకున్నాను. నన్నది కరచినట్టు కూడా నాకు అనుమానం వేసింది. దానితో మరీ భయపడ్డాను" అంది. మళ్ళీ ఓసారి కళ్ళు ఒత్తుకుంటూ "మీకేమీ భయం లేదండీ. ఇంకెప్పుడూ ఇటువంటి తెలివి తక్కువ పని చెయ్యను లెండి. ఇది ఈ పూటే పంపించేస్తాను ఇక్కడనుంచి. మళ్ళీ ఎప్పుడైనా ఇలాంటి పనిచేస్తే మీ ఇంటిలోంచి వెళ్ళగొడుదురు గాని లెండి" అన్నాను.

"అబ్బెబ్బే ఎంతమాట. ఆమాట ఎప్పుడూ అనకు. ఏమైనా సరే! నిన్నిక్కడ నుంచి వెళ్ళనివ్వను. నీ చదువులు పూర్తి అయి పరీక్ష పాసయి డిగ్రీతీసుకునే వరకూ, మనం అంతా ఏకంగా ఉండవలసినదే" అంది నన్ను కౌగిలించుకుంటూ.

"సరే మీకు కోపం పోయింది గనుక ఈ భయము కూడా పూర్తిగా పోవడానికి ఇప్పుడు మిమ్మల్నో పిక్చరుకి తీసుకువెళ్ళాలి తప్పదు. త్వరగా తయారుకండి" అన్నాను.

"మమ్మల్ని విడిచి మా అమ్మ ఒక్కర్తి ఎప్పుడూ అలా వెళ్ళడం అలవాటు లేదు" అంది చిన్నపిల్ల.

"అవును నిజమే అయి ఉంటుంది. ఈ ఇంట్లో చంటిపిల్ల ఉంది, ఏ తల్లి విడిచి వెళుతుంది పాపం. ఆకలయితే నీకు పాలెవరు ఇస్తారు." అనగానే ఆ అమ్మాయి నా మీదకేదో విసరబోతే, గబుక్కున నేను గుమ్మం అవతలకు వెళ్ళి, మళ్ళీ ఒక అడుగు వెనక్కి వచ్చి, "తల్లి అంటే, పిల్లలతో సహా అని అర్థం" అని వ్యాఖ్యానం చేశాను. "మీ అభిప్రాయం ఏదయినా నాకేమీ తీరిక లేదిప్పుడు" అంది మూతి విరుచుకుని. "నీకు

తీరిక లేకపోతే మటుకు మిమ్మల్ని విడిచి మీ అమ్మ ఎలా వస్తుంది పాపం! అందుచేతను ఆవిడ కోసమైనా మీరు కాస్త శ్రమపడక తప్పదు." అని నేను చక్కాపోయాను.

ఇక నా జీవిత సౌధానికి శంకుస్థాపన చేసే రోజు వచ్చింది. వుద యాన్నే రాజూ, మా ప్రయివేటు మాష్టారూ కూడా వచ్చారు. వారికి కాస్త టీ ఇచ్చి, నేను బట్టలు వేసుకొని బయలుదేరాను వారితో.

యూనివర్సిటీ మాకు ఒకటు రెండు ఫర్లాంగుల లోపున ఉన్నది. అక్కడకు వెళ్ళి ఆ భవనాలు ఇదివరకు పైనుంచి చూచినా, మళ్ళీ యీనాడు చూచేటప్పటికి కొంత భయమూ, కొంత ఆశ్చర్యమూ కలిగి, కొద్దిగా దడవచ్చినట్లయింది. మా మిత్రులు నన్ను లోపలకు తీసుకువెళ్ళి క్లాసులు జరిగే గదులూ, ఉపన్యాసకుల గదులు, ఆఫీసు గదులు, లైబ్రరీ హాలు, సైన్సు లేబరేటరీలు ఒకటొకటే చూపించారు. ఇవి చూడ్డానికి గంటపైగా పట్టింది. మన వూళ్ళూ, మన స్కూళ్ళూ, అక్కడ పాకలు, అందులో క్లాసులు తలుచుకుంటే కంపరమెత్తినట్లయింది. అవెక్కడ, ఇవె క్కడ!

ఈ గదుల్లో ... గదులేమిటి ... హాలుల్లో ఆ గాలరీలలో కూర్చుంటేనే, చదువు దానంతటది వస్తుందా అనిపించింది. ఈ క్లాసు హాలు ప్రక్కనే ఆయా విషయం బోధించే ఉపన్యాసకుల గది, దానిలో ఈ విష యానికి సంబంధించినవీ, ఉపన్యాసకులకు ఉపయోగపడేవీ, కొన్ని వందల పుస్తకాలు బీరువాలలో అమర్చబడి ఉంటాయి. క్లాసుహాలులోకి ప్రవేశిం చబోయే ముందు మరొక సన్నని నడవుంటుంది. దీనిని "కారిడార్" అంటారు. అందులో ఒక నౌఖరుండి వచ్చిన వాళ్ళ పేర్లు అక్కడే హాజరు పట్టీలో గుర్తు పెట్టుకుంటాడు. దీనివల్ల క్లాసులో ప్రొఫెసరు పిలవడం, కాలయాపనా లేకుండా సులువైన పద్ధతన్నమాట. తరువాత విద్యార్థులు తొడుక్కువచ్చిన ఓవర్ కోట్లూ, హేట్లూ, గొడుగులూ వగైరా అన్నీ విడిచి అక్కడ పెట్టుకోడానికి తగ్గ యేర్పాటు వుంటుంది. ఒక్క కాగితం ముక్క కూడా యెక్కడకూ పోదు. చలికాలంలో చలి వేయకుండా అన్ని గదులూ వెచ్చగా ఉండగలందులక్కు యెవ్వరికీ అడ్డులేకుండా ఆవిరి గొట్టాలుంటాయి.

ఇలా తిరిగి తిరిగి అన్నీ చూచి, ఆఫీసులోకి వెళ్ళి, దరఖాస్తు ఫారం తీసుకొని, మా ప్రయివేటు మాష్టారు సహాయంతో, అందులో వ్రాయవలసినవి వ్రాసి, అది తీసుకొని రిజిష్ట్రారు గదిలోకి ఆయన చెప్పిన ప్రకారం యివ్వడానికి నేను ఒక్కడినే వెళ్ళాను. నేను వెళ్ళి ఒక గది ముందు నిలబడి మా ప్రయివేటు మాష్టారు చెప్పినట్లు తలుపుమీద

నెమ్మదిగా తట్టాను. "యస్" అని లోపలనుంచి వినపడ్డది. కాని, నాకు కాళ్ళలో వణుకువచ్చి వెంటనే లోపలికంటూ వెళ్ళలేక పోయాను. "కమిన్" అని ఈమాటు కొంచం గట్టిగా వినపడ్డది అపుడెలాగో ధైర్యం తెచ్చుకుని లోపలకు ప్రవేశించాను. గదిలో ఈ ప్రక్కనూ, ఆ ప్రక్కనూ గోడయెత్తున పుస్తకాల బీరువాలున్నాయి. కొన్ని సోఫాలు, కుర్చీలున్నాయి. నా కెదురుగా యెడం వైపున ఒక ముసలి ఆయన నెరిసిన గడ్డమూ, నెరిసిన తలతో కళ్ళజోడూ పెట్టుకొని టేబిల్ మీద నున్న కాగితాలూ యెవో చూస్తూ కూర్చున్నాడు. నేను వచ్చిన అరక్షణానికి తల యెత్తకుం డానే "కూర్చో"అన్నారు. నాకు ఆపాదమస్తకం చల్లబడిపోయి చలిజ్వరం వచ్చినంత వణుకు వచ్చింది. నేను కూర్చోకుండా అలాగే నిలబడ్డాను. మరొక క్షణానికి ఆయన తలయెత్తి నాకేసి చూశారు. "నేను" అనుకో లేదు ఆయన. అనగా కాలేజీకి సంబంధించిన ప్రొఫెసరో మరొక పెద్ద ఉద్యోగులో, యెవరో వచ్చి ఉంటారు అనుకుని వుంటాడు. నన్నొకలిప్త కాలం యెగాదిగా చూచి మందహాసం చేస్తూ "యేం నాయనా, నేసు నీకు చేయవలసిన సహాయం ఏమిటీ" అన్నారు. (Well my boy what can I do for you) నేను మాటాడలేక, యేం చేయాలో చెప్పాలో తొచక, ఈ దేశాచారం మరచిపోయి ఆయనకు వినపడీ వినపడకుండా "నమస్కారమ" న్నాను చేతులు జోడించి. ఆయన మళ్ళీ మందహాసంతో యెంతో ఆదరం కరుణా ముఖంలో వ్యక్తం చేస్తూ, కుర్చీలో తనకేమీ తొందర లేదన్నట్టు వెనక్కు జార్లబడి యేం నాయనా! యేమిటి సంగతి నీకేం భయంలేదు చెప్పు అన్నారు.

ఆయన మాటలూ, ఆయన కంఠంలో మార్దవం ముఖంలో మంద హాసం చూస్తే నా పైనేదో అమృతం చిలికినట్లయింది. "నేను ఇండియా నించి కొత్తగా వచ్చానండి. ఇక్కడ యెంట్రన్స్ పరీక్ష పాసయ్యాను కూడాను. యమ్.యే. క్లాసులో చేరుదామని వచ్చాను" అన్నాను యెలాగో ధైర్యం తెచ్చుకొని.

"అలాగా, చాలా సంతోషం యేదీ, నీ ఎంట్రన్స్ పాసయిన సర్టి ఫికెట్ చూపించమన్నారు". ఆయన నా మార్కులు అవీ గమనించి "వెరీగుడ్! బాగుంది, చాలా బాగుంది. చాలా సంతోషం. యిక్కడ చేరడానికి ఫారం ఒకటి రాసివ్వాలి" అన్నారు. "అదీ తెచ్చానండి" అని ఫారం కూడా చూపించాను. "బాగుంది రిజిస్ట్రార్ ఆఫీసు ఈ గది ప్రక్కనే వుంటుంది. అందులోకి వెళ్ళి అక్కడ నీ పని పూర్తి చేసుకో వచ్చు. నీకు తెలియక ఈ గదిలోకి వచ్చుంటావు" అన్నారు.

నేను అప్పటికి తెలివి తెచ్చుకుని "థేంక్యూ సర్. వెరీవెరీ సారీ సర్" అని మళ్ళీ నమస్కారం చేసి మళ్ళీ పొరపాటు చేశాను కదా అని వెనక్కి చక్కావచ్చి, పక్కగదిలోకి వెళ్ళి, నా పనిపూర్తి చేసుకున్నాను. ఆ క్షణం నేనూ ఒక ఎడింబరో యూనివర్సిటీ విద్యార్థిని అయ్యాను కదా అని ఒక తృప్తి, సంతోషం కలిగి, వికసిత వదనంతో బైటికి వచ్చి, మా ప్రయివేటు మాష్టరుగారిని, రాజునూ కలుసుకొని జరిగిన సంగతంతా వారికి మనవి చేశాను.

"అరి నీ యిల్లు బంగారంగాను. మళ్ళీ పప్పులో కాలు వేశావు" అన్నాడు రాజు. మొత్తం మీద "నీ బాపనగుణం పోనిచ్చుకున్నావు కాదు" అన్నాడు నవ్వుతూ రాజు. "మరేం ఫరవాలేదు నీవు మొదట వెళ్ళిన గది వైస్ చాన్సలర్‌ది. ఆ కనపడ్డ ముసలాయనే యీ విశ్వవిద్యాలయానికి అధిపతి. చాలా మంచివాడు, కరుణార్ద్ర హృదయుడు" అని మా ప్రయివేటు మాష్టరుగారన్నారు. "ఇప్పటికి పన్నెండు దాటింది. మనమింక లేచి దగ్గర హోటలుకి వెళ్ళి లంచి తీసుకుందాం" అన్నాడు రాజు. తథాస్తు అని బయల్దేరాం. మా మేష్టరుగారు మట్టుకు "ఎందుకు అనవసరం ఖర్చు ఎవళ్ళ రూంకి వాళ్ళు పోదా"మన్నారు. "అక్కడైనా ఖర్చు లేందే భోజనం ఊరికే రాదు కదా. ఈ వేళ సరదాగా ముగ్గురం కలిసే భోంచేద్దాం. పార్వతీశం యూనివర్సిటీలో చేరిన శుభ సమయంలో మనకి ఈ విందు ఏర్పాటు చేయడమైనది. ఖర్చులన్నీ పార్వతీశంగారే భరించగలరు, త్రీచియర్స్" అన్నాడు రాజు చప్పట్లు కొడుతూ. ముగ్గురమూ నవ్వుకుని కబుర్లు చెప్పుకుంటూ హోటలు వైపు సాగాము.

మరునాడు ఉదయాన్నే లేచి, నిత్యకృత్యములు పూర్తి చేసుకొని స్నానం, ఫలహారం చేసి ఒక్కమాటు మా అమ్మనూ, నాన్ననూ తల్చుకొని "గణానాంత్వా" అని గణపతి స్తవం చేసుకొని తిథీ నక్షత్రం వర్జ్యం చూసుకోడానికి పంచాగమైనా లేదు కదా అని, తొమ్మిదన్నర వరకు యూనివర్సిటీ మొదటి రోజు క్లాసులోకి వెళ్ళడానికి జ్ఞాపకం పెట్టుకొని విశ్వవిద్యాలయ ప్రాంగణంలో మరచిపోకుండా కుడికాలే పెట్టాను. టైం కావడంతోటే అందరూ వెడుతూంటే నేనూ నా క్లాసు వైపుకి నడిచాను. విద్యార్థులంతా నన్ను వింతగా చూడ్డం మొదలుపెట్టారు. నేనొక్కడినే భారతీయుణ్ణి కాబోలు అనుకుంటూ లోపలి కెళ్ళాను, అక్కడ అటెండరు నన్నొకసారి చూచి మందహాసం చేసి "గుడ్ మార్నింగ్ సర్, హౌ డూ యూ డూ సర్" అన్నాడు. వెంటనే నాకు టీ పార్టీ సంగతీ

అక్కడ వారూ యిలాగే ప్రశ్నించగానే చెప్పిన సమాధానం స్ఫురణకు వచ్చి నాలో నేను నవ్వుకుని "క్వైట్ వెల్ థేంక్యూ" అన్నాను. మీ పేరే మిటో దయచేసి చెబుతారా అన్నాడు. "తప్పకుండా" అని పేరు చెప్పాను. అప్పటికప్పుడే నా పేరు నమోదయ్యింది. అక్కడ గుర్తు పెట్టాడు. నా కోటూ హేటూ అక్కడ పెట్టమని చూపించాడు. మళ్ళీ థాంక్యూ అని నా తలనీ, వంటినీ ఉన్న బరువు కొంత అక్కడ వంకికి తగిలించి లోపలకు వెళ్ళాను. అప్పటికి క్లాసు విద్యార్థులు రావలసిన వారరంతా వచ్చినట్లున్నది. హోలు నిండుగా కనబడ్డది. నాలుగు వైపులా చూసే సరికి రెండు మూడు భారతీయ ముఖాలు కూడా కనబడ్డవి. అందులో ఒక భారత యువతి ముఖం కూడా ఉండడం చూసి ఆశ్చర్యపోయాను. పాతిక ముప్పైమంది ఆ దేశపు యువతులు కూడా ఉన్నారు. నేను ఎక్కడ కూర్చుందామా అని సందేహిస్తుంటే యెదురుగా ఉన్న ఒక విద్యార్థి తన పక్కన ఖాళీ చూపించి రమ్మని సంజ్ఞ చేశాడు. నేను వెళ్ళి "థేంక్యూ" అని కూర్చున్నాను. క్లాసంతా నిశ్శబ్దంగా ఉంది. ఒక మూడు, నాలుగు నిముషముల పాటు అక్కడ ఉన్న వాళ్ళందరం ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ కాలక్షేపం చేసుకున్నాం. ఇంతలో ప్రొఫెసర్ వచ్చే గది తలుపు తెలుస్తున్న చప్పుడై మేమంతా భయభక్తులు ముఖంలో ప్రదర్శిస్తూ ఆ గదివైపు చూడగానే ప్రొఫెసర్ గారు ఒక పుస్తకం చేతబట్టుకొని ప్లాట్‌ఫారం మీదకి వచ్చారు. నేను కంగారుపడి మన దేశాచారము చొప్పున లేచి నిలబడబోయాను. తక్కిన ఏ ఒక్కరూ కదలలేదు. నేను లేవబోవడం నా ప్రక్కనున్న విద్యార్థి గమనించి నా కోటు పట్టుకొని దిగలాగాడు. నేను దభీమని చతికిలబడ్డాను. కొంచెం శబ్దంతో క్లాసంతా నాకేసి చూసి యెక్కువ గట్టిగా కాక పోయినా నవ్వారు. మా ప్రొఫెసర్ కూడా యిది గమనించారు. ఆయన నాకేసి చూస్తూ "ఏం అబ్బాయి నీవు కొత్తగా వచ్చావా! ఇదే మొదటి సంవత్సరమా ఇదే మొదటి క్లాస్ కూడానా" అన్నారు. నేను మళ్లీ అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పేటప్పుడైన లేచి నిలబడక పోతే బాగుండదని చటుక్కున మళ్ళీ లేచాను. అందరూ మళ్ళీ నవ్వారు. "కూర్చో నాయనా మేము ఏదడిగినా నువ్వు లేచి నిలబడ నక్కరలేదు. కూర్చునే సమాధానం చెప్పడం కూర్చో" అన్నారు. మళ్ళీ "అయితే నువ్వు ఇండియాలో ఏ ప్రాంతం నుంచి వచ్చావు" అన్నారు. నేను మళ్ళీ లేవబోతుంటే ఆయన సంజ్ఞ చేశారు. "నేను మద్రాసు రాష్ట్రంలో గోదావరి జిల్లా నుంచి వచ్చా"నన్నాను. నువ్వేం చదివేవ న్నారు. నేనిక్కడ యెంట్రన్స్ పాసయ్యానన్నాను. "నీకు ఇంగ్లీషు బాగా

వచ్చిందా" అన్నారు. "ఇక్కడకు వచ్చిన తరువాత బాగా నేర్చుకున్నా"న న్నాను "ఎంట్రెన్స్ పరీక్షలో ఇంగ్లీషులో ఎన్ని మార్కులొచ్చా"యన్నారు. కొంచెం సిగ్గుపడుతున్నట్లు "ఎనభై ఐదు వచ్చాయండ"న్నాను. "ఏమిటీ ఎనభై ఐదా! బాగుంది చాలా బాగుంది. చాలా సంతోషం. అయితే నీకొచ్చిన ఆంగ్ల కవి వ్రాసిన పద్యం ఏదైనా చెప్పగలవా" అన్నారు. నాకు ఎనభైఐదు మార్కులు వచ్చాయంటేనూ ప్రొఫెసర్‌గారు యిన్ని ప్రశ్నలు శాంతంగా, సంతోషంగా అడగడంతోటే క్లాసందరి దృష్టి నా మీదే పడింది. అందరూ నిశ్శబ్దంగా నాకేసే చూస్తూ కూర్చున్నారు. నాకూ యెంతో ఉత్సాహంగా ఉంది. నేను మళ్ళీ మరచిపోయి లేచి నుంచుని చేతులు మడిచి చంకలో పెట్టుకొని టెన్నిసన్ పద్యభాగం ఒకటి చదివాను. నదురు బెదురులేకుండా స్వచ్ఛంగా ఉచ్చారణ దోషంకూడా లేకండా. ఈ మాటెవ్వరూ నన్ను కూర్చోమని అనలేదు. అందరూ నన్ను తదేకదృ ష్టితో చూస్తున్నారు. చదివిన పద్యానికి పదిపంక్తులు వ్యాఖ్యానం కూడా చెప్పాను. ప్రొఫెసర్ చాలా సంతోషించారు. విద్యార్థులంతా ఆశ్చర్యపో యారు.

"నిలబడే వున్నావు నాయనా కూర్చో. మీదేశంలో యిలా నిలబడి సమాధానం చెప్పడం అలవాటని నాకు తెలుసు. కాని యిక్కడ ఆ ఆచారం లేదన్న సంగతి నువ్వు జ్ఞాపకం పెట్టుకోవాలి. యికనెప్పుడూ నీవు లేవద్ద"న్నారు. ఇంతసేపూ ఆయనమట్టుకు నిలబడే ఉన్నారు. నేను సంతోషంతో మళ్ళీ మైమరచి చేతులు జోడించి "థేంక్యూ సర్" అని కూర్చున్నాను. ప్రొఫెసర్‌గారు వచ్చిన విద్యార్థులందరికి స్వాగతం చెప్పి, "ఈ మొదటి విద్యార్థి పద్ధతి చూస్తే మీరందరూ కూడా చాలా తెలివైనవాళ్ళూ బుద్ధిమంతుల్లాగా కనపడుతున్నారు. ఇంతమంది ఉత్సా హపూరితులైన యువకులు విద్యాభిలాషులు, నా క్లాసుకి రావడం నాకు చాలా సంతోషంగా వుంది. మీరు అందరూ సంవత్సరాంతం వరకూ, ఇలాగే భక్తి శ్రద్ధలతో విద్య పూర్తి చేసుకొని, పరీక్షల్లో కృతార్థులవుతారని ఆశిస్తున్నాను. ఈ రోజున వూరికే లాంఛనంగా నాలుగు మాటలు ఆంగ్ల సారస్వతాన్ని గురించి ఉపోద్ఘాతంగా చెప్పి మిమ్మల్ని పంపించేస్తాను. మొద టిరోజునే పెద్ద ఉపన్యాసం చేసి మిమ్మల్ని భయపెట్టడం నా అభిమతం కాదు." అని ఆంగ్ల సారస్వతాన్ని గురించి ఒక అరగంటసేపు చక్కని ఉపన్యాసం చేసి క్లాసు ముగించారు.

ఉపన్యాసం వింటుంటే, వీనులకు విందుగా ఉందిగాని పారమనిపిం

చలేదు. ఇక్కడ పాఠాలన్నీ ఈ ఉపన్యాస ధోరణిలో ఉంటే యెంత హాయిగా ఉంటుంది. వీరిచ్చే ఈ ఉపన్యాసాలే శ్రద్ధగా వింటూంటే పుస్తకాలేమీ యెక్కువగా శ్రమపడి చదవనక్కరలేదేమో శ్రమపడి చదివినా యే ప్రయివేటు మాష్టరు సహాయం అవసరం లేకుండానే కాలక్షేపం చేయవచ్చును. అని అనుకున్నాను. ప్రొఫెసర్‌గారు వారి గదివైపు మళ్ళారు. మేమంతా నిశ్శబ్దంగా గందరగోళం, గట్టిగా మాట్లాడుకోడం ఒకళ్ళు నొకళ్ళు తోసుకోవడం లాంటివి మనదేశపు బాల్యచేష్టలేమీ లేకుండా పైకివచ్చాం.

కారిడర్‌లో మా ఓవర్ కోట్లూ, హేట్లూ తీసుకుంటుంటే కొందరు అంగ్ల విద్యార్థులూ ఒకరిద్దరు భారతీయులూ, కూడా నా దగ్గరికి వచ్చి నా ధైర్యానికీ, నా భాషా జ్ఞానానికీ నన్నభినందించారు. ఒకతను భారతీయుడే "నువ్వు మనదేశంలో యేం పాసయ్యావు" అన్నాడు. "నేనేం పాసవ్వలేద" న్నాను, మరయితే ఇంత ఇంగ్లీషు యెలా వచ్చిందన్నాడు. "ఇక్కడ ప్రయివేటు మాష్టర్ని పెట్టుకుని చెప్పించుకున్నాను. చాలా బాగా చెప్పారు" అన్నాను. "ఓ! అలాగా! చాలా ఆశ్చర్యంగా ఉందే" అంటూ వెటకారంగా నవ్వుతూ చక్కాపోయాడు. ఈ విధంగా విశ్వవిద్యాలయంలో నా విద్యాభ్యాసం ప్రారంభమైంది.

# 17

ఆ రోజు మధ్యాహ్నం కూడా రెండు క్లాసులు జరిగాయి. నేను యే ప్రమాదం లేకుండా సాయంత్రం నాలుగు గంటలకు యింటికె వచ్చి టీ తీసుకొని రాజు బసకు వెళ్ళాను. కాస్సేపు ఆమాటా యీ మాట చెప్పుకుని ఉదయం క్లాసులో నే జరిపిన తమాషా కూడా వర్ణించి చెప్పాను. మరేం ఫరవాలేదులే బాగుందన్నాడు. "యింకేమీ దేనికీ నీవు కంగారు పడవద్దు. అంతా సవ్యంగా సాఫీగా జరిగిపోతుంది" అని ఉత్సాహపరిచాడు రాజు. అతను కూడా టీ పుచ్చుకున్న తర్వాతను మేమిద్దరం బయటికి వచ్చి కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ యిదివరకు మేం వెళ్ళిన బ్లాకవర్ట్ హిల్సు మీదికి వెళ్ళాం. అప్పటికక్కడికి చాలామంది వాహ్యాళికి వచ్చారు. మనదేశస్థులు కొంతమంది కూడా కనపడ్డారు. మేమంతా కలసి కాస్సేపు కబుర్లు చెప్పుకొని మళ్ళీ చెడుగుడు ఆట ప్రారంభించాం. ఆట ప్రారంభించేసరికి ఆ చుట్టుపట్టున్న యువతీ యువకులు చాలామంది మా ముందు చేరారు. మేం మంచి హుషారుగా ఆట సాగించాం. నేను మావూర్లో నాకున్న

అనుభవాన్ని బట్టి, నా ఆటనుబట్టి కిందటి మాటే నన్ను నాయకుణ్నిగా యెన్నుకున్నారు. మేం ఆట ఆడుతుంటే ప్రేక్షకులు ఉత్సాహమెక్కువై వాళ్ళలో ఈలలు, చప్పట్లు, హిప్ హిప్ హుర్రేలు మిన్నుముట్టాయి.

మా ఆట ముగించగానే ప్రేక్షకుల్లో నుంచి మా వయస్సు కుర్ర వాళ్ళు ఒక పదిమంది వచ్చి మమ్మల్ని కూడా చేర్చుకుని మాకి ఆట నేర్పుతేనే కాని వీలులేదని బలవంత పెట్టారు. సరేనండని కొంతమం దిని చేర్చుకొని ఈ ఆట పద్ధతేమిటో దీని నియమాలేమిటో అన్నీ పది నిమిషాలు వాళ్ళకు బోధించి బరిలోకి దిగాం. ముందు మా వాళ్ళు కూత ప్రారంభించారు. మమ్మల్ని పట్టుకోడం యెదుటి వాళ్ళకు తెలి యక కొంచెం తికమకపడ్డారు. తరువాత యెలాగైతేనేం ఒకడ్ని పట్టుకొని బయటకు పంపించగలిగారు. అప్పుడు యెదుటివాళ్ళు కూతకు రావలసి వచ్చింది. ఒక స్కాచ్చి కుర్రవాడు ముందుకి వచ్చాడు. వాడికి కూత యెలా ప్రారంభించాలో తెలియక ముందు మా వైపు కురికి ఆ ఓయస్ వెల్ వెల్ అంటూ మొదలెట్టాడు. అది పనికి రాదని మేం పేచీ పెట్టి వాడికి మళ్ళీ బోధ ప్రారంభించాను. వాడికి యెంతసేపు చెప్పినా హరి బల్ చెప్పించలేక పోయాను. యెంతసేపు చెప్పినా కొంతసేపు వెల్ అనీ, కొంతసేపు బెల్ అనీ చెప్పేవాడు. పోనీయేమన్నా తరువాతను మట్టుకు గుక్క తిప్పకోకుండా డూడూ అనమన్నాను. వాడు చచ్చినా ఆ అక్షరం మీద నాపి గుక్కపట్టలేక పోయాడు. పోనీ ఇది వద్దు ఇంగ్లీషులో నీ యిష్టం వచ్చిన అక్షరం పలుకుతూ గుక్క పట్టమన్నాను. పోనీ యే అక్షరం లేకుండా ఊరికే ఆగకుండా ఊ... అనమన్నా వాడికి చేతకాలేదు. ఇంక చాలు బాబూ. నీకు చెప్పడం మాకు కాదుగదా నిన్నూ నన్నూ సృష్టిం చిన బ్రహ్మతరం కూడా కాదు అన్నాను. దాని భావమేమిటో వాడికర్థం కాలేదు. అర్థమయ్యేటట్టు చెప్పడం కూడా నా ఉద్దేశ్యంకాదు.

అయినా వాళ్ళకు ఆట నేర్చుకోవాలనే కుతూహలం ఎక్కువైంది. మీరెలాగైనా చెప్పి తీరాలని పట్టుబట్టి నన్ను బలవంతం చేయడం మూలాన్ని నాకేదో చెప్పక తప్పింది కాదు. అందుకని బాబులూ, ఒకచిన్న పనిచేద్దాం. రెండు చిన్న మాటలు ఇంగ్లీషులోనే తొందరగా అంటూండడం నేర్చు కోండి. గుక్కపట్టక్కరలేదు. మధ్యను ఊపిరి తీసుకోవచ్చు, మాట వరసకు వెల్‌కమ్ అనో, కమిన్ అనో తొందరగా అనండి చూద్దాం అన్నాను. వాళ్లు నాలుగు మాటలూ కలిపి వెల్ కమ్ కమిన్ అని తొందరగా అన లేకపోయారు. ఈ పారం జరుగుతుండగా మన భారతీయులే ఉత్తర

దేశస్థులు కొంతమంది వచ్చి వాళ్ళూ ఇందులో చేరతామన్నారు. వాళ్ళకూ ఇదే పద్ధతి నేర్పడానికి ప్రయత్నిస్తే వాళ్ళూ తొందరగా అవలేకపోయారు. పోనీ వెల్ కమ్ ఒక్కటే అనండన్నాను. పదిసార్లనేటప్పటికి అది చెప్పడం కొంచం కష్టమయింది. వెల్ కమ్‌లో కొందరికి యల్ లోపించి కమ్ అనో వెక్ అనో మొదలెట్టారు. అందుకని ఇది కూడా వదులుకొని కమిన్ అనమన్నాను. అది కూడా కొందరికి తొందరగా అనడం యిబ్బందయింది. ఇది బాగుంది కాదని ప్లైం... ప్లైం... ప్లైం... అన మన్నాను. ఇదే కొంచెం ఋబ్బందినిపించింది వాళ్ళకు. ఆఖరుకు అందులో ఒక స్కాచ్ కుర్రవాడు తెగించి మీరేమీ అనుకోకండి మే ఊరికే టా... టాం... టాం.... అంటాం" అన్నాడు. బేషుగ్గా ఉందని అలాగే కానివ్వండన్నాను. తరువాత నా ఆట సవ్యంగా కొంతసేపు సాగింది. ఇలా కొన్నాళ్లు మాకు ప్రాక్టీసు యివ్వాలి అని వాళ్ళెంతో ప్రాధేయపడ్డారు. అలాగే లెమ్మని వాళ్ళకి సెలవిచ్చి, నేనూ రాజూ, గృహోన్ముఖుల మయ్యాం. వాళ్ళందరూ చాలా సంతోషించారు. ఈ దెబ్బతో నేనొక పెద్ద నాయకుణ్ణి అయినట్టుగా మా ఫ్రెండ్స్ అందరూ నన్ను వేళాకోళం పట్టించారు.

ఇలా ప్రతిరోజూ సాయంత్రం ఇదొక కాలక్షేపం ఏర్పడ్డది. రోజూ వెడుతూండడం చెడుగుడి ఆడుతుండడం మా కొత్త శిష్యులందరూ ఆట చాలా బాగుందని మెచ్చుకుంటూ ఎంతో ఉత్సాహంగా ఆడుతుండేవారు.

ఇలా కొన్నాళ్లు గడిచిన తర్వాతను అందులో ఒకతన్ని. నాకు కేవలం శిష్యుడినే సంచరిస్తున్న స్కాచ్ కుర్రాడిని పట్టుకుని "మా జాతీయపు ఆట మీకు నేర్పద్దా"అన్నాను. "తప్పకుండానండీ. రేపే ప్రారంభిద్దాం. రేపు ఉదయాన్నే ఆరుగంటలదాకా ఆడుకొని మళ్ళీ వెళ్ళిపోవచ్చును. మీకభ్యంతరం లేకపోతే కొంచెం శ్రమయినా దయచేయండి. లేదా, మీకు కొత్త కనుకను నేనే వచ్చి మిమ్మల్ని తీసుకువెడతాను. ఈ సారి మనం బ్రైడ్ హిల్సు మీదకు వెళ్ళి గాల్ఫ్ ఆట ప్రారంభిద్దాం" అన్నాడు. "చాలా సంతోషం తప్పకుండా ప్రారంభిద్దాం. మరి దానికేదో కర్రా, బుర్రా అన్నీ కొనాలి కదా" అన్నాను. అక్కర్లేదులెండి, రేపు నాదగ్గరనున్న వాటితో కాలక్షేపం చేద్దాం. మీ కందులో వుత్సాహం కలుగుతే మీరుకూడా కొన్ని గాల్ఫ్‌స్టిక్కు కొనుక్కుందురుగాని" అన్నాడు. సరేనన్నా మర్నాడు అతను మా యింటికి వచ్చి నన్ను తీసుకు వెళ్ళమని చెప్పి నా దారిన నేను చక్కాపోయాను.

... మర్నాడు ఉదయన్నే ఐదున్నరకల్లా జాక్ అనే ఆ కుర్రవాడు

నన్ను వచ్చి కేకేసేడు. మేమిద్దరం కలసి టీ, ఫలహారం తీసుకొని బయలు దేరాం. అతనొకపొడుగాటి సన్నని కాన్వాస్ సంచిలో ఐదారు రకాల హాకీ ఆడే కర్రలు పెట్టుకొని ఆ సంచీ భుజానికి తగిలించుకొని బయలు దేరాడు. మేం ఒక అరగంటలో బ్రైడ్‌హిల్స్ మీదికి చేరుకున్నాము. అక్కడ గాల్ఫ్ క్లబ్బని ఒక బంగళా ఉన్నది. అక్కడికి వెళ్ళి మా పేర్లు చెప్పి ఆటకు బయల్దేరాం. ఈ గుట్టలు సమప్రదేశం కాకపోయినా, మెట్టపల్లాలుగా వున్నా అంత ఎక్కువ ఇబ్బందనిపించలేదు.

అతను మా బస దగ్గర నుంచి బయలుదేరినది మొదలు ఇక్కడకు చేరే వరకు ఈ ఆట ఆడే పద్ధతులూ, దాని నియమాలూ, కట్టుబాట్లు ఎన్నో చెప్పాడు. ఆట ఒక సమప్రదేశంలో ప్రారంభమవుతుంది. అక్కడనుంచి బంతిని కొట్టుకుంటూ సుమారు ఒక మైలు నడవవలసి వుంటుంది. ఆ ప్రదేశమంతా పచ్చగడ్డితో చెట్టూచేమా లేకుండా, కంటికెంతో ఇంపుగా ఉన్నది. దారి పొడుగునా గడ్డి ఎదక్కుండా ఏ రోజూ కారోజు మన జుట్టు కత్తిరించినట్టు దగ్గరగా అంటకత్తెరేస్తుంటారు. నేలంతా వేసం గులలో తడుపుతుంటారు. ఆ పచ్చిక బయలుమీద ఊరికే నడుస్తుంటేనే స్ప్రింగ్ పరుపులమీద నడిచినట్టు ఎంతో ఆనందంగా ఉంటుంది. దానిమీద ఆటగాళ్ళు తప్ప అస్తమానం అందరూ నడవకూడదు.

ఆట ప్రారంభమయ్యేచోట చిన్న బంతి మన బాడ్మింటన్ బంతి అంత. అంతకన్నా కొంచెం చిన్నదే. కాని, క్రికెట్ బంతిలా చాలా గట్టిగా వుంటుంది. అది ఆ పచ్చికబైలు మీదను కొంచెం యిసుక పోసి, (అక్కడొక పెట్టిలో యెప్పుడూ మెత్తని యిసుక సిద్ధముగా ఉంటుంది.) బంతి ఆ యిసుకమీద పెట్టి చివరను కొంచెం వంపుగానూ, దిమ్మలాగానూ ఉన్న పొడుగాటి కర్రతో ఆ బంతిని కొట్టాలి. కొంతదూరం ఆ బంతిని కొట్టు కుంటూ వెడితే ఫర్లాంగుకి, అర ఫర్లాంగుకి ఒక చిన్న చతుర ప్రదేశం మధ్యను, ఓ రంధ్రముంటుంది. నేలలోకి. ఈ బంతిని ఆ రంధ్రంలో పడెయ్యాలి, యెన్ని తక్కువ దెబ్బల్లో ఆ రంధ్రములో పడవేయగలిగితే అంత గొప్ప ఆటగాడన్న మాట. ఆ కొండమీద యిటువంటివి పద్దెని మిది రంధ్రాలుంటాయి. తొమ్మిది రంధ్రాల వరకూ క్లబ్బుహౌసు నుంచి దూరంగా వెళ్ళాలి. అక్కడనుంచి మరో దారినుంచి తక్కిన తొమ్మిది రంధ్రాలు పూర్తి చేసుకొని క్లబ్బువైపు రావచ్చు. ఇదే ఈ ఆట.

మొదటి రోజున - మొదటి రోజునే అన్నమాటేమిటి నాలుగైదు రోజుల వరకూ అందులో సులువు బరువులు తెలియలేదు. ఈ ఆటలో

అందమేమిటా అనుకుంటూ వచ్చాను. కాని వారం రోజులయ్యేసరికి అందులో సుఖువు మెలకువులు తెలుసుకోగలిగాను. నాకెంతో వుత్సాహం బయలు దేరింది. యిది చాలా శాస్త్రీయమైనటువంటి ఆట. దెబ్బకొట్టే ముందు కఱ్ఱకియెంత ఊపివ్వాలో, యెంతగట్టి దెబ్బ తగలాలో, ఆ దెబ్బకు బంతి ఎంత దూరము వెడుతుందీ, ఇవన్నీ మనసులో ఊహించుకొని అంచనా వేసుకొని దెబ్బకొట్టాలి. ఆ దెబ్బ నేలకి తగలకూడదు. మొదట యెంత కష్టపడ్డా పదిపదిహేనురోజులు, నెల రోజులయ్యేసరికి, నేను ఒక మంచి ఆటగాణ్నయ్యాననీ సులువుగా ఇంత త్వరగా ఈ ఆటయెలా వచ్చిందా అని అందరూ చాలా ఆశ్చర్యపోవడం మొదలు పెట్టారు.

మా శిష్యుడు ప్రస్తుతం నాకు గురువు. అక్కడ యెరుగున్న వాళ్ళందరి తోటీ నా సంగతి చెబితే వాళ్ళు నమ్మలేక పదిహేనుగురు ఒక రోజున నా ఆట చూడ్డానికి వచ్చారు. చూసి ఆశ్చర్యపోయారు. తరువాత ఒక్కొక్కరే వచ్చి నాతో ఆడుతూ వచ్చారు. వాళ్ళందరూ కూడ నా ఆట చాల మెచ్చుకొని నన్ను క్లబ్బులో మెంబరుగా చేర మని బలవంతపెట్టి అక్కడ కమిటీ మెంబర్లనందరనూ తీసుకొచ్చి నా ఆట చూపించి వారిని బ్రహ్మాండంమీద ఒప్పించి నన్ను క్లబ్బు మెంబరుగా చేర్పించారు. ఇది చాలా గర్వకారణమయి మా మిత్రులందరూ నన్నభి నందించారు. క్లబ్బు మెంబర్లెవరో చాలామంది పెద్దాపిన్నా ఆటలోనూ, వయసులోనూ అందరూ నాతో ఆడి నాకు మరింత ప్రోత్సాహమిచ్చారు. ప్రోత్సాహమివ్వడమే కాకుండా ఎడింబరోకు సమీపంలో వున్న వూళ్ళలో గాల్ఫ్‌కు ప్రసిద్ధి చెందిన చోట్లన్నిటికీ నన్ను తీసుకువెళ్ళి నా ఆట వాళ్ళంద రికీ ప్రదర్శించే అవకాశం కల్పించారు. తరువాత నాలుగైదుసార్లు పోటీలో కూడా ఆడడానికి పాల్గొన్నాను, నేను విజయవంతంగా ఆడగల్గాను.

ఒక చోట నార్తుబెరిక్ అనే గ్రామం, సముద్రతీరాన నున్నది. అక్కడ చాలా ప్రసిద్ధమైన గాల్ఫ్ ఆడే ప్రదేశాలు రెండున్నాయి. ఒక దాంట్లో ఆటకు తిరగవలసిన ప్రదేశం చిన్నదేగాని ఆడడం మటుకు చాలా కష్టం. ఏమంటే ఇక్కడ మిట్టపల్లాలు చాలా ఎక్కువ. ప్రారంభించిన చోటు ఒక గుట్ట మీదుంటే, మొదటి రంధ్రం ఎదుటను ఇంకో గుట్ట మీదుంటుంది. దూరం అట్టే లేకపోయినా, బంతి ఈ మధ్య లోయలో పడితే దాన్ని మళ్ళీ పై గుట్టమీదకి ఎక్కించడం చాలా శ్రమవుతుంది. వెళ్ళిన రోజున మేం నలుగురం అక్కడ ఆడాం, వాళ్ళు ముగ్గురూ కొట్టారు. ఒకతను

కొట్టిన దెబ్బకు బంతి పల్లంలో పడిపోయింది. తరువాత నా వంతు. నేనెలాగో ఊహించుకొని దెబ్బకొట్టాను. నా బంతి యెక్కడపడిందో తెలియలేదు. నలుగురం బయలుదేరాం పల్లంలో పడిపోయిన బంతి పై కెక్కించడానికి అతనైదారు దెబ్బలు కొడితేగాని సాధ్యంకాలేదు. యెలా గైతే నేమి అవతల గుట్టమీదకు వెళ్ళాం. నా బంతి యెటుపోయిందో కనపడలేదు. తక్కిన ముగ్గురూ నెమ్మదిగా వాళ్ళ బంతులను రంధ్రం దగ్గరకు తీసుకురాగలిగారు తీరా చూస్తే నా బంతి అక్కడ ఆ రంధ్రంలో కనపడ్డది. నేను కొట్టిన మొదటి దెబ్బకే బంతివెళ్ళి సరిగా అందులో పడిందన్నమాట. ఇది అపూర్వం! అనన్య సామాన్యం, చరిత్రాత్మకం, ఆశ్చర్యకరం అని అందరూ నన్ను మెచ్చుకొని అభినందించారు. మధ్యాహ్నానికల్లా నేను అప్రయత్నంగా సాధించిన విజయం ఊరంతా వ్యాపించింది. ఆ మర్నాడు ఆ ఊరిలో ఆటగాళ్ళందరూ నన్ను అనేక విధాల అభినందించి వారి క్లబ్బులో గౌరవ సభ్యునిగా చేర్చుకొని ఆ ఊళ్లో ఉన్న గాల్ఫ్ కోర్సు మీదను ఆడమని ఆహ్వానించారు. చాలా సంతోషంతో, సిగ్గుతో, భయంతో అంగీకరించాను. ఇక్కడంతా సమప్రదేశం, యెత్తుపల్లాలేమీ అట్టే లేవు, సముద్రపుగాలి, చలిప్రదేశం, రంధ్రం దూరంగా వుండడం మూలాన ఆట కొంచెం కష్టం. అదీగాక కోర్సు మధ్యను ఒకచోట అడ్డుగా ఐదారడుగుల యెత్తు గోడొకటున్నది. ఒక దెబ్బలో ఆ గోడమీదనుంచి ఆ బంతి అవతల పడేటట్టు కొట్టగలిగితేనే తప్ప ఆట గెలవడం కష్టం. ఇక్కడకు దేశం నలుమూలలనుంచి ప్రసిద్ధులైన ఆటగాండ్రు వచ్చి ఆడివెడుతూ ఉండడం మామూలు. అందులో ప్రసిద్ధుడు లార్డు బాల్ఫర్ అనే ఆయన, తరుచు అక్కడి కొచ్చి ఆడుతుండేవాడట.

కాని నేను వెళ్ళేటప్పటికి సుమారు అరవై సంవత్సరాలనుంచి ఏడాదికి నాలుగైదు సార్లు ఆయనొచ్చి ఆడుతున్నా యెప్పుడూ ఒక్క దెబ్బలో బంతిని గోడ అవతలకి పంపించలేక పోయాడట. అందుకని ఆ గ్రామస్తులు ఆ గోడకు బాల్ఫర్స్ వాల్ అని ముద్దుపేరు పెట్టారు. నేనేదో నక్కను తొక్కొచ్చినట్లు ఆ రోజున మొదటి దెబ్బలోనే నా బంతి గోడ వతలకి వెళ్ళిపడ్డది. ఇకనే ముందు ఈ దెబ్బలోనే పేరెన్నికగన్న గాల్ఫర్ నయిపోయాను, యెన్నో ప్రదేశాలనుంచి నన్ను వచ్చి వాళ్ళ ఊళ్ళో ఆడమని ఆహ్వానాలొస్తూండేవి. అనేక పోటీల్లో పాల్గొని అనేక బహుమతులు సంపాదించగలిగాను, యీ రీతిగా కూడా నేను మన దేశానికి పేరు సంపాదించగలిగానని సగర్వంగా చెప్పకోగలుగుతున్నాను. ఏమంటే భారతీయుల్లో యీ ఆటలో విజయం సాధించినవారు అప్పటికెవరూ లేదనివిన్నాను. ఇది

నా క్రీడాభిరామం.

పగలు విద్యాలయానికి వెళ్ళడం, తీరిక సమయాల్లో లైబ్రరీ కెళ్ళడం సాయంత్రం వేళప్పుడు కొండ మీద షికారుకో, ఆటలకో వెళ్లడం లేకపోతే సినిమాలకు వెళ్ళడం మొదలైన కార్యక్రమాలతో యెక్కడా తీరిక లేన ట్టున్నా మనస్సుకి ఉత్సాహంగానూ ఆనందంగానూ వుండేది. ఇదివరకు మా ప్రయివేటు మాష్టరుని కూడా తరచు కలుసుకుంటూ ఆయనతో కొంత కాలక్షేపము చేస్తూ వుంటే యెన్నెన్ని విషయాలో ఆయనవల్ల నేర్చుకోడానికి అవకాశం కలుగుతుండేది. ఆయనతో ఒక రోజున గోష్ఠిలో నాటకాలూ, నాటక ప్రదర్శనలూ ప్రస్తావన కొచ్చాయి. ఆయన చెప్పిన విషయాలన్నీ వింటూంటే ఎంతో ఆశ్చర్యజనకంగా ఉంటూ వచ్చింది. ఒక రోజున మాటల సందర్భములో "ఇక్కడ నాటకాలు మువ్వెప్పుడన్నా చూశావా" అని అడిగారు. "లే"దన్నాను. "రేపిక్కడ షేక్స్‌పియర్ నాటకం లైసియమ్ థియేటరులో వేస్తారు. వెళ్ళి చూపిర"మ్మన్నాడు. "మీరు కూడా రాకూడదా" అన్నాను. "మీరు వక్కామంటే నాకేం వందే హాలొచ్చినా మిమ్మల్నడిగి తెలుసుకోవడానికి వీలుగా వుంటుంది." అన్నాను. "సరే అయితే" అన్నారు. మర్నాడు హామ్‌లెట్ చూడ్డానికి వెళ్ళాం. ఆనాటకశాల చూస్తేనే నిశ్చేష్టుడనయ్యాను. లోపల ప్రేక్షకులు కూర్చునే యేర్పాట్లు, రంగస్థలం ప్రక్కన వరండాలు, అదంతా చూస్తే నాటకం చూడకుండానే మరో ప్రపంచంలోకి వెళ్ళినట్టు అనుభూతి కలిగింది. నాటక ప్రారంభం నుంచి తుది వరకూ ఈ లోకంలో వున్నట్టేలేదు. నిజమైన తన్మయత్వం అంటే యేమిటో ఆనాడు అవగాహన అయింది. తెర పడినప్పుడూ, ఆ కొద్ది క్షణాల్లో మా మేష్టరుగారు చెప్పిన వ్యాఖ్యాన వచనాలు కూడా తలకు ఎక్కేవిగావు. విరామ సమయంలో బయటకు వచ్చి మేముభయులమూ టీ పుచ్చుకుంటున్నా అప్పుడు కూడా నిద్దర్లో తిరుగుతున్నట్టుంది కాని కేవలము జాగ్రదవస్థలో వున్నట్టులేదు! సుమారు మూడు గంటలసేపు కొన్ని వందల సంవత్సరాల వెనక డెన్మార్కులో వున్నాను అన్న భావన పూర్తిగా నన్నావహించింది. నాటకం అయిపోయిన తరువాత. కొంతసేపటి వరకూ నాటి నుంచి నేటికి రాలేకపోయాను.

మా మేష్టరుగారు నా తన్మయ స్థితిని చూచి ఆశ్చర్యపోయారు. మొదట కొంతసేపటి వరకూ నటకుల ఉచ్చారణ నేను సరిగా గ్రహించలేకపోయాను. త్వరలోనే అది తెలుసుకోగలిగాను. నాటి రంగాలంకరణా నటీనటుల ఆహార్యం వారి అలంకరణా, వేషధారణా అపూర్వ

నటునాకౌశలం చెప్పుకోవడానికి నాకు మాటలు చాలడంలేదు. నావలె నాటకాన్ని చూసి ఇటువంటి తన్మయత్వం పొందినవారిని ఇంతకుముందె న్నడూ చూడలేదన్నారు మామేష్టరుగారు. "నాకెంతో చాలా వింతగా ఉన్నదండీ. ఈ ప్రదర్శన అపూర్వమైన. అనూహ్యమైన అనుభూతి కలిగిం చిందండీ. మనమూ నాటకాలు మా దేశంలో కొన్ని చూచినా ఇటువంటి అనుభూతి యెన్నడూ కలుగలేదు. కలుగడానికి తగ్గావకాశం కూడా లేదు లెండి. ఏమంటే మాకు రంగస్థలాలంటూ పెద్దవిలేవ్వూ. అదొక పరిశ్రమ కిందా, వ్యాపారంకిందా, కళకిందా తయారు చేయగలిగిన స్థితిలో మేము లేము కాబోలు అనుకోవలసి వస్తోంది. ఈ నాటకం చూచిన తరువాత ఇక్కడ ఈ నాటక పద్ధతులు గురించి తెలుసుకోవాలనుంది. సినిమాలు మాటయేలా వున్నా "ఈ నాటకాలు మరికొన్ని చూడాలి." అన్నాను. "తప్పకుండా చూడవలసినదే. వారానికోసారి కొత్తనాటకం తప్పకుండా వస్తుంది. నీకింత ఉత్సాహము వున్నందుకు నీవు వెళ్ళి చూస్తూండడం మంచిది. ఇంకొక్క చిన్న సలహా ఏమిటంటే నా పద్ధతినిబట్టి చెబుతు న్నాను సుమా! నాటకం చూచి నిజమైన ఆనందం పొందవలెనంటే నీ వొక్కడివే వెళ్ళడం మంచిది. నేను సాధారణంగా ఎప్పుడూ ఇంకొకరితోటి వెళ్ళను. నేనొక్కణ్ణే కూచుని చూస్తుంటే కలిగే ఆనందంవేరు. మరొ కళ్ళు పక్కనకూర్చుని ఏవో కబుర్లు చెబుతూంటే న ఆనందానికి భంగం కలుగుతుంది. నాటకం మీద మన దృష్టి నిలువదు. అందుచేత నీవు కూడా ఒక్కడవే చూడడం అలవాటు చేసుకోవడం మంచిదనుకుంటాను" అని అన్నారు "మీరు చెప్పినది నిజమేను. నాకూ అదే వుద్దేశ్యం కలి గింది." అన్నాను. సెలవు తీసుకుని నా దారిన నేనువచ్చాను. నేను ఇంటికి వచ్చినా, భోజనం చేస్తున్నా నా మనస్సంతా ఆ నాటకానుభవం తోటే నిండి వుంది. ఆ ఇంటి ఆవిడ "ఏమిటండీ యింత పరధ్యానంగా వున్నారు" అని రెండుమూడుసార్లు హెచ్చరించిన తరువాత నేను నాట కానికి వెళ్ళడం అక్కడ పొందిన అనుభూతి ఆవిడతో చెప్పాను. ఆవిడ చాలా సంతోషించింది.

ఇలా తరుచు నాటకాలు చూడడం అలవాటయిపోయింది. దానివల్ల వాళ్ళ సంభాషణా, ఉచ్చారణా నాకు బాగా పట్టుబడ్డాయి. వాళ్ళ వేషధారణా నటనాపద్ధతులూ నన్ను ముగ్ధుణ్ని చేశాయి. మా మేష్టరుగారు చెప్పినట్టు నేనెప్పుడూ వెళ్ళినా ఒక్కడినే వెడుతూండేవాడిని.

సాంఘిక నాటకాలూ, అందులో హాస్యరస ప్రధానమైన నాటకాలు

నన్నెక్కువగా ఆకర్షించేవి. నేనెక్కువగా ఆనందించగలిగే వాడిని. మన వాళ్ళేవళ్ళూ ఏ ఒకరిద్దరోతప్ప, నాటకాలకి రావడం నే చూళ్ళేదు. వాళ్ళకు ఆ భాష అర్ధమయ్యేది కాదట. ప్రహసనాల్లో ఆ హాస్యము వాళ్ళకు తెలిసేది కాదట. నేను మట్టుకు చాలా ఆనందించేవాడిని, ఒక రోజున ఏదో ఒక కామెడీ చూడ్డానికి వెళ్ళాను. ఒంటరిగా రాగానే నా పక్కన ఒక అమ్మాయి కూర్చున్నది. ఆమె కూడా ఒంటరిగానే వచ్చినట్లుంది. రెండవ వైపున ఒక భార్యా భర్తలు, కొంచెం పెద్దవాళ్ళు కూర్చున్నారు. నాపక్కనున్న అమ్మాయికి అవతల ఒక యువదంపతులు కూర్చున్నారు. ప్రహసనం బ్రహ్మాండంగా ఉంది. ఒక రంగాన్ని మించి, మరొక రంగం అందులో సంభాషణా చాతుర్యం, ఆ సంభాషణలు నటీనటులు చెప్పే రీతుల్లో స్ఫురించే విపరీతార్ధం, ప్రేక్షకులను చాలా ఆనంద తరంగములలో ఓలలాడిస్తున్నది. నాటకం రెండవ అంకములో నుంచి నా పక్కనున్న అమ్మాయి నాతో సంభాషించవలెనని నాకింకా చేరువకు రావలెననీ చేస్తున్న ప్రయత్నము కొంతసేపటికి గమనించాను. కాని నేనేమీ తెలియనట్టే చూడనట్టే ఊరుకున్నాను. ఆ తరువాత నాటకంలో ఏదో ఒక గొప్ప జోక్ వినపడ్డది. ప్రేక్షకులు కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వుతున్నారు. నట కుల సంభాషణ మాకేమీ వినపడ్డానికి వీలులేనంత కోలాహలంగా ఉన్నది. ఆ ఘట్టంలో కడుపు పట్టుకొని నవ్వుతూ! నవ్వుతూ నా పక్కనున్న "ఓ బాయ్" అని అతి సహజంగా తనవారినెవరినో కౌగలించుకున్నట్లు ఆ నవ్వుల్లో నన్ను కౌగలించుకొని "ఓ సారీ మన్నించండి" అంది. "మన్నిం చడానికేముంది. చాలా బాగుంద"న్నాను నేను నవ్వుతూ. "ఏమిటి" అంది నాకేసి చూస్తూ. అబ్బేనాటకం చాలా బాగుంది అన్నాను. "బేడ్ బాయ్" అంది నా భుజం ఒక్కసారి నొక్కి. తరువాత అవకాశం వచ్చిన ప్పుడల్లా ఇక్కడ ఈ సీనుమట్టుకు పదేపదే పునరావృత్తమవుతుండేది. నేను ఏమీ అనలేక ఏమన్నా అంటే మోటుగానూ, అనాగరికంగానూ ఉంటుం దేమోనని సందేహించి ఊరుకున్నాను. నాటకం అయిపోయిం తర్వాతను బయట వసారాలోకి రాగానే ఆ అమ్మాయి నాకోసం అక్కడే నిలబడి నా పక్కన నడుస్తూ నాతో మాట్లాడడం ప్రారంభించింది. "ఏమండీ నాటకం బాగుందా మీరు బాగా ఆనందించారా", అన్నది. నాటకం చాలా బాగున్నది. చాలా ఆనందించాను. అందులో మీరు పక్కనుండడం వల్ల మరీ ఆనందించడానికి వీలు కలిగిందన్నాను. "ఊహూ అలాగా, మాటలు చాలా నేర్చారే. మీరెంత కాలమైందిక్కడకొచ్చి" అంది. "నేనిక్కడ కొచ్చి సుమారు సంవత్సరం కావస్తున్నది. మరిక్కడ కొచ్చిన తరువాతను

మాటలు నేర్చుకోక తప్పుతుందా" అన్నాను. తప్పించుకోవాలంటే తప్పక ఏం చేస్తుంది, అన్నది. మీ రొక్కరూ వచ్చారేం నాటకానికి, మీకు స్నేహితులెవరూ లేరా అనగా యువతీ మణులెవరూ లేరా, ఏడాది నుంచి ఏ ఒక్కరూ పరిచయంకాలేదా" అన్నది. "ఎవరితోటి పరిచయం కాలేదు. నేనుగా ప్రయత్నించి పరిచయం చేసుకొనేటంత చొరవ లేకుండా ఉంది. నాకీ జీవితం కొత్తగనుక ఇక్కడి పద్ధతులు అలవాటు లేక మీ బోంట్లతో మాట్లాడ్డం కొంచెం సిగ్గుగానూ, భయంగాను ఉంటుంది" అన్నాను. సరే అయితే మీ భయం కొంత పోగొడతాలెండి నేను. ఈ పరిచయానికి లాంఛన ప్రాయంగా మనమిక్కడ టీ, ఫలహారం సేవిద్దాం, రండని నేను సమాధానం చెప్పకుండానే హోటల్‌కు దారితీసింది.

నాటకాల్లోంచి, సిమాల్లోంచి విడుదలై వచ్చే జనంతోటి హోటలు క్రిక్కిరిసి వుంది. యెక్కడైనా కూర్చోడానికి ఒక్కడికి కూడా చోటులే దేమో ననిపించింది. చాలామంది అక్కడున్న స్త్రీ పురుషాదులు ఇటు వంటి దృశ్యానికి అలవాటుపడిన వాళ్ళయినా మాకేసి వింతగా చూడడం మొదలెట్టారు. నాకు కొంచెం బెదురుగానూ, సిగ్గుగానూ వున్నది. నేను కొత్తవాడినని ఈ అమ్మాయే సాహసించి నన్ను వెంట వేసుకొచ్చిందని అనుకున్నారని నా అనుమానం. యిక్కడ చాలా యిరుగ్గా వున్నట్టుంది. పోనీ "ఇంకో చోటికెక్కడికైనా వెడదామా" అన్నాను ఆ అమ్మాయితో. యింకో రెండు గంటలదాకా యెక్కడికి వెళ్ళినా యిలాగే వుంటుంది. చూద్దాంలెండి. మనకిక్కడ చోటు దొరక్కపోదు. అప్పటికే పదకొండున్న రయింది. తెల్లవారుజామున రెండు మూడు గంటలవరకూ యిలా జనం వచ్చి యేదో మెక్కుతూ, తాగుతూ తెల్లవారుజామున మూడు గంటల దాకా కాలక్షేపం చేస్తారు కాబోలు. అప్పటివరకూ ఈతిండేమిటి! ఈ తిరగడమేమిటి! వీళ్లు నిద్రెప్పుడు పోతారు! ఉదయాన్నే పనిలోకి యెప్పుడు వెడతారు. వీళ్ళ వ్యవహారమంతా తలక్రిందులుగా కనపడుతోంది. వీళ్ళేదో పెద్ద నాగరికులనుకుని వస్తే ఇలా వున్నారేమిటి. ఇదేమి నాగరికత అను కున్నాను. యింతలోకే ఒక ఖాళీ స్థలం కనిపెట్టింది నా స్నేహితురాలు. నాచేయి పట్టుకొని గబుక్కున అక్కడికి లాక్కెళ్ళింది. అక్కడ లఘువు గానే ఫలహారం చేశాం. ఫలహారం చేస్తున్నంత సేపూ నోరూరుకోకుండా ఆ అమ్మాయి గొణగొణ యేదో మాట్లాడుతూనే వుంది.

నన్ను లక్ష ప్రశ్నలు వేసింది. నే నా దేశం యెందుకు వచ్చా ననీ, యెన్నాళ్ళుంటాననీ యెక్కడుంటాననీ నాకు సాయంకాలం కాలక్షేపం

యెలా అవుతుందని నేను వచ్చి సుమారు సంవత్సరమైనా యింకా అక్కడ పిల్లలతో పరిచయం చేసుకోకుండా యెలా వున్నాననీ, యిలా యెన్నో వన్ను ప్రశ్నలడుగుతూ యేదో తింటూనే వుంది.




నా సమాధానాలు వింటూ నేవుంది. నా సమాధానాలు వింటూన్నప్పుడూ తింటూనే వుంది. ఈ రెండు పనులూ తినడం మాట్లాడడం, ఏకకాలంలో చేయడం నాకు కొంచెం యిబ్బందనిపించింది. ఆమె అడిగిన ప్రశ్నలన్నిటికీ యెంతో ఓప్పిగ్గా కులాసాగా సమాధానాలు చెప్పాను. అంతసేపూ ఆ అమ్మాయి మధ్యమధ్యను నవ్వుతూ చాలా బాగా మాట్లాడింది.

"యిక్కడేదో చాలా కాలంనుంచి స్థిరపడిపోయిన వారిలా వున్నారు కాని, కొత్తవారిలా కనపడ్డంలేదే. అసాధ్యులులా వున్నారు. మీ దగ్గరెలాగైనా కొంచెం జాగ్రత్తగానే వుండాలనిపిస్తోంది." అంటూనే నెమ్మదిగా నాతో నడుస్తూ ట్రామ్‌దాకా వచ్చి అక్కడ కూడా నిలబడి "ఈ వేళ మిమ్మల్ని కలుసుకోవడం నాకెంతో సంతోషంగా వుంది. నేనూ ఈ వూరికి కొత్తే. ఇక్కడ పుట్టినదాన్నికాను. ఇక్కడ వుద్యోగానికి వచ్చి ఒంటరిగా ఉంటున్నాను. నాకున్న స్నేహితులెవ్వరూ ఆట్టేమంది లేరు. మీరేమనుకుంటున్నారో గాని అందరితో పరిచయం చేసుకొనే చొరవా నాకూలేదు. మీ దేశస్థులని యీ వూళ్ళోనే మొదటిసారిగా చూచాను. యెవరితోనైనా పరిచయం చేసుకొని మీ దేశం సంగతి సందర్భాలు తెలుసుకుందామని యెంతో కుతూహల పడుతున్నా యెవ్వరితోటీతెగించి మాట్లాడలేకపోయేదాన్ని. నేనిదివరకు చూసినవాళ్ళు చాలా గడుసరులు, తొందరపాటు

మనుషుల్లా కనపడ్డారు. అందుచేతను ఒకరిద్దరు నాతో మాట్లాడటానికి ప్రయత్నం చేసినా నేను మాట్లాడకుండా చక్కా పోయేదాన్ని. మీరెందుకో చాలాపెపెవారుగనూ, అమాయకులుగనూ కనపడ్డారు. అందుచేతను సాహ సించి మీతో మాట్లాడాను. మీరేమనుకున్నారో యేమిటో. ఇంక మనకు ఎవరిదారి వాళ్ళది. నేనూ ఒంటరిదాన్ని. యిప్పటికే యింటికెందుకు రాలేదా అని మా లాండ్ లేడీ ఏవేవో వూహించుకుంటుంది. అందుచేతను యింక నాకు సెలవిస్తారా?" అంది.

నాకామ్మాయిని చూస్తే, చెప్పిన మాటలు వింటూంటే ఆ అమ్మాయి చెప్పినదంతా నిజమనిపించింది. "మీ పరిచయం నాకూ చాలా సంతోషదాయకంగానే ఉంది. అప్రయత్నంగానే ఆప్తులెవరో ఒకరు తటస్థపడుతూంటారు" అని అన్నాను. ఇక మనం కలుసుకొనే అవకాశం ఉండదు కాబోలంది. ఆ అమ్మాయి కొంచెం దీనవదనంతో. "ఏం, ఎందుకుండదు. మళ్ళీ ఏ సినిమాలోనో, ఏ నాటకంలోనో, " అన్నాను నవ్వుతూ. "అంతేనా మనం పోనీ విడిగా కలుసుకుని ఏ కొండలమీదకో, పార్కుకో పోయి కులాసాగా కబుర్లు చెప్పుకోకూడదా" అంది. "ఏందుకు చెప్పుకోకూడదు. అలాగే కలుసుకుందా" మన్నాను. వెంటనే ఆదు ర్దాగా "ఎప్పుడు, ఎక్కడంది" "అది నీ యిష్టం. నువ్వే చెప్పు. నీకెప్పుడు తీరికవుతుందో, ఎక్కడ కలుసుకుంటే బాగుంటుందో " అన్నాను. ఆ అమ్మాయి ఎంతో సంతోషంతో "అయితే మనం, రేపు - మాకు శలవు కూడా కనుక - రేపు మధ్యాహ్నం నాలుగు గంటలకు కలుసుకుందామా ? అప్పుడేదన్నా సినిమా చూచి కాస్సేపు షికారుకి వెళ్ళి కులాసాగా కబుర్లు చెప్పుకుందా" మంది. "ఓ అలాగే తప్పకుండా కలుసుకుందాం " అనగానే ఆ అమ్మాయి ముఖం ఎంతో సంతోషంతో వికసించింది. తనే కలుసుకునే చోటు, టైము ఏర్పాటు చేసి "గుడ్‌నైట్ థేంక్యూ సోమచ్" అని నాచేతిని తన రెండుచేతులతోను వూపి మారు మాటలేకుండా, తిరిగి చూడకుండా ఒక్కపరుగున చక్కా పోయింది.

నేను కాస్సేపలాగే ఆ పిల్ల వైపే చూస్తూ నిలబడిపోయాను. ఎంత సేపు నిలబడ్డానో నాకు తెలియలేదు. అక్కడికి ట్రామ్ రావడం, జనం గబగబా ఎక్కడం తెలుసుకొని, నేనూ ఎక్కడానికి ప్రయత్నం చేసి, చాలా సమ్మర్దంగా ఉండడంచేత కులాసాగా నడిచి వెడదామనిపించి, బస దాకా నడకారంభించాను. దారిలో ఒకరిద్దరు పిల్లలు నాకేసి చూచి నవ్వారు. నేను నా దారిని పోవడం చూచి "నో గుడ్" ( లాభం లేదు ) అంటూ చక్కాపోయారు. ఒకరిద్దరు నన్ను చూచి కన్నుగీటారు.

నేను పలక్కపోయేసరికి దగ్గిరకొచ్చి "హల్లో జానీ" అన్నారు. "నువ్వు పొరపాటు పడ్డావు! నేను జానీనికా"నని ముందుకు వెళ్ళిపోయాను. "టూ యంగ్" (మరీ చిన్నతనం) అనుకుని నవ్వుకుంటూ. వాళ్ళూ వెళ్ళిపో యారు. దారినపోయేవాళ్ళు యువతీయువకులు పరిస్పరాలింగనాల్లో నడుస్తూ ఈ వేడుక చూస్తూ నవ్వుతూ వాళ్ళు చక్కాపోయారు. ఎవరో ఒక నడివయస్సులో ఉన్న ప్రేమికులో, దంపతులో ఇంకొకరు, ఎవరో ఇద్దరు నన్ను పలకరించడం నేను మాట్లాడకపోతే వాళ్ళు నన్ను చెయ్యి పట్టు కొని నన్నాపడానికి ప్రయత్నించడం, నేను నెమ్మదిగా చెయ్యివిదిలించుకొని "సారీ గుడ్ నైట్" అని రావడం వాళ్ళు గమనించి "దట్స్ రైట్ యంగ్ మేన్ యు హేవ్ గాట్టు బి జాలీ కేర్‌ఫుల్" మంచిపని చేశావు నాయనా, కొంచెం జాగ్రత్తగా ఉండాలి వీళ్ళతో అని వాళ్ళ దారిన వాళ్ళు చక్కాపోయారు. నేను నా బసకు చేరుకునేటప్పటికి పన్నెండయింది. యజమానురాలు, పిల్లలు గాఢనిద్రలో ఉన్నట్టున్నారు, చడీచప్పుడూ లేదు. నేను నిశ్శబ్దంగా నా గదిలోకి వెళ్లాను. నా గదిలో బల్లమీద కాసిని వేడి పాలూ, వెన్న రాచిన రెండు మూడు రొట్టెముక్కలు పెట్టి వుంచింది మాయింటి యజమానురాలు. నేను పాలుమట్టుకు తీసుకొని యీవేషం తీసేసి, పైజామా తొడుక్కొని కాస్సేపు ఆ రాత్రి జరిగిన సంఘటనలను తలుచుకుంటూ నాకు నేనే గుడ్ నైట్ చెప్పుకుని పడుకున్నాను.

# 18

మర్నాడు మధ్యాహ్నం మూడుగంటలకు, ఆ అమ్మాయిచెప్పిన సంకేత స్థలానికి వెళ్ళాను. నేను వెళ్ళేటప్పటికి ఆ అమ్మాయి వచ్చి నా రాకకు యెదురుచూస్తూంది. నన్నుచూడ్డంతోటే మందహాసంతో ఎదురుగా వచ్చి "గుడ్ ఆఫ్టర్ నూన్" అని కరచాలనానికి చేయి అందించి "మీ రొచ్చారు చాలా సంతోషం. తప్పక వస్తారని ధైర్యం వుందిగాని అయినా ఎక్కడో కొంచెం సంకోచం కూడా లేకపోలేదు. అయినా మీ ముఖం అబద్ధమాడే ముఖంలా కనబడలేదు కూడాను." అన్నది తడుముకోకుండా "అయితే ముఖాన్నిబట్టి మనిషిని తెలుసుకోగలరన్నమాట. ఆ విద్యనాకు కూడా నేర్పుదురూ కొంచెం. నాకు ఎవర్ని చూచినా అందరిలోనూ మంచే కనబడుతుంది. ఎందుచేతనంటారు!" అంటే ఆవిడ నవ్వుతూ "మీరు మంచివారు కనుక అందరిలోనూ మంచే కనబడుతుంది." అన్నది యిలా మాట్లాడుకుంటూ సమీపములో నున్న హోటలుకు వెళ్ళి లఘువుగా టీ ఫలహారం తీసుకొని, ఒక సినిమాకు వెళ్ళాం.

అక్కడ హాస్యరస ప్రధానమై చార్లీచాప్లిన్ అనే ఆయన నటించిన చిత్రపటం చూపించారు. చాప్లిన్ పటం చూడ్డం అదే మొదటిసారి యెంత అద్భుతంగా ఉందో చెప్పలేను. ఒక మాటామంతీ లేకుండా పాటా పద్యం లేకుండా, కేవలం వాళ్ళ నటనవల్లనే కథంతా మన కర్థమయ్యేటట్టు యెంత చక్కగా చేశారు. అందులో చాప్లిన్ హాస్యనటన మరీ అద్భుతం.




అతని పటం చూచిన సుమారు గంటసేపు నేనూ, నాతో సమానంగా పక్కనున్న అమ్మాయియూ, మేమే నన్నమాటేమిటి? ఆహాల్లోవున్న ప్రేక్షకులంతా ఆ హాస్య నటన చూచి ముగ్ధులై, పరవశులై, వొళ్ళు తెలియని ఆనందంలో మునిగిపోయాం. మా నవ్వులతో హాలు మార్మోగిపోయింది. పిక్చరు చూడ్డం పూర్తి కాగానే బయటికొచ్చి మళ్ళీ కొంచెం టీ సేవించి అక్కడ నుంచి కబుర్లు చెప్పుకుంటూ ఒకకొండమీదకి కులాసాగా నడిచి షికారుకు వెళ్ళాం.

అప్పటికి సుమారు ఆరు గంటలయింది. మేము వెళ్ళేటప్పటికే వందలాది వేలాది జనం జంటలు జంటలుగా ఆ కొండమీద షికారుకొచ్చి యున్నారు. అందరూ నూటికి తొంభైమంది పైగా యువకులే. యువతీ

యువకులంతా ఒక ఆడ, మగ కూడ బలుక్కుని, వుండిపోయినట్లు, తలో చోటా నిర్భయంగా, నిశ్శంకగా కూర్చుని, ఒకళ్ళ నొకళ్లు ఆలింగనము చేసుకొని నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ సినిమాలలోను, నాటకాల్లో లాగ పరవశులై ఆ కొండమీదను యెవరిమటుకువారు తమరొక్కరేవున్న ట్టుగా భావించుకొని బాహ్యాన్నంతా మరచి ఆనందిస్తూ కూర్చున్నారు. బహు కొద్దిమంది మటుకు కొందరు పురుషవాళ్లు ఒకచోటా, వేరొక చోట కొందరు ఆడవాళ్లు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. మేము ఒకపొద దగ్గరికి చేరాం. ఈ మధ్యన ఇటువంటి దృశ్యాలు కొంచెం అలవాటుప డినా ఇక్కడ శృంగారం తప్ప మరేమీ వున్నట్టు కనబడలేదు. మేమూ కూర్చున్నాం. రెండుమూడు నిమిషాలు మా వుభయులకూ కూడా యేం మాట్లాడాలో తోచలేదు. తరువాత ఆ అమ్మాయి నా ముఖం కేసిచూస్తూ.

"యేమండీ అలా మౌనంగా కూర్చుంటే యెలాగు. చెలికత్తెను తీసుకు ఇంతదూరం వచ్చినది మౌనంగా కూర్చోడానికేనా?" అన్నది.

నేను నవ్వుతూ "నువ్వన్నది కొంచెం సవరణ చెయ్యాలి. నేను చెలి కత్తెను తీసుకురాలేదు. చెలికత్తె నన్ను తీసుకొచ్చింది. అందుచేతను నాకు వుత్సాహం కలిగించే కబుర్లేమన్నా చెప్పవలసిన బాధ్యత మీదే" నన్నాను.

"అమ్మా అలాగే అయితే ముందు మీ సంగతి కొంచెం చెప్పండి మీరెక్కడ నుంచి వచ్చిందీ, ఎంతకాలమైందీ ఇక్కడ మీ అనుభవాలేమిటో. యివన్నీ ఒకటొకటే చెప్పండీ, బోలెడంత కాలక్షేపమవుతుంది" అన్నది. కాలక్షేపమే అవుతుందో మీకు తలనొప్పే వస్తుందో అన్నాను. మరేం ఫరవాలేదులెండి. తలనొప్పి ప్రారంభం కాగానే నేను మీ తోటిచెప్పకుం డానే వెళ్ళి ఓ తలనొప్పి మాత్ర తెచ్చుకుంటాను అన్నది నవ్వుతూ. ఈరీతిగా మొదలైన పరిచయ వాక్యాలతో రెండుమూడు గంటలసేపు నేనేం మాట్లాడానో, ఆ అమ్మాయేం మాట్లాడిందో ఎవరోవకరము ఏం మాటాడామో తెలియకుండానే పరస్పర పరిచయం సంభాషణలో కాలమింత వేగంగా పరిగెడుతున్న సంగతి మాకు తెలియకపోయినా, మా కడుపులు మాకు గుర్తుచేసినాయి. మేమిద్దరం లేద్దామా అని ఏక కంఠంతో అనుకొని లేచాక, అనగా నేను ముందులేచి ఆ అమ్మాయికి నా చేయి అందించి లేవదీసి నెమ్మదిగా హోటల్ వేపు సాగాం.

అక్కడ ఫలహారం చేసి ఎవరి దారిన వాళ్ళం మళ్ళీ ఎప్పుడో కలుసు కుందామనుకుని విడిపోయాం. ఇంటికి వచ్చి ఆలోచించుకుంటూ చాలాసేపు కూర్చున్నాను. ఆ అమ్మాయి చాలా బుద్ధిమంతురాలు. నెమ్మదయినదిగా

కనబడ్డది. నాటకశాలలో కనపర్చిన చొరవ ఈ మాటేమీ ప్రదర్శించలేదు. దగ్గరకు రావడానికి, కాని మాటలో కాని, చేతలో కాని, ఏ ప్రయత్నమూ చేయలేదు. ఏదో ఒక కొత్త మనిషితో పరిచయం కోసం వచ్చినట్టున్నది. కాని అంతకంటే ఏమి ఆశించినట్టు ఎటువంటి సూచనా కనపర్చలేదు. నాలాగునే ఆమె వంటరిగా ఉంది కాలక్షేపం కోసం వచ్చిందనే అనుకున్నాను. ఇలా అనుకుంటుండగా, మా ఇంటావిడ కూతురు నెమ్మదిగా లోపలికి వచ్చి "ఏమండీ సేమ్ గారూ ఏమిటి ఆలోచిస్తున్నారు. మీరు చదువుకో డంలేదు. పడుకోనూ లేదేం" అన్నది. "నా మాటకేం గాని నువ్వెందుకు పడుకోలేదింకాను. చిన్న పిల్లలందరూ కొన్ని గంటలక్రితమే పడుకోని నిద్ర పోవాలికదా" అన్నాను. "నిజమే సుమండీ, అయితే మీరే చెప్పారుగా చిన్నపిల్లలని అది మనకు వర్తించదులెండి. ఇంతకూ మీ సంగతేదో చెబు దురూ, మీరెక్కడకెళ్ళినదీ ఏంచేసిందీ చెప్పాలి. నాకు నిద్దరరావడంలేదు." అన్నది. "సరే తప్పనిసరయితే చెబుతాను. నీకు కోపమొస్తే నన్నేమీ అన కూడదు." అన్నాను "నాకు కోపమెందుకొస్తుంది. ఇంతకూ కోపం వచ్చే పనేం చేశారో" అన్నది. మొన్న నాటకానికి వెళ్ళినప్పుడు - అన్నట్టు నీతో చెప్పలేదు కదూ! మొన్నరాత్రి నాటకానికి వెళ్ళాను. నాటక మెంతో బాగుంది. అక్కడొక చక్కని చుక్కతో పరిచయమయింది. ఎంత బాగుం దనుకున్నావు అమ్మాయి అన్నాను ఈ అమ్మాయి ముఖం కేసి చూస్తూ, ఈ పిల్ల మొహంలో వికాసం, ఉత్సాహం తగ్గి కొంచెం అగ్రహం పొడ చూపింది "పోనీ లెండి ఎంత బాగుంటే నాకెందుకు. కనబడ్డదేం పాపం! పరిచయమయిందేం. అయితే ఈవేళ ఆ అమ్మాయితో షికారుకెళ్ళారా?" అందికొంచెం చురుగ్గా. "ఔను ముందు ఫలహారం చేసి తరువాత సినిమా కెళ్ళి ఆ తరువాత కొండల మీదకి షికారెళ్ళి కులాసాగా కబుర్లు చెప్పు కొని మళ్ళీ ఫలహారం చేసి ఇక్కడ కొచ్చి ఆ అమ్మాయి సౌందర్యం గురించి సంభాషణా చాతుర్యాన్ని గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను" అన్నాను "ఓహో అలాగా పాపం మీ ఆలోచనలకు అడ్డొచ్చాను మన్నిం చండి. ఇదా మీ వ్యవహారం ఇప్పుడు తెలిసింది లెండి మీ సంగతి. మా అమ్మతోటి చెప్పి మీ సంగతంతా మీ యింటికి ఉత్తరం రాయించకు పోతే అడగండి. అమ్మాయిట అందంగా ఉందిట. ఉండదుమరి. మీలాంటి కుర్రాళ్ళకి విదేశాలనుంచి వచ్చిన వాళ్ళకు ఇక్కడ అందరూ అందంగానే కనపడతారు. అసలందమంటే ఏమిటో మీకు తెలిస్తేగా అందంట అందం" అని విసవిసన, రుసరుసలాడుతూ గిర్రున తిరిగి వెళ్ళబోతున్న పిల్లను రెక్కట్టుకుని వెనక్కిలాగి, "కొందరు పిల్లలు కోపమొచ్చినా అందంగానే

ఉంటారు. సుమా" అని దగ్గరకు తీసుకొని బుగ్గమీద చిన్న ముద్దు పెట్టు కున్నాను. "చాల్లెండి సంతోషించాము. ఆ అమ్మాయి దగ్గిర చేసిన పనులన్నీ ఇక్కడ చేయనక్కరలేదు, అవన్నీ తలుచుకొని పడుకోండి పాపం" అంది. అక్కడ ఈ చిన్నపని కూడా చేయలేదంటే నువు నమ్మవు మరి ఎలాగా? ఇంత కోపమెందుకమ్మా నామీద అన్నా నవ్వుతూ. మీ రెవరూ నే నెవరు? మీ మీద నాకెందుకు కోపం అంది. అయితే నువ్వు ఊరికే తమాషా చేస్తున్నావన్నమాట. పోనీలే ఈ గొడవకేంగానీ "చార్లీ చాప్లిన్ పిక్చరు ఎంత బాగుందనుకున్నావు. నాకు మళ్ళీ అది గాని, అతనిదే మరో పిక్చరుగాని చూడాలని ఉంది నువ్వు తీసుకెళ్ళక తప్పదు నన్ను. ఏమంటావు" అన్నా. "సంతోషించాను లెండి" అంటూ ఒక్క మాటు నన్ను వెక్కిరించి నాకందకుండా ఒక్క పరుగున అవతలి కెళ్ళి పోయింది ఎంత చిత్రం. ఈ అమ్మాయికి కూడా అసూయే కాబోలు. అందుకనే ఆయనెవరో స్త్రీకి మారుపేరు అసూయన్నాడు అని నాలో నేను నవ్వుకుంటూ పడుకునే ప్రయత్నం చేసాను.

ఆ వ్యాళ్ళో అనగా యెడింబరోలో వున్న భారతీయవిద్యార్థులందరి లోనూ నేనే చిన్నవాడి ననుకుంటాను, అయినా యెందుచేతనో అందరి ఆదరణకూ, అభిమానానికి పాత్రుడనయ్యాను. ఎందుచేతనంటే కారణం చెప్పలేను. అన్ని భాషలవారూ, అన్ని రాష్ట్రాలవారూ కూడా, నేను కనబడితే వుత్సాహంగా, సంతోషంగా పలకరించి, నా యోగ క్షేమం విచా రిస్తూంటారు. మా క్లాసులో తోటి స్కాట్ విద్యార్థులు కూడా నేనంటే అభిమానం పెంచుకున్నారు.

నా ప్రోత్సాహం మీదను, నేను చేసిన సూచనలు మీదనుతెలుగు వాళ్ళందరూ తరుచు కలుసుకోవడం, ఉగాది, విజయదశమి, దీపావళి, సంక్రాంతి లాంటి పండుగలు మనం కలిసి జరుపుకుంటే బాగుంటుందని నేను మన వాళ్ళందరితోటీ చెప్పాను. మా రాజు కూడా నా సూచ నను బలపరిచాడు. అందు కాంధ్ర సోదరులందరూ ఏకగ్రీవంగా ఆమోదం తెలిపారు. అప్పటికి వారం రోజుల్లో రానున్న ఉగాది పండుగతో మా తీర్మానం అమలుకు ప్రారంభించాం. ఆనాడు కార్యక్రమం వేపపువ్వు పచ్చడితో కాక అది దొరకని కారణం చేతను, వుదయాన్నే పులిహోర, ఫలహారంతో ప్రారంభించాం. పులిహోర నేనూ, రాజు కలిసి తయారు చేశాం. పోపు దగ్గరకి వచ్చేటప్పటికి నూనెలేదన్న సంగతిజ్ఞప్తికి వచ్చింది. అక్కడ మన నూనెలేవీ దొరకవు. నెయ్యి బాగుండదు. అందుకని

మా లేండ్ లేడీని సంప్రదించి ఆమెను వెంటనే బజారుకి తోలి, ఆలివ్ ఆయిల్ తెప్పించి దానితో పని జరిపాం. పులిహోర బ్రహ్మాండంగా వుందని మిత్రులందరూ మమ్మల్నభినందించారు. కొట్టులో ఏకకాలమందు యిన్ని మిరపకాయలూ, చింతపండూ, ఆవాలూ వగైరా కొంటుంటేకొట్టువాడు నిర్ఘాంతపోయి యెందుకని మమ్మల్నడిగి, "ఇవన్నీ ఫలహారాలకు వుపయోగిస్తాం" అనడంతోనే, అవి తిని మేము ఏమయిపోతామో అని, వాళ్ళు హడిలి బేజారయ్యారు. మధ్యాహ్నం ఓ చిన్న సభ ఏర్పాటు చేసుకొని అక్కడ పాటలూ, పద్యాలూ తోటి ఆనాటి కార్యక్రమం నిర్విఘ్నంగా జరుపుకున్నాం. ఆ సభకు మనవాళ్ళేకాకుండా కొందరు యితర రాష్ట్రీయులు కూడా వచ్చి మెచ్చి ఆనందించారు. తరువాత వాళ్ళూ యిలాటివి జరుపుకుంటే బాగుంటుందని నిశ్చయించుకున్నారు.

ఆనాడు ఒకరిద్దరు దాక్షిణాత్యులూ, ఒక తెలుగతనూ కొత్తగా వచ్చారు. వాళ్ళూ ఈసభ కొచ్చారు. అందులో కొత్తగావచ్చిన తెలుగతను నేనిక్కడ సభా నిర్వహణకు బాధ్యత వహించడం, హడావిడిగా అందరితోనూ తిరగడం చూసి, నేనేదో నాయకుడి ననుకుని నెమ్మదిగా నాదగ్గరకు వచ్చి నా పరిచయం చేసుకున్నాడు సభాంతమందు.

అతనికి ఇంకా ఎక్కడా గది దొరకలేదనీ, ఒక చిన్న హోటల్‌లో ఉన్నాననీ, తెలిసినవాళ్ళెవరూలేరనీ, తన కా విషయంలో కొంత సహాయం చేయాలనీ అర్థించాడు. "సరే, దీనికేముంది తప్పకుండాను. మర్నాడు కలుసుకుందాం" అని చెప్పి అతన్ని పంపించాను. లండన్‌లో మీనన్, ఇక్కడ రాజూ నాకిటువంటి సందర్భంలో చూపిన అవ్యాజానురాగం, చేసిన అమూల్యమైన సహాయం జ్ఞప్తికొచ్చినాయి. మర్నాడుదయాన్నే ఆ యువకుని తీసుకొని మధ్యాహ్నం వరకూ తిరిగి నాక్వార్టరు దగ్గర లోనే ఒక రూం కుదర్చగలిగాను. తరువాత నా దాక్షిణాత్యులూ వచ్చి అడుగుతే వాళ్ళకూ అటువంటి సహాయమే చేయగల్గాను. వీళ్లు ముగ్గురూ నన్నొక క్షణం కూడా విడవకుండా, నాకు అంగరక్షకులుగా తయారయ్యారు. నాకు రాజు చెప్పిన పాఠాలే ఇక్కడ యెలా ఉండాలో, యెలా తిరగాలో, ఎలా మాట్లాడాలో వగైరా విషయాలన్నీ యెంతో విపులంగా వీళ్ళకూ నేర్పాను. యెంత నేర్పినా చిత్రమేమిటంటే అడుగడుగునా, దిన దినమూ యెన్ని అవకతవకలు చేసేవాళ్ళో లెక్క వుండేదికాదు. ఇంత తెలివితక్కువగా ఎందుకు ప్రవర్తించారు వీళ్ళు అనుకునేవాడిని. రోడ్డుమీద నడవడం దగ్గర నుంచి భోజనం దగ్గర ఆచరించవలసిన విధానం వరకూ

అన్నీ పిల్లవాళ్ళకు చెప్పినట్టు చెప్పాను. అయినా సరే నడుస్తూ రోడ్డు మీద కాండ్రించి ఉమ్మేయడం, ముక్కు చీదడం మొదలైనవి పనికిరావని యెన్నిసార్లు చెప్పినా, వాళ్ళకో పట్టాన ఎక్కలేదు. అందులో ఒకతనికి పొడుం అభ్యాసం కూడా వుందిట. వాడస్తమానం బర్రని పొడుంపీల్చడం, బిర్రని చీదడం, ఆ చేయి యే లాంతరు స్తంభానికో, ట్రామ్‌లో వుంటే ట్రాము కారుకో రాయడం, చూచిన వారందరూ అసహ్యించుకోడం, నేనా విషయం అతనికి తెలియపర్చి "ఇంతకూ నీకు ఈ పొడుం ఎక్కడ దొరికింది" అన్నాను. "మా యింటి దగ్గర్నుంచి తీసుకొచ్చానండి" అన్నాడు. నాకు నవ్వు వచ్చింది. "పొడుం కూడా తీసుకొచ్చావా బాబూ ఏ మాత్రం తెచ్చావేమి"టన్నాను. "బరువుగా ఉంటుందని ఆట్టే తేలేదండీ. ఒక వీశెడు మట్టుకు తెచ్చాను." అన్నాడు. నా గుండె ఆగిపోయినంత పనయింది.



"వీశెడే! మరిక్కడ దొరుకుతుందో, దొరకదో. దొరక్కపోతే మనం చేసుకోడానికి సాధన సామగ్రి సంపాదించేవరకూ సరిపోతుందనే ఉద్దేశ్యంతో ఓ వీశెడే తెచ్చాను. శాంపిల్ చూస్తారా" అన్నాడు నవ్వుతూ. తన పొడుంకాయ తీస్తూ.

"వద్దులే బాబు వుంచు, ఇంకేం తెచ్చావేమిట" న్నాను.

"కొద్దిగా పండ్లు తోముకోడానికి బొగ్గు పొడి, భోజనం లోకి సాంబారు పొడి, రసం పొడి, కొంచెం మిరియాలు, యాలకులు, లవంగాలు ఇంకా యిలాంటి చిల్లరసామానులు, వక్కపొడికూడా కొద్దిగా తీసుకొచ్చానండి. తరువాత ఇక్కడ దొరుకుతాయికదా" అన్నాడు "దొరక్కేం చేస్తాయి చచ్చినట్టు దొరుకుతాయి. అంతగా దొరక్కపోతే ఏ శెలవులోనో ఇంటికెళ్ళి ఏకంగా తలో టన్నూ తీసుకొచ్చి ఇక్కడో చిన్న కొట్టుపెడితే నీకు

ఖర్చులూ కలిసొస్తాయి. ఇక్కడ నీ సాటిసోదరులకు ఉపయోగముగానూ వుంటుంది అన్నాను. నేను నిజంగా అన్నానో, వేళాకోళంగా అన్నానో అర్థంకాలేదు వాడికి. అయినా నవ్వుతూ "ఔనుసార్ మీరు చెప్పింది నిండా బాగుంది సార్. మంచి ఐడియా చెప్పారు సార్ అని నన్ను స్తోత్రం చేసి నాకు మరీ సన్నిహితుడై ఊరుకున్నాడు. వాళ్ళూ విద్యాలయంలో చేరారు. ఎవళ్ళ చదువులు వాళ్ళు ప్రారంభించారు. ఇలా వుండగా ఒక రోజున అక్కడున్న ఒక స్కాట్ దంపతులు రాజునూ, నన్నూ, మరొక ఇద్దరినీ ఈ కొత్తగా వచ్చిన వాళ్ళనూ ఆదివారం సాయంకాలం టీకి రమ్మని పిలిచారు. సరేనన్నాము. ఈ కొత్తగా వచ్చిన మిత్రులకు అక్కడయెలా ఉండాలో ఏమిటో అన్నీ ఒక్కసారి మళ్ళీ ఉపదేశం చేశాను. ఆసాయంకాలం నాలుగు గంటలకు విడివిడిగానే మేమంతా, మమ్మల్ని పిలిచిన వారింటికి చేరుకున్నాం. చిత్రమేమిటంటే మేమక్కడికి వెళ్ళేసరికే సోఫా మీద కాళ్ళుజాపుకు పడుకుని హాయిగా ఏదో నవల చదువుతున్నాడు నా పొడుం శిష్యుడు. మేమంతా తెల్లబోయాం.

"ఇదేమిటి యెప్పుడొచ్చా" వన్నాను.

"పొద్దున్నే వచ్చా"నన్నాడు

"నీ బొంద పొద్దున్నే రావడమేమిటి, సాయంత్రం రమ్మంటే" అన్నాను. వాడేమో నవ్వు తుళ్ళూ లేకుండా "ఎప్పుడైతే ఏమండీ! నాకు పని ఏం లేదు. వాళ్లు రమ్మన్నారు కదా మంచి వాళ్లు. వాళ్ళ స్నేహం చేసుకుందామని ప్రొద్దున్నే వస్తిని సార్, తప్పాసార్" అన్నాడు వెర్రి చూపు చూస్తూ.

"అబ్బే తప్పేముంది వాళ్ళు చాలా సంతోషించిఉంటారు" అన్నాను.

"ఔను సార్ నిండా మంచివాళ్ళు. చాలా మర్యాద చేశారు సార్ అన్నాడు "

ఇంతట్లోకే యజమానురాలు వచ్చి. పరస్పరం "గుడ్ ఈవినింగ్. గుడ్ ఆఫ్టర్ నూన్‌లు హౌడూయూడూ" లు అయిన తరువాత నేను నెమ్మదిగా ఆమెను ఇవతలికి పిలిచి.

"వాడేదో ఉదయాన్నే వచ్చాడట. మీరేమీ అనుకోక మమ్మల్ని మన్నించండి. కేవలం అమాయకత్వమేగాని, మరో ఉద్దేశమేమీలేదు వాడికి. ఇంకనెప్పుడూ ఇటువంటి తెలివితక్కువ జరుగద" ని హామీ యిచ్చాను.

ఆమె నవ్వుతూ "దీనికి మీరింత బాధపడ్డం ఎందుకు. ఫరవాలేదు లెండి. ఏదో తెలియక వాళ్ళ ఊళ్ళో చుట్టాలింటికి వెళ్ళినట్టు వచ్చేడిక్కడికి తప్పేముంది." అన్నది. "ఎంత గడసరివమ్మా" అని లోపల అనుకుని.

"మీరింత అర్ద్రతతో అర్థం చేసుకుని ఆదరించినందుకు చాలా సంతోషమండి. మేమంతా చాలా కృతజ్ఞులం." అన్నాను. ఇంతలో టీ రెడీ అయిందని పిలుపు వచ్చింది.

టేబిలు మీదను మామూలుగా అందరికి ఖాళీ ప్లేట్లు, స్పూన్లు వగైరా పెట్టి, పదార్థాలు వేరే ప్లేట్లలో ఆ బల్లమీదనే అమర్చబడిఉన్నాయి. ఎవరెవరికి కావలసినవి వారు స్పూన్లు. ఫోర్కుల సహాయంతో తీసుకుని వాళ్ళవాళ్ళ ప్లేట్లలో పెట్టుకోవాలి, మేమందరం అలా పెట్టుకోవడం చూసి కూడా ఈ ముక్కు పొడుంగాడు గబుక్కున ఒక కేకు చేత్తో అందుకుని, కొరుక్కుని మరికొన్ని కూడా తన కంటికి నచ్చినవి. తన ప్లేటు నిండా పెట్టుకొని చేత్తోటే కొరుక్కొని తినడం ఆరంభించాడు. అందరూ నిర్ఘాంతపోయారు. మేమతనికి ఇలా కూడదని చెప్పడానికి ప్రయత్నించాం. అతను మాకు ఆ అవకాశం యివ్వలేదు. ఇంతట్లోకే యజమానురాలు కల్పించుకొని "యిలా కత్తి ఫోర్కుతోటి తీసుకొని నోట్లో పెట్టుకుంటే వీలుగా ఉంటుందేమో ప్రయత్నించి చూడండండి" మందహాసంతో. "అబ్బే ఎందుకు పోనిద్దురూ హాయిగా దేముడిచ్చిన చేతులుండగా ఇవన్నీ ఎందుకండి. చేతితోటి తినడమే సహజమైన పద్ధతీ సుఖమైన పద్ధతీ" అన్నాడు. ఇంక ఏమనగలం అలాంటి వాడితోటి? అందరం నోరుమూసుకొని సహించి ఊరుకున్నాం. ఇది చాలక వాడు కుడిచేత్తోటి తీసుకు తినడం. ఇంటి వాళ్ళకు మరీ యిబ్బందనిపించింది. "మీరెప్పుడూ ఇలాగే తింటారా" అంది ఇంటావిడ "అవునండీ ఇంకెలా తింటాం" అని ఇంకా ఏదో అనబోతుంటే నాకు వొళ్ళు మండి వాడికి మా అసంతృప్తి, అసహ్యమూ, తెలిసే మార్గం లేక బల్ల అడుగు నుంచి వాణ్ణి ఒక్క తాపుతన్నాను. మొర్రోమన్నాడు. నేను నోరుమూయమని కళ్ళెర్ర జేసి సంజ్ఞచేశాను. "మరేం లేదులెండి నేనుకాలు జాపుకుంటే ఆ కాలు తగిలి ఉంటుంది. మన్నించండి" అన్నాను. ఇంక ఏం జరుగుతుందో అని కంగారుపడుతూ త్వరలో టీ పార్టీ ముగించి, మరికొంచెం సేపు ఈ మాటా, ఆమాటా చెప్పుకుంటూ కాలక్షేపం చేసి, యజమానుల దగ్గర సెలవు తీసుకొని బయలుదేరాం. బయటకొచ్చి చూస్తుంగదా, ఆపొడుంగాడు ఇంకా రాలేదు. ఇదేమిటో ఈ వింతని నేను మళ్ళీ లోపలికెళ్ళాను.

వాడొచ్చే సూచన లేవీ కనబడలేదు. యజమానురాలు ముఖంలో చికాకు కనబడుతూంది. నాకు వళ్ళు మండింది. ఏం యింకా రావేం. అన్నాను. "నేనీరాత్రి యిక్కడే వుండి ఉదయాన్నే రూంకి వెడదామనుకుంటు న్నాన"న్నాడు. నాకు విపరీతమైన కోపమొచ్చింది. యజమానురాలు మా సంభాషణ వింటూ నవ్వూ తుళ్ళూ లేకుండా అక్కడే నిలబడింది. "ఏమిటీ ఈ రాత్రి యిక్కడే ఉంటావా? నీకేమైనామతిపోయిందా ఏమిటి? నీ సౌఖ్యమే కాని వారి యిబ్బందులేవీ గమనించక్కర్లేదా? ఉదయాన్ని రావ డమే ప్రథమ తప్పిదం. తరువాత మరికొన్ని ఘెరాలు చేశావు. ఇవన్నీ చాలక మళ్ళీ రాత్రి యిక్కడే పడుకుంటానంటావేమిటి చుట్టానివైవచ్చి దయ్యమైపట్టుకున్నట్టు. వారిక్కడ ఇంకో మంచం, పరుపు, రగ్గులు అన్నీ యిక్కడ అమర్చి ఉంటాయనుకున్నావా, రా, వెడదామ" న్నాను. "పోనిద్దురూ మంచం లేకపోతే నేను వారి మంచం కిందపడుకోగలను అన్నాడు. యజమానురాలు నవ్వు ఆపుకోలేక అవతలికి పరుగెత్తింది! నేను వీడిని రెక్కపట్టుకుని వాడి కోటూ హేటూ తీసుకోమని మాట్లాడకుండా బయటికి యీడ్చుకొచ్చాను. వాడు లాభం లేదనుకోని కిక్కురుమనకుండా చక్కా వచ్చాడు. ఇంకను వాడిని ఏమనీ ఏం లాభంమని. "మళ్ళీమట్టుకు వెనక్కు తిరిగిరాక తిన్నగా ఇంటికెళ్ళు. కాస్సేపుండి నేను మళ్ళీవచ్చి చూస్తాను. నువ్వు నగదిలో కనబడకపోతే నువ్వెక్కడున్నా వెతికిపట్టుకొని డొక్కబద్దలు చేస్తాను. జాగ్రత్త" అని వాడిని ముందుకు తోశాను. మా దారిన మేము ఎవళ్ళ బసకు వెళ్ళం చేరుకున్నాం. వాడు తిన్నగా ఇంటికి పోయాడు. ఈ వ్యవహారమంతా ఊళ్ళోయెలా పాకిందో తెలియదుకాని మళ్ళీ ఎవళ్ళూ ఏ పార్టీకి వాడిని పిలవలేదు. దేశం కాని దేశంలో ఉన్నప్పుడు ఆ దేశస్థుల కనుగుణంగా ఉండేటట్టు మనం మసులుకోకపోతే ఎలాగో చెప్పండి.

# 19

ఒక రోజున ఏదో సెలవొచ్చింది. కాలేజీలు, ఆఫీసులు. ఫ్యాక్టరీలు వగైరా నమస్తం మూసేశారు. ఏటేటావచ్చే సెలవేనటది. ఆ రోజున పొరుగూళ్ళకు పోయేవాళ్ళతో, రైళ్ళు కిక్కిరిసుంటాయి. ఏ రైలు స్టేష నులో చూచినా స్టేషనునిండా జనమే. ఊళ్ళో ఏపనీ లేకుండా తిరిగే జనసమూహాలతో, హోటళ్ళు, సినిమాలు, విహార స్థలాలు, వినోద స్థలాలు, క్రీడా స్థలాలు వాహ్యాళికెళ్ళే కొండలు, పార్కులు, ఎక్కడ చూచినా నేల ఈనినట్లు స్త్రీ పురుషాదులతో, బాలబాలికలతో నిండిపోయి ఉంటవి.

చిత్రమేమిటంటే ఇంత జనసమ్మర్ధమున్నా ఎక్కడా త్రొక్కిడిగానీ, ఒకళ్ళనొకళ్ళు తీసుకోవడముగాని, చిల్లర దెబ్బలాటలు కాని ఒకళ్ళ నొకళ్ళు మాటా మాటా అనుకోవడంకాని కనుపించదు. ఇంత మంది జనమున్నా మన తీర్థాల్లో ప్రజల్లోలాగా ఇక్కడి జనం మైమరచి సంచరించరు. అందరూ ఏక కంఠముతో మాట్లాడినా శబ్దమైనా వినబడదు అక్కడక్కడా నవ్వులు మటుకు వినపడతాయి. జనసమూహం ఊరమ్మట బలాదూరు తిరిగేవారు తిరుగుతుంటే ఆరుబయట ఆడుకొనే ఆటలు టెన్నిస్, బాడ్మింటన్ వగైరాలు ఆడుకునేవాళ్లు, సెలవురోజు గనుకను రోజంతా ఉండే సినిమాలకు వెళ్ళేవారు, ఊరి కబుర్లు చెప్పుకుంటూ రోడ్లంట తిరిగేవాళ్ళు, బట్టలు, వస్తువులు వగైరా సామాన్లతో నిండి వున్న పెద్ద దుకాణాల దగ్గిర నిలబడి అద్దాల తలుపుల వెనుక అందంగా అమర్చబడిన వస్తు సముదాయాన్ని గంటలతరబడి చూస్తూ నిలబడే స్త్రీ జనం వీళ్ళను చూస్తూ ఆనందించే నా బోటి ఏకాకులతో రోడ్లు కిటకిటలాడుతూ వున్నాయి. మరి కొందరు కొంచెం నడివయస్సు వాళ్ళూ, వయస్సు ముదిరిన వాళ్ళూ, ఒక పబ్లిక్కు హౌసులోకి వెళ్ళి, అక్కడ కొంచెం మద్యపానంచేస్తూ. స్నేహితులతో ఒగంట గడిపి, అక్కడ నుంచి మరో చోటికి, అక్కడ నుంచి మళ్ళీ మరో చోటికి ఇలాగంటకొక పబ్బు (Pub) చొప్పున మారుతూ ఆ రోజంతా గడిపే సోదరులు కొందరు - అన్ని గంటలు మధ్యపానం చేసినా మనవాళ్ళకు మల్లే పెద్ద పెద్ద కేకలు వేయడం దెబ్బలాడడం. హద్దుమీరి సంచరించటం సాధారణంగా కనిపంచదు. మేము అంటే మన దేశస్థులం ఇంట్లో చదువుకుంటూకూర్చోనో, స్నేహితుల ఇళ్ళకు వెళ్ళో కాలక్షేపం చేసుకుంటూ సాయంత్రం కొండసమీదకు బయలుదేరాం. నేనూ బయలుదేరి ఇవతలి కొచ్చేటప్పటికి మరికొందరు మిత్రులు కూడా కలిసి, ఈ వేళ చెడుగుడు ఆడాలని బయలుదేరాం. వెడుతుంటే ఒక విచిత్రమైన తమషా జరిగింది. రోడ్డు మనుష్యులతోటి, వివిధ వాహనములతోటీ క్రిక్కిరిసి వున్నది. రోడ్డు ఈ ప్రక్క నుంచి ఆ ప్రక్కకు వెళ్ళడం చాలా కష్టంగానూ, ప్రమాద భరితంగానూ కనబడ్డది. అయినా ఒక చోటదాటక తప్పనిసరై ఆ ప్రయత్నం మీదే ఎవరికి వారే విడివిడిగా, తొందరగా దాట ప్రయత్నిస్తున్నాం.

నా ఫక్కనే ఒక నడివయస్సుదాటిన మనిషి ఈ రోడ్డు దాటే ప్రయత్నములోనే కొంచెం తూలుతూ నడుస్తున్నాడు. వాడెక్కడ పడిపోతాడో ఏం ప్రమాదం జరుగుతుందో అనే భయంతో నేను దగ్గరగా వెళ్ళి అతని చేయి పట్టుకొని "రండి, నేను జాగ్రత్తగా తీసుకువెడతా, మీకేం

భయం లేదు'' అన్నాను. అతనొక పెద్దనవ్వునవ్వి నాచేయి విదిలించుకుని నాకేసి నిదానంగా చూస్తూ పడబోయి నిలదొక్కుకుని "అబ్బాయీ నీ వయస్సుకి ఇంత మదిర పుచ్చుకోకూడదు. చూశావా అది భరించక ఎలా తూలుతున్నావో! కొంచెం జాగ్రత్తగా వెళ్ళు నాకు తొందర పనుంది'' అని తూలుతూ ముందుకు సాగాడు. బళ్ళ రద్దీ చాలా యెక్కువగా వుంది. వర్ష ధారల మధ్యను అర్జునుడు రథం నడిపినంత నేర్పుతో, ఈ వాహనాల్ని తప్పించుకు నడవాలి. ఈ మనిషి ఇంకొక్క నాలుగడుగులు ముందుకు వేసి దభీమని కిందపడబోయి ఎదరవైపు నుంచి వస్తున్న ముప్పైఏళ్ళ స్త్రీ మీద పడి, ఆమెను గట్టిగా పట్టుకొని నిలబడి నవ్వుతూ ఆమెకేసి చూసి కొంచెం ముద్దు మాటలతో "థేంక్యూ డియర్'' కష్టంమీద.

ఆమె చీదరించుకుని ఆవాసన భరించలేక ఆ మనిషిని అవతలకి తోసేయబోయింది. అతనామెను మరింత గట్టిగా పట్టుకొని అన్నాడు కలి సుంటే నిలబడతాం. విడిపోతే పడిపోతాం. (United we stand - seperated we fall) అన్నాడు చాలా గంభీరంగా. రోడ్డు దాటుతున్న జనమంతా నిలబడి విరగబడి నవ్వారు. బండ్లు ఎక్కడి వక్కడ నిలిచిపోయినాయి. ఆమె యెంతో సిగ్గుపడిపోయింది. యెవరో యెక్కడనుంచో ఒక కాని స్టేబులు వచ్చి ఈ మనిషిని ఇవ తలకు లాగి ఆవిడకు క్షమాపణ చెప్పి జాగ్రత్తగా వెళ్ళమని చెప్పాడు. మేం కులాసాగా నవ్వుకుంటూ చెడిగుడి ఆటకు వెళ్ళాం. అక్కడ మా స్కాచ్ స్నేహితులు కూడా మమ్మల్ని కలుసుకున్నారు. వాళ్ళొక పార్టీగా, మేమొకపార్టీగా చెడుగుడి బ్రహ్మాండంగా ఆడాం. చుటుపట్ల కొన్ని వందల మంది ప్రేక్షక సమూహం హర్షధ్వా నాల మధ్యను, నాటి ఆట ఎగ్జిబిషన్ ఆటలా తయారయింది. ఇంకను ఒక రోజున ఎప్పుడో మేచ్ ఏర్పాటు చెయ్యాలని నిశ్చయం చేసుకొని విడిపోయాం.

నేన్నూ, మనవాళ్లు కొందరూ కాస్సేపు కూర్చుని కబుర్లు చెప్పకుని బయలుదేరి వస్తుంటే మరొక చిత్రమైన సన్నివేశం కనపడ్డది. ఇక్కడ కొందరు విద్యార్థికులు వారు వారభ్యసించిన విద్యల్లో పండితులైన వాళ్ళు జీవనోపాధికి ఏ ఉద్యోగం చేస్తున్నా, తమరభ్యసించిన శాస్త్రమును మరి చిపోక, బోటనీని చదివినవాళ్లు బోటనీని గురించి, జియాలజీ చదివినవాళ్లు ఆయా శాస్త్రాలకు సంబంధించిన వస్తు విశేషాలను సేకరిచడానికి ప్రయత్నం చేస్తూంటారు. అందులో ముఖ్యంగా ఎంటిమాలజీ అనగా క్రిమి, కీట కాదులకు సంబంధించిన విద్య నభ్యసించినవారు ఏదైనా కొత్త రకం

ఎగిరే రంగు రంగు రెక్కల పురుగుగాని, సీతాకోకచిలుకలు గాని కనపడితే వాటి నెలాగైనా ఒక్క పురుగు నైనా మచ్చుకు పట్టుకోవలెననే ప్రయత్నం చేస్తూండటం నేను చాలా సార్లు చూశాను. ఆ రోజున మేము యింటికి వెళుతుంటే అప్పటికి బాగా చీకటి పడి దీపాలు పెట్టారు. జనసమ్మర్దం చాలా వరకు తగ్గిపోయింది.

మేము నడిచి వెడుతుంటే ఒక లాంతరు స్తంభం దగ్గర ఒక పాదరీ నిలబడి ఆ దీపం కేసీ, దాని చుట్టూ పరిభ్రమిస్తున్న రెక్కల పురుగులకేసి, తదేక దీక్షగా చూస్తున్నాడు. నేనూ మాలాంటి వాళ్ళు మరి కొంతమందీ, ఏమిటి ఈయన చూస్తున్నాడని మేమూ చూస్తూ నిలబడిపోయాం. ఒక రెండు నిమిషాలలో ఆయన నెమ్మదిగా లాంతరు స్తంభం పైకి ప్రాకడం మొదలెట్టాడు. ఆ పని మామూలుగా రోడ్డుమీద ఎవరు చేసినా హాస్య జనకంగానే ఉంటుంది. అందులో కొంచెం వయస్సు మీరిన మత ప్రబోధకుడైన ఫాదరీ ఆ పని చేస్తుంటే ఎందుకో మాకు మరీ నవ్వు వొచ్చింది. ఆయన ఇదేమీ గమనించకుండానే పైకి బహు నెమ్మదిగా పాకుతున్నాడు.



ఇంతలోనే మరో ఆసామి కొంచెం పెద్దవాడు, మదిర భారంతో తూలుతూ, తూలుతూ మా దగ్గిరకొచ్చి నిలబడి పైకెక్కుతున్న మనిషిని చూసి,

ఆయన ఫాదరీ అని గ్రహించి, ఆయన పైకి ఎందుకు ఎగబ్రాకుతున్నాడో మాకు మల్లేనే ఊహించలేక, ఒక్క క్షణం ఆలోచిస్తూ నిలబడి, సమాధానం దొరికినట్టు మా వైపు చూసి నవ్వుతూ కన్ను గీటి "హైమేట్ కిందికి రా అగ్గిపుల్ల నేను యిస్తాలే" అని కేకేవేశాడు.

పాపం ఈ మదిరాపాన మత్తుడు వూహించిందేమిటంటే ఆ పెద్ద మనిషి అంటే ఫాదరీ చుట్ట కాల్చుకోడానికి దగ్గిర నిప్పుపెట్టె లేక ఆ దీపం దగ్గిరికి పై కెగపాకుతున్నాడని అనుకొని తనెంతో ఆదరంతో నిప్పుపుల్ల ఇస్తానన్నాడు. దాని అంతరార్థమేమిటంటే ఆ లాంతరు స్తంభము పట్టుకొని పైకి వెడుతున్న మనిషి మస్తుగా తాగి ఉంటాడని ఈ బుద్ధిమంతుడు వూహించి తన ఉపబుద్ధిని ప్రదర్శించేడన్న మాట. నాకు చచ్చేటట్టు నవ్వు వచ్చింది. ఫాదరీ గారు కూడా ఈభావం గ్రహించి సిగ్గుపడుతూ కిందికిచ్చి మాకేసి తిరిగి "సారీ జంటిల్ మెన్" అని ఆ తాగుబోతు భుజంమీద చేయివేసి "నాయనా నీవు చేసినపని మేము చేసేమనుకున్నావు కదూ. నీవు చాలా పొరపాటు పడ్డావు. నేను అందుకోసం కాదు పైకి వెడుత. ఆ దీపం చుట్టూ ఎంతో అందంగా విలాసలాస్యం చేస్తున్న ఆ రంగు రంగుల రెక్కల పురుగునుపట్టి బంధించవలెననే కుతూహలంతో పైకి వెళ్ళాలని ప్రయత్నించాను. నా ఉత్సాహం చంపేశావు. నడువు నీవు నెమ్మదిగా, ఎవరి యిళ్ళకు వారు చేరుకుందాం. నీవు జాగ్రత్తగా వెళ్ళగలవా, నా సహాయం కావలెనా" అన్నారు ఫాదరీ. "అక్కర్లేదండీ ఫాదర్ జాగ్రత్తగానే వెడతాను. మన్నించండి. నేను పొరపడ్డాను. నేను పొరపడ్డాను గుడ్ నైట్ ఫాదర్" అని తొందరగా నడవబోయి ముందుకు పడబోతుంటే ఫాదర్ అతన్ని పట్టుకొని లేవదీసి, కొంతదూరం కూడా వెళ్ళి సాగనంపారు. ఇలాటి హడావిడి రోజుల్లో ఇలాటివి ఎన్నెన్నో రకరకాల వింతలూ, విశేషాలూ, కనపడతూ హాస్యజనకంగా ఉంటుంటాయి.

ఈ దేశంలో ఒక ఆచారమున్నది. సెలవులివ్వటం తోటే విద్యార్థులుగానీ, ఆఫీసుల్లో పనిచేసేవారు కానీ, ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు కానీ అందరూ కూడా ఉన్న వూరు విడిచి ఏ సముద్రతీరానికోపోయి, కొన్ని రోజులు అక్కడ గడుపుకుని మళ్ళీ కొంత శక్తి సంపాదించుకొని, వారి వారి పనుల్లో కొస్తుంటారు. మెరక ప్రదేశాలున్నవారు సముద్రతీరానికి పోతారు. సముద్ర తీరవాసులు యే పర్వత ప్రాంతాలకో పోతారు. ఆ గాలిమార్పు, నీటి మార్పు ఒక్క పది రోజులలో అద్భుతమైన పని చేస్తుంది. ఇంత ఆరోగ్యాన్ని చేకూరుస్తుంది. ఆఖరికి ఒక రోజు శెలవయినా

సాధ్యమైనంత వరకూ, తమరున్న వూరు విడిచి వెళ్ళిపోతుంటారు. అందుచేతను ఈ వేసంగి సెలవల్లో నాకూ అటువంటి సరదా పుట్టి ఐర్లండు వైపునున్న సముద్రతీరానికి వెళ్ళవలెనని నిశ్చయం చేసుకున్నాను. ఇంకెవ్వరితోటీ చెప్పకుండా మా గురువుగారి ఉపదేశాన్ని అనుసరించి ఈ శెలవులకు కూడా ఒంటరిగా వెళ్ళవలెనని నిశ్చయించుకున్నాను. స్టేష నుకు వచ్చేటప్పటికి స్టేషనంతా జనంతో కిటకిటలాడుతోంది. టిక్కెట్టు సంపాదించి రైలుపెట్టెలో ఒక చివర స్థలం సంపాదించి కూర్చున్నాను. నా పక్కన సుమారు ఇరవైయేళ్ళ యువతి ఒకతి కూర్చున్నది. నన్ను చూచి చిరచిరలాడుతుందేమో అనుకున్నాను. కాని నవ్వుతూనే ఆహ్వా నించి తను పక్కకు జరిగి కిటికీ దగ్గర చోటు నాకిచ్చింది. ఆమె పక్కన ఒక పాతికేళ్ళ లోపు యువకుడు కూర్చున్నాడు. ఇక తక్కిన వారందరూ కూడా యువతీయువకులే. యెవరి మట్టుకు వారు మందర స్థాయిలో వారివారి కబుర్లలో మునిగిపోయారు. నాకూ, నా పక్కనున్న అమ్మాయికీ, ఆమె పక్కనున్న ఆయనకూ మట్లాడ్డాని కెవ్వరూ కనప డలేదు. నా కెవ్వరితోనూ మాట్లాడవలెననే కుతూహలం లేదు. అందు చేతను అక్కడున్నవారి ముఖాలు చూస్తూ కూర్చున్నా. నాపక్కనున్న అమ్మాయి యేదో ఒక నవల తీసి అతి శ్రద్ధగా పరీక్షకు చదువుతు న్నంత శ్రద్ధగా పుస్తక పఠనం ప్రారంభించింది. ఆమె పక్కనున్న ఆసామి ఏం చేయడానికి తోచక యెవరితోనూ మాట్లాడ్డానికి ఖాళీగా వున్నవారె వరూ లేక నాతో మాట్లాడడం యిష్టం లేక, ప్రక్కనున్న యువతితో మాట్లాడవలెనని చేసే ప్రయత్నం, నవ్వడం, కన్ను గీటడం, దగ్గరగా జర గడం వగైరా ప్రయత్నాలేవీ ఫలించక పోగా ఎంతో బాధగా కూర్చున్నాడు. వాడిని చూస్తే జాలివేసింది. ఇంకో స్టేషనులోనో మరో స్టేషనులోనో ఎక్కడో ఈ పెట్టెలో నుంచి మారతాడానుకున్నాను. కాని తరువాత రెండు స్టేషనులు వచ్చినా అతను మారలేదు సరిగదా బాధపడడము మానలేదు. ఇలా మరి కొంత దూరం ప్రయాణం చేసేసరికి, రైలొక సొరంగంలో ప్రవేశించింది. అంతా గాఢాంధకారమైంది. ఈమార్గం అంద రికీ తెలుసు కాబోలు. ఈక్షణం కోసం నిరీక్షిస్తూ అందరూ తయారయ్యి వున్నట్టు ఏకకాలములందు ఓ ఇరవై ముద్దుల శబ్దం వినబడ్డది. నా పక్కా నున్న అమ్మాయి నాకు తెలియకుండానే లేచి తలుపు దగ్గిరనిలబడింది. ఎవరివో రెండు చేతులు నన్ను బలంగా ఆలింగనం చేసుకున్నాయి. అవి పురుషహస్తాలని తెలుస్తూనే ఉంది. యూసిల్లీ You Silly అని, ఆబంధం విడిపించుకునే ప్రయత్నంలో ఉండగా రైలు సొరంగందాటి వెలుతురులో

కొచ్చింది.

తలుపు దగ్గరున్న అమ్మాయీ, పెట్టెలో వున్న ఇతర జనాభా అందరూ మా అవస్థ చూచి జరిగినది ఊహించుకున్నారు. రైలు మార్మోగేటట్లు అందరూ ఒకటేనవ్వు. వెలుతురు రాగానే నన్నాలింగనం చేసుకో ప్రయత్నించిన మనిషి సిగ్గుపడి మొహం కందగడ్డయై రెండో వాళ్ళ కెవళ్ళకి వినపడకుండా "సారీ" అని అవతలికి జరిగాడు. మా మధ్యనున్న అమ్మాయి ఎమీ ఎరగనట్టు ముఖాన హాసమైన లేకుండా



కనురెప్పయినా కదపకుండా వచ్చి కూర్చుని తన చదువులో పడ్డది. నాకూ పట్టరాని నవ్వు వచ్చింది. కాని యెలాగో పైకి నవ్వకుండా ఊరుకోగలిగాను. ఇంతలో ఏదో స్టేషను వొచ్చింది. నాపక్క నున్న అమ్మాయికి అవతల పక్కనున్న యువకుడు గబగబాలేచి తలవంచుకొని దిగి వేరే పెట్టెలోకి వెళ్ళిపోయాడు. అతన్ని చూచి అందరూ ఒక్కసారిగొల్లుమనినవ్వారు. నేనూ ఈసారి నానవ్వునుకూడా వాళ్ళనవ్వుతో శృతి కలిపాను ఆ అమ్మాయి ఈసారి మందహాసంతో నావైపు చూసింది. నేను నవ్వుతూ అద్భుతం ఆశ్చర్యం ఇంత తమాషాగా, ఇంత చురుగ్గా మెలకువగా యెలా ఉన్నావమ్మా ఈ సొరంగం వస్తుందని నీకు తెలుసా అంత నిశ్శబ్దంగా ఎవరికి తెలియకుండా యెలా మా మధ్యనుంచి జారిపోయావన్నాను.

ఆ అమ్మాయి గట్టిగా నవ్వి "నేను ఈ దారిన చాలాసార్లు ప్రయాణం చేశానండి. ఈ సొరంగం యెప్పుడొచ్చేదీ నాకు తెలుసు ఇందులో జరిగేతంతూ తెలుసు అందుచేత అప్రమత్తతతో చురుగ్గా, నెమ్మదిగా, అడుక్కు జారి తరువాత లేచి నిలబడ్డాను నేను భయపడ్డంత పనీ జరిగింది. నాకు

జరగవలసిన అవమానం మీకు జరిగింది. చాలా సేపటి నుంచి అతను కనుసైగను చేయడం, నా దగ్గరగా జరగడం నామీద చేయి వేయబోవడం యివన్నీ గమనిస్తూ రాబోయే ప్రమాదాన్ని గుర్తించి నేను జాగ్రత్త పడ్డాను. మధ్యన మీకీ ఇబ్బంది కలుగజేసినందుకు మన్నించండి" అంది.

"ఇందులో ఎవర్ని మన్నించడానికేమున్నది. నేనేమీ కష్టపడలేదు. అవమానమూ పొందలేదు. నాకూ యీ అనుభవము ఆనందదాయకంగానే వుంది" అన్నాను.

ఆ అమ్మాయి యెంతో అమాయకంగా కళ్ళు పెద్దవిచేస్తూ "ఏమిటీ వారి ఆలింగనము మీకంత ఆనందదాయకంగా వుందా" అంది నవ్వుతూ.

"ఆ ఆనందం నీకు లేకపోయిందని విచారిస్తున్నావా యిపుడు. నా ఆనందానికి కారణం అదికాదు. అతను చేసిన విఫల ప్రయత్నానికి, తెలివి తక్కువకూ, తొందరపాటుకూ జాలివేసింది, పరాభవం జరిగింది అతనికి కాని, నాకూ, నీకూ కాదు, ఆతరువాత నీ జాగ్రత్తకూ, మెలకువకూ, చురుకుతనానికీ సంతోషం కలిగింది. మొత్తం మీద ఈఒకటి రెండు నిముషాల్లో జరిగిన సంఘటన ఆనందదాయకమంటావా కాదంటావా" అన్నాను.

ఆ అమ్మాయి నవ్వుతూ "అతను చేసిన ప్రయత్నం అసలు మీరు చేస్తారేమో అనుకున్నాను" అంది నవ్వుతూ.

అలాగయితే నువ్వలా జారిపోకపోయేదానివా అని నేనన్నాను.

"అమ్మా! అది కాదులెండి నా అభిప్రాయం" అంది.

ఇంతకూ యీ సొరంగం వస్తుందని గాని సొరంగంలో ప్రయాణమర్యాదలు యిలా వుంటాయని కాని నాకేం తెలుసు. "నేనెక్కడ నుంచో పరాయిదేశం నుంచి వచ్చినవాడిని. యింకా తగినంత అనుభవంలేదు. వుంటే ఏం జరిగేదో" అన్నాను. అలాగా! మీరు కొత్తగా వచ్చారా? విశ్వవిద్యాలయంలో చదవడానికి కొచ్చారా! ఎంతకాలమైంది వచ్చి? అని మౌనంవిడిచి, పుస్తకం మూసేసి, నాతో సంభాషణలోకి దిగింది.

"ఏం పుస్తకం కట్టి పెట్టేవేం? పుస్తకం అయిపోయిందా నువ్వు ఏదన్నా పరీక్షకు చదువుతున్నావా, నువ్వు అంత దీక్షగా చదువుతుంటే పరీక్షకన్నానులే."

"పరీక్షా గిరీక్షా నాకేమీ లేదండి. నేనొక వ్యాపార సంస్థలో స్టైనో గ్రాఫర్‌ని. సెలవులిచ్చినపుడు ఇలా యెక్కడికైనా వెళ్ళి నాలుగు రోజులు గడిపివస్తూ వుంటాను. యెవ్వరితోటీ యే పరిచయం లేందే, యెవరితో యేం మాట్లాడతాను? నా కింటిదగ్గరా స్నేహితులు తక్కువే అందులో మగ స్నేహితులు అసలేలేరు" అన్నది.

"అదెలాగు? నీ లోటూ. వాళ్ళ లోటూ. ఈ దేశంలో ఇటువంటి స్నేహాలు పిన్నల్లోనూ, పెద్దల్లోనూ విశేషంగా కనుపిస్తున్నాయి కదా? నువ్విలా ఉన్నావంటే ఏకాంతంగానే బ్రతుకుతున్నావంటే నమ్మలేకుండా ఉన్నాము. ఇటువంటి దానవు నీ వ్రత భంగమునకైనా ఒప్పుకొని నాతో సంభాషిస్తున్నావంటే చాలా సంతోషంగా ఉంది. ఎటొచ్చీ మన మీరైల్లో కలుసుకున్నాముగాని లేకపోతే నీ పరిచయం మరికాస్త పెంచుకునే అవకాశం ఉండేది ఉభయులకూ" అన్నాను. "ఇంతకు మీరెక్కడ కెళుతున్నారు" అంది. "నేను లాక్‌రాంజా అనే కుగ్రామం వెడుతున్నాను." "ఇంకనేం నేనూ అక్కడికే వెడుతున్నాను. మనిద్దరి అభిరుచులూ కలిసేటట్లున్నాయి. మీరన్నట్టు వీలునుబట్టి మన పరిచయాన్నిక్కడ వృద్ధిచేసుకోవచ్చు మీరిక్కడేదైనా బస ఏర్పాటు చేసుకున్నారా" అంది. "లేదు ఇక్కడ హోటల్ వుందన్నారు. అందులో గది తీసుకుని అక్కడ సదుపాయంగా ఉంటే వారం రోజులు ఈ ప్రశాంత ప్రదేశంలో ఉందామని వచ్చాను" అన్నాను. "అలాగా సరే యెలాగైనా అంతా సాయంకాలానికీ సముద్ర తీరానికి వస్తారు కదా? మనము అక్కడే కలుసుకోవచ్చు" అని అంటుండగా మేము దిగవలసిన స్టేషను రానే వచ్చింది. మేం దిగి యెవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయాం.

నేను అనుకున్న హోటల్‌కి వెళ్ళి గది కావలెనని అడిగాను వాళ్ళు చాలా సందేహిస్తూనే ఒక చిన్న గదిచ్చారు. అప్పటికి సుమారు సాయంకాలం ఐదుగంటలవుతుంది. నేను సామాను గదిలో పెట్టి ఊరు చూసొద్దామని బయలుదేరాను. అక్కడా యిక్కడా తిరిగి కాస్సేపు సముద్రపొడ్డున తిరిగ యేడు గంటలకు మళ్ళీ హోటలుకు చేరుకున్నాను. నే వెళ్ళేటప్పటికి మేనేజరు అక్కడ నౌకరూ నన్ను చూచి కంగారుపడుతూ చాలా నమ్రతతో, భయంతో నాదగ్గరకు వచ్చి, మమ్మల్ని మన్నించాలండి తమకిస్తామన్న గది ఇవ్వడానికి వీలులేదు. అది అదివరకే మరొకరిటి యేర్పాటయిందట. మరో గదేదీ ఖాళీలేదు. మీరింకొచోట యెక్కడైనా ప్రయత్నం చేసుకోండి అని

అన్నాడు. వాళ్ళు చెప్పింది నిజం కాదని తెలుస్తూనే వుంది. అమాటే వాళ్ళతో అన్నామ కూడాను. "మీరు చెప్పిందీ నిజంకాదని స్పష్టంగా మీ ముఖాలే చెబుతున్నాయి. యెందుచేత నివ్వరు హోటలుకు వచ్చిన వాళ్ళకు గది ఇవ్వననడానికి మీకేమి అధికారమున్నది. ఇక్కడయేమైనా వర్ణ విపక్షత ఉందా! అటువంటిది వుంటే ముందెలా అంగీకరించారు?" అంటూ దడదడా ఈ ప్రశ్నపరంపరలు కురింపించేటప్పటికి వాళ్ళు నిర్ఘాంతపోయారు. అక్కడ నుంచి వాళ్ళు కాళ్ళ బేరానికొచ్చారు. ఆ హోటలులోనే ఇండియాలో ఒక వ్యాపార సంస్థలో పనిచేసి రిటైర్ అయిన మనిషి ఇక్కడుంటున్నాడండి. ఆయన మీరు రావడం చూచాడు. మీరు వెళ్ళగానే మా దగ్గరకొచ్చి రూం ఇవ్వడానికి వల్ల కాదని చాలా సేపు మాతో పేచీ పడ్డాడండి. అందుచేతను వారి మాట కాదనలేకపోయినాం అన్నాడు భయంతో.

"అయితే అయనుండడం నాకూ యిష్టంలేదు. ఆయన్నే పొమ్మనండి" అన్నాను నిర్భయంగా. దాంతో వాళ్ళు మరీ కంగారుపడి ఆయన మాకు ఇక్కడ శాశ్వతంగా వుండేమనిషండి. ఆయనకెవరూ లేరు ఇక్కడే స్థిర నివాసమేర్పరచుకున్నాడు. మేం పొమ్మనడం భావ్యంకాద న్నారు. "అయితే నన్ను పొమ్మనడం మట్టుకు భావ్యంగా తోచిందా" అన్నాను. "లేదండి మా తప్పే" మమ్మల్ని మన్నించి మీరింకో చోటికి వెళ్ళమని మా ప్రార్థన. లేకపోతే మేం చాలా చిక్కుల్లోపడతాం అని నా రెండు చేతులూ పట్టుకొని బ్రతిమాలారు. "ఆయనెక్కడున్నాడో చూపించండి ఆయనతోటే మాట్లాడతాను." "ఆయనెక్కడికో వెళ్ళారు. ఆయన చాలా కోపదారి మనిషి మీరు నాలుగు రోజులుండి వెళ్ళేవారు. మీరు విద్యార్థులని చెబుతున్నారు. ఈ పేచీలెందుకు చెప్పండి." అన్నాడు ఆ మేనేజరు ఎంతో దీనంగా నాకూ ఆ మాటే తోచింది.

"ఇక్కడ ఇంకో హోటల్ లేదు కదా" అంటూాటే - కొండమీదకి వెడితే అక్కడ గదులు దొరుకుతాయండీ అని మేనేజర్ సలహా ఇచ్చాడు. "సరే అయితే నే వెళ్ళి ప్రయత్నం చేస్తాను గది దొరుకుతే వెడతాను. లేకపోతే ఈ రాత్రి ఇక్కడ పడుకుని ఉదయాన్నే వెళ్ళిపోతాను. ఈ దేశంలో అంతా పెద్ద మనుష్యులూ, మర్యాదస్తులూ అనుకున్నాను. నా అంచనా తప్పని ఇపుడు తెలుసుకొని విచారిస్తున్నాను" అని బయటకు వెళ్ళిపోయాను.

# 20

ఎక్కువ ప్రయాస లేకుండానే ఒక రైల్వే పోర్టర్ ఇంట్లో ఓ గది సంపాదించాను.ఆ తరువాత సామాను తీసుకొని ఇక్కడ గృహ ప్రవేశమయ్యాను. అంత ఎక్కువ పరిశుభ్రంగా లేకపోయినా ఏదో మోస్తరుగా కొంచెం వీలుగానే ఉన్నది. ఇంటి యజమానురాలు భార్యా భర్తలు నన్ను చాలా గౌరవంగా చూశారు. హోటలులో జరిగిన సంగతివిని చాలా విచారించారు. సరే అయిందేదో అయిపోయిందని ఇక్కడొక వారం రోజు లుండడానికి నిశ్చయించుకున్నాను. ఇక్కడ వాతావరణం. చాలా బాగున్నది. ఎంతో ప్రశాంతంగా ఉన్నది. ఏ విధమైన ధ్వనులూ లేక చాలా బాగున్నది. ఎంతో ప్రశాంతంగా ఉన్నది. ఏ విధమైన ధ్వనులూ లేకుండా నిశ్శబ్దంగా ఉంది. ఇలా నాలుగు రోజులు కులాసాగా గడిచింది. ఒకటి రెండు సార్లు సముద్రతీరాన రైలులో నాతో ప్రయాణం చేసిన అమ్మాయి కనపడ్డది. ఎంతో కులాసాగా, హాస్యంగా నేర్పుగా, నొప్పింపక తానొవ్వక అన్నట్టు కబుర్లు చెబుతూ వచ్చింది.

ఆరోజు రాత్రి బసలో కొచ్చి నేను భోజనం చేసిన తర్వాతను ఒక తమాషా జరిగింది. అందరికీ చెప్పవలసిన విషయం కాదు గాని, తప్పదు గనుక చెబుతున్నాను. నాకు మలబద్ధకముండేది. చాలాసేపు దొడ్లో కూర్చోవలసినచ్చేది. ఉదయాన్నవుతే తక్కిన వాళ్ళకు యిబ్బందిగా ఉంటుందని నా కార్యక్రమం రాత్రికి అలవాటుచేసుకున్నాను. ఇక్కడ వాళ్ళు కనిపెట్టారా సంగతి.



ఇక్కడున్న యిబ్బందేమిటంటే, దొడ్డికి వెళ్ళడానికి ఇంటివారి వంటగదిలో నుంచి వెళ్ళాలి. నేను రోజూ ఇలావెళ్ళే వేళకు వాళ్ళు భోజనాలు చేసుకొని, అన్ని పనులూ ముగించుకొని, భార్యా భర్తలు కబుర్లు చెప్పుకుంటూ, నా రాకపోకలు నవ్వుతూ గమనిస్తుండేవారు ఆ గదిలో కుళాయి లేని కారణాన నేనొక చిన్న జగ్గుతో నీళ్ళు తీసుకొని వెళ్ళేవాడిని. సాధ్యమైనంత వరకూ వాళ్ళకు కనపడకుండా. యజమానురాలెప్పుడో ఇది కనిపెట్టి భర్తతో చెప్పింది. దానిపైన నేను నీళ్లు ఎందుకు తీసుకెడుతున్నానో అని రెండు రోజులు తర్జనభర్జన చేసుకున్నారు. ఏదీ తేల్చుకోలేకపోయారు. నాకేమైనా సుఖవ్యాధులున్నాయేమో, అందుకు లోషన్ నీళ్లు ఏవైనా తీసుకెడుతున్నానేమో, అలాగయితే నన్నిక్కడుంచడం మంచిపని కాదు. వెంటనే ఈ సంగతేదో తేల్చుకోవాలి, అని నిశ్చయముతో నేను ఆ రాత్రి దొడ్డినుంచి తిరిగి వస్తుంటే కూర్చోమన్నారు. ఇదేమిటి ఈ మర్యాదని నా చేతిలో పాత్ర అక్కడ పెట్టి కూర్చున్నాను. వాళ్ళుకాస్సేపు లోకాభిరామాయణం మాట్లాడి "ఇక్కడ మీకు సుఖంగా ఉన్నదా, ఏమీ ఇబ్బంది లేదుకదా, మీకు ఏమి కావలసినా, ఏ లోటు జరిగినా మాతో నిర్మొహమాటంగా చెప్పండి. మాకు చేతనయినది చేస్తాం" అన్నారు. నేను సంతోషించి "నాకు ఏ యిబ్బందులూ లేవు. మీ మంచి తనం నాకెంతో సంతోషంగా వున్నది. ఇంకో వారం రోజులు కూడా ఉందామనే అనుకుంటున్నాను"అన్నాను. వాళ్లు చాలా సంతోషించారు. మరి రెండు నిముషాలు మాట్లాడి యింటి యజమాని కొంచెం భయసంకోచాలతో "మిమ్మల్నొక ప్రశ్న అడగదలుచుకున్నాను. మీరేమీ అనుకోకండి" అన్నాడు. "తప్పకుండా అడగండి దానికి ఇంత ఉపోద్ఘాతమెందుకు" అన్నాను. తమరు ఈ జగ్గు ఎందుకు తీసుకు వెడుతున్నారన్నాడు. నీళ్ళకు అన్నాను "ఎందుక"న్నాడు. ఎందుకేమిటని తెల్లబోయి, ఈ ప్రశ్న ఎందుకడుగుతున్నారా అని ఒక అర్థక్షణం ఆలోచించాను. నాకు సమాధానం స్ఫురించి "మా దేశంలో కాగితం ఉపయోగించం, శుభ్రంగా ప్రక్షాళన చేసుకుంటాం" అని నిర్మొహమాటంగా చెప్పేటప్పటికి వాళ్లు విరగబడి నవ్వి తమకు కలిగిన సందేహాలు నిర్మొహమాటంగా చెప్పి క్షమాపణ వేడుకున్నారు. నేను నవ్వుకుంటూ నా గదిలో కొచ్చాను.

జీవితం వొడుదుడుకులు లేకుండా ప్రశాంతంగా నడిచిపోతోంది. చదువు కూడా బాగా సాగుతోంది. బారిష్టరు పరీక్ష కూడా చదవడానికి అవసరమైన ఏర్పాట్లు చేసుకొని లండన్ లింకన్‌పిన్ చేరాను. ఇంటి దగ్గర

అంతా క్షేమంగా వున్నట్లు వర్తమానం తెలిసింది. నేనింక చదువు పూర్తి అయ్యేదాకా ఇంటికి రానని మా నాన్న నిశ్చయం చేసుకున్నాడు. ఇకచేసేదేం లేక పరిస్థితులకు తల ఒగ్గి వూరుకున్నాడు మా నాన్న. ఇక్కడ చదువుకూడా నాకెంతో ఉత్సాహంగా వుంది. బాగా చదువుతున్నాను.

మంచి తెలివైన విద్యార్థి అనే పేరు వచ్చింది. నానాటికీ మిత్రబృందం పెరుగుతున్నది. ఇండియన్ అసోసియేషన్‌లో నన్నొక సహాయకార్యదర్శిగా కూడా యెన్నుకున్నారు. అక్కడ సభలు సందర్భాల్లో యెక్కువ పాల్గొనడం జరుగుతోంది. ఆ రీతిగా కూడా పరిచయాలెక్కువైనాయి. ఏడాది పైనయింది వచ్చి. ఇంకొక్క రెండు మూడు సంవత్సరములు దైవానుగ్రహము వల్ల యిలా సాగుతే హాయిగా స్వదేశం చేరిపోవచ్చు అనుకుంటూ యెన్నెన్నో కలలు కంటూ కాలక్షేపం చేసుకుంటున్నాను. మొదట మా ప్రయివేటు మాష్టరుతో తరచు సంప్రదించుతూ క్లాసులో పాఠ్యపుస్తకాలే కాక అనేక ఇతర గ్రంధాలు సాంఘిక, రాజకీయ, ఆర్థిక వ్యవస్థలకు సంబంధించినవి చదవడం నేర్చుకున్నాను.



అంతే కాకుండా సారస్వతానికీ, కళకూ, తర్కశాస్త్రానికీ సంబంధించిన పుస్తకాలు మరీ యెక్కువగా చదవడం సంభవించిది. నేను బయలుదేరిన వేళ మంచిది అని సంతోషిస్తుంటే, నా స్వప్నాలన్నీ తలక్రిందులయ్యే సూచనలు కనబడుతూ వచ్చాయి. దినపత్రికలు చూస్తుంటే రోజు రోజుకీ ప్రపంచం తారుమారయ్యే సూచనలు, తత్సంబంధమైన వార్తలు గుప్తంగానూ, బాహాటంగానూ వచ్చిపడుతున్నాయి. రష్యాలో జార్ చక్ర వర్తుల రాజ్యం టప్‌న్ ఎగిరిపోతోంది. జర్మనీ విపరీతమైన బలం పుంజుకుని ప్రపంచానంతటినీ కబళించే బ్రహ్మాండమైన ప్రయత్నం చేస్తోంది. యెటు చూచినా అస్తి మితమే కాని స్థిమితం కనబడ్డంలేదు. యేం జరుగుతుంది. ఈ భీతావహమైన పరిస్థితులు యెలా పరిణమిస్తాయి. మన మేమవుతాం అని ప్రతివాడూ, ప్రతిరోజూ యెదటివాళ్ళనూ, తన్ను తానూ ప్రశ్నించు కుంటూ భయభ్రాంతులై, కాలక్షేపం చేస్తున్నారు. యుద్ధం రానే వచ్చింది. జర్మనీ అమాంతం ఫ్రాన్సు మీద విరుచుకుపడి నల్లేరుపై బండి నడక లాగ, జగన్నాథ రథ యాత్రలాగ నిముషాల మీద ముందుకు తరలి వస్తోంది ఒకనాడు ఎడింబరోలో ఆస్క్విత్ ప్రైమ్‌మినిస్టర్ ఆఫ్ ఇంగ్లండు వస్తున్నాడనే వార్త పత్రికల్లో చూచాను. ఆ రాత్రే ఇంగ్లండు జర్మనీతో యుద్ధం చేయ నిశ్చయించుకుంది. అలాగని ప్రకటించింది కూడాను. ఇది జరిగిన మర్నాడు ఆస్క్విత్ బ్రిటిష్ ప్రధాని ఎడింబరో రానే వచ్చాడు. అషర్‌హాల్ అనే హాలులో సభ ఏర్పాటయింది. ఆ హాలు పైకి సామా న్యంగా కనపడ్డా, లోపల ఆరూ ఏడు వేలమంది సుఖంగా కూర్చోడానికి తగ్గ ఏర్పాట్లు కావించబడింది. నేను విశ్వప్రయత్నం చేసి ఇండియన్ అసోసియేషన్ జాయింటు సెక్రటరీగా ఈ సభకు హాజరుకావడానికి ఒక టిక్కట్టు సంపాదించుకున్నాను. బ్రిటిష ప్రధానిగా ప్రపంచ పరిస్థి తులన్నిటినీ సమీక్షించి యుద్ధంలోకి యెందుకు దిగవలసి వచ్చిందో అనేక కారణాలుచెప్పి ప్రజలు భీతావహులుకాకుండా ధైర్యంగా వుండి అన్ని విధాలా తమకు తోడ్పడవలసిందని ప్రజలకు ప్రబోధంచేశారు. అంత బ్రహ్మాండమైన వుపన్యాసం నేనెప్పుడూ వినలేదు. అక్కడ చేరిన వారంతా నిట్టూర్పు విడవడానిక్కూడా భయపడినంత నిశ్శబ్దంతో ఉపన్యాసం విన్నారు.

ఉపన్యాసం పూర్తికాగానే మామూలు చప్పట్లు కూడా లేకుండా జనం అతా లేచి నుంచున్నారు. వెంటనే ఆంగ్ల జాతీయగీతం ఆలపించడంతో సభ ముగిసింది. సభికులంతా ఎవరిస్థానాల్లో వాళ్ళు నిలబడే వున్నారు. ప్రధా నమంత్రిగారూ వారి అనుయాయులూ ప్లాట్‌ఫారం దిగి బైటికొచ్చారు. వారు వెళ్ళడం నా పక్కనుంచే వెళ్ళారు. ప్రధానమంత్రి నా దగ్గరకు

రాగానే పులకాంకితుడనై, భక్తిభావముతో నమస్కరించాను మన పద్ధతిలో ఆయన నాకేసి చూసి మందహాసంచేసి వెళ్ళిపోయారు. నేనా మందహాసంతో ఆకాశంలో తేలిపోయినట్టుగా అయ్యాను. హాలులో జనమంతా ఏ హడావిడీ లేకుండా ఒక్క వరుసలో బైటికొచ్చారు. నేనా సభా ప్రధాని ఉపన్యాసము తలుచుకుంటూ ఏదేదో ఊహా ప్రపంచంలోకి పోయి నేలమీద నడుస్తున్నానో, ఆకాశంలో విహరిస్తున్నానో తెలియని స్వప్నావస్థలో ఎవ్వరితోటీ మాట్లాడకుండా నా బసకు చేరుకున్నాను. యుద్ధ ప్రకటన కాగానే క్షణంలో వాతావరణం మారిపోయింది. ఆ మర్నాటి నుంచి హిమపాతం పడ్డట్టు అందరిలో ఉత్సాహం చల్లారిపోయి, అందరి వదనాల్లో ఆనందం ఆరిపోయి ప్రతివాడూ ఏదో ఆందోళనతో, భయంతో ఉత్తరక్షణంలో ఏమవుతామనే ఆలోచనలతో అంతిమవిజయం ఎవరిదోనన్న సందేహంతో తిరుగుతున్నారు తప్ప మామూలు ధోరణిలో నిశ్చింతా, నిర్భయం, ఆత్మవిశ్వాసం, ధైర్యసాహసాలూ ఎక్కడా కనబడకుండా పోయాయి. చాలా చిత్రమనిపించింది. యుద్ధాలను గురించి పుస్తకాల్లో చదవడమేగాని ప్రత్యక్షానుభవం మనకెక్కడిది? అందుచేతను నాబోటి యువకులకు యుద్ధ స్వరూపం దాని పరిణామం దైనందిన జీవితాన్ని అది ఎలా మార్చగలిగేది ఇత్యాది విషయాలన్నీ అనుదినం కూడా ప్రత్యక్షంగా అనుభవంలోకి వస్తున్నాయి.

వారం పదిరోజులు గడిచేటప్పటికి ఎడింబరో పట్టణమే. దాని స్వరూపమే, దాని పద్ధతులే మారిపోయి ఊరు ఊరంతా యుద్ధభూమిలా సైనికుల్లా నిలబడ్డదేమో అనే భావము కలిగింది. మామూలు సంచలనం కనపడకుండా ఎటు చూచినా యుద్ధ సన్నాహాలే. ఊరిబయట ఏ కొండల మీద చూచినా యుద్ధ కవాతులే పద్దెనిమిది సంవత్సరములు పైబడ్డ ప్రతి యువకుడూ యుద్ధంలో చేరిపోతున్నాడు. తన చదువు, తన తెలివి, తన ఐశ్వర్యం తన సంపాదన అన్నీ విడిచిపెట్టి, ధనికులూ, పేదలూ, విద్యార్థులూ, కార్మికులూ, అందరికి ఒకటే ఆలోచన, ఈ ప్రమాదం నుంచి దేశాన్ని రక్షించాలి. ఆబాధ్యత మనదేగాని మరెవ్వరిదీ కాదు. మనమంతా వెళ్ళి దేశంకోసం మన రక్తం ధారపోసి మన మందరం నిహతులమైనా, జర్మనీని ఈ జన్మలో ఇంక లేవకుండా అధఃపాతాళానికి తొక్కి మనం విజం సాధించాలి. "లాంగ్‌లివ్ ఇంగ్లండు రూల్ బ్రిటానియా గాడ్ సేవ్ దికింగ్" అనే నినాదాలు తప్ప మరేమీ వినపడ్డం మానేసేయి. ఎవరి ముఖంలోనూ నవ్వూ తుళ్ళూ కనిపించడం మానేసింది. పగలంతా ఆకాశం మీద విమానాలు బయ్యిమని శబ్దంచేస్తూ విహరించడం మొదలు పెట్టాయి.

ఇంతకు ముందెప్పుడూ ఏ యుద్ధంలోనూ విమానాలు ఉపయోగించలేదట ఎవరూను, అందుచేతను అందరికీ ఇదో కొత్తగానూ, కొంత భయంగానూ ఉన్నా వీటితోనే మనం విజయం సాధిస్తాం అనే ధైర్యం కూడా ప్రజల హృదయాల్లో స్థిరస్థానం ఏర్పాటు చేసుకుంది. రాత్రులు ఏ వీధిలోనూ దీపాలుండకూడదని అధికారులు శాసించారు. ఇంట్లో దీపాలు కిటికీల్లోంచి వెలుపలకు కనపడకుండా నల్ల తెరలు దట్టమైనవి వేసుకోవలెనని హెచ్చరికలు పంపించారు. రాత్రులు తిరిగే మోటార్లకు కూడా ముందుండే దీపాలు బాగా తగ్గించి ఆమోటారు లైట్లకు పై భాగం నల్లరంగు వూయించారు. కొంచెం యించుమించుగా ప్రతి రెండు మూడు ఫర్లాంగులకూ ఒక భూగృహం లాంటిది విశాలమైనది నిమిషాలమీద నిర్మాణాలు చేశారు. పైన తిరిగే శత్రు విమానాల నించి బాంబులు పడటితే చాలా ప్రమాదం కనుక ప్రజలు భీతిల్లక, కంగారు బడక, తొక్కిసలాటు లేకుండా ఈ భూగర్భమందిరాల్లో తలలు దాచుకోవలెను. విమానాలు వస్తుంటే ముందుగా రైలు కూతలాంటి కూతవినపడుతుంది. అది వినపడగానే స్త్రీ, బాల, వృద్ధులంతా ఈ భూగృహాల్లోకి పారిపోవాలి. రోడ్డుమీదున్న పురుషులు ఎక్కడి వారక్కడే బోర్లగిలా పడుకోవాలి. ఇలాంటి ఏర్పాట్లన్నీ ప్రజలకు తెలియపర్చి ఆ ఆపత్సమయ మందు ప్రవర్తించ వలసిన విధానాలు నాటకాల్లో రిహార్సల్లాగా ప్రజలకు అలవాటు చేశారు. పెద్ద పెద్ద ఫ్యాక్టరీలలో మామూలుగా ఉత్పత్తిచేసే వస్తువులను నిలుపుచేసి, అన్నిటిలోనూ యుద్ధావసర వస్తువులనే తయారు చేయించడం మొదలెట్టారు. యాభై ఏళ్ళుపైబడ్డ పెద్దలు కూడా తమని కూడా యుద్ధంలోకి రానిమ్మని, అలా వీల్లేని పక్షమునందు దేశ సేవకు మరో విధంగానే తమని ఉపయోగించుకోమని లక్షలాది జనం అధికార్లను వత్తిడి చేయడం మొదలెట్టారు. యువతులందరూ లక్షలాది జనం యుద్ధ భూమిలో గాయపడ్డవారి సంరక్షణ కోసం రెడ్‌క్రాస్ అనే సంస్థలో చేరి తర్ఫీదు పొందడం ప్రారంభించారు. ఇలా ప్రతిజీవీ, ప్రతి వస్తువూ, ప్రతి అణువూ దేశరక్షణ కోసమే ఉన్నదా అన్న భావం ప్రతి మనిషిలోనూ కలిగేట్టున్నది. ఎన్నడూ కనీవినీ ఎరుగని, ఊహకు కూడా అందని ఈ విపరీత పరిస్థితి పరిణామాలు చూస్తుంటే నేను విభ్రాంతుడనై ఇంత సన్నాహం, ఇంత ప్రబోధం అవసరమా అనుకునేవాడిని. ఈ యుద్ధజ్వాల ఇన్ని దేశాలకు ఎందుకు వ్యాపిస్తుందో అర్థంకాలేదు. ఇన్ని దేశాలొక్కసారి యుద్ధంలోకి ఎందుకు దిగాయో అసలే అంతుపట్టడం లేదు. ఏమైనా జరుగుతున్న విషయమూ, పరిస్థితులూ ఇవి గమనించక తప్పదుకదా అదివరకు ఎంతో స్నేహం, ఆదరణ, అభిమానం చూపిస్తున్న వారందరూ కూడా

ఈ మనదేస్తులను అనుమానంతో భయంతో చూడడం మొదలెట్టారు. మేం పైవాళ్ళం ఇక్కడ మీకు స్థానం లేదన్నట్టు అనేక విధాల మాకు స్ఫురింపజేస్తున్నారు. మేంకూడా యుద్ధంలో చేరుతాం. మమ్మల్ని కూడా చేర్చుకోండని మనవాళ్ళు యెంత బ్రతిమాలినా యెవ్వరినీ చేర్చుకోలేదు. మమ్ముల్ననూ, మా దినచర్యలనూ, రహస్యంగా, అనుక్షణం ఎవరో గమ నిస్తున్నారనే భావన మా అందరిలోనూ కలిగింది. ఈ అనుమానం ఎందుకు గలిగిందంటే ఏ ఒక్కరమూ సరియైన సమాధానం చెప్పలేని స్థితిలో ఉండిపోయాం. మా ఉత్తరాలు మాలో ఎవరికి ఎక్కడనుంచి వచ్చినా అవన్నీ పోస్టాఫీసులో మాకు తెలియకుండా తెరిచి దేశభాషల్లో వన్నీ ఆంగ్లంలోకి తర్జుమా చేయించుకొని అవి మళ్ళీ అనవాలు తెలి యకుండా కవర్లు అతికించి ఆ తరువాత మాకు బట్వాడా చేసేవారు. ఇందులో అతిశయోక్తి ఏమీ లేదన్న సంగతి జగద్విదితము. ప్రతివాళ్ళూ మేము ఎక్కడ కనపడ్డా మేముకూడా శత్రుపక్షంలో చేరేమో, చేరబో తున్నామో అనే దృష్టితో మమ్ముల్ననూ చూడ్డం తప్పనిసరయింది. పోనీ యిదంతా భరించలేక ఇంతటితో చదువు ముగించి ఇంటికే పోదామంటే దానికీ పర్మిషననీ, పాస్‌పోర్టని బోలెడంత తతంగం ఉరుపుతేనేగాని యెవర్నీ కదలనివ్వడంలేదు. ఇలా ఉండగా భారతీయులంతా కూడా యుద్ధంలోచేరి తమకి అనుకూలంగా సహాయం చేయడానికి సంసిద్ధులై వున్నారనే వార్త ఆంగ్ల పత్రికలన్నిటిలోనూ కనబడ్డది. దానితో మామీద అనుమానం కొంత తగ్గి విశ్వాసం ఏర్పడ్డం మొదలెట్టింది.

ఇలా వుండగా ఒక రోజు మధ్యాహ్నం మేమంతా విద్యాలయంలో క్లాసుల్లో వుండగా బ్రహ్మాండమంతా ఒక్కసారి బద్దలయినంత భయంక రమైన శబ్దం వినబడ్డది. మా విశ్వవిద్యాలయమంతా దద్దరిల్లిపోయింది. భూకంపమా అనుకున్నాం. అదికాదు. విమానాల దాడా అనుకున్నాయం. ఎక్కడా విమానాల ధ్వనేలేదు. అక్కడ అక్కడేనన్న మాటేమిటి ఊరంతా అశేషజనం హడలిపోతూ ప్రాణాలరచేతుల్లో పెట్టుకుని కూర్చున్నారు. మళ్ళీ ఇంకో మాటు, ఇంకోమాటు రెండుమూడుసార్లు, ఆ శబ్దతాలు వినపడ్డాయి. మా ప్రొఫెసరు ఉపన్యాసము కట్టిపెట్టి తలవంచుకొని కళ్ళుమూసుకొని భగవత్ ప్రార్థనచేస్తున్నట్టు నిలబడ్డాడు. మరోసారి శబ్దం అయిన తర్వా తను మరే శబ్దమూ వినబడలేదు. మరో అయిదు నిముషాలు అందరూ నిశ్శబ్దముగా ఉండిపోయాం. ఇంతలో ఒక నౌకరు మా ప్రొఫెసరుగారికి ఒక చీటీ చూపించి వెళ్లిపోయాడు. వారుమమ్ముల్ను నిశ్శబ్దంగా ఇళ్ళకు వెళ్ళిపొమ్మని సెలవిచ్చి పంపించేశారు. మేము భయంతో, దడతో ఒక

రితో ఒకరు మాటయినా మాట్లాడకుండా మా బసలకు బయలుదేరాం. దారిలోనే ఆ శబ్దం యేమిటో మాకు తెలిసిపోయింది. ఎడింబరోకి సమీపం లోనే కొద్దిమైళ్ళ దూరంలో ఫర్తుఆఫ్ ఫోర్తు అనే ఓడరేవు వున్నది. స్కాట్లండు తీర సంరక్షణకు అక్కడ యుద్ధ నౌకలన్నీ యుద్ధ సన్నాహంతో వున్నాయి. జర్మనీవాళ్ళు ఇది ఎలా కనిపెట్టారో కాని కనిపెట్టి రెండో కంటి వాళ్ళకి తెలియకుండా జలాంతర్గాములతో (సబ్ మెరీన్లు) వచ్చి టార్పిడో అనే ఫిరంగితో ఇక్కడున్న యుద్ధనౌకలను మూడు దెబ్బలతో ముంచేసి నిర్భయంగా వెళ్ళిపోయారని అందరికీ తెలిసిపోయి భయభ్రాం తులనుచేసింది. మేం చేసేదేంలేక ఎవరి బసకు వ వాళ్ళు చేరుకున్నాం.

# 21

జనమంతా యుద్ధకాల జీవితానికి క్రమేణా అలవాటుపడసాగేరు. భయం వదలకపోయినా మృత్యువు నెపుడూ సన్నిహితంగానే, అతి సన్నిహితంగానే వున్నదని తెలిసినా ఈ రోజుల్లో ఈ యుద్ధపద్ధతుల్లో మృత్యువు రణరంగంలోనే కాక యెక్కడపడితే అక్కడ ప్రత్యక్షమవుతుంది, అనే సత్యం అందరూ తెలుసుకున్నా, యేదో మొండి ధైర్యంతో, యేదో నిర్లక్ష్యంతో యెలాగైనా చచ్చుయినా శత్రువులను రూపుమాపి దేశాన్ని రక్షించాలనే భావం, ప్రతి హృదయంలోనూ నాటుకుపోయింది. యెవరు శత్రువు యెందుకు మనం శత్రువనుకుంటున్నాం? అనే ప్రశ్న పరంపర కొందరు వెలిబుచ్చినా దానికి సమాధానం చెప్పవలసిన అధికారులు మౌన ముద్రవహించి శత్రు సంహారం చేయడమే మనవిధి. మన ధర్మము అది తప్ప తక్కిన విషయాల తర్క వితర్కములతో మీకేం పనిలేదని ప్రబో ధాలు చేస్తున్నారు. దైనందిన జీవితం యేదో ఒక దారిన నడుపుకోడం అలవాటు చేసుకొంటూంటే ఒకనాటి రాత్రి సుమారు మూడు గంటల వేళపుడు శత్రువిమానాలు వస్తున్నాయని సూచనగా కూడా వినబడేసరికి నిద్దరమత్తులో వున్న అశేష జనం అబాల గోపాలం వులిక్కిపడి నిద్ర నుంచి లేచి భయభ్రాంతులై, బట్టలు మార్చుకోవాలా అక్కడలేదా అనే మీమాంస పూర్తి కాకుండానే విమానాలు రావడం, అక్కడొకటి, అక్క డొకటి బాంబులు పడేసి ఇక్కడి విమానాలు పైకెగిరే లోపుననే, శత్రు విమానాలు పారిపోవడం కూడా జరిగింది. చాలా మంది స్త్రీ పురుషాదు లందరూ పడక దుస్తులతోనే భయభ్రాంతులై వీధిలోకి పెరుగెత్తుకొచ్చారు. అటూ యిటూ రక్షణ గృహాలు వెతుక్కుంటూ పరుగులు తీసేరు. ఒక

ముసలాయనా, ఒక ముసలావిడ రోడ్డుమధ్యన పరుగెడుతున్నారు. వారు దంపతులు అవునో, కాదో తెలియదుకాని పరుగెడుతున్న వాళ్ళలా ఆగిపోయి యేదో జ్ఞాపకమొచ్చినట్టు ఒక క్షణం నిలబడి అమాంతం రోడ్డు మధ్యగా ఇద్దరు కూడబలుక్కున్నట్లు దబీమని బోర్లగిలాపడుకున్నారు. అటూ యిటూ పరుగెడుతున్న జనం ఇదేమిటే వీళ్ళు యిలా పడిపోయారు కొంపతీసి భయంతో చావలేదుకదా, అని వాళ్ళదరికి చేరి పైకి లైవతీయ ప్రయత్నిం చారు. అరక్షణంలో కొన్ని వందలమంది చుట్టూ చేరారు. యింతలో వాళ్ళంతటవాళ్ళు దగ్గరకొచ్చిన వాళ్ళ చేయూతతో గజగజలాడుతూ లేచి నిలబడ్డారు. జనమంతా హిప్‌హిప్ హురే అని సంతోషంతో అరుస్తుండగా విమాన దాడి అయిపోయిందని క్షేమంగా ఇంటికి వెళ్ళవచ్చునని తెలియ పర్చడానికి సైరన్ కూత వినబడ్డది. అది వినేసరికి భయంలోంచి బయ టపడి అందరూ ఒక్కసారి నిట్టూర్చినట్టూ పెద్దనవ్వు నవ్వుకుంటూ ఒకరి దుస్తులనొకరు చూచి సిగ్గుపడుతూ గృహోన్ముఖులయ్యారు.

ఈ రీతిగా యిదో కొత్త అపద వచ్చిపడిందని జనంలో మళ్ళీ భయం బయలుదేరినా యెలాగో ధైర్యం తెచ్చుకొని కాలక్షేపం చేసుకుంటున్నారు. ఈ విమాన దాడులలో జన సమూహానికి సహాయపడటానికి కొత్త రక మైన రక్షక భటులు ఏర్పాటై, యిరవైనాలుగ్గంటలూ వాళ్ళు రోడ్లంట గస్తీ తిరగడం ఒక కొత్త దృశ్యం. సాయంకాలం మామూలుగా కొండల మీదికి వెళ్ళడం తగ్గించారు జనం. నిత్యజీవితం అనేక విధాల కేవలం స్తంభించకపోయినా కుంటుపడ్డదని చెప్పక తప్పదు.

మేము కాలేజీకి మామూలుగా వెడుతూనే ఉన్నాం పాఠాలూనూ మామూలుగానే జరుగుతూనే వున్నాయి, ఒకరోజు ఊళ్లో అంతా జాతీయ పతాకాలు చిన్న చిన్నవి సూదులు గుచ్చి వీధులలో అమ్మడం మొదలెట్టారు. ప్రతివాళ్ళు ఆబాలగోపాలమూ ఒకళ్ళు కూడా విడవకుండా కొంటున్నారు. ఈ రాబడంతా యుద్ధ నిధికి అని అందరకూ తెలియపర్చారు. మేమందరం తలోటీ కొని మా కోట్లకు తగిలించుకొని క్లాసులకి హాజరయ్యాం. క్లాసులో పాఠం జరుగుతోంది. హఠాత్తుగా మా వెనకాల బల్లల్లో కొంచెం సంచలనం బయలుదేరింది. కుడిపక్క నుంచి ఇద్దరూ, యెడమ పక్కనుంచి యిద్దరూ యువతులు జాతీయ పతాకవర్ణములతో తయారైన దుస్తులు ధరించి ఆ రంగులే నెత్తిన సిపాయి టోపీ ధరించి క్లాసు మధ్యన అందరిదగ్గరా యుద్ధ నిధికి వసూళ్ళు ప్రారంభించారు. వారి నలుగురూ ఒకచేతిలో వీధిలో మేం కొన్నలాంటివి చిన్నచిన్న జాతీయ పతాకాలు పళ్ళెంనిండా పోసు

కుని రెండువ చేతిలో పైన రంధ్రముండి తక్కినదంతా సీలు చేసిన డబ్బీలతో, మనిషి మనిషి దగ్గరి వచ్చికే వసూళ్ళు ప్రారంభించారు వాళ్ళు లోపలకు ఎలావచ్చారో, యెవరుతీసుకొచ్చారో యెవరికి అర్థం కాలేదు. అక్కడ వాళ్ళను మీరిక్కడ కెలా వచ్చారని డబ్యాయించడానికి కాని, కోప్పడడానికిగాని వీలయిన సమయమూ కాదు. ఎవళ్ళకు తోచినది వాళ్ళు నిశ్శబ్దంగా నవ్వుతూ డబ్బీలలో పడేస్తున్నారు. ప్రొఫెసరుగారు నిర్ఘాంతపోయి ఈ దృశ్యం చూస్తూ స్తంభించి పోయినట్టు నిలబడిపోయారు. ఒకర్నికూడా విడిచిపెట్టకుండా క్లాసులో ఉన్న విద్యార్థులందరి దగ్గరా వాళ్ళు వసూలు చేసి తిన్నగా ప్లాట్‌ఫారం ఎక్కి ప్రొఫెసర్‌గారి వద్దకు వెళ్ళి ఈ వైపున ఇద్దరు, ఆవైపున ఇద్దరూ నిలబడి నలుగురూ పతాకాలు తీసి వారికోటుకి గుచ్చి, నవ్వుతూ చేతిలో డబ్బీని ముందుకు జాపారు. ప్రొఫెసరుగారు మందహాసం చేస్తూ జేబులు తడుముకోవడం మొదలెట్టారు. ఏ జేబులో ఒక పెన్నీ కూడా చేతికి తగలకపోయేసరికి తెల్లబోయి ఏమనాలో తోచక నిలబడిపోయారు. కుశాగ్రబుద్ధులైన విద్యార్థులంతా ఆయన యిబ్బంది గ్రహించి ఎవరికి తోచిన, యెవరి చేతికందిన పెన్నీలు అరషిల్లింగులు, షిల్లింగులు ఈల వేస్తూ ప్లాట్‌ఫారం మీదకి గిరవాటెట్టారు. ఆ పిల్లలు నవ్వుకుంటూ అవన్నీ ఏరుతూ కూర్చున్నారు. మా ప్రొఫెసర్‌గారు ఈ వేడుక చూచి మళ్ళీ ముఖంలో మందహాసం చిందిస్తూ ఈ వేళ కిదిచాలుననుకుంటాను. ఇంతటితో క్లాసు ముగిద్దాం అని వారు రూంలోకి చక్కాపోయారు. విద్యార్థులంతా కరతాళ ధ్వనులు చేస్తూ నవ్వుతూ కొందరు డబ్బులేరడంలో పిల్లలకు సహాయం చేస్తుంటే మేమంతా బయటకు నడిచాం.

యిక్కడ ఏం జరిగినా ఏఉపద్రవమొచ్చినా ప్రొఫెసర్లు ఉద్రిక్తులు కారు. ఆగ్రహం ప్రదర్శించరు. ఏ విషమ పరిస్థితి వచ్చినా ప్రశాంతంగా యెదుర్కొని విద్యార్థులతో పేచీలు పెట్టుకోకుండా వాళ్ళ మనసులు నొవ్వకుండా వ్యవహరిస్తారు. వారు పాఠం చెప్పేటప్పుడు టైం కాగానే గంట వినపడటనవసరం లేకుండానే రెండుమూడు నిముషాల ముందుగానే వారి ఉపన్యాసం ముగించి క్లాసు విడిచి పెడతారు. ఒకరోజున ఒ తమాషా జరిగింది. ఆ రోజు ఇంగ్లీషు పాఠం జరుగుతోంది. పన్నెండు గంటలకు క్లాసు విడిచి పెడితే అంతా ఫలహారాలకూ, భోజనాలకూ యిళ్ళకూ పోతారు. ఆ రోజున ప్రొఫెసర్‌గారు తన్మయులై, పాఠం యెంతో చక్కగా చెబుతున్నారు. కాలం యెవరూ గమనించలేదు. పన్నెండు కూడా అయిపోయింది. కొందరు. విద్యార్థులలో అశాంతి బయలుదేరి కొంచెం శబ్దం చేయడం

మొదలెట్టారు. ప్రొఫెసర్‌గారి దాకా ఆ శబ్దం ప్రసరించలేదు. మరో పది నిముషాల వరకూ ఉపన్యాసం సాగింది. విద్యార్థులు గ్యాలరీ మీద తమ పాదరక్షలతో చప్పుడు చేయడం మొలెట్టారు. ఏమిటి శబ్దమని ప్రొఫెసర్‌గారు ప్రశ్నార్థకంగా విద్యార్థులకేసి చూశారు. దానికి సమాధానంగా మరింత ధ్వని చేయడం మొదలెట్టారు. అప్పటికాయన అసలు విషయం గ్రహించుకొని, "నాయనలారా నేను పరాకుగా కాలంగమనించక, మీ కిబ్బంది కలుగజేసినట్టున్నాను. కాని నేను వెదజల్ల వలసిన ముత్యాలు, మరికొన్ని ఉండిపోయినాయి. తరువాత మీయిష్టం". ( I am sorry Gentlemen, but I have a few more pearls to throw away) అన్నారు నవ్వుతూ. throwing pearls before swine అని ఆంగ్లంలో ఒక సామెతున్నది. పందుల ముందు ముత్యాలు జల్లితే వాట్లకు ఏం తెలుస్తుంది? అవి ముత్యాలనీ, విలువైనవనీ. ఆ మాట ప్రొఫెసర్ అనడంతోటే మళ్ళీహాలంతా నిశ్శబ్దమయిపోయింది. ఒకడు కదిలితే ఒట్టు. గట్టిగా వూపిరి కూడా పీలుస్తే ఒట్టు. ప్రొఫెసర్‌గారు మందహాసం చేస్తూ మరి ఒక పావుగంట ఉపన్యాసము గావించి "అబ్బాయిలూ మీరింక యింటికి వెళ్ళచ్చు."అని

"క్షుద్బాధ గ్రహించుకోలేక పాఠంలో నిమగ్నుడనన్తై మిమ్మల్నింత సేపు కూర్చోపెట్టి బాధ కలిగించాను, మీరేమీ అనుకోకుండా మీ యిళ్ళకు వెళ్ళి ఇంత ఆలస్యమైనందుకు మామూలు మోతాదు కంటే రెట్టింపుగా, యుద్ధం విషయం కూడా మరిచిపోయి భోంచేయండి" అని ఆయన గదిలోకి చక్కాపోయారు. ఇక్కడ పద్ధతిది. ప్రొఫెసర్లకూ, విద్యార్థులకూ మధ్యనుండే అభిమానం, గౌరవం అటువంటివి. మనదేశంలో అయితే అటువంటి అల్లరి చేసిన విద్యార్థులకు యెటువంటి కఠినశిక్ష పడేదో వూహించడం కూడా కష్టం.

ఇక్కడ ప్రొఫెసర్లకు చాలామందికి చతురోక్తి, హాస్యోక్తి, సమయస్ఫూర్తి చాలా యెక్కువ. ఇక్కడ పద్ధతేమిటంటే ప్రొఫెసరుగారు క్లాసుకి యే కారణం చేతనైనా రావడానికి వీలు లేకపోతే ఈ వేళ మీ క్లాసుకు పాఠం చెప్పడానికి నాకు వీలుపడదు. అని ఒక కాగితం మీద వ్రాసి క్లాసు బయటనున్న కారిడార్‌లో నోటీసు తగిలిస్తారు. అలాంటి నోటీసు మాకా రోజున ప్రత్యక్షమయింది. The Professor will not be able to meet his classes today అని నోటీసున్నది.

మేం చూచి బయటికి వెడుతుంటే ఒక అల్లరి




పిల్లవాడు తను తెలివైన వాడిని అనుకొని ప్రొఫెసర్‌గారి మీద ఛలోక్తి విసురుదామని ఆ నోటీసు దగ్గరికి వెళ్ళి Classes అనే శబ్దంలో C అనే మొదటి అక్షరం కొట్టేసి చక్కాపోయాడు. పోతే మిగిలింది Lasses అనగా ఆడపిల్లలని అర్థం. మరునాడు ప్రొఫెసర్‌గారు ఇది చూచి ఏమీ ఆగ్రహించకుండా, యెవరిని పల్లెత్తుమాట అనకుండా కుండా L అనే రెండో అక్షరం కొట్టేసి మామూలుగా పాఠం చెప్పకు చక్కాపోయారు.

చాలామంది ఆ నోటీసు బోర్డువైపు చూడక ప్రొఫెసర్‌గారు చూసేరా! లేదా? చూస్తే కోపం రాలేదా? అని తమలో తాము తర్జన భర్జన చేసుకుంటూ క్లాసు కాగానే ఏకముఖంగా అందరూ నోటీసు బోర్డు వైపు పరిగెత్తి చూచేసరికి, యల్ పోయి, Assesమిగిలింది. మా ఎత్తుకు ప్రొఫెసర్‌గారు వేసిన పై ఎత్తుకు మేము సిగ్గుపడి తల వంచుకొని చక్కాపోయాం. ఇటువంటి పెంకెతనాన్ని ఎంత చతురతతో సర్దుకుపోయారు ప్రొఫెసర్‌గారని ఆశ్చర్యపోయాము మాలో మేము. ఆయన సమయస్ఫూర్తికి అభినందిస్తూ చక్కాపోయాం.

# 22

ఈమధ్యను ఒకనాడు యెన్నడూ అనుకోని, ఊహించని తమాషా ఒకటి చేశాడు మా స్నేహితుడు. ఇదివరకు వేరే సందర్భంలో కూడా అతని పేరు వచ్చింది. ఇక్కడున్న ఆంధ్రులందరిలోనూ అతను బహుచురుకైన వాడు మాటకారి. అంతేకాకుండా హాస్యప్రియుడు, మంచి వాక్చమత్కృతి

కలవాడు. అందరినీ మాటలతో మురిపించి మరిపించగలవాడు. ఆంధ్రభాషా ప్రియుడు, యత్కించిత్ కవి. సమ్మోహనంగా పాడగల గాత్రమాధుర్యం కలవాడు. అయితే వట్టి అల్లరివాడు. అస్తమానం ఎవరినో ఒకరిని ఏదో అంటూ, ఏడిపిస్తూ, మళ్ళీ నవ్విస్తూ వుండేవాడు. ఈ తమాషా తల పెట్టి మమ్మలనందరినీ హడలుగొట్టి, చచ్చేటట్టు నవ్వించిన పెద్దమనిషి దుగ్గిరాల గోపాలకృష్ణయ్య. అతను తరచుగా నా గదికి వస్తూ, కబుర్లు చెబుతూ, వెడుతుండేవాడు. మొట్టమొదటనే నన్ను చూచిన నాటినుంచీ నేనంటే యెంతో ఆదరం, అభిమానమూను. శ్రీ ఆనందకుమారస్వామి గారు వచ్చిన నాటి సభలో తలవని తలంపుగా నేను చదివిన భాగవత పద్యాలు వినడంతోనే నామీద అభిమానం మరో పదిరెట్లు యెక్కువయింది.

ఒకరోజురాత్రి సుమారు పదిగంటలవేళ నేను శ్రద్ధగా దీక్షగా చదువుకుంటుండగా గోపాలకృష్ణయ్య చాలా హడావిడిగా, కంగారుగా అతి గంభీరమైన మొహంతో వచ్చి, తలుపు కొట్టాడు. ఎవరా ఇప్పుడు వచ్చే వారు? ... కుంటూ, నేను లేచి తలుపుతియ్యడం తోటే, ఒక్కడుగు లోపలికివేసి

"బాబూ, నువ్వు త్వరగా డ్రస్సువేసుకో, మన రావుకి హఠాత్తుగా యేదో జబ్బు చేసింది. ఒళ్ళు తెలియకుండా చాలా బాధపడుతున్నాడు. నువ్వు వెంటనే అక్కడికి పరుగెత్తు, నేను వెళ్ళి మరో పదిమంది మన వాళ్ళను కూడా కేకేసి , డాక్టర్‌ని కూడా తీసుకు వస్తాను." అని

యింక నా మాటేమీ వినిపించుకోకుండా ఒక్క వుడాముని వీధిలోకి పరిగెత్తాడు. నేనమాంతం నిలబడివున్నవాడిని కుర్చీలో చతికిలపడ్డాను. ఈ రావు అనే ఆయన మా స్నేహితుడు. ఆయనా బారిష్టరు చదువుతున్న వాడే ఇంక కొద్దిమాసములలో చదువుపూర్తయి, స్వదేశానికి తిరిగి వెళ్ళనున్నాడు. అయిదున్నర అడుగుల యెత్తుమనిషి కొంచెం స్థూలకాయుడు. మా అందరిలోకి బలిష్టుడులా కనబడేవాడు. హఠాత్తుగా పిడుగులాంటి ఇతనికీ ఏమి వచ్చిందా అని కంగారుపడుతూ, గబగబా సూటూ గీటూ తొడుక్కుని వీధిలోకి పరుగెత్తేను. త్వరగా అక్కడ చేరవలెననే ఆదుర్దాయే కాని అనుకున్నంత తొందరగా వెళ్ళలేకపోయాను. ఎలాగైతే నేమి రావుగారి గదికి చేరి, గోపాలకృష్ణయ్యగారు వచ్చినంత హడావిడిగా నేను తలుపుకొట్టాను. లోపల నెమ్మదిగా మాటలు వినబడుతున్నాయి ఎవరో వచ్చి తలుపు తీశారు. నేను లోపల అడుగు పెట్టి నిశ్చేష్టుడనై నిర్ఘాంత పోయి నిలబడిపోయాను. రావుగారు నల్లరాయిలా నవ్వుతూ కూర్చున్నారు,

మరి నలుగురితో పేకాడుతున్నాడు. చుట్టూ ఏడెనమండుగురు నిలబడి వేడుకచూస్తున్నారు. మొదట ఎవ్వరూ చూడనట్టు నటించి తరువాత తలెత్తి అరే! ఇదేమిటిది? మన పార్వతీశం! అలా వున్నావేమిటి వంట్లో కులాసాగా వుంటోందా అన్నారు. అప్పటికి రావుగారు చేతిలో పేకముక్క ఉక్రిందపడేసి గభాలున లేచి నుంచుని నా దగ్గరకు వచ్చి నా వీపు మీద నేను ముందుకి పడేటట్టుల ఒక్క చరుపు చరిచి ఏం పార్వతీశం భాయ్! ఇలా కొట్టుకొచ్చావేమిటి ఈ వేళప్పుడు, బుద్ధిమంతులంతా నీ వయస్సు వాళ్ళు, చదువులో మునిగితేలుతూ వుండవలసిన సమయంలో నువ్వు ఏ గుంటనో తీసుకుని సరదాగా సినిమా చూసివస్తున్నట్టుంది నీవాలకం. ఇలా అయితే లాభం లేదబ్బాయ్. మేమంతా పెద్దవాళ్ళం ఇక్కడున్నాం మీబోటి వాళ్ళను కుర్రకారుని జాగ్రత్తగా ఓ కంట కనిపెడతామనే ధైర్యంతో మీ వాళ్ళు యిక్కడికి పంపించారు. మొదటి నుంచి నీ ధోరణి చూస్తూ నీవు బాధ్యత గుర్తెరిగి జాగ్రత్తగా చదువుకుంటావ్ అనే నమ్మకంతో నీ మీద పర్యవేక్షణ కొంత మేం తగ్గించిన మాట వాస్తవమే. నువ్వు మా ఏమరుపాటు కనిపెట్టి ఇలా శృంగార కలాపంలో దిగుతున్నావన్నమాట. మేము కొంచెం మళ్ళీ నిన్ను జాగ్రత్తగా కనిపెట్టవలసిన పని కల్పించావు మాకు సరే'' అని నన్ను కూర్చోమన్నాడు.

ఇదంతా చూస్తే నాకు ఏమనాలో తోచలేదు. ఇంతట్లోకే ఇంకొక తను తలుపుతీసిన కుర్రాడు ఏమిటి పార్వతీశం గారూ ఇంత హడావిడిగా వచ్చారు. మీ కంగారు మీ ముఖవైకరి చూస్తే నాకు చాలా భయమేసింది సుమండీ అన్నాడు. ఇంతలోనే తలుపుచప్పుడు కావడం నాకు మల్లేనే ఇంకో నలుగురైదుగురు లోపలికి రావడం నన్ను పలకరించినట్టుగానే మళ్ళీ రావుగారూ తదితరులూ వీళ్ళని పలకరించడం వాళ్ళూ తెల్లబోయి మాట లేక నిలబడిపోవడం జరిగింది. అప్పటికి నేను నా కంగారు నుంచి తేరుకుని "ఏమండీ? మీరంతా కూడా నేవచ్చిన పనిమీదే వచ్చారా?'' అన్నాను. అందులో ఒకతను అవునండీ అలాగే కనబడుతోంది. ఇంతకూ అని అతనేదో అనబోతుంటే "ఏమండి రావుగారు తమకిప్పటికి పూర్తారోగ్యం కలిగినట్లేనా? పాపం తొందరపడి ప్రయాణమైన వారు మళ్ళీ మూట మూలను పెట్టేరన్నమాట. మా యోగక్షేమాలు కనుక్కోడానికి, అబ్బ, ఎంత మంచివారండి మీరు!'' అనగానే అందరూ గొల్లుమన్నారు. అందరితోపాటు రావుగారు కుర్చీలో వెనక్కుపడి నవ్వుతుంటే, వారి ఉదరం ఎగిరెగిరి పడుతుంటే మేము పట్టలేక మళ్ళీ నవ్వాము.

"ఈ వేళ ఏప్రిల్



మొదటి తేదీ యేనా అయింది కాదు అన్నాడు ఒకతను. ఇంతకూ ఆ దుర్మార్గుడు, ఆ తుంటరి, ఏడీ కనబడడేమీ" ఎక్కడున్నా, కొండ చరియలలో దాగినా, సముద్రగర్భాన నక్కినా, పైకి లాగి తుక్కురేగకొట్టి ఎముకలు చూర్ణం చేయవలసిందే అన్నాడు ఒకతను ఎంతో కోపోద్రిక్తుడైన ఏ దుశ్శాసనుడు లాగనో అభినయిస్తూ. రావుగారు ఇదంతా చూచి బ్రహ్మానంద భరితుడై వాళ్ళ లాండ్ లేడీని నిద్రలోనో, మరే స్థితిలోనో ఉన్నదో పాపం,

పిలిచి మాకందరికీ కాస్త టీ పోయించమనీ, లేకపోతే మేము ఆయనను వదలివెళ్ళే సూచనలు ఏమీ కనపడ్డంలేదనీ, మేము పోకపోతే తనకారాత్రి నిద్రపోయే యోగం లేదనీ ఎంతో దీనంగా విన్నవించుకున్నాడు. ఆమె ఎంతో కోపం వచ్చినట్టుకనపడ్డా తుదకు నవ్వుకుంటూ అక్కడున్న మూర్తులు ఎన్నని లెక్కించుకుని వెళ్ళి, మా రావుగారన్నట్టుగా అయిదు నిముషాలలో కాకపోయినా, పది నిమిషాలు దాటకుండా ఒకటో రకమైన టీ, బిస్కట్లూ అందించింది. ఏం జేస్తాం! ఎదొచ్చినా, ఎవరిచ్చినా, అనుభవించక తప్పదు కదా. ఆపని ముగించుకుని రావుగారిని సుఖనిద్రపొమ్మనీ, ఇటువంటి తెగుళ్ళు తెప్పించుకోడం ఆరోగ్యకరం కాదని హెచ్చరించి మా దారిన మేము వెళ్ళి పోయాము. దీనిని ఆంగ్లంలో Practical joke అంటారు.

తెల్లారిన తరువాత గోపాలకృష్ణయ్య కనపడితే అతనిపని పట్టిద్దామనుకున్నాను. వారం రోజుల వరకూ ఆయనెక్కడా పికరేలేకుండాపోయారు.

బ్రతికి పోయాడు.

చాలా కాలం క్రితం జరిగినదే ఒక సంగతి చాలా స్వల్పమైనదే చెప్పడం మరచిపోయాను. అందులో విశేషం ఏమీ లేదుకాని వూరికెనే తమాషాకి చెపుతున్నాను. నేనిక్కడకు వచ్చిన తరువాత, నాబారసాలనాడు జరిగిన నామకరణ మహోత్సవం కాక, ఇక్కడ మళ్ళీ మంచి రోజుకాని, మహోత్సవం కాని లేకుండానే నామకరణం చేసుకోవలసి వచ్చింది.

ఇక్కడ ఆచారమేమిటంటే మనదేశంలో ప్రతివాళ్ళకు ఉన్నట్టుగానే ఇంటిపేరూ, వ్యక్తిపేరూ కలిసి వెరసి రెండు పేర్లుంటాయి. ఎటొచ్చీ ఈదేశంలో వ్యక్తి పేరు మొదలూ యింటిపేరు చివరా ఉంటుంది. మన దేశంలో అనగా రాష్ట్రంలో యింటిపేరు ముందూ, వ్యక్తి పేరు చివరా ఉంటుంది. పైగా మన యింటిపేర్లన్నీ చాలా వరకు ఏనాడో మన పూర్వులు నివసించిన గ్రామముల పేర్లయి ఉంటాయి. లేక మన పెద్దలు సంపాదించిన బిరుద నామములేనా అయి ఉంటాయి. ఈ పద్ధతి మనదేశంలో కూడా మనిషి పేరు ముందూ, యింటి పేరు వెనుకా ఉండడం కొన్ని ప్రాంతాలలో అలవాటేనని యిక్కడున్న ఉత్తరాది విద్యార్థులవల్ల తెలుసుకున్నాను. మన వాళ్ళలో కొంతమంది కూడా యిక్కడకు వచ్చిన తరువాత తమ పేరు ముందు వేసుకుని యింటిపేరు వెనక్కు మళ్ళించడం చూశాను. నేనూ అలా చేయవలెననీ మొదట అనుకోలేదుకాని, చేయక తప్పినదికాదు. ఏమంటే నా పేరు యెవరికి చెప్పినా వాళ్ళకు మొదటిసారి అర్థం కాకపోవడమేకాక పదిసార్లు చెప్పినా ఉచ్చరించలేక నానా యాతన పడినాకూడా, పలకలేక పోయేవారు. కొందరు నన్ను "టెసామ్" అనే వారు కొందరు "టీసమ్" అనేవారు. మరి కొందరు అల్లరికి "మిస్టర్ సమ్‌టీ" అనేవారు. మా లేండ్ లేడీ వగైరా ఈ మాత్రం కూడా అనలేక ఊరికినే సేమ్ అనేవారు. చాలామందికి ఈ సేమ్మే అలవాటయింది. తరువాత టపా బట్వాడాలో కూడా నాపేరు టపాజవానే ఉచ్చరించలేక తెలుసుకోలేక నానాయాతనా పడేవాడు. అందుకని ఈ యిబ్బంధులన్నీ ఎందుకనుకుని ఈ దేశాచార ప్రకారం ఇంటిపేరే చివరకు మారిస్తే బాగుంటుందని ఆలోచించి ఆ ప్రకారం చేశాను. కాని ఆ మార్పుకూడా ఇక్కడివాళ్ళకు వీలు కలిగించలేదు. పి.వె.మూర్ అని మార్చుకున్నాను. అయినా అది కూడా వాళ్ళు వెమార్ అని కొందరు, మోర్‌వే అని కొందరు మూర్ అని రకరకాలైన అపభ్రంశ రూపాలు కల్పించటం మొదలుపెట్టారు. ఈ కర్ణకఠోరమైన శబ్దాలు వినలేక బాధపడి కొంచెం ఆలోచించి మళ్ళీ ఒకచిన్న మార్పుచేశాను. యింటిపేరు

యిదివరకు ఇంగ్లీషులో Vemur అని వ్రాసేవాణ్ని ఇప్పుడు దానిలో కూడా ఒక చిన్న మార్పు చేస్తే బాగుంటుందని P.V. more ని మార్చుకున్నాను. దానివల్ల మళ్ళీ కొన్ని ఇబ్బందులు వచ్చాయి. కొందరు మర్ మర్ అని ఈమర్ ఏమిటండీ అని కొందరు అడగడం మొదలు పెట్టారు. అందుకని ఈ సారి మూర్‌కి వర్ణక్రమం కొంచెం మార్చాను. Mor అని యీసారి అంతా సాఫీగా నడుస్తుందనుకున్నాను. కాని అదేం జరగలేదు. వేమూర్ అనే మాటే తలలో అడుతుండడం మూలాన్ని Ve మానేసి మూర్ అంటారని సంబరపడ్డాను కాని More అనేది ఇంగ్లీషులో మోర్ అవుతుం దన్న సంగతి మర్చిపోయాను. అక్కడనుంచి కొందరు So you are now more what more అని Mister more we will be sorry when you are no more అని నన్నాట పట్టించారు.

దాని తల్లి సిగగొయ్యా ఎటు చూచినా ఇబ్బందే కలుగుతోంది. ఇదంతా మనం మంచిరోజు చూచుకోకుండా విఘ్నేశ్వరపూజ చెయ్య కుండా నామకరణం చేచుకోవడం వల్ల వచ్చిన యిబ్బంది అనుకుంటాను. అని ఆలోచిస్తూ ఒక రాత్రంతా గడిపాను. మరునాడు లేచి విశ్వవిద్యా లయానికి వెడుతూ ఒక పుస్తకం కావలసి పుస్తక విక్రయశాలకు వెళ్ళి నాక్కావలసిన కవితా సంకలనం కోసం వెతుకుతుంటే థామస్ మూర్ అని కవిగారి కావ్యం కనపడ్డది. ఆ పుస్తకం చూదామని పైకి తీయ గానే పుటలు తిప్పకుండానే నామకరణం ఎలా చేసుకుంటే పేచీ లేకుండా ఉంటుందో ఈ పుస్తకం మీద పేరు చూడంతోనే హఠాత్తుగా స్ఫురిం చింది, నాక్కావలసిన పుస్తకం తీసుకుని ఒక క్షణం కూడా అగకుండా తిన్నగా అచ్చు ఆఫీసుకు తీసుకు వెళ్ళి P.V. Moor అని నా పేరు అచ్చు కార్డులు వేయించుకుని వచ్చాను. అది నా మిత్రులకు చూపించాను. వారందరూ ఈ మాటు బాగుంది అని వారి ఆమోదం తెలిపారు. ఇటువంటి మార్పులు ఒక్కొక్కప్పుడు లాభిస్తాయని కూడా కొంతకాలా నికి తెలుసుకున్నాను. లాభం మాట ఎలా ఉన్నా ఇప్పుడందరూ ఇక్కడి వాళ్ళూ. మన వాళ్ళూ, కూడా ఉచ్చరించగలుగుతున్నారు. ఉత్తరాలు ఏ పేచీ లేకుండా సకాలంలో చేరుతున్నాయి.

ఈ మధ్యను ఒక చిన్న తమాషా జరిగింది. మరేం లేదు, ఒక కుర్రాడిని వెర్రివాణ్ని చేసి ఒక పూట ఏడిపించాం అందరంకలసి. అయినా ఈ స్వల్ప విషయానికి అబద్ధం ఎందుకు? అదంతా ఏర్పాటు చేసింది అల్లరి చేసింది నేనేనని చెప్పకోడానికి గర్వపడుతున్నానో, సిగ్గుపడు తున్నానో చెప్పలేకుండా ఉన్నాను. మనకు చేతనైనది అదే కదా. మన కంటే కొంచెం తెలివి తక్కువ వాడు, కొంచెం అందరికే సరదా. ఆ

క్షణంలో ఒకప్పుడు మరొకరు మన్ని ఇలాగే ఏడిపించారన్న సంగతి మరచి పోతూఉంటాం.

సుమారు ఒక సంవత్సరం అవుతుంది మనవేపు నుంచే ఒక కుర్ర వాడు, చాలా బుద్ధిమంతుడూ, చాలా అమాయకుడూను, మా అందరికి మల్లేనే ఇంట్లో చెప్పకుండా మంచిరోజు చూసో, చూడకుండానో ఇక్కడికి తిన్నగా చక్కావచ్చేడు. నేను వచ్చినప్పుడు, రాజు నాకు తగిలినట్టుగానే నేను ఈ కుర్రవానికి ఆపద్బాంధవుడిలా దొరికేను. అతనికి నా గదికి దగ్గ రలోనే ఒక గదికూడా కుదిర్చి ప్రవేశపెట్టి, అతని కవసరమైన సహాయం చేస్తుండేవాడిని. పాపం అతనికి నేనంటే ఎంతో గురి, గౌరవం ఏర్ప డ్డదో చెప్పశక్యం కాదు. అంత ఇదికి కారణం ఏమీ కనిపించదు. మేము కలుసుకొన్న వేళా విశేషం అనుకొని సమాధానం చెప్పకొన్నాం. అతను పాపం నా దగ్గర ఏ దాపరికం అరమరికా లేకుండా సమస్తమూ నాతో చెపుతూ ఉండేవాడు. నాతో అన్నమాటేమిటి? ఎవరితోనైనా చెప్తాకునే వాడు అనుకుంటాను. అతని స్వభావ మది. వాళ్ళు గోదావరి జిల్లా వాళ్ళు. సంపన్న గృహస్థులు, భూస్వాములు ముగ్గురు అన్నదమ్ముల్లోనూ ఇతను కడసారపు వాడు. ఓ పడమటి గాలికి ఇలా కొట్టుకొచ్చి, ఇక్కడ స్థిరపడి చదువు ప్రారంభించేడు. అతనికి నేను చేస్తున్నపనే చేయమని అనగా M.A బారిష్టర్ చదవమని సలహా యిచ్చాను.

అందు కంగీకరించి విద్యాలయంలో చేరాడు. అప్పటి నుంచి కులా సాగా కాలం గడుస్తోంది. మా మైత్రి ఎక్కువవుతోంది. ఒక రోజున ఇతని పేరుతో ఒక కవరు, చుట్టూ పసుపురాసి ఇతని చిరునామాతో ఇండియన్ అసోసియేషను చిరునామాకు వచ్చింది. నేనా రోజు పెంద లాడే అసోసియేషన్‌కి వెళ్ళేసరికి, ఈ ఉత్తరం కనబడింది. ఆ ఉత్తరం చూసి ఏదో పెళ్ళి శుభలేఖ అయివుంటుందని మన ఆచారం తలుచు కుని ఉత్తరం తీసి జేబులో పెట్టుకున్నాను. నా స్నేహితుడు రమణ కిద్దామని తరువాతను ఆ మాటమర్చిపోయి, నేను కొంతసేపు అక్కడ గ్రంధాలయంలో కాలక్షేపం చేసి ఆ తరువాత విశ్వవిద్యాలయానికి వెళ్ళి అక్కడ క్లాసులు అయిపోగానే యింటికి వచ్చేశాను. నా భోజనాదికములు ముగించుకుని మధ్యాహ్నం తరగితులకు విద్యాలయానికి వెళ్ళి వచ్చేను. ఇంతసేపూ ఈ ఉత్తరం సంగతే మర్చిపోయాను. అప్పుడు హఠాత్తుగా ఇది జ్ఞాపకం వచ్చి నాలుక కరచుకొని తిన్నగా మా స్నేహితుడి గదికి వెళ్ళి బయటికి వెళ్ళడానికి తయారైన రమణను కూర్చోపెట్టి "నీకో శుభవార్త తీసుకువచ్చేను" మీ యింట్లో ఎవరికో పెళ్ళట, నీవు ఒకమాటు వెళ్ళి

ఆ శుభకార్యం జరిపించి వస్తావా ఏమిటి అన్నాను. అతను తెల్లబోయి అదేమిటండీ! పెళ్ళేమిటి ఇప్పుడు పెళ్ళి కావలసిన వారెవ్వరూ లేరుగా మా యింట్లో. ఆఖరు వాడిని నాక్కూడా పెళ్ళి అయిపోయిందే అన్నాడు చటుక్కున నోరుజారి. "యేమిటీ చెప్పావు కాదు ఇన్నాళ్ళ నుంచీని. ఆరిపిడుగా అసాధ్యుడవే! అమాయకుడ వనుకుంటున్నాను ఇన్నాళ్ళనుంచి" "మీరు రైటేనండీ, ఇందులో నేను చేసిందేముంది. మా వాళ్ళు పెళ్ళి చేశారు. నేనా సంగతి మర్చిపోయి తిన్నగా ఇక్కడికి చక్కా వచ్చాను. మీరుకనపడ్డారు దేవుళ్ళాలాగ, మీతో చెప్పడం మర్చిపోయాను. పొరపాటే నండీ కాని మరో దురుద్దేశ్య యేమీ లేదు" అన్నాడు వెర్రి మొహం వేసికొని. "మరైతే ఈ శుభలేఖ యేమిటన్నాను. ఈ వుత్తరం అందిస్తూ ఇది ఈవేళ వచ్చింది. ఉదయాన్ని నీకు త్వరగా అందచేద్దామని తీసు కుని ఇప్పటివరకూ ఇవ్వడం మర్చిపోయాను యేమీ అనుకోకు." అన్నాను అతను అదుర్దాలో ఉత్తరం అందుకుని చింపి చూసి ఉలుకూ పలుకూ లేకుండా పరధ్యానంగా కూర్చున్నాడు. శుభలేఖ చూసి ఎందుకలా పరధ్యా నంగా ఉన్నాడో, ఎందుకు సంతోషంగా లేడో, నాకర్థం కాలేదు. ఒక క్షణం ఊరుకుని, "యేం రమణా, యేమిటలా కూర్చున్నావు. ఇంతకూ పెళ్ళి ఎవరికి! నువ్వు ఇప్పుడు వెళ్ళక్కరలేదులే. అంతలా కంగారుపడతా వెందుకు, అన్నాను. "కంగారుకాదండీ. పెళ్ళేం కాదండీ మీకెలా చెప్పాలో తోచడం లేదండీ నాకు. మా నాన్న ఈ ఉత్తరం రాశాడ"ని నాకందించేడు. నేను వుత్తరం అందుకుని యేమిటీ విచిత్రం అని ఆశ్చర్యపోతూ గబ గబా ఉత్తరం చదివేను, పెళ్ళీకాదు, పెటాకులూ కాదు. మా రవణ భార్య చి॥ సౌభాగ్యవతి సత్యవతి రజస్వల అయినదట. నక్షత్రం కొంచెం దోష యుక్తమగుటచేత శాంతి చేసుకోవలసి ఉరిటుందని ఒక్క వారం రోజులు సెలవు పెట్టి ఇతన్ని వెంటనే ఇంటికి రమ్మని వాళ్ళ నాన్న వ్రాసిన శుభలేఖ సారాంశం. నాకు విపరీతమైన నవ్వువచ్చింది. ఇంకనేం ఇది మరీ బాగుంది? పెళ్ళికంటే ఎక్కువ సంతోషకరమైన వార్త కదా నీకు. ఇది చూడగానే ఆసంతోషంలో తరువాత కార్యక్రమం ఊహించుకుంటూ ఉన్నావన్నమాట. "నీ పరధ్యానానికి కారణం అర్థమైంది. బాగుంది శభస్య శీఘ్రం అన్నారు." ప్రయాణానికి ముహూర్తం ఇప్పుడే చూడమన్నావా? మళ్ళీ అప్పుడోమాటు మీ నాన్న రమ్మని వ్రాయకుండా ఆ తరువాయి కూడా ఇప్పుడే తీర్చుకొచ్చేస్తే అందరూ సంతోషిస్తారు. కొంత ఖర్చూ కలిసి వస్తుంది" అన్నాను.

అతనెంతో జాలిగా ముఖంపెట్టి "ఏమిటండీ గురువుగారూ? మీరు కూడా నన్ను యిలా యేడిపిస్తే ఏలాగు. మానాన్న అసలు ఈ ఉత్తరం రాయడం ఎందుకు? వారం రోజులు సెలవు పెట్టి రావాలిట. ఆ వారంరోజులలోనూ సమస్తము సర్దుబాటుచేసికొని తిరిగి వెళ్ళిపోవచ్చునట. యెంత వెఱ్ఱివాళ్ళో మనవాళ్ళు నేను యిక్కడికి చేరడానికి సుమారు నెలరోజులు పట్టిందన్న సంగతి మర్చిపోయాడు మానాన్న పాపం" అంటూ సఱుని ఉత్తరం చింపేయపోతుంటే నేను ఆపి ఆ వుత్తరం లాక్కుని "శుభలే ఖలెప్పుడూ చింపేయకూడదోయ్ అలా వుంచు, లేకపోతే నేను జాగర్త పెడతాలే. నా స్వీయ చరిత్ర భవిష్యత్తులో వ్రాసేటప్పుడు ఈ రికార్డు వుండద్దామరి." అన్నాను నవ్వుతూ. అతను ఏమీ అనలేక తలవంచుకుక్కూర్చున్నాడు సిగ్గుపడుతూ. తనే రజస్వల అయినట్టు. నేను నవ్వుతూ "మళ్ళీ కలుసుకుందాం నువ్వూ యెక్కడికో బయలుదేరుతుంటే నీ ప్రయాణానికి అడ్డు వచ్చాను. అయితే యిప్పుడు మనదేశానికి నీ ప్రయాణం లేదన్న మాటేకదూ?" అని, అతనికేసి చూడకుండా ముందుకు అడుగు వేశాను. అతనువెనుక నుంచి, "అది మీరు నిర్ణయించవలసిన విషయం. మానాన్న మాట కొట్టేయగలనుగాని మీ ఆజ్ఞ శిరసావహించవలసినదే గదా?టట అన్నాడు "సరే అయితే నేనాలోచించి నా నిర్ణయం త్వరలోనే తెలియపరుస్తాలే" అని చక్కా పోయాను. నేను యెక్కడికో వెళ్ళవలెననుకున్న ప్రయాణం కట్టిపెట్టి తిన్నగా బ్రైడ్‌హిల్స్‌కు వెళ్ళి కాసేపు ఒంటరిగా గాల్ఫ్ ఆడుకొని పరధ్యానంగా ఒకచోట కూర్చున్నాను.

ఇంతలో మెరుపులా, ఒక ఆలోచన తోచింది. అది మరోమాటూ మరోమాటూ ఆలోచించినకొద్దీ చాలా అద్భుతంగా ందరికీ ఆశ్చర్యజనకంగానూ, ఉత్సాహంగానూ వుంటుంది అని ఆలోచన తోచింది. వెంటనే ఆ ప్రయత్నం రెండో కంటివాడికి తెలియకుండా అమలు పరచవలెనని నిశ్చయంతో నాలో నేను నవ్వుకుంటూ గాలిలో తేలిపోతున్నంత వుత్సాహంతో, వేగంతో ఇంటికి చేరుకున్నాను. మరునాడు స్నేహితులకు, మన తెలుగు వాళ్ళందరకూ ఆ సాయంకాలం, నాగదిలో తేనీటి విందుకు విధిగా దయచేయవలసిందని సవినయంగా ప్రార్థిస్తూ ఆహ్వానాలు టైపు చేయించి ఆప్తులైన పది పన్నెండుగురికి అందచేశాను. నేను ఆ కార్యక్రమానికి అవసరమైన ఏర్పాట్లు చేయడంలో నిమగ్నుడనై చాలా హడావుడిగా రోజంతా గడిపాను. మిత్రులకు సరదాగా వుంటుందని కొంచెం పులిహోర కూడ స్వహస్తాలతో తయారుచేశాను. ఒక స్వీటు కూడా తయారుచేసి షాపులోనుండి రెండు రకాల కేకులూ, బిస్కట్లూ కూడా తీసుకు వచ్చాను, ఈ

హడవిడంతా చూచి మా యింటి ఆవిడ తెల్లబోయి, "ఏమిటండీ సేమ్ గారూ ఇంత హడావుడి చేసతున్నారు. మీకేమైనా పెళ్ళి తలపెట్టుకున్నారా, లేక డర్బీ పందాల్లో బహుమతి యేమన్నా వచ్చిందా. చెప్పండి! మేమూ సంతోషిస్తాం" అన్నది. నా పెళ్ళి కాదూ, నీకార్యమూకాదు, అన్నాను తెలుగులో వాట్?వాట్? ఏమిటి? యేమిటిది అంది ఆవిడ కంగారుగా - సాయంత్రం మీకూ తెలుస్తుందిలే అన్నాను.

సాయంకాలం సరిగా నాలుగయ్యేసరికి మా మిత్రబృందం ఈ పార్టీ యేమిటో, ఎందుకో తెలుసుకుందామని అదుర్దాతో ఒక క్షణం అటూ యిటూ పోనివ్వకుండా చక్కా వచ్చారు. వీళ్ళందరకంటే ముందే మా రవణ కూడా వచ్చి, "యేమిటండీ గురువుగారూ, ఈ హడావుడంతా" అన్నాడు నాతో అన్నీ సర్దుతూ. నేను తయారుచేసిన కాఫీతప్ప, తక్కిన వన్నీ బల్లమీద అమర్చడం, అందరూ ఆరగించడం అయిపోయిన తరువాతను తీపి వుండలు వున్న పళ్ళెం తీసుకొచ్చి బల్లమీద పెట్టి, నేను లేచి నిలబడి, "సోదరులారా! ఈ హడావిడీ, ఈ పార్టీ యెందుకని మీరు ఆశ్చర్యపోతూ వుంటారు. ఇంతసేపూ చెప్పకుండా మిమ్ములను ఆశ్చర్యనిమగ్నులను చేయడం అట్టే అంత న్యాయం కాకపోయినా దీని వల్ల వచ్చిన ఇబ్బందేమీ లేదుకదా అని ఇలా చేశాను. మీరు మన్నిస్తారనే ధైర్యంతో ఇప్పటికైనా చెప్పకపోతే, ఎప్పటికీ నన్ను మన్నించకపోవడమే కాకుండా యేదైనా అఘాయిత్యం కూడా చేస్తారేమో అనే భీతితో అసలు రహస్యం బయటపెట్ట సాహసిస్తున్నాను. మొన్న ఈ శుభలేఖ వచ్చిందని రమణకు వచ్చిన వుత్తరం పైకితీశాను. అతను నిర్ఘాంతపోయాడు. "ఇక్కడ మన మిత్రులలో నూతనంగా అంటే కొలదికాలం క్రితం వివాహమైన యువమిత్రుడు ఒకడున్నాడు. అతని భార్య ప్రథమ రజస్వల అయినట్లు ఈ శుభలేఖ వచ్చింది. ఈపాటికి ఆమె ఋతుస్నాతం అయివుంటుంది. టపా యేర్పాట్లు సక్రమంగా లేకపోవడం మూలాని మనక్కొంచెం అలస్యంగా ఈవార్త అందింది. అక్కడ పేరంటాండ్రకు పంక్తి భోజనం వగైరాలన్నీ అయ్యే ఉంటాయి. ఈ శుభసమయంలో వరుడు కూడా అక్కడ వుండివుంటే ఎంతో వుత్సాహంగా ఆనందంగా వుండవలసినవాడు, ఏకాకిగా ఈ పురుషపుంగవుల మధ్యను చిక్కుపడి సిగ్గుతో, వ్యధతో కుమిలిపోతున్నాడు. అతనిని మనమందరమూ వుత్సాహపరచవలసిన బాధ్యత మన మీదను వున్నదనుకొని, అతనిని వుత్సాహపరచే కార్యభారం నామీద వేసుకొని, మిమ్ములనందరనూ ఇక్కడకు ఆహ్వానించాను. మీరూ నాతో పాటు సంతోషిస్తూ ప్రథమ రజస్వల అయిన కన్యను ఆశీర్వదిస్తారని

ఆశిస్తున్నాను. ప్రత్యేకించి ఈ సమయంలో యే పిండివంట వున్నా లేక పోయినా చిమ్మిలి ముఖ్యంగా ముత్తైదువులకు పంచిపెట్టవలెనని మన పెద్దలంటారు. అందుకని ఇక్క డ కనపడే స్త్రీ జాతిలో ముండెవరో, ముత్తైదువెవరో తెలుసుకోవడం కష్టము కనుక ఆ జాతివారిని ఆహ్వానించక పోవడమే మంచిదని అనుకున్నాను. అందుకని ఈ కొద్దిక్షణాలు మీరే ముత్తైదువులుగా భావించుకుంటే ఇక్కడ వున్న వరుడు వుధువుగా కొంచెం సిగ్గు పడుతున్నా మీకందరకూ చిమ్మిలి ప్రత్యామ్నాయంగా యీ తీపితో మీ అందరి నోళ్ళు తీయబరచగలడు. లే రమణా" అన్నాను.



అతను అదివరకే సిగ్గుతో ముడుచుకొని ముద్దయిపోయి వున్న మనిషి యీ పిలుపుతో మ[illegible] కుంగిపోయి, సి[illegible] కారిపోయి, లేవ[illegible]తుంటే నేను జాలి [illegible] అతనిని నెమ్మ[illegible] లేవదీసి, ఆ పళ్ళెము [illegible]గళహారతి పళ్ళెం [illegible] మేమిద్దరమూ పట్టు[illegible] అందరికీ తలో వుండా పంచిపెట్టాము. "[illegible]పప్పు యిక్కడ లభ్యం [illegible] కారణంచేత, బాదంపప్పుతో యీ చిమ్మిలి తయారుచేయడం అయినది" అన్నాను.

సభికులు హర్షామోద కరతాళ ధ్వనుల మధ్య పార్టీ బ్రహ్మాండంగా వున్నదనీ, దానికి చరిత్రలో ఒక ప్రత్యేకత, విశిష్టత, వుండి తీరుతుందని, ఇది చాలా ఒరిజినల్ ఐడియా అనీ, మిత్రులందరూ నన్ను శ్లాఘించి, రమణ వీపు తట్టి "తరువాత కార్యక్రమం త్వరలోనే జరిపిస్తారు పార్వతీశం గారు, భయపడవద్ద"ని ఆశీర్వదించి, అభయమిచ్చి, యెవరి దారిన వాళ్ళు చక్కా పోయారు.

నేనూ, మా రవణ మిగిలాం. అతనికి కళ్ళనీళ్ళ పర్యంతమయింది. "గురువుగారూ ఇది మీకు ధర్మమేనా" అన్నాడు యెంతో జాలిగా. "ఓయి వెర్రివాడా ఇందులో ఆధర్మం ఏమీ లేదు, నీ మీద వుండే ఆదరణా, అభిమానం మాత్రమే దానికి కారణం. నాకే కాక ఈ వచ్చిన వాళ్ళందరికి కూడా నామీద యెంత అభిమానమో, నీమీదను కూడా అంత అభిమానమూ కలవాళ్ళే. అందుచేతను నీవు యేమీ అనుకోవద్దు." అని నేను ఓదార్చేను. అతను నన్ను కౌగలించుకొని. ఆనందబాష్పములతో మాట రాక ఉక్కిరి బిక్కిరై, కరచాలనం చేసి నమస్కారం చేసి మాట్లాడకుండా వెళ్ళి పోయాడు.

అతను బయటికి వెళ్ళడం తడవుగా మా యింటి యజమానురాలు కూతుళ్ళు ఒక్క పరుగున నా గదిలోకి చక్కా వచ్చి "యేమిటి సేంగారూ యేమిటి విశేషం. మీరు చెప్పాలి తప్పదు. మేము యిందాకటినుంచీ ఊపిరి బిగబట్టుకుని కూర్చున్నాం." అన్నారు. "సరే, అయితే కూర్చోండి" అని ఖర్చు కాగా ఉన్న కేకులు, బిస్కట్లూ, నేను తయారుచేసిన వంటకం ముందు పెట్టి మొహమాట పడకుండా తీసుకోమని హెచ్చరించి, అప్పుడు సావకాశంగా మా దేశ ఆచారాలూ, ప్రకృతి సహజమైన స్త్రీలలో ఈ పరిణామానికి మా వాళ్ళు చేసే హడావిడీ, అంతా వివరంగా చెప్పి వాళ్ళ నాశ్చర్యచకితులను చేశాను. వాళ్ళు యిదంతా విని నవ్వుకుంటూ వెళ్ళారు. గుమ్మం దగ్గర ఆ చిన్నపిల్ల వెనక్కి తిరిగి, నన్ను చూసి నవ్వింది. యేం "నీకున్కాడా యేమన్నా అనుమానంగా ఉందా యేమిటి" అన్నాను. సమాధానం లేకుండా ఒక్క పరుగున వాళ్ళ గదిలోకి వెళ్ళిపోయింది.

# 23

యుద్ధంలో జయాపజయాలు ఎవరివవుతవో నిర్ణయించడం మాట యెలా వున్నా ఊహించడమూ కూడా యెవరికీ సాధ్యంకానట్లు తోస్తోంది. జయము యెవరిదైనా ఆంగ్లేయులది మాత్రము కాదన్న సందేహం చాలా మందికి కలుగుతున్నది. యుద్ధరంగాలలో అనేకచోట్ల అనేక విపరీత పరిణామాలు ఆంగ్లేయులు యెదుర్కోవలసి వచ్చింది. టర్కీ ప్రాంతాల్లో, మొదట స్కాట్లండులో ఆనాడు జరిగిన నౌకాభంగంకంటే ఘెర పరాజయం మళ్ళీ అనుభవించవలసి వచ్చింది. ఆ కారణం చేతను నౌకాశాఖకు ఆనాడు మంత్రిగా వున్న (First lord of the admirality) విన్‌స్టన్ చర్చిల్

అనే ఆయన ఉద్యోగ విరమణ చేయవలసి వచ్చింది. మొత్తం యుద్ధతంత్ర నిర్వహణ ఏమీ బాగాలేదని అనేక ఆక్షేపణలు రాగా ప్రధానమంత్రియైన యాస్క్విత్ అనే ఆయనకూడా ప్రధానమంత్రి పదవిలో నుంచి తొలగవలసి వచ్చింది. ఆ సందర్భంలోనే ననుకుంటాను రాజకీయపార్టీలు ఎన్నికలకు దిగ వలసి వచ్చింది. అదివరకు యాస్క్విత్ పార్టీలోనే వుంటున్న లయడ్ జార్జి అనే ఆయన, ఆయనకు ప్రత్యర్థిగా బ్రహ్మాండమైన ప్రచారం సాగించడం మొదలెట్టారు. యిటువంటి ప్రచారములు యెప్పుడూ ఇంతకి పూర్వము చూడలేదు. దానిని గురించి విశేషముగా చదువనుకూడా లేదు. కాని నేడిది ప్రత్యక్షంగా చూడడము మహావిజ్ఞాన ప్రదమనిపించింది. లయడ్ జార్జిగారు ప్రసంగం వినవలెననే కుతూహలముతో మాకు సమీపములో వున్న గ్లాస్‌గో అనేపట్టణానికి కొందరి మిత్రులతో కలసి వెళ్ళాను. లోగడ యెడింబరోలో నాడు యాస్క్విత్ గారి సభకంటె మరీ బ్రహ్మాండంగా వుంది ఇది. ఒక హాలులోకాక ఒక విశాలమైన బహిరంగ స్థలములో ఏర్పాటు కాబడిన దీసభ. జనం అసంఖ్యాకంగా వచ్చారు. ఇన్ని వేలని చెప్పశక్యము కాకుండా వున్నది. మేము వచ్చిన కొద్ది నిముషములకే సభ ప్రారంభమైందది. సభాధ్యక్షులు కొన్ని నిముషములు ప్రసంగించి లయడ్ జార్జిగారిని ఉపన్యాసమిమ్మని కోరారు. ఆ దేశస్థుల పరిమాణాలను బట్టి ఆయన కొంచెం కురచని చెప్పాలి. తెల్లని మీసములు వెనుకనుంచి ఆయన మందహాసం కనిపిస్తూనే వుంది. ఆయన లేవగానే సభంతా నిశ్శబ్దమైంది. చీమ చిటుక్కుమన్నా వినబడేటంత నిశ్శబ్దం. ఆయన వుపన్యాసం మహా ప్రవాహంగా సాగిపోతున్నది. ఆయన వాక్కు సింహగర్జనలా మ్రోగుతూ ఎంతదూరానికో వినిపించింది. ఆయన ఉపన్యాసము మధ్యన ఆ నాటి పరి స్థితులనూ ప్రజల ఆశయాలనూ చెప్పడంలో "దూరానవున్న ఇండియా హోమ్‌రూల్ ఇవ్వక తప్పదంటున్నది. మా వేల్స్‌కు కూడా హోమ్ రూల్ కావలెనని నేనూ అంటూన్నాను. అనగానే అంతవరకూ నిశ్శబ్దంగా వింటున్న శ్రోతలమధ్యనుంచి ఒకడులేచి హోమ్‌రూల్ ఫర్ హెల్ అని ఉరుములా, సభంతా దద్దరిల్లేట్టు పెద్దకేక పెట్టేడు దానితో సభలో పెద్ద గందరగోళం బయలుదేరింది. అనేక మంది ఈ రౌడీని, ఈ దుర్మార్గుణ్ణి, ఈ నీచుణ్ణి, ఈశత్రుపక్షం వాణ్ణి, ఈ త్రాగుబోతును అవతల కీడ్చేయండి. బయటికి తన్ని గలేయండి అంటూ కొన్ని వేల కంఠాలు వినబడ్డాయి ఇంతటితో సభ ఆపివేయవలసి వస్తుందేమోనని చాలామంది భయపడ్డారు. అందరూ లేచి నిలబడే వున్నారు. అధ్యక్షుడూ సభను సముదాయించ లేకపోయినాడు. అప్పుడు లయడ్ జార్జిగారు మహాజనులారా! ఒక్క క్షణం

ఓపిక పట్టండి. ఎందుకు మీరెంత ఉద్రిక్తులవుతున్నారు. ఆ పెద్దమనిషి అన్న దానిలో తప్పేమున్నది. మీకెంత ఆగ్రహావేశములు ఎందుకూ? ఆయన రాష్ట్రానికి ఏకైక ప్రతినిధిగా వచ్చి వారికి స్వరాజ్యం కోరడంలో తప్పేమున్నది? నామట్టుకు చాలా సబబుగా కనిపిస్తోంది. అని ఆ అల్లరి చేసిన మనిషివైపుకు తిరిగి అయ్యా! మీరు చెప్పిన విషయం తప్పకుండా ఆలోచించదగ్గదే. ఇంక తరువాత సంగతి" అని ఉపన్యాసము పునఃప్రారంభించపోతుంటే సభలో నున్న వారంతా కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుతూ, ఆకాశంకూడా దద్దరిల్లేటట్టు నవ్వుతూ కరతాళధ్వనులు చేశారు. మరొక అరగంటసేపు వారి ఉపన్యాసం ఏ అడ్డంకీ లేకుండా సాగిపోయింది. ఆ అల్లరి చేసిన మనిషి ఏమయ్యాడో అంతులేదు. ఇటువంటి సభ మళ్ళీ యెప్పుడూ చూడగలుగుతా ననుకోను. ఉపన్యాసకుడు యెంతటి వాడైనా వాక్ప్రవాహమునకు ఇటువంటి అడ్డు తగిలినప్పుడు అంత ప్రశాంతంగా, అంతసౌమ్యంగా దెబ్బతీసేవాడికి కూడా బాధ తెలియకుండా చెప్పుదెబ్బ కొట్టడం ఎంతటి వాళ్ళకోగాని సాధ్యం కాదనుకుంటాను. ఇంటికి వెడుతూ ఆయన చమత్కార ప్రయోగాన్ని గురించే ఆలోచిస్తూ మళ్ళీ ఎడింబరో చేరుకున్నాను. తుదకు ఎన్నికలలో, ఇంగ్లండులో అద్వితీయుడని పేరుగన్న యాస్క్విత్ పరాజితుడు కావడం లయడ్ జార్జి ఆ స్థానం ఆక్రమించుకోడం విధి వైపరీత్యం.

యుద్ధం నానాటికీ భయంకర రాక్షసాకృతిలా తయారై ప్రపంచాన్ని దద్దరిల్లచేస్తోంది. నేలమీద యుద్ధంకన్నా, సముద్రంలోనూ, గాలిలోనూ జరుగుతున్న యుద్ధం మరీ భయంకరంగా ఉంది. ఏనాడూ పగలు వీధిలో కెళ్ళినా వాళ్ళు మళ్ళీ ప్రాణాలతో యింటికి చేరుకుంటారనే నమ్మకం పోయింది. రాత్రి పడుకున్న వాళ్ళు ఉదయాన్నే లేచి బయటకు వస్తారో లేకపోతే దీర్ఘ నిద్రలో పక్కలోనే ఉండిపోతారో చెప్పటం కష్టంగాఉంది. అహర్నిశాదులూ ఆకాశంలో మనవో, శత్రులవో తెలియకుండా విమానాల రొదతో చెవులు గింగురుమంటూ గుండెలు ఝల్లుమంటూ భీతావహంగానే రోజులు గడపవలసి వస్తోంది. బజారులో నిత్యావసర వస్తువులు కూడా దొరకడం దుర్లభమవుతుంది. ధరలు విమానాలతోపాటు అంత ఢిక్షాని కెగురుతున్నాయి.

తెల్లవారి పత్రికలు తెరిచేసరికి జర్మనులు కొన్నివందల గ్రామాలు ఆక్రమించుకున్నారనో, కొన్ని వ్యూహాల్ని విధ్వంసం చేశారనో, ఎక్కడో దూరతీరాల్లో తమ జలాంతర్గాములతో కొన్ని ఓడలు ముంచి వేశారనో,

విమానాల నుంచి కొన్ని పట్టణముల మీద కొన్ని వందల బాంబులు పడేశా రనో, కొన్ని వేల మంది సైనికులో, నావికులో, సామాన్య పౌరులో నిహ తులయ్యారనో వార్తలు తప్ప మరేమీ కనబడేదికాదు. ఎప్పుడూ ఫిరంగుల మోతో, బాంబుల ప్రేలుడు చప్పుళ్ళో తప్ప మరొక శబ్దం వినపడడం లేదంటే అతిశయోక్తికాదు. ప్రతినిత్యం ప్రతిక్షణం ప్రాణములరచేతిలోపెట్టు కుని భీతావహులై ప్రజలు కాలం గడుపుకోడం చాలా ఆశ్చర్యంగా ఉన్నది. ఇటువంటి దుర్భర భయంకర భీతావహస్థితి అనూహ్యం , ఇదివరకెప్పుడూ ప్రపంచమంతకూ ఏకకాలమందు ఇటువంటి అనుభవం వచ్చిందని విని కూడా ఎరుగము.

చిత్రమేమిటంటే ఇంత దుర్భర భయంకర స్థితిలోనూ జనం ఈ విచిత్ర పరిణామానికి అలవాటుపడి ప్రతినిత్యమూ, ప్రతిక్షణమూతమను మృత్యువు వెంటాడుతున్న సంగతి కూడా విస్మరించి, నిర్భయంగా ఉన్నట్లే కనుపడుతూ ఏ విషవాయువో, ఏ తుఫానో హఠాత్తుగా వచ్చి ప్రజలను కొంత భయ భ్రాంతులను చేసినా దాని దారినది పోయినట్లుగానే, ఈ యుద్ధం కూడా నేడో రేపో పోకమానదు. అంతిమ విజయం మనం సాధించకపోము. అనే నిశ్చయముతో ఎవరికి వారు ధైర్యము చెపపుకొ న్నట్టు కాలక్షేపం చేసుకోడం చూస్తే చాలా ఆశ్చర్యంగా ఉన్నది. ఎవరి మట్టుకు వారు వారి దైనందిన కార్యక్రమం మార్పులేకుండా సాధ్యమైనం తలో జరుపుకుంటూనే ఉన్నారు యువకులు విద్యాలయాలకు వెడుతూనే ఉన్నారు. తమ క్రీడా కలాపాలు జరుపుకుంటూనే ఉన్నారు. సిని మాల్లోనూ, నాటకశాలల్లోనూ అన్నీ మామూలుగానే జరుగుతున్నాయి. ఎటొచ్చీ శత్రుసంహారానికి దోహదం చేయగలిగినవి ప్రజలకు మనోధైర్యం కలిగించేవీ, యువకులను యుద్ధమునకు పురికొల్పేవీ, ఈ సంబంధమైన నాటకములూ, పాటలూ ఎక్కువగా ప్రదర్శింపబడడం గమనించవలసిన విషయం. దేశాభిమానమును పురికొల్పేవీ నాటకాలు ఎన్ని రకాలుగా బయ లుదేరినవో లెక్కలేదు. ఇక మామూలు అలవాటు ప్రకారం సాయంకాలం తమదైనిక కార్యక్రమములు ముగియగానే యువతీ యువకులు ఎంత చీక టిగా వున్నా, వీధులలో దీపాలులేకున్నా, వాహ్యాలికి వెళ్లడం మానుకోలేదు. ఈ చీకట్లో అట్టే దూరం వెళ్ళకుండానే ఎక్కడికక్కడే ఆలింగనచుంబ నాదులు అనుకూలంగా జరుగుతుండేవి.

ఒక రాత్రి సుమారు తొమ్మిదిగంటలవేళప్పుడు జనం రోడ్లంటతి రుగుతూ, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ, ప్రేమికులు

ఆలింగనం చేసుకుంటూ, ముద్దు పెట్టుకునే సమయంలో శత్రువిమానాలు వచ్చే సూచనగా భయంకరంగా, సైరను కూత వినపడ్డది. రోడ్డులో జనం తొందర తొందరగా గృహోన్ముఖులయ్యారు. ప్రేమికులు భయభ్రాంతచిత్తులై ఆలింగనములను వీడలేక ఉత్తర క్షణంలో ఏమౌతామో అన్నట్లు మరీ దగ్గరగా ఒకరిలో ఒకరు కలిసిపోతున్నారు. ఆ క్షణంలో ఒక మేడ మీద నుంచి కిటికీ తలుపు గభాలున తెరచి ఒక వృద్ధ పురుష శిరస్సు కిటికీలోంచి ఇవతలకివచ్చి ఏమర్రా! మీకు బుద్ధుందాలేదా! త్వరగా ఇంటికి చావకపోతే యిక్కడే చచ్చూరుకుంటారు. బ్రతికి బాగుంటే ఈ కౌగిలింతలు అప్పుడే పునఃప్రారంభించవచ్చు. తెలిసిందా. వినపడుతోందా! అని కేకవేశాడు. ఆ కిటికీ సమీపంలోనే రోడ్డుమీద తన ప్రియురాలిని కౌగలించుకున్న ప్రేమికుడు కౌగిలి పట్టు విడవకుండానే పైకి చూచి "తాతగారు దయచేసి మీ తలకాయ లోపలికి లాక్కోండి లేకపోతే, మీ బట్టతలమీద పడు తున్న చంద్ర కిరణాలు పరావర్తనమై విమానాలకు మార్గదర్శకం కాగలదు" అన్నాడు.



దారిన పోతున్న వాళ్ళు, సమీపంలో నిల బడి ఒకటే నవ్వు. ఆయనకు విపరీతమైన ఆగ్రహం వచ్చి "నే వస్తున్నా ఉండండి. మీ తెగులు కుదురుస్తాను. కావరమెక్కి" అని తల లోపలకు తీసుకొని గభీ మని కిటికీమూశాడు. ఆయన నిజంగా కిందకు వచ్చి అల్లరిచేస్తాడేమో నని కొందరు యువతీ యువకులు తొలగ నారం భించారు.

ఈ మాటాడిన యువకుని బాహు బంధాలలో ఇమిడియున్న కన్య "ఏడిసినట్టే ఉంది. నీ తెలివితేటలు, రా అవతలికి పోదాం. ఆయన వచ్చాడంటే, ఆయన మన దుంపతెంపుతాడు. ఆయన మా నాన్న అన్న

సంగతి నీవు గమనించినట్టు లేదు." అన్నది ఆ మాటతో హడలిపోయి "బాబోయ్ రాత్వరగా! ఏమిటంత నెమ్మదిగా అడుగు వేస్తావేం" అని ఆ కన్యక రెక్కను పట్టుకొని దడ దడా దౌడు తీశాడు. ఇదంతా మా వీధి గుమ్మంలో నుంచుని ఆనందిస్తూ లోపలికి వెళ్ళడం మరిచేసరికి మా యజమానురాలి కూతుళ్ళిద్దరూ వచ్చి చెరో రెక్కా పట్టుకుని రండని లోపలికి లాక్కుపోయారు.

ఇంత భయంకర స్థితిలోనూ ఇంత నిర్భయంగా ఎలా బ్రతుకుతున్నారు ఈ ప్రజానీకం. అనుకుని ఆశ్చర్యపోతూ ఇలా ధైర్యంగా ఉండక ఏం చేయగలరు భయపడి గుండె బేజారై చావడంకంటే ఇదీ నిత్యజీవితంలో ఒక భాగమే అనుకుని సరిపెట్టుకోడం తదనుగుణ్యంగా కాలక్షేపం చేసుకోడం తప్ప మరో గత్యంతర మేమున్నది. అనుకుంటూ కూచున్నాను.

మర్నాడు పుదయం తొమ్మిది గంటలయ్యేసరికి ఆ సాయంకాలం ఇండియన్ అసోసియేషన్‌లో ఈ అత్యవసర పరిస్థితులను సమీక్షించడానికి ఒక సభ జరుగుతుందని అందరూ తప్పక హాజరు కావలసినదనీ ఒక ఆహ్వానం వచ్చింది. ఈ పిలుపు ఏమిటి, ఈ పరిస్థితుల సమీక్ష యేమిటి? దీని వలన ప్రయోజనమేమిటి? అని పరి పరి విధాల ఆలోచిస్తూ సాయంకాలం సకాలంలోనే సభకు వెళ్ళాను. మిత్రులంతా కొంచెం ఇంచుమించుగా అక్కడున్న భారతీయులంతా వచ్చి హాలు నింపేశారు. అంత క్రితం రోజునే యం.కె. గాంధి అనే బారిష్టరు ఒకాయన లండను వచ్చారనీ యుద్ధభూమిలో దెబ్బతిని వికలాంగులైన భారతవీరుల సహాయార్థం ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ ఒకటి యేర్పాటు చేస్తున్నారనీ నిన్నటి పత్రికల్లో వార్త ప్రసారమైంది. యిక్కడ సభలో సభాపతిగా మన దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు కూర్చుని • యుద్ధ పరిస్థితులు స్థూలంగా సమీక్షించి యే విధమైన సంబంధమూ లేని భారతదేశం కూడా యుద్ధంలోకి దిగి మన శక్తికి మించిన ధన ప్రాణనష్టం చేసుకోడం అవివేకం, అనవసరం, హాస్యాస్పదమంటూ గంభీరోపన్యాసం చేశారు. యిప్పటికైనా మనం కళ్ళు తెరుచుకుని మన యథార్థస్థితి మనం తెలుసుకుని ఈ యుద్ధంలో నుంచి యెలాగో బయటపడడం మన ప్రథమకర్తవ్యమనీ, తదనంతరం మనము మన దాస్య విముక్తికై స్వాతంత్ర్య సమరం సాగించడం మన ద్వితీయకర్తవ్యమనీ గంభీరోపన్యాసం చేశారు. ఆ ఉపన్యాసంతో అక్కడున్న యువకులు చాలామంది పులకాంకితులూ, ఉత్తేజితులూ అయ్యారు. తరువాత మనం ప్రస్తుత పరిస్థితులలో ఆయనెవరో గాంధీ అనే ఆయన

యేర్పాటుచేస్తున్న రెడ్ క్రాస్ సొసైటీలో చేరి వారితో సహకరించవలెనా, అక్కరలేదా అనే విషయం పై చాలా సేపు తీవ్ర వాదోపవాదాలు జరిగిన పిమ్మట, ఏ నిర్ణయమూ, తీర్మానమూ, లేకుండానే సభ ముగిసింది.

ఈ సమావేశము జరిగిన తరువాత ఇండియన్ అసోసియేషన్‌లో కూడా వాతావరణం గంభీరంగా ఉంటూ వచ్చింది. మునుపటివుత్సాహమూ, నిర్భయమూ అందరిలోనూ మృగ్యమైనాయి ఎవరిమట్టుకు వారు ఈ యుద్ధభారమంతా తామే మోస్తున్నట్లు ముఖాలు పెట్టుకొని తిరగడం ఆరంభించారు గాంధీ ప్రారంభించిన రెడ్‌క్రాస్‌లో కూడా ఆయన అనుకున్నంతమంది, అనుకున్నంత తొందరగా చేరడంలేదని వార్తలువస్తున్నాయి. భారతీయులంతా తప్పక విధిగా ఈ స్వచ్ఛంద సేవాదళంలో చేరడం మనకు గౌరవమూ, శ్రేయస్కరమూ అనే హెచ్చరికలు తరచు గాంధీ, పత్రికలలో ప్రచురణ చేస్తున్నాడు.

ఇలా ఒక వారం రోజులు గడిచిన తరువాత దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు ఒక డజను మందిని తనకు సన్నిహితులైన ఆంధ్రులను మాత్రము తన యింటికి టీకి పిలిచారు. అందులో నేనుకూడా ఒకడనని చెప్పుకొనుటకు చాలా గర్విస్తున్నాను. టీ, పానీయం, ఫలహారాలు నిశ్శబ్ధంగానే తొందరగానే ముగించాం. ఎప్పుడూ అలవాటులేని ఈ సమావేశాన్ని, ఈ పెద్దమనిషి యెందుకు ఏర్పాటు చేశాడాని ఎవరిమట్టుకు వారు ఊహాగానాలు చేస్తున్నారు. ఫలహారాలు కాగానే ఆయన గంటమోగించగానే లేండ్‌లేడీ వచ్చి ఈ కప్పులూ వగైరా అన్ని తీసుకుని టేబుల్ శుభ్రపరచి వెళ్ళగానే. గోపాలకృష్ణయ్యగారు తలుపు తాళం బిగించారు. ఇది మమ్మల్నందరనూ ఆశ్చర్యచకితులను చేసింది.

ఆయనవచ్చి కూర్చోకుండా నిలబడిఉపోద్ఘాతమేమీలేకుండా "మిమ్ములను ఈనాడు ఇక్కడకు యెందుకు ఆహ్వానించానని మీరందరూ ఆశ్చర్యపడుతున్నారని నాకు తెలుసు. వారం రోజుల క్రితం మన అసోసియేషన్‌లో అశాంతి బయలుదేరింది. ఈ యుద్ధమూ దీని పరిణామమూ భారతదేశం లాంటి దాస్య దేశాలపై దాని ప్రభావమూ మనము ఊహించలేకున్నాము. ఈ పరిస్థితుల తీవ్రత మనలో ఎవ్వరినీ తగినంతగా కలతబెట్టినట్లు తోచటం లేదు. ఇది యేదో గాలి వాటనీ, తుఫాను లాంటిదనీ, యెంత హఠాత్తుగా వచ్చిందో అంత హఠాత్తుగానూ పోతుందని మన మనుకుంటున్నాము. ఇప్పటికే, యూరపులో జరిగిన మారణహోమము యెంత భయంకరమైనదో మనం ఊహించుకోలేకుండా వున్నాం. ఈ మారణహోమంలో మన భార

తీయులను కూడా మన ప్రభువులు ఇక్కడకు రప్పించి వేల సంఖ్యలోనే లేక లక్షల సంఖ్యలోనేమో కూడా సమిధలుగా ఉపయోగించారు అన్న సంగతి మనకు పట్టినట్టు, లేదా మనం పట్టించుకున్నట్టు తోచడం లేదు. ఇంత దూర దేశంలో వున్న మనకు మనదేశంలో బయలుదేరిన రోదన, శబ్దము మన చెవులకు వినిపించకపోవచ్చు. అంతమాత్రాన అక్కడ అంతా ప్రశాంతంగా వున్నదని మనము సంబరపడడానికి ఎంత మాత్రమూ వీలు లేదు. నేనీ మధ్యను అనుభవిస్తున్న తీవ్రమనోవేదన ఇంతింతని చెప్పలేక పోతున్నాను. ఈ వేదన ఇతరులకు తెలిసేది కాదు.

ఇది దుర్భరం, దుర్యూహ్యం. అందుచేతను నేనొక నిశ్చయానికి వచ్చాను. అది మీతో చెప్పి మీ సహాకారమూ, అధమం మీ సాను భూతి అర్థించటవలెనని మిమ్మల్నిక్కడకు పిలిపించాను. దేశం నన్ను పిలుస్తోంది నేను అక్కడ వుండడం అత్యావసరమనిపిస్తోంది. నేనొక్కడనూ వెళ్ళి ఏదో చేయగలనని కాదు. కాని నేను మట్టుకు ఇక్కడ వుండలేను. నా కర్తవ్యం అక్కడికి వెళ్ళినిర్ణయించుకోవలసింది. ఈ చదువు ఈనాడు కాకపోతే బ్రతికి బాగుంటే మరోనాడు చదవవచ్చును. మీలో యెవరికైనా నాలాగే మానసిక ఆందోళన బయలుదేరి వుంటే నాతో బయలుదేరమని నా ప్రార్థన. నిష్కల్మషమైన సంకల్ప బలంతో, అకుంఠిత కార్యదీక్షతో మన మొకరిద్దరము బయలుదేరినా, అక్కడ మనవెంట బయలుదేరేవారు వందలు. వారివెంట వేలు, వారి వెనువెంట లక్షలు బయలుదేరతారు అనే నమ్మకం నాకున్నది.” ఆయన మాటపూర్తి కాకుండానే బాగానే వున్నదికాని, ఏదో కొంచెమయినా కనీస కార్యక్రమం మీరేమైనా ఆలోచిం చారా అని ఒక మిత్రుడు అడిగాడు.

“బాగుంది మీరడగడం సబబే. నేను వివరాలేమీ చెప్పలేను. కాని స్థూలంగా ఒక ఊహ నాకు తోస్తుంది. నేను వెళ్ళి పదిమందినో వంద మందినో కూడగట్టుకుని ప్రతి పట్టణంలోనూ వున్న పోలీసు ఠాణాలపై దాడి చేసి, అక్కడి ఆయుధాలను సంగ్రహించి వాళ్ళను అసహాయస్థితిలో, దుర్బల స్థితిలో పెట్టవలెనని నా వుద్దేశ్యము.

మాలో కొందరు నవ్వేరు. కొందరు మౌనం వహించారు, ఒకరి ద్దరేదో అనవలెనని అనడానికి సాహసం లేక వూరుకున్నారు. నాకు కొంచెం తొందరపాటెక్కువ కనుక నేను చిటుక్కున అనాలోచితంగా, రెండు స్టేషన్ల మీద దాడి జరపగానే మూడవ స్టేషను మీదకు మీరు వెళ్ళే అవకాశం లేకుండా మీ ఆట కట్టడులుందన్న సంగతి మీరూహించారా?

అలా జరక్కుండా దానికి ప్రతిక్రియ ఏమన్నా వూహించారా" అన్నాను. ఆయన నాకేసి చూసి మందహాసం చేసి "భలేవాడవోయ్, నీమాట మర్చే పోయాను నేను. నీకు సమాధానం తరువాత చెబుతాను. కాని నువ్వూ నా తోటి రాకూడదా" అన్నారు. "చిత్తం అంత అదృష్టమా? నా పరిస్థితి నాకిటువంటి సదవకాశము కల్గిస్తుందని అనుకోలేకుండా వున్నాను. అయినా మీరు వెళ్ళి మీ వుద్యమం ప్రారంభిస్తే నేనప్పుడు పరిగెత్తుకొ స్తానేమో ఇప్పుడేమీ చెప్పలేను. అయినా నన్ను మీ ప్రథమ శిష్యుడుగా లెక్కవేసుకోండి మీరు దారితీస్తే నాకిక్కడ కాలునిలుస్తుందనే నమ్మకం లేదు" అన్నాను. "సరే భవతు! అలాగే కానీ! మీరందరూ కూడా దీన్ని గురించి కొంచెం జాగ్రత్తగా ఆలోచించి మీకు తోచిన సలహాలేవైనా నాకు చెపుతే స్వీకరించడానికి నాకేమీ అభ్యంతరము లేదు. నా పిలుపు అందు కుని మీరందరూ ఈనాడు యిక్కడకు వచ్చినందుకు చాలా సంతోషం. ఈలాగనే కొన్నాళ్ళయిన తరువాతనైనా ఈనాటి నా పిలుపుకు వలెనే మన దేశ సంరక్షణకు స్వదేశానికి కూడా పరిగెత్తుకు రాగలరని ఆశిస్తు న్నాను. సెలవు" అన్నారు. అందరు నిశ్శబ్దంగా లేచి సెలవని యెవరిదారి వారు చక్కాపోయారు. వారం పదిరోజులు మేము మళ్ళీ కలుసుకోలేదు. యుద్ధం నానాటికీ భయంకరమవుతున్నది మనదేశం నుంచి ఇక్కడికి ఎవ రన్నా రావలనన్నా కష్టంగానే వున్నది. ఇక్కడనుంచి యింటికి వెళ్ళడం మరీ కష్టమైన స్థితి ఏర్పడ్డది. కారణమేమైనా మన గోపాలకృష్ణయ్యగారి ప్రయాణం సాగలేదు. నా తొందరా తగ్గింది దానితోపాటు.

ఇక్కడ జీవితం కొన్ని విషయాల్లో చిత్రంగానూ, మన పద్ధతులకు వ్యతిరేకంగానూ, కనపడుతుంది. ఇక్కడ యువతీ యువకులు కాస్త వయస్సు వచ్చినవాళ్ళు నిస్సంకోచంగా కలిసి తిరుగుతూండడం సామాన్య దృశ్యం. పరాయి వాళ్ళతోటి కూడా పరిచయాలు అతి సులువుగా చేసుకుంటారు. పెద్ద పెద్ద కుటుంబాలలో అయితే పరస్పరం తెలిసిన వారొకరు పరిచయం చేస్తేనే తప్ప, ఒకరితో ఒకరు మాట్లాడ్డం మర్యాద కాదు. మధ్య తరగతి యింకా తక్కువ కుటుంబాలలో ఈ పట్టింపులు పెట్టుకుంటే ఎలా కుదురుతుంది? మేమంతా యిక్కడ మధ్యతరగతి కుటుంబాలలోనే లెక్క. అందుచేత స్త్రీ పురుషాదులలో కొత్తవాళ్ళతో మాట్లాడవలెనంటే ఇంకొకరు పరిచయం చేయడం అవసరం లేకుండానే మనము మాట్లాడవలె ననుకున్న వ్యక్తి దగ్గరకు వెళ్ళి గుడ్ మార్నింగో, గుడ్ ఈవినింగో అని ఆపైన ఒక "ఎక్స్క్యూజ్ మీ" వాళ్ళ మొహాన పారవేసి పలకరించవచ్చును. ఎటొచ్చీ స్త్రీలతో పరిచయం యింత సులువుగా జరగదు. పురుషులకు

లేని సందేహాలు స్త్రీల కనేకముంటాయి. అందదుచేతను వారితో మాట్లాడవలేనంటే మాట్టాడి మర్యాదగా బయటుపడవలెనంటే కొంచెము ముందు వెనుకలు ఆలోచించి మరీ పలుకరించవలసి ఉంటుంది. మధ్యతరగతి వారిలో కూడా రెండు రకాలు, మధ్యతరగతిలో పై అంతరువు వాళ్ళూ బాగా తక్కువ వాళ్ళూ కొంచెమించు మించుగా సమానమన్నమాట అందు చేతను ఈజాతి స్త్రీ పురుషాదులతో పరిచయం సులువుగానే చేసుకోవచ్చు.

ఇక్కడ మా కాలేజీ విద్యార్థినులతో కాక, పైన కనపడే యువతులతో పరిచయం చేసుకోడం, వారితో వాహ్యాళికీ, సినిమాలకూ, నాటకాలకూ వెడుతూండడం, అక్కడ చాలా సన్నిహితంగా ఉండడం, అందరకూ అలవాటే. ఈ పరిచయాలు కొన్ని స్నేహితుల ద్వారా జరిగినా చాలా వరకు పరాపేక్ష లేకుండా జరుగుతూండడం కద్దు. ఏ సెలవు రోజునో మరొకప్పుడో సావకాశంగా సాయం సమయమందు వీధి వెంట వెడుతూంటే కొందరు యువతులు మన ముఖాలకేసి తేరిపార చూస్తూంటారు. మనము పరదేశస్థులమని భావము కావచ్చు. లేదా మనతో మాట్లాడితే ఎలా ఉంటుందో అనే కుతూహలమూ కావచ్చు. మనం కూడా వారికేసి చూసినప్పుడు వారు సిగ్గుపడకుండా కొందరు సాహసవంతులైన యువతులు ధైర్యం చేసి హలో అని వారేనా మనని పలకరించవచ్చు. కొంచెం భయపడుతున్న వాళ్ళయితే మనం పలకరించినా పలకరించవచ్చు. అప్పుడా హలోను సంభాషణలోకి సాగదీసి "సఖ్యం సాప్తదీనం" అన్నట్లు పదడుగులు వేసేటప్పటికే పరిచయమై ఏ కొండలమీదకో, సినిమాలకో వెళ్ళనూ వచ్చును. పరిచయం ఎక్కువ చేసుకోనూ వచ్చును. కొందరు కొందరితోకొన్ని అనుభూతులను పొందనూ వచ్చు. లేదా కబుర్లతోనే కట్టిపెట్టనూ వచ్చు. కొంచెం యిబ్బంది పడ్డా ఎవరూ అట్టే ఏమీ పట్టించుకోరు. నేనొకనాడు సముద్రతీర గ్రామానికి ఒకనాటి సెలవులలో వెళ్ళినప్పుడు పరిచయమైన అమ్మాయే మళ్ళీ ఇక్కడొక రోజున బజారులో తటస్థపడ్డది. ఒకరినొకరు చూచి మందహాసం చేసుకున్నాము. ఏమండి సేమ్‌గారూ! కులాసాగా ఉన్నారా! ఈ ప్రపంచ మెంత చిన్నదో చూశారా? అంది ఆ అమ్మాయి. నేను నవ్వుతూ "ప్రపంచం చిన్నదే కాకుండా గుండ్రంగా కూడా ఉంటుందని పెద్దలంటారని" అన్నాను. అందుకనే మనం యెక్కడెక్కడో తిరిగినా మళ్ళీ ఈ ప్రదేశంలో కలుసుకోగలిగాం. అన్నదామె. మీరు ఇక్కడ ఉద్యోగం ఇంకా సాగిస్తున్నారా అని అడిగేను. మరి ఏం చెయ్యనండి తప్పనిసరిగదా అన్నది. అయితే మీ బాధ్యత వహించేవారు ఎవరూ ఇంకా దొరకలేదా అన్నాను. "అంత బుద్ధిమంతులూ, భూతదయ

కలవాళ్లూ ఇంకా నాకు దొరకలేదుసార్. ఎప్పటికేనా మీలాంటివారెవరో బుద్ధమంతులు దొరక్కపోతారా అని ఆశతో కాలక్షేపం చేసుకొస్తున్నాను" అంది నవ్వుతూ. ఏమండీ మీ ఊహలు చాలా దూరం పరుగులెడుతు న్నాయి. ఇలా ముందరి కాళ్ళకు బంధాలు వెయ్యడం ఇంత చిన్నతనంలో యెలా నేర్చుకున్నారు అన్నాను. అబ్బెబ్బే ఆ ప్రయత్నం ఏమీ లేదులెండి, భయపడకండి" అంది నవ్వుకుంటూ అనుకోకుండా ఆర్థర్ సీట్ అనే కొండలమీదకి వెళ్ళాము.

అక్కడి కొచ్చేవరకూ ఇలా రావలెనని గాని ఇంత దూరం నడవవ లెననిగాని అనుకోలేదు. సరే వచ్చినవాళ్ళం యెలాగూ వచ్చాంగదా అని కొంతసేపు అక్కడ కూచోని కులాసాగా చేతులలో చేతులు కలిపి కబుర్లు చెప్పుకున్నాం. మా కబుర్ల మధ్య కాలగతి గమనించలేదు. తొమ్మిదిగంటలు దాటే ఉంటుంది. కొండమీదున్న జంటలు పల్చబడ్డారు. ఇది గమనించి మేమూ లేచి ఒకరిచేతుల్లో ఒకరిచెయ్యి తగిలించుకుని గృహోన్ముఖులమ య్యాము.

కొంతదూరం వచ్చి ఒక హోటల్లో ఫలహారాలు, టీ తీసుకొని మరి కొంతదూరం నడచి ఒక వీధి చివర యెవరి దారిన వారు వెళ్ళవల సివచ్చింది. నేను గుడ్‌నైట్ ఇక వెడదామా అన్నాను. నా చెయ్యి నొక్కి మళ్ళీ యెప్పుడు కలుసుకుందాము అంది. నీ యిష్టం అన్నాను. రెండు రోజుల తర్వాత కలుసుకోడానికి నిర్ణయించుకొని సంకేత స్థలం ఏర్పాటుచేసుకున్నాము. అయితే యెల్లుండి వరకూ గుడ్‌బై అని కర చాలనానికి నాచేయి జాపాను. ఆ అమ్మాయి నా చెయ్యిపట్టుకుని వెంటనే విడిచి పెట్టకుండా గుడ్‌నైట్ అని అలాగే నిలబడ్డది. ఇదేమిటి చెయ్యి విడిచిపెట్టదు అనుకుని మళ్ళీ ఒకసారి గుడ్‌నైట్ అన్నాను. ఆ అమ్మాయి నవ్వుతూ ఇదేం మర్యాదండీ అంది నా చేయి తనచేతిలోనే ఉంది. ఆవిడ భావమేమిటో నాకర్థం కాలేదు. తెల్లబోయి చూస్తుంటే ఒక్కనవ్వు నవ్వి నాకు దగ్గరగా వచ్చి తలయెత్తి గబుక్కున నా మూతిమీద ముద్దుపెట్టి, టా టా. అని చెయ్యి ఊపుతూ, నవ్వుతూ వెనకచూపు లేకుండా ఒక్క పరుగు తీసింది. నేను నిశ్చేష్టుడనై కొన్ని నిముషాలపాటు అక్కడే స్తంభించినట్లు నిలబడిపోయాను. ఈ అనుభవం చిత్రంగానే వున్నది. నేనిక్కడ చాలా నేర్చుకోవాలి అని అనుకుంటూ ఈ దేశ ఆచా రాలు కొన్ని బాగుండేటట్లున్నాయి అనుకుంటూ చక్కాపోయాను.

ఇది జరిగిన మరునాడు మా స్నేహితు డొకడు మహమ్మదీయ యువకుడు హడావుడిగా నా దగ్గరకు వచ్చి ఆ సాయంకాలం తన వివాహమనీ తప్పకదయచేయమనీ బలవంత పెట్టి వెళ్ళేడు. నాకాశ్చర్యమేసింది. ఇదేమిటి ఇక్కడ వీళ్ళతో వివాహమేమిటనుకున్నాను. మనకూ, వీళ్ళకూ ఎలా కలుస్తుంది. సంసారమెలా సాగుతుంది. అనుకున్నాను. అయినా ఈ వేడుక చూద్దామని సాయంత్రం వెడుదును గదా. అక్కడ తీరాచూస్తే పెండ్లికుమార్తె మా స్నేహితుని ఇంటి యజమానురాలి కూతురై ఊరుకుంది.




నేను నిర్ఘాంతపోయా చాలాసార్లు అతనా పిల్లతో చెట్టాపట్టా పట్టాలు వేసుకుని తిరగడం చూచాను. ఆ పరిచయం అంతకంతకూ సన్నిహితమై పరిణయం దాకా పరిణమిస్తుందని మేమెవరము ఊహించలేక పోయాం. వివాహం జరిగిపోయింది. స్నేహితులు చాలామంది వచ్చారు. అందరూ అభినందించి వధూవరులను లోలోపల ఆశీర్వదించి, విందారగించి, యెవరిదారిన వారు ఇళ్ళకు చేరుకున్నారు. నేనింటికి వచ్చిన తరువాత ఆ రాత్రంతా నాకునిద్రపట్టలేదు. ఇలా ఎలా జరిగిందనుకున్నాను. మనవాడేదో తొందరపడితే ప్రమాగిం-చిందనుకున్నాను. లేక ఇతడు ధనికుడని తెలిసి వీని నెలాగైనా వివాహము చేసుకొనవలెనని ఆ పిల్లే తొందర పెట్టినదా

అనుకున్నాను. తొందరపాటు ఎవరిదైనా ఫలితం ఒక్కటే. యిటువంటి వివాహములు ఎంతవరకూ జయప్రదమ్ములు అవుతావో చూడవలసి ఉన్నది. వధూవరులు వివాహానంతర విలాసయాత్రకు వెళ్ళిపోయారు.

మరునాడు నేనూ మా స్నేహితురాలూ అనుకున్నట్లు మా సంకేత స్థలంలో కలుసుకుని దగ్గరలో ఉన్న చిన్న హోటలుకు వెళ్ళి టీ తీసుకొని క్రిందటిసారి లాగానే కులాసాగా ఊసులాడుకుంటూ కొండమీదకి దారి తీశాం. అప్పటికి అక్కడ నిర్జనంగా ఉన్న ఒక పొదమాటున కూర్చుని పిచ్చాపాటీ కొంతసేపు మాట్లాడుకున్నాం. ఆ అమ్మాయి మాటల సందున నెమ్మదిగా నా కరగ్రహణం చేసింది. దానిపై తనచేయి అన్చి నన్ను కొంచెం దగ్గిరికి లాగినది. ఆభావము గ్రహించి నేను సన్నిహితంగా జరిగాను. నెమ్మదిగా నామీదకు వాలి నామెడను రెండు చేతులతోచుట్టి తన ముఖానికి సన్నిహితంగా తీసుకున్నది. నేను నవ్వుతూ గాఢంగా ఆలింగనం చేసుకున్నాను. ఆమె అంతకంటే గాఢంగా నా పెదవులను చుంబించింది. నేను ప్రతిక్రియ ఏమీ లేకుండా ఆలోచనలో పడ్డాను. ఇదేమిటి యీ అతి పరిచయం ఎక్కడకు లాక్కెడుతుంది. మన స్నేహితుడి సంగతి చూశాం గదా! అందుచేతను యీ ప్రణయము అట్టేదూరం వెళ్ళకుండా ఆపడం మంచిదేమో అనే ఆలోచన బయలుదేరింది. ఆ అమ్మాయి నాలో ఉత్సాహం లేకపోవడం గ్రహించి "ఏమిటండీ ఆలోచిస్తున్నారు. మీకు భయంగా ఉందా? మీ దేశంలో యువతీ యువకులు ఇలా విహారానికి వెళ్ళి పరస్పర ఆలింగన చుంబనాదులతో కాలక్షేపము చేసుకోవడము అలవాటు లేదా! అది తప్పుగా భావిస్తారా?" అన్నది. నేను నవ్వుతూ, "మా కిదంతా వింతగానే ఉంటుంది. మా వాళ్ళు యువతీ యువకులు కలిసి మాట్లాడుకోనే మాట్లాడుకోరు. విహారాదులకు అసలు వెళ్ళరు. ఇంకను ఆలింగన చుంబనాదులకు లవకాశమెక్కడ? వివాహితులే పడక గదిలో తప్ప ఇటువంటి ముచ్చటలు ఇంకొకరి యెదుట సాగించరు. అవతలివారు యెంత సన్నిహితులైనా సరే" అన్నాను.

ఆ అమ్మాయి కొంచెం కంగారుపడి "అయితే నేను తొందరపడ్డానంటారా తప్పుగా వ్యవహరించానంటారా" అన్నది కొంచెం దీనంగా.

"అదేం లేదమ్మా! యిక్కడ ఆచారమిదిగదా! మా కలవాటు లేక తెలియక నేను వుత్సాహంతో ప్రవర్తించలేక పోతున్నాను. నా సంస్కారం అనేక సందేహాలను లేవతీస్తున్నది. ఇంతకన్న మరేమీలేదు" అన్నాను. ఆమె నెమ్మదిగా నా ఒడిలోనే వాలి "అయితే చెప్పండి మీ

దేశమూ, మీ పద్ధతులూ మీ వివాహాలూ, దానికి పూర్వరంగం అన్నీ చెప్పండి సావకాశంగా. నేను తొందరపడి ఇక్కడనుంచి మిమ్మల్ని చర్చికి తిన్నగా తీసుకువెడతాను అని భయపడకండి"అన్నది. "అలాటి భయమేమీ లేదమ్మా! నాకిది కొత్త అన్నానుగాని పిరికివాడననలేదుగా! నేను క్రమేణా ఈ విలాసాలకు అలవాటు పడతానేమోకాని, అంతకుమించి పైకి పోతా నేమో అనే అనుమానం నాకున్నది. అయినా ఈ నిర్ణయాలూ, ఈ పర్యవసానాలూ, మన చేతుల్లో లేవుగా" అన్నాను. అలా ఎంతో సేపు ఆమె నా ఒడిలో పడుకుని నా కోటు బొత్తాలు తిప్పుతూ, నాబుగ్గలు నిమురుతూంటే నేనామె ముంగురులు సవరిస్తూ మనదేశపు కబుర్లు మన వైవాహిక సాంప్రదాయాలూ చెపుతూ ఎంతోసేపు కూర్చుని ఆ పూటకు అంతటితో ఆపి, నేను లేచి అక్కడనే పరస్పరం కౌగలించుకొని ముద్దాడి, యింటిముఖం పట్టాము.

# 24

ఇంటికి వచ్చిన తరువాతను కూడా ఏదీ చదవవలెనని బుద్ధిపుట్ట లేదు. ఒక విధమైన ఆశాంతి. ఆందోళనా బయలుదేరినాయి. ఏమిటీ స్థితి అనీ, ఇది ఉచితమో, అనుచితమో అనీ, చాలా సేపు మధనపడ్డాను. ఇది చిన్నప్పటి నుంచీ మా నాన్న మొదలైన పెద్దలు చేసిన అలవాటు. ఏ పని చేసినా పూర్వాపరాలు ఆలోచించుకుని ఉచితా నుచితములు తెలుసుకుని, మంచి చెడ్డలూ లాభ నష్టములూ తేల్చుకోవడం అవసరమని వారంటూండేవారు. అదే అలవాటైంది నాకు. ఈ నిర్ణయాలు తీసు కోడానికి అర్హత ఉన్నా లేకపోయినా యథాశక్తి, అన్నట్టు ఈ ధోరణిలో పడ్డాను. ఒక్కొక్కప్పుడు తాత్కాలికంగా ఈ పద్ధతి కొంచెం యిబ్బందిగా ఉన్నా కొంతవరకు బాగానే ఉన్నదేమో అనుకునే వాడిని.

ఆలోచించగా ఈ సాయంకాలం నాతో గడిపిన పిల్ల ఎంతసేపూ నాలో తిష్టవేసుకుని కూర్చున్నట్లు తోచింది. అందులో కిందటిమాటూ ఈ మాటూ ఆమె మాటా, ఆమె స్పర్శా, ఆమె రూపూ, ఆమె చూపూ ఆమె శరీరము నావహించిన గంధమూ అన్నీ చేరి నాకు ఒక విధ మైన మైకము కలిగించినట్లు అనిపించింది. నా స్వాతంత్ర్యం, నా వ్యూహ వెనకపడ్డాయి. ఆమె నాఒడిలో ఉన్నంతసేపూ నేనేమీ ఆలోచించలేకపో యాను. ఈ అనుభవమంతా నాకు సరికొత్త. మనదేశంలో సాధారణంగా నా వయసువాళ్ళకు ఇటువంటి అనుభవములు ఉండే అవకాశం లేదుగదా!

ఇక్కడకు నేను వచ్చి సుమారు 2 సంవత్సరములు అయినా కొంచెము ఇంచుమించుగా నా వయస్సులో ఉన్న ఏ కన్యతోనూ ఇంత సన్నిహితంగా మెలగలేదు. అప్పుడప్పుడూ మాయింటి ఆమె కూతురు నా దగ్గరకు వస్తూ అల్లరి చేస్తూ ఒకటి రెండుసార్లు నేనామెనో, ఆమె నన్నో ముద్దుపెట్టుకున్నా అదో అల్లరీ, ఆటా అనే భావనే తప్ప అలా అనుకుని వెంటనే అదంతా మరిచిపోవడం తప్ప, మరొక సంచలనమేమీ నాలో కలుగలేదు. ఈ అమ్మాయి దగ్గిర నిశ్చలంగా ఉండలేకపోతున్నాను. ఇది ఎక్కడి వరకూ వెడుతుందో ఊహించలేని స్థితిలో పడ్డాను. ఆ అమ్మాయి ఉద్దేశ్యమేమిటో అసలు తెలియడం లేదు. అవకాశం దొరికినపుడు అందినంత, లభ్యమైనంత ఆనందమును పొందవలెనని ఉద్దేశ్యమా లేక నన్ను ప్రేరేకపరచి వివాహము వరకూ తీసుకువెళ్ళవలెననే ఉద్దేశ్యమా? కేవలం అల్లరిపిల్ల కాదని ఇది వరకు మాటలవల్ల అనుకుంటూ వచ్చాను. వైవాహిక ఉద్దేశ్యమే ఉంటే తన జాతి వాళ్ళనందరనూ విడిచి నన్నెందుకు కోరుకుంటున్నది. నాకేమీ బోధపడక అయోమయంగా ఉన్నది. పోనీ నా విషయం ఆలోచించు కుందామా అంటే ఈ వేడిలో నేనేమీ ఆలోచింప లేకుండా ఉన్నాను. వచ్చిన ఆవకాశమును చేజిక్కించుకొని అనుభవించి విడిచిపెట్టవలెననే దురుద్దేశం ఏ కోశానా లేదనుకుంటాను. అటువంటప్పుడు నేను చేయదగ్గదేమిటి? ఏదో సాకు చెప్పి ఆ పిల్లను తప్పించుకు తిరగగడమా, లేక ఏం జరుగుతుందో చూదామని నిర్లక్ష్యంగా ఊరుకుని ఆ అమ్మాయిని కలుసుకుంటూ ఉండడమా, లేక వివాహ ప్రసక్తివస్తే నా అభిప్రాయమేమిటో ముందు నేనైనా తేల్చుకోవాలి గదా! ఇటువంటి విషయాల్లో ఎవరి నిర్ణయం వారే చేసుకోవలెనా, లేక స్నేహితుల సలహా అడగడం బాగుంటుందా అని ఆ రాత్రంతదా నిద్రపట్టక ఆలోచిస్తూ కూర్చుని నా మిత్రుడు రాజునిగాని, మరి ఎవరినేనా గానీ అడుగుదామని నిశ్చయము చేసుకుని, తెల్లవారుఝామున ఒక కునుకు తీసి మరునాడు మామూలుగా లేచాను.

రాత్రి ఆలోచనలన్నీ సూర్యోదయంతో చీకట్లులా మటు మాయమయ్యాయి. రాజుతో సంప్రదించవలెననే ఆలోచన కూడా వెనక పడ్డది. హఠాత్తుగా ఈ దేశస్థుడైన నా ప్రైవేటు మాష్టారుతోటి సంప్రదించడం బాగుంటుందనీ అయనే సరి అయిన సలహా చెప్పగలడనీ తోచింది. అందుకని వెంటనే ప్రాతఃకాల కార్యక్రమమంతా పూర్తి చేసుకుని మాష్టరు గారింటికి వెళ్ళాను. ఆయన నన్ను చూసి ఎంత సంతోషించాడో లెక్కలేదు. "హలో సేమ్ ఏమిటి, ఉదయాన్నే ఇలా వచ్చావు. ఏదో విశేషం

ఉంటేగాని ఇలారావడం నీ కాట్టే అలవాటు లేదు. కేవలం నామీద ఆదరం తోనో, గౌరవంతోనో వచ్చావని అనుకోలేకుండా ఉన్నాను. ముందు మన ముభయులమూ కాస్త టీ సేవిస్తే మన ఆలోచనా సరళి బాగుంటుం దేమో? ఏమంటావు. అన్నారు. "నేను అనడానికేమున్నది. గురువు ఆజ్ఞ శిరసావహించవలెనని మా పెద్దలు చెబుతారు. అందులో ఇటు వంటి విషయాల్లో మీ ఆజ్ఞ అత్యంతమూ అనుసరణీయము" అన్నాను. ఇంతలోటీ రానే వచ్చింది. ఆయన నవ్వుతూ నాకో కప్పు అందించారు.

మేము టీ ముగించి కప్పులు పైకి పంపించి రెండు నిమిషములు సావకాశంగా మౌనంగా కూర్చున్న తరువాతను "ఏమిటి సేమ్! ఏమిటి విశేషం. నీ ముఖవైఖరి చూస్తే నీవేదో ఆందోళన పడుతున్నట్లు కని పిస్తున్నది. నే చేయగలిగిన సహాయము ఏమైనా వుంటే తప్పక చేస్తాననే నమ్మకము నీకున్నది కదా? మరింక చెప్పు నీబాధ ఏమిటో" అన్నారు. "నేనందుకే వచ్చానండీ తమ సలహా ఆపేక్షించి ఇది కేవలం వ్యక్తిగత విషయమూ, మరొకరితో మనవి చేసుకోవలసిన విషయమూ ఏమీకాదు. అయినా మీబోటి వారి దగ్గర నాకు భయమెందుకని ధైర్యంగా మీ దగ్గరకు వచ్చాను." అని ప్రారంభించి నెమ్మదిగా ఈ మధ్యను జరిగిన నాకా కన్యతో కలిగిన పరిచయం, అప్పుడప్పుడు ఆమె కలుసుకుంటూ వుండడం ఆ కలయిక ఏ దారికి మళ్ళినదీ, ఎంతవరకు వెళ్ళినదీ ఏమీ జంకూగొంకూ లేక, దాపరికమూ లేక ఆయనతో అన్నీ చెప్పేను. దానిపైన నాకు కలిగిన అనుమానాలు, ఆందోళనలు కూడా చెప్పాను.

ఆయన యెంతో సావధానంగా విని ఫకాలున ఒక నవ్వు నవ్వారు. నా భయాందోళనలు నేను చెప్పుకుంటే ఈయన ఇంత ఇలా నవ్వుతా డేమిటి అనుకున్నాను. ఆయన నవ్వుమాని లేచి నాదగ్గరకువచ్చి నా వీపుతట్టి సేమ్! నాయనా! నువ్వెంత అమాయకుడవోయ్! ఈ స్వల్ప విషయానికి నీవింత బాధపడవలసిన అవసరంలేదు. మీ సంగతి నాకు తెలియదుగాని ఈ దేశంలో ఈ వయస్సులోవున్న యువతీ యువకు లకు ప్రతి వాళ్ళకూ ఇది అలవాటే. దీనిలో తప్పేమీవున్నదని మేమేమీ అనుకోము వయస్సుకు తగ్గ పరిణామమని సరిపెట్టుకుంటాం. దీన్ని మా భాషలో Flirtation అంటారు. నిరపాయకరమైన ఉత్సాహకరమైన కేళీవి లాసం దీనివల్ల జబ్బేమీ లేదు ఎరిగదా ఈ మాత్రందానికి భయపడితే వాళ్ళలో ఏదోజబ్బుంది. అని కూడా అనుకునే అవకాశం ఉన్నది. అందుచేత ఇప్పటివరకూ జరిగిన దానిలో తప్పుకానీ, ప్రమాదం కాని

ఏమీలేదు. ఇకనెటొచ్చీ ఇది శ్రుతిమించి రాగానపడితే మట్టుకు కొంచెం తీవ్రంగా ఆలోచించవలసిన విషయమే అవుతుంది. ఆకన్యకు నీమీద నిజమైన మక్కువకలిగి ఉండవచ్చు ఇదేమీ వింతా, అసాధారణమూ అయిన విషయమూ కాదు ప్రపంచము నానాటికీ సన్నిహితమై ప్రయాణ సౌలభ్యం ఎక్కువై దేశాలమధ్య రాకపోకలు ఎక్కువైనప్పుడు, ఈపరిణామంకూడా అనివార్యం అవుతుంది. మీ దేశస్థులను ఎంతో మందిని మాకన్యలు వివాహముచేసుకున్నారు. అందుచేతను ఈఅమ్మాయికి నిన్ను వివాహము చేసుకోవలెననే సదుద్దేశం కలగడంలో ఆశ్చర్యమేమీ లేదు. యెటొచ్చీ మీ మతానికి మీవాళ్ళ అభిమతానికి, నీ సంప్రదాయానికీ, ఆచారవ్యవహారానికీ యెంతో తేడా వుంటుంది. వాటితో ప్రతి నిత్యం, ప్రతిక్షణం ఏవో భేదాలు వస్తూనే వుంటాయి. అవి ఒకప్పుడు వైరుధ్యం పెంచడం కూడా జరగవచ్చు. అప్పుడు కొంచెం సంసారం సాగించుకోడం దుర్లభమే అవుతుంది. మొత్తముమీద ఈ రకమైన వివాహములు ఆదర్శ వివాహాలని నేను ఖచ్చితంగా చెప్పలేను. ఆ తుది నిర్ణయం నీవు చేసుకోవాలి. మీలో మీరు మీ అభిప్రాయాలను దాపరికం లేకుండా చెప్పకుని ప్రశాంత చిత్తంతో మీ స్నేహానికి యిబ్బంది లేకుండా నిర్ణయించుకోవలసిన తరుణం వచ్చినదని మట్టుకు నేను చెప్పగలను. బాగా ఆలోచించుకో అన్నారు. నేనేమీ అనలేక ఇకనక్కడ కూర్చోలేక వెంటనే సెలవు తీసుకున్నాను.

ఆ రోజంతా మా మేష్టారుగారు చెప్పినదాని గురించే మననం చేసుకుంటున్నాను. యేదో ఆందోళన. యేదో భయము యేదో అశాంతి రోజంతా ఏపని చేయడానికి తోచలేదు. ప్రశాంతంగా ఒక చోట కూర్చోలేక పోతున్నాను, ఏ పుస్తకమూ చదవలేక పోతున్నాను. యాంత్రికంగా విద్యాలయానికి వెళ్ళి వస్తున్నాను. కాని అక్కడ చెప్పేదేదీ వినిపించనూ లేదు, తలకెక్కనూలేదు.

ఇలా రెండు రోజులు ఎలాగో గడిపి మూడోనాడు సాయంకాలం మళ్ళీ నా స్నేహితురాలిని కలుసుకున్నాను. కలుసుకుని ఫలహారాదులు కానిచ్చి తిన్నగా దగ్గరలో ఉన్న ఒక సినిమాకు వెళ్ళాము. అక్కడ పిక్చరు ఒక ప్రేమగాథ తెరమీద నడుస్తున్నది. హాల్లో వున్న ప్రేక్షక జనమంతా ఎంతో వుత్సాహంగా చూస్తున్నట్టు అనిపించింది. నా సమీపంకలో వున్న యువతీ యువకులను చూస్తే వారి హావభావ విలాసచేష్టలు నాకు ఆనినంతవరకూ చూడగా మా వూహ రూఢమైనది. కాని మాకు మట్టుకు ఎందుచేతనో ఉండవలసినంత ఉత్సాహజనకంగా కనపడలేదు. కారణం చెప్పలేను.

బహుశా మేము ఉభయులమూ కూడా మామా ఆలోచనలలో నిమగ్నులమై ఉండడమే కారణమై యుంటుంది. నేననుకున్నట్టుగానే ఆ అమ్మాయి కూడా మా స్నేహం ఎటు పరిణమింపచెయ్యాలో, ఈ నాడేదో నిశ్చయానికి రావలెనని నిశ్చయము చేసుకోదలచిన దనుకుంటాను. పిక్చరు సగం కూడా ముగియకుండానే "సేమ్ ఈ పటం చాలా డల్‌గా లేదూ! నీకెలా ఉన్నా నాకు మట్టుకు తల నొప్పి వస్తుంది. మనం హాయిగా బయటికెక్కడకేనా పోయి కూర్చోకూడదూ అన్నది. సరే అలాగే చేద్దాము ఇక్కడ కూర్చోడం నాకూ కొంచెం ఇబ్బందిగానే ఉన్నది. అని ఉభయులమూ లేచి బయటికి వచ్చేశాము.



అక్కడి నుంచి ఈ మధ్యను మేము వెడుతూ వచ్చిన కొండల మీదకు ఎక్కాము. మేముక్కడకు చేరేసరికి సమ్మర్ధమాట్టేలేదు. ఇంకా బాగా చీకటి పడనూలేదు. నిర్జనంగా ప్రశాంతంగా ఉన్న ఒక పొదమాటున చతికెలపడాము. రెండుమూడు నిమిషాలుభయులమూ ఏమీ మాట్లాడలేదు. ఈ వ్యవహార మేదో ఒక కొసకు తేవలెనని ఆ అమ్మాయి కూడా

ఎందుచేతనో అనుకున్నదని నాకు తోచింది. ఇంతట్లో ఏ మాటా లేకుండా ఆ అమ్మాయి నాకు బాగా దగ్గరగా జరిగిన గబుక్కున కౌగ లించుకుని మాటామంచీ లేకుండా ముద్దుపెట్టుకున్నది. నేను నిశ్చలముగా ప్రతి చుంబనము చేయకుండా నన్ను కాదన్నట్టు కూర్చోవడం చూచి నిర్ఘాంతపోయి ఏమిటి సేమ్, అలా ఉన్నా వేం! అంత చల్లగా మంచులా గడ్డకట్టుకుపోయినట్లు ఏ చలనమూ కనిపించదే నీలో, మామూలుగా లేవు ఎందుచేతను? ఒంట్లో బాగా లేదా? నామీద నేమైనా కోపము వచ్చిందా? ఇదివరకెప్పుడూ మనం ఒకరి నొకరు కౌగలించుకున్నప్పుడూ, ముద్దుపెట్టు కున్నప్పుడూ ఇలా ఉండేవాడవుకావు. ఈనాడు నీలో రక్తం వేడి యెక్కడంలేదా నన్ను నీ కౌగిటిలో బంధించికోవలెననీ, నాకు ఊపిరి ఆడకుండా ముద్దులతో ముంచెత్తాలని లేదా? ఈనాడు నీ ప్రవర్తన నా కేమీ అర్థం కావడం లేదు. ఈ వేదన నేను భరించ లేకుండా ఉన్నాను. ఈ రెండు మూడు రోజులనుంచీ ప్రతిక్షణమూ నీవేనన్నావ హించి నీ మాటే నా చెవులలో మోగించి నీ చుంబనమే నా పెదవుల మీద నిలిపి, నన్నేదేదో చేస్తూ ఏ స్వర్గసీమలలోనో విహరింపచేస్తున్నట్లు విచిత్రమైన అనుభూతితో జాగ్రతో, స్వప్నమో, రాత్రో, పగలో తెలియని స్థితిలో వచ్చి నీ ఒడిలోవాలి, నా వేద వెల్లడించుకుంటూంటే మాట్లాడ వెందుచేతను? నేను భరించలేని బాధను చెప్పకుంటున్నాను సేమ్, ఇవన్నీ నీ నోటంట రావలసిన మాటలు. యే స్త్రీ తనకు తానుగా ఇంత విస్పష్టంగా తన భావాలను వెల్లడించదు. నేను లజ్జా విహీనురాలను అనుకుంటున్నావా సేమ్, నీవు చాలా అమాయకుడవనీ, పసివాడవనీ, యే అనుభవమూ లేక నా పరిచయంతో కలిగిన స్వల్ప అనుభవాన్ని కూడా పైకి చెప్పలేక సిగ్గుతో నీవు సతమతమవుతున్నావని ఊహించి నీ బాధతో పాటు వెల్లడించాను అనుకుంటున్నాను సేమ్, అంటూ ఉద్రే కంతో గాద్గదికతో చెపుతూ అశ్రుపూరిత నయనాలతో నాకేసి చూస్తూ జవాబు కెదురు చూస్తున్నట్లు నా ఒడిలో నుంచి లేచి కొంచెం దూరంగా జరిగి నావైపే చూస్తూకూర్చున్నది. నేనేం చెప్పను. కరిగి నీరైపోయాను. ఆ అమ్మాయి అన్నట్లే నేనైతే నా బాధ అంత స్పష్టంగా చెప్పలే కపోయే వాడిని. స్త్రీ స్పర్శ తగలగానే రక్తం కొంచెం వేడెక్కడం నాళాల్లో తొందరగా ప్రవహించడం, ఏదో గిలిగింతలు పెట్టినట్లు ఉండడం వంటికి ఒళ్ళు, రొమ్ముకి రొమ్ము, పెదవికి పెదవీ తగలడంతోటే పరవ శమై, లోకజ్ఞానం పోయి, స్వర్గసీమల విహరిస్తున్నట్లు అనిపించడమే కాని అంతకంటే ఈ తీయని వేదనను వర్ణించలేక పోయేవాడిని. వర్ణన లేకుండా

యధాతధంగా కూడా చెప్పలేకపోయే వాడిని. ఆ అమ్మాయి అన్నట్లే "యేమిసేమ్ మాట్లాడవా! యేమీ చెప్పవా, అని గడ్డం పట్టుకుని రెండవ చేతితో నాముఖం, కళ్ళు, చెక్కిళ్ళు నిమురుతూ తన ఒడిలోకి చంటిపిల్లవానిలా నన్ను తీసుకుని నా ముఖాన్ని తన రొమ్ముకు హత్తుకుంది.

అంతటితో నే పరవశుడనై ఎక్కడికో మహా ప్రవాహంలా కొట్టుకుపోతున్నట్టనిపించి నెమ్మదిగా ఆమె కౌగిలిలోంచి లేచి కూర్చుని బయటకి వస్తున్న కన్నీటిని తుడుచుకుని మళ్ళీ మవునంగా రెండు నిమిషములు కూర్చుని చూడమ్మా ఈ మన యిద్దరి గుండెల్లోనూ ఏకస్పందనమే వినిపిస్తున్నట్టున్నది. మన యిద్దరి తలల్లోనూ ఒకే వూహ తిరుగుతున్నది. యిది చాలా చిత్రంగా వున్నది. నీవన్నట్లే నీవు చెప్పినదంతా నేనే చెప్పవలెననుకునే వచ్చాను. నిన్ను చూడ్డంతోటే నీ గంభీరవదనం నన్ను కొంచెం వెనకాడించింది. నేనేమీ అనలేకపోయాను. ఐనా భావాలకు తగిన మాటలు నానోటికి అందలేదు. అందుచేతను ఏమీ అనలేక నిశ్చేష్టుడనై కూర్చున్నాను. నీవన్నదంతా ప్రతి అక్షరమూ యదార్ధమే. నేను నిన్నటి నుంచి కాదు నిన్ను విడిచి వెళ్ళినప్పటినుంచి ఒకే ఆలోచనతో ·వుక్కిరి బిక్కిరి అవుతున్నాను. మన అనురాగానికి పర్యవసానము యేమిటా అనే ఆలోచనలో పడ్డాను. నీవన్నట్టునే పసివాడినే. యే అనుభవమూ పొందని వాడినే. అందుచేతనే దాని పర్యవసానం హఠాత్తుగా స్ఫురించేసరికి హడలిపోయిన మాటకూడా నిజమే. అని ఈ బెదురే లేకుంటే ఈనాడు మన ఉద్రేకం ఒక కొనకు వచ్చేదేననుకుంటాను. ఆ వూహతో మరీ బెదిరిపోయాను. నా మాటలవల్ల నీకూ అటువంటి వూహే వచ్చిందని అనుకుంటాను. అందుచేతను యేమి చెయ్యాలో తోచక యేమి చెప్పాలో ఎలా చెప్పాలో అంతకంటె తోచక యే చైతన్యమూ లేనట్లు ·బొమ్మలా కూర్చున్నాను. అయినా శరీరం వేడెక్కక పోలేదు. రక్తప్రవాహ వేగము తగ్గనూలేదు, యెటొచ్చీ తరువాత అడుగు వేయడానికే సంకోచిస్తున్నాను. నీకూ అటువంటి వూహే కలిగినది కనుక మన ఉభయులమూ కూడా ప్రశాంతంగా మనస్థితి, మన భవిష్యత్తూ ఆలోచించుకోవలసిన తరుణం వచ్చింది.

మాదేశమూ మా ఆచార వ్యవహారాలు మీకు బొత్తిగా తెలియదనుకుంటాను. మాలో పరిచయంలేని యువతీ యువకులు పరస్పరమూ కలుసుకోవడమే అసంభవము. పరిచయస్థులు కూడా కలుసుకున్నా, రహస్య

స్థలాలలో కలుసుకునే అవకాశముండదు. వున్నా ఒక పట్టాన ఒకరి స్పర్శ చూపులలోనో లేక యెప్పుడో ఒకప్పుడు మాటలలోనో వ్యక్తం కావలసిందే కాని చేతలలోకి దిగడమంటూ యెన్నడూ వుండదు. ఇవన్నీ వివాహానంతర క్రియలే అప్పుడు కూడా అన్నప్పుడూ వీటి కవకాశం చిక్కడం దుర్లభం. అందుచేత నిక మనమూ కాస్త శాంతించి మన వుద్రేకాలకు సంకెళ్ళు వేసి మన విషయం క్షుణ్ణంగా ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రావాలి అని నిశ్చయం చేసుకున్నాను. నేనెక్కడ నుంచో దూర తీరాల నుంచి చదువుకని యిక్కడికి వచ్చాను. దైవికంగా ఎందుకో మనం కలుసుకున్నాము. మనకలయిక ప్రథమ పరిచయంతో అగక, కరచాలనంతో నిలువక, కౌగిలిలోకి అక్కడ నుంచి ముద్దుల వరకూ సాగింది. ఇక తరువాత మెట్టు ఒక్కటే మిగిలింది. మీ దేశంలోనైనా, మీ ఆచారం ప్రకారమైనా ఆ మెట్టు దాటడం వివాహమైతేగాని అంత సులభం కాదేమోననే ఆలోచన తోచింది. నీకూ, మాకూ, జాతిలోగాని, మతంలోగాని, ఆచారంలో గాని, సంస్కారంలోగాని, పొంతనకుదిరేట్టు కనబడ్డంలేదు. మన మిద్దరమూ ఏకమైతే అన్నిటమాట ఎలా ఉన్నా మన జీవయాత్ర సుఖంగా సాగుతుందా! ఏ పొర పొచ్చములూ క్షణ క్షణమూ పొడసూపకుండా ఉంటాయా? నేను మా వాళ్ళకు ఏకైక సంతానం, నీకోసం వాళ్ళను విడిచి రాలేను. నీవు మాత్రం మా దేశంలో ఉండగలవా? నీవంగీకరించి వచ్చినా మా వాళ్ళు మనలను గుమ్మంలోకి రానివ్వరన్న సంగతి మనం మరువకూడదు. ఈ పరిస్థితులలో మన వివాహమూ, వివాహానంతర జీవితమూ సాధ్యమేనా, అనే విషయం మనం ముందు తేల్చుకోవాలి. అది సాధ్యం కానప్పుడు మన ఉద్రేకమును వదులుకుని మన ప్రణయమును మరో దారిన పట్టించి నిన్ను విడిచి నా దారిని నేను పోతే జరగబోయేదేమిటో కూడా ఆలోచించుకోవాలి" అన్నాను.

వెంటనే ఆ అమ్మాయి నామాట కడ్డొచ్చి "నేన్ నేను అనుకున్నంతా, భయపడినంతా జరిగింది. ఎందుచేతనో నీవీరోజున ఈ ప్రశంస చేస్తావనే ఆలోచన నాకు తోచింది. దానితో ఈ కొలది రోజుల ఆనందానుభూతి ఎక్కడకు దారితీస్తుందోనని నేనూ పునర్విమర్శ చేసుకోవలసి వచ్చింది. నీకు తోచిన ఆలోచనే నాకూ తోచింది. కాని ఆ ఆలోచన తలకు తట్టగానేవ హడలిపోయాను. కొలదిరోజుల అనుభవంతోనే నీవు నాహృదయంలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నావు. హృదయంలోనే కాక నా అంతటా నీవే నిండి ఉన్నావు. మరీ క్రిందటిసారి నిన్ను విడిచి వెళ్ళినప్పటినుంచీ అనుక్షణమూ నా ఒళ్ళు పులకాంకిత మవుతూనే వున్నది. నీ

చేతులు నా ఒళ్ళంతా గిలిగింతలు పెడుతున్నట్టే ఉంది. నీ మధురవాక్కు నా చెవులలో గానం చేస్తూనే ఉన్నది. నీ పెదవులు నా పెదవులను పీల్చి పిప్పి చేస్తూనే వున్నాయి. నీ వేడి నిట్టూర్పులు, నా నిట్టూర్పులో కలసి నన్ను పరవశం చేస్తూనే ఉన్నాయి. నీ వెంతదూరంలో వున్నా ఇంకేమీ చెప్పను సేమ్, ఇంక ఎలా చెప్పను సేమ్. ఇవన్నీ ఎలా మరువగలను సేమ్. మరచి మనగలనా సేమ్. ఏమిటి మనకు గత్యంతరం. ఎలాగు మనము విడిపోగలం? నీ మాట నేను చెప్పలేను కాని నేను మటుకు అలా ఉండలేనేమో అనుకుంటున్నాను. పోనీ నీవున్నన్నాళ్ళూ అప్పుడప్పుడు నిన్ను కలుసుకుందామన్నా మన ప్రణయ పర్యవసానం చూడకుండా ఉండలేను సేమ్? నీవు మొగవాడవు పసివాడవైనా, ధైర్యశాలివే. నేనిదివరకెన్నడూ ఈ దేశంలో ఉండి కూడా ఇంతమంది మగవాళ్ళలో తిరుగుతూ కూడా ఏ ఒక్క రోజున కూడా ఇటువంటి అనుభవమును పొందలేదంటే నీవు నమ్మాలి సేమ్. నాకేమిటి దిక్కు, నేనేం కావాలి. నాకు మతిపోతుంది సేమ్ నీకు దూరమై బ్రతకను లేనూ సేమ్. భగవంతుడా! ఏమిటి నాగతి అంటూ వెక్కి వెక్కి ఏడుస్తూ నన్ను కౌగలించుకుని ఏడుస్తూనే నన్ను ముద్దుపెట్టుకొని ఎక్కిళ్ళతో నా మెడను కౌగలించుకుని ఉండి పోయింది. నేనెలా సముదాయించాలో, ఓదార్చాలో నాకు తోచలేదు. నే నామెను గట్టిగా పొదివి పట్టుకొని చెక్కిలికి చెక్కిలి చేర్చి చలనం లేకుండా, ఊపిరి కూడా విడవకుండా, ఎంతోసేపు అలాగే కూర్చునిపోయాను. కొంతసేప టికి ఆ అమ్మాయికి ఎక్కిళ్ళుతగ్గాయి. అశ్రుధారలు కట్టుబడ్డాయి. ఎంతో అలసట వచ్చినట్టు ఒళ్లంతా పట్టు విడిచినట్టు ముద్దలా నా పక్క నుంచి నా ఒడిలోకి జారిపోయింది. నేను నెమ్మదిగా నాజేబు రుమాలుతో ఆమె కన్నీరు తుడిచి, తలా చెక్కిళ్ళూ నిమిరి, కళ్ళు ముద్దాడి కొన్ని క్షణాలు గడపగా ఆమె నెమ్మదిగా లేచి కూర్చున్నది. లేచి సేమ్ మనం యింటికి వెళ్ళిపోదాం నేనిక్కడ కూర్చోలేను. ఈ సామీప్యం సహించలేను. నీ స్పర్శ నాకు దుర్భరంగా ఉంది. ఈనాటికిలా విడిపోదాం మళ్ళీ మనం కలుసుకుని ఈ ఉద్రేకం చల్లార్చుకుని, తుది నిర్ణయమేదో తేల్చుకుందాము ఇంకొక్క క్షణము ఇక్కడ ఉండలేను. నీవు నాతోకూడా రావద్దు." అని చెంగునలేచి నామాట వినకుండానే నే నడుగు ముందుకు వెయ్యకుం డానే, ఒక్క పరుగున వెళ్ళిపోయింది. నేను చేష్టలుడిగి శిలా ప్రతిమలా ఆమె వెళ్ళిన దిక్కేచూస్తూ ఎంతసేపో అలా నిలబడిపోయాను. నా పక్కగా వెడుతున్న వాళ్ళు కొందరు నన్నెగాదిగా చూసి ఎవడీ వెర్రి వాడు అనుకుంటూ చక్కాపోయారు. కొంతసేపటికి తెలివి తెచ్చుకుని బయటికి రాబోతున్న కన్నీటి నాపుకుని నెమ్మదిగా యింటివైపు సాగాను."

# 25

మాకు పరీక్షలు చాలా దగ్గరకు వచ్చాయి. అహర్నిశాదులు చాలా కష్టపడి చదువుతూనే వున్నాను. తప్పక కృతార్థుడనవుతాననే ధైర్యం వున్నా ఒకపక్కన చాలా బెదురుగా కూడా వుంటూనే వున్నది. భగవంతుడి మీద భారం వేసి నా ప్రయత్న లోపం లేకుండా చదువుకుంటూండగా హఠాత్తుగా ఒక రోజున నా స్నేహితురాలి దగ్గరనుండి ఒకసారి ఎలాగైనా వీలు చేసుకుని ఆ సాయంకాలం కలుసుకోమని ఎంతో దీనంగా బ్రతిమాలుతూ వుత్తరం వచ్చింది.

ఇదేమిరా భగవంతుడా, పిడుగులా ఇప్పుడీ వుత్తరమేమిటి? వెళ్ళడమా, వెళ్లక పోవడమా, వెడితే మళ్ళీ ఆమె సామీప్యంలో ఆమె చూపులలో పడి మైమరచి, నా చదువు వెనకపడుతుందేమో, వెళ్లకపోతే ఆ అమ్మాయి యిక్కడికే వస్తే నేను చేయగలిగన దేముంది? ముందు నుయ్యి వెనుక గొయ్యి అన్నట్టుగా ఏమీ చేయడానికి తోచక ఆ రోజంతా వికలమైన మన స్సుతో ఏమీ చదవలేక సాయంకాలము వెళ్ళి ఆమెను కలుసుకున్నాను. ఎంత సంతోషించిందో ఎలా చెప్పగలను! ఆ సంతోషం వెనుక విషాదరే ఖలు కూడా అలుముకొని అస్పష్టముగా కనబడుతూనే వున్నాయి. దగ్గర హోటల్లో కొంచెం టీ తీసుకుని మేము మామూలుగా వెళ్ళే చోటికి వెళ్ళి కూర్చున్నాం ఆమె నాకు బాగా దగ్గరగా కూర్చుని నా మెడచుట్టూ చేతులు వేసి, నా చెక్కిలిచేర్చి, ఎంతసేపో మౌనంగా కూర్చున్నది. కొంతసేపటికి కాని ఆమె కన్నీరు ధారగా పడుతున్న సంగతి నేను గమనించనేలేదు. అప్పటికి నేను తేరుకుని వులిక్కిపడి, ఆమె ముఖం నాకెదురుగా తిప్పుకుని కన్నీరు తుడిచి తడికన్నులను ముద్దాడి "యేమిటే బలహీనత, నీవిలా బాధపడితే నేను చూచి ఎలా ఊరుకోగలను? నాకా పరీక్షలు చాలా దగ్గరకు వచ్చినాయి. నేనీ దేశం వచ్చి మావాళ్లకు దూరమై ఇంతవ్యయ ప్రయాసలకోర్చి ఇప్పుడే చదువు ముగించుకోకపోతే మావాళ్ళేమంటారు? వాళ్ల మాటటుంచి నేనేమౌతాను. ఇక్కడ నన్ను చూచేవారెవరు? నాకు తిండి పెట్టె వారెవరు? ఇక నా ప్రేమను పురస్కరించుకొని, నీ చెంతనే వుండి నీ సంపాదనలోనే నేను కూడా బ్రతకడం భావ్యమేనంటావా? ఈ వేడి తగ్గిన తరువాత నన్ను భరించడం దుస్సహంకాక మానుతుందా? నీ మీదను ఇష్టంలేక నిన్ను వదిలించుకుందామనే వుద్దేశ్యంతో ఇవన్నీ చెబుతున్నానని అనుకోకు. నీబాధతెలుసు. నా బాధ అంతకెన్నిరెట్లో నీకు

తెలియదు. ఈ సందర్భంలో నాకెన్ని సమస్యలు వుత్పన్నమైనన్ను వేధిస్తు న్నాయో నీవు ఊహించనుకూడా లేవు ఇదంతా స్వప్నవతుగా నిన్ను మరచి పొమ్మని నేనను, నేను మరచిపోతాననీ చెప్పాను. కాని జీవితంలో కొన్ని సత్యాలను ఎంత బాధాకరంగావున్నా ఎదుర్కోక తప్పదు. ముదివయస్సులో అనవలసిన మాటలు ఈనాడు అంటున్నాననీ, వూరికే మాటవరుస కంటు న్నానని అనుకోవద్దు. అందుచేతను నా పరీక్షలయ్యేవరకూ మనం ఎడంగా వుంటే వుభయులకూ శ్రేయస్కరం అనుకుంటాను. నేనెలాగో బలవంతాన నా చదువుమీద మనస్సు నిలుపుకుంటాను. నీవుకూడా నీపని ధోరణిలో నిమగ్నురాలవై నా సంగతి మరచిపోవడానికి ప్రయత్నించు. ఇంతకంటే నేనేమీ చెప్పలేను. ఈ బాధాకరమైన వియోగం యెంత కఠినమైనా, మనకు తప్పదని చెప్పవలసి వస్తున్నందుకు విచారిస్తున్నాను." అన్నా నెంతో గంభీరంగా. ఆ అమ్మాయి నా చేతుల్లోనే ఇమిడి వూపిరికూడా తీసుకోకుండానే చెప్పినదంతా విని మళ్ళీ ఒక్కసారి వెక్కి వెక్కి ఏడ్చి నన్నొక్కసారి ముద్దు పెట్టుకుని "గుడ్‌బై సేమ్" అని వెనుతిరిగి చూడ కుండా చక్కాపోయింది. నేనెంతసేపో చలనం లేక, అనిమిషనేత్రాలతో, ఆమె వెళ్ళినవైపే చూస్తూ కూర్చున్నాను. కొంత సేపటివరకూ నా కళ్ళు కూడా అశ్రువులు వర్షిస్తున్న సంగతి తెలుసుకోలేక పోయాను. ఆ తెలివి కలగ్గానే కళ్ళు తుడుచుకుని ఏమిటీ వెర్రి అనుకుని తిన్నగా ఇంటికి చక్కాపోయాను. ఆ రాత్రి నాకు చదువేమీ సాగలేదు.

మరునాడు గతాన్ని తలచుకోకుండా చదువుమీదనే, కొంత యిబ్బం దిగా ఉన్నా. మనస్సు కేంద్రీకరించి చదవసాగాను. మధ్య మధ్య ఒకటు రెండు సార్లు ఆ అమ్మాయి ఉత్తరమూ, పత్తరమూ లేకుండా తిన్నగా నా గదిలోకి వచ్చి పది పదిహేను నిమిషములు కూర్చుని మరో ప్రశంస ఏమీ చేయకుండా "నన్ను మన్నించు సేమ్, ఒక్కసారి కంటితోనైనా నిన్ను చూచి వెడదామని వచ్చాను." అంటూ నేనివ్వబోయిన టీ కూడా తీసు కోకుండా వెళ్ళిపోతూ వచ్చింది. నేనేమీ అనలేకపోయాను.

నా చదువు పూర్తి అయినది. పరీక్షలకు వెళ్ళాను. చాలా బాగా వ్రాశాను. కూడాను. ఆ సాయంకాలానికి యెంతో బరువు పోయి మన సంతా తేలికై ఇంటికి వచ్చాను. నేను రాగానే నా లేండ్‌లేడీ కూతురు తిన్నగా లోపలకి వచ్చి "యేం సేమ్ మీ పరీక్ష లయిపోయినాయా? బాగా రాశారా? అని మా అమ్మ అడగమంది" అన్నది. "ఓహో అలాగా! నువ్వే అడుగుతున్నావనుకున్నాను. పాపం నీకంత ఆలోచన ఉండదుకదా!

బాగానే రాశాను అని చెప్పు" అన్నాను. ఇంతలో తల్లి కూడావచ్చి "సేమ్ గారూ బాగా రాశారా? చాలా సంతోషం! మీ కోసమని ఈ రోజున ప్రత్యేకంగా ఈ కేక్ తయారుచేశాను. మీరు తిని తీరాలి." అని కేక్ బ్రెడ్ టీ బల్లమీద పెట్టింది. "ఇదేమిటిలా ఒక్కడికే పెట్టారు. నాకంటే ముందే ఈ అమ్మాయి ఎవరో వచ్చి సిద్ధంగా కూర్చుందికదా! నన్ను తిననిస్తుందా? తింటే జీర్ణం అవుతుందా. ఇంకో ప్లేటుకూడా పెట్టండి ఇక్కడ అన్నాను. ఆమె నవ్వుకుంటూ లోపలకి వెడుతూ అయితే మీరు దాన్ని మీతోటి కూడా తీసుకుపోతారా ఏమిటి?" అంది.

"అమ్మయ్యో! ఈ రాక్షసిని భరించడం నాక్కాదుకదా నన్ను సృష్టించిన దేవునిక్కూడా శక్యంకాదు. నేవెళ్ళేటప్పుడు నా వెంటబడుతుందనే అనుమానం లేకపోలేదు. అందుచేత ఏ అర్ధరాత్రో, అపరాత్రో మంచిరోజు చూసుకుని చడీచప్పుడూ లేకుండా ఉడాయిద్దామనుకుంటున్నాను" అన్నాను.

"అవునులెండి పాపం మీ సంగతి నాకు తెలుసులెండి. మీకు తెలియని సంగతి ఒకటి చెబుతాను. ఇక్కడ మీ వ్యవహారమంతా మీ యింటికి ఉత్తరం రాశానులెండి. ఆ సంగతి తమరు తెలుసుకోవడం మంచిదని చెబుతున్నాను" అని అంటూంటే ఒక కేకు ముక్క కోసి గబుక్కున ఆ అల్లరిపిల్ల నోట్లో కుక్కి "యిక నోరు ముయ్యండి తమరు" అన్నారు.

ముసిల్ది నవ్వుకుంటూ చక్కాపోయింది. ఈ అమ్మాయి కోపంతో కుర్చీలోంచి లేవబోయింది. "కూర్చో పాపం, తొందరపడకు" అని ఒక్కమాటు ఈ బుగ్గా ఆ బుగ్గా ముద్దెట్టుకుని కుర్చీలో కూలద్రోసి నేను మళ్ళీ చేతికందకుండా ఎదురుకుర్చీలో వెళ్ళికూర్చుని ఏమీ ఎరగనట్టు గంభీరంగా నా ఫలహారం సాగించాను. ఆ అమ్మాయి ఫలహారం కూడా కాగానే "నువ్వూ మీ అక్కా పావుగంటలోతయారైతే సినిమాకు వెడదాం. ఆలస్యం చెయ్యక" అన్నాను. మా అక్క లేదండి అంది. ఇంట్లో ఉన్న సంగతి నాకు తెలుసుగాని పిచ్చి వేషాలు కట్టిపెట్టి త్వరగా డ్రెస్ వేసుకో. నువ్వు ఒక్కర్తివీ నాతో సినిమాలో నా పక్కన కూర్చుని కులుకుదామనుకున్నావు కాబోలు పాపం. నీసంగతి నాకు తెలుసు దయచేయి అన్నాను. ఒక్క ఉడాముని నా దగ్గరకు వచ్చి నా మెడ వంచి నన్ను ముద్దెట్టుకుని సేమ్ Your are a very very bad boy But all the same I love you అని చక్కాపోయింది. పది నిమిషాల్లోనే వాళ్ళు భయులూ తయారైనన్ను చెరో రెక్కా పట్టుకుని ఎక్కడికని నన్నడకుండానే వాళ్ళ యిష్టం వచ్చిన సినిమాకు తీసుకు వెళ్ళారు.

కొద్దిరోజులు ఏపనిపాటూ లేకుండా స్నేహితులందరినీ తిరగవేస్తూ ఒకపూట మా మాష్టరుగారిని కూడా కలుసుకుని తీరిక సమయాల్లో గ్రంథ కాలక్షేపం చేస్తూ, పరీక్షా ఫలితాలు ఎప్పుడు తెలుస్తాయా అని నిరీక్షిస్తూ కూర్చున్నాను.

హఠాత్తుగా ఒక రోజున సాయంకాలం బయటికి వెడదామని అనుకుంటూండగా, మా స్నేహితురాలు ప్రత్యక్షమై "నేను సమయానికే వచ్చాను రండి వెడదాం" అన్నది. సరేనని బయలుదేరి దారిలో ఉన్న హోటలుకు వెళ్ళి టీ తీసుకున్న తరువాత సినిమాకు వెళ్ళాం. అక్కడ బొమ్మ చూస్తూ ఏవో పిచ్చాపాటీ కబుర్లు చెపుతూ మధ్యను "మీ పరీక్ష లయిపోయినాయా బాగా రాశారా? నేనేమీ అడ్డురాలేదు కదా అన్నది. బాగానే రాశాను పాసవుతాను అనుకుంటాను" అన్నాను. "ఫలితాలు ఎప్పుడు తెలుస్తాయి" అంది. "దానికోసమే నిరీక్షిస్తున్నాను. నాలుగయిదు రోజుల్లో తెలుస్తాయనుకుంటాను అన్నాను. "అయితే తెలియగానే ప్రయాణమేనా మీ దేశానికి అన్నది." అవున"న్నాను. చాలా సంతోషం. మీరు కష్టపడి చదువుకున్నారు. పరీక్షలలో ఉత్తీర్ణులై వెడుతున్నారు. మీభవిష్యత్తు ఎదర పూలబాటగా ఉంటుంది. ఈ దేశం

ఎప్పుడేనా జ్ఞాపకమొస్తే ఇక్కడ వ్యక్తులు కూడా జ్ఞాపక మొస్తారనుకుంటాను మా కంతవరకే ప్రాప్తం అన్నది. తరువాత పిక్చరయ్యే వరకూ మాటలేక ఒకరి నొకరు కౌగలించుకుని కూరచున్నాం. తరువాత బయటికివచ్చి "మన మామూలు చోటికి వెడదామా" అన్నాను. "థాంక్యూ సేమ్ వద్దులెండి ఇలా విడిపోవడమే మంచిదికదా!" అన్నది ఇక నేనేమీ అనలేదు. అంతటితో ఎవరి దారినవారు వెళ్ళిపోయాం.



వారం రోజుల తరువాత పరీక్షా ఫలితాలు తెలిసినాయి. నేను ఆశించిన దానికంటే ఎక్కువగానే మొదటి తరగతిలో ఉత్తీర్ణుడనయ్యాను. ఆ సంతోషం పట్టలేక పోయాను. ఎవరితో ఈ ఆనందం పంచుకోను? ముందు మేష్టరుతోటీ, రాజుతోటే చెప్పి వాళ్ళ అభినందనలు తీసుకొని, నాబసకు వచ్చి మా లాండ్ లేడీ గదిలోకి వెళ్ళి నేను పాసయ్యానని చెప్పాను.

ఆమె ఏదో వంట చేసుకుంటున్న మనిషి బ్రహ్మానందపడి ఆ మురికి చేతులతోటే నన్ను గట్టిగా కౌగలించుకుని ఈ బుగ్గా ఆ బుగ్గా ఎంతో ప్రేమతో తన కొడుకుని ముద్దెట్టుకున్నట్టు ముద్దు పెట్టుకుంది. నన్నెంతో అభినందించింది. నిండుహృదయంతో చేసిన ఈ అభినందనకు నేను ముగ్దు డనయ్యాను. కూతుళ్ళిద్దరూ నవ్వుతూ నాకేసి చూస్తు నిలబడ్డారు. అలా నిలబడతారేం మీరేమీ అభినందనలు చెప్పరా? అన్నాను. చెప్పకేమండీ అందుకే నిలబడ్డాం heartiest congratulations అని ఇద్దరూ చేతులు జాపారు. "ఓస్ ఇంతేనా మీ అమ్మలాగే మీరూ అభినందిస్తారని ఆశి స్తాంటే ఊరికే చేతులు జాపి వూరుకుంటే ఎలాగూ" అని వారిద్దరినీ దగ్గరకు లాక్కుంటూ వారి నుంచి ఆశించినపని నేనే చేసి వూరుకున్నాను తల్లి కడుపు చెక్కలయ్యేట్టు నవ్వింది. పెద్దమ్మాయి కొంచెం సిగ్గుపడి బుగ్గలను గులాబీలు పూయించింది. చిన్నమ్మాయి కోపాన్ని అభినయిస్తూ "నువ్వు ఇలాటి అల్లరి పిల్లవాడివని తెలుసు నీ పని చెప్తాఉండు" అంది. "సరే అయితే రా" అని చెయ్యిపట్టుకుని నా గదిలోకి లాక్కెడదామని అనుకుంటూంటే నన్ను విదిలించుకుని పారిపోయింది.

పరీక్షా ఫలితాలు విద్యాలయంలో ప్రకటన కాగానే, ఆ ప్రకటన మన వాళ్ళందరూ చూడగానే నేను మొదటి తరగతిలో వచ్చానని తెలియగానే మనవాళ్ళంతా, వాళ్ళేకాక ఆంధ్రేతరులు కూడా ఎంత మందో తండో పతండాలుగా నా గదికి వచ్చి నన్నెంతగానో అభినందించి పైకెత్తేశారు. మనవాళ్ళు అందరిలో వయస్సులో నేను చిన్నవాణ్ణి కావడం, ఇంత త్వరలో పరీక్షకు వెళ్ళి ప్రధమ తరగతిలో రావడం, వాళ్ళందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఈ పరీక్షకు ముందే నేను "ఇండియన్ అసోసియేషన్"లో సహాయ కార్యదర్శిగా ప్రముఖ పాత్ర వహించడం, ఆ దేశానికి మన చెడుగుడి పరిచయం చేయడం నేనెంతో తొందరగా Golf ఆట నేర్చుకుని ప్రధమ తర గతి క్రీడాకారునిగా పేరు సంపాదించడంవల్ల నేనందరకూ సుపరిచితుడనూ, అభిమానపాత్రుడనూ అయ్యాను. ఈ వచ్చిన వారందరికీ సుపరిచితు

డనూ, అభిమానపాత్రుడనూ అయ్యాను. ఈ వచ్చినవారందరూ నన్ను అభినందించడమేకాక మా కందరకూ వెంటనే పార్టీ ఇస్తావా, చస్తావా అని కూర్చున్నారు. "మహాప్రభో నేనింకా చావదలుచుకోలేదు. అందుకని పార్టీ యిచ్చుకుంటాను. సాధ్యమైనంత త్వరలోనే ఏర్పాటు చేస్తాను. మా గ్రహస్థితి బాగుండనప్పుడు ఇలాంటివి వస్తూ ఉంటాయి. ఇక్కడ అయిన ఖర్చుకు ఇది వడ్డీ అనుకుంటాను. దయచేయండి." అని అందరినీ పంపించేసి, నా మిత్రుడు రాజును, అప్పుడొచ్చిన ముక్కు పొడుం గాణ్ణి, ఈ మధ్యనే రజస్వల అయిన కుర్రవాడినీ (పాపం ఆ పని చేసినది అతని భార్యలెండి) సంప్రదించి వారి సహాయంతో ఒక చిన్న హోటల్లో తేనీటి విందు ఏర్పాటు చేశాను. ఇదివరకు ఒకటి రెండుసార్లు చేసినట్టుగానే ఆఖరుసారి పులిహోర సత్యనారాయణ ప్రసాదంలాంటి రవ్వకేసరి నేనూ, రాజు కలిసి తయారుచేశాం. పాకం అద్భుతంగా అమిరింది. ఇదంతా తనవల్లనే అని మా రాజు అనుకున్నాడుగాని నేను మట్టుకు అతను నా ప్రక్కన నిలబడి భుజాలెగరేస్తుంటే ఈ ప్రసాదాలు తయారుకాలేదనీ వాటికా రుచిలేసని ఖచ్చితంగా నచ్చచెప్పాను. అతనెంతో చిన్న బుచ్చుకుని అలాగేచూద్దాం, ఇది మన మధ్య తేలే విషయంకాదు. సభాముఖాన్నో, కోర్టులోనో తేల్చుకోవలసిన విషయం ఇది. చూస్తూ వుండు అన్నాడు.

సాయంకాలం పార్టీ దిగ్విజయంగా జరిగింది. అందరూ యెంతో సంతోషించారు. నాకు తెలియకుండానే ఎవరో తబలా, హార్మోనీ తెప్పించి రహస్యంగా అక్కడ దాచి వుంచారు. పార్టీ ముగియగానే, టేబులు ఖాళీ కాగానే ఇద్దరు ముగ్గురు మిత్రులు తెలుగులోనూ, హిందూస్థానీలోనూ పాటలు పాడారు. నన్నూ పాడమన్నారు. నా చేతగాదన్నాను. నువ్వు పద్యాలు చదివేవు అన్నారు. కాదనలేక భాగవతం లోని కొన్ని, హరిశ్చంద్ర నాటకంలోని కొన్ని ఇంకేవో కలగా పులగంగా కొన్ని పద్యాలు చదివాను.

మిత్రులందరూ ఒకరి తరువాత ఒకరు ఉపన్యాస ధోరణిలో వారి హర్షామోదాలు తెలియపరచారు. కొందరు యెంతో చమత్కారంగా హాస్య రస ప్రధానంగా మాట్లాడారు. పెద్దలు అనుకున్నవాళ్ళు ఒకరిద్దరు నన్ను దిగ్విజయంగా జీవనయాత్ర సాగించగలననీ, ఇంటికి వెళ్ళగానే మామూలు పద్ధతిని మర్చిపోకుండా బుద్ధిమంతురాలైన రూపవతియైన, విద్యావతియైన, గుణవతియైన కన్యను చూసి వివాహం చేసుకోమనీ, అలా చేయనినాడు రవాణా చేస్తామనికూడా సలహాతోపాటు, అభయము యిచ్చారు. అంద రూనాతో కరచాలనం చేయడంతో హిప్ హిప్ హురే" అనే జయ [illegible]

ధ్యానాలతో పార్టీ ముగించి అందరూ ఎవరి దారిన వాళ్ళు వెళ్ళారు.

నా ఆనందం పట్టలేక పోయాను. అక్కడే కూర్చుని కొంతసేపు పొంగిపొరలి వస్తున్న ఆనంద బాష్పాలను అణచుకొని లేచి బయటకు వచ్చాను. నా మిత్రులంతా ఒక్కరూ మిగలకుండా నన్ను ఏకాకిని చేసి చక్కాపోయారు. నేను పరధ్యానంగా నడుస్తూ వస్తుంటే వీధి చివర నా స్నేహితురాలు నిలిచి వుండడం నాకాశ్చర్యం వేసింది. నేను "గుడ్ ఈవినింగ్ ఏమిటి ఇక్కడ నిలబడ్డావెందుకు? ఇలా వచ్చావేమి? నా బస చాలా దూరంకదా!" "ఈ వేళ పార్టీ వున్నదని ఇక్కడికి వచ్చి వుంటారని తెలుసుకుని మీరు ఒంటరిగా కనపడతారనే ఆశతో వచ్చి ఇక్కడ సుమారు గంట నుంచి వేచి వున్నాను" అన్నది. "అయ్యయ్యో ఎంత పొరపాటు జరిగింది. నీకెంత శ్రమ కలిగించాను. పార్టీకి అంతా మా దేశస్థులూ, నాతోటి విద్యార్థులే కానీ ఆడవాళ్ళ నెవ్వరినీ పిలవలేదు."

ఎవ్వరినయినా పిలిచి ఉంటే నిన్ను తప్పకుండా పిలిచి ఉండే వాడిని రా అలా పోదాం" అని కొంతదూరం నడిచి మామూలు చోటికి చేరుకు న్నాము. కూర్చుని కొంతసేపు లోకాభిరామాయణం చెప్పకుంటూ ఉండగా మాటల మధ్యను "అయితే యిక్కడ మీ పని పూర్తి అయినట్టే కదా!" అన్నది. "అవును బహుశా రేపు బారిష్టర్ పరీక్షా ఫలితాలు కూడా తెలు స్తాయి. నేను పాసయినట్టు ఈ మధ్యాహ్నమే వార్త అందింది. అందుచే తను పనిపూర్తి అయినట్టే. కొద్ది రోజులలో మీ అందరి దగ్గరా సెలవు తీసుకుని ఈ దేశానికి గుడ్‌బై చెప్పి వెళ్ళిపోవాలి. మళ్ళీ ఈ జన్మలో ఇక్కడికి వచ్చే అవకాశం ఉంటుందని అనుకోలేకుండా 'ఆశించను కూడా లేకుండా' ఉన్నాను." అన్నాను. ఆ ఆఖరు మాట అనేటప్పుడు నా కంఠంలో కొంచెము వణకు కూడా వచ్చింది. ఆ అమ్మాయికి కంట నీరే వచ్చింది. "సంద్రంపు టుప్పు అడవి ఉసిరి" అన్నట్టు ఎక్కడ భారతదేశం, ఎక్కడ స్కాట్లండు? నే నెవరినో? ఈ అమ్మాయి ఎవరో? మా కీ పరి చయం ఎందుకు కలిగింది? ఈ సంయోగం పర్యవసించకుండానే మళ్ళీ ఈ వియోగమేమిటి? అనే ఆలోచనలు ఏవేవో తలలో ముసురుకోవడము ప్రారంభమయినాయి. కొంతసేపు నేనేమీ మాటాడకుండా నిశ్శబ్దంగా ఉన్న సంగతే నేను గమనించలేదు. ఆ అమ్మాయి నా ముఖంకేసి తదేక దీక్షతో చూస్తూ "ఏమండీ? హఠాత్తుగా అంత గంభీరులై పోయారు. మనం విడిపోయే సమయము అసన్నమైనదని విచారిస్తున్నారా? ఎప్పటి కైనా తప్పదని అనుకున్నాం కదా! మీరే ఇలా అయిపోతే నేనేం కాను?

ఈసంయోగ వియోగములు మానవాళికి సహజమే కదా? తెలిసి కూడా బాధ ఎందుకు? చేతికందిన ఆనందమును అనుభవించడం, తరువాతను ఆ ఆనందంతోనే విడిపోవడంలోనే సుఖముంటుందనుకుంటాను.

చాలా చిత్రంగా ఉన్నది. నేను కూడా మీ ఆలోచనా సరళి లోనే [Moodలోనే] పడ్డట్టున్నాను. అత్యంత సన్నిహితుల ఆలోచనలు అలాగే ఏకముఖంగా నడుస్తాయి కాబోలు. నాకు ఇదో వింత అనుభవం" అన్నది. నేనూ తెలివి తెచ్చుకుని అతి ప్రయత్నం మీదను నా గంభీర ముద్ర వదలి మళ్ళీ మామూలు ధోరణిలో పడి కాస్సేపు కబుర్లు చెప్పుకుని మళ్ళీ ఇద్దరు ఒకే క్షణంలో కూడబలుక్కున్నట్టు వెడదామా అని ఏకకాలమందు లేచి నుంచుని ఏ ఉద్రేకమూ లేకుండా కేవలం కరచాలనం చేసిన ధోరణిలో ఒకరి నొకరు తేలికగా పెదవుల మీద ముద్దుపెట్టుకుని ముందుకు సాగాము.




నాలుగురోజుల తరువాత convocation జరిగింది. హాలుకిటకిటలాడిపోయింది. నేనెంతో కష్టం మీదను నాలేండ్ లేడీకూతుళ్ళకూ అక్కడ ప్రవేశానికి టిక్కెట్లు సంపాదించాను. ఆహాల్లో కూర్చున్నంత సేపూ నేను

ఈ లోకంలో, ఈ మానవాళి మధ్యనున్నాననే భావమే లేదు. వూహాలన్నీ నన్ను విడిచి వినువీధిలో విహారము చేయనారంభించినాయి. నా పేరు పిలిచినప్పుడు నిద్రలో ఎవరో నన్ను పిలిచినట్టు వినబడి లేచి నుంచుని ప్లాట్ ఫామ్ దగ్గరకు వెళ్ళి వారందించిన Hood తీసుకుని పెట్టా పట్టుకొని నా చోట్లో వచ్చి కూర్చున్నాను.

సభ ముగిసింది. అందరమూ బయటికి వచ్చాము. వచ్చి టాక్సీ కోసం చూస్తూండగా దూరాన నా స్నేహితురాలు వెనుదిరిగి నాకేసి చూడకుండా తలవంచుకుని వెళ్ళిపోవడం చూచాను. ఈమె వచ్చినట్లే నాకు తెలియదు. వస్తానని చెప్పలేదు. టిక్కెట్టు కావలెనని కోరలేదు. ఎలా శ్రమపడి వచ్చిందో పాపం, ఎంత అభిమానమో అనుకుంటూ ఆశ్చ ర్యపోతూ టాక్సీ పిలిచి నేను మా లెండ్ లేడీ కూతుళ్ళతో సహా యింటికి చేరాను. వాళ్ళ ఆనందానికి మేరలేదు. నామీదను వాళ్ళకింత అభిమాన మెందుకా అని ఆశ్చర్యపోయాను.

మరునాడు నాకాన్వొకేషన్ డ్రస్‌లో ఒక ఫోటో గ్రాఫ్, ప్రయాణా నికి దరఖాస్తుకు అవసరమైన ఫోటో ఒకటి తీయించుకొని వస్తూ మా యింటి ఆమెకూ పిల్లలకూ తలొక బహుమతీ కొని వాళ్ళ కిచ్చాను. మా లాండ్ లేడీ కూడా చక్కని పెట్టెలో ఒక వెండి ఫౌంటెన్ పెన్ బహు మతి చేయడం నాకెంతో ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగించింది. నేనిచ్చిన బహుమతులకు వాళ్ళు మరీ సంతోషించారు. చిన్న పిల్ల చేతికి బహు మతి అందిస్తూ నీకు రహస్యంగా ఇవ్వవలసిన బహుమతి వేరే ఉన్నదిలే అది తరువాత ఇస్తాను అన్నాను. ఆ పిల్ల దేవాంతకురాలు. నా వూహ యిట్టే గ్రహించి నాకీ బహుమతీ అక్కరలేదు. ఆ బహుమతీ అక్కరలేదు. ఇది వరకిచ్చినది చాలు అంది. పోన్లే నాకు మాత్రం చాలలేదన్నాను. అందుచేతను నీవుబుద్ధిమంతురాలిగా నే నిచ్చిన బహుమతులు బహిరంగంలో కాని అంగీకరించి తీసుకోవలసిందే దీనికి తిరుగులేదు ఈ నీముద్దు మొహం సాక్షిగా చెబుతున్న విషయం తెలిసిందా, అని రెండు బుగ్గలూ పట్టు కుని జాడించి నాగదిలోకి వెళ్ళిపోయాను. మరి నాలుగు రోజులు అయిన తరువాత నా పాస్‌పోర్టు వచ్చింది. అనగా నా ప్రయాణానికి అనుమతి అన్న మాట. వచ్చేటప్పుడు ఎవ్వరి అనుమతీ లేకుండా ఎవరితోటీ చెప్ప నైనా చెప్పకుండా తిన్నగా చక్కావచ్చాను. ఇప్పుడే యుద్ధమూలాన్ని ఈ తతంగమంతా ఏర్పడ్డది. మరి నాలుగురోజులలో అతికష్టంమీదను మెయిలుస్టీమరులో ప్రయాణానికి cabin దొరికింది. ఈవార్త తెలియగానే

అక్కడలేని సామాన్లన్నీ ఇక్కడ ఖర్చుపెట్టి అవసరమైనవి కొనుక్కుని సామాను సర్దుకోడంతో సరిపోయింది, నేను మా స్నేహితురాలుకు ఫలానా రోజున, ఫలాని రైలులో, ఫలానా స్టేషను నుంచి బయలుదేరి లండన్ చేరి, అక్కడ స్టీమరెక్కుతానని నన్ను మరచిపోయి అనుకూలుడైన యువకుని పరిచయం చేసుకుని వివాహమాడి సుఖపడమని కోరుతూ నాకు సెలవిమ్మని ఉత్తరం వ్రాశాను. కొన్ని కన్నీటి బిందువులు ఉత్తరం మీద పడి కొంత భాగం తెలియకుండా పోయిందను కుంటాను. మధ్యాహ్నము నామిత్రులందరి దగ్గరా సెలవు తీసుకుని సాయంకాలం పెందలాడే భోజనం చేసి ప్రయాణమై వెడుతున్నానని మా వాళ్ళతో చెప్పగానే వాళ్ళందరూ ఒకరి తరువాత ఒకరు కళ్ళనీళ్ళతో నన్ను కౌగలించుకుని ముద్దుపెట్టుకుని సాగనంపారు. ఆ చిన్నపిల్ల మరీ ఒకటే ఏడుపు. ఆ పిల్లను చూస్తే నాకెంతో ముద్దు జాలి ఆనందం కలుగుతుండేది. ఇటువంటి అమ్మాయి నాకో చెల్లెలు ఉండకూడదా అనుకునే వాడిని ఎన్నోసార్లు నేనూ. ఎంతో బాధతో బండిలో కూర్చుని వాళ్ళు టాటా అని చెయ్యి వూపుతుంటే బండికదిలింది, వాళ్ళు స్టేషనుకు కూడా రావలెనని ఎంతో కుతూహల పడ్డారుకాని నేనే వద్దన్నాను.

స్టేషనులో దిగగానే రాజూ, అనుకోకుండా మా ప్రైవేటు మాస్టరుగారూ, మరి కొందరు మిత్రులు వచ్చి నాకు టిక్కెట్టు వగైరాలు కొని రైల్లో నన్ను ఎక్కించి నేను సుఖాసీనుడను కాగానే వాళ్ళు సెలవు తీసుకొని వెళ్ళిపోయారు. బయలుదేరడానికి గంట మోతా, రైలు కూతా వినబడ్డాయి. ఇంకరైలు కదులుతుందని కడసారి స్టేషను చూద్దామని తల కిటికీ లోంచి బైటికి పెట్టి చూద్దునుగదా! నా స్నేహితురాలు చిన్న పెట్టితో నన్ను చూసి ఒక్క పరుగున నా పెట్టి దగ్గరకు వచ్చింది. పెట్టి కదిలింది. గభీమని ఆమె నా పెట్టెలోకెక్కింది. ఇది ఏమిటి? ఎందుకు వచ్చావు? రైల్లో ఎక్కి కూర్చున్నావేమిటి? అని నిర్ఘాంతపోయి వణుకుతూ అడిగాను.

"కూర్చోండి మరేం భయంలేదు. మీరంత దూరాన్నున్న మీదేశం వెళ్ళిపోతున్నారుగదా! అధమం లండనుదాకా నైనా మిమ్మల్ని సాగనంపుదామని కడసారి అక్కడ మీ కరచాలనమైనా చేద్దామనీ వచ్చాను. మీరేం బాధపడకండి" అంది.

నా పక్కనే కూర్చున్నది, తెల్లవార్లూ ఉభయులమూ పడుకునే ప్రయత్నము చేయలేదు. ఏవేవో అర్థం పర్థంలేని మాటలు చెప్పుకుంటూ

చిన్న పిల్లలకు మల్లే నవ్వుకుంటూ తెల్లవార్లూ కాలక్షేపం చేసుకున్నాము. ఉదయాన్నే లండనులో దిగి ఒక హోటల్లో చిన్నగది తీసుకుని స్టీమరు వేపుకు వెళ్ళి స్టీమరెప్పుడు బయలుదేరేది తెలుసుకుని పైకి వచ్చి మా స్నేహితురాలి సహాయంతో సామానంతా స్టీమరుకు చేర్చేసరికి మధ్యాహ్నం ఒంటి గంటయింది. మేము ఒక హోటలుకు వెళ్ళి భోజనం చేసి కాస్సేపు ఇటుఅటుతూలి తిరిగి రెండున్నరకల్లా స్టీమరు వేపుకు చేరుకున్నాం. నేను స్టీమరులోకి వెడుతుంటే తనూ నా క్యాబిను చూస్తానని లోపలకు వచ్చింది. చూచి ఐదు నిముషములు కూర్చుని స్టీమరు బయలుదేరుతుందని గంటా, సైరనూ వినగానే నన్ను గట్టిగా కౌగలించుకుని గాఢంగా ముద్దు పెట్టుకొని నా కళ్ళకల్లో చూస్తూ "సేమ్ ఈ కడసారి కౌగిలింతా, ముద్దూ, మాపూ



నా హృదయంలో నేను బ్రతికిఉన్నంత కాలం విలిచి ఉంటాయి. మీ వాళ్ళు చెప్పేటట్లుమరో జన్మ వుంటే అక్కడికూడా ఈస్మృతి, ఈ రూపం, నాతోనే ఉంటాయి గుడ్‌బై. నీకు సమస్త సౌఖ్యములూ, సమస్త విజయములూ పరమేశ్వరుడు అనుగ్రహించగలడు. గుడ్ బై సేమ్" అని గబగబా వెళ్ళిపోయింది.

ఆమె వెనుకనే నేనూ డెక్ మీదకు వచ్చి నిలబడి ఆమెకేసి చూస్తూ కన్నీటిపొర అడ్డగించిన కండ్లతో వణుకుతున్న చేతితో, రుద్దమైన కంఠంతో టాటా గాడ్ బ్లెసేయూ అని మూర్ఛపోయినట్లుగా డెక్‌కు వున్న యినుపకమ్మీల మీదికి తూలిపడ బోయాను.

పక్కనున్న ప్రయాణీకులు నన్ను పట్టుకుని ఒక కుర్చీలో కూర్చోపెట్టి కొంచెం టీ తెప్పించి ఇచ్చారు. నేనూ పూర్తిగా తేరుకుని కళ్ళు తెరిచే సరికి మా ఓడ లండను రేవు విడిచి మహాసముద్రంలో ఉరుకుతోంది.

# 26

సాయంకాలానికి నెమ్మదిగా డోవర్ జలసంధి దాటి మాస్టీమరు ఇంగ్లీషు ఛానలులో ప్రవేశించింది. అక్కడ తరంగముల గడబిడకొంచెం ఎక్కువగా ఉన్నా. యెలాగో తప్పించుకుని అట్లాంటిక్ మహాసముద్రంలో ప్రవేశించాము. అప్పటికే బాగాచీకటిపడింది. ఎన్నో వేలసార్లు ఆమార్గాన్నే నడచిన మా ఓడ, చీకట్లో దారితెలియనట్లు అడుగడుగూ తూచి వేస్తున్నట్లు నెమ్మదిగా ముందుకు సాగింది. ఎటు చూచినా గాఢాంధకారం ఆకాశాన నక్షత్రాలు తప్ప ఫ్రెంచి తీరాన వున్న యే పట్టణములలోనూ ఒక్క దీపకాంతికూడా కంటికగుపడలేదు. ఇదంతా యుద్ధభీతి కాబోలు, అడుగున అంతు తెలియని అట్లాంటికు మహాసముద్రం. మూడు సంవత్సరముల తరువాత మళ్ళీ సముద్రయానం చేస్తుంటే ఇంటికి వెళ్తున్నానన్న ఆనందం మళ్ళీ ఈ జన్మలో ఇందులో ఎంతమందిని కలుసుకోగలుగుతానా అనే భావన. వీటన్నికంటే మా ఓడ రాత్రింబగళ్ళు ప్రకృతి భీభత్సాన్నుంచి, శత్రువుల రాక్షసకృత్యాల్నించి తప్పించుకుని బయటపడి దారి తెలియని ఈ మహాసముద్రమును దాటి నన్ను ఇంటికి క్షేమంగా చేర్చగలదా? అని భయమొక్కటే కొంతసేపు బాధించింది.

భోజనానికి ఇంతలోనే పిలుపు వచ్చింది. కిందకు వెళ్ళాను. బల్ల మీద అందరితోపాటే అందరికి మల్లేనూ నాకూ పెట్టారు. నేను వెయిటర్ని పిలిచి "నాకీ భోజనం సరిపడదనీ, నేను శాకాహారిననీ, అన్నమూ, కాయగూరలు తప్ప మరొక పదార్థము గుడ్డయినాగానీ ముట్టననీ, వానికి నచ్చచెప్పాను. ఇప్పుడెలాగండి అన్నాడు. అవసరమైతే కాస్సేపుంటాను. లేకపోతే ఒక ప్లేటులో కాయగూరలూ, కొంచెం రొట్టె, వెన్నా, పుడ్డింగు, పాలు పళ్ళు తెచ్చిపెట్టమన్నాను. "ఇంతేనాండి" అని అన్నాడు. అవిచాలు. నేను చాలా అల్పసంతోషిని అన్నాను. వాడు నవ్వుకుని చక్కాపోయాడు. నాక్కావలసిన బంగాళాదుంపా, కేబేజీ కూరలూ, రొట్టె వెన్నా, సగ్గుబియ్యం పుడ్డింగు, పాలూ, అరటిపళ్ళూ సప్లయి చేశాడు. రేపటి నుంచి మరచిపోకుండా నాకు రెండుపూట్లా రెండు మెతుకులు అన్నంకూడా చేయించమని చెప్పాను. Sure sir certainly sir అన్నాడు భోజనమైన మరొక మాటు డెక్ పైకి వెళ్ళి కొంచెంసేపు పచార్లు చేసి అంతులేని అంతుపట్టని ఆ మహాసముద్రాన్ని ఆకాశాన్ని చూసి నెమ్మదిగా నాకేబిన్లోకి వచ్చి దుస్తులు విడిచి పడుకున్నాను. యెంతసేపు పడుకున్నా కంటికి

కునుకు రాలేదు. పడుకున్న నన్ను నా ప్రయత్నమేమీ లేకుండానే సముద్ర తరంగములు ఇటూ, అటూ దొర్లిస్తున్నాయి. మళ్ళీ తలలో ఏవేవో ఆలోచనలు తిరగడం ఆరంభించినాయి, మా యింటి యజమాను రాలూ, ఆమె కూతుళ్ళూ, ఆ చిన్నపిల్ల అల్లరీ, ఎక్కడ నుంచో వచ్చిన నామీద వాళ్ళు చూపిన ఆదరణ, మా ప్రయివేటు మాష్టరూ, నాకు Golf నేర్పిన యువగురువూ నాతో Golf ఆడిన మిత్రులూ, ఒకనాడు నాటకంలో సరసన కూర్చుని సరసమాడ యత్నించిన యువతీ, నన్నెంత గానో ఆకర్షించి ప్రేమించిన ప్రియురాలూ ఇంకా యెన్నెన్ని మోహాలో, ఎన్నెన్ని ప్రదేశాలో నా కళ్ళయెదుట సినీమాలో తెరమీద బొమ్మలలా తిర గడం మొదలెట్టినాయి. ఇవన్నీ చూస్తూ ఆ ముఖాలూ వాటివెనుకనున్న గాధలూ తలుచుకుంటూ యెప్పుడో నిద్రలోకి జారిపోయాను.

మరునాడుదయం ప్రభాత విధులన్నీ అయిన తరువాతను, సావకా శంగా డెక్‌మీదకి ఒకసారి వచ్చాను. పైన ఏదో రొదవినపడ్డది. ఇదేమిటని చూతునుగదా మా ఓడపైన ఇటొకటీ, అటొకటీ వాయు విమానాలు, మాతో కూడా సాగుతున్నాయి. ఇవేమిటి శత్రువిమానాలు కాదుగదా, అనే భయం ఒక్కక్షణం కలిగింది. అంతలోనే శత్రువులవే అయియుంటే మన ఓడ ఇంత నిశ్చింతగా ప్రయాణం చేస్తుందా అని సమాధానం చెప్పు కున్నాను. ఇంకొక క్షణం అయిన తరువాతను మా ఓడ కిరుప్రక్కలా కొంచెందూరంలో యుద్ధ నౌకలు కూడా ఫిరంగులు అమర్చుకొని మా వెంట వస్తున్నవి కనపడ్డాయి. అప్పుడు నాకు సమీపంలో ఉన్న ఒక పెద్ద మనిషిని పిలిచి ఈ పైన విమానాలేమిటి? అడుగున యుద్ధనౌకలేమిటి? వాటి దారినవిపోతున్నాయా? మనతో వస్తున్నాయా? అని అడిగాను. అతను నన్నొకసారి ఎగాదిగా ఇంత తెలివితక్కువేమిటన్నట్టుగా చూచి మనది మెయిల్ స్టీమరు టపాలు వెడుతుంటాయి. మామూలు ప్రయాణీకు లను తీసుకు వెళ్ళే ఓడలేవీ తిరగడం మానేసినాయి. ఈ రోజుల్లో ఇంత మహాసముద్రము ప్రయాణీకులకు చాలా భయంకరమైన ప్రదేశముగా మారిపోయినది. రాత్రింబవళ్ళు అనుక్షణమూ పైన శత్రువిమానాలో, సముద్రంమీద శత్రునౌకలో, నీటి అడుగున శత్రువుల జలాంతర్గాములో తిరు గుతూంటాయి. మన సంరక్షణార్థం పైన రెండు విమానాలు సముద్రం మీద రెండు యుద్ధనౌకలు మనకు సహాయంగా గవర్నమెంటు ఏర్పాటు చేసింది. సురక్షితంగా సూయజ్ కాలువలో ప్రవేశించేవరకూ, అవి మన కూడా ఉంటాయి.” అని చెప్పాడు. దానితో మనస్సు కొంత శాంతిపడ్డా,

వెనుకటి భయం కూడా మళ్ళీ కొంచెం తలెత్తకపోలేదు. ఈ ఓడలమీద ప్రయాణీకుల సౌకర్యార్థం డెక్ మీద కూర్చోడానికి కాన్వాసుగుడ్డ, పడ క్కుర్చీలు అద్దెకు ఇస్తారు. బొంబాయిలో దిగిన తరువాత వాట్లను మళ్ళీ భద్రపరచుకుంటారు. నేనొకటి తీసుకుని ఏదో పుస్తకం ఒకటి చదువు కుంటూ కాలక్షేపం చేసుకో నారంభించాను. అప్పుడెవరో ఒక యువకుడు నా పక్కన వచ్చి నిలబడి, నన్ను పలకరించి "ఏమిటి చదువుతున్నా"ర న్నాడు. "కాలక్షేపానికి ఒక నవల" అన్నాను. "ఇక్కడ లైబ్రరీలోదా" అన్నాడు. "కాదది నా సొంతమేను" అని "ఇక్కడ లైబ్రరీ ఉంటుందా" అన్నాను. "ఎందుకుండదూ? లేకపోతే మనలో కొందరికి కాలక్షేపం కావ డమెలాగు మీకు తెలియదా లైబ్రరీ ఉంటుందని" అన్నాడు. "నాకు తెలియద"న్నాను.

"రండి చూపిస్తా"నన్నాడు. నన్ను తీసుకు వెళ్ళి లైబ్రరీ చూపిం చాడు. ఇతరుల కాలక్షేపానికి కొన్ని ఇన్‌డోర్ గేమ్సుకూడా ఉంటువన్నీ, పింగ్‌పాంగ్ టేబుల్, పేకాట టేబుల్స్, చదరంగం బల్లలూ చూపిం చాడు. "డెక్‌పైన బేడ్‌మింటన్ కూడా ఆడతారన్నాడు. ఇవి చాలక మరికొందరు ఉత్సాహంగా స్టీమరు దాని మార్గాన్ని, గంటకు ఎన్ని మైళ్ళు ప్రయాణం చేస్తుంది. ఇప్పుడు మనం ఎంతదూరం వచ్చాము. అని పందాలు వేసికొనే వాళ్ళుకూడా ఉంటార" న్నాడు. ఇలా ఈ నూతన పరిచయస్థునితో కబుర్లు చెప్పకుంటూంటే మధ్యాహ్న భోజనమునకు వేళ అయినది. క్రిందకు వెళ్ళి భోజనాలకు కూర్చున్నాం నిన్నను గమనించని విషయం ఈనాడు తెలిసింది. భోజనాల బల్లమీద ప్లేటు ఓడ ఊపుకి ఇటూ, అటూ పరుగులెత్తకుండా ప్రతీ వరుసలోనూ పల్చని బల్లలు అడ్డు పెట్టారు. తరువాత పదార్థాలు వడ్డించేవాళ్ళు, పళ్ళాలుచేతితోపట్టుకుని, అవి పడిపోకుండా డాన్స్ చేస్తున్నట్టు నడవడం ఆరంభించారు. ఏదీ కాని వేళ వీళ్ళ భరతనాట్యం ఏమిటనుకున్నాము. పోనీ ఇంగ్లీషు నాట్య మైతే మటుకు, ఇప్పుడెందుకనుకున్నాను. నా ప్రక్కనున్న పరిచయస్థునితో నెమ్మదిగా ఈ విషయమడిగాను. వాళ్ళెందుకు అలా డాన్స్ చేస్తున్నారు అని" నేనేదో చమత్కారంగా మాట్లాడినట్లు ఎంతోసేపు నవ్వి. "అది డాన్స్ కాదండీ మనమూ ఆ నడక అలవాటు చేసుకోవలసి ఉంటుంది. ఓడ ఇటూ అటూ ఒరుగుతూ ఉంటుంది కదా, అందుచేతను నిటారుగా నిలబడి ఉన్నా, అలాగేనడుస్తున్నా ఓడ ఒరిగినవేపు మనం తూలుతూ ఉంటాం. అలవా టులేని వాళ్ళు తరచుపడిపోతూ ఉంటారు కూడాను. అందుచేతను, ఓడ

జరిగిన వేపు కాక ఎదరి వైపుకు మనం వాలుతూ నడుస్తూంటే ఎంత తుఫానులోనైనా మనం పడిపోయే అవకాశం ఉండదు. అందుకని ఈవేళ నుంచీ మీరు కూడా ఈ నడక అలవాటు చేసుకోవలసి ఉంటుంది. లేకపోతే చాలా ఇబ్బంది పడతారు" అని హెచ్చరించాడు.



కొంచెంయించుమించుగా ఆపూటంతా ఈ డాన్స్ లాంటి నడకో, నడకలాంటి డాన్సో అలవాటు చేసుకోడానికి ప్రయత్నించాను. కొంతవరకు కృతార్థుడనయ్యాను అనుకుంటాను.

సాయంకాలం 7 గంటలయ్యే సరికి మార్సెల్సు హార్బర్‌లోకి మా ఓడ ప్రవేసించింది. మా రక్షకభటులు, యుద్ధనౌకలు హార్బర్‌కు వెలుప

లనే నిలిచిపోయినాయి. విమానాలు యెక్కడికో తప్పుకున్నాయి.

మనస్టీమరు రాత్రంతా ఇక్కడ వుంటుందా అని నౌకరు నడిగాను. ఉంటుందండీ అన్నాడు. "అయితే వూళ్ళోకి వెళ్ళవచ్చునా" అన్నాను. వెళ్ళవచ్చునన్నాడు. నమ్మకమేనా అన్నాను. నమ్మకమేనండి అయినా పది గంటలలోపున వచ్చేసేయండి అన్నాను. నేనేమీ తోచక పగటివేళ చూచిన మార్సెల్స్ రాత్రి ఎలా ఉంటుందో చూదామని కుతూహలంతో బయలు దేరాను. యెంతో దూరం నడచి ఊరు మధ్యన వెళ్ళిచూతును గదా! వీధులన్నీ అంధకారబంధురంగా వున్నాయి. మనుష్య సంచారం మామూ లుగానే వున్నది. నడుస్తూండగా మిణుకు మిణుకుమనే దీపాలతో సన్నని సంగీతంతో ఒక హోటల్ కనబడ్డది. లోపలకు వెళ్ళి కూర్చున్నాను. రద్దీగానే వున్నది. టీ, ఫలహారము తెమ్మన్నాను. వాడు ప్రశ్నార్థకంగా ముఖం పెట్టి నాకేసి చూశాడు. అప్పటికి నా తెలివి తెల్లారిందని తెలుసు కున్నాను. నేనప్పుడు ఆక్షణంలో ఫ్రాన్సులో వున్నానని ఇక్కడ యెవళ్ళకూ అంగ్లంరాదు, అనే విషయం స్ఫురణకు వచ్చి నాకు ఫ్రెంచి రాని విషయం కూడా జ్ఞాపకం తెచ్చుకొని కేవలం సంజ్ఞా పరిచ్ఛేదంతో నా అభిప్రాయం తెలివిడి చేసి ఫలహారం ముగించుకుని డబ్బు చెల్లించి బయటపడ్డాను. అక్కడ నుంచి యెటు పోవడానికీ తోచక అక్కడ చాలా సమీపంలోనే కన పడ్డ సినిమాహాలులో ఫ్రెంచి పిక్చర్లు యెలా వుంటాయో చూడబుద్ధిపుట్టి లోపలకు వెళ్ళాను. జనం క్రిక్కిరిసి వున్నారు. అక్కడ నౌకరు నాకు ఖాళీ స్థలం చూపించాడు. కూర్చున్నాను. కొద్ది క్షణాలు తరువాత నా పక్కను ఒక యువతి కూర్చున్నదనే జ్ఞానం నా నాసికా పుటాల వల్ల తెలిసింది. అటుతిరిగి చూచాను. ఆమె నన్ను చూచి మందహాసం చేసింది. నేనూ నవ్వి తెరకేసిచూస్తూ కూర్చున్నాను. మరి రెండునిమి షాలకు మరో చెయ్యి నా వెనుకకు యెగబ్రాకింది. యింకొక క్షణానికి ఒక మృదువైన చెక్కిలి నా చెక్కిలినీ గాలికి రెపరెపలాడే ముంగురులు నా ముఖాన్ని గిలిగింతలు పెట్టినాయి. ఎవరీ అమ్మాయి? ఇంత తొందరపాటు సాహసం ఏమిటి? అనుకున్నాను. మాట్లాడ్డానికి నాకు ఫ్రెంచి రాదు. అనాలోచితంగా యిలా బయటికెందుకొచ్చాను? యెంతసేపు చూసినా కూర్చున్నా యింతేగదా! యెందుకైనా, వెంటనే మన ఓడకు చేరుకోడం చాలా మంచిదనుకున్నాను. మాట్లాడకుండా లేచి ఆ అమ్మాయి చెక్కిలి ఒకసారి స్పృశించి గబగబా బయటికి వచ్చాను.




ఆ అమ్మాయిని నే నాహ్వానించానను కుని తనూ నా వెన కలేచి వచ్చింది. నేనా సంగతి గ్రహించి బాబోయ్ అనుకుని వేగం హెచ్చించి రోడ్డుమీదకు వచ్చాను. నేను వూళ్ళోకి వచ్చే టప్పుడు ఓడరేవుకు దారె లాగో తెలుసుకోలేదు. నేనా క్షణంలో వున్న ప్రదేశమేమిటో అసలే తెలియదు.

ఇంక నిలుసేరు ఉపాయమెద్ది? అన్నట్టుగా ఈ పరాయి పరాసు దేశంలో చిక్కుపడ్డాను, ఓడకు చేరడమేలాగు భగవంతుడా అని పరి పరి విధాల వాపోయాను. కొంచెం దూరం నడవగానే టాక్సీ ఒకటి కనపడ్డది. వాణ్ణి పిలిచి నన్ను ఓడ రేవుకు తీసుకెళ్ళమన్నాను. వాడికి నా బాష అర్థం కాక వాడి కర్థమైన భాష నాకురాక మేమీద్దరమూ నానాయాతన పడ్డాము. ఎలాగైతేనేమి? నాకు తెలిసిన ఒకడజను ఫ్రెంచి మాటలుపయోగించి, కొంత చెప్పగలిగాను నన్ను కూర్చోమని జాగ్రత్తగా నన్ను ఓడరేవుకు తీసుకు వచ్చి దిగబెట్టాడు. అపార కరుణా సముద్రుడు అయినభగవంతుడే నామీద నిర్హేతుక కటాక్షముతో ఈ రూపంలో నన్నిక్కడకు తీసుకు వచ్చాడని యెంతో సంతోషించాను. యేమంటే తెల్లవార్లూ అక్కడే వుంటుందన్న స్టీమరు యెందు చేతనో వెంటనే బయలుదేరుతోంది. నేను హార్బరులో అడుగు పెట్టేసరికి సైరను కూయడం ప్రయాణీకులు ఓడపైకి యెక్కే నిచ్చెన ఓడలోకి లాగేయడం జరిగిపోయింది. నేను పరిగెత్తుకుంటూ వచ్చి భయభ్రాంతుడనై వెర్రిమొగం వేసుకుని అక్కడ నిలబడ్డాను. ఒక నావి కుడు చూచి వెంటనే యెవరితోనో చెప్పి నిచ్చెన క్రిందకు దింపించాడు. హరియప్, హరియప్ అని హెచ్చరించాడు. బ్రతుకు జీవుడా అని రాబోయే కన్నీరు తుడుచుకుని గబగబా మెట్లెక్కాను. డెక్ మీద రెండో అడుగు కూడా పూర్తిగా మోపకుండానే స్టీమరు బయలు దేరింది. నిచ్చెన పైకి లాగేశారు. నా వళ్ళంతా గజగజ లాడిపోయింది. ముచ్చెమటలు పోసి

నాయి. దగ్గిర ఒక కుర్చీలో అప్రయత్నంగా చతికిలపడ్డాను.

స్టీమరు వెంటనే వేగం పుంజుకుంటోంది. నా అవస్థను గమనించిన వారెవ్వరూ లేరు. సుమారు పావుగంట పైగా నిశ్చేష్టుడై శీతజ్వర పీడితునిలా వణుకుతూనే కూర్చున్నాను. క్రమేణా వణుకు తగ్గి భయం పోయి ఎంత ఆపదలో నించి బయటపడేశాడు భగవంతుడు అని ఒక్కసారి ఎక్కడనో దాగి అన్ని కనిపెడుతున్న ఆ కరుణామయునికి శతసహస్ర నమస్కారములు మానసికంగా అర్పించుకున్నాను. నెమ్మదిగాలేచి కిందకు వెళ్ళేసరికి భోజనాలవుతున్నాయి. అంత క్రితం మోగించిన గంట నేను వినిపించుకోనేలేదు. నేనూ నెమ్మదిగా వెళ్ళి నా స్థానంలో కూర్చుని తలవంచుకుని నిశ్శబ్దంగా భోజనం చేస్తుంటే నా ప్రక్కనున్న నూతన స్నేహితుడు నన్నెంతో సేపటినుంచి పరిశీలనగా చూస్తున్నాడు. కాబోలు ఏమండీ అలా ఉన్నారేం? ఆలస్యంగా వచ్చారేం? అన్నాడు. దానికి చాలా పెద్దగాథ ఉన్నది తరువాత చెపుతానన్నాను. భోజనం ముగించుకుని అప్పటికే శీతలం తిరగటం మూలాన్ని మేము డెక్ మీదకు వెళ్ళకుండా హాల్లో ఒక మూల కూర్చున్నాం. "ఈ స్టీమరు రాత్రంతా ఇక్కడే ఉంటుంది. అనుకున్నది వెంటనే ఎందుకు బయలుదేరిందో చెప్పగలరా?" అన్నాను. మొదట యిక్కడ ఉండవలసి ఉంటుందనే అనుకున్నారుగాని తక్షణం ఇక్కడనుంచి బయలుదేరి ఇటలీ వైపు వెళ్ళమని నౌకా శాఖాధికారుల వద్ద నుంచి అర్జంటుకేబుల్ వచ్చింది. అందుకని వెంటనే లంగరు ఎత్తారు. మీ రెక్కడకు వెళ్ళారు కనబడలేదు." అన్నాడు. నేను సావకాశంగా చేసిన తెలివితక్కువ దాచకుండా చెప్పాను. అతను నిర్ఘాంతపోయాడు. ఎంతపని చేశారండీ? ఎంత ప్రమాదం జరిగిందో తెలుసునా? మీరిక్కడ దిగిపోవడం దారీ, తెన్నూ తెలియక ఏమి చెయ్యాలో తెలియక మతిపోగొట్టుకుని తిరుగుతూంటే మీరు గూఢచారి అని ఫ్రెంచి పోలీస్ భ్రమపడి మిమ్ములను జైల్లో పెట్టడం, తరువాత విచారణమీద చరిత్ర విని అది నిజమని తేల్చుకుని మిమ్ములను ఇంగ్లీషు ఎంబెసీకి ఒప్ప చెప్పడం వారు సావకాశంగా వీలు వెంబడిని మిమ్ములను మీ దేశానికి రవాణా చేయడం జరిగేది ఈ తంతంగం ముగిసేటప్పటికి కొన్ని మాసములు పట్టి ఉండేది లేదా? యుద్ధం ముగిసే వరకూ ఇక్కడనే మిమ్ములను అట్టేపెట్టినా అట్టేపెట్టే వారు. మీరూ మీ యింటివద్ద మీ వాళ్ళూ చాలా అదృష్టవంతులు you are very very lucky అని నా వీపు తట్టి సంతోషంతో నన్నొకసారి ఆలింగనం చేసుకున్నాడు. మరి కొంచెంసేపు ఆమాటా ఈమాటా చెప్పుకుని ఎవరి

కేబిన్‌కి వారు వెళ్ళిపోయాం.

మరునాడు మేము లేచేసరికి మా స్టీమరు యిటలీరేవులో లంగరు వేసుకొని కూర్చుంది. ఈసారి మేమెవరమూ బయటకు వెళ్ళకూడదని అధికారులే కట్టడి చేశారు. పగలంతా అందులోనే ఎవ్వరూ ఏ ఆటా పాటా ఏ వినోదమూ లేకుండానే యెవరిమట్టుకు వారు ఏదో భయంతో కూర్చున్నారు. స్టీమరు మీదికి అనేకరకాలైన వినోద వస్తువులు ఎంతో అందమైన చిన్న చిన్న చలువరాతి చెక్కడములూ, వెండివస్తువులు అమ్మకానికి వచ్చాయి. స్టీమరు అడుగునించి కొందరు ఇటలీ కుర్రవాళ్ళు పెద్ద పెద్ద కేకలు వేస్తూ పై నున్న జనాన్ని ఆకర్షించి చిల్లరడబ్బులు సముద్రంలోకి గిరవాటు వేయమని కేకలు పెడుతూంటే ఒకరిద్దరు యెంతో చిన్న నాణెములు క్రిందకువిసరగా అవినీటి అడుక్కుపోతుంటే కుర్రవాళ్ళు ఈది ఆడబ్బులు అడుక్కి పోకుండానే పట్టుకునేవారు. యిది మాకొక వినోదమూ ఆ పిల్లవాళ్ళకు ఒక ఆట. పైకి వచ్చిన వినోద వస్తువులు చూస్తూ క్రింద వాళ్ళ ఆట చూస్తూ కొంత కాలక్షేపం చేసుకొన్నాము. మళ్ళీ చీకటిపడి భోజనములై పడుకోబోతుంటే ఈ రాత్రి యెవ్వరూ పడుకుని నిద్రపోకూడదు. మామూలు దుస్తులతోటే మెలకువగా కూర్చుని వుండవలసిందని అధికార్లు మాకు పరాకు పలికారు. మళ్ళీ యేం వచ్చిందిరా భగవంతుడా అనుకుంటూ కూర్చున్నాం. మరొక అరగంటలో మమ్మల నందరనూ లైఫ్ బెల్టు కట్టుకోమన్నారు. ఇది రబ్బరుతోటో, జీలుగు బెండుతోటో, తయారవుతుంది. ఏ ప్రమాదం సంభవించినా ఇది కట్టుకొని సముద్రంలోకి దూకితే మనిషి మునిగిపోకుండా ఎంతసేపైనా తేలే ఉంటాడు. యిటువంటివి ఓడమీదనున్న జనానికందరికి తలొకటీ ఏర్పాటు చేసి ఉంచారు. వాటిని మాకిప్పుడందించి వాటిని యెలా కట్టుకోవలెనో నేర్పారు. మమ్మల నందరినీ డెక్ మీదకు రమ్మన్నారు. ఇప్పుడు మనము చాలా ప్రమాదస్థితిలో వున్నామని శత్రువుల జలాంతర్గాములు మనలను తరుముకొస్తున్నాయని ఏ క్షణమైనా మన ఓడ ప్రమాదానికి గురికాగల అవకాశమున్నదని అందు చేత ఈ బెల్టుతోనే కూర్చుని భయ భ్రాంతులు కాక నౌకాధికారులు చెప్పినట్లు వినవలసి ఉంటుందనీ అందరకూ సరిపడ్డ ఒడ్డుకు చేర్చగల చిన్న చిన్న పడవలు వున్నవనీ సాధ్యమైనంత వరకూ ఎవ్వరికీ ఏ ప్రమాదమూ జరగకుండా చూచే బాధ్యత మాది అనీ సైరను వినపడగానే భయభ్రాంతులు కాక కంగారుపడక తొడతొక్కిడి లేకుండా ఒక క్రమంగా స్త్రీ బాలురంతా ముందు చిన్న పడవలలోకి వెళ్ళ

వలెనని, ఆ తరువాతనే పురుషులు దిగవలెనని, ఈ ఆర్డరును పరిగణించక పురుషులు ముందుకు తోసుకువస్తే వారు కఠిన శిక్షాపాత్రులగుదురనీ అందు చేత ధైర్యంగా వుండి తొందరపాటు లేకుండా భగవంతుని ప్రార్థించుకోమని నౌకాధికారి ఉపన్యాసమిచ్చి వెళ్ళాడు. ఆ సమయంలో యెవరెన్ని ఉప న్యాసాలిచ్చినా భయమూ, కంగారూ మట్టుకు లేకుండా ఎలా వుంటుంది? ఎవరి ప్రాణాలు ఎవరికి తీపికాదు! అయినా అధికారులమాట పాటించవ లెకదా! నౌకాధిపతి ఉపన్యాసం ముగించి వెళ్ళిన తరువాత అక్కడున్న వారిలో ఒక ఆసామీ సుమారు 50 యేళ్ళ వయస్సు గలవాడు, తనొక సారి అమెరికాకు నౌకాయానం చేస్తూంటే ఓడకు ఒక రాత్రివేళ ఏదో ప్రమాదం సంభవించిందని అందుచేత నిద్రలో ఉన్న ప్రయాణీకులందరినీ లేపి డ్రెస్ వేసుకోమని ఓడనుంచి నీటిలోకి దింపబడిన ఉన్న పడవల్లోకి ఆడవాళ్ళను పిల్లలను ముందు దిగి వెళ్ళమని వాళ్ళందరూ, వెళ్ళేవరకూ మగవారరెవ్వరూ కదలకూడదనీ మా మాట వినక యెవరేనా తొందర పడి ఆడవాళ్ళను వెనక్కుతోసి ముందుకు వెళ్ళడానికి ప్రయత్నిస్తే చంపేస్తామనీ, అందరికీ తగిన సౌకర్యం కల్పిస్తామని చెప్పి ఆయన రివా ల్వర్ పట్టుకుని కిందకు దిగే నిచ్చెన పై మెట్టున నిలబడి ఆడవాళ్ళనూ, పిల్లలనూ ముందు రమ్మన్నాడు. మగవాళ్ళు కొందరు ఈయన మాట వినక తొందరగా ముందుకు తోసుకుని రాబోతుంటే కోప్పడి మళ్లీ ఇలా వస్తే నిస్సంకోచంగా చంపేస్తానని చెప్పి వాళ్ళను వెనక్కు పంపించాడు. ఆడవాళ్ళు హడావిడిగా కంగారుగా కన్నీటితో తమ పిల్లలను చేతికందిన చిన్న వస్తువులనూ తీసుకుని గబగబా దిగిపోయారు. ముప్పాతిక మంది దిగి మూడు పడవల్లో కూర్చున్నారు. మిగిలినవాళ్ళు కూడా ముందుకు హడావిడిగా వస్తుంటే వెనకనుంచి ఇద్దరు మునలివాళ్ళు కూడా హడా విడిగా కేకలేసుకుంటూ ఈ ఆడవాళ్ళను వెనక్కు తోసేసి కెప్టెన్‌ను తప్పించుకుని పడవలోకి ఏకాయెకి దూకుదామని ప్రయత్నిస్తుంటే ఆ అధి కారి రివాల్వర్ చూపించి Stand back అని గర్జించాడు. అప్పుడూ లక్ష్యపెట్టక ముందుకు వాళ్ళు వురకడం రివాల్వర్ పేలడం మొందు వాడు చనిపోయి సముద్రంలో పడిపోవడం రెండవవాడు కొద్ది దెబ్బతో అక్కడే పడిపోవడం జరిగింది. ఎవ్వరూ కిక్కురుమనలేదు. చచ్చినవాడి కోసం విచారించలేదు. అక్కడ పడ్డవానిని నావికులు వెనక్కు లాగేశారు. మిగతా ఆడవాళ్ళందరూ గజగజ లాడుతూ దిగిపోయారు. వెంటనే మగవాళ్ళందరూ కూడా దిగి కింద పడవలో సర్దుకున్నారు. ఆ పడవ లను సముద్రంలోకి తోసుకొని వెళ్ళిన ఒక అరగంటలో పెద్ద ప్రేలుడు

శబ్దం వినపడి మేము దిగిన ఓడ మా అందరి సామాన్లతోటి అక్కడే మునిగిపోయింది." అని వర్ణించి చెప్పాడు. దానితో మా కందరికీ మరీ భయంవేసి ఏమైనా అధికారి ఆజ్ఞపాటించడమే శ్రేయస్కరమని నిశ్చయించుకుని డెక్ మీదనే చాలామంది నిలబడిపోయాం. ఇంతలోనే ఓడ అమిత వేగంతో ముందుకు దూసుకుపోయింది. యింత వేగంగా స్టీమరు పోగలదని మేమెన్నడూ ఊహించలేదు.

ఓడలో దీపాలన్నీ పూర్తిగా ఆర్పేశారు. మా ఓడ ఇంజన్లమోత, సముద్రఘోష తప్ప మరే శబ్దమూ లేదు. మాలో ఏ ఒక్కరూ ఒక్క మాటకూడా అనడానికి ధైర్యం చాలలేదు. ఇందులో ఏ ఒక్కరికి ఆ రాత్రి గడచి బయటపడి సూర్యదర్శనం చేసుకుంటామని నమ్మకం లేదు. ఇలాగెన్ని గంటలో ప్రాణములరచేత పెట్టుకుని కొంచెం ఇంచుమించుగా డెక్ మీదనే నిలబడి తెల్లవారేసరికి మాలాలు అనే బ్రిటిషువారి ద్వీపం చేరుకున్నాం. సూర్యభగవానుడు చిరునవ్వుతో మాకు స్వాగతం చెప్పాడు. అందరం ఒక్కసారి పెద్ద నిట్టూర్పు విడిచాం. నౌకలో ఉన్న క్రైస్తవ మతగురువు ఒకాయన వచ్చి ప్రార్థన చేసి మా అందరి తరపున పరమేశ్వరునకు వందన శతాలు అర్పించాడు. ఆ రోజంతా అక్కడే గడిపి శత్రువుల జలాంతర్గాములు వెనక్కు వెళ్ళిపోయాయని వర్తమానం అందగానే మళ్ళీ ప్రయాణం సాగించి మరునాటికి కాబోలు సూయజ్ కెనాల్ చేరుకున్నాం. మా రక్షణ కోసం వచ్చిన యుద్ధనౌకలు, విమానాలు మా దగ్గర సెలవు తీసుకోకుండానే వెనక్కు మళ్ళినాయి. మేము నెమ్మదిగా సూయజ్ కెనాల్ దాటి ఆరేబియా సముద్రంలో ప్రవేశించాము. కొంత దూరము వచ్చేసరికి అక్కడ కూడా శత్రునౌకలు, జలాంతర్గాములు వున్నాయని అంతక్రితం రాత్రే ఎవరివో రెండు ఓడలను ముంచేశాయని బహూ జాగ్రత్తగా వెళ్ళవలసిందని మా ఓడకు వర్తమానం అందింది. ఏమైనా ముందుకు వెళ్ళక తప్పదుకదా! అందుచేత నలాగే భయంతోటీ, ఆశతోటీ ముందుకు సాగాము. ఆ రాత్రికి కూడా చాలాసేపు, చాలామంది డెక్ మీదనే కాలక్షేపం చేశాము. మన దేశ సమీపానికి చేరుతున్నాము గనుక చలికాని మంచుగాని లేదు. ప్రాణానికెంతో హాయిగా వున్నది. యెవరూ యెవరితోటీ మాట్లాడకుండా ఎవరి ఆలోచనలో వారున్నారు. నేనొక్కడినే లేచి పచార్లు చెయ్యడం మొదలుపెట్టాను. ఏదో ఆలోచనలో నుండి తల పైకెత్తి ఆకాశం కేసి చూచేసరికి చంద్రగ్రహణం కనిపించింది. ఆదృశ్యం యెంతో అందంగా కనపడ్డది.

అడుగున సముద్రం,
పైన అనంత ఆకాశం,
నడుమ ప్రాణభీతితో హడ
లిపోతున్న ఈ అల్పమా
నవులు. యెంతోసేపు ఆ
గ్రహణం చూస్తూ అలాగే
ఉండిపోయాము. ఆ గ్రహణ
సమయాల్లో జరిగే తతం
గమంతా జ్ఞాపకం వచ్చింది.
ఎలాగో ఆ రాత్రి గడిచి
తెల్లవారింది. అలా ప్రయాణం
చేస్తూ మరో రాత్రి
కూడా గడిపితే భారత
దేశం సమీపిస్తుంది. క్షేమంగా
చేరగలమనే ధైర్యంతో ప్రయా
ణిస్తూ ఒకనాటి ఉదయం
8 గంటలకు బొంబాయి
రేవులోకి మా ఓడ ప్రవే



శించింది. అందరికి అంతులేని ఉత్సాహమూ, ఆనందమూ, కలిగింది. ఇందులో ఏ ఒక్కరూ కూడా ప్రాణాలతో ఇక్కడికి చేరుతామని అన కోలేదు. పరమేశ్వరుని లీలలు తెలుసుకోడానికి ఏ మానవుడికి మాత్రం సాధ్యమవుతుంది.?

రెండవ భాగం సమాప్తం.

1974 లో రెండవ భాగము పునర్ముద్రణకు
నరసింహశాస్త్రిగారు వ్రాసిన

## తుదిపలుకు

ఎలాగో ఈ నాటికి బారిష్టర్ పార్వతీశం రెండవ భాగం పూర్తి చేయగలిగాను. 40 సంవత్సరములు పైగా ఎక్కడికి వెళ్ళినా ఎంతమందో రెండవ భాగం ఎక్కడ దొరుకుతుందండీ అనో మీరసలు రాశారా? అనో లేదంటే ఎందుకు రాయలేదనో రకరకాల ప్రశ్నలతో నా కెదురయ్యేవారు నాకొకప్పుడు కొంత చిరాకు కలిగినా వీరందరూ ఇన్ని ఊళ్ళలో నామీ దనూ, నా రచన మీదనూ అభిమానం పెంచుకున్నవారే కదా! ఇంత అభిమానమూ, సానుభూతి, కలిగి వుండటం నా అదృష్టం కదా! అను కుంటూ ఎవరికీ సమాధానం సరిగా చెప్పలేకపోయేవాడిని. రాయలేదని కొందరితోటి, విజయదశమికో, దీపావళికో; సంక్రాంతికో, సంవత్సరాదికో వస్తుందని రకరకాల అబద్ధాలు చెబుతూ కాలక్షేపం చేసుకువస్తూంటే రాజమహేంద్రవరంలో సుమారు 6 సంవత్సరాల క్రితం జరిగిన ఆంధ్ర రచ యితల మహాసభలలో సభవారు కోరిన కథానికపై ప్రసంగించి వెళ్ళిపోతుంటే ఎంతో మంది మీ పార్వతీశం రెండవభాగం సంగతి ఏదో ఖచ్చితంగా చెబు తేనే గాని వీలు లేదన్నారు. నాటి సభకు అధ్యక్షత వహించిన శ్రీ గిడుగు సీతాపతిగారు ఆయన ఇంకేం రాయగలడు? ఏదో మొదటి భాగం అప్పుడు వ్రాశారు. ఇంక నేమీ వ్రాయలేక ఇన్నాళ్ళూ ఊరుకున్నారు అన్నారు తొందరపాటులో. నాకు మనసుకి ఇబ్బంది కలిగింది. అయినా వెంటనే మైక్ దగ్గరికి వెళ్ళి "సోదర సోదరీమణులారా? మీరునన్ను అడిగిన ప్రశ్నకు నా అనుమతి లేకుండానే నా తరపున సభాపతిగారు వారికి తెలిసిన సమా ధానం చెప్పారు. నేను కూడా ఏదో సమాధానం చెప్పకోకపోతే మర్యాదగా ఉండదేమో? నా చిన్నతనంలో, కీర్తిశేషులయిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనర సింహంగారు కర్పూర మంజరి అనే చక్కని నవల వ్రాసి మొదటిభాగము సమాప్తమని అచ్చువేసి అంతటితో వూరుకున్నారు. నన్ను మీ రడిగినట్లు

గానే ఎన్నో సంవత్సరముల వరకూ రెండవ భాగం ఎప్పుడు వస్తుందని వారిని అడుగుతూ వచ్చారు. సుమారు పాతిక సంవత్సరములు కాబోలు వారూ ఏదో సమాధానం చెబుతూ కాలక్షేపం చేస్తూ ఆఖరుకు రెండ వభాగం వ్రాసి ప్రచురించారు. అది ప్రచురణ అయిన రెండు మూడు సంవత్సరములలోనే వారు దివంగతులయ్యారు. అందుకని నేనూ ఇప్పుడు సందేహిస్తున్నాను అన్నాను. సభలో యావన్మందీ నవ్వుతూ, కరతాళధ్వ నులు చేశారు. నేను నవ్వుకుంటూ వచ్చాను. ఈ మాట యధార్ధంకాదు. అనగా శ్రీ లక్ష్మీనరశింహంగారు కర్పూర మంజరి వ్రాసిన కొలదికా లమునకే దివంగతులు అయినారన్న విషయం నిజమవుదో కానో నాకు రూఢిగా తెలీదు. నే నాక్షణంలో నా మిత్రులను మభ్యపరచడానికి అన్న మాట. ఒకవేళ వారలా దివంగతులయి ఉండడం నిజమే అయినా నేనూ ఏనాడో వారిననుసరించి వెళ్ళవలసిన వాడినయినా ఆకారణం చేతను నేను వ్రాయడం మానుకోలేదని నా మనవి.

ఏ దెలా వున్నా తీరా ఇప్పుడు పుస్తకం రాశాను గనుక రాయని యధార్ధగాధ మీకు చెప్పవలెనని కుతూహలం కలిగి ఈ పంక్తులు వ్రాస్తున్నాను.

అసలు సంగతేమిటంటే, పార్వతీశాన్ని విదేశాలకు పంపవలెనని గుంటూరులో నిర్ణయించుకొని ఆ పుస్తకం పూర్తిచేసినప్పుడు రెండవ భాగం వ్రాయవలెననే సంకల్పం నాకు లేదు. పుస్తకం మా మిత్రుడు శ్రీనివాస శిరోమణి బెజవాడలో అచ్చుకిచ్చినప్పుడు ప్రధమ భాగము సమా ప్తము అని చివర తనే వ్రాశాడో లేక అచ్చాఫీసులో బుద్ధిమంతులెవరైనా వ్రాశారో నా కీనాటికీ తెలియదు. పుస్తకము అచ్చై వచ్చిన తరువాత ఈ ప్రధమ భాగము సమాప్తము అన్నది చూచి గుండె ఆగినంత పని జరిగింది. మా మిత్రుడు శిరోమణిని ఇదేం పని అని మందలించాను కూడాను. ఆయన తనకేమీ తెలియదన్నాడు సరే జరిగిన దేదో జరి గింది. ఇంకేం జరుగుతుందో చూద్దామని మాట్లాడక ఊరుకున్నాను. ఆనాడు అచ్చువేసిన వెయ్యి ప్రతులైనా అతిశీఘ్రముగా దాని ప్రశస్తి దేశ వ్యాప్తమైంది. అప్పడిక రెండవ భాగం రాయక తప్పదు. కాబోలు అని కొన్నాళ్ళు బాధపడ్డాను. ఆ తరువాత నాలోచించగా రెండవ భాగంలో విదేశ జీవితం వ్రాసి మూడవ భాగం కూడా అతనింటికి తిరిగిరాగానే కలిగిన అనుభవాలు వ్రాస్తే బాగుంటుందని అనుకున్నాను.

మద్రాసులో రేడియో స్టేషను ప్రారంభించిన కొత్తలో నామిత్రులు శ్రీ ఆచంట జానకిరామ్‌గారు పార్వతీశంగారి విదేశానుభవాలు కొన్ని వ్రాసి ఇస్తే రేడియో ప్రసారం చేదామని నన్ను హెచ్చరించారు. ఇది చాలా మంచి

అవకాశమని నేనూహించి కొన్ని వ్రాసి ఆ స్టేషన్ నుంచి ప్రసారం చేశాను. కాని అప్పుడు అవి తీసుకుని వెంటనే అచ్చు వేయిద్దామనే ఆలోచనలు కలుగలేదు. తరువాత కొన్ని సంవత్సరములకు విజయవాడ కేంద్రంనుంచి నా మిత్రుడు బుచ్చిబాబు ప్రోత్సాహంతో పార్వతీశంగారి మరికొన్ని అనుభవాలు కూడా ప్రసారం చేయడం జరిగింది. ప్రసారమునకు నేను వ్రాసిన ఈ వ్యాసములన్నీ మద్రాసులోనూ, విజయవాడలోనూ రేడియో ఆఫీసులోనే ఉండిపోయినాయి. అప్పటికి పుస్తకం అచ్చువేయించమని నా మిత్రులు కొందరు తొందర చేయగా మదరాసు రేడియో స్టేషనుకు వాటి ప్రతులు పంపమని కోరుతూ ఉత్తరము వ్రాశాను. అవన్నీ కూవమ్‌నది వరదలు వచ్చి రేడియో ఆఫీసులో రికార్డులన్నీ గంగపాలైనాయని చెప్పడానికి చింతిస్తూ వారుత్తరం వ్రాశారు. హతోస్మి అనుకున్నాను. కొన్నాళ్ళు బాధపడి అవన్నీ జ్ఞాపకం తెచ్చుకుని వ్రాయుటకు పునః ప్రయత్నంచేసి ఎలాగో పూర్తిచేశాను. అచ్చు వేయుటకు అర్థబలం తక్కువై కొంతకాలం ఉపేక్ష జరిగింది. ఈ లోపున పార్వతీశం మీద అభిమానం మానవులనుంచీ క్రిమి కీటకాదుల వరకూ వ్యాపించి పుస్తకమంతా చెదలపాలైంది. దీనితో ఎంతో ఉత్సాహభంగమైంది. మళ్ళీ వ్రాసే ప్రయత్నం చేయక ఉపేక్ష చేస్తుంటే పార్వతీశం మిత్రులు నన్ను సుఖంగా నిద్రపోనివ్వలేదు. మూడవభాగంలో వ్రాయవలెననుకున్న విజయవాడ నుంచి ప్రసారమైన విశేషములు తెప్పించి, అదేనా ముందు అచ్చు వేద్దామనుకున్నాను. రేడియో వారికి వ్రాశాను. నా దురదృష్టం కొద్దీ ఇక్కడకు కృష్ణ వరదలొచ్చి విజయవాడ రేడియో రికార్డులన్నీ కృష్ణ వేణమ్మ కొనిపోయిందీ అని జవాబిచ్చారు. ఇంకనేం చేయను? ఇక లాభం లేదని వ్రాతప్రయత్నం విరమించుకున్నాను. కానీ, ప్రతిరోజూ కొన్ని సంవత్సరములు ఎవరో ఒకరు దాన్ని గురించి అడుగుతూంటే రోజుకు ఒక అనృతం కల్పన చేసుకుంటూ సమాధానాలు చెబుతూ వచ్చాను.

ఒక శుభ ముహూర్తాన నా మిత్రులు, శ్రేయోభిలాషులూ నార్ల వెంకటేశ్వరరావుగారు మొదటిభాగం ధారావాహికంగా "ఆంధ్రజ్యోతి" వారపత్రికలో వేయడానికి నిశ్చయించి నా అనుమతితో ప్రారంభించారు. సగమైన తరువాత నన్నొకసారి పిలిపించి "ఏమండీ యిప్పుడైనా రెండవ భాగం మీరు వెంటనే ప్రారంభించి ముగిస్తేగాని వీల్లేదు. చదువరులు ఊరుకోరు. వారికి సమాధానం చెప్పలేక నేను బాధపడవలసి వస్తుంది. కాబట్టి మీరు నాకేబాధ లేకుండా వెంటనే రచన ప్రారంభించాలి" అన్నారు. నేను నిశ్చేష్టుడనై నోటమాట లేక ఊరుకుని, "నాకు వయసుముదిరింది.

అప్పుడు శిరోమణిగారు వ్రాశారు అన్నాను. "ఇప్పుడు శ్రీకాంత్ శర్మగారు వ్రాస్తారు. ఆయన మా వీక్లి సహాయ సంపాదకుడు కదా! ఆయన రోజూ మీ దగ్గరకు వచ్చి కూర్చుని మీరు చెబుతుంటే వ్రాసి పెడతాడు, కాబట్టి ఇంకేమీ మీరడ్డంకులు చెప్పకుండా రేపటినుంచీ ప్రారంభించి తీరాలి" అని శాసించారు. ఇంతవరకెవ్వరూ నన్నిలా శాసించినవారు లేరు. ఒకరిద్దరు ప్రయత్నించినా వారితో నేను శాసనోల్లంఘనము చేస్తూ వచ్చాను. కాని ఎందుచేతనో వెంకటేశ్వరరావుగారి శాసనాన్ని అంతసులువుగా త్రోసివేయ లేక ఆ మర్నాటినుంచీ రచనకు ఉపక్రమించి, వారి వాక్ సహాయాన్ని, వారి శాసన ముహూర్తబలాన్ని ఈ నాటికి రెండవభాగం పూర్తిచేయగలిగాను. ఇది పత్రికలో ప్రచురిత మవుతుండగానే అభిప్రాయ వేదికలో అనేకమంది చాలా బాగుందని వ్రాశారు. కొద్దిమంది మొదటి భాగంలో ఉన్నంత హాస్యం ఇందులో కనబడ్డంలేదు అన్నారు. ఒకరెవరో ఆయనలో హాస్యం ఏనాడో యిగిరిపోయింది. ఇంకా ఆయన నెందుకు బాధపెడతారు? అని సంపా దకులను అడిగారట. దానికేమి? ఎవరేమనుకున్నా నాకేమీ ఇబ్బంది లేదు. మానవాళిలో ఏ విషయాన్ని గురించీ ఏకాభిప్రాయం ఎప్పుడూ ఉండదు. ఈశ్వరుడే ఉన్నాడా లేడా? అని తేల్చుకోలేక కొట్టుకుచ స్తున్న వారిలో నన్ను గురించి మట్టుకు ఏకాభిప్రాయం ఎలాఉంటుంది? లోకోభిన్నరుచిః అని పెద్దలన్నారు. నవ్విపోదురుగాక నాకేటి వెరపు అని కృష్ణశాస్త్రిగారూ అన్నారు. అయినా నా అభిప్రాయం కూడా కొంచెం తెలుపుకోడం మంచిదికదా! పార్వతీశం యిల్లు బయలుదేరిన నాడు ప్రపం చమేమీ ఎరుగనివాడు. పాశ్చాత్య నాగరికతా ప్రభావము సోకనివాడు. అందుచేతను అతను తెలితక్కువవాడనీ, బుద్ధిహీనుడని అనుకోడం చాలా పొరపాటు. సహజమైన తెలివితేటలు కావలసినన్ని ఉన్నాయి. కాని ఎంత తెలివైన వారైనా నూతన పరిస్థితులలో నూతన వాతావరణంలో ఎలా ప్రవర్తించాలో తెలియక తికమకలు పడడం చాలా సహజం. పార్వతీశం చేసినట్లుగానే, వర్ణించిన అవకతవకలు కొన్నైనా మేము చేశామని రహ స్యంగా కొందరు మిత్రులు నా దగ్గర ఒప్పుకున్నారు. వారి పేర్లు ఇప్పుడు చెప్పడం ఉచితముకాదేమో అనే సందేహంతో చెప్పడంలేదు.

ఇటువంటి రచనలు యధార్థ జీవితానికి సన్నిహితములుగానే ఎప్పుడూ ఉంటాయి. అలా లేనినాడు ఇవి రక్తి కట్టనేకట్టవు. ఎటొచ్చీ జీవ తంలో జరిగిన సంఘటనలు యథాతథాంగా తీసుకోవడం లేదా! వాటి నాధారం చేసికొని కొన్ని సృష్టించటం. అది కాకపోతే వీటికి సమీపంలో సహజ సిద్ధముగా ఉండేటట్లు కొన్ని ఊహించడం రచయిత అనుసరించే

పద్ధతి. ఈ రోజుల్లో కూడా అంత తెలివితక్కువ వాళ్ళుంటారా? అని ప్రతి వాళ్ళూ అడిగే ప్రశ్న. మొదటి సంగతి పార్వతీశం ఇంగ్లాండు వెళ్ళి నది అర్ధశతాబ్దం క్రితమన్న సంగతి వారు విస్మరిస్తారు. అయినా ఈనాడు కూడా అనేకమంది అంతకంటే అవివేకంగా, అజ్ఞానంగా ప్రవర్తించేవాళ్ళు చాలామంది ఉన్నారని సోదాహరణంగా చెప్పగలను. కానీ, గ్రంథ విస్తరభీతి చేత ఇప్పుడు చెప్పడం లేదు. ఇవన్నీ ఎప్పుడో మరొకచోట చెప్పవలెననే ప్రయత్నంలో ఉన్నాను. అటువంటి పార్వతీశం ఆనాడు బయలుదేరి మదరాసు చేరే లోపుననే తన అవివేకము చాలా తెలుసుకో గలిగాడు. మద రాసు నుంచి మార్సెల్స్ చేరే సరికి మరికొంత అనుభవం సంపాదించాడు. అక్కడ నుంచి లండను, లండన్ నుంచి ఎడింబరో చేరేసరికి కేవలం కొత్తమనిషే అయ్యాడంటే ప్రజలెందుకు ఆశ్చర్యపడుతున్నారో నాకర్థంకావ డంలేదు. ఎలాటి వాడూ కూడా వయస్సుతో, దేశాటనంతో, బోలెడంత అనుభవముతో - వాడు పుట్టుకతోనే మతిలేని వాడైతే తప్ప - వివేక వంతుడూ, నాగరికుడూ కాక తప్పదు. అవనే పార్వతీశం విషయంలో కూడా జరిగింది. అంతకన్నా విరుద్ధంకాని విపరీతంకాని ఏమీ జరగలేదు. పార్వతీశం జన్మతః పెరుగుటకు సాధ్యంకాని బుద్ధిమాంద్యమున్న వాడైతే అతను సహజంగా విశాఖపట్టణమో, మద్రాసో పిచ్చి ఆస్పత్రికి పోవలసి నవాడు, ఇంగ్లాండు కాదు. హాస్యము కొన్ని సంఘటనలవల్ల ఉత్పన్న మవుతుంది. కొన్ని చోట్ల వికృతమైన వికార చేష్టలు వ ల్లా బయలు దేరుతుంది. కొన్ని చోట్ల చమత్కార వచోనైపుణిచేత వస్తుంది. ఒక్కొక్క ప్పుడు ఎదుటి వాళ్ళ తెలివితక్కువ వల్ల నవ్వు వస్తుంది. మరొకప్పుడు మన తెలివితక్కువలే మనని నవ్విస్తాయి. ఇలా ఎన్నో రకాలు నాగరికతలో, నాజూకుతోహాస్యం కూడా పెరుగుతుందని కొందరు పెద్దలు అన్నారు. humour grows with civilisation అన్నాడు Wal Pole మహాశయుడు.

జీవితమంతా ఆటనీ, నవ్వనీ అనుకోలేం కదా! విషాదహాసములు ఎపుడూ కలిసే ఉంటాయి. ఈ రెంటికి చాలా సన్నిహితసంబంధం ఉందనే ఉద్దేశంతో కొలది సంఘటనలు ఇందులోనే చేర్చాను. ఇక నింత కంటె ఏమి చెప్పగలను? చదువ వలసిన వారూ, చదివి ఆనందించవలసిన వారు మీరు. ఈ వివరణ మీ కేమైనా సహాయపడితే సంతోషిస్తాను. ఇది చదివిన మీదట కూడా నన్నేమన్నా అనదలచుకుంటే అనవచ్చును. నా అభ్యంతరమూ ఎంత మాత్రమూ లేదు. సంతోషిస్తాను. మీరు చెప్పేదా నిలో నేను తెలిసికోవలసింది ఏమైనా ఉంటే తెలుసుకుంటాను కూడాను.

ఒక విషయం చెప్పడం మరచాను. యుద్ధపు రోజులగురించి

వ్రాస్తూ ఒక అధ్యాయములో దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఒకరోజున, మిత్రులను కొందరను పిలిచి, "ఈ యుద్ధాన్ని గురించి ఆలోచిస్తూనే మన దేశ దౌర్భాగ్యాన్ని తలచుకుంటూ భరించలేని వేదన అనుభవిస్తున్నాను. ఇక భరించలేను. నేను చదువుకు తిలోదకాలిచ్చి ఇంటికి వెళ్ళి స్వరాజ్య సంపాదనకు తీవ్రకృషి చేయదలిచాను." అన్నారు. అనగానే మిత్రులొకరు "ఏమిటి కార్యక్రమం" అన్నారు. "పదిమందినీ కూడగట్టుకుని చిన్న చిన్న పట్టణాల్లో పోలీసు ఠాణాలమీద దాడిచేసి అక్కడి ఆయుధాలను స్వాధీనం చేసుకోవడమన్నారు."

తరువాత చాలా కాలానికి ఇక్కడ సీతారామరాజుగారు ఫితూరీ కార్యక్రమం ప్రారంభించారన్న సంగతి ఈనాడు చాలామందికి తెలుసును. వీరు గోపాలకృష్ణయ్యగారి నడిగి చేశారనీ నేను చెప్పడంలేదు. వీరి కార్యక్రమం జ్ఞాపకం వచ్చి అది నేను గోపాలకృష్ణయ్యగారి కంటగట్టినా ననుకుంటారేమో ననే భయముతో అది సరికాదనీ, గోపాలకృష్ణయ్యగారానాడన్న మాటలు విన్న వారింకా ఒకరిద్దరు సజీవులయి వున్నారు. అవసరమైతే వారు నేను వ్రాసిన దీని యదార్థతను రుజువు చెయ్యకలరనీ నా మనవి.

కొందరు మిత్రులు, భాషకూడా యిందులో మొదటి భాగంలో వున్నంతక సుళువుగా లేదన్నారు. కావచ్చు. అలాగే వ్రాయవలెననే యెంతో ప్రయత్నం చేశాను. ఒకవేళ అలా వ్రాయలేక పోయానేమో నేను చెప్పలేను. నేను చెప్తుంటే వ్రాసిపెట్టిన శ్రీకాంత్ శర్మగారికి నేను కొన్ని శబ్దముల విషయమై యెంత ఆలోచించి మాటల నెన్నికచేశానో తెలుసు. పైగా భావంతో భాష పెరగడం మారడం జరుగుతూ వుంటుంది. కొన్ని భావముల ప్రకటనకు అనుగుణమైన భాష అప్రయత్నంగా దానంతటదే వస్తుందని నా మనవి.

మరొక మాట, వ్యావహారికంలో భాష రోజు రోజూ మారుతూ వున్నది. ఆనాడు వాడుకలోవున్న మాటలు ఈనాడు మనకు అర్థం కాక పోవచ్చు. మాటవరసకు ఈనాటి సినిమా హాళ్ళను ఆనాడు పిక్చర్‌హౌసు అని వ్యవహరించేవారు. ఆ శబ్దమే ప్రత్యేకంగా ఈనాడు వాడితే చాలామందికి తెలియదు. అందుకు అలాటివి కొన్నిటికి ఈనాటి మాటలే వాడాను. తెలుగులో కూడా భావాలు ఎప్పుడూ ఒక్కటైనా వాటి ప్రకటనకు మట్టుకు భాషమారుతూ వుంటుంది. అందుచేతను నేటి చదువరులకు సౌలభ్యంకోసం నేటి భాషనే వాడడమైనదని గమనించ ప్రార్థన.

— మొక్కపాటి నరసింహశాస్త్రి

# బారిష్టరు పార్వతీశం

## మూడవ భాగము

కొన్ని సంవత్సరాలు విదేశవాసం చేసి ఇంటికి వచ్చేటప్పుడు వుండే సంతోషం చెప్పడానికి సాధ్యంకాదు. కవులైతే యేదో గమ్మత్తుగా పద్యాలు చెప్పి మన్ని సంతోషపెడతారు. ఆవిద్యనాకు చాతకాకపోవడం చేత, వట్టి మాటలతో చెప్పవలసివస్తోంది. చిన్నపిల్లలకు తల్లి యెంతోసేపు కనబడకపోతే, వెతుక్కోగా వెతుక్కోగా ఆఖరికి కనబడగానే యెంత సంతోషం వస్తుందో అంతకంటే వెయ్యిరెట్లు యెక్కువ ఆనందం కలిగింది. హిందూదేశం దూరాన్నించి కనబడగానే, స్టీమరు బొంబాయి తీరం దగ్గరకు వచ్చిన కొలదీ మరీ సంతోషం పట్టలేక Deck పైకి వచ్చి ఆనందబాష్పాలు కారుస్తూ అలా నిలబడిపోయాను. దేశం విడిచి దూరంగా వున్నంతసేపూ మనదేశం చాలా గొప్పదనీ, ఆదర్శ ప్రాయమైనదనీ అనిపిస్తుంది. విదేశాల్లో అందరితోటీ అలాగే దెబ్బలాడేవాణ్ణి. మా దేశంలాటి దేశం మరొకటి ఈ భూమండలంలో లేదని. ఇక్కడుంటే లోపాలన్నీ కొన్ని తెలియకా కొన్ని మరచిపోయీ కనబడేవికావు. ఆ దేశాల్లో ఉండే మంచి అంతా మనకూ ఉన్నదనే నమ్మకంతో ఉండేవాడిని. ఆ ధోరణిలో మాట్లాడుతూంటే ఆ దేశస్తులకు నన్ను చూస్తే వేళాకోళంగా ఉండేది. నన్ను వట్టి వెర్రికుట్టి కింద నవ్వుతూండేవారు. నా దురదృష్టమేమిటో కాని ఎప్పుడు ఏది అనుకున్నా దానికి వ్యతిరేకమే జరుగుతూండడం, ఏది ఊహించుకున్నా దానికి విపరీతంగా ఉండేదే ప్రత్యక్షమవడం.

స్టీమరు బొంబాయి హార్బరు చేరింది. పూర్తిగా ఆగలేదు. ఎవరూ ఇంకా నేలమీద అడుగుపెట్టలేదు. వెంటనే నేను అనుకున్నదంతా తప్పనీ, నా మాట తప్పనీ అన్నవాళ్ళ మాటలే నిజాలనీ, నా ఊహలన్నీ ఊహలు

మాత్రమేననీ తెలుసుకున్నాను. ఏమంటారా స్టీమరు పూర్తిగా ఆగకుం డానే ఎలా వచ్చాడో ఒక షరాబు పెద్ద తలగుడ్డా, వాడూ చెమటలు కారుకుంటూ, వగరుస్తూ, చెమటలు చొక్కాతో తుడుచుకుంటూ అందర్నీ చూచి వెర్రిగా నవ్వుతూ పైకి చక్కావచ్చాడు. వచ్చినవాడు మర్యా దగా అక్కడున్న కుర్చీమీదనో సోఫామీదనో కూర్చోకూడదూ. నేలమీద, పదిమందీ నడిచే చోట చతికిలపడ్డాడు. ఇంతకూ పడిపోయినట్లు ఎందుకొ చ్చాడో తెలుసా? కావలసిన వాళ్ళకు చిల్లర ఇవ్వడానికి, అనగా స్టీమరులో వాళ్ళంతా ఇతర దేశాల్నుంచి వస్తున్నారుగదా! వాళ్ళదగ్గిర పౌండ్లూ, షిల్లింగులేకాని రూపాయలూ అర్ధలూ ఉండవు. అవి ఉంటేనేగాని ఇక్కడ వ్యవహారం నడవదు. అందుకని ప్రయాణీకుల సౌకర్యంకోసం, విదేశీడబ్బుకు స్వదేశీడబ్బు ఇద్దామని సంకల్పం. మంచిదే కానీ, ఆ షరాబుకు మనమీద అభిమానం కాదుగా రూపాయికి కానీయో, అర్ధణాయో మారకం తీసుకుని ఒక్క అరగంటలో ఏ శ్రమా లేకుండా ఏభయ్యో వందో పంపాదించుకు పోదామని వాడి ఉద్దేశం. ఇన్ని దేశాలు తిరిగినా, ఎక్కడా ఈ పద్ధతి కనుపించలేదు. కావలిస్తే కావలసినన్ని బ్యాంకులు ఎక్కడపడితే అక్కడ. వెడితే క్షణంలో మన పని చూసి పంపేస్తారు. అంతేనే కాని ఇదేమిటవె అసహ్యం వేస్తూను. ఇంతలోనే మరో షరాబు తయారయ్యాడు. ఈ లాభం అంతా వీడే తిని పోతున్నాడన్న బెంగకొద్దిని. ఇది చూసి స్టీమరులో ఉన్న దొరలంతా బయటికి వస్తూ నవ్వుకుంటూ పోవడం. ఇంతా చేస్తే చాలామంది వీళ్ళదగ్గిర సొమ్ము మార్చుకోనేలేదు. కాని వీళ్ళను చూస్తేనే ఏదో నేరం చేసినట్లు బాధపడి తలకాయ ఎక్కడో పెట్టుకున్నానంటే నమ్మండి.

అయిందా! నేను అనేక పెద్దపెద్ద హార్బర్లూ, రైలు స్టేషన్లూ చూచాను కదా. అక్కడ ఏవిధమైన గందరగోళమూ ఉండేదికాదు. ప్రజలు నిశ్శబ్దంగా నెమ్మదిగా దిగుతారు. ఎక్కుతారు. కూలీలు సామాన్లు ఎక్కి స్తారు. దింపుతారు. కానీ బొంబాయి హార్బరులోనూ, తరువాత మన రైలు స్టేషన్లలోనూ ఉన్నంత హడావుడీ, కంగారూ, గందరగోళం, మరో చోట ఎక్కడా వుండవు. ఐరోపా మహాసంగ్రామంలో కూడా ఇంత శబ్దం ఉంటుందా అని అనుమానం. అనుమానమేమిటి ఉండదని నిశ్చయం. సరే! ఎలాగో నేనూ నా సామాను జాగ్రత్త పెట్టుకుని దర్జాగా దిగాను. నలుగురు కూలీలని కేకేసి అంతా అవతల పెట్టమన్నాను. ఇంతలో ఒకడు వంగి వంగి సలాములు చేస్తూ, హడలిపోతూ నా దగ్గర కొచ్చాడు. ఎందుకు నాకీఈ సలాములు? నన్ను చూసి ఇంత భయమెందుకు? నేనేమైనా

గవర్నర్నా? ఇంతా చేసి అదేమిటో తెలుసునా? నా సామానులు పరీక్ష చేయాలిట అదీ సంగతి. 'ఎందుకన్నాను.' "అది రూల్సండీ. ప్రతివాళ్ళ సామానూ చూడాల" న్నాడు. "సరే అయితే అందరినీ చూడ"మన్నాను. 'ఒక్క పక్కనుంచి చూస్తున్నానండీ' అన్నాడు. "అయితే నాదే పక్క నుంచి చూస్తావ"న్నాను. అయితే నేనన్నది వాడికర్థం కాలేదనుకున్నాను. క్షణం ఏమీ మాటాడలేదు. "దొరల సామాన్లన్నీ చూడ్డం అయిందా" అన్నాను. "అయిందండీ అయినా వారు దొరలు కదండీ. వారి సామాన్లు అంత ఇదిగా చూడక్కర్లేదండీ" అన్నాడు. ఇది వినేసరికి నాకు వళ్ళు కాలుకొచ్చింది. కానీ అప్పుడు ఏం చేయగలను? మాటాడకుండా ఈ అవమానం దిగమింగి, సరే చూసుకోమని నా సామానక్కడ దింపాను. ఏముంది? బట్టలు, పుస్తకాలూ తప్ప మన దగ్గిరేముంటాయి? పుస్తకా లన్నీ తిరగేస్తున్నాడు. 'అవి మీకెందుకు అందులో ఏముంటుంద'న్నాను. 'దేశంలోకి తేకూడని పుస్తకాలు వున్నవేమో చూడాల'న్నాడు. సరే కాని మ్మన్నాను. నా దగ్గిరున్నపుస్తకాలన్నీ తిరగేశాడు కానీ వాడికేం తెలుస్తుంది గనుక? తేకూడని పుస్తకాలు కొన్ని చూచి కూడా తెలియకూరుకున్నాడు. కానీ అనీబీసెంటు దొరసాని వ్యాఖ్యానంతో వున్న భగవద్గీత తీసి యిది వుండకూడదన్నాడు.'అదేమిట'న్నాను. అనీబీసెంటు పుస్తకాలేవీ వుండకూడ



దన్నాడు. 'ఓయి వెర్రినాయనా! యిది భగవద్గీత, అనగా మత గ్రంథము. రాజకీయ గ్రంథం కాదు. దీనివల్ల యెవరికీ యే అపకారమూ లేదు. ఆవిడఖర్మం మా ఖర్మం కాలి మా మత విషయంలో చాలా కృషిచేసి పుస్తకాలు వ్రాసింది. వాటికీ, ఆవిడ రాజకీయాందోళనకీ దీనికీ ఏమీ సంబంధం లేద'ని ఆ ఆసామికి నచ్చచెప్పేసరికి నా తాతలు దిగివచ్చారు.

ఎలాగయితేనేమి ఆ గండం తప్పించుకు బయట పడ్డాను. అక్కడ నుంచి ఒక బండి చేసుకొని తిన్నగా ఏదేనా హోటలుకు తీసుకు వెళ్ళమన్నాను. నేను ప్రపంచంలో పెద్దా చిన్నా అనేక రకాల హోటళ్ళు చూచాను గాని, యింతద దరిద్రంగా ఏదీ కనబడలేదు. బొంబాయిలో యిద్దో మంచి హోటలనే పేరు. చాలామంది యిందులో మకాం చేస్తున్నారు. కానీ రాజుని చూచిన కళ్ళతో మొగుణ్ణి చూస్తే మొత్త బుద్ధయిందని నాకు మటుకు మహా అసహ్యం వేసింది. అక్కడ ఏర్పాట్లు, సామాన్లూ ఏం చూసినా, అబ్బ! మహా బాధపడ్డాను, తరువాత అంతకన్నా ఛండాలాలు చాలా చూచాను గనుక యిప్పుడదే బాగున్నదేమో ననిపిస్తుంది.

సామాను గదిలో సర్దుకుని స్నానం చేద్దామని స్నానాల గదిలోకి వెళ్ళాను. దొరలు స్నానం చేసే పద్ధతి తెలుసుగా మీకు? బట్టలు విడిచి కుళాయి కింద నిలబడ్డాను. ఆ దేశాలలో ఉండే స్నానాలతొట్టెలు ఇక్కడ లేవుగా మరి. పోనీ లేకపోతే నేమని హాయిగా కుళాయి కిందనే స్నానం ప్రారంభించాను. గదంతా ఎక్కడ చూసినా సబ్బు అనేది కంటపడలేదు. ఏమిఈ అన్యాయమని దెబ్బలాడదామని అక్కడనుంచి యజమానిని కేక వేశాను. ఏదో కొంపమునిగిందని నౌకరు పరుగెత్తుకొచఅడు. నన్ను చూసి ఖంగారు పడి వెనక్కి వెళ్ళాడు. అప్పుడు నా అవస్థ నాకు జ్ఞాపకం వచ్చి, సిగ్గుపడి, తువాలు చుట్టిపెట్టుకుందామని నాలుగు పక్కలా వెతుకుదునుకదా? తువాలుకానీ, అంగవస్త్రంకానీ, ఏమీ కనబడలేదు. ఒళ్ళుతోముకోడం మాట దేవుడెరుగును తడి ఒళ్ళు తుడుచుకోకుండా ఎలాగ. తలుపు చాటున నుంచుని హోటలు వాళ్ళని నాలుగుతిట్టి, సబ్బూ, తువ్వాలూ ఏవని అడిగాను. ఎవరికి వారు తెచ్చుకోవలసిందేకాని హోటలు సప్లయిచెయ్యడం మామూలు లేదని అన్నాడు. విదేశాల్లో మనం ఎక్కడికి వెళ్ళినా సబ్బూ, తువాళ్ళూ, దుప్పట్లూ, కంబళ్ళూ వగైరా అన్నీ హోటలు వాళ్ళే ఇస్తారు.

ఇక్కడ పెద్ద హోటలని పేరుపడ్డచోటే ఇలా ఏడిస్తే మిగతా చిన్న వాటిల్లో ఎలా ఎలా ఉంటుందో ఆలోచించండి.

ఎలాగో ఆ తడి వంటిమీదే చొక్కాలాగూ తొడుక్కుని బయట పడ్డాను. వెంటనే షాపుకు వెళ్ళి సబ్బు, తువాళ్ళు కట్టుకునేందుకు పంచలూ వగైరా కొనుక్కున్నాను

ఇంక భోజనం విషయం ఏం చెప్పను. తలుచుకుంటే అసహ్యమూ చెప్పడానికి సిగ్గూను. వండిన పదార్థాలు, వడ్డించే పాత్రలు, మనుష్యులు, పద్ధతులు, అన్నీ కూడా అసహ్యం. దొరలు మన్ని చూసి నవ్వారంటే నవ్వరామరి. అసహ్యించుకున్నారంటే ఆశ్చర్యమేముంది? బోలెడంత దేశాభిమానం ఉన్నవాణ్ణి, ఇక్కడ పుట్టిపెరిగిన నాకే ఇలా ఉందంటే ఇతర్ల సంగతి చెప్పడం ఎందుకు? అక్కడినుంచి "ఊరు" చూద్దామని బయలుదేరాను. వీధిలోకి వచ్చేసరికి అంతా గొడవ, గందరగోళం కంగారూను. బళ్ళవాళ్ళు వాళ్ళ యిష్టంవచ్చినట్టు అడ్డదిడ్డంగా తోలతారు. సైకిళ్ళు చెప్పనే అక్కరలేదు. మనుషులంతా తలోదారీని. సాధ్యమైనంత వరకూ రోడ్డు మధ్యనే గాని నడవరు. వారు వ్యవహారాలూ, లావాదేవీలూ అన్నీ రోడ్డు మధ్యనే నిలబడి తేల్చుకుంటారు. నడుస్తూ, ప్రతి వాడూ రెట్ట వేసినట్టు తుపుక్కున ఉమ్మేస్తాడు. నడకలో ఒకరికీ ఒకరికీ సంబంధం కనబడలేదు. నలుగురు కలిసి బయలుదేరినా అడుగులో అడుగు కలవదు.

నేను మొదట్నించీ నియమాలకూ, నిబంధనలకూ అలవాటుపడ్డ వాడిని దేశాంతరం వెళ్ళినప్పట్నించీ మరీను. అక్కడేమిటంటే రోడ్లమీద బళ్ళచప్పుడూ, మనుషుల బూట్ల చప్పుడేకాని మరో ధ్వనేమీ ఉండదు. ఇక్కడో, మన ఇష్టం వచ్చినట్టు కేకలు వేస్తాం. నవ్వుతాం, గట్టిగా మాట్లాడుతాం ఇది కూడా ఓ పెద్ద తప్పేనా ఏమిటి? మాట్లాడ్డానికి కూడా ఆ మాత్రం స్వతంత్రం లేదా అంటారేమో? మాట్లాడవచ్చు. కానీ మన గొడవలు ఊరంతా వినబడేటట్లు గోలచేయనక్కరలేదు. కాదూ నెమ్మదిగా మాట్లాడ్డం, నెమ్మదిగా నవ్వడం మనం అలవాటు చేసుకుంటే ఏంతో హాయిగా ఉంటుంది. హోటళ్ళలో, రైళ్ళలో, నాటకాలలో, ఒక చోటేమిటి పదిమంది చేరే చోటల్లా ఈ పద్ధతికి మనం అలవాటుపడితే ప్రాణం ఎంతో హాయిగా ఉంటుంది.

వీధిలో చూస్తే ఒక మనిషి మోస్తరు ఒకరుండరు గదా, అంటే పోలికలోకాదు నేచెప్పేది. అది ఎలాగూ అసంభవమే. నేననేది వేష భాషల సంగతి. ఎన్ని దేశాలు తిరిగినా, ఇంగ్లీషు భాషతో నెగ్గుకొచ్చాను. స్వదేశానికొచ్చినా, ఒక్కోచోట ఒకరకం భాష. భాషమాట అటుంచండి వేషం సంగతి నేననేది. యూరపు అమెరికా ఖండాల్లో ఎక్కడికి వెళ్ళినా

ఒకేరకం దుస్తులు కదా, అలాగే మన దేశంలో కూడా విదేశీయులంద రిలా ఒక్క మోస్తరుగా దుస్తులు వేసుకోకూడదూ? ఆడవాళ్ళ ధర్మమా అని వాళ్ళు మట్టుకు దేశమర్యాద నిలిపి ఒకేరకంగా దుస్తులు వేసుకుం టున్నారు. మగవాళ్ళకు ఈ సూట్లూ, బూట్లూ వేస్టుకోట్లూ ఎందుకో తెలియదు. పిల్లకని కుట్టించడం. ముద్దు పెద్దలకవి ఫాషన్. కొందరు మరీ సూటు వేస్తే ఉంటారు మహాప్రభో చూడకళ్ళు లేవన్నట్టుంటారు. పొట్టిగా, లావుగా ఉండడం, పెద్దపొట్టా, నెత్తిమీద జుట్టు ముడీ ఈ మనిషి సూటు వేస్తే ఎలా ఉంటుందో ఆలోచించండి. నేను అలాంటి వాళ్ళను చాలా మందిని చూశాను. బాధపడ్డాను ఆ పొట్టమీదనుంచి లాగు జారిపో తూండడం, దాన్ని ఆపడానికి పెళ్ళాం పాతచీరంచు ముడిపెట్టి, దానినే బెల్టుగా భావించడం, ఇది కనబడుతూ కోటుబొత్తాలు పెట్టకపోవడం నెత్తి మీద తలగుడ్డ. ఈ గంగిరెద్దు వేషం ఎందుకు వేస్తారో తెలియదు. వీధుల్లో కొస్తే ఇదీ. ఇళ్ళూ అలాగే ఉంటాయి. ఒకదానికీ సంబంధం ఉండదు. పెద్ద మేడ పక్కనే చిన్న ఇల్లు. ఇంకో పక్కన అతకన్నా చిన్న గుడిసె పోనీ ఆ ఉన్న మేడలేనా ఒకదాన్ని పోలి మరొకటి వుండదు. దేని దారి దానిదే ఎవరికి తోచినట్టు వారు కట్టవలసిందే. ఆ దేశాల్లో అలాకాదు వీధులకి వీధులు ఒకే మోస్తరుగా వుంటాయి. కట్టడాల్లో పొరూ తీరూ ఉంటుంది. వేషభాషల్లో సమానత్వం వుంటుంది. నడకలో, చర్యలో ఐక్యత వుంటుంది. దానివల్ల నేమిటంటే ఆ జాతిలో సంఘంలో ఆచార వ్యవహారాల్లో, వ్యవహార దృక్పథంలో, జీవితాదర్శంలో, ఐక్యత వున్నదని బోధపడుతుంది. మన వేషముల వల్లా, నడకలవల్లా, కట్టడములవల్లా ఈ ఐక్యత యిక్కడ మృగ్యమని తోస్తుంది.

బొంబాయిలో దిగగానే ఈ తారతమ్యం చూసేసరికి చాలా బాధ కలిగింది . ఇది కేవలం బాహ్యమేనా, అంతర్యంలో కూడా ఈ వ్యత్యా సాలున్నాయా అనే సందేహం కలిగింది. ఆ దృష్టితో మన సంఘాన్ని పరిశీలనగా చూడాలని ఆ క్షణంలో ఒక సంకల్పం కూడా కలిగింది. అందుకని నగర సంచారానికి బయలుదేరాను. ఈ వూరంతా కొత్త, ఇక్కడ మనుష్యులు కొత్త. భాషకొత్త. ఆచార వ్యవహారాలు కొత్త. ఇంక నా బొంద. ఇక్కడ కొత్తకాని దేమిటో అర్థం కావడంలేదు. పోనీ నాలుగు రోజులు ఇక్కడ ఉండి ఈ ఊరు నాలుగు దిక్కులా తిరిగి ఇక్కడ పద్ధతులుచూసి తెలుసుకుంటే భారతమంతా తెలుసుకున్నట్టే అనిపించింది. మూడేళ్ళు ఇంటికి దూరంగా ఉన్నవాడిని ఇంకో నాలుగు రోజుల్లో, వారం రోజులో గడుపుతే మట్టుకు మునిగిపోయింది ఏమున్నదీ,

అనుకున్నాను. ఏమయినాముందు యింటికి, బొంబాయి క్షేమంగా చేరి నట్టు ఉత్తరం రాద్దామని అనుకొని దగ్గర కార్డులూ, కవరులూ వగైరా ఏమీ లేవని తెలుసుకుని, తిన్నగా పోస్టాఫీసుకు వెళ్ళి కావలసినవి తీసు కుని అక్కడే ఎలాగో కూర్చుని, నేను బొంబాయి క్షేమంగా చేరాననీ, నాలుగైదు రోజులలో బయలుదేరి ఇంటికి చేరుకోగలననీ, ఇన్నాళ్ళ తరు వాత మిమ్ములను మళ్ళీ కలుసుకుని పాదాభివందనం చేసి మీ అశీస్సులు పొందవలెనని ఉత్సాహంతో ఉన్నాననీ వ్రాశాను. ఉత్తరం రాస్తున్నంత సేపూ కళ్ళ నీళ్ళు కారుతూనే ఉన్నాయి. ఎలాగో సముదాయించు కుని ఉత్తరం పెట్టిలో పడేసి బయటకు వచ్చాను. ఈ పోస్టాఫీసులో కూడా ఎంత గొడవో, ఎంత గందరగోళమో, ఎన్ని భాషలో ఎన్నిరక ముల వేషములో లెక్కలేదు. భారతీయులంతా ఒక్కసారి ఇక్కడకు ఏదో తిరునాళ్ళకు వచ్చారా అనిపించింది. విదేశాలలో ఏ పట్టణం చూచినా, పల్లె చూచినా, వేషంమటుకు అందరికీ ఒక లాగునే ఉంటుంది. లండన్, పేరిస్ ఇలాంటి నగరాలలో కూడా జనాన్ని వెనుక నుంచి చూస్తే అందరూ అక్కడి వారే ననిపిస్తుంది. ఇక్కడ వీధులన్నీ ఎంత సమ్మర్దంగా ఉన్నవో లెక్కలేదు. అంత విశాలమైన రాజవీధులలో కూడా తొడతొ క్కిడే. ఒకరినొకరు తోసుకు తిరగడమే. స్త్రీలూ, పురుషులూ కూడా రాజవీధులలో కూడా మధ్యగా నిలబడి రాజకీయాలో, పరస్పరవైరాలో, దూషణ భూషణలో, గృహచ్ఛిద్రాలో చెప్పకుంటూ అక్కడ తిరిగే ఇతర మనుష్యులకు తాము అడ్డుగా వున్నామన్న సంగతే యెవ్వరూ గమనించరు. వాళ్ళను తప్పుకోమని సైకిళ్ళ గంటలూ, రిక్షావాళ్ళ కేకలూ, దూషణలూ, మోటారు కార్ల కూతలూ, వారిని తప్పుకోమని హెచ్చరిస్తున్నా వాళ్ళ వాద ప్రతి వాదాలతో యివి యేవీ యెవరి చెవికీ యెక్కినట్లు కనిపించదు. ఆ విషయంలో మట్టుకు వాళ్ళదీక్షా పట్టుదలా, నిర్భయత్వం ప్రశంసనీయ మనిపించింది. రకరకాల తినుబండారాల నుంచి కూరలు పువ్వులు, పళ్ళు పిల్లల ఆటవస్తువులు, స్త్రీల అలంకరణ వస్తువులు ఒకటేమిటి యెన్నెన్నో రకరకాలు తోపుడు బండ్ల మీదవేసుకొని పెద్ద పెద్ద కేకలతో అమ్మేవారు వందలాది కనబడ్డారు. వారి నందరినీ జాగ్రత్తగా తప్పించుకొంటూ మను షులమీద బళ్ళ కిందా పడిపోకుండా సర్కసులో తీగమీద నడిచే మనిషిలా ముందుకు సాగి, ఒకటి రెండు షాపులలోకి వెళ్ళి కొన్ని పంచలూ, చొక్కా గుడ్డలూ, తువ్వాళ్ళూ వగైరా కొనడానికి ఎంతో ప్రయత్నం చేశాను, ఏఒక్కడూ సరియైన ధర చెప్పడు. ఇక్కడి వస్తువుల విలువ నాకు తెలియదు. తక్కువ కడుగుతే ఏం తప్పో, అడక్కపోతే మోసమన్న

సంగతి తెలిసేపోయింది. ఇలా బాధపడుతూ. అఖరికి అత్యవసరమైన ఏ ఒకటి రెండు వస్తువులో మాత్రం కొనుక్కుని బయటపడ్డాను.

ఇలా వేడుకలు చూస్తూ తిరిగి, తిరిగి ఒక హోటల్లో ఫలహారానికి వెళ్ళాను. తీరా చూస్తే అది మాంసాహారులకు మాత్రమే ఉపయోగించేదని తెలుసుకుని. వెంటనే బయటకు వచ్చి ఈసారి శాఖాహారుల హోటలుకు వెళ్ళాను. అక్కడ ఏదో కొంత కడుపులో వేసుకుని బయలుదేరాను. ఇకనిక్కడుండి చూచేది ఏమీ లేదని, రాత్రికే ఇంటికి పోదామని నిశ్చయంచేసుకుని, హడావిడిగా నా బసకే బయలుదేరాను.

# 2

ఆ రాత్రి నెమ్మదిగా సకాలంలో విక్టోరియా టర్మినస్‌కు వచ్చాను. నిడదవోలుకి టిక్కట్టు ఇమ్మన్నాను. నిడదవోలు ఏ దేశంలో ఉన్నదన్నాడు. 'మన దేశంలోనే తూర్పుతీరాన. మదరాసు రాష్ట్రంలో మదరాసుకి ఉత్తరంగా, సుమారు మూడువందల మైళ్ళ దూరంలో M S M రైలు లైను మీద ఉన్న చిన్న స్టేషను. దగ్గర మేప్ లేదుగాని, లేకపోతే చూపించే వాణ్ణే' అన్నాను. పోనీలెండి, ఫరవాలేదు. అయినా మా దగ్గర టిక్కట్లు లేవు మదరాసుకు కావలిస్తే ఇస్తానన్నాడు. 'నేనిక్కడ నుంచి బోలెడంత దూరం మదరాసు వెళ్ళి అక్కడ నుంచి మళ్ళీ ఎగువకు వెళ్ళడం నాకు నష్టమూ కష్టమూ కూడాను. అందుచేతను మీరు నిడదవోలుకు వ్రాసి ఇవ్వండి. లేకపోతే మీకు బహూశా బెజవాడ అనే ఊరు తెలిసే ఉంటుంది. అక్కడికిచ్చినా సంతోషమే'అన్నాను. "అయితే ఇంకనేం. బెజవాడకు ఇవ్వగలను అని ఒక టిక్కట్టు తీశాడు దానిని చూచి దయచేసి నాకు రెండవ తరగతి ఇప్పించండి అన్నాను. వాడు నాకేసి చూసి కొంచెం కంగారుపడి "క్షమించండి సార్" అని "తమకేవూరు కావాలన్నారు మొదట" అని అడిగాడు. "నిడదవోలు" అనగానే ఇండియా గైడ్ తీసి, ఆ ఊరూ, అది ఎంత దూరంలో ఉన్నదో, దానికి ఛార్జీ ఎంత అవుతుందో, గబగబ లెక్కకట్టి నాకు టిక్కట్టు వ్రాసి "ఈమాట మొదటిలోనే చెప్పలేదేమిసార్. మిమ్మల్ని శ్రమపెట్టేను మన్నించండి." అని లేచి నుంచుని నాకు సగౌరవంగా టిక్కట్టు అందించి పంపించాడు. నేను కూలీచేత సామాను పట్టించుకుని రైల్లోకి వెళ్ళి అప్పటికింకా చాలా వ్యవధి ఉన్నా రైల్లోనే ఏదో పుస్తకం తీసుకుని చదువుతూ కూర్చున్నాను.

సుమారు ఒక గంటవరకూ అక్కడనే వేచి ఉండవలసి వచ్చింది.

క్రమేణా జనం పూటయ్యారు. నా పెట్టెలో కూడా ఇద్దరు అంగ్లోఇండి యన్ యువతులూ, ఒకరిద్దరు పార్సీలు, ఒక మహారాష్ట్ర దంపతులూ, ఎక్కి కూర్చున్నారు. నేనొక్కడనే విశాలంగా కూర్చోడం చూచి ఆ మహారాష్ట్ర దంపతులు ససామానుగా వచ్చి నా బెర్త్‌మీద సుఖాసీనులై కూర్చున్నారు. స్టేషనంతా కావలసినంత సందడిగా వుంది. రైలు బయ లుదేరింది. బ్రతుకు జీవుడా అనుకున్నాను.

రెండురోజుల్లోపున సుఖంగా యింటికి చేరవచ్చును కదా అని సంతో షిస్తూ ఇప్పుడు మొగలితుర్రు ఎలా ఉంటుందో, మా వాళ్ళు నారాకకు ఎంత ఆదుర్దాతో వేచి ఉంటారో, ఇన్నాళ్ళు వంటరిగా వాళ్ళెలా రోజులు గడిపారో, నేను వస్తున్నానని తెలిసి ఇతర బంధువులెవరైనా కూడా వచ్చి ఉంటారేమో, అనే ఆలోచనలు ఏవేవో బయలుదేరినా నాలో నేను నవ్వు కుంటూ మధ్యమధ్యను కొంచెం విషాదచ్ఛాయలు తెచ్చుకుంటూ వెంటనే వాటిని వెనక్కు నెట్టుతూ, పిచ్చివానిలా నేనెక్కడున్నది మరచి కూర్చు న్నాను. మిగతావాళ్లు ఎవళ్ళ భాషలో వాళ్ళు సంభాషణలు సాగిస్తున్నారు. దొరసాని పిల్లలిద్దర్నూ అర్థంపర్థంలేని కబుర్లు గట్టిగా చెప్పుకుంటూ, అస్తమానం వెర్రిగా కీచుగా పెద్దపెద్ద నవ్వులు నవ్వుతూ, హడావిడిగా ఉన్నారు. వాళ్ళు చాలా తెలివైన వాళ్ళమనీ తమరు కేవలము ఆంగ్ల దేశంలోనే జన్మించి గతిలేక ఈనాడు ఈ దరిద్రదేశానికి వచ్చినట్లుగా మాటలలోనూ, నవ్వులలోనూ, తల విసురులలోనూ, వ్యక్తం చేయడం ఆరంభించారు. వాళ్ళ భాష చూస్తే నాకెంతో అసహ్యమనిపించింది. మన వాళ్ళెవరూ ఎంత తక్కువ చదువుకున్నా, ఆఖరుకు బొంబాయిలోనూ, మదరాసులోనూ రిక్షాలాగే వాళ్లు కూడా ఇంతతకంటే మంచి ఇంగ్లీషు మాట్లాడ్డం విన్నాను. ఎదదర బల్లమీదున్న పార్శీసోదరులు వారి వ్యాపార గొడవలలో పడ్డారు. నా పక్కనున్న మహారాష్ట్ర దంపతులు రైలెక్కి నప్పటి నుంచి ఒక్క క్షణం కూడా ఊరుకోకుండా ఏదో గొడవ మహారాష్ట్రంలో సాగిస్తూనే వున్నారు. ఏదో జ్ఞాపకం వచ్చి సామాన్లన్నీ పైకితీసి, ఒక్కొక్క పెట్టెలోనూ ఉన్నవి కస్టమ్స్ పరీక్ష చేస్తున్నట్లు అన్నీ ఇవతల పడేసి మొగుడు వాటిని మళ్ళీ సర్దుతూంటే భార్య రెండో పెట్టెలోవన్నీ తీసి ఇవతల పడేస్తూంటే ఆయన విసుక్కుంటూంటే నాకెంతో ఆనందంగా ఉంది. సుమారు గంట పైగా వారు పెట్టెలు తిరిగేసుకున్నా, కావలసిన వస్తువు వారికి గొరికినట్టు లేదు. వారి భాషనాకర్థం కాకపోయినా ఆ వస్తువు నువ్వే ఎక్కడో పెట్టావు. అంటే నువ్వే ఎక్కడో పెట్టావు. అంటే నువ్వే ఎక్కడో పెట్టి ఉంటావు. ఎక్కడో నువ్వే పెట్టి ఉంటావు. అయినా ఆడదానికి ప్రయాణమై వెడుతూంటే ఇంతమందమతి ఏమిటే?

అన్నభావం ఆయన కొంచెం భయంతోనే వ్యక్తపరచాడు. చాల్లేండి. మీ కబుర్లూ మీరూను. ఆ వస్తువు ఫలానా చోట ఉన్నది. మీరు లేచి జాగర్త పెట్టవలసిందని లక్షసార్లు చెప్పాను. నా మాట వినిపించుకుంటే కదూ! పైగా నామీద కేకలు. మగవాళ్ళ కందరకూ ఒకటే జబ్బు అనే భావాన్ని ఆవిడ చాలా పెద్దగొంతుకతో అతిశయమైన అభినయంతో వ్యక్తంచేసింది. నేను మొదట అన్నట్టు నాకు భాష తెలియకపోయినా, వారి ముఖభంగిమలవల్లా, అభినయమువల్లా, వారి సంభాషణంతా నాకర్థమైనట్టు అనిపించి నేను ఎంతో ఆనందించాను. ఈ ఒంటరి ప్రయాణంలో ఈ కాల క్షేపం బాగానే ఉందనుకున్నాను. నాకూ వారి భాషే తెలిసి ఉంటేనేనూ వారి సంభాషణలో కలుగజేసుకుని వారి తగవు పెంచడమో, తుంచడమో చేసి ఉండేవాణ్ణి. అది మరికొంత వినోదంగా ఉండేది.

ఎలాగైతేనేమి అర్ధరాత్రి దాటే వేళకు నెమ్మదిగా ఒక రొకరే ఆవలిస్తూ అయిష్టంగానే నిద్రలోకి జారిపోతూ నిద్రలోనే మరి రెండు నిముషములు సగం సగం మాటలంటూనే బలవంతాన, కళ్ళు మూతపడి నోళ్ళు కట్టుపడి నిద్రపోయారు. నాకైతే ఇంకా ఎంత సేపటి వరకో నిద్రరాక, వాళ్ళ ముఖాలు చూస్తూ, వాళ్ళ జీవితా లూహించుకుంటూ, వారి దిన చర్యలు ఇలానే ఉంటాయి కాబోలు అనుకుంటూ నేనూ నాకు తెలియకుండానే నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోయాను. మరునాడు బాగా పొద్దెక్కిన తరువాత హైదరాబాదు చేరుకున్నాను. ఇక్కడ అందరూ దిగి పోవడం హడావిడీ, కూలీల కేకలూ, ఆడవాళ్ళ హంగామా మగవాళ్ళ విసుగుదలా, పిల్లల ఏడుపులూ వగైరా సందడితో చెవులు బద్దలై ఉన్నమతి కాస్తా పోతుందనిపించింది. నేను నా తరువాయి ప్రయాణానికి ఇక్కడ దిగి సాయంకాలం ఇంకో రైలులో ప్రయాణించవలెనని తెలుసుకున్నాను. నా సామాను వెయిటింగ్ రూమ్‌లోకి చేర్చి, ఒక పావుగంట విశ్రాంతి తీసుకుని, అక్కడనే స్నానంచేసి, సామానంతా జాగ్రత్తగా చూడమని అక్కడ నౌకరుకు ఒప్పచెప్పి, బయటకి భోజనానికి వెళ్ళాను. మనదేశానికి కొంచెం ఇంచుమించుగా మన ప్రాంతాలకు వచ్చి కూడా ఇంత దరిద్రపు తిండి తినవలసి వస్తుందని ఎన్నడూ ఊహించలేకపోయాను. భోజనం మధ్య లోనే విడిచి కొంచెము పెరుగుమట్టుకు దాహం పుచ్చుకుని బయటికివచ్చి నాలుగు అరటిపళ్ళతో కడుపు నింపుకుని, నగర సందర్శనానికి బయలుదేరాను. ఇక్కడ ఏ కొద్దిమందో తప్ప తక్కినవాళ్లందరూ ఉరుదూలోనే సంభాషణ. వీధులూ, వాహనాలు ఎంతో అసహ్యంగా ఉన్నాయి. ఘనత వహించిన నవాబుగారి నగరం కూడా ఇలా ఉన్నదేమా అనుకుని, కొంచెం బాధపడ్డాను. మదరాసు, బొంబాయిలో వలె ఇక్కడ ట్రాం కారులైనా

లేవు. అక్కడ ఏమీ చూడవలెనని కానీ, ఎవరినీ పలకరించవలెనని కానీ అనిపించలేదు. అందుచేతను మళ్ళీ కొన్ని పండ్లు కొనుక్కుని స్టేషనులో విశ్రాంతి గదిలోకి చేరి అక్కడ సుఖంగా పడుకున్నాను. అదృష్టవశాత్తూ ఆ గదిలో రద్దీకానీ, సందడికానీ, ఏమీ లేక సుఖంగా నిద్రపోయాను.

సుమారు రెండున్నరకు మెలకువ వచ్చింది. బయటకొచ్చేసరికి అక్కడి బంట్రోతు గోడను జార్లబడి కునికిపాట్లుపడుతూ ఏవో కలలు కంటున్నాడు. నేను వెళ్ళి నాకిష్టం లేకపోయినా, తప్పనిసరియై అతనిని నెమ్మదిగా లేపి, ఈ లోకంలోకి తీసుకువచ్చి వాడిచేతిలో కొంతడబ్బు పెట్టి ముందు కొంచెం టీ,నీవు తీసుకుని తరువాత నాకు రొట్టె, వెన్న, టీ తెచ్చిపెట్టమన్నాను. వాడు పరమానంద భరితుడై నిద్రాభంగమైన సంగతి కూడా మరచిపోయి, అసలు నిద్రే పోనట్టుగా నటించి ఒక్క పరుగున వెళ్ళి ముఖ ప్రక్షాళనాదికములు ముగించుకునేసరికి వాడూ ఫలహార శాల మనిషి చేతను, నాకు ఫలహారములు పట్టించుకువచ్చాడు. కడుపులో కొంచెం చురుకుపాలు ఎక్కువగా ఉండడం మూలాన తెచ్చిన వస్తువులను క్షణంలో మాయంచేసి కూర్చున్నాను. అక్కడ నౌకరు ఒక కూలీని వెంట పెట్టు కుని రైలు వేళ అయినదని, నన్నూ నా సామాన్నీ, నేనిచ్చిన బక్షీసు గ్రహించి ఎంతో ఆనందంతో, ఆప్తబంధువుని సాగనంపినట్టు సాగనంపాడు. నేను రైలులో రెండవ తరగతిలో వీలైనచోటు చూసుకుని సుఖాసీనుడ నయ్యాను. మరొఒక పావుగంటలో స్టేషన్‌లో హడావిడీ, జనసమ్మర్దం పళ్ళూ, ఫలహారాలు అమ్మేవాళ్ళ కేకలూ, ఎక్కువయినాయి. నా పెట్టె కూడా పూర్తి అయింది. నలుగురైదుగురు ముసల్ మానులూ, ఎవరో ఉద్యోగిలా ఉన్న ఒకాయనా, ఆయన భార్య, మళ్ళీ ఇద్దరు ఆంగ్లో ఇండి యన్ యువతులూ, ఒక చంటిపిల్లతో తెలుగు యువదంపతులూ, నా పెట్టెలో చేరారు. బొంబాయిలోకి మళ్లేనే ఈ దంపతులు కూడా నాప క్కనే కూర్చున్నారు. దంపతుల కందరకూ నామీద నింత అభిమానం ఎందుకో అర్థంకాలేదు. అయితే మట్టుకు చేసేదేముంది? చంటిపిల్ల ఏడాది గడిచి ఉంటుంది. విశాలమైన కళ్ళూ, నుదురూ, నల్లనిజుట్టూ, బొద్దుగా, తెల్లగా, ఎంతో ముచ్చటగా, ముద్దుగా కనపడ్డది. ఆ పిల్ల కూడా నాకేసే రెప్పవాల్చకుండా చూస్తూ ఒక చిరునవ్వు చిలికించింది. ఎలాగైనా ఆ పిల్ల నొక్కసారి తీసుకుని ఆలించి, ముద్దాడి, ఆ పిల్లకు గిలిగింతలు పెట్టి, నవ్వించి ఆడుకోవలెననే వెర్రిసరదా పుట్టింది. ఎలాగూ? ఆపిల్ల ను నాకోమాటిమ్మని ఎలా అడగడం? వారేమనుకుంటారో అని ఎంతో సేపు సందేహిస్తూ, నా వాంఛ తీవ్రతరంగా కాగా పట్టలేక, నా పక్కనున్న పిల్ల

తండ్రిని పలకరించి "తమదేవూరండీ" అన్నాను. "బందరు"అన్నారు. ఇక్కడేమైనా ఉద్యోగమా అన్నాను. "ఇక్కడకాదు. మా బంధువుల యింట్లో శుభం జరుగుతూంటే చూడ్డానికొచ్చాను" అన్నాడు. మరో పదినిమిషాలు పిచ్చాపాటీ మాట్లాడుతూ "మీదేవూరు" అన్నాడు నన్ను. "మాది నర్సాపురం" అన్నాను. "హైదరాబాదులో వుంటున్నారా?" అన్నాడు. "లేదు ఇంగ్లండు చదువుకోడానికి వెళ్ళి మూడేళ్ళు అక్కడవుండి ఇప్పుడే తిరిగివస్తున్నాను. నిన్న బొంబాయిలో రైలు ఎక్కాను. ఇప్పుడు మా వూరు వెడుతున్నాను అన్నాను. అమాట వినడంతోటే నేనెన్నో అడుగులు ప్రమాణం పెరిగినట్లు ఆయన నిర్ఘాంతపోయి నాకేసి చూచాడు. ఆయన భార్యా నామీద ఎంతో గౌరవమున్నట్టు నాకేసి ఒక్కసారి చూచి. మందహాసంతో కళ్ళూ, తలా వంచుకుంది. ఆ చంటిపిల్ల కూడా తనకేదో తెలిసినట్టు నన్ను చూచి ఫకాలున నవ్వింది. ఏమమ్మా? నన్ను ఎరుగుదువా? మనము ఎప్పుడైనా కలుసుకున్నామా? మనము పూర్వపు స్నేహితులమా? రా ఇలా రా అని చెయ్యిచాపాను. "ఎందుకండీ" అని ఆయన అంటూంటే ఆ పిల్ల గభీమని తండ్రి మీదనుంచి నా చేతుల్లోకి వాలింది. నేనాపిల్లని ఎంతో అప్యాయంగా అందుకున్నాను. ఆ అందుకోడంలో నా చేతివేళ్ళు ఆపిల్ల తల్లి చేతికి తగిలినవి కాబోలు ఆమె సిగ్గుతో కుంచించుకుపోయింది. ఆ పిల్లను కౌగలించుకుని ముద్దాడుతూ కూర్చున్నాను. కొంతసేపటికి నాతోనే ఆడుకుంటూ నా ఒడిలోనే మూత్రవిసర్జన చేసింది. "అన్నా అల్లరిపిల్లా" అన్నాను. తల్లిదండ్రులది గమనించి "అయ్యయ్యో ఎంత పని చేశానే రాక్షసీ" అని తండ్రి పిల్లను లాక్కున్నాడు. ఆయన చేతుల్లోంచి తల్లి లాక్కుని ఆ పిల్లను ఒక్కటి వేయబోయింది.

"కొట్టకండి" అన్నాను. "కొట్టకండి నేను భరించలేను. ఆపిల్ల చేసిన తప్పేమీలేదు. చంటిపిల్లకు ఏమి తెలుస్తుంది" అంటూ నాకేదో తెలిసినట్లూ నేమా పదిమందిని కని పెంచినట్టూ, కబుర్లు చెబుతుంటే, ఆమె కోపంతోటే కూతుర్ని రొమ్ముకు హత్తుకుని ముద్దాడడ మారంభించింది. ఇలాగే వారితో మట్లుకు ఏవేవో కబుర్లు చెబుతూ, విదేశీ విశేషాలు వర్ణిస్తూ నెమ్మదిగా నిద్రలోకి జారాము. ఉదయానికి బెజవాడ చేరుకున్నాము. వారక్కడ దిగిపోయారు. మళ్ళీ ఒకసారి ఆ చంటిపిల్లను అడిగి తీసుకుని ముద్దాడి "నాతో వస్తావా పాపా" అన్నాను నవ్వుతూ చేతులతో బుగ్గలు సాగదీస్తూ. ఊఁ ఊఁ అంది. "అయితే ఇక మీరు వెళ్ళండి, మీకు బాధ్యతా, భారమూ తగ్గింది. మీ అమ్మాయిని తీసుకువెళ్ళి, పెళ్ళి చేసుకుంటాను. శుభలేఖ పంపిస్తాను. మీరు తప్పకుండా రావాలి

సుమండీ" అన్నాను. వాళ్ళెంతో సంతోషంతో అలాగేలెండి. ఇంకొంచెం పెరిగి పెద్దదైన తరువాత అప్పటివరకూ మీరు ఖాళీగా ఉంటే మీకే యిచ్చి వివాహం మేమే చేస్తాంలెండి, మీకెందుకు ఈ శ్రమ" అని నిజంగా పిల్లను నేను తీసుకుపోతానేమో అనుకున్నంత కంగారుతో వా చేతిలోంచి తీసుకొని, వారి దారిన వారు, పిల్ల వెనక్కి తిరిగి నన్ను చూస్తూంటే, వెళ్ళిపోయారు. నేనూ కొంత సేపు అలాగే పరధ్యానంలో అక్కడే నిలబడిపోయి విశ్రాంతి గదికి నా సామాను పట్టించుకుని వెళ్ళి అవశిష్టములు తీర్చుకొని స్నానం చేసి దుస్తులు వేసుకునేటప్పటికి, తూర్పుకు వెళ్ళే మా బండి సిద్ధంగా ఉన్నదని తెలుసుకుని, మళ్ళీ రైలుకు పరుగెత్తేను. భోజనం సంగతి ఏమిటున్నమాట స్ఫురణకు రానేలేదు. ఆ చంటిపిల్లే కళ్ళలో మెదులుతూ కడుపు నిండి నట్టయింది.

రైలు బయలుదేరి ప్రయాణం ముందుకుసాగుతూంటే, ఆలోచనలు మూడు సంవత్సరములు వెనక్కి వెళ్ళాయి. అప్పుడు ఒకనాటిరాత్రి ఏమీ ఆలోచించుకోకుండా, ఏమీ తెలియకుండా, అభమూ, శుభమూ ఎరుగని అమాయకత్వంతో, మొదటిసారిగా రైలెక్కి చేసిన మదరాసు ప్రయాణం స్ఫురణకు వచ్చింది. ఈ స్టేషన్లు కొన్ని గుర్తుకొచ్చాయి. వాటిలో మార్పేమీ కనపడలేదు. తోటి ప్రయాణీకులు ఆనాటి జనంలాగనే ఈనాడూ కనపడ్డారు. ఎటొచ్చీ రెండవతరగతి గనక ఇందులో పాటక జనం కాక కొంచెం పై తరగతి వారూ, ఈనాటి వారు ఉన్నారు. మధ్య నెక్కడో కడుపులో మాడుతూంటే, మళ్ళీ కొన్ని పళ్ళూ రెండు మిఠాయి ఉండలూ, కొనుక్కొని తిని, కాసిని నీళ్ళు తాగి, ఆకలిని అణగించాను. సాయంకాలానికి నిడదవోలు చేరి, స్టేషన్‌లో దిగేసరికి, మళ్ళీ ఒకసారి పూర్వస్మృతులన్నీ మెదడులో మెలగడం మొదలెట్టినాయి. స్టేషన్ మాస్టర్‌తో టిక్కట్టుకోసం పడ్డ తగాదా, రైలెక్కబోతూ సామానుతో వెనక్కిపడడం. నేనెక్కవలసిన రైలు కాక ఎదరవైపుకు వెళ్ళే రైలు ఎక్కడం, దిగమంటే దిగనని తెలివితక్కువగా డబాయించడం మొదలైనవన్నీ ఎన్నెన్నో జ్ఞాపకాలు నన్నలాగే అక్కడనే కొంతసేపు నిలవేసినాయి. తరువాత తెలివి తెచ్చుకుని సామాను అక్కడ నౌకరుకు ఒప్పచెప్పి, దగ్గరలో ఉన్న హోటల్లో ఎంతో డోకు వస్తున్నా మూడు సంవత్సరములు తరువాత మొదటిసారిగా తెలుగు భోజనం రుచి చూచాను. తరువాత సామను పట్టించుకుని పడవల రేవుకు వెళ్ళాను. వెనుకటికి మల్లేనే మళ్ళీ పడవలో ఒక గది తీసుకొని కూర్చున్నాను. త్వరలోనే సరంగులు పెద్ద పెద్ద కేకలతో హడావుడితో పడవను మడుగులోకి తోసి నర్సాపురం వైపు ప్రయాణం సాగించారు. రాత్రి అయిన

కొద్ది తాడులాగే సరంగుల ఈల పాటలూ పడవలో కూర్చున్నవాళ్ళ రకరకాల ముచ్చట్లూ, నిశ్శబ్దంగా ఉన్న ప్రకృతి ప్రశాంతతను భగ్నం చేసినా, నాకు మట్టుకు మనసుకెంతో హాయి అనిపించింది. ఒక్కొక్క మైలే ముందుకు వెడుతుంటే మా వూరు సమీపిస్తూంటే మా యిల్లూ, మా వాళ్ళూ కళ్ళ ఎదుట నిల్చున్నట్లు వాళ్ళ తోటి మాట్లాడుతున్నట్లూ చిన్ననాటి మాటలేవో చెప్పుకుంటున్నట్లు ఊహించుకుంటూ భావనా ప్రపంచంలో విహరిస్తూ నన్ను నేను మరచి, నిద్రమరచి తెల్లవార్లూ అలాగే చూస్తూ, పొడిగుడ్లు పడి కూర్చున్నాను. సుమారు ఝాము ప్రొద్దు యెక్కే సరికి నర్సాపురం చేరుకున్నాము. వెంటనే పడవదిగి మూడు సంవత్సరములుగా లోపల అణిగివునన స్వస్థలాభిమానం. కాబోయే మాతా పితృల సందర్శనభాగ్యం, యింకా ఏవేవో ఊహలు నన్ను వెడుతున్న వేగిరపాటుతో జట్కాబండికుదుర్చుకుని బండివానిని తొందరగా పోనిమ్మని వేధించుకు తిని తుదకు మొగలితుర్రు చేరాను.

# 3

**బం**డి మొగలితుర్రు గ్రామంలో ప్రవేశించేసరికి సుమారు పదకొండు గంటలు అవుతుంది. బండి చూచి బండిలో నూతనంగా కనబడే నన్ను చూచి, 'ఎవరా ఈయన' అనే మీమాంస చాలామందికి బయలుదేరింది. తాసిల్దారో, కలకటేరో అయివుంటాడని కొందరభిప్రాయం తెలిపారు. 'మరి తాసిల్దారేనా, కలకటేరేనా అయివుంటే, ముందు డవాలీ బంట్రోతు ఉండ డేంటి' అని ఒక అనుభవశాలి అడుగుతున్నమాట కూడా వినపడ్డది. 'మరియితే వోరూ' అనే తర్జన, భర్జనలు అవుతుండగా, నా బండి వాళ్ళకు సందేహ నివృత్తి చేయకుండానే ముందుకు దూసుకుపోయింది. కొందరు కుర్రాళ్ళు నా వెంట కొంతదూరం పరుగెత్తినా నన్ను అందుకోలేకపోయారు. బండి మా వీధిలోకి మళ్ళడంతోటే వీధి మొగను నిలబడి ఏవో కబుర్లు చెప్పుకొంటున్న వాళ్ళు నా ముఖం చూచి 'మన చాత్తుల్లుగారి అబ్బాయా ఏంటి అన్నారొకరు, 'సీమ నుంచి దిగాడేంటి' అని మరొకరన్నారు. "మరి సీమనుంచి దిగితే నెత్తిమీద దొర టోపీ వుండద్దేంటి" అని మరొ కరడిగారు. "ఏ యున్నా లేకపోయినా దొరసానమ్మా వుండద్దేంటి" అని మరొకడన్నాడు. "యెదవ తెలివితేటలూ నువ్వూనూ! దొరసానమ్మ వస్తే మట్టుకు "బాపనింటికెలా వస్తుంది." అని వారిలో, వారు, జవాబులు దేనికీ రాక, తెలియక చూస్తూ ఊరుకున్నారు. బంటి మా యింటి దగ్గర ఇంతలో ఆగింది.




నేనా పూట వస్తానని మావాళ్ళు అనుకోలేదు. వీధిలో బండి ఆగిన చప్పుడు వినడంతోటే నేనే వచ్చి ఉంటాననే ఆశతో, మా అమ్మ పరుగు పరుగున వచ్చి, తలుపు తీసేసరికి నా గుండెలు రైలు వేగంతో కొట్టుకుంటున్నా, గభిమని ఉరికి ఒళ్ళంతా కళ్ళు చేసుకుని గుమ్మానికెదురుగుండా నిలబడ్డాను. తలుపు తెరవడంతోనే నాముఖం కనబడగానే మా అమ్మ కూడా ఓ క్షణం నిలబడి "నాయనా! వచ్చావా?" అని ఒక్క వెర్రికేకతో తను ముడి కట్టుకున్న సంగతి కూడా మరచిపోయి, నన్ను ముట్టుకోవచ్చునా, ముట్టుకోకూడదా, లోపలికి రానివ్వవచ్చునా రానివ్వకూడదా అనేవేవి ఆలోచించకుండా గభిమని నన్ను కౌగిలించుకుని నోటమాట లేకుండా సంతతధారగా కన్నీరు కారుస్తూ నిలబడిపోయింది. నేనంతకంటే బెంబేలు పడిపోయి నిశ్చేష్టుడనై మా అమ్మ కన్నీరు నా చొక్కాను తడుపుతుంటే అంతకంటే ఉప్పెనలా పొంగుతూవస్తున్న నా కన్నీటితో ఆమె శిరసు నభిషేకించాను. దేవతార్చన చేసుకుంటున్న మా నాన్న, మా అమ్మకేక విని కాబోలు ఎన్నడూ అలవాటులేని తొందరపాటుతో, దేవునీ దేవతార్చననూ కూడా విడిచి, ఒక అంగలో ఆయన వాకిట్లోకి వచ్చి నాముందు నిలబడిపోయారు. ఆయనకు వాగ్బంధనమై కన్నీరు మట్టుకు బయటపడకుండా, ఆనకట్ట కట్టి అనిమిషనేత్రాలతో పంచప్రాణాలనూ నేత్రాలలోనే నిలుపుకుని నాకేసి చూస్తూ నిలబడిపోయారు. ఇలా కొన్ని నిమిషములు నిశ్చలంగా నిలబడిపోయాం. బండివాడు సామాను దింపి, లోపల పెట్టాడు. మా వీధి చివరనూ, పై వీధిలోనూ, నన్ను గురించి మీమాంసపడ్డవారు, మా గుమ్మంలోకి గబగబా చక్కావచ్చి నోట్లో చుట్ట అవతల పారేసి, కాళ్ళు

చెప్పులు వీధిలోనే విడిచి, నా వెనుక నాలుగడుగుల దూరంలో, మమ్మల్ని మమ్మలను చూస్తూ నిలబడిపోయారు. అప్పటికి మంత్రముగ్ధులమైన నేను మా అమ్మా, నాన్నా ఒక్కసారే చైతన్యం తెచ్చుకొని, రా నాయనా లోపలికి అంటూ తను ముందుదారి తీసింది. మా అమ్మ నాన్న అలాగే నిలబడి-

"ఈ వేళ వస్తావా! రేపు వస్తావా అనుకుంటున్నాము" అన్నారు. మా వెనుక నున్న జనం గుమ్మం లోపలికి వచ్చి మానాన్నకూ, నాకూ నమస్కారం చేసి "బాబుగారూ! అబ్బాయి వచ్చేశారు మీరు చాలా అదృష్టవంతులు. అబ్బాయిగారిని చూసి కలకటేరు అనుకొన్నామండీ. మునూరికే నేను కలకటేరయితేనా?" అన్నారు నలుగురైదుగురు ఏకకంఠముతో. నేను చిరునవ్వు చిందిస్తూ మాట్లాడకుండా నిలబడ్డాను. "ఏదో ఈ నాటికి మూడేళ్ళ తరువాత పరమేశ్వరుడు మమ్మల్ని అనుగ్రహించి మా వాణ్ణి క్షేమంగా, ఈ భయంకర యుద్ధ సమయంలో తీసుకువచ్చి మా కప్పజెప్పాడు. ఆయన అనుగ్రహమే వుంటే మనకెప్పుడూ యే లోటూ వుండదు. పాపం మీరేదో పనులమీద బయలుదేరినట్టున్నారు. మావాడు కాస్త బడలిక తీర్చుకుని, స్నానపానాదులు ముగించుకుని కొంచెం విశ్రాంతి తీసుకొంటాడు సాయంకాలం సావకాశంగా కలుసుకుందాం ఏమంటారు" అన్నాడు మానాన్న. ఆయన నేర్పూ, వచో నైపుణ్యమూ, సమయస్ఫూర్తీ నన్ను ముగ్ధుణ్ణి చేశాయి.

వచ్చినవారంతా "'చిత్తం చిత్తం సెలవిప్పించండి' అని నమస్కరించి చక్కాపోయారు.

ఇంతలో మా అమ్మలోపలికి వెళ్ళి స్నానం చేసి వేరే మడిబట్ట కట్టుకుని ముఖం నిండా పసుపూ, అర్ధ రూపాయంత బొట్టుతో సాక్షాత్తూ అన్నపూర్ణేశ్వరిలా, మహాలక్ష్మిలా కళకళలాడుతూ ఆనందంతో వచ్చి నిలబడ్డది.

"నాయనా! క్షేమంగా వచ్చావా! దారి పొడుగునా ఏ ప్రమాదములూ భయపెట్టలేదుగదా, అటువంటిదేమీ జరగదనీ, పరమేశ్వరుడు మనయందు ఉన్నాడనీ నాకు దృఢవిశ్వాసం. అందుకనే స్థిరచిత్తంతో రోజులు లెక్కపెట్టుకుంటూ నీ రాకకు ఎదురుచూస్తున్నాను అన్నారు మానాన్న. ఇంతసేపూ నాకు కొంచెం దూరంలోనే నిలబడి మాటాడుతున్నారు. నేను మట్టుకు అక్కడున్న బల్లమీద కూర్చున్నాను. అప్పుడు లేచి ఆయనకు పాదాభివందనం చేదామని అనుకుంటుంటే ఆయన నా వూహ కనిపెట్టి - "ముందు నీవు లేచి స్నానం చెయ్యి నాయనా. అమ్మ

నీకు అక్కడ వేడినీళ్ళు పెట్టి ఉంటుంది. ఈ లోపున నేను నా దేవతార్చన ముగించుకుంటాను." అని లోపలికి వెళ్ళిపోయారు. నేనొక్క క్షణం అలాగే, నేపుట్టి పెరిగిన ఆయింటి గోడలను చూస్తూ కూర్చున్నాను. ఎంతసేపో తెలియలేదు. మా నాన్న దేవతార్చన పూర్తి కావస్తూ సూచనగా గణగణ గంట మ్రోగింది. నేను ఉలిక్కిపడి మైకంలోనుంచి లేచినట్లు లేచి నిలబడ్డాను. మూడేళ్ల క్రితం వరకూ ఎన్నోసార్లు విన్న మంత్రపుష్పం నేడు మళ్ళీ మానాన్న కంఠంలోంచి వెలువడుతూంటే ఒళ్ళు జలదరించింది. అప్రయత్నంగా చేతులు జోడించి నిలబడ్డాను. మంత్రపుష్పం పూర్తికాగానే, స్నానానికి బట్టలు విడిచి తువ్వాలు తీసుకొని చిన్నప్పుడు లేని అలవాటు, ఇప్పుడు కొత్తగా వచ్చినది. సబ్బు కూడా తీసుకుని వంటఇంటిలో నుంచి వెళ్ళవచ్చునో, వెళ్ళకూడదో అనని సందేహం కలిగి మా సావిడి పక్కనున్న సందులోనుంచే నూతి దగ్గరకు వెళ్ళాను! మూడు సంవత్సరములు అలవాటయిన స్నానాలగది, స్నానాల తొట్టి, దిగంబర స్నానం, మరచిపోవలసివచ్చింది. ఒక్కక్షణం తటపటాయించి తువ్వాలు, అక్కడున్న దండెంమీద వేసి, నచేల స్నానం చేశాను. పూర్వపు అలవాటు జ్ఞాపకం వచ్చి, తువ్వాలు తడిపి మొలకు చుట్టుకుని పంచ, నీళ్ళలో జాడించి, అక్కడ దండెంమీదను ఆరవేసుకుని లోపలకు వచ్చాను. ఇంతసేపూ మా అమ్మ తలుపు వారన నిలబడి సమస్తం మరచి ఈ సృష్టి అంతకూ నేనొక్కడనే అయినట్టు ప్రాణమంతా కళ్ళల్లో పెట్టుకుని నాకేసి చూస్తూ, నా ప్రతి సంచలనమూ, చర్యా గమనిస్తూ, హర్షిస్తూ ఉండిపోయింది. నేను వచ్చిన దారినే మళ్ళీ సావిట్లోకి వెళ్ళి నూతన వస్త్రధారణ చేసి బొంబాయిలో కొన్న సన్నని లాల్చి కూడా తొడుక్కుని తలదువ్వుకుని కూర్చున్నాను మా నాన్న భోజనానికి ఉపక్రమించినట్టున్నారు. మా అమ్మ అద్దమూ, గంధాక్షతలూ తీసుకువచ్చి, నా ముందు పెట్టి, "బొట్టు పెట్టుకో నాయనా! నీకు ఈ వేళా రేపు కూడా ఇక్కడే భోజనం పెట్టవలసి ఉంటుంది. ఏం చేయను నాయనా ఆ మాట ఈపాడు నోటితో అనవలసి వచ్చింది." అంటూ లోపలికి వెళ్ళి నాకు సావిట్లోనే ఒక పీటవేసి, విస్తరివేసి, యధాశాస్త్రీయంగా వడ్డించింది. నేను భోజనానికి కూర్చోబోతుంటే 'నాయనా చొక్కా విప్పేసి కూర్చో' అన్నది చొక్కా విప్పబోతుంటే కొంచెం దగ్గరకు వచ్చి యజ్ఞోపవీతం ఉన్నదా? అని అతి రహస్యంగా అడిగింది. 'ఉన్నదని' చెప్పాను. ఇటువంటి అవసరం వస్తుందని ఊహించి నేను ముందే జాగ్రత్త పడ్డాను. నేను విస్తరి దగ్గర కూర్చున్న తరువాత పరిషిస్తానో లేదో అని మా అమ్మ తలుపుచాటు

నుంచి చూస్తూనే ఉన్నది. నా భోజనం అయ్యేవరకూ వాక్కావలసినవన్నీ ఒకటికి పదిసార్లు అడుగుతూ, పావిడీ, వంటింటీ మధ్యన మా అమ్మ తిరుగుతూనే ఉన్నది. ఉత్తరాపోశన కాగానే కన్నీటితో, రుద్ధకంఠంతో, "ఆ విస్తరితీసేసి వీధిలో పారేయి నాయనా" అంది. తరువాత నేనిక్కడ పేడ నీళ్ళు చల్లుతా కాస్త చేత్తో రాసేయ్ బాబూ. ఎంత దురవస్థ వచ్చింది నాయనా. ఈనాడు నీచేత ఈ పనులు చేయించవలసి వచ్చింది. అవి ఎంతో నాపోయింది. నేను నవ్వుతూ మెతుకులు ఎత్తేసి విస్తరి మడుస్తూ 'ఏమిటమ్మా? ఇదేదో నాకు కొత్తయినట్టు అలా బాధపడతావెందుకూ! చిన్నప్పటి నుంచీ నీవు బయటచేరినప్పుడు ఎన్నిసార్లు చేయలేదు పని ఆ అలవాటు మరచిపోలేదులే ఇంకా' అన్నాను నవ్వుతూ. 'మర్చిపోలేదు నాయనా ఇంకా జ్ఞాపకముందిరా పిచ్చినాన్న' అంటూ లాలనగా పెదవులపై హాసం చిందిస్తూ కంటతడి పెట్టుకుంటూనే అన్నది. ఇంతలో మా నాన్న కూడా భోజనం ముగించుకుని ఇవతలకు వచ్చాడు.

ఆయన కూడా నేను కూర్చున్న బల్లమీదనే కూర్చున్నారు. ఆయన కాళ్ళు పైన పెట్టుకొన్నారు. వారి కెదురుగా సాష్టాంగ నమస్కారం చేశాను. "ఎందుకురా అబ్బాయీ? ఇప్పుడెందుకు?" అన్నారు నేను లేచి నిలబడి కంపిత గాత్రంతో "నా అపరాధాన్ని మన్నించలేరా నాన్న! చేసినది అంత అకార్య కారణమా? విదేశాలలో విద్యనేరిస్తే యెంతో విజ్ఞానమూ నాగరికతా అబ్బుతుందనీ తరువాతను పెద్ద ఉద్యోగమై పెద్ద హోదాలోకి రావచ్చుననీ; కొందరు పెద్దలు పదేపదే చెప్పగా విని క్షణికోద్రేకంలో తొందరపడి వెళ్ళిపోయినాను.

ఆ వెళ్ళిన క్షణంనుంచి ఈ క్షణంవరకూ మిమ్ములను మరువలేదనీ మీకోసం ఎంతో బెంగా, బాధా కలిగిందనీ చెబితే నమ్మగలరా నాన్నా?

ఆనాడు మీ అనుమతి అర్థించి ఉంటే మీరంగీకరించేవారేనా?

ఇంటిదగ్గరనే ఈ ఇరకాటంలోపడి ఎదుగూ బొదుగూ లేకుండా, కనుబొమ్మ మీద వెంట్రుకలా జీవించవలసిందే తప్ప నాకు మార్గాంతరం ఏమీ కనబడలేదు. ఇక్కడ చదువు నాకు నచ్చలేదు. అందుచేతను తెగించి మీ ఆగ్రహానికి కూడా భయపడక తిన్నగా వెళ్ళిపోయాను. అది ఈనాటికీ క్షంతవ్యము కాని నేరమా నాన్నా? బోలెడంత డబ్బు మీచేతను ఖర్చు పెట్టించాను. మీకు మనోవ్యాకులత ఎంతో కలిగించాను. ఇంకను ఆ దోషము సరిదిద్దుకోగలనని ధైర్యమున్నది. అక్కడి విద్యా, అక్కడ బోధనా పద్ధతులు నన్నెంతో ఉత్సాహవంతునిగా చేసి, ఎన్నెన్నో అజ్ఞాత విశాల

ప్రపంచాలు వాళ్ళు ఎదుట చూపించినదా విద్య అనుకుంటున్నాను.

ఏమైనా నాకు విశాల దృక్పథం ఏర్పడింది. అహంభావం నశ్నగిరి మానవుని అల్పత్వం స్పష్టమైనది. జీవితంలో సత్యానికున్న స్థానమూ, విలువా తెలుసుకోగలిగాను. ఇంకను భవిష్యత్తు అంతా తీర్చిదిద్దగల సమర్థుడు భగవంతుడు ఒక్కడే. మీరుమట్టుకు నన్ను అనుగ్రహించి, మన్నించావని ఒక్కమాట అనండి నాన్నా, నాకెంతో తృప్తిగానూ, ఉత్సాహంగానూ వుండి వేయి ఏనుగులబలము వచ్చినట్టు వుంటుంది. ఆ ఒక్కమాట అనండి నాన్నా" అని ముకుళిత హస్తములతో అలాగే ఆయన ఎదుట నిలబడిపోయాను.

ఆయన రెండు నిమిషముల వరకూ వంచిన తల యెత్తలేదు. నే చెప్పినది విన్నారో లేదో తెలియదు. ఆయన ముఖంలో యెప్పుడూ యే భావమూ వ్యక్తమయ్యేది కాదు. ఇప్పుడూ అంతే.

కొంతసేపటికి వారు తలయెత్తి నాముఖంలోకి సూటిగా చూస్తూ "నాయనా! నా క్షమను నీవింతగా కోరడమెందుకూ? నీమీదను నాకు కోపం యే మాత్రమూ లేదు. నీవు వెళ్ళిన కొత్తలో మట్టుకు నా స్వార్థం చేతను అహంకారంచేతను నావయసులో నాకండదండగా వుండవలసిన వాడవు దూరమయ్యేవే అని బాధపడిన మాట వాస్తవమే, కాదనను. ఇక నీవు చేసినపనీ దాని మంచిచెడ్డలూ ఈనాటికీ నేను నిర్ణయించలేకున్నాను. ఆ నిర్ణయం చేయవలసినవాడూ, క్షమించడమో హర్షించడమో చేయవలసినవాడూ కూడా పరమేశ్వరుడే, అ దేశాలలో నీ విద్య దిగ్విజయంగా ముగించుకుని అపమార్గాన పడక, ఈ కల్లోల పరిస్థితులలో క్షేమంగా ఇంటికి చేరగలిగావంటే ఆ పరమేశ్వరుడు నీ చేతను హర్షించి, నీయందుండి అనుక్షణం నిన్ను కాపాడుతున్నాడనే భావం నాకు కల్గింది. నిన్ను చూస్తుంటే నాకు ఆనందమే కాని ఆగ్రహమేమీ లేదు. ఇప్పుడింక రెండు రోజులు నిన్ను దూరంగానే ఉంచి మన సంప్రదాయ ప్రకారమూ, మన సదాచార పద్ధతిని నీకు ప్రాయశ్చిత్తము చేయించవలసి ఉన్నది. సాయంకాలమున పురోహితులతో సంప్రదించి ఆ ఏర్పాటు చేసేవరకూ, మనమింకా ఎడమెడముగానే ఉండవలసి ఉంటుంది. దూరప్రయాణం చేసి వచ్చావు. కాస్సేపు విశ్రమించు" అని ఆయన లోపలికి వెళ్ళిపోయారు.

నేను బల్లమీద పక్కవేసుకుని మా అమ్మతో కబుర్లు చెప్పుకోవాలననే ఆసక్తి ఉన్నా లోపలికి వెళ్ళడానికి సందేహిస్తూ పడుకున్నాను. పడుకున్న ఉత్తరక్షణంలోనే నిద్ర వచ్చింది కూడాను. సుమారు నాలుగు గంటలవ

రకూ మెలకువే రాలేదు మామూలు ప్రకారం టీ యిస్తుందేమో అమ్మ అనుకుని, మన యింట్లో అటువంటి అలవాట్లేమీ లేవు కదా! ఈనాడు హఠాత్తుగా ఆవిడ యెలా చెయ్యగలదు అని అనుకుంటూవుండగా మా అమ్మ నాకు కాసిని మంచినీళ్ళూ, కొంచెం ఫలహారం తీసుకువచ్చి అక్కడ పెట్టి "నాయనా నూతి దగ్గరకు వెళ్ళి ముఖం కాళ్ళూ కడుక్కో, వచ్చి ఫలహారం తీసుకో" అన్నది నాకేసి చూస్తూ, నేను మందహాసంతో లేచి "యివన్నీ యెందుకు చేశావమ్మా యిప్పుడు" అన్నాను.

"తరువాత చెబుతాలే. ముందు నువ్వెళ్ళి కాళ్ళు కడుక్కురా" అంది. నేనెంతో సంతోషంతో లేచి మూడు సంవత్సరములు రోజూ అధమం నాలు గయిదు సార్లు తీసుకునే టీ హఠాత్తుగా మానెయ్యడమెలాగా అనుకుంటూ వెళ్ళి కాళ్ళు కడుక్కువచ్చి మా అమ్మ అమృతహస్తంతో చేసిన ఫలహారం యెంతో సంతోషంగా తింటే నాకు మళ్ళీ టీ తాగవలెననే ధ్యాసే లేకుండా పోయింది.

ఈ కార్యక్రమం ముగిసిన కొంచెంసేపటికి మా పురోహితుడు వచ్చాడు. మానాన్నగారూ ఆయన కొంచెంసేపు సంప్రదించుకొని ఎల్లుండి ప్రాయశ్చిత్తకాండ జరిపించవలెనని నిశ్చయము చేసికొని కావలసిన సామగ్రి కోసం మానాన్న లేచి వీధిలోకి వెళ్ళారు. మరో పదినిమిషాలు మా పురోహితుడు నా యోగక్షేమములు విచారించి ఆయన వెళ్ళారు.

మర్నాడుదయం నేను లేచి అవశిష్టములకు చెంబు తీసుకుని బయ టకు భయపడుతూ వెళ్ళాను. అందులోనూ కొంచెం పొద్దెక్కిన తరువాత కావడాన మరీ సిగ్గనిపించింది. ఇక్కడ ఈ మాత్రం మార్పేనా రాలే దని విచారిస్తూ, గత్యంతరంలేక, పైకి ఎంతో దూరం వెళ్ళి తిరిగివస్తూ దారిలో ఉన్న చెరువులో స్నానం చేయవలెనని బుద్ధి పుట్టింది. వెంటనే చెరువులో మునిగి కొంచెంసేపు ఈతలాడుతూంటే, చెరువులోనూ, గట్టు మీదనూ ఉన్న స్త్రీ పురుషాదులు నాకేసి ఆశ్చర్యంతో చూస్తూ నిలబడి పోయారు. ఇంతమంది నన్ను చూస్తున్నారు అనే జ్ఞానం కలుగగానే ఏదో తప్పు చేసినట్లు సిగ్గుపడుతూ పైకి వచ్చి ఒళ్ళు తుడుచుకుంటూంటే.

ఒకరిద్దరు గ్రామవాసులు పెద్దవారు, 'ఏమయ్యా సీమకు వెళ్ళినా మూడేళ్ళు అయినా ఈత మరచిపోకుండానే వచ్చారే?'

చాలా సంతోషం

అక్కడ చలీగట్రా లేకుండా ఇలాగే చెరువులూ అవీ ఉండి అందులో

స్నానాలు చేస్తూ ఈతలు కొడుతుంటారా అన్నారు.

నేను నవ్వుతూ "అక్కడ స్నానానికి వేరే ఏర్పాట్లు ఉంటాయి. ఇలాటి ఆరుబయట చెరువులూ ఉండవు. ఏ నదులో, కాలవలో ఉన్నా అందులో ఇలా స్నానం చేయడానికి అక్కడ శీతలమూ ఒప్పుకోదు. అక్కడి ప్రజలు ఈ అర్ధనగ్న ప్రదర్శనమూ ఒప్పుకోరు" అన్నాను.

"ఆశ్! అబ్బా! అలాగటండీ! ఆం! ఇంకా మరయితేమా మరేమీ అనుకోకండి. కానీ మరి బయలుకెడతారండీ" అన్నారు.

"స్నానమే చెయ్యనివాళ్ళు బయలుకి ఎలా వెడతారు" అన్నాను నవ్వుతూ.

"మరయితే - మీరు ఈ మూడేళ్ళూ - ఎలాగండి వాళ్ళు మట్టుకు స్నానం మాట ఎలా వున్నా, ఇది లేకపోతే ఎలా బతుకుతారండీ" అన్నారు ఎంతో ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

"కంగారు పడకండీ ఇది అసల్లేదని నేను చెప్పలేదు. ప్రతీ ఇంట్లోనూ దానిక తగ్గ ఏర్పాటు ఉంటుంది" అన్నాను.

"ఆంహాం! అలా చెప్పండీ. నర్సాపురంలోనూ అక్కడ పాకీదొడ్లు ల్లాంటివన్నమాట" అన్నారు.

"అలాటివి మట్టుకు కాదు. అవి బాగుచెయ్యడానికి వేరే మనుష్యులు అక్కరలేకుండానే, శుభ్రమయ్యే ఏర్పాట్లు వేరే ఉన్నాయిలెండి, తరువాత మనవి చేస్తాను" అంటూ ఇంకెన్ని ప్రశ్నలు అడుగుతారో అనే భయంతో తొందరగా చెరువులోంచి పైకి వచ్చేశాను.

"మరయితే బాబూ" అని వారింకా ఏదో అడుగుతూ తరుము కూత పట్టకుండా గబగబ పరుగుతీసినంత వేగంతో యింటికి చేరుకున్నాను.

మా వీధి అరుగుమీదను సుమారు నలభైయాభైమంది గ్రామపెద్ద లంతా అన్ని వర్ణములవారూ సభతీర్చి నాకోసం ఎదురుచూస్తూ కూర్చు న్నారు. చచ్చానురా దేవుడా! అక్కడ తప్పించుకున్నా ఇక్కడ తప్పేటట్టు లేదు. వీళ్ళు ఏవేవో చచ్చు ప్రశ్నలు వేసి నన్ను వేధించుకు తింటారు కాబోలు అని హడలిపోతూ వారందరూ లేచి నమస్కరిస్తూ మందహాసం చేస్తూంటే

కూర్చోండి ; ఇప్పుడేవస్తా అంటూ, లోపలికి వెళ్ళి తడిబట్టలు విడిచి ఆరవేసుకుని చొక్కా తొడుక్కోబోతూఉంటే మా అమ్మ నేనేమీ

అడక్కపోయినా కమ్మని నేతి పెసరట్లు నాలుగు ఒక వెండి కంచంలో పెట్టి, మంచినీళ్ళు ఒక చెంబుతోను ఒక గిన్నెలో పాలూ తీసుకు వచ్చి అక్కడ కింద పీటవేసి అమర్చింది. నేనెంతో ఆనందంతో ప్రాణంలేచి వచ్చి ఇలాంటి పెసరట్లు మూడేళ్ళ తరువాత తింటూంటే ఎంత సుఖంగా వుందో వర్ణించలేకుండా వున్నాను. తరువాత పాలు తీసుకుని వీధి అరుగు మీదకి నాకోసం వేచివున్న గ్రామపెద్దలను కలుసుకోడానికి వచ్చాను.

నేను రావడంతోటే వారంతా మళ్ళీ లేచి నుంచుని ఒకవైపునవున్న అరుగుమీద వారు కొంచెం వెనక్కు సర్దుకొని, నాకుచోటుచేసి నన్ను కూర్చోమన్నారు.

నేను కూర్చోబోతుంటే మా యింటి చాకలి ఒక్క మాటుండండి బాబయ్యా సాపా, బాలీసు తెస్తానుఅంటూ లోపలికి వెళ్ళబోతుంటే వారించి వద్దులేవోయ వారందరూ కూర్చువ్నారుకదా. నాకు మట్టుకెం దుకూ? అన్నాను.

వాడు తెల్లబోయి కిందకు తప్పుకున్నాడు.

ఒక్కక్షణం యెవరు యెలా సంభాషణ ప్రారంభించాలో తెలియక తటపటాయిస్తుంటే,

ఒక రాజుగారు పెద్దవారు. "బాబూ పార్వతీశం బాబూ, యెప్పుడొ చ్చారు? నేను రాత్రి యింటికి వచ్చేసరికి చాలా ఆలస్యమైంది, అప్పటి కప్పుడే మీరొచ్చారనీ కొత్త మనిషయ్యారనీ అందరూ చెప్పుకుంటుంటే చూదామని యెంతో మనసు తొందరపెట్టినా అప్పటికి మీరు పడుకుని ఉంటారని మా వాళ్ళు వెళ్ళొద్దన్నారు. అందుకని మనస్సు ఎంత పీకు తున్నా ఆగిపోయి పొద్దున్నే లేచి వచ్చాను" అన్నారు.

"చాలా సంతోషం మీరందరూ ఉదయాన్నే మీమీ పనులు మానుకుని నన్ను చూడ్డాని కొచ్చారంటే ఎంతో సంతోషంగా ఉన్నది. ఏమిటి విశేషాలు ఈ వూరు వదలి, మిమ్మల్ని అందరినీ విడిచిపెట్టి, ఎక్కడో దూరదేశానికి వెళ్ళిపోయినా నా ప్రాణం తరచు ఇక్కడ తిరుగుతూ మిమ్మల్నందరినీ చూస్తూ మీత మాట్లాడుతూ ఈ వీధులంటా, పొలాలంటా, కాలవగట్ల లంటా, తిరుగుతున్నట్టే వుండేది. మీరందరూ క్షేమంగా ఉంటున్నట్టేనా? కాలమానమూ వ్యవసాయాలూ బాగున్నవి కదా" అన్నాను.

# 4

"అయ్యబాబయ్ బాబూ! మన పార్వతీశం బాబుకి అన్నీ ఎరుకే మనని ఎవర్నీ మరచిపోలేదు" అన్నాడు మా మాజీరైతు ఒకతను.

"అక్కడ అంతా కొత్తకామోనేమండి" అని ఓ యువకుడు అడిగాడు.

"అవునోయ్ అంతా కొత్తేమరి" అన్నాను.

"మరయితే ఎలాగండి బాబయ్యా" అన్నాడు.

ఇంతలోనే అక్కడ అందరూ ఇంగ్లీషే మాట్లాడతారా లేకపోతే మన భాషకూడా ఉంటుందా అని అన్నాడొకతను.

అయ్య బాబయ్ బాబూ! మరి సిన్నపిల్లల మాటేటండి. ఆళ్ళకి ఇంగ్లీషు ఒస్తదాండి అన్నాడు మరొక ఆసామీ.

నేను నవ్వుతూ తల్లిదండ్రులు మాట్లాడే మాటలే కదా పిల్లవాళ్ళు నేర్చుకునేది. పెద్దవాళ్ళ మాటలు చిన్న వాళ్ళ పాటలు అనే సామెత కూడా ఉన్నది గదా మనలో అన్నాను.

అయితే ఇళ్ళుకూడా మన ఇళ్ళలా ఉండవాండీ అన్నాడు.

'ఇలా ఉండవు కాని అక్కడ శీతల దేశం కనుక వీధి అరుగులూ అరుగులు మీద కూర్చుని కబుర్లు చెప్పుకోడం . అక్కడే పడుకోడంలాంటి వేవీ వుండవు' అన్నాను.

ఇంతలో గుండెలు పగిలిపోయినట్టు వీధి అరుగులే ఉండవాండి అన్నాడు.

'ఉండవ'న్నాను.

మరయితే మొహాలూ గట్రా కడుక్కోవడం యెలాగండి. అన్నాడు.

'ఏమో తెలియదు కానీ, అందుకనే కాబోలు చాలామంది అక్కడ మొహాలు రోజూ కడుక్కోవడమంటూ వుండదన్నాను.

'ఏమిటేమిటీ' అంటూ ఒకరాజుగారు గోడని జార్లబడివున్నవాడు నిటారుగా కూర్చుని మొహాలు కడుక్కోరూ? ఆరి వీళ్ళ మొహాలుమండా! మొహాలే కడుక్కోకపోతే యింకేం కడుక్కుంటారు. ఆపాచినోటనే అన్నీ తినడం, తాగడమూ నన్నమాట. అయ్యవీళ్ళ మొహాలు తగలెయ్యా! అదేమి

దేశమయ్యా పార్వతీశంబాబూ! ఆపాడు యెక్కడ దొరికిందయ్యా! నీకు వెళ్ళడానికి అన్నాడాయన గుండెబాదుకొని.

"ఏదో ఒక్కొక్క దేశానికి ఒక్కొక్క అలవాటు ఉంటూ వుంది. ఎక్కడ దాకానో ఎందుకూ? మన పక్కనువ్న తమిళసోదరులు నాలుక గీసుకోరు అలా అని వాళ్ళ మొహాలు తగలేస్తామా? నాలుకలు కోసేస్తామా? వారిలో యెంతమంది విద్వాంసులూ, మేధావులూ, పండితులూ, వేదాధ్యయనం చేసినవాదూ, యెంతమంది తెలుగమక"

'మరయితే బయలుకు వెళ్లడానికి బయళ్ళేనా ఉంటాయాండీ' అన్నాడు ఎంతో దీనంగా ఒకతను ఆ క్షణంలో ఆ అవసరం తనకు కలిగినట్లు.

నేను కొంచెం నవ్వుతూ బయళ్ళూ, బీళ్ళూ, గుట్టలూ, కొండలూ కావలసినన్ని ఉంటాయి గాని అక్కడ ఇలాటి పనులు చేయడానికి వీలు లేదు. ఎవరూ చేయరు కూడాను. అన్నాను,

ఇదెక్కడి చావొచ్చిందండీ! పొద్దున్న చేయవలసిన రెంటికీ వీలు లేకపోతే వాళ్ళెలా బ్రతుకుతున్నారు? మీరెలా బ్రతికి బయటపడ్డారు! అన్నాడు మరొకాయన.

నేను సమాధానం చెప్పేలోపుననే,

"బయళ్ళలో బయలుకి వెళ్ళకూడ దంటారు. కాలవల్లోనూ నదుల్లోనూ జలకాలాడ కూడదన్నారు. ఇంకేటి చెయ్యొచ్చును" అన్నాడు ఒక ఆసామీ.

జీవితంలో చేయడానికి ఈ మూడూ తప్ప మరేమీలేనట్టు. బయట కొన్ని పనులు చెయ్యకూడదన్నాను. కాని అసలు చెయ్యరని నేను అనలేదు కదయ్యా! ఏమీ చెయ్యకూడదన్నాను. కాని అసలు చెయ్యరని నేను అనలేదు కదయ్యా! ఏమీ చెయ్యకపోతే ఎలా బ్రతుకుతారు? వారి వారి అవసరాలకు దేశం, కాలం ఆలోచించుకుని తగిన ఏర్పాట్లు చేసుకుంటారు. వాళ్ళూ పొద్దునే లేస్తారు. అవశిష్టాలు తీర్చుకుంటారు. భోజనాలు చేస్తారు. ఇళ్ళలోనే ఉంటారు అనే మాట. పూర్తి కాకుండానే,

'అయితే పెళ్ళిళ్ళు అవీ' ఒకతను సందించేడు.

ఆ! పెళ్ళిళ్ళు చేసుకుంటారు. తరువాత వన్నీ జరిగి, పిల్లల్ని కంటారు అన్నాను. దాంతో కొందరాప్రశ్నలు మానివేయగా, ఒకాయన,

బాబూ ఏదో వెర్రి మొర్రిగా మాకు తెలియక అడుగుతున్నాం. అక్కడ పద్ధతులూ అవీ ఎలా ఉంటాయే జీవితమెలా సాగుతుందో వాళ్ళ సాంసారిక పద్ధతులెలా ఉంటాయో కాస్త మీరు విస్తరించి చెబితే వినవలెననే కుతూహలంగా ఉన్నది అన్నాడు.

"అలాగే చెప్పడానికి నాకేమీ అభ్యంతరంలేదు. ఆ కధంతా ఇప్పుడు ప్రారంభిస్తే కొండవీటి చేంతాడులాగా ఎంతో పొడుగై సాయంత్రందాకా పడుతుంది. మనం భోజనాలూ బొట్లూ మానుకుని, ఓపిగ్గా కూర్చుందా మంటే చెప్పడానికేమీ అభ్యంతరం లేదన్నాను. దాంతో అందరికీ ఉత్సాహం సగం చచ్చింది. అయినా ఊరుకోకుండా ఒక ఆసామీ,

"బాబయ్యా అక్కడ అందరూ తెల్లగానే ఉంటారండీ లేక మన లాగ కూడా వుంటారా?" అన్నాడు.

నాబోటిగాళ్ళు మనవాళ్ళెవళ్ళయినా అక్కడికి వెళ్ళినవాళ్ళు తప్ప తక్కిన వాళ్ళంతా తెల్లగానే వుంటారు.

"అయితే పిల్లలు కూడా తెల్లగానే ఉంటారాండీ" అన్నాడు.

"ఓయి వెర్రివాడా తెల్లవాళ్ళకు తెల్లపిల్లలు పుట్టకపోతే నల్లవాళ్ళు యెలా పుడతారయ్యా! అలాగే ఎక్కడో నూటికో కోటికో పుట్టివుంటే అక్కడేదో తిరకాసు జరిగిందన్నమాటే" అన్నాను. అక్కడున్న వాళ్ళంతా గొల్లున నవ్వారు. ఆ ప్రశ్న అడిగిన ఆసామి నా సమాధానంలో వున్న అంతరార్థం గ్రహించలేకపోయాడు పాపం. అంతరూ లేవబోతున్నారు. ఒక తను చటుక్కున,

"బాబయ్యా మరి బోజనం మాటేటండి. అక్కడందరూ భోంచే త్తారాండీ" అన్నాడు.

అన్నం కాదుకాని అంటుండగా,

"పోనిద్దు ఒరే! ఏదోగడ్డి తింటారు మనకెందుకూ, ఏగడ్డీ తిన కపోతే ఇక్కడికొచ్చి మన నెత్తిన ఎందుకు కూర్చుంటారూ? తిండి ఉంటే అసలు ఇక్కడికె ఎందుకొస్తాడూ. ఇంగ్లీషోడు వచ్చినా, అరవోడు వచ్చినా, ఎలకలాడు వచ్చినా, ఘూనాదోడొచ్చినా, తిండిలేకనే గదట్రా ఎర్రి మొగమా ఎందుకో మన పార్వతీశంబాబు అంతదూరం వెళ్ళాడుగానీ మనోళ్ళు ఎంతోమంది అలా వెడతారు" అన్నాడు కాబోయే కరణం.

చెబుతాలెండి సావకాశంగా! అన్నీ చెబుతాను. మీ పనులు మాను

కోవడ్డు పాయుంత్రోమ్మైన తరువాత మా అరుగుమీదనో, రాజుగారి అరుగు మీదనో, లేకపోతే ఏ పొలంలోనో కూచుందాం రోజూ ఒకగంటో, రెండు గంటలో కూచుని కులాసాగా కబుర్లు చెప్పుకుందాం. బోలెడన్ని సంగతులు చెబుతాను. నేను - అని లేచాను. వాళ్ళందరూ ఎంతచో సంతోషించి,

చిత్తం. చిత్తం మా బాగా అన్నారు. ఆ పద్ధతి చాలా బావుం టుంది. మనకు చక్కని కాలక్షేపం అవుతుంది అన్నాడు. రాజుగారు. అందరూ శలవుతీసికొని ఎవరి పనుల మీద వారు నాకు వినబడేటట్లు నన్ను మెచ్చుకుంటూ స్తోత్రం చేస్తూ చక్కా పోయారు.

మరునాడు బోలెడంత హంగామా. తెల్లవారి లేచేసరికి నా దంతధా వనాదికం ముగించుకుని స్నానం చేదామనుకుంటుండగా మా పురోహితుడు చక్కా వచ్చాడు. ఆయన్ను చూడగానే ఈ వేళ జరుగవలసిన ప్రాయశ్చి త్తకాండ జ్ఞప్తికి వచ్చింది. ఆయన లోపలకి వస్తూ, "బాబూ పార్వతీశం అవశిష్టాలయినాయూ?" అన్నారు.

"చాలావరకయినాయండి. స్నానం చేసి ఫలహార మేదైనా" అంటూం డగానే నా వాక్యము పూర్తి కాకుండానే,

"ఆగు నాయనా, ఒక్క మాటాగు. ఈ వేళ మట్టుకు, ప్రస్తు తానికి స్నానంతో నీ కార్యక్రమం కట్టిపెట్టి, కడుపు సంగతి మర్చిపో. తరువాత నేచెప్పినట్టు యథావిధిగా చేస్తేనే తప్ప, మీ నాన్న నిన్నూ కూడా బ్రతకనివ్వడు. ఇప్పటికే కొంత ఘర్షణపడి నేను నీతరపున మాట్లాడి, నీకు కొంత శ్రమ తగ్గించవలెనని ప్రయత్నించినందుకు, నానెత్తినదోసెడు అక్షింతలు పోశాడు మీ నాన్న" నా కవి చాలు. ఈ వేళకు ఇంకనే మైనా హెచ్చుతగ్గులు వస్తే అవన్నీ నీనెత్తిన పడతాయి. నేను చెప్పలేదు అనుకునేవు గనుక" అన్నారాయన.

అయితే హాడ్సున్నే. పరగడుపునే ఇన్ని అక్షింతలు మీ నెత్తినెందుకు పోశాడు మా నాన్న అన్నాను.

"ఆ ఏ రేంలేదు. ఆయనకవన్నీ యథాశాస్త్రీయంగా జరగాలి. అందు చేత మంచిది నాకు కాదు. సీమప్రకు కల్యాణము చేయించమన్నారు. అది ఇప్పుడవసరం లేదనీ ఈ కాలం కుర్రవాళ్ళకు అందులోనూ విదే శీయానం చేసివచ్చిన నీబోంట్లకు అసలేకుదరదనీ, అదిచేయించకపోయినా తరువాయి కాండకు ప్రత్యవాయము ఏమీ లేదనీ నచ్చ చెప్పాను. అందుకని తల చిల్లులు పడేటట్లు ఇన్ని అక్షింతలు నా బట్టతలను పడ్డాయి. ఏం

చెయ్యను. చేసుకున్న తరువాత అనుభవించక తప్పుతుందా! అలా అను కొనే ఇంట్లో ఇంటి ఆవిడతోటే, బయట మీ నాన్నలాంటి వాళ్ళతోటీ, కాలక్షేపం చేసుకువస్తున్నాను" అన్నాడాయన.

"అయితే నాకో గండం తప్పించారన్నమాట. మరి నాదో ప్రార్ధన. తరువాత జరగవలసిన ప్రాయశ్చిత్తకాండ సాధ్యమైనంత త్వరలో ముగించి, నా బ్రాహ్మణ్యము నాకు మళ్ళీ ప్రసాదిస్తే చాలా సంతోషిస్తాను అన్నాను. దానికాయన అదేదో మూడు రోజులు జరుగవలసినది ఒకటున్నది. ఇందులో నుంచి నిన్నెలాగో సూక్ష్మంగా పైకి లాగుతాను. కాని, ఆ అయి దురోజులకూ త్వరలో సిద్ధపడమని నా హెచ్చరిక. ఎటొచ్చి ఇందులో కూడా ఒక చిన్న తిరకాసుంది, నీవా దేశాల్లో ఏ తిళ్ళు తిన్నావో దానికి కొంచెం నాలుకమీద చురకయున్నూ పడుతుంది. అది కాదనడానికి వీలు లేదు" అన్నాడు.

నిజమే సుమండి వీలెలా ఉంటుంది. మీరు నా నాలిక కాల్చిన తరువాతే అన్నాను.

అది కాదయ్యా. హడలి పోక అలా ఆగు ముందు జరుగవలసింది బోలెడంత ఉండనే వుంది. మనవాళ్ళు ప్రతిదానికీ యథాశక్తిఅనీ. లఘు ప్రక్రియలనీ బోలెడన్ని సదుపాయాలు నీలాటి వాళ్ళకోసం చేసే ఉంచారు. మాటకు ముందు ఇది పనికిరాదు, అది పనికిరాదని నీలాంటివాళ్ళు మమ్మర్ని వేధించుకు తినడమేకాని త్రిరాత్ర వ్యవహారాస కొచ్చేటప్పటికి ఒక్కడూ మాట్లాడితే వట్టు. వీలైతే మళ్ళీ అది కూడా పంచరాత్రం చేయమంటారుకూడాను" అన్నారు.

"నేను అననులెండి అలాగ. ఎలాగైనా త్రిరాత్రమైనా, పంచరాత్ర మైనా అంతటితోటి విరమించే వెర్రివాళ్ళు ఎవ్వరూ ఉండరులెండి" అన్నాను. ఆయన సంతోషం పట్టలేక ఏవేవో జ్ఞాపకాలు వచ్చి వచ్చేనవ్వునాపుకుంటూ.

చాల్లే నెర్చావు కబుర్లు అంతదూరం, ఎళ్ళినందుకు మంచి పాండి త్యమే సంపాదించావు. లే త్వరగా స్నానం చెయ్యి మీనాన్న వస్తే మనని బ్రతకనివ్వడు. లే - అన్నారు.

అంటూ ఆయన లోపలికి చక్కాపోయాడు. అలా ఆయన్ని నేనూ, నన్ను ఆయనా చిన్నప్పటి నుంచీ ఎంతో సన్నిహితంగా ఎరుగుదుము. కనుక ఆయనెప్పుడూ ఇలా కులాసాగా, చమత్కారంగా మాట్లాడతాడని, ఏదో మాటలు అందించి ఆయన్ను రెచ్చగొట్టడమ్మూ, ఆయనచేత వాగించడమూ

నాకు బాగా అలవాటు. ఆ కబుర్లు వినడం ఎంతో సంతోషంకూడాను.

నేను స్నానం చేసి వచ్చేటప్పటికి ప్రాయశ్చిత్త కాండకు అన్నీ అమర్చారు మా వశిస్టులు. మా నాన్న యెప్పుడు తెప్పించి ఉంచాడో నా కోసం, ఒక పట్టు తాపితా అక్కడపెట్టి ఉంది. అని నన్ను కట్టుకోమన్నారు ఈ మధ్యన అలవాటు తప్పిపోయినా, ఆ పట్టుపంచె జారిపోతున్నా, జాగ్రత్తగా కట్టుకున్నాను. ఇంతలో మానాన్న ఊళ్ళోవున్న బ్రాహ్మణ్యం పెద్దవారిని పది మందిని వెంటపెట్టుకుని వచ్చారు. వారి వెనుకనే కొందరు క్షత్రియ ప్రముఖులు కూడా వచ్చారు. మంత్రతంత్రములతో వేదఘోషతో ప్రాయశ్చిత్తం సుమారు జాము తరువాతను ఎలాగో పూర్తి అయినది. యింకొక అరగంటలో అందరినీ భోజనముసకు దయ చేయమన్నారు. అక్కడకు వచ్చిన పెద్దలేకాక వూరిలో బ్రాహ్మణులూ మరికొందరు కూడా పంక్తి భోజనానికి దయచేశారు. నన్ను కూడా వారి సహపక్తిని కూర్చోమన్నారు. భోజనములయినాయి. దక్షిణ తాంబూలాదులు అందివ్వడమైనది. అందరూ వారి వారి ఇళ్ళకు వెళ్ళారు. కాని ఆ సాయంకాలానికే వూరిలో కొంత అలజడి బయలుదేరింది. ఈ ప్రాయశ్చిత్తము చాలదనీ, ఇది సశాస్త్రీయము కాదనీ, అసలు తెలిసి చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తమేమిటనీ, గ్రామంలో కొందరు తర్జనభర్జనలు ప్రారంభించారు అని విన్నాను. ఇందులో దేనికీ అధికారయినవాడు ఒక్కడూ లేడు. అయినా మానవ స్వభావం మారదుకదా? సరే ఏం జరుగుతుందో చూద్దామని మే మూరుకున్నాము. నాలుగురోజులు అయిన తర్వాతన మమ్మల్నిమలనూ, మాయింటికి వచ్చి భోజనం చేసినవారినీ బహిష్కరిస్తున్నామని ఆనోటా, ఆనోటా మాకు వర్తమానం అందజేశారు. మా నాన్నకు విపరీతమయిన కోపం వచ్చింది. ఎందరో పెద్దలనూ, పండితులనూ, అధికారులైన వారినీ సంప్రదించే ఈ ఏర్పాటు చేశారు. నాకే సలహాయిచ్చిన పండితులు మా యింటికి వచ్చి స్వయంగా ఈ కర్మకాండ జరిపికూడా, ఏదో సాకు చెప్పి మాయింట విందారగించకుండా వెళ్ళి ఇది సశాస్త్రీయముగా జరుగలేదనీ అందుచేతనే తమరు భోజనం చేయకుండా వచ్చామనీ, కొందరి దగ్గిర చెప్పి వారిచేతను కొంత దుష్ప్రచారము చేయించినట్లు మాకు తెలిసింది. మానాన్న పరమశాంతులే కాని పట్టుదల వస్తేమట్టుకు దాని అంతు తేలే వరకూ విడిచిపెట్టే స్వభావంకాదు ఆయనది. ఈ పట్టుదలలు నానాటికి ఎక్కువయినాయి. తరువాత ఒక రోజున మాయింట్లోవచ్చిన పితృకార్యమునకు మామూలుగా వచ్చే భోక్తలు రామన్నారు. పోనీ అని పొరుగూరునుంచి ఎవరినో తెచ్చుకుని ఆ కార్యము

ముగించుకున్నాడు మా నాన్న. దానితో గ్రామంలో ఉన్న బ్రాహ్మణ్యం రెండు పార్టీలుగా చీలిపోయారు. ఈ పట్టుదల చుట్టుపట్ల గ్రామాలకు కూడా పాకింది. మావూరు బ్రాహ్మణులను ఎవ్వరినీ పొరుగూరువారు సంభావనక్కూడా పిలవడం మానుకున్నారు. దానితో మా విరోధివర్గమువారు చాలా ఇరుకునపడి రోజులు దొర్లించుకోడం కష్టమై తుదకు కాళ్ళబేరానికి వచ్చి, మా నాన్నగారిని క్షమాపణవేడి, రాజీపడ్డారు. నిర్హేతుకంగా ఇంత గ్రంధం సాగించారు మావూరు గ్రంధసాంగులు.

ఈ ప్రాయశ్చిత్తము ముగిసినతరువాత నేనూ రెండుమూడురోజులు యధేచ్ఛగా యింట్లో తిరుగుతూ వేళపట్టున మానాన్న పంక్తిని భోంచేస్తూ, మధ్యాహ్నం అంతా ఏదో గ్రంథకాలక్షేపం చేస్తూ, కూర్చునేవాడిని. సాయంత్రం మట్టుకు ఒకమాటు వూళ్ళోకి పొలానికి వెళ్ళి వస్తూండేవాడిని. ఉదయం సాయంకాలం ఎవరో ఒకరు ఒకరంటే ఒకరుకాదు. ఓ పది మందికి తక్కువ కాకుండా వచ్చి కూర్చుని, "బాబయ్యా! అక్కడి సంగతులేమన్నా చెప్పండి" అనేవారు. రోజూ ఏంచెప్పను నామొహం చెప్పడాని కేమీలేదు దయచెయ్యండి, అని వాళ్ళకు ఉత్సాహభంగము చేయడము యిష్టముండేదికాదు నాకు. అందుకని, "ఏం చెప్పమంటావయ్యా! పోనీ మీరేమైనా అడుగుతే దానికి సమాధానం చెప్పే ప్రయత్నం చేస్తాను." అన్నాను.

వెంటనే "అయితేనండి అక్కడ మీకు భోజనం ఎలాగండీ? అక్కడేమన్నా మన వాటేళ్ళున్నాయా? లేకపోతే, మీరే వండుకునేవారా? ఏం జేసేవారండీ" అన్నాడు ఒకతను.

"మన వాటేళ్ళూలేవు నేను వంటా చేసుకోలేదు, ఒక వంటావిడను మట్టుకు సంపాదించాను" అన్నాను.

"ఏటేటేటే? మనోరేనండి! బేమ్మర్లేనటండి" అన్నాడు. "కాదు బాబూ! అంత అదృష్టమా నాయనా! మనోరూ కాదు, భేమ్మర్లూకాదు".

ఇదిగో చూడూ! ఎవ్వరితోటీ చెప్పకు, ఓ దొరసానమ్మనే సంపాదించాను అన్నాను.

"అయ్యబాబోయ్! బాబూ, బలేవోరండీ! అవునులెండి మీరుమట్టుకు దొరలా లేరా? అంచేతా బాబూ నిజంగా దొరసానమ్మే నేటండి? భలే పని చేశారండి. మన వూళ్ళో పెద్ద పెద్ద కలకటేర్లకే దొరకదు గందా! మరిట్టే పట్టేశారన్నమాట. బలే, బలే! మా దొడ్డమాట చెప్పారండీ"

అంటూ కొంతసేపు వాడిలోవాడు నవ్వుకుంటూంటే పక్కవాళ్ళుకూడా నవ్వుతూ, "నిజంగా నిజమేనటండీ" అన్నాడు ఒక కుర్రవాడు.

"నిజంగా సత్యప్రమాణంగా నిజమే. దొరసానే దొరికింది. అదీ ఎక్కువ కష్టపడకుండా, ఖర్చు లేకుండానే దొరికింది. నేనున్నన్నాళ్ళూ అక్కడ హాయిగా వేళకు ఇంత ఉడకేసి పడేసేది. ఇక్కడి కొచ్చేటప్పుడు నాతోటి వస్తానంది కూడాను. తీసుకు వద్దామనే అనుకున్నాను. మీకందరకూ చూపించడానికి. తీరా తీసుకువస్తే మీరంతా మీ పనులు మానుకుని, మా పనులు చేసుకోనివ్వకుండా ఆవిడనే చూస్తూ కూర్చుంటారని భయంవేసి, తీసుకురాలేదు" అన్నాను.

"అయ్యో! అయ్యో! ఎంతపని చేశారండి. మా మంచి ఛాన్సు పోగొట్టారు బాబూ" అని వాళ్ళు వాపోయారు.

"ఒక్కమాటు మేముకూడా ఆయమ్మను చూసి సంతోషించేవాళ్ళంగందా" అన్నాడు ఎంతో ఆశాభంగమైనట్టు. మళ్ళీ ఇంకొకడందుకుని "అయితే మీరున్నన్నాళ్ళూ ఆ ఒక్క మనిషేనాండి లేకపోతే" అతని వాక్యం పూర్తికాకుండానే,

"నా ప్రాణానికి ఒకత్తిచాలదా" అన్నాను.

"చాల్లెద్దురూ మంచి వయస్సులో దొరలా ఉన్నారు. మీకేమండి" అన్నాడు.

"నాకూ ఏంలేదు, నీకూ ఏంలేదుకాని" అని అంటూంటే ఇంకొకతను అందుకుని,

"అయితే ఆవిడికి మన వంట వచ్చునాండీ" అని బాణుస్ ప్రశ్న వేశాడు.

"వాళ్ళూ మన అన్నమే తింటారండీ?"

అని ఇంకొకడు అడిగాడు.

"తినరు బాబూ తినరు. మన అన్నం వాళ్ళకు ఎలా దొరుకుతుంది, మన అన్నం, మన పప్పు, మన కూరలూ వచ్చినా ఎన్ని జన్మలెత్తినా ఇక్కడ పుడితే తప్ప దొరకవు. అందుకని నేను కొంత శ్రమపడి కొత్త వాళ్ళకైతే అన్నీ చెప్పినట్లుగానే, ఆవిడకు నేనూ అన్నీ విప్పగా చెప్పాను."

"[illegible]" [illegible] ఒకడు.

"వాళ్ళకు కావలసింది అంతే. అదేదో నేర్చుకున్నంత నేర్చుకుని, చేసి పెడుతూండేది. మనవాళ్ళందరకూ అదే పద్ధతి. మేము అద్దెకి ఉన్న యింటి వారే ఈ సహాయం చేస్తుండటం అలవాటు. మా యింటి యజమానుధారికి ఇద్దరు పిల్లలు కూడాను" అన్నాను. దానితో వాళ్ళ ఉత్సాహం తగ్గింది.

"అయితే మన భోజనానికీ, వారి భోజనానికీ తేడా ఏమిటండీ" అని ఒక కుర్రవాడడిగాడు.

"మొదటి సంగతి నాబోంట్లు శాకాహారులు కదా! వాళ్ళందరూ ఆబాల గోపాలం మాంసాహారులే" అన్నాను.

"అయితే ఆ చేత్తోటి చేసేదానిండీ మీకు" అన్నాడొకతను.

"ఆ చేత్తోటి చెయ్యక దానికోసం వేరే చెయ్యొకటి సంపాదించి వొంకిని తగిలించి, అవసరమొచ్చినప్పుడు చెయ్యి ఉపయోగిస్తుందనుకున్నావా!" అన్నాను. అందరూ నవ్వేరు, ఆ కుర్రవాడు కొంచెం చిన్న బుచ్చుకున్నాడు.

"అయితే పొద్దున్నే లేచి మనకుమల్లే స్నానం గట్రా చేస్తారాండీ" అన్నాడు ఇంకొకతను..

"ప్రతివాళ్ళూ చేస్తారని చెప్పడం కష్టం. అది చలిదేశంకదా! బయట చెరువుల్లోనూ, కాలవల్లోనూ ఎవ్వరూ స్నానం చెయ్యరు. చెయ్యలేరు కూడాను. అందుచేత యింట్లో వున్న కుళాయిలతోటో, వేడినీళ్ళతోటో స్నానం చెయ్యాలి. అది సామాన్య లందరకూ సాధ్యపడే విషయంకాదు. పెద్దపెద్ద ఇళ్ళల్లో వుండేవాళ్ళకు తప్ప తక్కిన వాళ్ళకిది సులభ సాధ్యం కాదు" అన్నాను.

మరయితే తమరోండి అన్నాడు ఇంకొకడు.

'నేనెలాగో దానికోసం వేరే వార్త్రి కట్టి స్నానం చేస్తుంటే చూసేవాడిని మానకుండా.' ఇలాగే ఏవేవో వెర్రిమొర్రి ప్రశ్నలు అడుగుతూ, నన్ను వేధిస్తూండేవారు. తెల్లారి లేచింది మొదలురాత్రి పడుకునేవరకూ, మనము చేసే ప్రతి పనిగురించీ వాళ్ళకన్నీ సందేహాలే.

'అక్కడ కూర్చోడానికి చాపలుంటాయా అండీ' అన్నాడు [illegible]

'తాటాకు చాపలా? తుంగ చాపలా? [illegible]' మరొకడు.

అక్కడ తాటిచెట్లూ, ఈతచెట్లూ, కొబ్బరిచెట్లూ వుంటాయా అని ఒకడి సందేహం.

నేను మంచంమీద పడుకున్నానా కింద పడుకున్నానా అని ఒక డడిగేడు.

'లేదు మంచంపైన పరుపుమీద పడుకునేవాడి'నన్నాను.

అయితే అక్కడా మంచాలూ, పరుపులూ గట్రా ఉంటాయన్న మాటండి అన్నాడు.

కంబళ్ళే కప్పుకోవాలాండీ! అని ఒక ఆసామీ ఆశ్చర్యపడ్డాడు.

ఒకటికాదు. మూడు నాలుగు జోడించి కప్పుకుంటేనే గాని, శీతా కాలంలో ఒకప్పుడు ఇన్నీ కప్పుకున్నాకాని చలి ఆగేదికాదు అన్నాను.

'అంత చలి వుంటుందాండి' అన్నాడు మరొకతను.

'అంతా ఇంతా చలికాదు. మనమూహించలేనంత చలి. శీతాకాలంలో ఒక్కొక్కప్పుడు మంచు కురుస్తుంది. అంటే మనకు మంచుపడ్డట్టు నీటి బిందువులుగాకాదు. ఆకాశం మీదనుంచి ఎవరో దూదిపింజలు తెల్లనివి, కిందికి దిమ్మరించినట్టుగా పడుతుంది. అది నేలమీద పడీపడ్డంతో కరిగి పోతుంది. కాని ఒక్కొక్కప్పుడు నేలమీద కొన్ని అడుగుల మందంలో నిలిచి పోయి, ఒకరకమైన శీతలవాయువు వీచి ఇదంతా ఘనీభవిస్తుంది. అంటే రాయిలా గడ్డకట్టిపోతుంది. అటువంటప్పుడు ఏరులూ, నదులూ కూడా గడ్డకట్టి పోవడం కద్దు. మేమున్న ప్రదేశం కంటే ఇంకా పైకి వెడితే అక్కడ ఇంకా శీతలం. ఆరునెల్లు చీకటి ఆనెరుల్లు వెలుతురూను. అన్నాను.'

'బాబోయ్ ఆరు నెలలు చీకట్లో లేవకుండా అవశిష్టాలు తీర్చకో కుండా తిండీ, తిప్పలు లేకుండా, ఆ చీకట్లో ఎలా బ్రతుకుతారండీ' అన్నాడు.

'తిండీ తిప్పలు లేకేం ఖర్మ చీకటిగా ఉన్నంత మాత్రాన్ని ఎవరూ ఏపనీ మానుకోరు. మనం మానుకున్నామా! ప్రతినిత్యం జరిగేవన్నీ విధాయకంగా జరిగి తీరుతాయి. నయం చీకట్లో సంసారాలు చేస్తారా అన్నావు కాదు' అన్నాను.

ఒకతను నిర్ఘాంతపోయి

'అక్కడ అడంగులు కూడా ఇంతచలిలోనూ ఉంటారాండీ' అన్నాడు

'మొగంగులున్నచోట, ఆడంగులు మట్టుకు లేకపోతే ఎలాగ' అన్నాను.

'అబ్బా అక్కడాడోరూ, పెళ్ళిళ్ళూ, సంసారాలూ, అన్నీ ఉంటా యన్నమాట' అన్నాడు గుండె బాదుకుని.

'చాల్లే యెదవ తెలివితేటలూ, నువ్వూను. ఏసేవ్ పెశన ఎలా గైతే నేం. ఆడోళ్ళూ ఆళ్ళకి పెళ్ళిళ్ళూ ఆళ్ళకి పిల్లలూ, లేకపోతే, ఈ దొరలందరూ ఎక్కడనుంచి వచ్చారనుకున్నావ్ యెదవ. మనం కావి కంటున్నామేంటి ఈళ్ళని. అలాటోరుని అడిగేటప్పుడు కొంత ముందూ, యెనుకా ఆలోచించి అడగాలి' అన్నాడు ఘరొకడు. నా బదులు తను సమాధానం చెబుతూ.

మొదటి ప్రశ్న అడిగినవాడు ఈ దెబ్బకు ఖిన్నుడై తలవంచుకుని కూర్చున్నాడు. ఇంకొక ముసలతను ఇంత సేపటినుంచీ మవునంగా కూర్చున్న వాడు నాకేసి చూసి చేతులు జోడించి.

'బాబయ్యా ఒక్క సందేహం తమరినడగాలనుంది. ఇది అడక్కూడని ప్రశ్నేనండి. అందుకనే భయపడుతున్ననాను. తమరిని చూచి కాకపో యినా. ఈ కుర్రనాగన్నలంతా ఏమన్నా అంటారనీ నవ్వుతారనీ భయంగా ఉందండీ' అన్నాడు.

'పెద్దవాడవు. నిన్ను నే పుట్టినప్పటినుంచీ ఎరుగుదును. నీకంటే తెలివైన వాళ్ళా వీళ్ళందరూను. మనలో మనం కులాసాగా కబుర్లు చెప్పు కుంటూన్నప్పుడు ఈభయమూ సందేహమూ ఎందుకోయ్ కానీ, అన్నాను.'



అలా చేతులు జోడించుకునే, రహస్యం చెబుతున్నట్టు కొంచెం గొంతు తగ్గించి.

'అక్కడ ఆడోరు మనోళ్ళకి మల్లే'

ఏమి అడుగుతాడాని నేను హడలిపోతుంటే, మనోళ్ళ మల్లే నెల నెలకీ బయటుంటారాండే, అన్నాడు. అందరూ గొల్లుమన్నారు. అతను కొంచెం చిన్నబుచ్చుకున్నాడు.

'పెద్దయ్యా, పెద్దవాడవు అడగవలసిన ప్రశ్న అడిగేవు. మనలో మాట వాళ్ళేగాదు ఏదేశంలో పుట్టిన ఆడదైనా వయస్సు వచ్చిన తరువాత ఈ ధర్మం తప్పదు' అన్నాను.

వెంటనే ఊరుకోక,

'అంతచలిలో బయట ఏలా ఉంటారండీ' అని మళ్ళీ అడిగాడు.

'చెప్పడం మరచిపోయాను. వాళ్ళు బయటున్నా లోపలే ఉంటారు. అనగా మనకుమల్లే దూరంగా కూర్చోరు మామూలుగా ఇంట్లోనేఉంటారు, అన్నాను.

అయితే ఆ మూడురోజులూ వంటా వగైరా అన్ని పనులు చేస్తా రాండీ. అన్నాడు.'

వంట చేస్తారన్న సంగతి నాకుతెలుసు. తరువాయి పనులు చేస్తారో చెయ్యరో నాకు తెలియదు. నువ్వు ఆడగనూ కూడదూ అన్నాను.

'పోన్లెండి అడగను కానండి మీ మడిసికూడా మీకు వంటచేస్తే మీరు తినే వారా బాబయ్యా' అన్నాడు.

ఆరోజులన్న సంగతి ఎప్పుడూ చెప్పలేదు నాతో ఆవిడ. చెపితే ఏం జరిగేదో కాని. ఇంక నువ్వు ఇలాంటి ప్రశ్నలు వేస్తే ఇంట్లోక వినపడితే మా అమ్మ ఈ క్షణంలోనే బయటికి వెళ్ళగొడుతుంది. ఇలాటి దోషాలన్నీ పోగొట్టుకోడానికే మొన్న మా వాళ్ళు ప్రాయశ్చిత్తం చేయించారు. ఇవి తెలిస్తే మా వాళ్ళు మరికొన్ని ఊహించుకుని, ఇంకా ప్రాయశ్చిత్తం చేసినా లాభంలేదని నన్ను ఇంట్లోంచే కాకుండా దేశంనుంచి తగిలేస్తారు అన్నాను.

అందరూ ఒక్కమాటుగా గొల్లుమన్నారు. ఇంకొక తెలివైన కుర్ర వాడు వ్యాకరించి ధైర్యంచేసి.

'అమ్మాయిక్కడ ఏం చేసినా అని అన్నీ ఇక్కడ తెలిసినా, మీ వారు

వెళ్ళ గొడతామంటే మేము ఒప్పుకోములెండి అపూచీ మాది' అని హామీ ఇవ్వడంతో

ఒకమాటు గుండెలమీద చేయి వేసుకుని.

'థాంక్యూ, ఆమాత్రం అభయం ఇచ్చావు అంతేచాలు అన్నాను.

వాళ్ళందరూ నవ్వుకుంటూ లేచినిలబడి నమస్కరించి నా దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

వాళ్ళందరూ పూర్తిగా వెళ్ళకుండానే ఒక పదిమంది యువకులు కొందరు నాతో చదువుకున్న వాళ్ళు నర్సాపురంనుంచి వచ్చి ''నమస్కారం పార్వతీశంగారూ అంటూ జయ్ రమారమణ గోవిందో హరి అన్నంత హడావిడిగా వచ్చారు.

ఏమిటోయ్ ఈ హడావుడి? అంతా కులాసాగా వున్నారా మూడేళ్ళ నుంచి ఇందులో ఏ ఒక్క మొహం కనబడలేదు. ఏమయిపోయారు ఏదో పాడు పనిచేసి ఉన్నా మూడేళ్ళు మొహం చాటేసుకోడమెందుకు అన్నాను నవ్వుతూ.

వాళ్ళు ఫకాలున నవ్వి.

మన పార్వతీశం మొత్తం మీద అక్కడికి వెళ్ళినా మారని చిల్లి గవ్వలా మామూలుగానే వచ్చాడు అన్నాడు నా మిత్రుడొకడు.

వాళ్ళందరూ మళ్ళీ నవ్వేరు.

'ఏమిటీ? ఏదికాని వేళ ఇలా కొట్టుకొచ్చారు, పొద్దున్నవచ్చినవాడా, పొద్దెక్కి వచ్చిన మట్టాం వెంటనే పోరు అంటారు. మీరందరూ ఈ పూటి క్కడ తిన్నవేస్తానంటే నే నొప్పుకోను అబ్బాయ్ తరువాత మీ యిష్టం' అన్నాను.

పోనీలెండి దాని సంగతి తరువాత ఆలోచిద్దాం. ముందు మిమ్మల్ని చూస్తేనే మా కడుపునిండింది మీరు చెప్పిన సామెత అబద్ధమని రుజువు చెయడానికి వచ్చాము మీరు భోజనానికి వెళ్ళవలెనని లేవారు కాబోలు. మేము మరో ప్రయత్నం మీద వచ్చాము. మీకోచిన్న హెచ్చరిక చేసి వెడదామని వచ్చాము. మీరు దేశంలోకి దయచేశారన్న వార్త నాలుగు రోజుల క్రితమే నర్సాపురమంతా దావాగ్నిలా వ్యాపించింది. వార్త వినగానే కొన్నవు పెళ్ళివాళ్ళు గొప్ప, తలగుడ్డలు బిగించుకోడం నారిని పోయారు. [illegible]

విన్నాము. కాని అవి అధికారికంగా చెప్పలేకున్నాము. అవన్నీ అటుంచి ప్రస్తుతాంశం ఏమిటంటే, మన హైస్కూల్లో పాత, ప్రస్తుత విద్యార్థుల తరపున మీకు ఘన సన్మానం చేయ నిశ్చయమైనది ప్లీడర్లు కూడా బార్ అసోసియేషను తరపున ఆపని చేయబోతున్నారు. ఈశుభ వార్త మీకు అడ్వాన్సుగా చెప్పడానికే మేము ఒక్క పరుగున వచ్చాము. బహుశా సభ రేపే జరుగవచ్చు. లేదా ఎల్లుండి ఒకటి. ఆపలెల్లుండి ఒకటి జరిగి తీరతాయి. మన స్కూలు సభకు మిమ్మల్ని ఆహ్వానించడానికి కీర్తి శేషులైన కీర్తివంతులైన మన ప్రధానోపాధ్యాయులు స్వయంగా ఆదరా బాదరా రెండు మెతుకులు నోట్లో వేసుకుని గుండె దిటవు చేసుకొని రానున్నారని, ఇందువలన ఘనత వహించిన శ్రీ బారిష్టరు పార్వతీశం గారికి తెలుపడమైనది" అని నాతో చిన్నప్పటి నుంచి చదువుకుంటూ అనేక అవకతవకలలోనూ, అల్లర్లలోనూ నాకు సహాయభూతుడైన మిత్రుడు సాటింపు చేశాడు.

మా హెడ్ మాష్టరుగారు దయచేసిన కొలది సేపటికో లేకపోతే వారితోనో నర్సాపురం బార్ అసోసియేషను అధ్యక్షుడు కూడా దయ చేయనున్నారని వినయంగా మనవి చేసుకుంటున్నాడు అన్నాడు ముకుళిత హస్తాలతో మరో పూర్వాశ్రమవాసి.

'ఇక మేము వచ్చినపని సక్రమంగా నెరవేర్చుకున్నాము. మీ దర్శన భాగ్యానికి సంతోషిస్తున్నాము. ఇంతటితో మేము విరమిస్తున్నాము.'

అని పూర్వం మా మూర్తిత్రయంలో మూడవవాడూ, అధముడూ అయిన మరొక మిత్రుడు వందన సమర్పణ చేసి, నాకు మిలటరీవందనం చేసి వెనక్కి తిరిగాడు. అందరూ నవ్వారు.

చాలా సంతోషించాను. ఇక మీరెన్నడూ ఇటువంటి పిచ్చివేషాలు వెయ్యమని అగ్నిసాక్షిగా సూర్యచంద్రాదుల సాక్షిగా ప్రమాణంచేసి, నేను వచ్చేదాకా కూర్చోండి. లేకపోతే మీరు మళ్ళీరండి నాకు సన్మానంట, సన్మానం ఎందుకీ సన్మానం? మన హెడ్ మాష్టరుగారు రానీ చెబుతాను. అన్నాను.

"మేమూ వచ్చి చూస్తాంలే ఏమాత్రం చెబుతావో" అంటూ నవ్వు కుంటూ వాళ్ళదారిని వాళ్ళుపోయారు.

# 5

నేను లోపలికి వెళ్ళి, మా నాన్న ఇంకా దేవతార్చన ముగించలేదని తెలుసుకుని, కాస్సేపు వాకిట్లోనే విశ్రమించాను. ఈ సన్మానాలేమిటి? సభ లేమిటి? సందర్భములేమిటి? అనుకుంటూ, ఏ అనుభవమూ లేని నేను, ఏమి ఉపన్యాసము ఇవ్వనా, ఏమి మాట్లాడనా, అని అనుకుంటూ, అసలు దాని భావమేమిటో అనీ, నేనొక్కసారి విదేశీయానం చేసివచ్చినంత మాత్రాన నాకీ ఘనత ఎందుకు? నాకీ గౌరవమెందుకు అని, ఆలోచిస్తూ ఒక అరగంట కూర్చునేసరికి దేవతార్చనకు ముగింపుగా గంట లోపల నుంచి వినబడ్డది. ఇంకొక రెండు నిమిషాల్లో మా అమ్మ వచ్చి "లే నాయనా! కాళ్ళు కడుక్కో భోజనం చేదువుగాని, వచ్చిన వారిలో ఎవరైనా భోజనానికి ఉంటే, వారిని కూడా కాళ్ళు కడుక్కోమని నీళ్ళూ అవీ ఇయ్యి" అని లోపలకు వెళ్ళిపోయింది.

వచ్చే వారెవ్వరూ లేరమ్మా అందరూ వెళ్ళిపోయారు. పైవిస్తళ్ళు ఏమీ వేయవద్దు. అని నేను నూతి దగ్గరకు వెళ్ళి కాళ్ళు కడుక్కొని పట్టు వస్త్రము ధరించి బుద్ధిమంతుడిలాగ భోజనానికి తయారయ్యాను. ప్రతి పూటా, భోజనాలయ్యేవి. నేనువచ్చినప్పటినుంచి, అక్కడ నువ్వు యేమి చదివావు. ఏమి పాసయ్యావు. లేకపోతే అక్కడా తప్పావా? అక్కడ సంగతి సందర్భాలేమిటి నీ భోజనాదికములు ఎలాగడిచేవి? అక్కడ జీవిత విశేషాలేమిటి? విధానాలేమిటి? అని ఒక్కమాటూ నన్ను అడగలేదు.

ఆయన అడుగుతాడనీ నేనెన్నో చెబుదామనీ ఎంతో వుత్సాహపడే వాడిని ఒక్కమాటూ ఆ ప్రశంసే ఎత్తకపోయే సరికి నాకెంతో ఆశాభంగం కలిగినట్లయినది. ఎందుకో తెలియదు. ఆలోచిస్తే ఆయన అడక్కపోవడం సబబేననిపించింది, అక్కడ నే చేసినపనులన్నీ కాని. కొన్ని, కాని విని వుంటే ఆ అప్రాచ్యపు చర్యలను ఆయన మన్నించలేకపోయేవారు. అనుకుంటాను. వాటికి తగ్గ ప్రాయశ్చిత్తమే లేదనుకునేవారనుకుంటాను. అందుకనే ఏమీ తెలుసుకోకపోవడమే మంచిదని ఉభయతారకమని నిర్ణయించుకున్నారు కాబోలు, ఈ ఆలోచన కలగడంతో ఆయన మీదను ఎప్పుడూ ఉంటున్న గౌరవముకంటే ఇప్పుడు వెయ్యిరెట్లు ఎక్కువైనది. భోజనములు ముగించుకొని వాకిట్లోకి వచ్చాం. మానాన్న భగవద్గీత చేత పుచ్చుకొని అలవాటు ప్రకారం కొంతసేపు పారాయణం చేసి విశ్రాంతి తీసుకోడానికి ఆయన గదిలోనికి వెళ్ళిపోయారు. మా అమ్మ భోజనం తరువాత సవరణలు

చేసుకుంటుంటే, నేనూ ఒక పుస్తకం తీసి కొంత సేపు చదువుతుండగా నిద్రా జాడ్యము నిన్ను చేరెకదరా అన్నట్టు నిద్రాదేవి నన్ను వరించింది. ఒక గంటో, అరగంటో నిద్రపోయి వుంటాను. మా హెడ్మాష్టరుగారు వస్తారేమోనని ఉలిక్కిపడిలేచాను. వారింకా రాలేదని తెలుసుకుని ముఖ ప్రక్షాళన చేసుకుని. మళ్ళీ నా చదువులో పడ్డాను. మళ్ళీ కాసేపు గ్రంధ పఠనం సాగించాను. మా అమ్మ నాకు ఫలహారం ఏదో చేసితీసుకు వచ్చింది. అది నేను ముగించే లోపున నా ఫఫలహారం పళ్ళెం లోపల పెట్టేసి చేతులు కడుక్కుని ఇవతలికి వచ్చేసరికి వారు వచ్చి అక్కడున్న బల్ల మీద సుఖాసీనులయ్యారు, నేను వచ్చి నమస్కారంచేయగనే, వారూ నవ్వుతూ "ఏమోయ్ పార్వతీశం!" అంటూ లేవబోయారు.

ఆయనతోటి కూడావచ్చిన ముగ్గురు నలుగురు విద్యార్థులూ నిలబడే ఉన్నారు.

'మాష్టరుగారూ దయచేయండి మీరు లేవడమేమిటి? నేను మీ శిష్యుడినన్నమాట అప్పుడే మర్చిపోయారు. నేను ఎన్ని విదేశాలు తిరి గినా, ఎంత చదువు చదివినా, మీరు నాకు ప్రధమ గురువులనీ, మీ క్రమ శిక్షణా, కరశిక్షా, బెత్తం శిక్షతోటే, నేను పైకి వచ్చానన్న సంగతినే నెప్పుడూ విస్మరించనండీ' అంటూంటే.

ఆయన మళ్ళీ కూర్చుని.

'హారినీయిల్లు బంగారం గానూ! నువ్వు ఇవేవీ మరచి పోలేదన్న మాట. ఆఖరికి నాచేతి విసురూ, బెత్తం చురుకూ, ఇంకా నిన్ను వేధి స్తూనే ఉన్నాయన్నమాట. ఎంతపని జరిగింది. అయినా ఫరవాలేదులే. దండం దశగుణం భవేత్. అనే పెద్దల వాక్యం నీలో నిజమైంది. చాలా సంతోషం. తరువాత సభా ముఖాన్ని క్షమాపణ చెప్పుకుంటాను' అన్నారు నవ్వుతూ.

"అంతమాట మీరనడం ధర్మంకాదు మాష్టరుగారూ! అది నాకు శాపంగా పరిణమించవచ్చు. ఆపని మట్టుకు చేయకండి" అన్నాను.

వారు సంతోష పూర్వకంగా నన్ను దగ్గిరకు తీసుకుని నా వీపు తట్టి, పక్కనే కూర్చోబెట్టుకుని, ఒకమాటు రెండుచేతులతోటీ ఆలింగనం చేసుకున్నారు.

ఆయన శరీరం కొంచెం కంపించినట్లూ హృదయ స్పందన ఎక్కు వైనట్లూ, అనిపించింది నాకు. నాకూ ఒళ్ళు పులకరించింది. గురుదేవుల

ప్రేమ కూడా నాకు పితృవాత్సల్యం లాంటిదే అనుకున్నాను.

“అయితే విద్యాధికా, నీవు వచ్చావని మూడు రోజులై తెలిసినా అనుక్షణం నిన్ను చూడవలెననే ఆతృత పడుతున్నా, వీలైంది కాదోయ్. నిన్ను చూస్తే నాకెంత ఆనందంగా ఉందో ఎలా చెప్పను. ఆనాడు నీ పెద్దలతోనే చెప్పకుండా దేశాంతరం వెళ్ళావని విని అందరూ ఎంత బాధ పడ్డా, నేను మాత్రం చాలా సంతోషించాను. అంటే నీవు తప్పక పెద్ద చదువు చదివి, క్షేమంగా తిరిగివచ్చి, పెద్ద పేరు సంపాదించు కుంటావనే ధైర్యం అప్పటినుంచీ ఉండేది. నే ననుకున్నట్లుగానే విద్యలు పూర్తిచేసుకుని క్షేమంగా తిరిగి వచ్చినందుకు సంతోషిస్తూ, నీవు చాలా పేరు ప్రతిష్టలు సంపాదించుకుంటావని ఆశిస్తూ, ఆశీర్వదిస్తున్నాను.”

‘ఇక నే వచ్చిన పని చెప్పద్దుమరీ నీవు వచ్చావని తెలియగానే స్కూలు అందరికీ ఆబాలగోపాలం ఎనలేని ఆనందం పొందారు. స్కూలు స్కూలంతా మీ వూరు వచ్చి పడదామన్నంత ఉత్సాహం కలిగింది అంద రకూ నేనే వాళ్ళ ఉత్సాహాన్ని తాత్కాలికంగా చల్లపరచి దానిని క్రమబద్ధం చేయవలెనని సంకల్పించి మేమింత మందీ మీ యింటిమీద దాడిచెయ్యడం కంటె విద్యార్థులూ, ఉపాధ్యాయులూ అందరి తరఫునా నిన్ను అక్కడకు ఆహ్వానించి, గౌరవించి అక్కడ, అనగా ఆ దేశపు విశేషాలన్నీ నీ ముఖతా, నిండు సభలో వింటే బాగుంటుందనీ కొందరి ఉపాధ్యాయు లతో చెప్పగా, వారూ చాలా సంతోషించి నాతో ఏకీభవించి ఈ ఏర్పాటు చేశారు. అందుకని ఎల్లుండి సాయంకాలము మన హైస్కూలు ఆవరణలో సభ ఏర్పాటు చేశాము. నీవు పాత విద్యార్థిగా నేటి గౌరవ అతిధిగా వచ్చి నీ అనుభవాలను అన్నిటినీ, కొన్నిటినో చెప్పి మమ్ములనందరనూ ఆనందపరచవలెనని అందరి తరఫునా, నిన్ను శాసిస్తున్నాను. అని అనను కాని, తప్పక మరోమాట చెప్పక, వచ్చి మమ్ములను అందరనూ ఆనంద పరవశులను చేయవలెనని కోరుతున్నాను’అన్నారు.

అనగానే నేను లేచి నిలబడి నమస్కరిస్తూ అంత పెద్దమాటలు అనవద్దు మాష్టరుగారూ. నాకు సన్మానమూ, గౌరవమూ ఏమిటండీ? తలచుకుంటేనే నాకు భయంగా ఉంది. ఊరికే మీరు పెద్దలు పదిమంది కూర్చుని చిన్న గోష్ఠిలా ఏర్పాటుచేసి నన్నేదైనా ప్రశ్నలు వేస్తే, నేను చేతనైన సమాధానాలు చెపితే బాగుంటుంది. అనుకుంటాను. ఉపన్యా సాలు పెద్ద సభలలో చేయడం నాకింకా చేతకాలేదు. పైగా ఉపన్యాస మంటే విద్యార్థులంతా సరదాగా వచ్చినా రెండు నిమిషాలయ్యేటప్పటికి

విధిగా వాళ్ళందరకూ తలనొప్పి వచ్చి తీరుతుందని నా భయం. వాళ్ళకు ఊరికే నా ముఖం ఒకసారి చూపించి మనం గోష్ఠి జరుపుకోడం చాలా బావుంటుందని నా అభిప్రాయం అన్నాను.

'నీ అభిప్రాయం చాలా బాగానే ఉంది కాని అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాం గనుక ముందు ఈ సభ ముగించి, తరువాత ఉపాధ్యాయులతో ప్రత్యేకించి గోష్ఠి ఏర్పాటు చేస్తాను. అది కూడా చాలా మంచిపనే అందుచేతను ఎల్లుండి సాయంకాలం నాలుగుగంటలకు బండితీసుకుని మా విద్యార్థి నాయకుడో లేక ఉపాధ్యాయుడో వస్తారు. వారితో నీవు తప్పక రావాలి. ఇంక నే వస్తాను మరి' అని నేను నమస్కరించగా నా భుజాల మీద చెయ్యివేసి తనతో వీధిలోకి తీసుకవెళ్ళినాకు సెలవిచ్చి వారు బండెక్కి వెళ్ళిపోయారు.

# 6

ఈసభ ఏమిటి? సన్మానమేమిటి? నాకెందుకొచ్చింది భగవంతుడా అనుకుంటూ ఆలోచిస్తూకూర్చుండగా, మళ్ళీ వాకిట్లో బండిఆగిన చప్పుడు కావడం, నేను లేచి వీధిలోకి వెళ్ళి వారిని ఆహ్వానిద్దామని అనుకుంటూ ఉండగానే వారు లోపలికి రావడం జరిగింది. ఈసారి వచ్చినవారు ఇద్దరు ప్లీడర్లు. వారు ఫలానా అని తెలుసుకొన్నాను. నాకంటె బాగా పెద్దలు కావడం చేతను ఎక్కువ పరిచయం లేదు. వారు రావడంతోటే పరస్పరం అభినందనలు చేసుకుని కూర్చున్నాం. వారు వచ్చినపని వెంటనే విన్నవించారు.

"తమరాక విన్నాము. మన ప్రాంతాల్లో విదేశీయానం చేసిన వారిలో మీరే ప్రథములు. విదేశాలలో విద్యనేర్చి M.A బారెట్లా అయివచ్చిన వారిలో మీరే ప్రథములు అయి ఉండడం, మీరు మాకు అన్ని విధాలా సన్నిహితులు కావడం మాకు గర్వకారణం. ఆవలెల్లుండి మా నర్సాపురం బారు అసోసియేషన్ తరపున, మీ రాకసారి దయచేసి, మమ్ములను గౌరవించి, మీ విదేశానుభవాలు కొన్ని మాకు తెలుపవలెనని సభ ఏర్పాటు చేసుకుని మిమ్ములను స్వయంగా కోరడానికి వచ్చినాము. మా మునసబుగారు కూడా స్వయంగా మీ దర్శనానికి రావలెనుకున్నారు కాని వారి నంత శ్రమపడవలదనీ, మేము మీతో మనవిచేసి మిమ్ములను తప్పక తీసుకువస్తామనీ చెప్పి మేము వచ్చాము. నాటి సభకు వారే అధ్యక్షత

వహిస్తారు. తమరు తప్పక దయచేస్తారు కదా, ఆ సాయంకాలం మాలో ఎవరో ఒకరు బండి తీసుకుని వచ్చి మిమ్మల్ని తీసుకువెడతాం అన్నారు.

'అబ్బెబ్బే! మీకంత' అని నేనేదో అనబోతుంటే,

వారు లేచి నిలబడి నామాట పూర్తి కానివ్వక తమరు మరోమాట ఏమీ చెప్పక, మా ప్రార్ధన మన్నించాలి. తప్పదు సెలవు" అని గబగబ వెళ్ళిపోయారు.

ఈ రోజు సాయంకాలం నర్సాపురంలో ఈ యజ్ఞం ఒకటి తప్పదు కదా అని, మధ్యాహ్నం మూడు గంటలకేలేచి స్నానంగీనం చేసి మామూలుగా పంచ కట్టుకుని ఒక లాల్చీ వేసుకుని పైన కండువా కూడా వేసుకోడానికి అమర్చి సిద్ధం చేసుకున్నాను, మా స్కూలు నుంచి విద్యార్ధులో ఉపాధ్యాయులో వస్తారనుకుంటూ పావుతక్కువ నాలుగింటికల్లా నేను వారి రాకకు నిరీక్షిస్తూ తయారై కూర్చున్నాను. వారు సరిగ్గా నాలుగింటికి వస్తామన్నారు. గడియారం నాలుగు కొట్టింది. నాలుగున్నరకూడా దాటింది. నేనేమైనా పొరపాటు పడ్డానా, లేక వాళ్ళు తేదీ యేమైనా మార్చుకున్నారా, అని అనుకుంటూ అయినా బండి ఏదైనా వస్తోందేమో చూదామని వీధి గుమ్మంలోకి వచ్చేసరికి బండికూడా ఆ క్షణంలోనే గుమ్మం దగ్గిర ఆగింది. బండిలోనుంచి ఒకవిద్యార్థి, ఒక ఉపాధ్యాయుడూ దిగారు. మందహాసము చేస్తూ నాకు నమస్కరిస్తూ,

'మన్నించాలి పార్వతీశంగారూ, చాలా ఆలస్యమైంది తమరు అక్కడకు దయచేసిన తరువాతను ఆలశ్యమూ కాకూడదని ఎంత తొందరపడ్డా, సర్దుబాట్లన్నీ అయ్యేసరికి ఈవేళ అయింది. ఇంకను తమురు డ్రస్ వేసుకుంటే వెంటనే వెళ్ళిపోదాం' అన్నాడు వచ్చిన ఉపాధ్యాయుడు.

'నా ఆలస్యం ఏమీలేదు. సుమారు మూడుగంటల నుంచి మీ రాక కెదురు చూస్తున్నాను. అన్నామ. అతను కొంచెం తెల్లబోయి'

'మరిడ్రస్ మార్చుకోరా' అన్నాడు.

'మార్చుకోడానికేమున్నది. చాకలి తెచ్చిన పంచా, చొక్కా కండువా కంటే వేరే దుస్తులు యేముంటాయి అన్నాను. అతను కొంచెం తడబడి.

హో హో చిత్తం, అదేనండీ, తమరు ఇవి విడిచేసి వస్తారేమో అనుకున్నా'నండి అన్నాడు చేతులు జోడించి, కంగారుగా.

'మాస్టారూ! బట్టలు విడిచేం సభకు ఎలారానండీ' అన్నాను ఎంతో

అమాయికంగా ముఖంపెట్టి ఆయన ఉక్కిరి బిక్కిరై

'చిత్తం చిత్తం, అదేనండీ అనగా అంతేనండి, తమరు బట్టలు కట్టు కుంటారని అనుకోలేదండి, అనగా ఎప్పుడూ అదేదో సూటూ, హేటూ వగైరాతోకాని పైకి రారనుకున్నానండి'అన్నాడు ఎంతో భయంతో.

'అయితే యింట్లో ఏమీ లేకుండా వుండి వీధిలోకి వచ్చేటప్పుడు అమాంతం అవి తగిలించుకు వస్తాననుకున్నారా? భలేవారండీ రండిపోదాం' అన్నాను, ఆయన భుజం మీద చెయ్యివేసి, వీధిలోకి తీసుకువచ్చాను. పక్కనున్న కుర్రవాడు పైకి నవ్వలేక, నవ్వు ఆపుకోలేక, కడుపు పట్టుకుని ఉండ చుట్టుకుపోయి, నానాయాతనా పడుతూ, మా వెనకనే వచ్చాడు. ముందు నన్ను బండి ఎక్కమన్నారు గౌరవంతో వెనుకను కుర్రవాడూ, చివరను మాష్టరుగారూ కూర్చున్నారు. ఈ బండిలో నర్సాపురం చేరే టప్పటికి బట్టలకూ, ముఖానికీ, కొంచెం జేగురురంగు వస్తుంది. అక్కడ ఎడింబరోకి మల్లే మీరేమైనా ముఖప్రక్షాళనాదికం చేసుకుంటారా అని అడి గేవారు ఎవరూ ఉండరుకదా అని, అనుకుంటూ, ఒళ్ళు కంపరమెత్తినా గత్యంతరం లేక బండిలో ఎక్కి కూర్చున్నాను బండి పదిగజాలు సాగ్గానే.

'అయ్యా పంతులుగారూ కొంచెం పైకి రండి అయ్యా' అన్నాడు బండితోలే సాయిబు.

నవ్వుకుంటూ కొంచెం ముందుకు జరిగాను. మళ్ళీ కొంచెం దూరం సాగేటప్పటికి.

'తమరు ఇంకా పైకి రావాలండి అయ్యా' అన్నాడు సాయిబు.

'నాయనా, ఈ కొద్ది పరిచయంతోటే నామీద యింత అభిమానం కలిగి నన్ను పదే పదే పైకి రావాలని కోరుకునేవాడవు నువ్వు ఒక్కడవు కనపడ్డావు. చాలా సంతోషం. ఇంక చాలునా ' అన్నాను కొంచెం పైకి జరుగుతూ,

'చాలునండీ మహారాజ్' అన్నాడు.

'అరె నీ యిల్లు బంగారంగానూ! నన్ను అప్పుడే మహారాజుని కూడా చేసేశావ్ అన్నాను.'

'చిత్తం తమరు ఎప్పుడూ మహారాజాలాగనే ఉంటారండి అయ్యా' అని నవ్వుకొంటూ ఈలవేసి హుషారుగా బండిని పోనిచ్చాడు.

ఆ ఉత్సాహంతో మమ్ములను అరగంటైనా కాకుండా నర్సాపురంలో

మా హైస్కూలు గుమ్మంలో  బండి ఆపి

'ఇంక దిగండి మహారాజా' అని నన్నూ నా పరివారాన్ని హెచ్చరించి తను కిందకు ఉరికి బండీ, గుర్రంపైకి తేలిపోకుండా నొక్కిపట్టుకుని, నిలబడ్డాడు.

మేము ముగ్గురం నెమ్మదిగా కిందకు దిగాం. మా కెదురుగుండా హెడ్మాష్టరుతో సహా, ఉపాధ్యాయులందరూ, యావన్మంది విద్యార్థి బృందం నాకు స్వాగతము చెప్పడానికి అక్కడే నిలబడి ఉన్నారు దిగగానే మా రోజుల్లోనే నెరుగని విశేషం ఒకటి ముందు కనపడ్డది. కొందరు  విద్యార్థులు అన్ని తరగతులనుంచి తలొకరో, ఇద్దరో వచ్చినట్లుగా, కాకీదుస్తులూ, నెత్తిమీద టోపీ, మెడలో నీలంరంగు గుడ్డ టైలా ముడివేసుకుని, దానికి ఇరుప్రక్కలా వరుసగా నిలబడి  నేను ముందుకు బయలుదేరగానే 'ఎటెన్షన్' అనే ఒక పొలికేక ఆ విద్యార్థి నాయకుడు పెట్టగా  వారంతా తమ బూట్లు చప్పుడుచేసి, నాకు సైనికాభివందనము చేశారు. నేను చిరునవ్వుతో ఫీల్డు మార్షల్ వలే వాళ్ళను చూస్తూంటే హెడ్మాష్టరుగారు ఎంతో సంతోషంతో.

'వాళ్ళు బాయ్ స్కౌట్స్, మన స్కూల్లో ఈ ఏడే శిక్షణ కొత్తగా ప్రారంభించాము. విద్యార్థులందరకూ ఇది యెంతో ఉత్సాహజనకంగా ఉంది' అన్నారు.

చోపుదార్లు పరాకు పలుకుతున్నట్లుగా కొందరు ఉపాధ్యాయులు కుర్రవాళ్ళను అల్లరి చేయకుండా తమ తమ స్థానాలలో కూర్చోమంటూ హెచ్చరిక చేస్తూంటే, నేను నా ప్రక్కను ఉన్న హెడ్మాష్టరుగారు మహామంత్రి తిమ్మరుసు అయినట్టూ, నేను రాయలునా ఏమిటి అనుకుంటూ  లోపలికి ప్రవేశించాను.

హాలు కిటకిట లాడుతూ ఉన్నది. అక్కడ కేవలం విద్యార్థులే కాక చాలామంది పురప్రముఖులూ ఉద్యోగులూ కూడా వచ్చినట్లు కనపడ్డది. నేను లోపలికి రాగానే లేవాలా అక్కరలేదా అనే  సందేహంతోనూ ఈ పంచా చొక్కా కండువాతో ఉన్న మనిషి, పార్వతీశం అవునా కాదా అన్న సందేహంతోనూ ఒకలిప్తకాలం అనుమానించి ఎందుకేనా మంచిదని అక్కడున్న యావన్మందీ గభీలున లేచి నిలబడ్డారు. నన్ను హెడ్మాష్టరుగారు ఎంతో గౌరవంతో తిన్నగా అక్కడ ఉన్న  ఉన్నత స్థానానికి తీసుకు వెడుతూంటే, పంచకట్టుకున్నా నేను పార్వతీశాన్నేను, అనే  నిశ్చయానికి సభికులంతా వచ్చి హర్షధ్వానాలు చేసారు.

నేను చాలా గంభీరంగా మామూలు నవ్వూ తుళ్ళూ లేకుండా, చాలా సుప్రసిద్ధుడులాగా ఒక్క క్షణం నిలబడి సభికుల నందరనూ దయార్ద్ర దృష్టితో చూచినట్లు చూచి, దయచేయండి అన్నట్టు హస్తాభినయం చేసి కూర్చున్నాను. సభికులంతా వారి వారి స్థానాల్లో కూర్చున్నారు.

క్రిందనున్న ఉపాధ్యాయులంతా విద్యార్థుల నందరనూ సరిగా కూర్చో బెట్టి బల్లలు లేక నిలబడి ఉన్న కొందరి విద్యార్థులను ప్లాట్ ఫారానికి ఎదురుగుండా నేలమీదనే కూర్చోపెట్టి నిశ్శబ్దంగా ఉండవలెనని అందదరినీ హెచ్చరించగానే సభలో శబ్దం చల్లారింది. హెడ్మాష్టరుగారు నెత్తిమీద తల గుడ్డా మెడమీదనున్న కండువా, సవరించుకుని ప్లాట్ ఫారం మీదకి దయచేసి ఒక కుర్రవానిని పైకి రమ్మని ప్రార్థన చేయమన్నారు. సభ్యులంతా లేచి నిలబడ్డారు. ఆవిద్యార్థి తానునేర్చిన గణపతి స్తోత్రం సంస్కృతంలోనూ, సరస్వతీ ప్రార్థన తెలుగులోనూచేసి, మాకు నమస్కరించి, తనకేదో అఖండ గౌరవం జరిగినట్టుగా సంతోషించి క్రిందకు వెళ్ళిపోయాడు. హెడ్మాష్టరు గారు లేచి నిలబడి మళ్ళీ ఒకమాటు కోటూ, కండువా సవరించుకుని, సభ్యులను చూచి మందహాసం చేసి, కొంచెం కంఠం సవరించుకుని, 'సభాయైనమః' అని, చేతులు జోడించి 'మహాజనులారా, విద్యార్థులారా, సోదర ఉపాధ్యాయులారా, ఈ రోజు మనకందరకూ చాలా సుదినం. ఇది ఒక అపూర్వమైన మరపురాని మరువకూడని సంఘటన. మన స్కూలులో మావద్ద విద్యనభ్యసించి ఈనాటికే మన తెలుగువారిలో ఏ ఒకరిద్దరో తప్ప తక్కిన వారెవ్వరూ చేయలేని సాహసకృత్యం, అసాధారణమైన ధైర్యముతో, నేర్పుతో చేయగలిగాడు మనపార్వతీశం. కొన్ని సంవత్సరముల క్రితం అతను నా విద్యార్థి. అయి ఉండడం నాకింతంత అని చెప్పనలవిగాని ఆనంద హేతువూ గర్వకారణముగానూ ఉన్నది. ఆ సంతోషాతిశయముతో నన్ను మరచి పూర్వపు చనువుతో వారిని ఏకవచనముతో సంబోధన చేసినాను. వారు అన్యధా భావించరని తలుస్తాను - అని నాకేసి చూచారు. నేను మవునంగా వారివేపు ఒక నమస్కార బాణంతో మందహాసం జోడించి విసిరాను. ఆయన అది అందుకున్నట్టు ప్రతిహాసం చేసి, మన పార్వతీశం గారు నేను మనవి చేసినట్టుగా పరాపేక్ష లేకుండా, ఎవ్వరి సహాయమూ, లేకుండా, అంత పిన్న వయస్సులో, ఇన్ని వేలమైళ్ళు సముద్రయానం చేసి, మన ప్రభువుల స్వదేశము అయిన బ్రిటన్‌లో అంతర్భాగముగా ఉంటున్న స్కాట్లండు వరకూ వెళ్ళి, ఎడింబరో విశ్వవిద్యాలయంలో ఎం.ఏ., బాక్ యట్ లాలో ఉత్తమ తరగతిలో ఉత్తీర్ణులైన విషయం మీరం దరూ విని ఉన్నారు. ఆనందించి ఉన్నారు. ఇప్పుడు ఒక భయంకరమైన

మహాఘోర సంగ్రామము, ఐరోపాలో జరుగుతున్న విషయము మీకందరకూ తెలిసినదే. ఈ రోజులలో జలాంతర్గాములు సప్తసముద్రాలలోనూ, అహర్నిశాదులు తిరుగుతుంటే, సముద్రంమీద చూడ భయంకరమైన యుద్ధ నౌకలు పహరాయిస్తుంటే, పైన అంతరిక్షంలో వాయు విమానాలు మన సంచారాన్నీ, సంచలనాన్నీ, వెయ్యి కళ్ళతో కనిపెడుతుంటే, ఎంతో ధైర్యం చేసి ప్రాణభీతి లేకుండా వీటన్నిటినీ తప్పించుకుని క్షేమంగా ఆరోగ్యంగా స్వదేశానికి తిరిగి రాగలిగిన ధైర్యశాలి మన పార్వతీశంగారు. వారికి పరమేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించమని మనమందరమూ చేతులెత్తి ప్రార్థించాలి' అనగానే సభలో ఉన్న యావన్మంది తప్పదు కాబోలని బాధపడకుండా ఒక్కసారి చేతులెత్తారు మళ్ళీ మా హెడ్మాష్టరుగారు మరొకమారు కంఠం సవరించుకుని, గాత్ర గాంభీర్యంగాని, స్థాయిగాని తగ్గకుండా, 'ఇక పార్వతీశం వారి గుణగణాలనూ, వారివిద్యాబుద్ధులనూ, వారి తెలివితేటలనూ ఎంతసేపైనా మీకు చెప్పవలెనని ఉన్నది. కాని, ఇప్పటికే కాలాతీతమైనందువల నా పరిచయ వాక్యాలు ఇంతటితో ముగించి, మన పార్వతీశంగారు లేచి వారి అనుభవాలను మనకు తెలుపవలెనని కోరుతూ, సభా ప్రారంభం అనుకున్నకంటె, చాలా ఆలస్యమైనందుకు మన్నించవలెనంటూ నేను విరమిస్తున్నాను' అని కుర్చీలో కూర్చుని వారు పడ్డశ్రమకు ముఖాన బయల్వెడలిన స్వేదబిందువులు తుడుచుకుంటూంటే, సభికులు దిశలు మారుమ్రోగేటట్లు సుదీర్ఘ హర్షధ్వానములు చేశారు.

ఆ శబ్దం సర్దుమణగ్గానే నేను లేచి, మందహాసంతో నలువైపులా పరికించి, నేను కూడా మా హెడ్మాష్టరుగారి పద్ధతిని -

'సభాయైనమః అని చేతులు జోడించి, మహాజనులారా సోదర విద్యార్థులారా, మా పూర్వపు ప్రస్తుతపు ఉపాధ్యాయులకూ నన్నెంతో ఆదరంతో, అభిమానంతో, గౌరవంతో, అతిశయోక్తులతో మీకు పరిచయం చేసిన మా హెడ్మాష్టరుగారికీ అనేక కృతజ్ఞతా గౌరవపూర్వక నమస్కార సహస్రములు భక్తివినమ్రతతో అర్పిస్తున్నాను. మొన్నపొంరు మాఇంటికి స్వయంగా దయచేసి నన్నిక్కడికి రమ్మని ఆహ్వానించినప్పుడే, నేనెంతో సందేహిస్తూ అంగీకరించాను. ఎందుచేతనంటే నేనూ మీలాగనే ఈ స్కూలులో చదువుకున్నవాడిని. నావిద్యాభ్యాసము కూడా ఇప్పుడున్న గురువుల వద్దనే అప్పుడప్పుడు వారాగ్రహంతోటో, అనురాగంతోటో తగిలించిన చురకలు ఇంకా మరువలేదు కూడాను. నేను ఆ రోజుల్లో చాలా అల్లరి చేసేవాడిని అన్న విషయము శిక్షపొందినపుడు కాకపోయినా తరువాత తరువాత

తెలుసుకోగలిగాను. ఆనాడు నేనూ, .నా సహాధ్యాయులూ చేసిన చిలిపి చేష్టలూ అప్పుడప్పుడు జ్ఞాపకము వస్తూండేవి. ఇవన్నీ మా ఉపాధ్యాయుల సహనానికి యెంత పరీక్షగా వుండేవో, తరువాతను ఎప్పటికోగాని, తెలుసుకోలేక పోయాను. ఆనాటి అల్లరి చేష్ట ఒకటి ఈ క్షణములో నాకు జ్ఞప్తికి వస్తున్నది.

ఒకరోజున ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. ఆ రోజున నేను బడికి వచ్చేసరికి నలభై యాభైమంది విద్యార్థులు వీధిలోవుండే చాకలి గాడిదలను రెంటిని ఎలాగోకష్టపడి, పాఠశాల ఆవరణలోకి మళ్ళించి తలుపులు బంధించి వాటి నటూాయిటూ పరుగులెత్తిస్తున్నారు. అవి హడలిపోయి బయటకు పోయే మార్గంలేక, చాలా కంగారుగా ఓండ్రపెడుతూ పరుగెడుతున్నాయి. ఇంతలో నేను మరికొందరి స్నేహితులతో వచ్చాను. తలుపు మూసి వుండడమూ లోపల హడావిడీ చూసి, నాపిలుపువిని తలుపు తీసేవారెవ్వరూ లేక, కాంపౌండు గోడలుదూకి, రంగంలోకి కూడా దూకాము. అక్కడ కుర్రవాళ్ళను, ఏమిట్రా యీగొడవ అని అడిగి తెలుసుకుని, ఆ ఆటలో మేము కూడా ఉత్సాహంగా ప్రవేశించాము.

ఇంతసేపటినుంచీ గాడిదలచేత గాడిదగత్తర చేయిస్తున్న కథానాయకుణ్ణి పిలిచి, ఇలాకాదురా అబ్బాయి, సరియైన పద్ధతి నేను చెబుతాను విను అనేసరికి వాళ్ళందరూ చప్పట్లు కొడుతూ చెప్పండి చెప్పండి' అంటూ అమితోత్సాహముతో, మళ్ళీ మాష్టర్లు రాకుండా, త్వరగా తెమల్చండి అని ఏమ్ముక హెచ్చరించారు.

అయితే మీరెవరైనా వెళ్ళి గట్టివి రెండు త్రాళ్ళు సంపాదించండి ఈ గాడిదలను కట్టేసి సర్కస్ చేయిద్దాము అన్నాను. ఇద్దరు ముగ్గురు కుర్రవాళ్ళు త్రాళ్ళకోసం పరుగుపెట్టారు. ఒక కుర్రవాడు మట్టుకు, తాపీగా అక్కడేనాకేసి చూస్తూ నిలబడి,

'ఒక మాట మనం చెప్పగానే విని అవి సర్కసు ఎలా చేస్తాయండీ' అన్నాడు.

ఏడిసినట్టే వున్నాయి నీ తెలివితేటలు చూస్తూవుండు. వీటిని ఎలాగూ తీసుకు వచ్చారుగనుకనూ, ఇవాళ పంచమీ గురువారం గనకనూ, వాట్లకు శిక్షణ యివాళనుంచి ప్రారంభిద్దాము. ముందు నువ్వువెళ్ళి, కాస్త సిరా తీసుకువచ్చి, వాటి తోకలకుగాని, ముఖానికిగాని పట్టిస్తే మన గాడిదలన్న సంగతి మనకు గుర్తుకు వుంటుందది. ఈవేళకు మల్లేనే రోజూవాటిని,

శ్రమపడిబడిలోనికి తీసుకువస్తే ఒక గంట ప్రొద్దున్నా వీలైతే ఒక గంట సాయంకాలం కూడా వీట్లకు సర్కసువిద్య నేర్పుదాము అది మనకు సరదా గానూ, కాలక్షేపంగానూ, వుంటుంది. ముందు ముందది చాకలి మూటలు మొయ్యకుండా, ఏదైనా సర్కసు కంపెనీలోచేరి, దర్జాగా బ్రతికే అవకాశం కల్పించినవాళ్ళమూ అవుతాము. ఏమంటావు అన్నాను. అతనూ అక్కడున్న తక్కినవాళ్ళూ ఏకగ్రీవంగానూ, కరతాళ ధ్వనులతోనూ, తమ అంగీకారం వ్యక్తపరచారు. ఇంతలో యిద్దరు కుర్రవాళ్ళు ఏలాగో రెండు త్రాళ్ళూ, రెండు చింతబరెకెలూపట్టుకొని, ఒగరుస్తూ పరిగెత్తుకు వచ్చారు. ఈ విద్యార్థుల మధ్యనుంచి, గాడిదలు ఉడాయించడానికి దారిలేక ఏదో తమ ప్రాణంమీదకు వస్తుందనే ఆలోచనేలేక అంత ఆలోచనే వుంటే, అవి గాడిదలు ఎలా అవుతాయిలెండి! హడలిపోతూ, మా అందరికేసి జాలిగా చూస్తూ మధ్య మధ్యనుకొంత భయంతోనూ కొంత సంతోష ముతోనూ 'హుర్రే' అన్నట్టు ఓండ్రిస్తూ నిలబడ్డాయి. యీ త్రాళ్ళతో ఆ గాడిదలను కట్టడం ఏలాగా అని ఆలోచిస్తూంటే, అతి తెలివైన ఒక కుర్రవాడు మేక పిల్లనూ, ఆవు దూడలనూ పట్టుకున్నట్టుగా, ఒక గాడిద చెవులుపట్టు కున్నాడు. ఈమోటు సరసంతతో ఆ గాడిదకు ఒళ్ళు మండి ముందున్న వాళ్ళను కరవబోయి, వెనకకు ఉన్నవాళ్ళను కాళ్ళతో ఎగిరి తన్నింది. వాళ్ళు మొర్రోమని పారిపోయారు. రెండోగాడిద తన్నే వరూ ఏమీచేయక పోయినా, తోటిగాడిదకు సానుభూతి చూపడంకోసం గిర్రున తిరిగి, కనబడ్డవాళ్ళనీ, కనపడని వాళ్ళనీ, తన్నడం మొదలెట్టింది. దాన్ని యింగ్లీషుతో చెప్పాలంటే 'సింపతిటిక్ స్ట్రయిక్' కాదు 'సింపతిటిక్ కిక్' అనాలి. ప్రేక్షకులందరూ దుష్టులకు దూరంగా వుండవలెననే సంగతి జ్ఞప్తిగా, దూరంగా తొలగిపోయారు.

మొదటి గాడిదను నలుగురు కుర్రావాళ్ళు ఎలాగో తంటాలుపడి, నాలుగు కాళ్ళకూ బంధంవేశారు. నేను చింతబరిక ఒకటి పుచ్చుకుని, ఆమధ్యను యీ వూళ్ళోనే చూచిన సర్కస్ పద్ధతిని, గాడిదను ఒక్కటి తగలనిచ్చి అప్ అప్ అని కేకవేశాను. అసలే గాడిద. ఆపైన యీ కంగారుతో మతిస్థిమితం తప్పింది. చాకలి . భాష తప్ప మరో భాషను ఎప్పుడూ విని ఎరుగని ఆ గాడిదకు 'అప్' అంటే ఎలా అర్థం అవుతుంది! నయాన్నా, భయాన్నా, ఎన్నో విధాల చెప్పాను. ఎంతకూ వినకపోతే, మళ్ళీ రెండు తగలనిచ్చి, 'ఓయి వెర్రిగాడిద కొడకా! అప్ అన్నప్పుడు రెండుకాళ్ళూ పైకెత్తాలి. తెలిసిందా' అని ఆ ముందుకాళ్ళ మీద మళ్ళీ రెండు తగలనిచ్చాను. సర్కస్‌రింగులో 'కదం' తొక్కడం నేర్పుదామని

నెమ్మదిగా మెడకు కట్టిన తాడును ఒకడిని పట్టుకోమని, ఆగాడిదను ముందుకు లాక్కు వెళ్ళమన్నాను. అప్పటిదాకా, అదిగాడిదే అనుకున్నాను గాని, ఏనుగనుకో లేదు. చచ్చినా అడుగుతీసి, అడుగు వేయించడం నాకు సాధ్యం కాలేదు. ఎలాగైనా ఈ ఒక్క Feat అయినా ఈ రోజు చేయించి తీరాలని, పట్టుదలగా పనిచేస్తున్నాను. కొంతసేపైనా తరువాత, ఇంతవరకూ ఉన్న కోలాహలం అంతా చల్లారి, ఎంతో నిశ్శబ్దంగా ఉండడం గమనించి, నాలుగు వైపులా చూసేసరికి, అక్కడ అదివరకు ఉన్న విద్యార్థి బృదం అంతా, మాయమైపోయారు. ఇదేమిటీ వింత అని, వెనక్కి తిరిగి చూతునుగదా గేటు అవతలనుంచి, మా హెడ్మాష్టరుగారూ, మరికొందరు ఉపాధ్యాయులు మమ్మల్ని తదేకదృష్టితో చూస్తున్నారు. నాకు నిలువెల్లా కంపంవచ్చి, పరుగెత్తబోయాను. నా అవస్థచూచి, ఆ గాడిదలు నాకంటే ముందే తెలివి తెచ్చుకొని, నన్ను చూచి వెకిలిగా నవ్వినట్టుగా ఓండ్రిస్తూ, పరుగుపుచ్చుకున్నాయి. అప్పటికి నాకూ చైతన్యం వచ్చి, పారిపోదామని ప్రయత్నం చేస్తుండగా మన హెడ్మాష్టరు గారూ, ఎంతో అప్యాయంగా, 'నాయనా పార్వతీశం. ఈ గేటు తీస్తావా బాబూ. మేము కూడా వచ్చి, నీకు కొంత చేతనైన సహాయము చెయ్యడానికి ప్రయత్నిస్తాము' అన్నారు. వారి మాటలకు అర్థము ఏమిటో నాకు సరిగా బోధపడక, ఎలాగో కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిగేటు గడియతీశాను. హెడ్మాష్టరుగారు అప్యాయంగా నాభుజంమీద చెయ్యివేశారు. వెనుకనున్న ఉపాధ్యాయులంతా విరగబడి నవ్వబోయి, బలవంతాన ఆపుకుంటున్నారు. నాభుజంమీద వున్న గురువుగారి హస్తం ఏదో ఇనుప గుండులా వుండి, క్షణ క్షణం బరువెక్కి వౌతున్నట్టు తోచింది.

నన్ను నెమ్మదిగా నడిపించుకొని హెడ్మాష్టరుగారు వారి గదిలోకి తీసుకువెళ్ళారు. తక్కిన మాష్టర్లంతా, వారి కామన్ రూములోకి వెళ్ళి మమ్మల్ని గురించే కాబోలు నవ్వుకుంటూ మాట్లాడుకుంటున్నారు. మొదటి గంట కొట్టారు. హెడ్మాష్టరుగారు తాపీగా కూర్చుని, నా భుజం మీద చెయ్యితీసేసి ఏమిటోయి పార్వతీశం, మనకున్న గాడిదలు చాలక పై గాడిదలను కూడా తీసుకువచ్చి ఏదో గాడిద గత్తర చేస్తున్నావేమిటి? అన్నారు. వారు కోపంగా అన్నారో, హేళనగా అన్నారో, ఆదరంతో అన్నారో నాకేమీ అర్థంకాలేదు. ఏదో చెప్పరాని భయమూ, గుండెల్లో దడా, కాళ్ళలో వణుకూ, కళ్ళవెంట నీళ్ళూ వచ్చినాయి.

'ఏం బాబూ పార్వతీశం మాట్లాడవేమి? అన్నారు మళ్ళీ ఆయన ఎంత నెమ్మదిగా అన్నా, నా చెవిని చేరేటప్పటికి ఏదో పెద్ద ఉరుము లాంటి శబ్దం వినవచ్చింది. నేను గజగజలాడుతూ చేతులు జోడించి ఏ ఏ ఏమీ లేదండి. గాడిదలను ' అన్నాను.

నేను గజగజ లాడుతూనే 'అవి అండీ... అంటే .. ఆ గాడిదలండీ... ఎలాగో వచ్చాయండి, ఎందుకొచ్చాయా అనుకుననానండీ. మేమందరమూ అలాగే అనుకున్నానండీ' అన్నాను.

'దానికేముంది, మిమ్మల్ని చూడడానికి వచ్చి వుంటాయి. అన్నారు నెమ్మదిగా ... బైటికి పొమ్మంటే, మేం చెప్పినమాట వినలేదండి. ఎవరు చెప్పిన వినలేదండి.'

ఏమిటీ! ఎవరి మాటా వినలేదూ! ఆఖరికి నీమాటకూడ వినలేదూ! చాలా చిత్రంగా వుంది ఇంతకీ ఏం చెప్పావు దానితోటీ? అన్నారు హెడ్‌మాష్టరుగారు.

వారి ధోరణి నాకేమీ అంతుపట్టలేదు.

తమరు వచ్చేటప్పటికి అవి ఇక్కడ అంతా గల్లంతు చేస్తూంటే బయటకు పొమ్మని చెప్పాను. నా మాట వినకపోతే, అసలే గాడిదలుకదా అని, ఈ బరికతో రెండు తగలనిచ్చాను. ఇంతట్లో తమరు దయచేశారు అన్నాను.

అహా అలాగా అంతేనన్నమాట ఇంకేం చెయ్యలేదన్నమాట. ఓ గాడిద కాళ్ళకు బందాలు వేసినట్టుందే? కొంపతీసి అవే బందాలు వేసుకుని వచ్చాయా లోపలకు అన్నారు హేళనగా.

'లేదండి పాపం బందాలు వేసుకోవడం వాటికేమీ చేతవుతుందండి. మన కుర్రవాళ్ళే ఎవరో వేశారండి. అవి కాంపౌండంతా గంతులు వేస్తూ మొక్కలన్నీ పాడుచేస్తుంటే, నేనే బంధం వెయ్యమన్నాను. పాపం నలుగురు కుర్రవాళ్ళు వద్దు మొర్రోయని ఆ గాడిదలు తన్నుతున్నా లక్ష్యపెట్టకుండా బంధం వేశారు. వాటిని తమకు వప్పచెప్పడమో లేకపోతే బంట్రోతు వీరాస్వామిచేత దొడ్డికి తోలించడమో చేద్దామనుకున్నాను' అన్నాను.

'చిత్తం చిత్తం ... అదేనండి ... పొరపాటేనండి ... తప్పేనండి ఆమధ్య యీవూరు వచ్చిన సర్కసు చూశానండి. అందులో వాడు గుర్రాలూ, గాడిదలూ, యింకా యెన్నో జంతువులచేత, యెన్నో తమా

షాలూ చేయించాడండి. ఇవికూడా చెయ్యగలవేమో చూద్దామని వాళ్ళు కేకవేసినట్టుగా నేను కూడా కేకేలేస్తున్నాను. అంతకంటే ఏమీ లేదండి. తప్పుమాట ఏమి అనలేదండి, అంటే ఒట్టండి' అన్నాను.

'అబ్బెబ్బే దానికి ఒట్టునా ఎందుకు? నీమాట మీద నాకు నమ్మకమే. నా రాకమూలాలన్న దానికి పారం సాగలేదన్నమాట. పోనీ రేపు రమ్మని అనకపోయావు నాయనా' అన్నారు.

'చిత్తం నే నామాట అనలేదుగానీండి, మళ్ళీ కనపడితే కొంత ప్రయత్నించి వీటిని లొంగతియ్య వచ్చునేమో అనే వూహా కలిగిన మాట వాస్తవమేనండి' అన్నాను.

భేష్ బాగుంది. నేనూహించినట్టుగానే నువ్వూ అనుకున్నావన్నమాట యీ శిక్షణలో నీకు సహాయం ఎవరు నాయనా! అన్నారు.

ఒకరేమిటండి - ఇక్కడున్న వందమందీ నాతో సహకరించిన వాళ్ళేనండి.

ఏమిటీ నేను వచ్చేటప్పటికి నీవు తప్ప ఎవరూ లేరే? అంతకు ముందు వందమంది దాకా ఉన్నారా - ఊఁ హూఁ. అయితే ఆ కొత్త గాడిదల మాట ఎలా వున్నా యీ పాత గాడిదల సంగతి ఏదో తేల్చాలి నీ సహాధ్యాయు లెవరో చెప్పమ్మా అన్నారు.

నా ప్రాణాలు నిలువునా పోయినాయి. ఎవరని చెప్పను? నా కేమి తోచలేదు. ఆమాటే వారితో మనవి చేసుకున్నాను.

'బాబూ వేనేమీ చెప్పలేనండి. నేను వచ్చేసరికి ఎవరో కుర్రాళ్ళు యీ గాడిదలను తరుంతున్నారండి అలా కాదర్రా ఇలా సర్కస్ చేయిద్దామని నేనన్నానండి, వాళ్ళందరూ నాచుట్టూ మూగారు. అందులో ఎవరు ఎవరని చెప్పగలను? అన్నాను.

'అవును పాపం కష్టమే అంత మంది నిజంగా వుంటే' - అన్నారు.

'నిజమేనండి ఎంత ఒట్టుపడితే అంత వొట్టు అండి. నేను ఎప్పుడూ అబద్ధమాడనండి. అలవాటు లేదండి. అసలు చేతే కాదండి' అన్నాను రెండు చేతులూ జోడించి.

మళ్ళీ వారొక పెద్ద నవ్వు నవ్వి.

'ఒరి వెర్రి పార్వతీశం, ఎంత అమాయకుడివిరా. నిన్ను చూస్తే

జాలివేస్తోంది. నా విధి నేను తప్పకూడదు కదా? నీ చేతిలో బెత్తం యిలా ఇచ్చి, రెండుచేతులూ జాపమ్మా' అన్నారు.

నేను హడలిపోతూ, రెండుచేతులూ జాపాను. రెండు చేతులమీద రెండు రెళ్ళు నాలుగు దెబ్బలు పడ్డాయి. వారి ముఖం చూడలేక పొంగి వస్తున్న కన్నీరును ఆపుకోలేక గట్టిగా కళ్ళు మూసుకున్నాను. 'ఇక వెళ్ళు నాయనా అన్నారు. ఆమాట అంటూంటే ఆయన కంఠం కొంచెం కంపించింది. అటువంటి దయార్ద్రహృదయులు కూడా నన్ను శిక్షించవలసి వచ్చేటట్లు చేశానంటే, వారి మనస్సు ఎంత క్షోభపెట్టానో మీరే ఊహిం చుకో గలరు' అన్నాను. అంటూంటే నా కంఠమూ కొంచెం కంపించింది.

నే నొకప్పుడు ఎంతో తెలివైన వాడినీ, చురుకైన వాడినీ, ఉత్తమ తరగతిలో అన్ని పరీక్షలలోనూ ఉత్తీర్ణుడనై మన ఉపాధ్యాయులకూ పాఠ శాలకూ పేరు ప్రతిష్ఠలు తెచ్చేవారిలో ఒకడినవుతానని కలలుకనే మా పెద్దలకూ, ఉపాధ్యాయులకుకూడా ఆశాభంగం కలిగించాను. ఒకనాడు పరమశాంత స్వభావులూ, దయార్ద్రహృదయులూ ఆయిన మన ప్రధానో పాధ్యాయులను కూడా ఆగ్రహావేశులయ్యేటంత అల్లరి చేసి వారిచేతను కూడా దెబ్బలుతిన్నాను. అటువంటి అల్లరి చిల్లరగా తిరిగేవాడను ఏదో శుభముహూర్తాన, ఎవరో మాటవరసకు యిచ్చిన సలహాతీసుకుని, ముందు వెనుక లాలోచించకుండా, నాశక్తి సామర్థ్యములు అంచనా వేసుకోకుండా నాకు సలహా యిచ్చిన వారితో మాటేనా చెప్పకుండా మొగల్తుర్రునుంచి నర్సాపురమో సకినేటిపిల్లో, అంతర్వేదో వెళ్ళడం కాబోలు ననుకుని ఇంగ్లండుకు మూటా, ముల్లీ కట్టుకుని ప్రయాణమయ్యాను. దారిపొ డుగునా క్షణక్షణమూ, ఎన్ని ఇబ్బందులు పడ్డానో, ఎంత అవివేకంగా ప్రవర్తించానో తలచుకుంటే నాకే సిగ్గుగా ఉన్నది. అవన్నీ మీ ఎదుట ఏకరువుపెట్టి కాలహరణం చేయడం నాకు సబబుగా తోచడంలేదు. అది కాక ఎప్పుడో ఒకప్పుడు అవన్నీ జ్ఞప్తికి తెచ్చుకుని ఒకకథగా వ్రాయవలెననే దురాలోచన కూడా బయలుదేరిందీ మధ్యన. ఈనాడు మీ కందరికీ చిర పరచితుడనూ, అల్లరి వాడిని అయిననన్ను, యిక్కడకు తీసుకువచ్చి ఈ సన్మానం ఎందుకు చేస్తున్నారో నే నే రీతిగా దీనికి అర్హుడనో నాకర్థం కావడంలేదు. అయినా మీ అందరి అపూర్వాదరాభిమానాలకు పాత్రుడనై నందుకు చాలా సంతోషిస్తున్నాను.

ఇకను అక్కడి సంఘజీవితం, విద్యావిధానం గురించీ, మనం నేర్చు కోవలసినది బోలెడంత ఉన్నది. నిత్యజీవితంలో కూడా వారిపద్ధతులెన్నో

మనకు అవశ్యం అనుసరణీయములు. వారిదైనందిన జీవితంలో వ్యవహారాలలో, వ్యాపారాలలో ఎంతో మర్యాదా, న్యాయమూ కనపడుతుంది. భోజన పదార్థాలలో పాలల్లో ఎక్కడా మనకు అలవాటైన కల్తీ అనేది ఉండదు. చంటిపిల్లలు వెళ్ళినా, పెద్దవాళ్ళు వెళ్ళినా తూకంలో మోసం అనేది ఉండదు. అసలు వాళ్ళకి అబద్ధమాడడం చేతనవునా అనిపిస్తుంది. నేనున్నంతకాలం నిత్యవ్యవహారంలో ఎక్కడా ఏ విధమైన అన్యాయమూ నాకంటపడలేదు. అన్నిటికంటే చిత్రమేమిటంటే, నేను ఒకరోజున ఏదోపని మీద అవ్రూళ్ళో ఒక రైలు స్టేషనుకు వెళ్ళి నాపని చూచుకొని వచ్చేటప్పుడు, పుస్తక విక్రయశాలలో కొన్ని పత్రికలు కొనుక్కొని తొందరగా బయటికి వస్తుంటే, నా జేబులో పర్సు నాకు తెలియకుండా జారిపోయింది. నేను గమనించకుండా వెళ్ళిపోయాను. ట్రాము ఎక్కిన తరువాత జేబు తడుము కుంటే ఏమీ కనబడలేదు. నేను కండక్టరుతో చెప్పి మధ్యలో దిగిపోయి, నా బసకు నడచి వెళ్ళాను, తరువాత వారం పదిరోజులకు నేను, మళ్ళీ ఆ స్టేషనుకు వెళ్ళివస్తూంటే ఆ పుస్తకశాల అతను నన్నుగుర్తించి పిలిస్తే నేను దగ్గరకు వెళ్ళాను. మళ్ళీ అక్కడ క్రొత్తగా కనబడ్డ పత్రిక ఏదోకొని డబ్బులిచ్చి రాబోతుంటే "మీకీ రోజున ఒకచిన్న బహుమతి చెయ్యవలెనని ఉన్నది" అన్నారు.

'ఈ వేళకు వద్దులే. నా పుట్టిన రోజు వచ్చినప్పుడో, నేను వెళ్ళి చేసుకునే టప్పుడో, నీకు చెబుతాను. అప్పుడు ఇద్దువుగాని'లే అని పోబో తుంటే,

నన్ను బలవంతాన ఆపి ఈ బహుమానం చాలా స్వల్పం. మీరు చెప్పిన ఆ శుభ సమయములు వచ్చినప్పుడు, నా తాహతును బట్టి అప్పుడు వేరే ఇచ్చుకుంటాను లెండి. ప్రస్తుతానికి యిది మీదగ్గర ఉంచండి అని నా పర్సు అనగా ఆనాడు నేను పారేసుకున్న దాన్ని నాచేతిలో పెట్టాడు అందులో చిల్లరతో సహా ఒఒక పెన్నీ కూడా తేడా లేకుండా ఉన్నది.

నే నాశ్చర్యపోయాను.

'ఇదేమిటన్నాను.'

ఆనాడు 'తమరేదో ఉత్సాహంతో వెళ్ళిపోతూ ఇది ఇక్కడే పారవే సుకున్నారుట. ఒక పోర్టరు తీసుకుని వచ్చి నాచేతికిచ్చి మీ అనమాలు చెప్పి, మీరు వస్తే యిచ్చేయమని చెప్పాడు. అప్పటినుంచీ మీ రాకకు నిరీక్షిస్తున్నాను' అన్నాడు నవ్వుతూ.

నేను సంతోషంతో "థ్యాంక్స్యూ" అని 'ఆ పోర్టరెవరండి, ఎక్కడ ఉంటాడు?' అన్నాను.

'అది నేనేం చెప్పగలను? వాడు ఏవేళప్పుడు డ్యూటీలో ఉంటాడో ఎక్కడ ఉంటాడో, నాకు తెలియదు. మీరు వచ్చినట్లు మీ పర్సు మీకందినట్లూ నేను చెబుతాను లెండి అన్నాడు.'

సరే అయితే ఇంకొక సహాయం కూడా చెయ్యండి. 'ఈ పది షిల్లిగులూ అతనికి యిచ్చి నా థాంక్స్ చెబుతూ నాకీ ఉపకారం చేసినందుకు చాలా సంతోషించానని చెప్పండి' అన్నాను.

'ఇది వద్దండీ, అతను తీసుకోడు' అని అతను అనబోతున్న మాటలు చెవిని పడనివ్వకుండా తొందరగా వెళ్ళిపోయాను.

ఇటువంటి పని మన పోర్టర్లు సాధారణంగా చేస్తారని మీరెప్పుడేనా వినడంగాని చేయగా చూడడం కాని జరిగిందంటారా?

అక్కడ పద్ధతులన్నీ విధిగా మనం నేర్చుకోవలసినవీ, అనుసరించవలసినవీనీ. చంటిపిల్లలు పెంపకం దగ్గరనుంచి విద్యార్థి దశవరకూ వాళ్ళు చూపే నేర్పూ, ఓర్పూ పిల్లలకు నేర్పే పద్ధతులూ, మనము ముఖ్యంగా గమనించాలి. నాకు అక్కడ ఉన్నన్నాళ్ళూ విచిత్రమనిపించేది ఒక విశేషం. నేను ఉన్నన్నాళ్ళూ ఎప్పుడూ, ఎక్కడా పిల్లలు రోదనం వినపడేదికాదు. ఇక్కడ మన పిల్లలు ఏడవకుండా ఉండే సమయం కనపడదు. మనవారు దానిని సమర్థిస్తూ 'బాలా నాం రోదనం బలం' అని పెద్దలు ఒక సామెత కూడా ఏర్పాటు చేశారు. ఇంకొక చిత్రమేమిటంటే తల్లులు అస్తమానమూ పిల్లలను చంకనువేసుకుని తిరగడమూ, అలా ఎంతదూరమైన నడిచివెళ్ళడమూ, అలా నడుస్తూ మధ్య మధ్యను పిల్లలకు చన్ను కుడపడం, ఈలాటి దృశ్యాలేవీ అక్కడ కనబడేవి కావు. కాళ్ళు వచ్చి తిరగడం నేర్చినప్పటి నుంచీ కొంచెం ఎండా, గాలీ తగలడం ఆరోగ్యమని పిల్లలను పార్కులకు తీసుకువెళ్ళి వాళ్ళను అక్కడ స్వేచ్ఛగా ఆడుకో నివ్వడం, తరువాత విద్యాభ్యాసం ప్రారంభమైనప్పటినుంచీ వాళ్ళు రోడ్డుమీద ఎలా నడవాలో, స్కూలుకు వెళ్ళేటప్పుడు దుస్తులు ఎలా ధరించాలో, అక్కడకు వెళ్ళి పంతులమ్మకు ఎప్పుడెప్పుడు గుడ్‌మార్నింగ్‌లు, గుడ్ ఈవినింగ్‌లూ, థ్యాంక్యూలూ, సారీలూ, ఏఏ సందర్భాలలో ఎలా చెప్పాలో, క్లాసులోకి వెళ్ళేటప్పుడుగాని పైకి వచ్చేటప్పుడుగాని ఎంత నిశ్శబ్దంగా వరుసలో ఎలా రావాలో, అన్నీ నేర్పుతారు. పెద్దవాళ్ళకు మాటలలో

ప్రవర్తనలో ఔచిత్యం అలవరచుకోవడం నేర్పుతారు. వాళ్ళు జీవితమంతా ప్రతి విషయంలోనూ ఈ ఔచిత్యానికి ప్రాధన్యం యిస్తారు. మన వాళ్ళూ ఔచిత్యాన్ని గురించి చాలా వ్రాశారు. కాని అవి అన్నీ తాటాకులలోనూ, కాగితాలలోనూ, అచ్చు పుస్తకాలలోనే అణగి మణగి ఉండిపోయాయి.

ఇంకా ఇలా చెప్పకు పోతుంటే నేను చెప్పగలిగినవీ, మీరు వినవలసినవీ అనేకమున్నాయి. కాని ఇప్పటికే ఇంత సేపటినుంచీ నా ఉపన్యాసంతో మిమ్ములనందరనూ విసిగించి ఉంటాను. ఇంకా మిమ్మల్ని బాధించడం సబబుకాదు. ఔచిత్యమూ కాదు. అందుచేతను ఇప్పటివరకూ నేను చెప్పే కబుర్లన్నీ ఓపికతో, శ్రద్ధతో విన్నందుకు మీకందరకూ నాకృతజ్ఞతాభివంద నలు సమర్పిస్తూ నేను సెలవు తీసుకుంటున్నాను. మీకందరకూ శుభం" అని కూర్చున్నాను.

# 7

హైస్కూలులో జరిగిన సన్మానంనాడు ఉపన్యా కలుగజేసింది. ఊరంతా ఒకటే గొడవగా దీన్ని గురించి మాట్లాడుకో వడం, బాగుందంటే బాగుందనుకోవడం, నాతోటి విద్యార్థులు -

'మన పార్వతీశంగారు ఇంత బ్రహ్మాండంగా మాట్లాడేడు ఏమిట్రా! ఎవరున్నా, ఆఖరికి హెడ్మాష్టరుగారున్నా, అంత భయంలేకుండా, నదురూ బెదురూ లేకుండా ఎలా దంచే డ్రా' అని కొందరూ.

'ఆహా అది కాదురా, వీడిని మన మెరుగుదుము కదా మనతోటే ఆడుతూపాడుతూ ఉండే వాడు కదా! మనము ఇలా ఉండగానే చూస్తుం డగా వీడంతటి వాడు ఎలా అయ్యాడురా! నాకేమి అంతుపట్టకుండా ఉంది. అని మరొకరూ.

'దానికేముందిరా! ఓ పదివేలు తగలేసుకొని ఒక్కమాటు లండన్ వెళ్ళొస్తే ప్రతి వెధవా అంతేరా' అని మరి కొందరూ వ్యాఖ్యానాలు చేస్తూ ఇరవై నాలుగు గంటల్లో నన్ను చాలా పైకెత్తేశారు.

అంతెత్తుకు వాళ్ళు ఉత్సాహంకొద్దీ నన్నెత్తినా నాకు మట్టుకు ఉక్కిరి బిక్కిరిగా ఉంది. నేల మీదున్నంతసేపూ ఎవరేమన్నా ఇబ్బంది లేదుకాని అంత ఎత్తున ఉన్నప్పుడు ఏ మాత్రం బేలెన్స్ తప్పినా ప్రమాదమే మరి.

ఈవేళ ఇంక లాయర్లు జరుపబోయే సన్మానసభలో ఎలా నెగ్గుకుని

బయట పడతానా అని ఆలోచించుకుంటూ కూర్చున్నాను.

అప్పుడే మా అమ్మ కాస్త ఏదో ఫలహారంచేసి తీసుకువచ్చి పెట్టింది. పాపం నాకోసం ఎంత కష్టపడుతోందో. కోడలుంటే యింత బాధ లేకపోను అనుకుంటూ నాలో నేను నవ్వుకుంటూ ఫలహారం ముగించేస రికి గడియారం నాలుగు కొట్టింది. ఓహో టైమవుతున్నది అనుకొంటూ లేచి ముఖ ప్రక్షాళణాదికము ముగించుకొని చాకింటిమడతలు తీసి కట్టు కొని వాకిట్లో కొచ్చి కూర్చునే సరికి నర్సాపురం వకీళ్ళు ఇద్దరు నన్ను తీసుకెళ్ళడానికి వచ్చారు. నన్ను హైస్కూల్లోకిమల్లే కాకుండా, వీరు ఏజాగూలేకుండా అనుకున్న క్షణానికివచ్చి నన్ను దయచేమన్నారు. నేను వేళకు సిద్ధంగా ఉండడంచూచి చాలా సంతోషించారు. మేము వెంటనే బయలుదేరి ఒక అరగంటలో నర్సాపురం చేరుకున్నాము. మేము కోర్టు దగ్గిర బండి దిగేసరికి కోర్టు ఆవరణంతా జనంతో కిటకిటలాడుతూ సందడిగా ఉంది. ఈ సభ చిన్నదిగా వుంటుంది. వకీళ్ళు వస్తే, వారు గుమాస్తాలూ తప్ప మరెవ్వరూ రారనుకున్నాను. మొన్నస్కూల్లో జరిగిన సభను గురించి విన్నవాళ్ళు చాలామంది కోర్టుకు సంబంధం లేకపోయినా నన్ను చూడవలెననే కుతూహలంతో ఏ ఆహ్వానమూ లేకపోయినా, చూడ్డా నికి వచ్చారు. అందుకని కోర్టుకు మొదట బార్ రూమ్ లోనే జరుపవలె ననుకున్న సమావేశం బహిరంగ ప్రదేశంలో అత్యవసరంగా ఏర్పాటు చేయక తప్పిందికాదు. ఏ ఇబ్బంది పడ్డా వకీళ్ళు సమర్థులు గనుక. ఎంత అవ్యవధి అయినా సభ చక్కగా ఏర్పాటు చేశారు.

మేము బండి దిగగానే మరొక ఇద్దరు పెద్ద వకీళ్ళు మా బండి దగ్గరకు వచ్చి నేను దిగి నమస్కరించగానే వారు ప్రతి నమస్కారముతో నాకరచాలనంచేసి, వారు నాకు చెరొకవైపునా నిలబడి ముందునన్ను బార్ రూమ్‌లోకి తీసుకువెళ్ళి, అక్కడ సమావేశమై నారాకకు ఎదురుచూ స్తున్న కోర్టు మునసబుగారికీ తదితర లాయర్లకూ నన్ను పరిచయం చేసి, అక్కడ బల్లలమీద సిద్ధంగా అమర్చిఉన్న ఫలహారములను అందరితో పాటూ నన్ను కూడా అరగించమని బలవంతం చేశారు. తప్పేది లేక త్వరలోనే ఆ కార్యక్రమం ముగించి అందరమూ సభలోకి నడిచాము. మునసబు గారు నా పక్కనే ఉండి ఏదో మాట్లాడుతూనే ఉన్నారు. నాదృష్టి అంతా సభమీదనే ఉన్నది. ఈ పెద్దలు ఎదుట ఎలా మాట్లాడాలో, ఏం మాట్లాడాలో అని భయపడుతూ మునసబుగారు చెప్పేనదానిని వినకపోయినా, ఊ కొడుతూ సభలోకి వచ్చాం. రాగానే మమ్ములను రెండు కుర్చీలలో ఆశీనులనుచేసి.

బార్ సంఘము కార్యదర్శిగారు వేదికపైకి వెళ్ళి సభాధ్యక్షులూ పూజ్యులు అయిన మునసబుగారినీ, నేటి ఉపన్యాసకులూ గౌరవనీయులు శ్రీపార్వతీశం బార్ - ఎట్లా - వారిని వేదికపైకి దయచేసి ఆసనములను అలంకరించమని నమ్రతతో అర్థించారు. అంత వినయ విధేయతలతో వారంతటివారు అలా ప్రాధేయపడుతుంటే మనం వెంటనే వేదిక నలంకరించకపోవడము మర్యాదకాదని మునసబుగారి ననుసరించి, నేనూ పైకి వెళ్ళాను. మేము వెళ్ళగానే ఒకక ప్లీడలు గుమాస్తాగారిని పైకివచ్చి ప్రార్థన చేయమన్నారు. వారు నాలుగు పద్యాలు రాగవరుసను నాటక ఫక్కీలో పాడి, సభికులను ఆనందింప చేసి, కిందకు వెళ్ళిపోయారు. ఇంక సభాకార్యక్రమం యథావిధిగా జరిపించమని మునసబుగారితో మనవిచేసి, కార్యదర్శి గారు వేదికదిగి వెళ్ళిపోయారు.

మునసబుగారు లేచి రీవిగా నిలబడి రెండుపక్కలకూ ఉన్న కండువా మడతలు రెండు చేతులతోటీ పట్టుకుని ఒక్కమాటు గొంతు సవరించుకుని సభలోనున్న వారందరినీ కలియచూస్తూ. 'మహాజనులారా! నేడు చాలా సుదినం! మీరందరూ ఇంత ఉత్సాహంతో ఇక్కడకెందుకొచ్చారో నాకు తెలుసు, అనగానే ఎవరో ఒకతుంటరి 'నిజంగా అయితే ఎందుకొచ్చామో చెప్పండి' అన్నాడు.

'అదేనయ్యా చెప్పబోతున్నాను. మన ప్రాంతాలనుంచి ప్రప్రథమంగా సాహసోపేతంగా విదేశములకు వెళ్ళి, అక్కడ విద్యాభ్యాసం చేసి, విజయవంతంగా ఎమ్మే, బార్ ఎట్లా, పరీక్షలలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై, ఇంత మహా భయంకరమైన ఐరోపా సంగ్రామం జరుగుతూండగా, నిర్భయంగా, క్షేమంగా, మనదేశంలో మన ప్రాంతమునకు సురక్షితంగా తరిగి వచ్చిన మన పార్వతీశంగారిని చూచి ఆనందించి అభినందించడానికి మీరూ మేమూ కూడా ఇక్కడ సమావేశమయ్యాము వారు చాలా యువకులు, ఎప్పుడూ మన తాలూకాకూడా విడిచి వెళ్ళనివారు. ఇంత సాహసము నకు ఊహాతీతమైన విషయము. ఇంత పిన్న వయస్సులో కొన్ని వేల మైళ్ళదూరంలో దేశంకాని దేశంలో స్వదేశానికి కన్న తల్లిదండ్రులకూ ఇతర బంధు వర్గానికీ దూరమై, మనకట్టూ, మన బొట్టూ, మన ఆచార వ్యవహారములు లేనిచోట్ల ఏ బెంగా భయము లేకుండా, మూడు సంవత్సరాలు ఈయన అక్కడ సుఖంగా నిశ్చింతగా ఎలా కాలక్షేపం చేశారా అని అనుకుంటే, నాకే భయము వేస్తోంది. ఇది చాలా అపూర్వమైన విషయం! ఇది వారి ధైర్యసాహసాలకూ మనోనిశ్చలతకూ, కార్యదీక్షకూ

ఉదాహరణ. అందుకని, మన మధ్యకు వారి నాహ్వానించి, అభినందిస్తూ, ఆశీర్వదించడం మన ప్రధమ కర్తవ్యమూ, కనీస ధర్మమూను, వారు ఇన్ని సంవత్సరాలు ఆ దూర దేశాలలో వుండి కూడా మన వేష భాషలను మరవకుండా, దయచెయ్యడం చూస్తే, మనధర్మమునూ. మన సంస్కృతినీ మన జాతీయతనూ నిలబెట్టగలరనే ధైర్యం నాకు వారిని చూడడముతోనే కలిగింది. ఆ విషయములో వారు మనకు ఆదర్శ పురుషులు కాగలరు అని ఆశిస్తున్నాను. మనము వారి వలన వినవలసినవీ, తెలుసుకొనవలసినవీ తెలుసుకుని ఆచరించవలసిన విషయము లనేకములుంటాయి. అందుకని ఇక నేను అతిగా మాట్లాడుతూ కాలక్షేపం చేయకుండా చిరంజీవులు శ్రీ పార్వతీశంగారిని, వారి అనుభవాలూ, అభిప్రాయులూ, ఆదర్శలూ చెప్పవలసిందిగా కోరుతూ ఇంతటితో ఉపన్యాసము ముగిస్తున్నాను, అని వారి కోటు వగైరాలు సవరించుకుని కుర్చీలో సుఖాసీనులయ్యారు. జనసమూహం కరతాళధ్వనులు చేశారు.

# 8

సభంతా దద్దరల్లేటట్టు మోగుతున్న కరతాళ ధ్వనుల మధ్యను నేను లేవాలి కాబోలు భగవంతుడా అనుకుంటూ, ఈ జనసమూహం ముందు ఈ విద్యాధికుల ఎదుట, ఈ విద్వజ్జన సమక్షమందు నేను నిలబడి వారికి మల్లేనే చొక్కా కండువా సవరించుకొని, మహా మేధావిలా ముఖం పెట్టి గంభీరోపన్యాసం ప్రారంభిస్తే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో అనే ఊహకల్గి నాకు నవ్వు వచ్చింది. తలచుకుని సభలో శబ్దం సర్దుకునేవరకూ అలాగే కూర్చుని మళ్ళీ ముఖంలోకి గాంభీర్యం తెచ్చుకుని లేచి నిలబడ్డాను. నేను లేవగానే జనం మళ్ళీ కరతాళ ధ్వనులుచేసారు. దానితో మళ్ళీ సిగ్గుపడి సన్మానవహిస్తున్న పిరికితనాన్ని వెనక్కునెట్టి సభాధ్యైనమః అన్నాను. దానితో పూర్తిగా సభలో నిశ్శబ్దం ఏర్పడ్డది.

'మొన్నను హైస్కూల్లో నాతోనూ, నా వెనుకనూ చదువుతున్న విద్యార్థుల ఎదుట, నాకు విద్యనేర్పిన ఉపాధ్యాయుల ఎదుటను నిలబడి మాట్లాడ్డానికే గజగజలాడిపోయి, ఏదో నాకు తోచిన కబుర్లు కొన్ని చెప్పి బయటపడ్డాను. ఈనాడు మహా విద్వాంసులు, న్యాయశాస్త్ర నిష్ణాతులు, వయస్సులోనూ అనుభవంలోనూ పండిన పండితుల సమక్షమందు నిలబడి నేనేం చెప్పను? ఏ విషయాన్ని గురించి మాట్లాడ్డానిక నాకు అర్హతవు

న్నది? మీకంటే అధికంగా నాకు తెలిసిన ఏదేమిటి? అని ఇందాకటినుంచీ నన్ను నేను ప్రశ్నించుకుంటూ కూర్చుంటే, ఏమీలేదోయ్ ఈనాడు ఇది ఒక విచిత్రమైన ఆచారమేగాని, నీ సత్తాని, నిన్ను ఆహ్వానించిన వారికి తెలియదు గనుకనా, అనే సమాధానం స్ఫురించి ఇందాకట నుంచీ నాలో నేను నవ్వుకుంటూ కొంత ధైర్యం తెచ్చుకోడానికి ప్రయత్నం చేస్తు న్నాను. నాచేతను ఈ పనిచేయిస్తున్నది మీరే గనుక పిల్లవాళ్ళ ఆటలూ, అవకతవకలూ పెద్దలు చూచి ఆనందించునట్టుగానే, మీరు కూడా నామా టలలోని అసందార్భాలూ, అవకతవకలూ మన్నిస్తారని ఆశిస్తాను. నేనూ ఇక త్వరలోనే మీలో ఒకడిగా బహుశా ఈ కోర్టులోనే న్యాయవాదవృత్తి అవలంబిస్తానేమో? అప్పుడెన్నో విషయాలు మీ దగ్గర ఎలాగూ నేర్చుకో వలసి ఉంటుంది. అప్పుడు మట్టుకు ఆనాడేదో పెద్ద మొనగాడిలా మాకు ఉపన్యాసం ఇచ్చావు. మేము ఏమి చెప్పగలం? అని మట్టుకు అనరని ఆశిస్తున్నాను.' అనగానే సభలో కరతాళ ధ్వనులు.

మూడు సంవత్సరాల క్రితము ఇక్కడ నా చదువు సన్నగిల్లింది. మొదట్లో ఉన్న చురుకూ, ఉత్సాహమూ ఎందుచేతనో చప్పబడ్డాయి. ఇక్కడ విద్యమీద మనను నిలువక ఏవేవో వ్యూహలు పెంచుకుని ఆకాశంలో అస్తమానం విహరస్తూ వుండేవాడిని. మా తండ్రిగారు నా స్థితి గమనించి కొన్నాళ్ళు చదువుకు స్వస్తి చెప్పి ఇంటిదగ్గర వ్యవసాయపనులు చూసు కుంటూ తెలుగూ, సంస్కృతం నేర్చుకునే ప్రయత్నం చెయ్యమన్నారు. మళ్ళీ హూణ విద్యమీద మోజు కలిగినప్పుడు అదీ చదువుకోవచ్చునన్నారు. నేనే మాటా చెప్పలేని విషమసంధిలో పడి బాధపడుతుండగా, కీర్తిశేషు లైన, ఇక్కడ ప్రముఖులైన శ్రీ రమణారావుగారితో నాకు పరిచయమేమి అనుకోవచ్చు మీరు, ఒకరోజున వారే నన్ను వెతుక్కుంటూ వచ్చి నాకో సహాయము నీవు చెయ్యాలి. నీకుతప్ప మరొకరికి సాధ్యం కానిదది. ఇక్కడ కొన్ని రాజకీయ సభలు ఏర్పాటు చేయదలచుకున్నాము. ఆ సభా నిర్వ హణ బాధ్యత అంతా నీవే వహించాలి. నిన్ను గురించి వాకబుచేయగా నీవు చాలా సమర్థుడవనీ, ఈ కార్యభారం వహించడానికి మీ స్కూలులో నీ వొక్కడవే వీలైనవాడవని అందరివల్లా విన్నాను. అని నన్ను వ్యామోహపరిచి ఆ కార్యరంగంలోకి దింపారు. అప్పుడు నాకు తెలియులేదు కాని కొన్ని సంవ త్సరములైన తరువాతను ఆలోచించుకోగా నాకు తోచినదేమిటంటే మా స్కూలులో కాస్త కండపుష్టి, ఉత్సాహమూ, దీక్షా కలిగి చదువు యందు శ్రద్ధతగ్గి బేవార్సుగా తిరిగేవాడిని నేను ఒక్కణ్ణే కనపడ్డా నన్న మాట. ఏమైతేనేమి కానీ, వారి శిష్యుడుగా చేరి సభలూ, సమావేశాలూ ఏర్పాటు

చేయడమే కాక వారివలన అనేక విషయములు తెలుసుకుని, వారిచ్చిన వివిధ విషయములకు సంబందించిన పుస్తకములెన్నో చదివి, స్కూలులో నేర్పనివీ నేర్చుకొనుటకు సాధ్యము కానివీ అనేక విషయములు తెలుసుకుని, నాతోటి విద్యార్థులు కంటే చాలా విజ్ఞానవంతుడను కాగలిగాను అని చెప్పడానికి ఎంతో గర్విస్తున్నాను. నన్నింక ఇక్కడ స్కూలులో చేరవద్దనీ, విదేశములకు వెళ్ళమనీ, అక్కడ బారిష్టర్ చదవుమనీ, ప్రోత్సాహించిన వారూ వారే. వారి సలహా ననుసరించి నేను దేశాంతరములకు వెళ్ళి విద్య నభ్యసించి అక్కడ పరీక్షలలో ఉత్తీర్ణుడనై వచ్చిన వెంటనే వారి దర్శనము చేసుకుని వారి ఆశీస్సు పొందుదామనుకుంటే వారు దివంగతులయినా రన్న విషాద వార్త తెలిసి ఎంతో బాధపడ్డాను. ఈనాడు వారు ఇక్కడ లేకపోవడం నాకెంతో వెలితిగా ఉన్నది. అయినా వారికంటె వయోవృద్ధులూ, విజ్ఞానవేత్తలూ, న్యాయమూర్తులూ అయిన మన సభాధ్యక్షులను చూడగనే నా పిరికి తనం పరారికాగా కొంత ధైర్యము తెచ్చుకున్నాను. వారి ఎదుట నేను పసివాడను. నా లోపములను వారు సంతోషముతో మన్నించగలరు. అనే ధైర్యము కలిగినది. ఇక ముందు ఏమి చెప్పవలెనో తోచక ఇంతసేపూ నేను శాఖా చంక్రమణము చేస్తున్న సంగతి మీరు గ్రహించే ఉంటారు.

నే నెప్పుడూ నర్సాపురం పొలిమేర దాటని వాడను. బండీ, పడవా తప్ప, మరొక రకమైన ప్రయాణసాధనములను ఎరుగనివాడను, ధూమశకటాన్నైనా ఎప్పుడూ చూడని వాడను. సాహసించి విదేశ యాత్రకు బయలుదేరినానంటే అదే చాలా హాస్యాస్పదమైన హాస్యజనకమైన విషయమనీ, నేను వేరే చెప్పనక్కరలేదు. పట్టణాలలోనూ అందులో విదేశాల్లోనూ నాగరికత ఎంత ఎలా పెరిగిందో జీవితం సౌఖ్యవంతం చేసుకోవడానికి ఎన్నెన్ని ఉపాయాలూ, సాధనాలూ, విజ్ఞానవేత్తలు కనిపెట్టి ప్రజానీకానికి అందించగలిగారో, నేనెన్నడూ వూహించి కూడా ఎరుగను. అంతటి అజ్ఞాన తిమిరంలో పెరిగినవాడిని ఇలా బరితెగించి విదేశాలకు బయలుదేరటం సాహసమంటారా? కాదా? బయలుదేరిన తరువాతను నాకనుక్షణం కలిగిన అనుభవాలు, నేను చూచిన విశేషాలు, అన్నీ ఒకటొకటే మీకు వర్ణించి చెప్పకు రావలెనంటే చాలా కాలం పడుతుంది. అది నావలన అయ్యే పనికూడా కాదని నా నమ్మకం. అందుచేతను సూచన ప్రాయంగా ఏవో రెండు మాటలు మనవిచేసి మిమ్ములను విసిగించకుండానే విరమిస్తాను. అనేక మంది జనాన్ని ఏక కాలమందు కొన్ని వందల మైళ్ళు దివారాత్ర భేదము లేకుండా జాగ్రత్తగా తీసుకువెళ్ళగలిగిన మొదటి ప్రయాణయాంత్రిక

సాధనము రైలుబండి. మీలో చాలా మంది దాన్ని చూచి వుంటారు. ప్రయాణం చేసి వుంటారు. నాకటువంటి అనుభవం లేక ఆనాడు నిడదవోలులో పడ్డపాట్లు టిక్కట్లుకొనేటప్పుడూ, రైలు యెక్కేటప్పుడూకూర్చున్న తరువాత నే పడినపాట్లూ, ఇన్నీ, అన్నీ అని చెప్పనలవికాదు కానీ, ఆ ఒక్కరాత్రి ప్రయాణించి మద్రాసు చేరేటప్పటికి నాకెన్నో నూత్నాంశాలు అవగాహనలోకి వచ్చి అప్రయత్నంగా నాలో విజ్ఞానమూ నాగరికతా పెరిగినట్టుగా భావనకలిగింది. ఇక మదరాసులో గడిపిన కొద్దికాలంలో నే నెదుర్కొన్న సమస్యలు, చూచిన వింతలు నేర్చుకున్న విశేషాలు అనంతం అక్కడే రెండవ యాంత్రిక సామూహిక ప్రయాణసాధనం ట్రాంకార్ అనేది కనపడ్డది. అది కాకుండా ధనికులైన వ్యక్తులు ఒంటరిగానో తమ కుటుంబాలతోనో దూరప్రయాణాలు చేయడానికి అనుకూలమైన మరొక యంత్రసాధనం మోటారు కారు కూడా చూచాను. ఆనాడు నాతో మైలర్ హైస్కూలులో ఉన్న విద్యార్థులందరిలోనూ ఇటువంటి అద్భుతమైన మానవ నిర్మితమైన ఈ యాంత్రి సాధనములను చూచిన వారిలో ప్రథముడనునేనే అనుకొంటాను. అందు కానాడు నేను కొంచెం గర్వించి ఉంటాను కూడాను. మనదేశంలోనే ఆంగ్లము తెలుగూ కాక ఇతర భాషలు, జాతులు ఉన్నవని వినడమేకాని నాడు ప్రత్యక్షంగా మదరాసులో అరవగోడు వినే వరకూ మన భాషరాని చోట మెలగడం కొంచెం కష్టమే నని తెలుసుకున్నాను ఇక ముందు ముందు కూడా అనేక దేశాలలోనుంచి ప్రయాణం చేస్తుంటే ఎలాగా అనుకున్నాను.

మొగల్తుర్రులోనూ నర్సాపురంలోనూ ఉన్న కట్టడాలూ, మేడలూ, దేవళాలూ చూచి సంభ్రమాశ్చర్యాలతో వాటి ఎదుట నిలబడిపోయేవాణ్ణి. ఇక మదరాసులో ఉన్న ఉన్నత భవనాలు అత్యున్నత దేవాలయ శిఖరాలు చూచినపుడు నా ఆనందానికి, ఆశ్చర్యానికి మేరలేకపోయింది. ఏదేశము లోనైనా యింతకన్నా విశాలములూ, ఉన్నతములు అయిన ప్రసాదములు కానీ, సుందరములైన దేవాలయములుకానీ, విశాలములైన రాజమార్గములు కానీ, ఉంటవా అనిపించింది. ఈ భావం నా ప్రయాణము సాగినకొద్దీ, కొత్త కొత్త ప్రదేశాలు చూచినకొద్దీ ఒకదాన్ని మించి ఒకటి ఎప్పుడూ వుంటుంది, అని తెలుసుకున్నాను. ఎంత సౌందర్యం చూచిన సౌందర్యాని కదే పరమావధి అనుకోడానకి వీలులేదనిపించింది. అలానే వెళ్ళిన కొద్దీ దేశములలోనూ, మనుష్యులలోనూ మానవ నిర్మితాలలోనూ ఆఖరికి ప్రకృతిలో కూడా ఎంతెంత సౌందర్యం. వైవిధ్యం కనిపించిందో, చెప్ప శక్యం కాకుండా ఉంచె. ఒక దానినిపోలిన వస్తువు అనగా ఏదో కించిత్తు బేధం

లేకుండా నాకెక్కడా కనబడలేదు. ఒక రోజున స్కాట్లాండులో మెల్‌రోజ్ ఎబ్బే అనే పవిత్రశిధిల ప్రదేశం చూడడానికి వెళ్ళినపుడు అక్కడి కిటికీలన్నీ గాలి వచ్చేటట్లు జాలర్లులా రాతిలోనే చెక్కబడి వున్నాయి. ఒక కిటికీసీ పోలి మరొకటి లేదు. ఒక కిటికీలోని సగ భాగం ఒకరకంగా సగభాగం మరొక రకంగానూ కనబడ్డది. ఇదేమిటని మాతో కూడా వచ్చిన ప్రదర్శకుని అడగ్గా అది అంతేనండి వీటిని సృష్టించిన శిల్పి మహామేధావి. ఎప్పుడూ ఏదో కొత్త చూపిస్తాడేకాని చేసినదే మళ్ళీ చెయ్యడు. Genius does not repeat itself అన్నాడు. ఆ మాట వినడంతోనే మానవ మేధే ఇంత వైవిధ్యం చూపిస్తుంటే జగత్కారకుడైన సృష్టికర్త మన కళ్ళయెదుట కన బడే అనంతమైన రూపాలను ఒక దానిని పోలినది మరొకటి ఉండకుండా ఒక దానిలోనే ఇంకా సూక్ష్మమైన వైవిధ్యాలు ప్రతి నిత్యమూ సృష్టించి పడేస్తున్నాడంటే ఆశ్చర్యమేముంది? ఒక దేశాన్ని మించి మరోదేశంలో విశేషంగా ఉంటున్న నాగరికతా ఆచార వ్యవహారములూ భషా భేదాలు అనంతంగా కనబడుతూ వచ్చాయి. అవన్నీ వర్ణించడానకి ఇప్పుడు వ్యవధి చాలదు.

ఇంకా అక్కడ వారి జీవిత విధానమూ నాగరికతాగురించి రెండు మాటలు చెబుతాను. ఇవన్నీ మీకు తెలియనివికావు ఇటువంటివవేకం పుస్తకాలలో చదివి ఇతరులవల్ల వినివుంటారు కూడాను. అయినా అక్కడికి వెళ్ళి మొన్న మొన్ననే తిరిగి వచ్చిన మనిషి అనుభవాలు చెబుతుంటే ప్రత్యక్షంగా నేను చూచినవీ, అనుభవించినవీ చెబుతూంటే ఎక్కువ ఉత్సా హంగా వుంటుంది సంఘ వ్యవస్థ ఉన్నది. మనకు నాలుగు వర్ణాలు ఉన్నాయి. వాళ్ళకు నాలుగు వర్ణములతోటి సమానమైన అంతరువు లున్నాయి. వాళ్ళకు ప్రభువులు, ఉన్నతులైన మధ్యతరగతి, సామాన్య మధ్యతరగతి, నిరుపేదలుఅనే ఆర్థిక పద్ధతిని విభజింపబడిన నాలుగు తరగతులున్నాయి.

మన విభాగము సంస్కార విజ్ఞానముల మీద ఆధారపడ్డది. వాళ్ళది కేవలం ఐహికైశ్వర్యము మీదనూ, ఆర్థికాధిక్యం మీదనూ ఆధారపడి వున్నది. వీటి మంచి చెడ్డలను గురించి యిప్పుడు నేనేమీ చెప్పలేను. మన పరిపాలకులు పరాయి దేశస్థులు కావడంచేతను వారిననుసరించే రాజ్యాంగ విధానానికి, మనజీవితానికి పొంతన కుదరక మన సంఘ వ్యవస్థ కొంచెం అస్తవ్యస్తమవుతున్నది. అక్కడ పాలకులు, పాలితులు సజాతీయులు కావ డముచేతను,జీవిత విధానానికి రాజ్యాంగ విధానానికి పొరపొచ్చం లేకుండా సాఫీగా సాగిపోతున్నది.

ఆదేశం చూడగానే ఇది నాగరికత పెంచుకున్న దేశమని తెలుస్తుంది. అక్కడి మనుషులు, పద్ధతులు చూస్తుంటే జీవితానికి నాగరికతకూ ఎంత సన్నిహితమో కూడా తెలుస్తుంది. ఎక్కడికి వెళ్ళినా ప్రప్రథమంగా నన్నాకర్షించింది అక్కడ తీర్చిదిద్దినట్లు ఉన్న వీధులు, కట్టడాలు వాటి తీరుతెన్నులు. అక్కడ పరిశుభ్రతాను తరువాతను అక్కడ సంచరించే మనుష్యులు. రహదారిమీద పోయే వాహనాలు, పక్కను పథికులకు ఏర్పాటైన పేవ్‌మెంట్లమీద నడిచే జనంలో ఒకక్రమం, ఒకపద్ధతి కనిపిస్తుంది. బళ్ళు వాటి యిష్టమువచ్చినట్టు పరుగులెత్తడానికి వీలులేదు. ఎగువకు వెళ్ళేబళ్ళు అన్నీ ఒక వైపు, దిగువకు వెళ్లేబళ్ళు అన్నీ ఒక వైపు. ఆబళ్ళకు అడ్డుగా ఎక్కడా పశువులు గాడిదలు తదితర జంతువులు కానీ, రాజకీయాలు, గృహచ్ఛిద్రాలు, కామకలాపాలు గురించి నిలబడి మాట్లాడుకునే జనసమూహముకాని కనుపించదు. పేవ్ మెంట్లమీద నడిచే జనం కూడా క్రమపద్ధతినే నడవాలి. అడ్డదిడ్డముగా ఎవరూ నడవరు. ఇద్దరు ముగ్గురు కలిసి నడిచేటప్పుడు వారి అడుగులు సమానంగా పడుతూ ఉంటాయి. రోడ్డుమీద ఎక్కడా ఏవిధమైన చెత్తా చెదారం, ఉమ్ములూ, ఉచ్చలు వగైరా ఏమీ ఉండవు ఇది పట్టణాలలోనే కాకుండా ఎంత చిన్న పల్లెటూరు వెళ్ళినా ఈ పద్ధతులే అక్కడా ఆచరణలో ఉంటాయి. అనగా అక్కడ పల్లెలు కూడా పట్టణములు లాగానే ఉంటాయి. మన దేశంలో అది విరుద్ధం అక్కడి జనాభాకి సౌందర్య కాంక్ష ఎక్కువ. వారికి జీవితంలో అది ఒక భాగమేమో అనిపిస్తుంది.

సత్యం, శివం సుందరం అన్నారు మన పెద్దలు. శివం మాట శివుడికి తెలియాలి కాని సుందరం మట్టుకు పాశ్చాత్య జీవితంలో ఒక భాగమని ఒప్పుకోక తప్పదు. మనకూ సౌందర్యం ఒకప్పుడు మన జీవితంలో అంతర్లీనమయ్యే ఉండేది. ఇప్పుడు మట్టుకు అది మృగ్యమైంది. పాశ్చాత్యులు సౌందర్యాన్ని జీవితాంతర్భాగము చేసుకున్నట్టుగానే సత్యం కూడా నిత్యం అనుసరణీయమని నిశ్చయించుకున్నారు. సామాన్య మానవుడు మొదలు అన్ని అంతస్తులవారు సత్యాన్ని బహు శ్రద్ధగా పాటిస్తారు. ఆచరణలోకూడా పెడతారు. నిత్య జీవితంలో వ్యాపారాదులలో కూడా దీనిని పాటిస్తూండడం నేనెరుగుదును. అలాగని అందరూ అపర హరిశ్చంద్రులని నేననడంలేదు. పెద్ద పెద్ద వ్యవహారాలలోనూ, వ్యాపారాలలోను మోసం ఉంటుంది. ఉండకుండా ఎలా ఉంటుంది? వర్తకమూ, వ్యాపారమూ అంటే మోసం తప్ప మరొకటి కాదనీ మరొకలా ఉండటానికి వీలులేదనీ మన నమ్మకం. ఉద్యోగం సంగతికొస్తే మనవాళ్ళకు జీతం కాక పైన ఏమాత్రం

దొరుకుతుంది అనే ప్రశ్న ముందే బయలుదేరుతుంది. గుమాస్తా దగ్గర నుంచి ఉన్నతాధికారి వరకూ వారి అంతరువుకు తగినట్టుగా ఈ ప్రయత్నం ఉంటూనే ఉంటుంది. అన్నిటికంటే ఘెరమేమిటంటే, న్యాయస్థానాలలో న్యాయనిర్ణేతలలో కూడా ఈదౌర్బల్యం అక్కడక్కడ ఉన్నట్లు వినికిడి. ఆదేశంలో మట్టుకు ఆ హోదాలో ఉన్నవారిలో ఇటువంటి దౌర్బల్యం ఉన్నట్లు నేనెక్కడా వినలేదు.

ఆ హోదాలో ఉన్నవారు వారి నిత్యజీవితంలో కూడా ప్రజలెవ్వరూ తమని వేలెత్తి చూపటానికి అవకాశము లేకుండా నడుచుకుంటారని విన్నాను. లండన్‌లో ఉంటున్న ఒక జడ్జి బ్రహ్మచారి, చాలా ఋజువర్తనుడు, ధర్మపరాయణుడూను, ఒక రోజున ఒక క్షణిక దౌర్బల్యంలో తన వంటామెతో అక్రమసంబంధం జరిపాడనీ, ఆ ఉత్తర క్షణమందు తన తప్పు తెలుసుకుని పశ్చాత్తప్తుడై మరునాడు సెలవుపెట్టి వెంటనే ఆమెను వివాహము చేసుకుని తన తప్పును సరిదిద్దుకున్నాడనీ, ఒకవార్త విన్నాను. ఇంత ఋజువర్తనము మనదేశంలో ఎంతవరకూ సంభవమో ఆలోచించవలసి ఉన్నది.

ఈ రీతిగా సత్యమూ, సౌందర్యమూ మొదలైనవి జీవితంలో అంతర్భాగముగా చేసుకుని మన గలిగిన మానవులే నాగరికులని చెప్పడానికి వీలు అవుతుంది అంటూ మా ఉపాధ్యాయులు మాకు హితోపదేశము చేస్తూండేవారు. ఇకనక్కడనే చూచిన వింతలు, విశేషాలు, చాలా ఉన్నాయి. అవన్నీ చెబుతూ కూర్చుంటే ఇక్కడ వృధాకాలయాపన చేసి నట్లవుతుంది. మూడు సంవత్సరాలు పాశ్చాత్య దేశవాసము వల్లనే నేనన్నో విషయాలు నేర్చుకున్నాననీ, ఎన్నో ఉన్నత భావాలు కలిగినవనీ, అనుకుంటున్నాను. యదార్థం చేతను, అతి స్వల్ప విషయములు మొదలు మహత్తర విషయములవరకూ మనము వారివలన నేర్చుకొనవలసినవి యెన్నెన్నో ఉన్నాయి. వాటినన్నటినీ మరచి ఏ వస్త్రధారణలోనో, వేషధారణలోనో వాళ్ళను అవసరంగా అనుకరించి నాగరికులమని సంతృప్తిపడడం ఆత్మవంచనే కాగలదని నా అభిప్రాయము. అన్నిటికంటే మన దేశమునూ, మన విద్యనూ, మన సంస్కృతినీ మన మెంతగా యెలా గౌరవించవలెనో ముఖ్యముగా వారిని చూచి నేర్చుకోవలసి ఉన్నది. ఆయా విషయాలలో నిష్ణాతులైన పాశ్చాత్యులనేకులు మనదేశం వచ్చి మనకు పాఠాలు నేర్పుతూ ఉన్న విషయం మీకందరకూ విదితమే. ఇంతకన్నా యెక్కువగా మీ ముందర ఏమి చెప్పగలను? చెప్పిన దానిలో ఉన్న లోపములను మీరు మన్నిస్తారని ఆశిస్తూ

మీ రింత శ్రద్ధగా ఓపికగా నా నిస్సారమైన ఉపన్యాసమును విన్నందుకు మీ కనేక కృతజ్ఞతాభివందనములతో విరమిస్తున్నాను. 'వందేమాతరమ్' అని ఒక నమస్కారముతో సభికుల హర్షధ్వానాలమధ్య నేనేదో ఘనకార్యం సాధించాననుకుంటూ నా కుర్చీలో చతికిలబడ్డాను.

సభలో చప్పట్లు సద్దుమణగగానే సభాధ్యక్షుల వారు లేచి సభికుల తరఫున నా గంభీరోపన్యాసమునకు వారి హర్షామోదములు, ఆశీస్సులు అందజేస్తూ వారు ఉపన్యాసము ముగించారు. తరువాత సభా నిర్వాహకులు, బార్ కౌన్సిల్ కార్యదర్శిగారూ తమ హర్షమును కృతజ్ఞతనూ వెల్లడించి సభ ముగించారు.

నర్సాపురం హడావుడి అయిపోయిన తరువాతను వారం రోజుల వరకూ యెవరో ఒకరు విద్యార్థులో, ఉపాధ్యాయులో, లాయర్లో ఎవరికి తీరి కయినపుడు వారు వచ్చి నాతో కబుర్లు చెపుతూ, అక్కడవిశేషాలడుగుతూ వెడుతుండేవారు. ఈ రీతిగా నాకు కొంత కాలక్షేపం అవుతుండేది. ఇక క్రమేణా ఈ కాలక్షేపం కూడా లేక, ఏమీ తోచక, పొలం వెళ్ళి అక్కడపని వాళ్ళతో ఎలా మాట్లాడాలో ఎలా పని చేయించాలో తెలియక, ఏమీ తోచక రెండురోజులు యెక్కడికేనా పోదామని బుద్ధి పుట్టింది.

# 9

నేను బహిర్దేశమునుంచి అనగా విదేశాలనుంచి వచ్చిన తరువాత మా బంధువర్గాన్ని ఎవర్నీ చూడలేదు. నర్సాపురానికి సమీపంలోనే ఒక చిన్న పల్లెటూరులో మా పినతల్లి ఉన్నది. ఆమెను చూడవలెనని కుతూహలం కలిగి మా అమ్మతోటి చెప్పి ఉదయాన్నే లేచి అక్కడకు వెళ్ళాను. అదొక మారుమూల గ్రామము కావడంచేతను, నాగరికత చాలాతక్కువ నేను వస్తున్నానన్న మాట ఎవరో గ్రామస్తుల కెరుకపరచారు. ఆమాట వినగానే, ఊరంతా వీధిలోకి విరగబడ్డారు. అందులోనూ ముఖ్యంగా స్త్రీ విభాగం - సీమకు వెళ్ళినమనిషి ఎలా వుంటాడో అతడు కూడా దొరలా తెల్లగా పాలిపోయినట్లుంటాడా! వాడేం కట్టుకుంటాడో! మన మోస్తరుగా పంచకట్టుకుంటాడా, లేక దొరల మోస్తరుగా సూటూ, హేటూ బూటుతో ఉంటాడా! వాడు మనలాగే మన భాషలో మాట్లాడతాడా లేక మాతృభాష మర్చిపోయి, ఇంగ్లీషులో మాట్లాడతాడా? ఇంకా అనేకం వెర్రి సందేహాలు తోచి నన్ను చూస్తే ఈ సందేహాలన్నీ కాకపోయినా కొన్నేనా తీరుతవి కదా

ఆసీ, నా రాక కెదురుచూస్తూ నా వేషభాషల విషయంలో మార్పును గురించి పందాలు వేసుకుంటూ కూర్చున్నారు. తన కెవరు చెప్పారో చెప్పలేదో కాని, నేను సీమలో ఒక దొరసానిని పెళ్ళి చేసుకున్నాననీ, దానిని ఇక్కడకు తీసుకువచ్చి చెన్నపట్టణంలో దాచాననీ, రూఢైన వార్త




తనకు తెలిసిందనీ, ఒక బుద్ధిమంతుడు పుకారు పుట్టించాడు. అందు చేతను వాళ్ళు మరీ ఆదుర్దాగా నా రాకకు ఎదురుచూశారట. ఇంతకూ ఒకవేళ ఆ దొరసాని కూడా వస్తుందేమో! అది తెల్లగా వుంటుందో, మనవాడిని పెళ్ళి చేసుకున్న తరువాత కొంచెం రంగు ఏమైనా తగ్గిందో, అసలేం కట్టుకుంటుందో, మనవాళ్ళకి మల్లేనే అన్నీ ఇలాగే ఉంటాయో, ఉండవో, ఎలాగైనా ఒక్కసారి చూస్తే బాగుండును అనుకుంటూ యువక హృదయాలు దడదడ కొట్టుకో సాగినాయి. ఇదంతా నాకు తరువాత తెలిసిన విషయము.

నేనారోజు ఉదయమము సుమారు ఎనిమిదిగంటలకు ఆవూరు చేరాను. గ్రామంలో అడుగు పెట్టేసరికి గ్రామస్తులు కొత్తవాడిని ఇట్టే పసి కడతారు. నన్ను ఊరి పొలిమేరనే ఎవరో చూచి, ఊరిలోనికి పరుగెత్తుకుని వెళ్ళినా రాక క్షణంలో వూరందరికి ఉప్పు అందించాడు. నేను గ్రామంలో

అడుగుపెట్టేసరికి చూడండి మహాప్రభో! ఏ కలక్టరునో గవర్నరునో, చూడటానికి వచ్చినట్టు ఊరు, ఊరంతా విరగబడి బారులు తీర్చి నిలబడ్డారు, దారి ప్రక్కన. కొంచెము వయస్సు చెల్లిన స్త్రీలంతా, ఉభయపక్షాలవారూ, అనగా ప్రస్తుత సువాసినులూ, పూర్వ సువాసినులూ కూడా అరుగులమీద నిలబడ్డారు. పడుచుపిల్లలు కొత్త కోడళ్ళు గుమ్మాలలోనూ, కిటికీలదగ్గరగానూ నిలబడ్డారు ఇంతమంది ఇలా యెందుకు నిలబడ్డారో నాకు మొదట తెలియలేదు. ఎవరో కొందరు నా ప్రక్కను వెనుకా నాతోపాటు అడుగువేస్తున్నారు. ఇంతమంది స్త్రీ పురుషాదులు ఇలా ఎందుకు నిలబడ్డారో నా కర్థం కాక నా సరసను నడుస్తున్న పెద్దమనిషిని 'ఎవరైనా అధికారులు వస్తారాండీ ఈవేళ' అన్నాను. 'ఇలా యింతమంది గ్రామంలో ఉన్నవారంతా బారులుతీర్చి నిలబడ్డారేమిటి?' అన్నాను.

'ఎవరు రావడమేమిటి? మిమ్మల్ని చూడడానికే' అన్నాడాయన.

ఆ మాటవిని ఛాతీ వెడల్పైనట్టు, నేను నాలుగంగుళాలు పొడవెదిగినట్టూ చూస్తూ గ్రామస్తులర్పించే జోహారులందుకుంటూ, ఎలాగో మావాళ్ళ యిల్లు చేరుకున్నాను.

లోపలకు వెళ్ళి యోగక్షేమాలడిగి వాళ్ళందించిన నీళ్ళతో, కాళ్ళూ చేతులూ కడుక్కుని మండువా వాకిట్లోకి వచ్చేసరికి సావిటినిండా అరుగుల నిండా జనం అన్ని రకాలవారూ, అన్ని వయస్సులవారూ, కిటకిటలాడుతూ కూర్చున్నారు. ఎందుకలా కూర్చున్నారనుకున్నాను. కొంపతీసి ఇప్పుడేమన్నా ఉపన్యాసము ఇమ్మంటారేమోనని భయపడ్డాను. కానివాళ్ళు ధర్మమా అని మాటాడకుండా, నాకేసి నిదానంగా చూస్తూ అలాగే కూర్చున్నారు. రెండు మూడు నిమిషములు తరువాతను ఒక ముసలాయన నెమ్మదిగా గొంతు సవరించుకుని.

'శాస్త్రుల్లుగారు (అనగా మానాయనగారు) చాలా అదృష్టవంతులు' అని ఆరంభించారు.

'వారికేమండి యిటువంటి కుమారుడు......" అని యింకొకడు అందుకున్నాడు.

'ఆ నెమ్మదీ, ఆ సుగుణ సంపత్తి' అని మరొకరు.

ఇలా రకరకాలుగా కొంతసేపు నన్ను స్తోత్రం చేశారు. నాకు ఒక పక్కన నవ్వూ మరొక పక్క సిగ్గూను చచ్చిచెడి ఎలాగో ప్రాణాలుగ్గబట్టి రాచ పెళ్ళికొడుకుల కొయ్యబారిపోయి అలాగే కూర్చున్నాను.

అక్కడి నుంచి ఒకరొకరే ఏదో ఒక వెర్రి మొర్రి ప్రశ్న అడగడ మారంభించారు.

'అయితేనండి అక్కడ కూడా ఇక్కడలాగే ఉంటుందాండీ' అక్కడ వాళ్ళు బట్టలు కట్టుకుంటారాండీ అని ఒకతను.

'కట్టుకుంటారయ్యా, కట్టుకోకపోతే చూడలేక మనమూ, చలి భరించలేక వాళ్ళూ చచ్చిపోతారు' అన్నాను.

ఆహాఁ అదికాదండీ వాళ్ళూ మనికిమల్లేనే పంచెలు, చీరెలు కట్టుకుంటారా? లేకపోతే అవేవో తొడుక్కుంటారా అన్నాడు.

'అయ్య బాబయ్య! బాబూ. మరయితే ఎలాగండి! తమకి మట్టుకు సలెయ్యలేదా' అన్నాడు.

'వెయ్యకపోవడం ఏం కర్మం! నేనూ గజగజలాడి పోయాను. వెంటనే ఆ దేశ పద్ధతిని రెండు సూట్లూ, కోట్లూ వగైరా కుట్టించుకున్నాను. మనలో మనమాట అసలు ఏమీ కట్టుకోకుండా ఉండేచోట్లు కొన్ని ఉన్నాయి ప్రపంచంలో లేకపోలేదు' అన్నాను.

'అయ్యబాబోయ్. మరయితే అక్కడ అంతా ఆడా, మగా అందరూ అంతేనాండీ' అన్నాడు గుండెబాదుకున్నట్టు.

వాడి వైఖరి చూచి నవ్వుకుని వాడేదో రహస్యంగా నా దగ్గరకు వచ్చి ఆ వూరేదో తెలుసుకుని అక్కడికి ప్రయాణం కట్టేటట్టున్నాడు నుకున్నాను. అది చాలా వేడి దేశం. వాళ్ళు ఒట్టి అడివిజాతివాళ్ళు, అనాగరికులు, ఇంకా సిగ్గనీ శరీరంలో కొన్ని భాగాలు గుప్తంగా దాచుకోవలెననీ వాళ్ళకి తెలియదు. అంటుచేతను వాళ్ళకేమీ ఎబ్బెట్టుగా ఉండదు అన్నాను.

ఈ ధోరణి కొంత మార్చవలెననే ఉద్దేశంతో ఒక పెద్దతను 'బాబూ అక్కడ వర్షాలు కురుస్తాయాండి అన్నాడు.'

'ఆ' అన్నాను.

'అయితే మనకుమల్లే పాడీ పంటా అవీఉంటాయన్నమాట. అస్ అబ్బా?' అని ఆశ్చర్యం వెల్లడించాడు ఒకతను.

"అయితే బాబయ్యా. నేను యెర్రిముండావాడిని, తెలీక అడుగుతున్నాను. కానీండి, అక్కడ కూడా పెళ్ళిళ్ళు చేసుకుంటారాండి" అన్నాడు.

నాకు వళ్ళు మండింది. 'పెళ్ళిళ్ళూ గర్భాదానాలూ సమస్తమూ చేసుకుంటారు. పిల్లలు కూడా పుడతారన్నాను.'

'అయితే ఆ పిల్లలు కూడా ఇంగ్లీషే మాట్లాడుతారు కాబోలేమండి. అయినా అంత పుట్టినప్పటి నుంచీ ఎంత దొరలైతే మట్టుకు ఇంగ్లీషు ఎలా వస్తుందో'నని అతననగానే, అతనితోపాటు అంతా ఆశ్చర్యపోయారు.

ఈ ప్రశ్నలన్నీ మావూరు వాళ్ళూ అడిగారు ఏవూరు వెళ్ళినా ఇంకా ఇలాంటివే అడుగుతారు కాబోలు అనుకుంటూ వారి అమాయ కత్వానికి నేను కొంచెం నవ్వుకున్నాను. వారు పాపం అడగవలసిన ప్రశ్నలు ఇంకా అనేకమున్నా ఆ రోజుకు అంతా సెలవు తీసుకున్నారు. ఇలా రోజూవచ్చి యిక్కడున్నన్నాళ్ళూ నన్ను చిత్రవధ చేస్తారు. ఏమిటి? అని హడలి పోయాను.

మరునాడు లేచి స్నానానికి చెరువు దగ్గరికి వెళ్ళాను. అప్పటికి కొందరు యువతులు తలొక బిందె చంకను పెట్టుకుని వయ్యారంగా వచ్చారు. నన్ను చూసి సిగ్గుపడి కొంచెం దూరంగా ఒక్క క్షణం నుంచుని, వాళ్ళు నెమ్మదిగా నీటిలోకి దిగారు. వాళ్ళ వయ్యారమూ, వాళ్ళ సౌందర్యమూ, వాళ్ళ లజ్జా చూస్తూ ముగ్ధుడనై మన పల్లెపడుచులలో కూడా యెంత లావణ్యమూ, నాజూకూ, వున్నదో అనీ, ఆశ్చర్యపోతూ నీళ్ళలో నెమ్మదిగా అటూ, ఇటూ ఈదుతూ, తేలుతూ, మునుగుతూ, కాలయాపన చేయటం మొదలెట్టాను.

ఆడవాళ్ళంతా స్నానాలుచేసి కబుర్లు చెప్పుకుంటూ మందహాసాలతో నెమ్మదిగా ఇళ్ళకు బయలుదేరారు. వీళ్ళింత చిన్నతనంలో ఇంత బరువు బిందెలు ఎత్తుకుంటూంటే నాకు మనస్సు చివుక్కుమన్నది. పోనీ ఆ బిందెలు నేనెత్తనా అందామనుకున్నాను. కానీ నేను మట్టుకు ఎన్ని బిందెలు మోసుకుపోగలను! ఎంతమంది చంకలకు అందిస్తూ నిలబడగలను? అందుకని ఊరికే జాలిపడుతూ మౌనంగా వాళ్ళకేసి చూస్తూ, నీళ్ళలో నిల బడ్డాను. అందరూ గట్టుమీదకి వెళ్ళారు. ఒకమ్మాయి మట్టుకు సుమారు పదిహారేళ్ళు ఉంటాయి. పలుచగా కుందనపు బొమ్మలా ఉన్నది. పాపం ఆ అమ్మాయి బిందె ఎత్తుకోలేక ఎంతో అవస్థపడుతూ ఉన్నది. కాస్త చెయ్యి ఇమ్మని తోటివాళ్ళను పిలిస్తే వినిపించుకోకుండా ముందుకు సాగు తున్నారు. నాకాపిల్లని చూస్తే జాలివేసింది. ఆలోచించకుండా ఒక్కడుగు ముందుకు వేసి.

"ఉండమ్మా నేను సహాయం చేస్తా నన్నాను."

ఆ అమ్మాయి ముఖం సిగ్గుతో కందగడ్డలా ఎర్రబడ్డది.

"వద్దనీ" అని అనవలెనని ప్రయత్నించింది. కాని నోటమాట రాలేదు. నిశ్శబ్దంగా పెదవులు మట్టుకు కదిలినాయి. నేనిదేదీ గమనించినట్టు, ఒకపక్కను బిందెపట్టుకుని భుజంమీదకు ఎత్తుకోడానికి సహాయం చేశాను. గత్యంతరం లేక హడలిపోతూ ఆ అమ్మాయి నా సహాయముతో బిందెను భుజాన అమర్చుకున్నది. ఆ బిందె భుజాన కెత్తేటప్పుడు నాచేయి పొరపాటున ఆమెకు తగిలింది పాపం. ఆపిల్ల గజగజలాడిపోయింది. బిందెకిందపడేస్తుందేమో అన్నంత భయం వేసింది నాకు. ఈ పిల్లరావడం లేదేమో అని తోటివాళ్ళంతా ఒక్కసారి వెనక్కి తిరిగి చూశారు. నేను బిందె పట్టుకుని సహాయం చేయడం చూచి నిర్ఘాంతపోయారు. ప్రపంచమంతా ఒక్కసారి చైతన్యం ఉడిగిపోయినట్లయింది. ఈపిల్ల నుద్దేశించి సీతా! అని ఒక కేకవేసిందొక అమ్మాయి! హడలిపోతూ ఈపిల్ల తలవంచుకుని గబగబ నడిచింది. ఇంకేముంది? క్షణంలో ఈ వార్త గాలిలో పాకిపోయింది. నామీద సదభిప్రాయం కొంత త[illegible] గ్రామానికి.

దీనితో ఊళ్ళో రెండు పార్టీలుగా ఏర్పడ్డవి. పెద్దవాళ్ళు స్త్రీ పురుషులంతా ఒకటి. కుర్రకారంతా ఒకటి. వాళ్ళు నా పక్షమన్నమాట. వాళ్ళందరికీ నామీద వొక విధమైన అభిమానం ఏర్పడ్డది. కుర్రకారులో మొగవాళ్ళు అస్తమానం నాతోటే కాలక్షేపం. నే నా కబుర్లూ, ఈ కబుర్లూ చెబుతుంటే అందులోనూ విదేశాలలో ఆడవాళ్ళు సంగతులు వర్ణిస్తుంటే వాళ్ళకు మరీ హుషారుగా ఉండేది. ఇది జరిగిన ఒకటి రెండు రోజులు తరువాత మళ్ళీ చెరువు దగ్గర నేనూ మరికొందరు కుర్రాళ్ళు స్నానాలు చేస్తున్నాము. ఆడవాళ్ళు పెద్దవాళ్ళు చాలామంది తొందరగా స్నానాలుచేసి నీళ్ళు తీసుకువెడుతున్నారు. నేను ఒళ్ళు తుడుచుకుంటున్నాను. ఇంతలో ఒక వితంతువు సుమారు పాతికేళ్ళ మనిషి. నా వైపు తిరిగి కేకేసి, ఒక మందహాసం విసురుతూ, సిగ్గునభినయిస్తూ.

'కాస్త ఈబిందె ఎత్తుదూ నాయనా! నాకు చెయ్యి బొత్తిగా స్వాధీనము లేకుండా ఉన్నది.' అన్నది అర్థోక్తితో.

అంతమంది ఆడవాళ్ళు వున్నంతసేపూ వాళ్ళ నెవళ్ళనీ సహాయమడక్కూడదా అనుకున్నాను.

'నేను వస్తున్నాను'. అన్నది నెమ్మదిగా ఒకావిడ.

నాకేమీ తోచక ఒక క్షణం తటపటాయించాను.

ఏమబ్బాయీ! దిక్కుమాలిన దాన్ని అవసరానికి అసరా అడిగాను కదా? కాస్త చెయ్యి వెయ్యకూడదూ! అవును నేనేమీ చిన్నపిల్లనా? చక్కనిదాన్నా! అన్నది సన్నాయి నొక్కులు నొక్కుతూ.

అమ్మ నీ తస్సాగొయ్యా ఎంతమాటన్నావు. అనుకుని ఆవిడ కోరిన సహాయం చేశాను. వూళ్ళో ఆవిడచాలా ప్రసిద్ధురాలనీ గ్రంధసాంగురాలనీ నాకు తరువాత తెలిసింది. ఇంకేముంది? నాఖ్యాతి ఈదెబ్బతో గ్రామం నలుదిశలూ వ్యాపించింది.

కాని నా స్నేహితులు మట్టుకు నన్ను విడిచిపెట్టలేదు. నా ధైర్య సాహసాలు మెచ్చుకుని నాకు మరింత సన్నిహితులు అయినారు. వాళ్ళ ప్రోత్సాహం మీద ఒకటి రెండు ఉపన్యాసాలు కూడా ఇచ్చాను. ఆ వూళ్ళో స్త్రీ లకు కూడా ప్రత్యేకించి ఏదో ఒక ఉపన్యాసం ఇమ్మన్నారు. అలాగే వాళ్ళకూ చెప్పవలసిన విషయాలు చాలానే ఉన్నాయి కాబట్టి స్త్రీలకు వేరే సభ ఏర్పాటు చేయమన్నాను. మా మిత్రుడు ఆ సభ ఏర్పాటుకు ఎంత ప్రయత్నం చేసినా పడుచువాళ్ళను పంపడానికి పెద్దవాళ్ళు ఎవ్వరూ ఎప్పకోలేదు. 'ఇక ముసలివాళ్ళకు ప్రత్యేకించి నేను చేయవలసిన వేదాంత బోధలేమీలేవు పొమ్మ'న్నాను.

అక్కడున్నన్నాళ్ళూ నన్ను విడిచిపెట్టకుండా, ఇరవై నాలుగు గంటలూ నా నీడలో తిరుగుతుండేవాడు సత్యం అనే కుర్రవాడు. నేనస్తమానమూ వాళ్ళింటికి వెడుతూ వస్తూండేవాడిని, అతనూ బి.ఏ. ప్యాసయినాడు. ఆధునిక భావాలు చాలా కలవాడు. అతని భార్య చక్కని చుక్క. ఆమె అంటే అతనికమితమైన ప్రేమ. ఆవిడకు చాలా స్వతంత్రమిచ్చేవాడు. తల్లికెంతమాత్రమూ ఇష్టము లేకపోయినా ఆ భార్యాభర్తలిద్దరూ ఏమీ ఎరమరిక లేకుండా నాతో చాలా చనువుగా ఉండేవారు.

ఒక రోజు మధ్యాహ్నం వారింట్లో కూర్చున్నాను. ఆ పూట ఆ అమ్మాయి, పుట్టింటికి వెడుతూ ఉన్నది. రెండెడ్లబండి వీధిలో నిలబడి ఉన్నది మూటా, ముల్లెకట్టుకుని ఆవిడ లోపల సిద్ధంగా ఉన్నది. ఆ అమ్మాయి భర్తా, నేనూ సామాను బండిలో పెట్టాము. మీకూడా ఎందుకండీ ఈ శ్రమ అంటూ అతను చాలా మొహమాటం కూడా పడ్డాడు. ఇంకొకటి రెండు వస్తువులు వుంటే, తేవటానికి అతను లోప లికి వెళ్ళాడు. బండి ఎక్కడానికి ఆ అమ్మాయి వీధిలో బండి దగ్గరకు

వచ్చింది. అత్తగారు వెనకాల గుమ్మం దగ్గర నిలబడ్డది. ఇరుగుపొరుగు వాళ్ళు కొంత మందీ, ఎదుటి యిళ్ళవాళ్ళు, పక్క ఇళ్ళవాళ్ళూ స్త్రీలూ, చాలామంది వాళ్ళ వాళ్ళ అరుగులమీద నిలబడ్డారు. నేను బండికి దగ్గరనే వున్నాను. ఆ అమ్మాయి బండి ఎక్కాలని రెండుమూడుసార్లు ప్రయత్నించి ఎక్కలేక అవస్థపడుతున్నది. కుర్చీపీట తీసుకురమ్మని అత్తగారు లోపల నున్న కొడుకును కేకవేసింది.

'ఎందుకమ్మా! ఎక్కు నేనున్నానుగా' అని క్షణంలో అత్తగారు ఆఁ అని వారించడానిక్కూడా వ్యవధిలేకుండా, నేను వెనుక నుంచి అమాంతం ఆ అమ్మాయి నడుము పట్టుకుని బండిలోకి ఎక్కించాను. ఇలా జరుగుతుందని అక్కడున్న ఏ ఒక్కరూ ఊహించలేకపోయారు. నేనూ అనాలోచితంగా పాశ్చాత్య పద్ధతిలో ఆ అమ్మాయి, నా చెల్లెలో మరో సన్నిహిత బంధువో అయినట్టు భావించుకుని, ఈ సహాయం చేయవలెనని తోచి, అలా చేశాను. అత్తింటి కాపురం చేస్తున్న పిల్ల. స్వంత చెల్లెలైనా, అలా ఎత్తుకుని బండి ఎక్కించటం, మన పద్ధతులకు విరుద్ధమన్న సంగతి ఆ క్షణంలో నేను విస్మరించాను. అది నావల్ల వచ్చిన పొరపాటు. పిల్ల సిగ్గుతోనూ, భయంతోనూ నోరెత్తలేకపోయింది. అత్తగారు అగ్నిహోత్రమైపోయింది. ఇరుగుపొరుగు వారంతా ఏకగ్రీవంగా.

'అయ్యో వాడి సాహసం మండా' అన్నారు.

ముసలావిడ 'పార్వతీశం నీకేం పొయ్యేకాలం' అన్నది నిప్పులు కక్కుతూ.

నేనూ నా తప్పు తెలుసుకుని హడలెత్తినాకు మరొక దురుద్దేశం ఏమీ లేదని చెప్పడానికి కూడా నోరు రాక అక్కడున్న ఎవ్వరికేసి చూడలేక, తలవంచుకుని యింటికి వెళ్ళిపోయాను. నాకంటే ముందే ఈవార్త మాయిల్లు చేరింది.

మాపిన్ని నన్ను 'ఇన్ని దేశాలూ, ఇన్నేళ్ళూ తిరిగి, ఇంతడబ్బూ తగలేసి, ఇదిట్రా నువ్వు చదివిన చదువూ నీ చదువు <u>చట్టుబండలు</u> కానూ! ఎంతపని చేశావురా పట్టపగలూ! ఎంత సిగ్గులేక పోయిందదిరా! వాళ్ళ మొహం ఎలా చూడనురా! నాతల ఎక్కడపెట్టుకోనురా! అంటూ శోకాలు తీస్తూ ఆ రాగవరసనే నాకు తలవాచేటట్టు నాలుగూ పెట్టింది.

కాస్సేటికి నా స్నేహితుడూ, అగ్ని పర్వతంలా చక్కావచ్చాడు. నన్నుచూచి,

నువ్వింత బద్మాష్వని అనుకోలేదు. ఈమాటు నీవు నాగుమ్మం తొక్కితే చంపేస్తాను' అని అక్కడ నుంచోకుండా పరిగెత్తాడు.

నాకు నవ్వాలో, ఏడవాలో తెలియలేదు. కథ యిలా అడ్డంగా తిరిగిందేమా అనుకున్నాను. అనాలోచితంగా చేసిన ఈ చిన్నపని ఎంతపని చేసింది? వాళ్ళందరూ ఒక్క క్షణంలో నాపై యెంత నింద మోపారు. అనుకుంటూ నా స్నేహితుడికి నాఅభిప్రాయమంతా విశదంగా ఉత్తరం వ్రాసి ఆ రోజుననే ఆ గ్రామం నుంచి మకాము ఎత్తేశాను. మంచికిపోతే చెడు ఎదురు అవుతుందంటారు ఇదే కాబోలు. మనవాళ్ళ వ్యవహారమంతా ఇలాగే వుంటుంది. పోనీ పల్లెటూరని సరిపెట్టుకుందామా అంటే, పట్నవాసాలలో మట్టుకు ఇంతకంటే ఉన్నత భావాలు ఉండివచ్చినాయా అనుకున్నాను. మొన్న నర్సాపురంలో జరిగిన సన్మానాలూ, ఈనాడు ఇక్కడ ఈ అవమానాలు, ఇదే కాబోలు జీవితం.

ఆ సాయంకాలానికి నెమ్మదిగా నర్సాపురం చేరుకున్నాను. అప్పూటి ఇంటికి వెళ్ళబుద్ధికాలేదు. ఆ గ్రామంలో నేను చేసిన పని తప్పు అని కానీ, దూష్యమనీ కానీ యిప్పటికీ నేననుకోలేకుండా ఉన్నాను. ఒక మర్యాద పూర్వ్తాన, ఏ దురుద్దేశమూ ఎంత మాత్రమూ లేకుండా అనాలోచితంగా చాలా సహజం అనుకొని చేసిన పని ఇటువంటి విపరీత పరిణామానికి దారి తీస్తుందని ఊహించలేకపోయాను నేను. మూడు సంవత్సరముల నా జీవనములో కొన్ని వేల సంవత్సరాల మన నాగరికతను అధిగమించి బహుశా మనమింకొక శతాబ్దిలో కాని సాధించలేని ప్రగతిని ఈమూడు సంవత్సరాలలోనూ కొంతవరకు నేనందుకోగలిగాను కాబోలు. ఈ విషయము అవూరు వాళ్ళకు తెలియపరచటమెలాగు? [illegible] కథ కల్పించానమకుంటారు గానీ, నామనోభావం వాళ్ళేలా గ్రహించగలరు. ఈ సంఘటనలతో నా మనస్సు ఎంత వికలమైనదో నాకే ఆశ్చర్యంగా ఉంది. ఏ సందర్భంలోనూ, ఎన్నడూ ఇంత మనోవేదన పొందిన జ్ఞాపకం లేదు. ఆ గ్రామస్థుల దృష్టిలో ఈ కళంక[illegible]. ఏం చెయ్యను? ఇంక నా గ్రామంలో [illegible] లారా పోగొట్టుకున్నాను. నేను అయితే మట్టుకు ఏంచెయ్యను! చేసినది అనుభవించక తప్పదుకదా అనుభవిస్తాను. నాకేమీ అభ్యంతరములేదు. అభ్యంతరమున్నా తప్పదు కానీ, ఆ పిల్లను. దేవతలాంటిదాన్ని అమాయకుడైన భర్తా మూర్ఖురాలైన అత్తగారూ, ఎన్ని విధాలుగా క్షోభపెడతారో! అంతకంటే పరమమూర్ఖులైన ఆ గ్రామీణ స్త్రీ జనం మరీ కాకుల్లా

పాడిచేస్తారు పాపం.

ఈ మనస్సుతో, ఈ వేదనతో ఇంటికి వెళ్ళవెలెననే బుద్ధిపుట్ట లేదు. ఆ రాత్రి అక్కడే ఒకస్నేహితుడింట్లో పడుకున్నాను. అతను చాలా సంతోషించాడు. రాత్రి యెంతోసేపు కబుర్ల మధ్యను నా గొడవ కొంత మర్చిపోగలిగాను. మరునా డుదయాన్ని వెళ్ళిపోతానంటే ఎన్నో విధాలా నన్ను కడుపు కాళ్ళూ పట్టుకుని బ్రతిమాలి అక్కడే ఉంచేశాడు. నా స్నేహితుడు. అప్పటికి చాలా వరకూ మామూలు మనిషినయ్యాను. అఖరికెలాగో అతనికినచ్చచెప్పి స్వగ్రామం చేరుకున్నాను.

నేను మా పిన్నిగారివూళ్ళో చేసిన ఘనకార్యం మాగ్రామానికి టెలి గ్రాఫ్ సౌకర్యం లేకపోయినా, ఎలాగో నాకంటే ముందే మా వాళ్ళకు తెలిసిపోయింది. మా గ్రామస్థుల కెంతమందికి తెలిసిందో ఇంకా అంచనా తెలియలేదు. నేను స్నానం గీనం చేసి కూర్చున్న కొంత సేపటికి, మా నాన్న పొలం నుంచి వచ్చి,

'ఏమిరా అబ్బాయీ ఎప్పుడొచ్చావు ఊరునించి, మీ పిన్నీ వాళ్ళూ కులాసాగా ఉన్నారా, నువ్వు తిన్నగా అక్కడ నుంచేనా రావడం? విశేషా లేమీ లేవు కదా' అని గబగబా నా సమాధానానికి అగకుండా నా కేసి తీక్షణంగా చూస్తూ అడిగారు. ఆయన ముఖకవళికలను బట్టే, ఆయనడి గిన ధోరణినిబట్టి కొంతవరకు జరిగిన సంగతి ఊహించుకున్నాను. ఏమి సమాధానము చెప్పడమా, ఎలా చెప్పడమా అని ఒక్కక్షణం ఆలోచిస్తూంటే కొన్ని విషమ పరిస్థితులలో జరిగినది జరిగినట్లు చెప్పడమే ఉత్తమ పద్ధతి : honesty is the best policy అనే ఆంగ్లసామెత నాకు జ్ఞాపకం వచ్చి, ఆ పద్ధతే అవలంభించాను.

నే నిప్పుడు రావడం నర్సాపురం నుంచి, నాన్నా, పిన్నిగారి ఊరి నుంచి అక్కడికి వచ్చి అప్పడే మూడురోజులైంది. పిన్నిదగ్గర ఇంకో వారం రోజులు ఉందామనే అనుకున్నాను. కానీ, నాలుగు రోజుల క్రితం ఒక విచిత్ర సంఘటన జరిగింది అని ప్రారంభించాను.

ఇంతవరకూ నిలబడి ఉన్న మా నాన్న మాట్లాడకుండా కూర్చు న్నాడు. ఒక అక్షరమేనా విడిచిపెట్టకుండా, నేను అవూరు వెళ్ళింది మొదలు అవూరు విడిచిన క్షణం వరకూ, సమస్తమూ వివరంగా వర్ణించి చెప్పాను. మా నాన్న సమాధాన మేమీ లేకుండా ఒక్కక్షణం ఊరుకుని,

'నువ్వు అయితే ఇంకా లండన్‌లోనే ఉంటున్నానని అనుకుంటున్నా

వన్నమాట. స్వదేశానికీ, స్వగ్రామానికీ వచ్చిన విషయం జ్ఞప్తిలోలేదన్ని మాట' అన్నారు.

'లేదు నాన్నా అన్నీ జ్ఞాపకం ఉన్నాయి. ఎలా మర్చిపోతాను? ఎటొచ్చీ నావల్ల వచ్చినది ఒక్కటే పొరపాటు నాన్నా. ఈ మూడుసం వత్సరములలోనూ నేను విదేశాలలో చూసిన నాగరికత ఇక్కడ వచ్చి ఉంటుందని అనుకున్నాను. ఈ సంఘటన జరిగిన ఉత్తర క్షణంలో నేను పొరపడ్డాననీ, మన మింకా యథా ప్రకారంగా ఆధునికతకు కొన్ని శతాబ్దాలు వెనుకనే ఉన్నామని తెలుసుకున్నాను. అది ఒక్కటే నావల్ల వచ్చిన పొరపాటు. అందుకు నేను క్షంతవ్యుడనో, కానో పెద్దలు మీరు నిర్ణయించాలి. శిక్షార్హుడనే అయితే ఏ శిక్ష విధించినా, ఏ ప్రాయశ్చిత్తము సూచించినా, అన్నిటికీ సిద్ధం, మీ దయ' అన్నాను.

మా నాన్న ఒక్కక్షణం ఊరుకుని దానిలో శిక్షకూ ప్రాయశ్చిత్తానికీ ఏమున్నది? నీవు చేసినది పొరపాటే కాని తప్పని నేను మట్టుకు ఎలా అనగలను? నీవు ఆ పిల్లను ఎత్తి బండిలో కూర్చోపెట్టడం కూడా తప్పని నేను అనను. కాని నీ మానసిక పరిణామము, పరివర్తనా అందరికూ వచ్చి ఉంటుందనీ అనుకోవడమే తప్పు. ఆ క్షణంలో ఇది కూడా వూహించుకోడానికి నాకు వ్యవధిలేక పోయింది. అంతే కొన్ని వందల శతాబ్దాల నాగరికత, ఆచార వ్యవహారాలూ, సాంఘికనియమములూ దేశమంతటా ఒక రోజులోగానీ, ఒక శతాబ్దంలోగానీ, మారుతవి అని అనుకోడానికి సావకాశంలేదు. సరే అయినదేదో అయింది. దాన్ని గురించి నీ వేమీ ఆలోచించనూ అక్కరలేదు. బెంగపెట్టుకోనూ అక్కరలేదు, అని వెంటనే లేచి స్నానానికి వెళ్ళిపోయారు.

# 10

సుమారొక వారం రోజులు వీధిమొహం చూడకుండా ఇంట్లోనే కూర్చుని గ్రంథపఠనంతో కాలక్షేపం చేసుకున్నాను. ఒకరోజు మధ్యాహ్నం సుమారు మూడుగంటలవేళ నేనేదో చదువుకుంటూంటే మానాన్న ఎందుకో నన్ను కేకవేశారు. ఎందుకా అనుకుంటూ పుస్తకం చేత్తోపట్టుకునే,

'పిలిచారానాన్నా' అంటూ సావిట్లోకి వచ్చాను. అక్కడ మా నాన్నే కాకుండా, పరాయి పెద్దమనుషులు ఏవరో యిద్దరు కూర్చున్నారు.'

'పిలిచాను. రా ఇలారా! ఒక క్షణం ఇలా కూర్చో' అన్నారు మా నాన్న.

ఏమిటా! ఈ వచ్చినవారెవరా, అని ఆలోచిస్తూ కూర్చుని వారి ముఖాలకేసి చూశాను. వాళ్ళూ నన్ను ఆపాద మస్తకమూ పరీక్షగా చూస్తున్నారు. ఎందుకో! మా నాన్న యిదుగోనండీ ఇతనే మా అబ్బాయి, అని వారితోను - వీరు సూర్యనారాయణ శాస్త్రులుగారని నిన్ను చూడ్డానికొచ్చారు. వారు సంపన్న గృహస్థులు. పెద్ద ప్రతిష్ఠగల విద్వద్వంశీయులు. వారు స్వతహాగా మంచి విద్వాంసులు. వారి కుమార్తెను నీకివ్వవలెననే సంకల్పంతో మనతో సంబంధం కలుపుకోవలెనని కోరికతో యిక్కడికి దయచేశారు. వారేవేవో వారి తాహతనుబట్టి మన అర్హతనుబట్టి, కట్నాలూ, కానుకలు యిస్తామంటున్నారు. మనకటువంటి విషయములో పట్టింపులేవీ లేవని వారితో మనవి చేశాను.

'అయ్యా! శాస్త్రుర్లుగారూ ఏమిటి మీ సెలవు' అన్నారు వచ్చినవారి నుద్దేశించి.

ఆ సూర్యనారాయణశాస్త్రుర్లు ఏమీ మాటలాడకుండానే పక్కనున్న పెద్దమనిషి,

'ఎవరు ఏమనడానికీ ఏమున్నదండీ ఇంక మీ పేరు ప్రతిష్ఠలు విని, మీ సదాచార సంపత్తి మీ ఐశ్వర్యమూ, మీ పిల్లవాని విద్యాబుద్ధులూ, సుగుణ సంపత్తీ, యిదివరకే విని యిక్కడకు వచ్చాము. నేడు మీ కుమారుని రూపురేఖ విలాసాదులూ, సౌమ్యతా, చూచి బ్రహ్మానందపడ్డాము. ఇక మంచిరోజు చూసుకుని సాధ్యమైనంత త్వరలో మా గ్రామం దయచేసి మా కన్యను చూడవలెనని మా ప్రార్థన.'

మా నాన్నగారు అలాగేలెండి మా కెప్పుడు వీలవుతుందో ఆలోచించి మీకు తెలియపరుస్తాను అన్నారు.

శాస్త్రులుగారు చాలా సంతోషం అన్నారు.

రెండో ఆయన కూడా ఇక్కడికి వచ్చి మీ దర్శనం చేసుకునేటప్పటికి మీ ఆదరణా, మర్యాదా చూచిన తరువాతను, మీ కుమారుని దర్శించిన తరువాతను, పిల్లను చూడడము ఊరికే ఒక లాంఛనమేకాని సంబంధము నిశ్చయమే అనే భావన నాకు కలిగింది. మేము బయలు దేరిన వేళా విశేషమూ, పెండ్లికుమార్తె అదృష్టమూ అన్నారు. ఉభయులూ లేచి మా నాన్నకు నమస్కరించి నన్ను మళ్ళీ ఒకసారి పరీక్షగా చూచి

ఇక మాకు అనుజ్ఞ ఇప్పించండి. మేమూ మా ఏర్పాట్లు చేసుకుంటూ మీ రాకకు నిరీక్షిస్తూ ఉంటాము అని వారు వీధిలోకి మళ్ళారు. మా నాన్న పది బారలు వారి ననుసరించి సాగనంపి తిరిగి వచ్చారు. నేను మట్టుకు నిలబడ్డచోటే నిలబడి ఇదేమిరా భగవంతుడా ఇదొకటి వచ్చి పడ్డది. వివాహప్రసక్తితో మళ్ళీ మా నాన్నకూ, నాకూ కొంత సంఘర్షణ జరిగే సూచనలు కనబడుతున్నాయి, ఎలాగా అనుకుంటూ నా గదిలోకి చక్కాపోయాను.

గదిలోకి వెళ్ళి కూర్చోగానే మళ్ళీ పుస్తకం చదవబుద్ధికాలేదు. మనసు పరిపరి విధాల పరుగులెడుతోంది. నేను విదేశాలకు బయలుదేరకముందు వచ్చిన పెళ్ళి సంబంధము అప్పుడు నేను మా మామయ్యా వెళ్ళి పిల్లను చూడడమూ, అక్కడ జరిగిన అభాసూ అన్నీ ఒకటొకటే జ్ఞాపకం వచ్చి ఎంతసేపో నాలో నేను నవ్వుకుంటూ కూర్చున్నాను. అప్పటినుంచీ పెళ్ళిచూపులకు వెళ్ళడమంటే ఒక విధమైన భీతిఏర్పడ్డది. అప్పుడంటే కన్యను చూడడానికి ప్రయాణమవుతూంటె కొంత కుతూహలంగానే వుండేది. ఇప్పుడా ఉత్సాహం పోయింది.

రెండు మూడు రోజులు నుళ్ళా మా నాన్న ఈ ప్రసక్తి ఏమీ తేలేదు. ఆయన పనులు ఆయన చూసుకుంటున్నాడు. నాపుస్తకాలతో నేను కాలక్షేపం చేసుకుంటున్నాను. నాలుగు రోజులు గడిచాయి. ఒక రోజు మధ్యాహ్నం భోజనాలయిన తరువాతను.

'ఏమిరా అబ్బాయి! మొన్నవచ్చిన పెళ్ళివారికి ఎల్లుండి బాగున్నదనీ మనం పిల్లని చూడడానికి వస్తున్నామనీ, నిన్ననే ఉత్తరం రాశాను. పిల్ల మనకు నచ్చితే మనం చేసుకుందాం. వారిచ్చే క ్న కానుకలతోటి మనేకమీ నిమిత్తంలేదు. అవసరమూలేదు. మనకు ాావలసింది గుణవతీ, రూపవతీ అయిన కన్యగాని కన్యతో వచ్చే బరువులేవీ కావు. ఇంతవరకూ వారు నాతోటి ఆ ప్రశంస ఏమీ చేయలేదు. నేన ంతకంటే అడగనూ లేదు. నేవిన్నంతవరకూ కన్యతండ్రి యోగ్యుడనీ, వేదాధ్యయన పరుడనీ, కొంచెం ఛాందసుడనీ విన్నాను, అంతకూ ఆయనఛాందసం ఆయనకే ఉంటుందిగాని పిల్లతోటి మన యింటికి రాదుగదా! కన్యను చూసుకోమని వారడగడం మర్యాదా. మన తృప్తికోసం వెళ్ళి చూడడం కూడా ఒక మర్యాదే. ఏమంటావు' అన్నారు.

నేను ఏమనను! ఈ నాలుగు రోజులనుంచీ ఈ సంభాషణ ఎప్పుడు జరుగుతుందా నేనేమి అనాలా అనే ఆలోచించుకుంటున్నాను. కాని ఏమ

నాలో మట్టుకు ఒక నిర్ణయానికి రాలేక పోయాను. నేను సమాధానం వూహించుకోకుండానే ప్రశ్నవెయ్యనే వేశారు మా నాన్న అనుకుంటూ ఏదో ఒకమాట అనాలి గనుక,

“పోనిద్దురూ ఇప్పుడొచ్చిన తొందరేమిటి? పెళ్ళికిమీరంత తొందరపడడానికి నేనేమీ ఆడపిల్లను కాదుకదా! నేనింకా ఏం చెయ్యాలో అనగా వ్యవసాయమో, ప్లీడరీయో, ఉద్యోగమో ఏ నిర్ణయమూ చేసుకోలేదు కదా” అన్నాను.

దానికీ, దీనికీ సంబంధమేమిటన్నారు మా నాన్న. నా జీవితవిధానంలో నా నిర్ణయాలను అనుసరించి నీ భార్య నీకు సహధర్మచారిణిగా ఉండవలసిందేగాని నీకు నిర్ణయాలు చేసేదీ, నీవు చేసుకున్న నిర్ణయాలు మార్చేది కాదుకదా అన్నారు.

మీరన్నదే మనసంప్రదాయం అనుకోండి. కాని ఈనాటి ఆలోచనా సరళి కొంచెం మారింది కదా! ఎక్కడనుంచో పరాయి యింటినుంచి మన యింటికి వచ్చి జీవితాంతం మనతోనే వుండి అన్నిటా మనతో ఐక్యం కావలసిన మనిషి. మన ఆలోచనలు, మన పద్ధతులు కూడా తెలుసుకోవద్దా! అందులో మంచి చెడ్డలు నిర్ణయించుకునేటప్పుడు ఆమె అభిప్రాయంకూడా మనను అడిగి తెలుసుకోవడములోను, మనము అడక్కపోయినా స్వతంత్రించి తన సలహా చెప్పడంలోను తప్పేముంటుంది? మా అమ్మని మీ రెప్పుడూ అడగరా? ఏ విషయంలోను ఆమెతో సంప్రదించరా! ఒకభోజన విషయంలోనేనా ఆమె స్వతంత్రించి నిర్ణయాలు చేసుకొనేది అన్నాను. కొంచెం తొందరతో.

అహా అలాగా, నిజమే! మీ చదువుతోపాటు ఇతర విషయాలు కూడా చాలా వంట పడతాయన్నమాట. మర్చి పోయాను. సరేపోనీ అవన్నీ తరువాత ఆలోచించుకోవచ్చును. ముందు పిల్లను చూడవచ్చు గదా అన్నారు. రెండు మూడు నిమిషములు మౌనంగా ఊరుకుని ఆ అమ్మాయి వయస్సు ఎంతో అన్నాను. మా నాన్న ఎప్పుడూ దేనికి మాటకి తడుముకోని మనిషి నిర్ఘాంతపోయి నాకేసి చూస్తూ కొంత సేపు వూరుకున్నారు. అప్పటికి తేరుకుని నా అభిప్రాయం గ్రహించినా గ్రహించనట్టు, నీ వుద్దేశం, అన్నారు.

నా ఉద్దేశానికేమున్నది మీరూహించినదే. నా వయస్సు ఇప్పుడు ఇరవై రెండో, ఇరవైమూడో ఉన్నాయికదా! ఇంకను ఆ పిల్లకూ, నాకూ

వ్యత్యాసం ఎం వుంటుందా అని వూహిస్తున్నాను అన్నాను.

'కొంత తేడా ఉండేమాట వాస్తవమే. నీవు విదేశాలకు వెళ్ళకముందే ఒకసారి ప్రయత్నం చేసిన సంగతి నీకు జ్ఞాపకం ఉండేఉంటుంది. అప్పుడ యితే ఈ ఈలోచన లేనీ మనకుండకపోయేవి. మరియిప్పుడు ఏదో కొంత తేడా తప్పనిసరి అవుతుంది. ఇంతకూ నేను వాళ్ళనడగలేదు. ముందు మనకు పిల్ల నచ్చడం, తరువాత జాతకం నచ్చడం. ఇవి రెండూ అయితే అప్పుడే వ్యత్యాసము మాట - నాకేసి చూస్తూ కొంతసేపు వూరుకు న్నారు. దానిని గురించి యింక వాదప్రతి వాదాలు అనవసరమన్నట్టు ఆయన లేచి వెళ్లిపోయారు.

నేను తుది మాట చెప్పే అవకాశం లేకుండా చేశారు మా నాన్న. అంతకంటే గట్టిగా నా పెళ్ళిసంగతి నా యిష్టము వచ్చినపుడూ, అవ సరం వచ్చినపుడూ నేనే చూసుకుంటాను అనిచెప్పే ధైర్యం ఇన్నేళ్ళు వచ్చినా, ఇన్ని దేశాలు తిరిగినా లేకపోయింది. యిక చేసేదేమీలేక ఏమి జరుగుతుందో చూదామని నేను వూరుకున్నాను.

మూడవనాడు బాగా తొందరగా భోజనములు ముగించుకొని పెళ్ళి చూపులకు బయలుదేర బోతుండగా అమ్మను కూడా తీసుకువెడదామన్నాను.

ఎందుకూ, అనవసరం యిప్పుడు. 'నాకు నచ్చితే మీ అమ్మకూ నచ్చుతుంది. పైగా అక్కడ కొంతదూరం నడవాల్సికూడ ఉంటుంది. మీ అమ్మ శ్రమపడలేదు. అన్నీనిశ్చయమైతే తాంబూలాలు పుచ్చుకునేటప్పుడు ఎలాగూ చూస్తుంది' అని ఏమే! మేము వెళ్ళివస్తున్నాం అని ఒక కేక వేశారు మానాన్న.

మా అమ్మ ఏ పనిమీద ఉన్నదో 'శుభం' అని చేతులు తుడుచు కుంటూ నవ్వుతూ యివతలకు వచ్చి మమ్మల్ని సాగనంపింది.

మధ్యాహ్నం సుమారు రెండు గంటలకు ఆ గ్రామం చేరుకున్నాము. వారు మా రాకకై అన్నీసిద్ధంచేసుకుని వీధి అరుగుమీదనే కూర్చుని, నిరీక్షిస్తూనే ఉన్నారు. మమ్మల్ని చూడడముతోటే మేము వస్తున్నామని లోపలికి కేకవేశారు. యజమానురాలు పాదప్రక్షాళనకు నీళ్ళు తీసుకు వచ్చి పెట్టింది. లోపలికి వెళ్ళి కూర్చుని కొంచెంసేపు ఈ మాటా, ఆ మాటా ఆయన తరువాతను 'ఏమే? అమ్మాయిని ఇంక తీసుకురావేమ'ని భార్యను కేకవేశారు. మొన్న మా వూరు ఈ శాస్త్రుర్లుగారితో వచ్చినా యన కూడా సావిట్లో వున్నారు. మరెవరో ఒకరిద్దరు కూడా వున్నారు. ఇంతలోకే శాస్త్రిగారి భార్య కుమార్తెను తీసుకుని సావిట్లోకి వచ్చింది.

'ఇలా కూర్చో అమ్మ' అని అక్కడున్న చాపమీద కూర్చోబెట్టి

పిల్ల వెనుకను తాను నిలబడి ఉన్నది. లోపల గుమ్మంలో ఇంకెవరో ఇద్దరు ముగ్గురు ముత్తయిదువులు వేడుక చూస్తున్నారు. మొదట వీధిలో తల్లిని చూచినపుడే నాక్కొంచెం అనుమానం కలిగింది. ఇప్పుడు పిల్లను చూడడం తోటే నా అనుమానం దృఢమయినది. పిల్లకు పదకొండేళ్ళుకంటే ఉండవు. సన్నగా చాలా అర్బకంగా, బాగా నల్లగా కనపడ్డది. ఆపిల్లలో స్ఫుటంగా కనపడేది కళ్ళు ఒక్కటే. ఇక నాపిల్లను చూడవలెననే కుతూహలం నాకెంతమాత్రం కలుగలేదు. ఒక్కక్షణం మా నాన్నకేసి చూశాను. ముఖం చూస్తే ఆయనకూ నచ్చినట్లు కనపడలేదు. ఇంకొక క్షణానికల్లా ఆయన కూడా ఇక్కడుండవలసిన అవసరం తీరింది అన్నట్టుగా 'బాగుంది శాస్త్రిగారూ, చాలా సంతోషం ఇంకను సెలవిప్పిస్తే' అన్నారు. ఆపిల్లను ఎవ్వరమూ ఏ ప్రశ్నా వేయలేదు. నీ పేరు ఏమిటనికూడా అడగలేదు. మా భావం వారందరికీ అర్థమయ్యే ఉంటుంది. ఎవ్వరూ మాటాడలేదు.

సాయంకాలానికి కొంచెం కష్టమైనా మొగల్తుర్రు చేరుకున్నాము. దారిపొడుపునా మా నాన్న ఒక్క మాటకూడా మాట్లాడలేదు. నేనేమి మాట్లాడను? ఇంటికి రాగానే మా ముఖం చూచి పెండ్లికూతురెలావు న్నదీ మా అమ్మకర్థమైనట్లుంది. ఆవిడకూడా ఈ ప్రశంస ఏమీ చేయలేదు.

ఆడపిల్లలను కన్నవారు పిల్లపుట్టింది లగాయతూ దాన్ని అత్తింటికి పంపేవరకూ ఒకటే ఆలోచనకదా! వారు సుఖంగా నిద్రపోరు. కనపడ్డ యువకులను నిద్రపోనివ్వరు. నెలరోజులు తిరక్కుండానే మళ్ళీ సంబంధం రావటం మళ్ళీ చూడవలెనని నిచ్చయించుకోవడం జరిగింది. ఈ సారి పిల్లతండ్రి పండితుడు కాదు కాని చాలా లౌక్యుడూ, గడసరీలాగ కనపడ్డాడు. పిల్లను చూడటానికి బయలుదేరబోతుంటే ఎక్కడనుంచో ఈ సంబంధం మాకు తగినది కాదని పిల్లతండ్రి పరమ దుర్మార్గుడనీ యింకా ఏవేవో వారిని గురించి వర్ణిస్తూ, ఒక ఆకాశరామన్న ఉత్తరం వచ్చింది. అనుకున్న ప్రయాణం ఆ పూటకు ఆపుజేసి మా నాన్న ఒక్కరూ ఎక్కడికో వెళ్ళి సాయంకాలానికి చాలా అలిసిపోయి యింటికి వచ్చారు. ఎవ్వరి తోటీ ఏమీ మాట్లాడలేదు. స్నానంచేసి భోజనాల దగ్గర ఈప్రసక్తి తీసుకు వచ్చారు. మనవాడి అదృష్టం చాలా మంచిదిగనుక ఈ సంబంధం తప్పిపోయింది. నేను రోజస్తమానమూ తిరిగి వారిని గురించి బోలెడన్ని వివరాలు తెలుసుకు న్నాను. ఆపిల్లతండ్రి ఎంత లౌక్యుడో, ఎంత దుర్మార్గుడో తెలుసుకోడానికి ఒక్క విషయం చెబుతాను. మన వాడికి కట్నం క్రింద కొంత రొక్కమే కాకుండా రెండు మూడు ఎకరాలు భూమి కూడా యిస్తామనీ, ఆ భూమి

వూరికి దక్షిణంగా ఉన్నదనీ దాని నెంబరు ఫలానా అని కూడా నేనేమీ అడక్కుండానే మాకు కట్నం అవసరంలేదని చెప్పినా వినిపించుకోకుండానే వివరాలన్నీ నాతోచెప్పాడు. ఇవ్వాళ వాకబులో తేలిన విషయమేమిటంటే, ఆ భూమి శ్మశానమీ, దాని నానుకున్న బంజరు గ్రామకంఠమని తేలింది. ఇటువంటి వాడిని ఏం చేస్తే పాపమున్నది? ఈ రహస్యం ఏనాటికి బయటపడదనుకున్నాడా? ఇంత దుర్మార్గం యిటువంటి దురాలోచనా, నాజీవితంలో ఇంతవరకెప్పుడూ వినలేదు. మనవాడి జాతకం మంచిదనీ, చాలామంచి సంబంధమే వస్తుందనీ నమ్మకమున్నది. కానియ్యి అయి నప్పుడే అవుతుందన్నాడు. 'అయ్యో వీడిల్లు వల్లకాడుగానూ' అన్నది మా అమ్మ. నేనేమీ మాట్లాడలేదు. కొంచెం నవ్వుమట్టుకు వచ్చింది. ఈ అనుభవంతో కొన్ని రోజులవరకూ మళ్ళీ వివాహ ప్రశంస ఏమీ జరగలేదు.

ఒకరోజున మా రాజు మిత్రుడు, భీమవరం వచ్చినట్లూ నన్ను వెంటనే ఎన్ని పనులన్నా మానుకుని, మనదేశంలో, విమానాలు లేవు గనుక రెక్కలు కట్టుకుని తక్షణం అక్కడకు వచ్చి నన్ను వాలమనిన్నీ, అలా చేయనిపక్షంలో తనేవచ్చి నా రెక్కలు వెనక్కి విరిచికట్టి ఈడ్చుకుపోతా ననీ ఉత్తరం వ్రాశాడు. అతని కంతశ్రమ కలిగించడం యిష్టం లేక మా అమ్మతోటి చెప్పి నేను వెంటనే భీమవరం బయలుదేరాను. మారాజు రాసినట్లు నేను ఎగిరి వెళ్ళకపోయినా, కొంచెం ఇంచుమించుగా అంతవేగం గానూ వెళ్ళాను. నే నింకా ఏ సాయంత్రానికో వస్తాననుకున్న రాజు నన్ను చూచి ఆశ్చర్యంతో ఒక్క ఉరుకున వీధిలోకివచ్చి నన్ను అమాంతంబండిలో ఉండగానే కౌగలించుకుని యివతలకు దింపాడు. ఇంకను లోపలికి వెళ్ళిన తరువాత ఎన్నెన్నో మర్యాదలు చేసి యోగక్షేమాలన్నీ అడిగి తన అవశి ష్టాలు అన్నీ తొందరగా తీర్చుకుని బయటి కెక్కడికేనా పోదాము రమ్మని నన్ను ఉప్పుటేరు ఒడ్డుకు తీసుకువెళ్ళాడు. మేమద్దరమూ నిర్జనంగా ఉన్న ఒక సైకతస్థలిలో ఒక చెట్టు నీడను సుఖాసీనులమై ఏదేదో బాతాఖానీ ప్రారంభించాము. విదేశాలలో మా ప్రథమ పరిచయంతో ప్రారంభించి నే నింటికి రావడానికి వేవర్లీ స్టేషన్‌తో రైలు ఎక్కేవరకూ అక్కడ మా జీవితం, మేము చేసిన అల్లరూలూ, అవకతవకలూ, యితరులను ఏడిపిం చడాలూ, ఇతరులు మమ్మల్ని ఏడిపించడాలూ, మొదలైన రసవద్ఘట్టాలు ఎన్నెన్నో, సింహావలోకనము చేసుకుంటూ, కాలగమనము గమనించకుండా ఎన్ని గంటలో అక్కడ కాలక్షేపం చేశాము. కాలగతిని మేము గమనించక పోయినా, అన్నగత ప్రాణులము కావడముచేత, మా కడుపులే మమ్మల్ని లేవమని హెచ్చరించడముతో, యింటిదారి పట్టక తప్పింది కాదు.

నేనా సాయంత్రం యింటికి వెడదామనుకున్నాను గాని రాజునన్ను కదలడానికి వీలులేదని ఆజ్ఞపెట్టి అక్కడనే ఉంచేశాడు. నేను కట్టుబట్టలతో వచ్చాను వేరే బట్టలు లేవనికూడా చెప్పాను.

తక్షణం బజారుకు తీసుకువెళ్ళి రెండుజతలు పంచెలూ, తువ్వాళ్ళూ వగైరాకొని, తక్షణం రెండు చొక్కాలుకూడా కుట్టించి, యింకను నోరు మూసుకుని నేను వెళ్ళేవరకూ యిక్కడే పడివుండు అన్నాడు.

గత్యంతరంలేక సుమారు వారం రోజులు నేను అనుకోకుండానే, నాకు తెలియకుండానే అక్కడ వుండడం జరిగింది. ఏమైనా నేను రేపు ఇంటికి వెళ్ళక తప్పదు అబ్బాయీ అన్నాను.

'రేపటికింకా పన్నెండు గంటలలో, పదిహేనుగంటలలో వ్యవధి ఉన్నది కదా' అన్నాడు.

నేనేమీ మాట్లాడలేదు. సాయంత్రం ఫలహారములు ముగించుకుని బయటకు ఎక్కడికేనా వెడదామని బయలుదేరబోతుంటే వాకిట్లోకి ఎవరో ఇద్దరు బ్రాహ్మణులు వచ్చి రాజు తండ్రితో ఏదో మాట్లాడుతున్నారు. ఆయన మమ్మల్ని క్షణం కూర్చోమన్నారు. ఇదేమిటా, వారెవరూ! కొంప తీసి నాకెవరైనా పెళ్ళివారు కాదుకదా అనే సందేహం ఎందుకో కలిగింది. ఇంతలో పెద రాజుగారు తన కొడుకునీ , నన్నూ వచ్చినవారికి పరిచయం చేశారు. తరువాత ఈవచ్చిన వారిలో ఒకరిని అచ్యుతరామయ్యగారనీ, మాశాఖ బ్రాహ్మణులేననీ, ఆ వూళ్ళో పెద్ద పేరు సంపాదించిన వకీలనీ, చెప్పారు. ఇంతలో ఆ అచ్యుతరామయ్యగారితో వచ్చిన వ్యక్తి నన్ను ఉద్దేశించి,

'తమ సంగతీ తమ తండ్రిగారి సంగతీ, తమ వంశమర్యాదా, తమ విదేశాలలో చదివిన చదువుల గురించీ చాలా విన్నాము. అచ్యుతరామయ్యగారూ నేనూ పదిహేను రోజులనుంచి మొగల్తుర్రు వచ్చి మిమ్ములనూ, మీ తండ్రిగారినీ సందర్శిద్దామని ప్రయత్నిస్తున్నా వారికి కోర్టుపనులతో తీరికలేక కదిలిరాలేక పోయాము. అచ్యుతరామయ్యగారి పెద్దకుమార్తె. బహు చక్కనిదీ, తెలివైనదీ. స్కూలులో స్కూలుఫైనలు చదువు కుంటున్నది. ఆ అమ్మాయికి ఇంకా పై చదువులు చదువువలెననే కుతూహలం ఎంతో వున్నా ఆ పిల్ల తల్లి, మాతా మహులు, ఒత్తిడిచేసి సాధ్యమైనంత త్వరలో వివాహము చేయవలెననే సంకల్పముతో వున్నారు. తమరిక్కడికి వచ్చినట్లూ, అయిదు రోజులుగా ఇక్కడనే ఉన్నట్లూ, నిన్న సాయంకాలమే నాకు తెలి

సింది. ఇప్పటికి తీరిక చేసుకుని యిలా వచ్చాము. ఈ వూట మాతో ఒక్కసారి దయచేసి పెండ్లి కుమార్తెను చూస్తే సంతోషిస్తాను. మీ కభ్యంతరం లేకపోతే ఈ రాత్రి మీ వూరువెళ్ళి మీ తండ్రిగారితో ప్రశం సచేసి రేపు వారిని యిక్కడికి దయచేమనికోరి మళ్ళీ రాత్రికి తిరిగివచ్చి ఏమాటా తెల్లవారేసరికి మీకందజేస్తాము' అన్నాడాయన.

ఇంతలో అచ్యుతరామయ్యగారు యింతసేపూ, ఉలుకూ, పలుకూ లేకుండా ఉన్నవాడు. 'బాబూ మామాట మన్నించి, మరోలా అనుకోక, మీరొక్కసారి మా యింటికి దయచేయండి. మా అమ్మాయిని చూడండి మీకు ఏమాత్రమూ ఆకర్షణీయంగా ఉన్నా, మీ నాన్నగారి దగ్గరకు వెడ తాము. వారు మా మంచి చెడ్డలు తెలుసుకుని రేపటెల్లుండికి యిక్కడికి తప్పక దయచేస్తారనే ఆశా, విశ్వాసమూ, మాకున్నది. లేవండి వెడ దాము మీ స్నేహితులుకూడా మీతో వస్తారు.' అని నాకు సమాధానం చెప్పడానికి వ్యవధి యివ్వకుండానే లేచి నిలబడ్డారు. రాజు నాచెయ్యి పట్టుకుని లేవదీశాడు. మేము యింక వారిని అనుసరించక తప్పలేదు.

అచ్యుతరామయ్యగారిది చాలా విశాలమైన స్థలంలో నిర్మితమైన పెద్ద భవంతి. ముందు చిన్న ఉద్యానవనము. ఎంతో చక్కగా ఉన్నది. లోపలికి వెళ్ళగానే హాలంతా పాశ్చాత్యపద్ధతిని కుర్చీలూ, సోఫాలూ, గోడలకు నేత్రా నందకరమైన పటములతోనూ అలంకరించబడి ఉన్నది. మేము వచ్చేసరికే ముందు సావిట్లో కొంతమంది వీరి రాకకోసం వారి పార్టీలు కాబోలు కూచున్నారు. మేము తిన్నగా అచ్యుతరామయ్యగారి ననుసరించి లోపల హాలులో కూర్చున్నాము. ఇదివరకే అన్ని ఏర్పాట్లూ సిద్ధము చేసుకు న్నారు కాబోలు, మేము వెళ్ళగానే అచుత్యరామయ్యగారు లోపలికివెళ్ళి పెండ్లికుమార్తెను తీసుకురమ్మని భార్యతో చెప్పినట్లున్నారు. అప్పటికే అలం కరణముతో సిద్ధముగాఉన్న కన్యను తీసుకుని రెండుమూడు క్షణములలో తల్లి ప్రవేశించింది. కొందరు ఆడవాళ్ళు లోపలున్నారు, మరొక చిన్న మ్మాయీ మరొక యిద్దరు మొగపిల్లలూ అచ్యుతరమాయ్యగారి సంతానమే కాబోలు హాల్లోకివచ్చి నిలబడ్డారు. అమ్మాయి లోపలికి ప్రవేశిస్తుండగనే నా దృష్టిని ఆకర్షించింది. మా పరస్పర వీక్షణములు అప్రయత్నంగా జరిగాయి. నేననుకోని, నా మనసూ హృదయమూ ఆమెతోనే నిండిపోయాయి. నేని న్నాళ్ళనుంచీ నిర్మించుకున్న ఊహా సౌధాలన్నీ గాలిలో ఎగిరిపోయినాయి. ఆ పిల్ల కూర్చోబోతూ మళ్ళీ తన విశాలనేత్రాలతో నన్ను ఒక్కసారి చూచింది. ఒక చిరుహాసముతో ఆసీనురాలైంది. తల్లి పక్కనే నిలబడి

ఉన్నది. 'ఇదేనండీ మా పెద్ద అమ్మాయి చదువుకుంటూ పెండ్లి చేసుకోబోతున్న కన్య' అన్నారు అచ్యుతరామయ్యగారు ఆయన చెప్పినదంతా సరికాదన్న సూచనతో తలవూపి, సిగ్గుతో తల కిందకు వంచుకున్నది. మీరేమైనా పిల్లను అడగదలచుకుంటే అడగండి. మీకే సంకోచమూ అవసరములేదు. అమ్మాయి సంగీతం కూడా నేర్చుకుంటోంది కొద్దిక్షణాల్లో తను నేర్చుకున్న మేరకు ఏదో ఒక పాటపాడి వినిపిస్తుంది కూడాను. అన్నారు అచ్యుతరామయ్యగారు. ఎందుకో, ఎవరో మంత్రించినట్లు నాకు వాగ్బంధనమైంది. ఇంతకాలంనుంచీ పెండ్లిచూపులకు వెళ్ళినప్పుడు ఎన్నెన్నో ప్రశ్నలు వేసి ఆ పిల్లచేత పలికించి ఆమెగాత్ర మాధుర్యం సమయస్ఫూర్తి, ఇంకా ఏవేవో తెలుసుకోవలెననుకున్న వేమీ ఇప్పుడు అడగబుద్ధికాలేదు. ఆ మూర్తిని అలా చూస్తూ కూర్చుంటే చాలుననిపించింది. నేనేమీ మాట్లాడక పోయేసరికి ఆ అమ్మాయిని ఒక పాడపాటమని తండ్రి



హెచ్చరించారు. దానితో ఏదో స్వర్గసీమలో విహరిస్తున్న నేను, అమాంతం నేలకు దిగి యిప్పుడవన్నీ ఎందుకండీ! రేపు మా నాన్నగారు వస్తే చూడవచ్చులెండి. అని నేననుకోకుండానే లేచి నిలబడ్డాను. అక్కడున్న అందరి వదనాలూ హాసాలతో వికసించినాయి. వారు కోరిన సమాధానం, ఆశించినపలుకూ, అప్రయత్నంగా, అనుకోని విధంగా, నాకు తెలియకుండగానే

నా నోటంట వచ్చింధి.

నాతోబాటు రాజుకూడా లేవడంతోనే అక్కడ అందరూకూడా లేచారు.

ఆ అమ్మాయీ లేచింది. మళ్ళీ ఒకసారి మాకళ్ళు కలిసాయి. ఆమె మందహాసం చేసింది. కానీ, నేను జవాబుగా నవ్వుకూడా నవ్వలేక పోయాను. నేనే పెళ్ళికూతురులా సిగ్గుతో తలవంచుకుని వీధిలోకి వచ్చాను.

# 11

అచ్యుతరామయ్యగారు మా వెంకనే వచ్చి మమ్ములను రోడ్డు వరకూ సాగనంపి, నాన్నగారు ఏమున్నారో మీకు ఉదయాన్నే తెలియ పరుస్తాను. ఉంటాను మరి" అన్నారు.

నేనేమీ మాటలేకుండా చేతులు జోడించి, రాజుని అసరా చేసుకుని, నిద్రలో నడుస్తున్నట్లు ముందుకు సాగాను. ఆవీధి చివరకు వెళ్ళి మలుపు తిరగ్గానే రాజు ఓ పెద్ద నవ్వు నవ్వి,

'పార్వతీశం నీపని అయిపోయింది. ఇంక నీ స్వాతంత్ర్యం ఇంతటితో ఆఖరు. నువ్వేదో పెద్ద ధీశాలీ, ధైర్యశాలీ అనుకున్నాను. ఇన్ని దేశాలు తిరిగి, ఎంతెంతమందినో సౌందర్యవతులను చూచినకళ్ళు ఈచిన్న పిల్ల ముఖంమీద పడగానే అలా అయిపోయావేమిటి? నీవు పలికిన ప్రతాపాలన్నీ ఏమయ్యాయి ఇప్పుడు' అంటూ నన్ను దారి పొడుగునా హేళన చేస్తూనే వున్నాడు.

నేనేమీ ఒక్క మాటకూడా సమాధానం చెప్పలేదు. ఎంతసేపూ నా కభిముఖంగా నిలిచి, నవ్వేకళ్ళతో నన్ను చూస్తూ వెనక్కు నడుస్తున్న ఆ పిల్ల కళ్ళమీదనే నా ప్రాణాలన్నీ లగ్నమై వున్నాయి. అలా యెంత దూరమో రాజు నన్ను రెక్కపట్టుకుని తీసుకువెళ్ళి, నిన్న కూర్చున్నచోట కూలవేసేవరకూ ఆ మాంద్యం వదలనేలేదు. రాజు నా వీపుతట్టి,

'ఏం నాయనా యిప్పటికేనా మెలకువ వచ్చిందా? లేకపోతే ఓ పరుపూ దుప్పటీ, తలగడా తెప్పించి పరిపిస్తే యిక్కడే నిద్రపోతావా? పోనీ అలా చెయ్యి రేపు మీ నాన్న వచ్చి ఎలాగూ లేపుతారు నా దారిని నేను పోతాను' అని రాజు లేచేసరికి నా మైకము పూర్తిగా వదలిపోయింది. మామూలు మనిషినయ్యాను.

'ఏడిశావు కూర్చుందూ' అని రాజును మళ్ళీ కూర్చోపెట్టి, మామూలు కబుర్లలో పడ్డాము. ఆ కబుర్ల మధ్య రాజు నోటంట వచ్చిన ఒకటి రెండు మాటలవల్ల, ఈ జరిగిన సంఘటన కంతకూ కారకులు మా రాజూ, అతని తండ్రిగారూ నని నాకు తెలిసిపోయింది.

మరునాడు ఉదయం మా అవశిష్టములూ, స్నానములూ ముగించుకునేటప్పటికి అచ్యుతరామయ్యగారి దగ్గిరనుంచి కబురు వచ్చింది. మా నాన్నగారు తమ అంగీకారం తెలిపేరనీ ఈ రోజు మధ్యాహ్నం మూడు గంటల లోపుననే వస్తామన్నారనీ వారు రావడంతోటే మాకు వర్తమానం చేస్తారనీ మమ్మల్ని సిద్ధముగా ఉండమని చెప్పమన్నారని వచ్చిన ఆసామీ మా కెరుక పరచాడు.

నేనూ రాజూ ఒకళ్ళ నొకళ్ళు చూసుకుని నవ్వుకున్నాము.

'పార్వతీశం ఈ రోజు మీనాన్న వచ్చి నువ్వా మైకంలో ఉండగానే ఆపిల్లచేత నీ మెళ్ళో మూడుముళ్ళూ వేయిస్తాడు. నీకు తెలివివచ్చి చూసుకునేసరికి మెళ్ళో పచ్చని పసుపుతాడు గలగలలాడుతూ కొత్త మంగళ సూత్రాలు తయారవుతాయి. అందుచేతను ఆ ప్రమాదం తప్పించుకోవలె నంటే నీవు యిప్పటినుంచీ కొంచెం మెలకువగా ఉండి నీ పరధ్యానం మాని జాగర్తగావుండు, ఇంకను తరువాతను ఎలాగూ జీవితాంతం వరకూ ఆ అమ్మాయి ముఖం చూస్తూ, ఆ మందహాసంలో మతి పోగొట్టుకుని, ఆమె కనుసన్నలలో మెలగుతూ ఆమెకు దాస్యం చేస్తూ, నీ చదువు సంధ్యలన్నీ మరచిపోయి, హాయిగా సంతోషంగా, ఆ దేవీ కటాక్ష వీక్షణాలలో కాలం గడుపుకోవచ్చు' అన్నాడు రాజు.

నాకు ఒళ్ళుమండి లేచి నా తువ్వాలుతో అతని నోరు కట్టేశాను.

'సంతోషించాను. దీనికంతకూ కారకుడవు నీవేనన్న సంగతి నిన్న సాయంకాలమే తెలిపోయింది. సరే ఏదో సదుద్దేశంతోటే చేశావుకదా' అని ఊరుకున్నాను. అతి ధోరణిమట్టుకు నేను సహించను' అన్నాను.

రాజు ఒక పెద్దనవ్వుతో ఆ తువ్వాలు లాగి నా మొహాన్ని వేసి కొట్టాడు.

'పార్వతీశం, ఎడింబరో స్నేహితురాండ్రను మర్చిపోయావా పూర్తిగా. ఈపిల్లను ఒక్కసారి చూసేటప్పటికి, అంత ఆనందం కలిగిందా? ఇంకెవ్వరినీ చూడాలని లేదా? 'ఒకమాటుకే ఈలాగయితే ఏలాగూ' అనే జావళి జ్ఞాపకం వస్తోంది నిన్ను చూస్తుంటే. మనలో మనమాట. ఈ పిల్ల చాలా

చక్కనైనదని ఒప్పుకోక తప్పదులే. నేను చిన్నప్పటినుంచి ఎరిగి ఉన్నాను ఈ అమ్మాయిని, చాలా తెలివైనదీ చాలా బుద్ధిమంతురాలూనూ. ఈ అమ్మాయికి వివాహ ప్రయత్నం చేస్తున్నట్టు అచ్యుతరామయ్యగారు వరాన్వేషణలో ఉన్నట్టూ నాకీమధ్యన తెలిసింది. నీవు వచ్చిన తరువాతను ఒక రోజున హఠాత్తుగా నీ సంగతి వారికి తెలియపరిస్తే బాగుంటుందని నాకు తోచిందది. ఈ జిల్లాలోకంతా అచ్యుతరామయ్యగారు చాలా ప్రసిద్ధిచెందిన వకీలు, అంత శాంత స్వభావులూ, లాయరు వృత్తిలో ఉండికూడా అంత ఋజువర్తన కలవాళ్ళూ మరొకరు లేరు. ఉండటంకూడా కష్టం. మీ నాన్నగారికి కూడా వారిపేరు తెలిసే వుంటుంది. అందుకని ఈ ఉద్దేశం స్ఫురణకు రాగానే మా నాన్నగారి చెవిని ఈ మాట వేశాను. ఇది చాలా బాగుందని ఆయన సంతోషించి ఈ సంధానానికి కావలసిన దోహదం అంతా ఆయన నిమిషాలమీద చేశారు. పర్యవసానం ఈ సాయంత్రం తాంబులాలు పుచ్చుకోవడం కూడా జరుగుతుందేమోనని నా అనుమానం దీనినే కాబోలు మనవాళ్ళు ఘటన అంటారు. లేకపోతే చిన్న పిల్లను చేసుకోకూడదని నీ దృఢాభిప్రాయం నాకు తెలుసు. ఇదివరకు వచ్చిన సంబంధాలు వదలుకోడానికి యిదికూడా ఒక కారణమని విన్నాను. ఈవేళ ఈ బొమ్మను చూడగానే నీవా సంగతే మరచిపోయావుకదూ, ఏ కారణముచేతనైనా మీ నాన్నగారు దీని కంగీకరింపకపోతే నీవు ఊరుకుంటావా? నిజం చెప్పు. ఇది వారికీ నచ్చుతుంది. వివాహమూ జరుగుతుంది. ఈఅమ్మాయి నీకు దైవమిచ్చిన భార్య అవుతుంది. నాకెంత సంతోషంగా ఉందదో చెప్పలేను. ఈ ఘటన వున్నచోట మన ఆలోచనలు, మన ఆశయాలు, మన పట్టుదలలు అన్నీ తారుమారవుతాయి' అంటుంటే

'చాల్లేవోయ్! యింక నీ వేదాంతం కట్టిపెట్టు' అన్నాను లేని కోపం అభినయిస్తూ. ఇలా సుమారు పదకొండుగంటలవరకూ కబుర్లు చెప్పుకుంచూ ఆ తరువాతను ఆత్మారాముని సంతృప్తిపరచి భుక్తాయాసం తీర్చుకున్నాము. సరిగా రెండు అయేసరికి మమ్మలను తయారైరమ్మని అచ్యుతరామయ్యగారి దగ్గర నుంచి కబురు రానే వచ్చింది.

మేము ఒక్క అరగంటలో అచ్యుతరామయ్యగారింటికి చేరుకున్నాము. అప్పటికి మా నాన్నగారు వచ్చినట్టున్నారు. ముందు సావిడంతా ప్లీడరుగారి స్నేహితులతో సందడిగా ఉన్నది. అన్నీ నిశ్చయమైనట్లే, గుమ్మాలకు తోరణాలు కట్టించారు. మా రాకకై కనిపెట్టుకున్నట్టు వీధిలో ఇద్దరు పెద్దమనుషులు నిలబడి మేము బండిదిగగానే, మమ్మలను సాదరంగా లోప

లకు తీసుకువెళ్ళారు. ముందు సావిట్లో మిత్రులతో మాట్లాడుతున్న అచ్యుతరామయ్యగారు మాకు ఎదురువచ్చి, కరచాలనం చేశారు. అక్కడ కూర్చున్నవారందరూ మందహాసాలతో లేచి నిలబడ్డారు. మేమూ అచ్యుత రామయ్యగారితో లోపలకు వెళ్ళాము. మా నాన్నగారు చిరునవ్వుతో నన్ను పలకరించారు. ముందు మాకు ఫలహారములు అందివ్వబోయారు.

మానాన్నగారు 'ముందు పిల్లను చూచి తరువాతను, ఈ లాంఛ నాలు సావకాశంగా జరుపుకుందామ' న్నారు.

అచ్యుతరామయ్యగారు సరేనని కన్యను తీసుకువచ్చి కూర్చోబెట్టడమూ, నేను మళ్ళీ మంత్రముగ్ధుడనై గుడ్లప్పచెపపి ఆపిల్లకేసి చూడడమూ, ఆ అమ్మాయి ఏమనుకుందో తెలియదుకాని, మందహాసంతో తనూ నాకేసే చూడడమూ తరువాత ఏం జరిగినదో మాకు తెలియదు. కాని తాంబూలాలు పుచ్చుకోవడం కూడా అప్పుడే నన్నారు మాటలేం జరిగి నాయో నాకు తెలియలేదు. రాజు నవ్వుతూ నా వెర్రిమొహం చూస్తూ కూర్చున్నాడు, అచ్యుతరామయ్యగారు వచ్చి నామెడకు జామారుకప్పి, నా చేతులలో తాంబూలం పెట్టడంతో మెలకువవచ్చి, ఇదేమిటన్నట్టు తెల్లబోయి చూశాను. మానాన్నగారు ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. ఇంతలో అచ్యుతరామయ్యగారు వారికి అమూల్యమైన జరీచాపుకప్పి, తాంబూలం అందించారు. అక్కడున్న వారంతా కరతాళధ్వనులు చేయకపోయినా అంత ఉత్సాహం వ్యక్తపరిచారు. పెళ్ళికూతురు వైపు చూడబోతే అక్కడ నాకు పున్నమిచంద్రుడు కనబడ్డాడు. ఆచంద్రబింబాన్ని మైమరచి చూస్తుండగనే ఆశీర్వచన మంత్రమాచెవిని పడడం, అక్షింతలు నామీద అన్నివైపుల నుంచీ పడడం జరిగింది.

అచ్యుతరామయ్యగారూ ఆయన భార్యా ఎంతో ఆనందంలో నా దగ్గ రకు వచ్చి అక్షింతలు వేశారు. మా నాన్నగారు కూడా దగ్గిరికివచ్చి ఎంతో ఆనందంతో, అర్ద్రితతో ఆశీర్వదించి, అక్షింతలువేశారు. ఆయనను చూస్తే నాకూ కళ్ళుతడిసినాయి. నేనులేచి ఆయనకు పాదాభివందనంచేశాను.

ఆయన ఒక్కసారి నా భుజంమీద చెయ్యివేసి దగ్గరకు తీసుకున్నారు. అత్తమామలకు కూడా పాధాభివందనం చేశాను. మా అత్తగారి ముఖంలో ఆనందం తాండవిస్తుంది. వచ్చిన బంధువులకూ మిత్రులకూ చందనతాం బూలాదులు అందించారు. వచ్చిన వారంతా ఒకరొకరే యింటి మొహం పట్టసాగారు. రెండు నిమిషాలలో హాలు ఖాళీ అయింది. నేనూ రాజూ మానాన్నగారూ మట్టుకు మిగిలాము. అచ్యుతరామయ్యగారు లేచి మా

నాన్నకు పాదాభివందనం చేసి,

'శాస్త్రులుగారూ నా ఆనందాన్ని వర్ణించలేకుండా ఉన్నాను. మమ్ము లను ధన్యులను చేశారు. పెద్దలంతా ఈకన్యాదనంతో యదార్థంగా తరి స్తారరు. సందేహంలేదు. మా అమ్మాయి జాతకం చాలామంచిదని, అది చాలా అదృష్టవంతురాలనీ, తానుసుఖపడి యితరులను సుఖపెట్టగలదనీ సిద్ధాంతులు చాలామంది అనేవారు. నేడది యదార్థమేనని సంతోషిస్తు న్నాను. ఇదంతా తలవని తలంపుగా ఊహించలేనంత వేగంతో క్రియాసిద్ధి కావడానికి కారకుడు మా రాజు, మీపార్వతీశం స్నేహితుడు. దైవఘటన అంటే ఏమిటో ఇంత ప్రత్యక్ష నిదర్శనం ఎక్కడా చూడలేదు. ఇంకనేమీ అనలేకుండా ఉన్నాను' అన్నారు కొంచెం గాద్గదికతో.

మా నాన్నగారు ఆయన రెండుచేతులూ పట్టుకుని కూర్చోబెట్టి,

'నాకు చాలా సంతోషంగా ఉన్నదండీ. నిజంగా యిది దైవఘటనే. తమపేరు చాలా కాలంనుంచీ నాకు సుపరిచతమే. అయినా ఈ పరి ణామం కేవలం దైవికమే కదా. మా వాడి జాతకమూ చాలాగొప్పదనీ వాడూచాలా ఉన్నతస్థితికి వస్తాడనీ అత్యంత రూపవతీ, గుణవతీ శీలవతి అయిన కళత్రం వస్తుందనీ, ఆమెతో మా గృహానికి అష్టైశ్వర్యములూ తీసుకువస్తుందనీ పెద్దలనడం, నాకూ ఆ నిశ్చయమే ఎంతో కాలంనుంచి ఏర్పడడమూ, తత్సంబంధమైన ఆశలు పెంచుకుంటూ, కలలుకంటూ, కాలక్షేపం చేసుకుంటున్నాను. ఈ నాటికి తమరు నిన్నరాత్రి వచ్చి మీ అభిప్రాయం వ్యక్తము చేయగానే ఈనాడిక్కడికివచ్చి లక్ష్మితాండవిస్తున్న మీ అమ్మాయి ముఖం చూడడముతోనే నా కలలన్నీ నిజమయ్యాయనీ, నా తపస్సు ఫలించిందనీ ఎంత ఆనందించానో చెప్ప శక్యము కాదు. అన్నిటికంటే విశేషం మా వాడికి చిన్న పిల్లని చేసుకోవడం, రజస్వలకాని పిల్లను చేసుకోవడం సుతారమూ ఇష్టము లేనట్లు నాకు తెలియపరిచాడు. ఈనాడు మీ అమ్మాయిని చూడడంతోనే వాడికే సందేహాలన్నీ, అభ్యం తరాలన్నీ గాలితో ఎగిరిపోయాయి. ఆ అమ్మాయి చూపులకు వశుడై పో యాడు. నిన్న సాయంత్రం మావాడు ఒంటరిగా చూడడానికి వచ్చినప్పుడు ఆ అమ్మాయి పేరుగానీ, వయస్సుగానీ, చదువును గురించిగానీ, ఏ ఒక్క ప్రశ్నా వేసి వుండడని నా ఊహ' అని నాకేసితిరిగి ఏమిటి అబ్బాయీ నే నన్నది నిజమేనంటావా అన్నారు. ఈ అనుకోని ప్రశ్నకు నే నానం దంతో ఉక్కిరిబిక్కిరై సిగ్గుతో పెళ్ళికూతురిలా తలవంచుకుని ఏమాటా చెప్ప లేకపోయాను.

నాబదులు నాకాబోయ్యే మామగారే తమ ఊహంతా సరియైనదేన న్నారు మందహాసంచేస్తూ. నేనీ సంభాషణాధోరణికి కొంచెం యిబ్బంది పడుతూ యిది మార్పించవలెననే ఉద్దేశ్యంతో. మా అమ్మ రాకపోవటం ఏమి బాగుందికాదు. నాకెంతో వెలితిగానూ, యిబ్బందిగానూ ఉన్నది అన్నాను మా నాన్నకేసి చూస్తూ.

'ఓరివెర్రివాడా మీఅమ్మను శ్రమపెట్టడ మెందుకూ? రెండుమూడు రోజులలో మీకాబోయే మామగారూ, అత్తగారూ, తమ కుమార్తెతో సహా యితర బంధుమిత్రులతో సహా మనించికివచ్చి అక్కడ కూడా తాంబూలాలు యిస్తారు. అప్పటికికాని మీ అమ్మకు తృప్తిగా ఉండదని ఈ ఏర్పాటు చేశాను. నీకు సంతోషమేగదా' అన్నారు.

నా ఆనందానికి మేరలేదు. మానాన్నగారు లేచి బావగారూ ఇంక నాకు సెలవిప్పించండి. నేను వెంటనే బయలుదేరకపోతే రాత్రికి యిల్లు చేరుకోవడం కష్టమవుతుంది అన్నారు.

అచ్యుతరామయ్యగారు తమరంత తొందరపడవలసిన పనిలేదు. తమ రుపాదప్రక్షాళణాదికములు ముగించుకుని ఫలహారం తీసుకుని వెడుదురు గాని, మిమ్ములను ఇక్కడకు తీసుకువచ్చిన మోటారుకారు మళ్ళీ తీసుకువెళ్ళి క్షణంలో మీ యింటిదగ్గర మిమ్ములను దిగవిడిచి వస్తుంది అన్నారు.

మానాన్నగారు నవ్వుతూ

'అయితే యికనేం. సంబంధం అనుకున్న క్షణంనుంచీ మాకు వాహ నయోగం పట్టిస్తున్నారన్నామాట. యినయితే అస్తమానమూ మేము కారు ఎక్కి తిరగడమూ, మా కారుకూతలతో అందరినీ హడలగొట్టడం తప్పదన్న' మాట అన్నారు.

అందరమూ విరగబడి నవ్వేము. మా నాన్న ఇంత చమత్కారంగా మాట్లాడతారని నేను ఎన్నడూ ఎరుగను.

త్వరలో ఫలహారాలు ముగించుకుని మానాన్న బయలుదేరుతూ నాయనా నువ్వూ వస్తున్నావా, లేక యింకోపూట ఆగి మరోమాటు పెళ్ళికూతురిని చూచి వయస్సూ వగైరాలు కనుక్కుని మరీ వస్తావా అన్నారు నవ్వుతూ.

నేనేమీ సమాధానం చెప్పలేక పొంగి పొరలివచ్చే ఆనందాన్ని ఆపుకో లేక తలవంచుకుని నిలబడ్డాను. మా నాన్నగారు నా అభిప్రాయం గ్రహించి.

'సరే నీయిష్టం. నీ వీలు చూసుకుని పెళ్ళివారితో కాకుండా రెండు పూటలు ముందుగా రా, కావలిస్తే వారు మనవూరినుంచి వెళ్ళేటప్పుడు వారితోకూడా వెళ్ళి వారిని దిగబెట్టి రావచ్చు' అంటూ అచ్యుతరామ య్యగారు వెంటరాగా గబగబవెళ్ళి వాకిట్లోవున్న కారులో కూర్చున్నారు. వెంటనే కారుబయలుదేరి వెళ్ళిపోయింది.

మా నాన్నగారు వెళ్ళగానే నేనూ, రాజూ అచ్యుతరామయ్యగారి దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాము. ఇంటికెళ్ళబుద్ధికాలేదు. వూరంతా ఏపనీ లేకుండా, ఏ ఉద్దేశమూ లేకుండా, అట్టే సంభాషణకూడా లేకుండా వీధులన్నీ బలాదూరు` తిరిగి ఏటి ఒడ్డుకు చేరుకున్నాం. మామూలుచోటనే చతికిలపడ్డాము. కొన్నినిమిషాలు మౌనం అయిన తరువాతను

'నీకీ ఆలోచన ఎందుకు తోచింది రాజూ' అన్నాను.

ఎందుకంటే ఏం చెప్పను? ప్రత్యేక కారణం ఏమీలేదు. నీవిలా చిన్నపిల్లను చేసుకుంటావా? అనే సందేహం నాలో కలగకపోలేదు మీ నాన్నకూ, నీకూ ఈ విషయంలో పెద్ద ఘర్షణ జరుగక తప్పదుకాబోలు. అది ఎలా వారించడమా అని అనుకుంటూనే ఉన్నాను.

మొన్నను హఠాత్తుగా మాయింటికి ఎవరోవచ్చి మానాన్నగారితో మాట్లాడుతూ మాటల మధ్యను అచ్యుతరామయ్యగారు కూతురికి వివాహ ప్రయత్నం చేస్తున్నారనీ, త్వరలోనే ఏదో ఒక సంబంధం నిశ్చయించుకుని వివాహం చేస్తారనీ అనుకుంటున్న మాటలు చెవినిపడ్డాయి. ఆయున వెళ్ళిన తరువాతను నాకు మెరుపులా ఈ ఆలోచన తోచింది. మా నాన్నగారితో ఈ ప్రశంసచేశాను. ఆయన కూడా ఎంతో సంతోషించి వారంరోజులనుంచి ఈ అబ్బాయి ఇక్కడ ఉంటున్నా మనయిద్దరకూ కూడా ఈ ఆలోచన కలుగకపోవడమేమిటి? చాలా చిత్రంగా ఉంది. అయినా ఇప్పుడు మించి పోయిందిలేదు. శుభస్యశీఘ్రం అన్నారు. అనడం తడవుగా వెంటనే చొక్కా తొడుక్కుని కండువా పైన వేసుకుని పరిగెత్తేరు అచ్యుతరామయ్యగారిం టికి ఇంకేముంది? ఈ శుభం జరిపించటానికి నిమిత్తమాత్రులు ఎవరా అని పరమేశ్వరుడు ఆలోచిస్తున్న తరుణంలో మా నాన్నగారు ఈ పనికి పూనుకోవడంతోనే ముక్కోటి దేవతలూ ఏకగ్రీవంగా తథాస్తు అన్నట్లు అయింది.

కాసీ పార్వతీశం, ఈ వేళ అక్కడ నిన్నూ, ఆ అమ్మాయినీ చూస్తుంటే ఒకరి కొకరు మీమీపుట్టుకలతోనే ఏర్పాటయినట్టూ ఈబాం

ధవ్యం మీకే నాటిది కాదన్నట్టూ, ఏవేవో వింత భావాలు నా తలలో పరుగులెత్తి నన్నెంతో పరవశుడిని చేశాయి. ఒక పురుషుడికి తగిన స్త్రీ ఒక్కతే పుట్టుకతోనే ఏర్పాటై ఉంటుందన్నది, యిక్కడ రుజువైనట్లు మరెక్కడా ఉండదనుకుంటాను. ఆ అమ్మాయికి పధ్నాలుగో సంవత్స రమట. ఇంకా రజస్వల కాలేదట. అందుకని వారి తల్లిగారూ ఆమె తరపు పెద్దలూ ఆమూడు ముళ్ళూ వేయించమని వత్తిడి చేస్తున్నారట. కానయితే ఈ తండ్రికీ కూతురుకి మట్టుకు ఆ తరువాయి తీరి చదువు పూర్తయిన తరువాతనే వివాహం అనుకుంటున్నా వీరి ఆలోచనలు సాగ వని నిశ్చయము చేసుకున్నారు. మానాన్నగారు ఈ సంబంధం చెప్పగానే వారువచ్చి నిన్ను చూడటంతోనే నీకోసమే ఇన్నాళ్ళ నుంచి నిరీక్షిస్తున్న ట్టుగా మరొక ఆలోచన యెప్పుడూ లేనట్టుగా వెంటనే అంగీకరించడం ఆశ్చర్యంగా లేదూ! నీవు అదృష్టవంతుడవు పార్వతీశం. నేనెన్నడూ ఎక్కువగా నమ్మని మాటను ఈనాడు పరిపూర్ణమైన విశ్వాసంతో ఉపయోగిస్తున్నాను. మనము మొదట కలుసుకున్న గడియలు మనకెంత ఆనందదాయకములైనవో, అంతకంటే వేయిరెట్లు మీ ప్రథమవీక్షణ క్షణ ములు ఆనందదాయకములుకాగలవు. నమ్ము నామాట' అని ఒకనవ్వు నవ్వి "ఇవన్నీ నీతో ఏదో ముసలివాడిలానేనంటున్నాను. కానీ నాకప్పుడే ఈ భావాలు నాలో స్థిరమై ఆనందిస్తూ మతిపోగొట్టుకున్నట్టు నీ వెర్రి మొహం చూస్తేనే తెలుస్తోంది" అన్నాడు.

నేను లేచి ఒక్కటి తగలనిద్దామనుకున్నాను. నా వూహ కనిపెట్టి నట్టు చటుక్కున లేచి పరిగెత్తాడు రాజు. నేనూ అతనిని అనుసరించక తప్పలేదు. మరునాటి సాయంకాలానికి మా యింటికి వెళ్ళిపోయాను.

ఇంటికి వెళ్ళగానే మా అమ్మ వాకిట్లోకి పరుగెత్తుకొచ్చి నాకు దిష్టి తీసి కాళ్ళు కడుక్కోమని నన్ను దగ్గరకు తీసుకుని చిన్నపిల్లవానిలా ముద్దె ట్టుకుంది. ఆమె కంట ఆనంగ బాష్పములు కారినాయి. నాకంటిధారలు కూడా ఆమెపై పడినాయి. మాకిద్దరకూ కొన్ని నిముషములు ప్రపంచం తెలియలేదు. నన్ను అలాగే పట్టుకుని లోపలికి తడబడే అడుగులతో తీసుకు వెడుతూ గాద్గదికమైన గాత్రంతో.

"నా తండ్రీ నా సంతోషానికి మేరలేదు. నాన్నా ఈ మధ్యను నీ వివాహ విషయంలో ఏం జరుగుతుందా, ఏం పేచీలు వస్తాయా అని మేము ఉభయులమూ పడుతున్న ఆరాటము నిన్నటితో తీరిపోయింది. మేమింక ఏమైనా యిబ్బందిలేదు. మీరు వెయ్యేళ్ళు సుఖజీవనముచేసుకోండి

అన్నది.

మరి రెండు రోజులకు భీమవరం నుంచి అచ్యుతరామయ్యగారు బంధు మిత్రులతో పెండ్లికుమార్తెతో సహా వచ్చి, ఇక్కడ తాంబూలాలు యిచ్చారు. అచ్యుతరామయ్యగారూ, భార్యా ఆమె తలిదండ్రులు యిద్దరూ వయోవృద్ధులు మా యిల్లూ, యిక్కడి పద్ధతులూ, మా తలిదండ్రుల సదాచార సంపత్తిచూచి బ్రహ్మానంద భరితులయ్యారు.

ఈ తాంబూల కార్యక్రమం అయి వారు నర్సాపురం వెళ్ళిపోయి నప్పటి నుంచీ మా అమ్మ ఎంత ఆనందాన్ని అనుభవిస్తూందో చెప్పలేను. ఏ క్షణాన చూచినా నేలమీద నడుస్తున్నట్లుగాక, గాలిలో తేలిపోతున్నట్లే కనపడేది. ఆమె వికసిత వదనం చూస్తే నాకే పట్టరాని సంతోషం వచ్చేది కొడుకుకేదో శుభం జరగబోతున్నదని, ఇతర దేశాలలో ఏ తల్లి అయినా, ఒక్కక్షణమైనా, ఇంత ఆనందాన్ని అనుభవించగలదా అనుకున్నాను. మన దేశంలో కూడా అందరు తల్లులూ యిలాగే వుంటారా అని అనుకుంటుంటే "కొడుక్కి పెళ్ళి అవుతుందన్న సంతోషమే కాని కోడలు వస్తుందన్న సంగతి తోచలేదు కాబోలు" అనే సామెత జ్ఞాపకం వచ్చింది. కొంచెం నవ్వూవచ్చింది. మా అమ్మమాట ఎలా ఉన్నా నేను నేలమీదా, గాలిలోనూ కాకుండా ఎక్కడ విహరిస్తున్నానో నాకే తెలియడం లేదు. తలలో ఏవేవో ఊహలు ఆనంద తరంగాలు ఉవ్వెత్తుగా లేచి పడుతుంటే, నా తల నన్ను విడిచి ఎక్కడికో పోతోంది అనిపించేది ఒక్కొక్క క్షణంలో, ఇలా ఎన్నాళ్ళు గడిచిందో పగలు తిన్నానో లేదో, రాత్రి నిద్రపోయానో లేదో, అసలు ఏది పగలో, ఏది రాత్రో తెలియకుండా నేవున్న స్థితిలో మానాన్నగారు నెలరోజులలో వివాహానికి ముహూర్తం ఏర్పాటుచేసి నర్సాపురం వర్తమానం చేశానని చెప్పారు. దానితో ఈ నెలరోజులూ ఎలా గడుస్తవా అనే భావము తుపాకి దెబ్బలా తగిలింది. వెంటనే వివాహము ఇప్పుడైనా ఆ మరునాటి నుంచీ నాభార్య ఆ ఎడింబరోలో పిల్లలాగా వచ్చి నాఒడిలో కూర్చుని, నా కంఠం కౌగలించుకుని నన్ను ముద్దాడుతుందని భ్రమపడక అని ఎవరో వీపుతట్టి హితబోధ చేసినట్టు అనిపించింది. అప్పుడు స్ఫురణకు వచ్చింది. నా భార్య చిన్నపిల్ల అన్న సంగతి. మళ్ళీ కొంతకాలం ఈవూహా ప్రపంచంలోనే మనిషి ఒకచోటా మనసు ఒకచోటా ఉండాలి కాబోలు, ఎన్నాళ్లో కదా అని యిప్పుడే గుండెల్లో రాయిపడ్డది.

చాలా చిత్రం ఎడింబరోలో సంవత్సరమూ అంతకుపైనో ఆ అమ్మాయితో అంత సన్నిహితంగా, అంత ఉత్సాహంగా గడిపినరోజులలో కూడా

యిక్కడేమీ అటువంటిది లేకుండానే ఇంత అంతులేని, భరించలేని ఆనందం కలగటానికి కారణమేమిటా అనే ఆలోచనపోయింది. దీనికే కాబోలు మన వాళ్ళు జననాంతర సంబంధమని అంటారనుకుని సమాధానం చెప్పుకుని, రోజులు లెక్కపెట్టుకోవడంలో తడబడుతూ కాలక్షేపం చేసుకుంటున్నాను.

నా లెక్క లేకుండానే మానాన్న నన్నేవిధమైన సహాయమూ కోర కుండానే ఏ పనీ నాకు పురమాయించకుండానే శుభలేఖలు వేయించి పంపించడం దగ్గర నుంచీ, పందిళ్ళు వేయించి తోరణాలు కట్టేవరకూ సమస్తము తానే చూసుకున్నారో, మరెవరైనా తోడ్పడ్డారో నాకు తెలియ కుండానే ఈ నెల 'పూర్తి అయినదోలేదో కూడా నా లెక్కతేలకుండానే, ఒకరోజు ఉదయం మా అమ్మ నన్ను తెల్లవారుజామునలేపి, త్వరగా నీ పనులు ముగించుకోనాయనా, యీ వేళ నిన్ను పెళ్ళికొడుకునుచేయాలి. అన్నది.

దానితో నేను ఉలిక్కిపడిలేచి ఈవేళ ఏమిటమ్మా యింకా పది పదిహేను రోజులు ఉన్నది కదా అన్నాను మర్చిపోయి.

ఆమె నవ్వుకుంటూ ఓ వెర్రితండ్రీ ఎల్లుండే వివాహం. ఇవేళ పెళ్ళి కొడుకుని చేయడం, రేపు స్నాతకం చేసుకోవడం. ఎల్లుండి నర్సాపురం తరలివెళ్ళడం అన్నది ఎంతో తేలికగా. మనబంధువుల రాకకూడా గమనిం చలేదుట్రా వెర్రివాడా అన్నది. నేను మారుమాటలేకుండా నా కార్యక్ర మమంతా అతి వేగంగా అనగా సుమారు ఒక గంటలోనే ముగించుకుని తయారయ్యాను.

పెండ్లి కుమారుణ్ణి చేయడమంటే ఏమిటో నాకు తెలియలేదు ఊరికే తలంటుపోసి, కొత్తబట్టలు కట్టుకోమంటారు కాబోలు ననుకున్నాను. ఈ తతంగం ఎప్పుడూ చూచిన జ్ఞాపకంలేదు. మా అమ్మ ఎవరినో పదిమంది ముత్తైదువులను పిలిచి, ఏదేదో చాలా గొడవ చేసింది. ఏమిటీ వెర్రి అంతా అనుకున్నాను.

మరునాడు మళ్ళీ సూర్యోదయం కాకుండానే లేపి స్నాతకమంటూ కొంత తతంగం, మా నాన్నగారు జరిపించారు. ఇదంతా చాలావరకు పురుషుల వ్యవహారం. ఆడవాళ్ళు ఊరికే వేడుక చూడటానికి మట్టుకు వచ్చారు. కొంతసేపు అయిన తరువాతను నన్ను కాళ్ళకు కొత్తజోడు తొడుక్కోమని, తాటాకుగొడుగు చేతికిచ్చి ఏదో చిన్నమూట బుజానికి తగి లించి 'నడువు ముందుకి' అన్నారు.

'ఎక్కడికి'న్నాను.

బాజాభజంత్రీలు వాద్యం ఆరంభించారు. ప్రయాణం అవుతున్నప్పుడు అలా అడగడం అపశకునంరా. అన్నాడు ఒకతను.

ఓయి వెర్రిమొగమా కట్నం చాలదనో పిల్ల బాగాలేదనో నాకీ పెళ్ళే అక్కరలేదనో ఈ మేళతాళాలతోటి నువ్వు ఇప్పుడు కాశీకి లేచిపోవాలన్న మాట. అప్పుడు మీ మావగారో, బావమరదో వారొచ్చిన సంగతి పాపం నువ్వు గమనించలేదు కాబోలు - ఇంత తొందరపాటు కూడదనీ మంద లింపు లాంటి బ్రతిమాలింపుతో ఓ వీసెడు బెల్లపు అచ్చుతో గడ్డంకింద కొట్టి ఆపుతారన్నమాట - అన్నాడు.

'బావగారూ మీరలా మామీద ఆగ్రహించి, ఈ శుభసమయంలో అమాంతం కాశీ లేచిపోతానంటే ఎలాగ చెప్పండి? మీకు మా చెల్లెలునిచ్చి వివాహం చేయడానికి సమస్త ఏర్పాట్లు చేసుకున్నాముకదా? ఇప్పుడు ఎలా చెప్పండి. ఈమాట తాంబూలాలు పుచ్చుకున్నప్పుడేనా చెప్పారు కారు' అంటూ బావమరదులూ, బావమరది వరసవారూ మీ అత్తవారి తరపు వారూ వేళాకోళాలుచేసి పది అడుగులేనా ముందుకి సాగనివ్వకుండా ఆపుచేఏసి, నా గొడుగు ఒకళ్ళూ, చెప్పులు ఒకళ్ళూ లాక్కుని -

'చాల్లేవోయి మహా వెళ్ళావు ఏలాగయితేనేం' అని మా మామయ్య కాబోలు నన్ను తీసుకువెళ్ళి మళ్ళీ పీటమీద కూలవేశాడు.

ఏమిటీ నాటకమంతా అనుకుని నాలో నేను నవ్వుకున్నాను.

'బావగారూ గడ్డంకింద బెల్ల కొట్టినప్పుడు గట్టిగా తగలలేదుకదా' అని మా బావమరదీ

'నాలిక కరచుకోలేదుకదా' అని మరొక అబ్బాయీ, అంటుంటే

'కరచుకునే ఉంటారురా అందుకనే బెల్లం అంతా గడ్డాన్నే ఉండి పోయిందీ' అని మరొకరూ నన్ను వేళాకోళం పట్టిస్తుంటే, యిదంతాకూడా ఎంతో సరదాగానే ఉంది. ఇంతలోనే ఆశీర్వచనపనస అందుకున్నారు. ఆశీర్వచనం, మంగళహారతులూ అయిపోయినాయి. నేను పీటమీదనుంచి లేచి లోపలకు వెళ్ళిపోయాను. తరువాత మరొక గంటతో భోజనాలు, అక్కడ మళ్ళీ కుర్రకారంతా నాకు ఇటూ, అటూ చేరి

'పార్వతీశంగారికి ఈవేళ బొత్తిగా అన్నహితవు పోయినట్టుందే' అని ఒకరూ.

'అదేమిటిరా ఆయన పాపం విస్తరి దగ్గర కూర్చున్నారా ఆయన ఎక్కడో ఉన్నామని అనుకుంటున్నారు' అని మరొకరూ.

'మరో ఇరవైనాలుగు గంటలు ఎలా గడుపుతావు బాబూ' అని ఇంకొకరూ.

ఏ నేతి వడ్డనకో మనిషి వచ్చినప్పుడు 'ఆయన వేయించుకోడం అయిపోయింది మళ్ళీ మళ్ళీ పరాకుగా ఉన్నారుకదా అని అలా బలవంత పెట్టకండి' అని ఇంకొకరూ.

పిండివంటలు వచ్చినప్పుడు 'బాబ్బాబూ ఆయనను వేధించకండి ఆయనకు తీపన్న బొత్తిగా సయించదు, నమ్మండి నామాట' అని వేరొకరూ,

ఇలా రకరకాలుగా, వేళాకోళాలతో, నవ్వులాటలతో, ఎలాగో భోజనం అయిందనిపించారు. తాంబూలాలు తీసుకుని ఎవరి దారిని వారు వెళ్ళ గానే నర్సాపురం నుంచి వచ్చిన మా అత్తవారి తాలూకు వారు కూడా వెంటనే వెళ్ళిపోయారు. ఇంకనక్కడ నుంచి మా బంధువర్గమంతా, కావ లసినంత కోలాహలంతో, ఇంటిపనులూ, సవరణా, పిల్లలసముదాయింపులూ, ఒకళ్ళతో ఒకళ్ళు పరాచికాలూ, ఆ తరువాత ప్రయాణానికి పెట్టె సర్దుకో వడంతో కావలసినంత సందడీ, కోలాహలమూనూ. ఎలాగో ఏం జరిగిందో ఎవరేం చేస్తున్నారో, ఏమంటున్నారో నాకేమీ తెలియదు.

# 12

నేనింకా తెల్లవారిన తరువాత కాబోలు ప్రయాణం అనుకొని యింట్లో ఈ కోలాహలంలో కూర్చోలేక ఒకరిద్దరు బంధువుల కుర్రాళ్ళను తోడుతీసి కొని అంతా అలా మా పొలాలవైపు కబుర్లు చెప్పకుంటూ వెళ్ళిపోయాము. మేము యింటికి వచ్చేటప్పటికి బాగా చీకటిపడ్డది. మా అమ్మా వాళ్ళూ నేనెక్కడికి వెళ్ళానో ఇంకారాలేదేమిటా అని కంగారుపడుతున్నారు. మా వీధివీధి అంతా రెండెడ్ల బళ్ళతో నిండిపోయింది. కొన్ని బళ్ళలో అప్పుడే సామాను ఎక్కించారు. యువదంపతులు కొందరు, ఒక్కొక్కళ్ళకు ఒక్కొ క్కబండి చొప్పున కేటాయించుకుని, ఆబళ్ళలో పరుపులుకూడా పరచుకొని సిద్ధం చేసుకున్నారు. వృద్ధులు కొందరు ఈస్వారస్యం గ్రహించలేకనో, లేక మర్చిపోయో ఇలా అయితే ఎలాగర్రా ఈ లెక్కను మనకు వందబళ్ళు

అయినా చాలవు.

సిగ్గు బిడియాలు లేక పరువులుకూడా పరుచుకున్నారు. ఇవి బళ్ళు అనుకున్నారా, గర్భాదానపు గదులు అనుకున్నారా? వేషాలు. వేషాలా" అని అంటూ వీధి అంతా మార్మ్రోగేట్లు కేకలేయటం మొదలుపెట్టారు.

ఈ గందరగోళంలో నేనూ, నాతోవచ్చిన కుర్రవాళ్ళూ యింటికి చేరుకున్నాము. వీధి చివరకు మాకీ కేకలు వినపడ్డాయి. నేను వర్తమానం అంతా మర్చిపోయి.

'ఏమిట్రా ఈ బళ్ళు ఏమిటీ, వీధిలో నుంచుని నర్సాపురం దాకా వినబడేటట్లు ఈ గర్భాదనపు గొడవ ఏమిటి' అన్నాను.

'అదేమిటలా అడుగుతేవేమిటి, ఇంకో అరగంటలోనో, గంటలోనో మనము భీమవరానికి బయలుదేరాలికదా' అన్నాడు ఓకుర్రవాడు. అప్పటికి నాకు తెలివి వచ్చి.

'యిప్పుడేనా బయలుదేరడము' అని కంగారుగా యింట్లోకి దౌడుతీశాను. మా అమ్మ నన్ను చూడడముతోనే పరుగెత్తుకువచ్చి -

ఏమిరా నాయనా ఎక్కడికి వెళ్ళావు. ఇంత ఆలస్యము చేశావు. అందరి భోజనాలూ అయిపోయినాయి. బళ్ళు ఎక్కడానికి సిద్ధంగా ఉన్నారు. త్వరగా కాళ్ళు కడుక్కుని నువ్వుకూడా రెండు మెతుకులు నోట్లో వేసుకురామ్మా అన్న ఆమె వాక్యం పూర్తికాకుండానే నేనుహడావిడిగా దొడ్లోకి వెళ్ళి కాళ్ళూచేతులూ కడుక్కుని వచ్చేటప్పటికి, నాకు కంచంలో భోజనం సిద్ధంగా అమర్చారు.

నాకేదో ఉత్సాహమూ, ఉద్రేకమూ అన్నం తినబుద్ధికాలేదు. వడ్డించిన పిండివంటలు సహా ఏదీ హితవుగా లోపలికి పోలేదు. మా అమ్మ అన్నట్టుగానే ఎలాగో రెండు మెతుకులు మూతికంటించుకుని లేచి బయటబడ్డాను. ఇంతట్లోకే ఎవరో పాలకీ బోయీలు వచ్చారా అని కేకలేస్తున్నారు. నా గుండె ఆగిపోయింది. ఇదెక్కడ గొడవ వచ్చిపడ్డది ఇప్పుడు ఇన్నేళ్ళు వచ్చి పల్లకిలో కూర్చుని, భీమవరందాకా ఊరేగుతాననుకున్నారు కాబోలు, అని అర్ధోక్తిలో అంటూ మా అమ్మదగ్గరికి పరుగెత్తాను. 'అమ్మా' అని ఆ ఉద్రేకంలో కొంచెం గట్టిగా కేకవేసేసరికి

ఏం నాయనా అంటూ ఏ పనిమీదనో ఉన్నమనిషి కంగారుగా పరుగెత్తుకొచ్చింది.

'ఏమిటమ్మా వాళ్ళు ఎవళ్ళో పాలకీ గీలకీ అంటున్నారేమిటి' అన్నాను కొంచెం కోపంగా.

'అదేమిటరా, వెర్రిమొహమా, పెళ్ళికి పాలకీ లేకపోతే ఏలాగురా. పెళ్లివారంతా బళ్ళలో వస్తారు. పెళ్ళికొడుకు పాలకీలో వెళ్ళాలమ్మా, ఇన్నేళ్ళు వచ్చినా ఇంకా అంత అమాయకత్వమేమిట్రా. ఎవళ్ళేనా వింటే నవ్విపోతారు కూడాను' అంటూ మా అమ్మ పరుగెత్తుకెళ్ళి నాకు ఒక కొత్త పంచా, కొత్త చొక్కా నాకు తెలియకుండా ఎప్పుడు కుట్టించారో ఒక ముఖమల్ కోటూ, ఒక పెద్ద జరీ కండువా, చుట్టూ చెమికి కుట్టిన ఒకముఖమల్ టోపీ, ఒక వెండి పళ్ళెంలో పెట్టి తీసుకువచ్చి నాయనా కట్టుకున్న బట్టలు విడిచేసి. ఈ బట్టలు కట్టుకో అన్నది ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

నాకు కాళ్ళలో దడపుట్టుకు వచ్చింది. అక్కడే చతికిల పడతా నేమో అని భయం వేసింది కూడాను. ఎందుకేనా మంచిదని అంతపని జరగకుండా అక్కడున్న బల్లమీద చతికిల పడ్డాను. మా అమ్మ కొంచెం కంగారుపడి.

'ఏం నాయనా ఒంట్లో బాగాలేదా' అంది.

ఒంట్లో బాగానే ఉన్నదమ్మా. నిక్షేపంగా ఉంది. ఎటోచ్చి ఈ నాటకం దుస్తులు చూడగానే కొంచెం కళ్ళు బైర్లుకమ్మి, దడవచ్చి, ఇలా కుప్పలా కూలబడ్డాను. ఈ కోటూ టోపీ ఏ కమ్మవారింట్లోనో, రాజుల యింట్లోనో ఎరువు తెప్పించావా. లేక మన సొంతమేనా? కొంపతీసి మా తాతగారో, మీ తాతగారో పెళ్ళినాడు ధరించిన అమూల్య వస్త్రములు కాదుకదా. ఈ శుభకార్యము అయిన తరువాతను ఇవి నా మనుమడికి మునిమనుమడికి జాగ్రత్త పెట్టవలసిన బాధ్యత నీదేసుమా' అన్నాను. మా అమ్మ విరగబడి నవ్వింది. ఆమె అలా నవ్వడం ఎప్పుడూ చూడ లేదు. ఒక క్షణంలో మళ్ళీ సర్దుకుని ఇది నీకోసమే. మీ నాన్నకుకూడా చెప్పకుండా నేను కుట్టించానురా. అప్పుడే నీతోటి చెబుతే ముందే నువ్వు దెబ్బలాడతావని నేను పోపుల పెట్టెలోనూ వత్తుల పెట్టెలోనూ అప్పుడ ప్పుడు దాచుకున్న డబ్బు ఖర్చుపెట్టి యివి తొడుగుకుంటే నువ్వు ఎంత బాగుంటావో అని వూహించుకుంటూ, మురిసిపోతూ, రోజూ ఒకమాటు వీటిని చూస్తూ ఎంతో భద్రంగా ఈ నెలరోజులనుంచీ నీకంటపడకుండా దాచిపెట్టాను అన్నది.

చాలా సంతోషము అమ్మా నామీద నీకు ఎంత అభిమానమో, ముద్దో నాకు తెలుసు. ఒక్కమాట చెబుతాను. నీవేమి అనుకోకు. ఈ కోటూ, టోపీ మనవాళ్ళు ఎవళ్ళూ తొడుక్కోరమ్మా. ఈ మాటు ఎప్పుడైనా నేను నాటకంలో రాజు వేషం వేస్తే అప్పుడు తొడుక్కుంటాలే. ఈ లోపుని మన గ్రామస్థులు ఎవరియింటనైనా వివాహం జరిగితే, ఈ పెళ్ళి కొడుకులకు ఓమాటు ఎరువు ఇస్తూవుండు. వాళ్ళు చాలా సంతోషిస్తారు. ఇవి సద్వినియోగము అయినట్టూ వుంటుంది అన్నాను.

మా అమ్మ నిశ్చేష్టురాలయింది.

'పనిలోపని ఇంకొక్కమాట కూడా చెబుతాను. నువ్వు కోపపడ కూడదు. నేను పాలకీలో ప్రయాణం చెయ్యలేను. చెయ్యను ఎవరేమను కున్నాసరే' అన్నాను ఖచ్చితంగా.

ఇందాకా నాకువచ్చినంత దడా, • ఒణుకూ యిప్పుడు మా అమ్మకు వచ్చి నా పక్కను కుప్పలా కూలబడ్డది. కళ్ళనీళ్ళు వచ్చాయి. ఆమెకు.

'ఇదేంట్రా నాయనా శుభంపలకరా మంకెన్నా అన్న సామెతలో లాగ ఈ అమంగళాలు ఏమిట్రా? పెళ్ళికి పల్లకీలో కాకపోతే మరెక్కడ కూర్చుంటారురా. నీకు తెలియదు నాయనా. అలాంటి మాటలనకు. ఎవళ్ళేనా వింటే నవ్విపోగలరు కూడాను. ఇదేం తప్పుపనా. ఎవళ్ళూ చేయనిపనా? పల్లకీ వద్దంటావేమిట్రా వెర్రివాడా. మీనాన్నవింటే



ఇప్పుడో పెద్ద గందరగోళం లేవతీస్తారాయన. పెళ్ళివారందరూ తలో మాటా అని నిన్ను వేళాకోళము పట్టిస్తారు. ఏమైనాసరే, పాలకీ మట్టుకు తప్పదుసుమా' అంటూ నా భుజంమీద చెయ్యివేసి, నన్ను దగ్గిరకు తీసుకుని, రెండుచేతులతోనూ నాబుగ్గలు నిమిరి, తన కణతలకు నొక్కుకుని, వేళ్ళు విరుచుకుని 'నాయనా ఇలాంటప్పుడు నువ్వేమీ పట్టుబట్టకు బాగుండదు' అన్నది రుద్ధకంఠంతో, బాష్పనయనములతో.

నేను ఏమనాలో నాకు తోచలేదు 'అమ్మా నువ్వు ఎన్ని అన్నా సరే ఏమి చెప్పినా సరే పడతాను వింటాను, కాని ఆ కోటూ, టోపీ నేను వేసుకోను. పాలకీలో కూర్చోను. మనము సరదాగా బండిలోనే వెడదాము' అన్నాను. గంభీరంగా. నామాటకు తిరుగుండకూడదన్నట్టు.

మారుమాట లేకుండా ఆవిడ ఒణుకుతూ, తూలుతూ లోపలికి వెళ్ళింది. మా నాన్నతో చెప్పింది కాబోలు, ఉత్తరక్షణంలో ఆయన దగ్గరకు వచ్చారు. రాగానే ఆ బట్టలు మీద పడ్డవి కళ్ళు.

'ఇదేమిటిరా ఎవరు యిచ్చారు' అన్నారు.

'సరదాగా, నా పెళ్ళికానుకగా మా అమ్మ యిచ్చిన మాతృభిక్ష' అన్నాను నవ్వుతూ.

ఆయనా నవ్వుకుని ఆకోటూ, టోపీ తీసేసి మిగతావి నన్ను కట్టు కోమన్నారు. 'ఇంకను పాలకీమాట ఏమిటో అంటుందేమిటే మీ అమ్మ' అన్నారు.

'మరేంలేదు పాలకీలో కూర్చుని భీమవరం వరకూ నన్ను మను ష్యులు మోసుకువెడుతుంటే నేను సహించలేను. ఇంకొకళ్ళు ఎవళ్ళేనా అలా వెడుతూంటే ఆ దృశ్యంకూడా నేను చూడలేను' అన్నాను.

'వివాహంలో జరిపే ఈ మర్యాదలన్నీ పూర్వపు రాజలాంఛనాలు నాయనా' అన్నాడు మా నాన్న.

'కావొచ్చు నాన్నా. ఆరాజ్యాలూ, ఆ రాజులూ అన్నీ పోయినప్పుడు మనకీ లాంఛనాలు ఎందుకు చెప్పండి' అన్నాను.

'మరయితే అక్కడ ఊరేగింపుకూడా అంగీకరించవా' అన్నారు.

'అసలు ఊరేగింపు ఎందుకనుకుంటున్నాను అనవసరము కదా. అది మానేస్తే ఈ పాలకీ సమస్యే ఉండదు. ఈ ఊరేగింపే లేనందువల్ల వచ్చిన నష్టము ఎవరికీ ఏమీ ఉండదు. ఇది చాలా హాస్యాస్పదంగా కూడా

ఉంటుంది. ఇదేదీ శాస్త్రంలో చెప్పబడ్డదీ, ధర్మవిరుద్ధమైనదీ కాదు కదా. అందుకనే మనము ఇది మానినంత మాత్రమున ఎవ్వరూ మనలను తప్పు బట్టబోరు. తప్పుపట్టినా దానిని మనమేమీ పట్టించుకో నక్కరలేదు' అన్నాను.

మానాన్న ఏమీ మాట్లాడకుండా అయిదు నిముషములు యిటూ, అటూ పచార్లుచేసి 'సరే నీ యిష్టము' అన్నారు.

బ్రతుకుజీవుడా అనుకుని ఒక పెద్ద నిట్టూర్పు విడిచాను. మానాన్న వెళ్ళి ఉన్నవాటిలో మంచిబండి వెదకి అందులోనూ మా అమ్మా, మరో యిద్దరూ కూర్చోవడానికి వీలుగా బాగా గడ్డివేసి, దానిపైన పరవూ దుప్పటీ వేయించి,బండి గుమ్మం దగ్గిరికి తెప్పించారు.

ఈలోపున యిందాకా నేను వచ్చేటప్పటికి బయలుదేరబోతున్న దంపతుల బండ్లు ఏమయ్యాయో చూదామని అన్నిబళ్ళూ పరకాయించి చూశాను. పది పదిహేను బళ్ళు అప్పుడే ముందుకి సాగినాయి. ఆ బళ్ళలో ఆయా దంపతులు కూర్చున్నారని బళ్ళవాళ్ళుకూడా ఉత్సాహంతో వాళ్ళతో సహకరించి, ఎవరితోటీ చెప్పకుండా ఆ బళ్ళు తోలుకుపోయారని విన్నాను. ఇంకా నాలుగు అయిదు బళ్ళలో పరుపులు పరచి దంపతులకై నిరీక్షిస్తున్నట్లు కనపడ్డది. మొత్తంమీద ఎలాగైతేనేమి కొంత సేపటికి బళ్ళు అన్నీ ముందుకు సాగినాయి. మా నాన్నా మరొకరూ మట్టుకు యిళ్ళకు తలుపులూ తాళాలూ అన్నీ జాగ్రత్తగా చూసుకుని, ఏమీ మర్చిపోలేదని తేల్చుకుని నమ్మకమైన పాలికాపులనూ, గ్రామస్థులనూ యింటికి కాపలా ఉంచి, ఆఖరు బండిలో వారూ వచ్చారు.

# 13

ఇంకా కొంచెం చీకటి ఉండగానే బళ్ళు భీమవరం సమీపించాయి. ఊరిబయట కొంచెంసేపు బళ్ళు ఆపారు. ఆడా మగా-యావన్మందీ దిగి గబగబా దేహబాధలు తీర్చుకున్నారు. తరువాత మరికొంచెం ముందుకుసాగి ఒక చెరువు దగ్గిర మళ్ళీ బళ్ళు ఆపారు. ఇక్కడ అంతా దంతధావనాలకు దిగగానే నేను కూర్చున్న బండీ, మా నాన్నగారి బండీ, మా పురోహితుల బండీ ముందు తిన్నగా పెళ్ళివారింటికి దారి పట్టించారు. అక్కడ మా రాక విని మమ్ములను మా విడిదిలోనికి తీసుకువెళ్ళారు. మేము అంతా కబుర్లు చెప్పకుంటూ నడిచేవెళ్లాము. మా వెనుక మాబళ్ళు వచ్చినాయి.

మా దంతధావనాదికములు అయ్యేటప్పటికి తక్కిన బళ్ళు అన్నీ వచ్చేశాయి.

గ్రామస్థులు చాలామంది, పని తొందరలులేని స్త్రీ బాలవృద్ధులూ అంతా ఈ బళ్ళనూ, ఈ పెళ్ళివారినీ చూడడానికి గబగబ పరుగె త్తుకుని వచ్చారు. అందరూ బళ్ళలోంచి దిగి, సామాను సర్దుకుని, స్నానాదికములు చేసుకొనుటకు ఉపక్రమించారు. ఇక్కడకూడా చురుకైన గడసరి యువ దంపతులు సాధ్యమైనంతవరకూ వేరు వేరు గదులలో తమతమ సామానులు పెట్టించుకుని తలుపులకు తాళాలు వేసుకున్నారు. కానయితే అదొక చాలా పెద్దభవంతి, ఇది చాలదేమో అని సందేహంతో పక్కనున్న మరొక భవంతికూడా మాకొరకై ఖాళీ చేయించి శుభ్రపరచి ఉంచారు. అందుచేతను ఈ యువదంపతులు అంత తొందరపడవలసిన పనిలేదు. ఎంత మంది దంపతులు పెళ్ళివారిలో, యువకులైనా, వృద్ధు లైనా, ఉన్నారో వారందరికీ కావలిస్తే తలోగది ప్రత్యేకంగా దొరికేదే.

పెళ్ళివారి అందరి స్నానములూ, వస్త్రాలంకరణలూ అయ్యేసరికి ముందు చంటిపిల్లలకు పాలు వచ్చినవి. ఇంకోపావు గంటకు పెద్దలకు ఫల హారములూ వచ్చినవి. బాలబాలికలలో ఉదయాన్నే భోజనము అలవాటు ఉన్న వారందరకూ ఆ ఏర్పాటు సిద్ధముగా ఉన్నది. పిన్నలూ, యిష్టమైన పెద్దలూ కూడా వెంటనే రావచ్చుననే పిలుపు వచ్చింది.

వారి పిలుపు అందినదే తడవుగా బిలబిలలాడుతూ యిరవై ఏళ్ల లోపు మగవాళ్ళూ, చంటిపిల్లలను చంకన వేసుకొని కొంతమంది తల్లులూ, మామూలు భోజన సమయం వరకూ ఉండలేని కొంతమంది ఉభయవర్గ ముల వృద్ధులూ, మడి కట్టుకునేవారు మడికట్టుకునీ, మడీతడీ అక్కరలేని యువతీ యువకులు తలో చెంబూ పుచ్చుకొని భోజనాలకు పెళ్ళివా రింటికి హాజరయ్యారు. అక్కడికి వెళ్ళగానే, ఆడవాళ్ళందరూ తమరు వచ్చినపని మర్చిపోయి అందరూ కట్టకట్టుకుని పెళ్ళి కూతుర్ని చూడ టానికి పరుగెత్తేరు. పెండ్లి కూతురుకి అభ్యంగనం చేయించి అలంకరణ చేస్తుండగా, ఇంతమందీ నవ్వులతో, కబుర్లతో లోపలజొరబడేప్పటికి, పెళ్ళి కుమార్తె అక్కడున్న వారూ అంతా నిర్ఘాంతపోయి, వీరి ముఖాలు చూసి పెళ్ళి వారయి వుంటారని వూహించి, వెంటనే అక్కడ తివాసీ పరిచి, వారందరినీ కూర్చోమని ఆహ్వానించారు.

పెళ్ళికూతురు ఎంతో సిగ్గుపడి ముడుచుకుని ముద్దయిపోయింది. అయినా నవ్వుతూ విప్ఫారిత నేత్రాలతో వాళ్ళను చూస్తూనే వుంది. వచ్చిన వారంతా పెళ్ళి కూతురు పేరేనా అడగకుండా ఇకను ఏమాటా

పలుకూ లేకుండా తదేక దీక్షతో, అక్కడకు చూడబోయిన సుమారు వంటకళ్ళూ పెళ్ళికుమార్తెను పైనా లోపలా, ఆపాదమస్తకం పరిశీలిస్తూ కూర్చున్నారు. ఆ అమ్మాయికి వాళ్ళవాళ్ళు కూడా ఏమాటా లేకుండా అలంకరణ చేస్తూనే ఉన్నారు. ఇంతట్లోకే వడ్డనలయినవని పిలుపురాగానే ఇంతమంది శకుంత సంతానంలా ఒక్కక్షణంలో విస్తళ్ళ దగ్గర వాలారు. ఇంకనక్కడ వడ్డనల్యూ భోజనాల్యూ, వేళాకోళాలూ, వెక్కిరింతలుతోటే భోజనాలుసాగుతున్నాయి.

ఆవకాయ చాలా బాగుందంటే బాగుందని కుర్రకారంతా ఆవకాయ మీద పట్టించారు. ఇంతమందీ ఒక్కసారి ఏకకాలమందు మూడు నాలుగు సార్లు మారు అడిగేటప్పటికి, యివతల ఉన్న ఊరగాయ కాస్తా అయి పోయింది కాబోలు, అది గ్రహించి కుర్రవాళ్ళు యావన్మంది ఏకగ్రీవంగా "ఆవకాయ మామ్మగారూ ఆవకాయ" అని భజన ప్రారంభించారు.

లోపల వున్న ఒక విశ్వస్త, చటుక్కున స్నానం చేసి తడిబట్ట ఊరగాయ గదిలోనే విడిచి, రాచ్చిప్పనిండా ఆవకాయతీసి, తను ఉన్నస్థితి మర్చిపోయి రాచ్చిప్ప అరచేతిలో పెట్టుకుని, పందిట్లో అల్లరి ఎక్కువగా ఉన్నదని పాపం తొందరతొందరగా చక్కావచ్చింది.

విస్తళ్ళదగ్గర ఉన్న జనం అంతా ఒక్కమాటుచేతులెత్తి "గోవిందా గోవిందా" అన్నారు.

ఆమెకేమీ అర్థంకాలేదు. ఈ గోల ఏమిటా అనుకుంది. అలాగే పదిమంది కుర్రవాళ్ళకు వడ్డించి ముందుకు వచ్చేసరికి పంక్తిలో ఉన్న ఆడవాళ్ళంతా ఆమె నక్కడే ఆపి ఆమె స్థితి అభినయం ద్వారా తెలి యపర్చారు. అప్పటికి ఆవిడ ఎగాదిగా తన నిజ స్వరూపాన్ని చూసుకుని.

"అయ్యో వెధవల్లాలా! మీ మొహాలు తగిలెయ్యా! ఇందుకుట్రా నీ గోలంతానూ" అని గొణక్కుంటూ పరుగెత్తింది.

ఇంతలోకే ఒక ముత్తయిదువు ఒక రంగు చీరతీసుకుని పరిగెత్తుకు వచ్చి ఆమెకు ఒంటి నిండా చుట్టబెట్టి ఆమెను షుందిరవతలకి పంపి, రాచిప్ప తను పుచ్చుకుని వడ్డన ఆరంభించింది.

ముసలామె తిట్టుకుంటూ కేకలెడుతూ బావిదగ్గిరకు పరుగెత్తి చేతులూ అవీ కడుక్కుని రెండుచేదలు మీదపోసుకుని, లోపలకు వెళ్ళి తడిబట్ట విడిచేసి, ఇంకనాపూట ఎవ్వరికీ కనబడకుండా, ఏ మూలనో పడుకుంది పాపం. ఇక్కడ భోజనాలు కాకుండానే పెళ్ళివారు విడిది నుంచి బయలు

దేరుతున్నట్లు మేళతాళాల ధ్వని వినపడ్డది. వీరందరూ తక్షణం చేతులు కడుక్కొని విడిదికి పరుగెత్తేరు. అక్కడ పెళ్ళివారు బయలుదేరిపదిబారలు అప్పుడే యివతలకు వచ్చారు. ఆడ పెళ్ళివారు వీరి వెనుకనే ఎదురుసన్నాహం కోసం వారికెదురై వారిని ఆపి, అక్కడ జరగవలసిన లాంఛనములన్నీ జరిపి తమతో మగ పెళ్ళివారిని తీసుకువెళ్ళారు.

పెళ్ళి పందిరి ఎంతో ముచ్చటగా, కన్నుల పండువుగా అలంకరించారు. పందిరి అంతా జనంతో కిటకిటలాడుతున్నది, నౌకర్లు అక్కడక్కడ నిలబడి వింజామరలు వేస్తున్నారు. వేద ఘోషతో పందిరి మారుమ్రోగుతోంది. ఇక్కడ విఘ్నేశ్వరపూజ వగైరా ముగించి, పురోహితుడు, మరి కొందరు బ్రాహ్మణులూ, వరునికోసం ఎంతో ఆతృతతో గౌరీపూజ చేసుకుంటున్న పెండ్లికుమార్తెవద్దకు వెళ్ళి అక్కడనే వారి రాకకోసము వేచి ఉన్న తల్లి తండ్రులకూ తదితర పెద్దలకు ఒక అద్భుతమైన పెండ్లికొడుకు, పెండ్లి కుమార్తెకు వచ్చే వరుడు, పెండ్లి పందిట్లో వేచి వున్నాడనీ అతని కుల గోత్రాదులు ప్రవరా ఫలానా అనీ చెప్పి కన్య గోత్ర ప్రవరలు వారి పురోహితుని వల్ల విని, కన్యనిస్తామని వారిచే అనిపించుకుని, తిరిగి పందిట్లోకి వచ్చేశారు. భజంత్రీలు వాద్యాలు వాయిస్తున్నారు. రెండు నిమిషాలలో సర్వాలంకార భూషితయైన పెండ్లికుమార్తెను బియ్యపు గంపలో కూర్చో పెట్టి పిల్ల మేనమామ చక్కా ఎత్తుకువచ్చాడు. ఈ పెండ్లి కుమార్తె వెంటనే పెండ్లి కుమారుని కంటపడి, అతని మతి పోగొడుతుందేమోననే భయంతో, అతని ముఖాని కడ్డుతెర పట్టుకున్నారు. పెండ్లికుమార్తెను గంపతో సహా అక్కడ కూర్చోపెట్టారు సభాసదులంతా అక్షతలు చల్లారు.

వధూవరుల మధ్య తెర తొలగించారు, వారుభయులు "అమ్మయ్యా" అని ఏకగ్రీవంగా అనుకుని అక్కడున్న జనాభానంతనూ మరచి అసలు లేనట్లే భావించి, ఒకరినొకరు మందహాసములతో చూచుకున్నారు. తరువాత కొన్ని క్షణములవరకూ పురోహితుడు ఎంత హెచ్చరించినా, పెండ్లి కుమారుడు తన దృష్టిని పెండ్లి కుమార్తెనుండి మరలింపలేక పోయినాడు. నాయనా, నాలుగు రోజులూ - కాదు - ఇహ అయిదు రోజులూ ఓ కన్ను మా మీద కూడా, వేస్తేనేగాని ఈ వివాహము పూర్తికాదు. ఇంక నా తరువాత రెండు, మూడు సంవత్సరములవరకూ మీ చూపుల కెవ్వరూ అడ్డురారు. అప్పుడైనా అత్యవసరమైన భోజనాధికముల సంగతి మర్చిపోకూడదు సుమండీ అన్నాడు పురోహితుడు.

నేను సిగ్గుతో తలవంచుకుని,

ఒక యింటివాళ్ళము అయినామన్నమాట! ఈశుభకార్యానికి ఎంతెంతో శ్రమపడి దగ్గిరనుంచీ దూరం నుంచి వచ్చిన ఆప్తులందరనూ నూతన వస్త్ర బహుమానాలతో సాగనంపడం ఒక లాంఛనం. వెంటనే వధూవరులను కన్య తల్లిదండ్రులనూ, తదితర ఆప్తులనూ తీసికొని వరునియింటికి వెళ్ళి మరు నాడో ఈ శుభకార్యమంతా నిర్ణయించి దిగ్విజయంగా జరిపించి పై నుంచి ఆశీర్వదదిస్తున్న తమ యిష్టదేవతలను పూజించడం, ఈ కార్యక్రమంలో ఆఖరు విషయము.

మూడవనాడు వధువును తీసుకుని వచ్చిన తల్లిదండ్రులు వారి బంధు వర్గమూ భీమవరము వెళ్ళిపోయారు. ఈ అయిదురోజుల ఆనందాన్ని ఏ చిన్న విషయమూ కూడా మరువకుండా మననం చేసుకుంటూ నెమ రువేసుకుంటూ నేనింటి దగ్గిర దిగబడ్డాను. మరొక నాలుగైదు రోజులలో మనుగుడుపులకు అంటూ మా మామగారు వచ్చి మమ్మలను మళ్ళీ భీమ వరము తీసుకు వెళ్ళారులెండి.

సమస్త సన్మంగళాని భవంతు. నిత్యశ్రీరస్తు. లోకాస్సమస్తాః స్సుఖి నోభవంతు. అని ఆశీర్వచనము ఎన్నాళ్ళవరకో నా చెవులో మారు మోగుతూనే వుండేది. ఈ శుభాస్సు అపూర్వమూ అనన్యమూ కేవ లమూ హైందవమూ అని ఎంతో గర్విస్తూ సంతోషిస్తూ వుండేవాడిని.

కొన్ని మాసములవరకూ కాలం నాకు స్తంభించిపోయింది. ఏపనీ చేయబుద్ధి పుట్టేదికాదు. ఏ పుస్తకమూ ఎంతసేపు చేతపట్టి కూర్చున్నా చదవవలెననిపించేది కాదు. ఒక్కపూట కూడ జరిగేదికాదు. ఇంత మాంద్యం ఎందుకేర్పడ్డదో నా కర్థంకాలేదు. వివాహమైన కొత్తలో ప్రతి వరుడూ ఇలాగే బాధపడతాడనీ ఏ చైతన్యం లేక వుంటాడనీ అనుకోలే కుంతా వున్నాను. అనేకమంది నూతన వధూవరులను చూచానుగాని, వారెవరూ యీ స్థితిలో వున్నట్టు నేను గమనించలేదు. నేను ఇన్నా ళ్ళనించీ వూహించిన వూహలన్నీ, కన్న కలలన్నీ తారు మారయ్యాయి. రజస్వల కాని కన్యను వివాహ మాడకూడదనుకున్నాను. యీ పిల్ల కంటపడగానే నా ప్రయత్నమేమీ లేకుండానే నా నిర్ణయం యిట్టేమారి పోయింది. నన్ను కాక ఇంకెవరిని ఎలా చేసుకుంటారో చూస్తానని ఆపిల్ల సవాల్ చేసి, నన్నేదో మంత్రముగ్ధుణ్ణి చేసి తన పంతం నెగ్గించుకుని వూరు కుంది. గెలిచింది కదా ఇకనైనా నన్ను విడిచి పెట్టకూడదూ! ఎందుకలా ఇరవై నాల్గంటలు నా ఎదటనే నిలబడి కళ్ళార్పకుండా నన్ను చూచి చిలిపిగా ఎందుకలా నవ్వుతుంది. స్వదేశంలోనూ, విదేశాల్లోను కూడా

ఏ యువతీ ఏ ప్రౌఢానన్నిలా ఆకర్షించలేదు. ఎందుచేతను ఈ బాధను యింకా విరహము అనవచ్చునో కూడదో నాకు తెలియదు కాని, ఏదో వంక కల్పించుకుని భీమవరం వెడితేనేగాని వీలులేదనుకున్నాను.

అక్కడున్న నా మిత్రుడు రాజు నా వూహలు పసికట్టినట్టు నాతో పని వున్నదని నన్నొకసారి తొందరగా రమ్మనమని మనిషిని పంపించాడు. అమ్మ వీడిల్లు బంగారంగాను నా వూహ ఎలా కనిపెట్టాడు వీడు. ఈ క్షణంలోనే నా అవసరం ఏం కలిగింది, వీడికి? అని అనుకుంటూ మా అమ్మతోటి చెప్పి మా నాన్న ఇంటికి వచ్చేవరకూ ఆగకుండా భీమవరం విమానంలో వెళ్ళిపోయాను. అంటే నిజంగా విమానమని కాదుకాని నేను మట్టుకు ఎన్ని గంటలు ప్రయాణం చేశానో లెక్కపెట్టనూలేదు. కాని సుమారు అయిదున్నర నిమిషాలలో భీమవరం చేరానని అనుకున్నాను. సైనొక్కక్షణం ఊరుబయట తటపటాయించి తిన్నగా యెందుకేనా మంచిదని రాజు ఇంటికే వెళ్ళాను. నా వూహ గ్రహించి పంపిన రాజుపిలుపుకంటే నేను రాజు ఇంటికి చేరిన ఒక గంటలో మరీ ఆశ్చర్యమైన సంఘటన జరిగింది. నేను కాఫీ ఫలహారం ముగించి రాజుతో ఏదో మాట్లాడుతుంటే అచ్యుతరామయ్యగారింటి దగ్గర నుంచి అనగా మా మామగారి ఇంటి వద్ద నుంచి పార్వతీశంగారు వచ్చారని తెలిసిందని వచ్చివుంటే మాయింటికి దయచేయమని చెప్పమన్నారంటూ ఒక మనిషి వచ్చాడు. నేను ఎంతో ఆశ్చర్యపడ్డాను. నా రాక వీళ్ళకెలా తెలిసింది అనుకున్నాను.

"ఏం రాజూ నువ్వేమైనా కబురు చేశావా" అన్నాను.

"రామ రామ నేనేమీ కబురుచేయలేద"న్నాడు.

నన్నసలు ఇక్కడకు రమ్మనవలెనని నీకెందుకు తోచిందన్నాను. నేనేదో మామూలుగా ఒకమాటు రమ్మని వ్రాశానుకాని, దీనిలో అంతరార్థమేమీ లేదన్నాడు.

అయితే ఏమిటిప్పుడు నాతో అంత అర్జంటుపని అన్నాను.

"పనేమీలేదు కాని చిత్రమేమిటంటే రెండు రోజులనుంచీ ఎందుకో నిన్నుచూడవలెనని నీవూ ఇక్కడకు రావలెననీ అనుకుంటున్నాననీ బలీయమైన ఆలోచన ఒకటి కలిగింది. దీని భావమేమిటో తెలుసుకుందామని నిన్ను రమ్మనమని వర్తమానము చేశాను అన్నాడు రాజు.

ఇటువంటి వింత ఆలోచనే అచ్యుతరామయ్యగారికి కూడా కలిగిందా తెలుసుకుందామనే కుతూహలం కలిగి రాజు ఏదో చెప్పబోతుంటే ఇప్పుడు

కాదు మళ్ళీ వస్తానని రాజునవ్వును కూడా లక్ష్యపెట్టకుండా తిన్నగా అచ్యుతరామయ్యగారింటికి వెళ్ళాను.

అచ్యుతరామయ్యగారు నన్ను చూసి నా రాకకు ఆశ్చర్యపోయి, ఎంతో సంతోషం కూడా వ్యక్తం చేశారు. మాటల్లో ఎక్కడా వారు నాకీ వర్తమానం చేసిన సంగతే స్ఫురింపచేయలేదు. నేను వచ్చినట్లు మీకెలా తెలిసిందని అడుగుదామని అనుకుంటూ అప్రయత్నంగా తల ఎత్తే సరికి లోపల గుమ్మం అవతల పెళ్ళి కూతురు అలంకరించుకుని నా రాక కై నిరీక్షిస్తున్నట్టు నవ్వుతూ నిలబడి, నావూహ కనిపెట్టినట్టు నోటికి చెయ్యి అడ్డుపెట్టి, ఏమీ మాట్లాడవద్దని సౌంజ్ఞ చేసింది. దానితో నాకు వాగ్బంధనమైనది. నే నడగదలుచుకున్న ప్రశ్న వెనక్కుపోయింది.

అచ్యుతరామయ్యగారు "ఏమర్రా అల్లుడుగారొచ్చారు. లోపలికి తీసుకు వెళ్ళండని కేకవేశారు."

అక్కడ తలుపుదగ్గర నుంచున్న అమ్మాయి నవ్వుతూ లోపలికి పరి గెత్తింది.

నేను తలవంచుకుని అతీంద్రియమైన ఈ ఊహా తంతిప్రసారానికి ఆశ్చర్యపోతూ, లోపలకడుగు పెట్టగానే మా అత్తగారు నాకు పాదప్రక్షాళ నకు వుదకం తీసుకుని ఎదురై,

"ఇంటి దగ్గర నుంచేనా రావడం. అమ్మగారూ, నాన్నగారూ కులా సాగా వున్నారా" అని యోగక్షేమమడిగి తెచ్చిన ఉదకం అక్కడ వుంచి"తువ్వాలు తీసుకురామ్మా. అని కూతుర్ని పిలిచి లోపలికి వెళ్ళి పోయారు. ఈ కేక ఆ అమ్మాయి చెవిని పూర్తిగా పడకుండానే తువ్వాలు చేత పుచ్చుకుని ప్రత్యక్షమైంది. మళ్ళీ నేను చేష్టలుడి ఆ దివ్య సుందర మూర్తిని ఆలోకిస్తూ అలాగే నిలబడిపోయాను. ఆ అమ్మాయి నవ్వుతూ తువ్వాలు నామీదకు విసిరి

"కాళ్ళు తరువాత కడుక్కుందురుగానిలెండి. ఇలా దయచెయ్యండని" తనగదిలోనికి దారితీసింది. నేను స్వప్నంలో నడిచినట్టు ఆమెను యాంత్రి కంగా అనుసరించాను.

తన గదిలోకి వెళ్ళి నేను రాగానే కూర్చోమని నాకుకుర్చీచూపించి తాను కొంచెం ఎడంగా నిలబడ్డది, ఒక్క క్షణం వూరుకుని,

"ఇంత దూరంలో ఉండవలెనని నియామకం వున్నదా" అన్నాను.

"నియామకం ఉన్నా ఆ అవసరం ఇంకా రాలేదులెండి" అనంది.

"అయితే ఇప్పుడెందుకు అంతదూరంలో ఉన్నావ"న్నాను.

"మొగల్తుర్రు కంటే ఇది దగ్గిరకదా" అన్నది.

"పలుకులు నేర్చిన చిలకవే" అన్నాను.

"చిలకెప్పుడూ ఇతరులన్నమాటలనే అనుకరిస్తుందికాని సొంతంగా ఏమాటా అనలేదు." అన్నది.

"పోనీలే, అయితే నీవు originality వున్న చిలకవని ఒప్పుకుంటాలే ఇలారా నిన్నొక్క సంగతి అడగాలి" అన్నాను.

"నాకిక్కడున్నా వినిపిస్తుంది. మాట అడగటానికి దగ్గరకెందుకు అన్నది."

"నువ్వు దగ్గరకొస్తే నీకే తెలుస్తుం"దన్నాను. తలవంచి కొంచెం నవ్వుకుని

"ముందు మీరేదో అడగదలుచుకున్నది అడుగుతే"

"నేనీ పూట మా రాజు దగ్గిరికి హఠాత్తుగా వచ్చాను. వచ్చిన అరగంట కాకుండా నేను వచ్చివుంటే మీ యింటికి రమ్మని నాకు వర్త మానం వచ్చింది అక్కడికి. ఆ వర్తమానం మీనాన్న చేయలేదన్న సంగతి తేలిపోయింది. నేను వచ్చినట్లు తంతివార్త నీకెలా అందింది భామా కాదు - బాలా"అన్నాను.

సమాధానం చెప్పకుండా తనలో తను ఊరికేనవ్వుకోవడం మొదలు పెట్టింది. నేను ఆ అమ్మాయికేసి చూస్తూ కూర్చున్నాను. కొంతసేప టికి నా మౌనం గ్రహించి కాబోలు తల ఎత్తి నాకేసి చూసింది.

"ఏమిటలా మౌనంగా చూస్తూ కూర్చున్నారు" అంది.

నవ్వడం అయిన తరువాతను నేనడిగిన దానికి సమాధానం చెబు తావేమో నని చూస్తున్నాను! అన్నాను.

"మీరసలు ఆ ప్రశ్న ఎందుకండిగారో నాకు అర్థం కావడంలేదు. మీరు వస్తున్నానని వారం రోజుల నుంచీ నాకస్తమానం కబురు పంపిస్తూనే వున్నారుగా అంతేకాకుండా ఈ రోజు మీరు బయలుదేరేటప్పుడు కూడా వర్తమానం అందచేస్తే ఆ మాట పట్టుకుని మీరీపాటికి వచ్చి వుంటారని ధైర్యంతో నేను కబురుచేసిన మాట వాస్తవమే అన్నది నవ్వుతూ. అని వెంటనే స్వరం మార్చి కొంచెం దీనంగా "నేను తప్పుచేశానంటారా" అన్నది.

నా ఆశ్చర్యానికి మేరలేకపోయింది. నా కోరికా, నా వూహా అంతా బలీయమై అటు రాజుకీ ఇటు నాహృదయేశ్వరికీ కూడా వర్తమానం అందించిందా! ఇది నమ్మలేని, నమ్మ శక్యంకాని విషయమే. కాని ఈ జరిగిన దంతా కనీ వినీ, నమ్మకుండా ఎలా వుండగలను. మానవుని వూహాలకూ సంకల్పానికీ ఇంత శక్తి వుంటుంది కాబోలని, మాటడలేక నెమ్మదిగా నా ప్రాణేశ్వరి చెయ్యిపట్టుకుని దగ్గరగా తీసుకున్నాను. నా స్పర్శ తగలగానే ఆ అమ్మాయి శరీరంలో ప్రతి నరమూ స్పందించింది. ఒళ్ళు వెచ్చబడింది. నామీదకు కొంచెం ఆని భయపడుతోన్నట్టు నిలబడ్డది. నేను ఇంకా కొంచెం దగ్గరకు తీసుకుని ముఖంమీద నాట్యమాడే ముంగురులు కొంచెం వెనక్కి తోస్తూ చెక్కిళ్ళు -నిమురుతూ-

"ఈ వారం రోజుల నుంచీ నేనొక్కసారివస్తే బాగుండనని నువ్వా అస్తమానమూ అనుకుంటూ, నాకూ తంతివార్తలు పంపేవా! ఎంత చిత్రంగా వుంది. ఈ స్వల్పవ్యవధిలో ఇంత దూరాన్నున్న మనమిద్దరమూ ఏకమైపోయామా ఈ అనుభూతి నాకెంత ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నదో నీతో కూడా చెప్పలేకుండా వున్నాను ప్రియా" అని ఒక్కమాటు గాఢాలింగనం చేసుకుని అంతకంటే గాఢంగా ముద్దుపెట్టుకున్నాను. ఆ క్షణంలో మేమిద్దరమూ ఒక్కరమే అయ్యాము.

# 14

కొంతసేపటికి నెమ్మదిగా నా చేతులను విడిపించుకుని ఒక్కరవ్వ ఎడంగా జరిగి "నేను పిలిచానంటారా? నాపిలుపు మీదాకా వచ్చిందా నాకూ చాలా ఆశ్చర్యంగానే ఉన్నది. నేను పైకి ఏమీ అనలేదు. లోపల ఏమనుకున్నానో నాకే తెలియదు. ఈపర్యవసానానికీ కారణం బహుశా మీ నామస్మరణ అక్షరలక్షలు చేశాను కాబోలు. మంత్రసిద్ధకలిగి నా స్వామి నా ఎదుట సాక్షాత్కరించాడు" అని ముఖానికి చేతులు అడ్డుపెట్టుకుని నాభుజం మీద వచ్చివాలింది. నేను ప్రతివచనం ఏమీ చెప్పలేక పోయాను. ఎంత గొప్పవూహ. ఎంత చిత్రమైన వర్ణన, నా సరస్వతి గొప్పకవి అవుతుందా ఏమిటి, అనిపించింది. ఆ క్షణంలో ఆమాటే పైకి అన్నానుకూడా నేను కవయిత్రినే అయితే అందులో నా ప్రయోజకత్వం ఏమీ ఉండదు. ప్రతివూహా, ప్రతిస్పందనా మీలోనుంచే నాకు వస్తుంది. పలికించెడి వాడు రామభద్రుండట -కాదు - పార్వతీశుండట,

అనారి కాబోలు అని నవ్వుతూ చెంగున ఆవలికెగిరి, ఇంకను తమరులేచి స్నానం చేస్తే బాగుంటుంది మా నాన్నగారికి కోర్టుకు వేళవుతున్నది. అల్లుడుగారి సహపంక్తి భోజనానికి కనిపెట్టుకునుంటారు. ఈసంభాషణ భోజనానంతరం సాగిద్దాం అన్నది.

"ఇప్పుడెలా సరస్వతి! నాబట్టలూ, అవీ రాజుదగ్గర ఉన్నాయి. వెళ్ళి తెచ్చుకుంటాన"న్నాను.

ఇక్కడకు వచ్చిన తరువాత మళ్ళీమీకంత శ్రమ కలిగించడం ఇష్టం లేక నేను ఇక్కడికి తెప్పించానులెండి. మీకు ఎంత మొహమాటమైనా, వివాహముయిన తరువాత మొదటిసారిగా అత్తింటికొచ్చిన అల్లుడు వూళ్ళో ఎక్కడో మకాంచెయ్యడం మీ మర్యాద కాబోలు. ఇంతవరకూ మే మెవరమూ ఆ మాటవినలేదు అంటుండగా నేను లేవడం గమనించి లేడిలా అవతలికి ఒకగంతు వేసి పారిపోయింది, నేను శిలాప్రతిమలా అక్కడలాగే నిలబడిపోయాను. ఏమి నాభాగ్యం అనుకుంటూ పరవశుడనై పట్టరాని ఆనందంతో స్నానానికి వెళ్ళాను.

నేను అక్కడ ఎన్నాళ్ళు ఉన్నానో తెలియదు. నేను అనుకోవడం ఓ పది నిమిషాలు ఉన్నాను కాబోలు అనుకున్నాను. హఠాత్తుగా మాఇంటి వద్ద నుంచి నేను యిల్లువిడిచివచ్చి పదిహేను రోజులు అయినదనీ, నాక్షే మసమాచారం ఏమీ తెలియలేదనీ, నేనూ, మా అత్తవారింట అందరూ క్షేమంగా ఉన్న వైనం వ్రాయమని, మా నాన్న చీటీరాసి మనిషిని పంపిం చాడు. ఆ ఉత్తరం చూసుకునేటప్పటికి గుండె గుభేలుమన్నది. నేనిక్కడికి వచ్చి పదిహేను రోజులయిందా అనుకున్నాను. నేను వెళ్ళి సరస్వతి నడిగాను.

"నేను వచ్చి ఎన్నాళ్ళయింద"ని.

'అదేమో నాకెంతెలుసును. రోజులేమిటి అరగంటో గంటో అయింది కాబోలు అనుకుంటున్నాను నేను. ఇంతకూ ఈ సందేహం మీకు ఎందుకు కలిగిందిప్పుడు' అన్నది.

'నేను వచ్చి పదిహేను రోజులయిందని మానాన్నగారు నాకు గుర్తు చేయమని, మనిషిని పంపించారు. ఆ మాటవిని ఒక క్షణం నా గుండె ఆగిపోయినంతపని జరిగింది. ఇన్నాళ్ళయిందనీ పోనీ నువ్వేనా కాస్త చెప్ప కూడదా అన్నాను.'

'ఇది మరీ బాగుందండి. మీకు తెలియని కాలగమనం నాకు మట్టుకు ఎలా తెలుస్తుంది. నిజంగా పదిహేనురోజులయిందా! మీ నాన్నగారు

అబద్ధం ఆగగు, పదిహేను రోజులయింది కాబోలు నిజంగా. నేనిక్కడ మీ ఎదుటనే ఉంటుంటినికదా, పదిహేను రోజులెలా అయినదండీ. ఇదేదో పొరపాటై ఉంటుంది' అని కిలకిల నవ్వింది. ఏమి చేయడానికీ తోచక నేనూ శ్రుతి కలిపాను.

ఈ పదిహేనురోజులూ, రోజూ సాయంకాలం ఒక గంటసేపు రాజుతో గడపడం తప్ప తక్కిన కాలమంతా ఇంట్లోనే కూర్చునేవాడిని. మరెక్కడికి వెళ్ళలేదు. ఎవరితోటీ మాట్లాడలేదు. ఏ పుస్తకమూ చదవలేదు. అయినా పది హేనురోజులు పదిహేను నిమిషాలుగా పరుగెత్తాయి. ఏమిటీ విచిత్రం. మేము భయులమూ సభ్యతకాని, ఔచిత్యంకాని మరచి ప్రవర్తించ లేదు. నాభార్య కన్యేకాని మరొకతెకాదుకదా! మేము ఏంమాట్లాడుకున్నాం మేభయులమూ పేకగాని, చదరంగంగాని, ఆఖరుకు గవ్వలూ, గిచ్చకాయ లేనా ఆడలేదు. మాకు ఎలాగడిచింది? మే మెక్కువగా మాట్లాడింది కూడా ఏమీ గుర్తులేదు. అసలేం మాట్లాడతాం, కాని మా ఉభయులలో ఏ ఒక్కరికి విసుగు కలగలేదు. చిరాకంతకంటే లేదు. తలనొప్పి అనే మాట ఎరగం. మాఇద్దరకూ అంత కొద్దిమాటలతో కాలగమనమెరుగని, ఒడలెరుంగని ఆనందం ఎలాకలిగింది. ఏమమ్మాయి, నువ్వేనా మనకాలం ఎలాగడిచిందో, ఇంత పరవశత్వం, మైరపూ ఎలా వచ్చిందో చెప్పగలవా? కొంపతీసి ఏకోయవాళ్ళదగ్గరేనా వశీకరణ మంత్రమేమీ నేర్చుకోలేదుకదా, అయిందేదో అయినది ఇకనైనా జాగ్రత్తగా వుంటాను. నాబట్టలు అవీ ఇవతల పడెయ్యి నేను వూరికి పోతాను, ఇప్పుడేనా వెళ్లకపోతే మాట దక్కదు" అన్నాను.

"లేడికి లేచిందే ప్రయాణమని అనుకున్నక్షణంలో మీరెలా వెడతా రండీ. మీరడిగిన బట్టలూ అవీ ఎక్కడునన్నాయో వెతకాలి. ఇవేళ మంచి రోజు అవునోకాదో చూడాలి. బోలెడంత తంతు వుందికదా! క్షణాలమీద ప్రయాణమెలా సాగుతుందండీ" అన్నది. సరస్వతి యెంతో అమాయకంగా మొహంపెట్టి.

నాకాతిథి వార నక్షత్రాలూ, ఆ మంచి చెడ్డలూ అవసరంలేదు. నేను విదేశాలకు వెళ్ళి బోలెడంత విజ్ఞానం నేర్చుకుని వచ్చినవాడిని, ఇప్పుడు వెళ్ళకతప్పదు. ఇప్పుడు నా బట్టలు వెతికి ఇవ్వకపోయినా యిబ్బందిలేదు ఈ మాటు వచ్చినప్పుడు తీసుకుంటానులే అన్నాను.

'పోనీలెండి. అలాగే ప్రతిదానికీ ఇంతతొందరైతే ఎలాగండీ' అన్నది.

'నాకు ప్రతిదానికీ లేదు తొందర. ప్రయాణానికే' అన్నాను.

'కావలసినవన్నీ తొందరపడినంత మాత్రాన జరుగవన్న సంగతి నాకూ తెలుసునులే' అన్నాను.

ఒక్కమాటు నన్ను వెక్కిరించి అవతలకి పరిగెత్తింది.

ఒక్క అయిదునిమిషాలాగి నేను లోపలకు వెళ్ళి మా అత్తగారితో నేనీపూట ఇంటికి వెడతానండీ చాలా రోజులైందివచ్చి. మా స్నేహితుడు రాజు నన్నెందుకో అత్యవసరంగా రమ్మని వర్తమానం చేస్తే వచ్చాను. ఇన్నాళ్ళున్నా, అతని పనేమిటో చెప్పలేదు. మధ్యనిక్కడ చిక్కడిపోయాను అన్నాను.

నెమ్మదిగా 'పాపం' అనే తీయని పలుకు ఎక్కడినుంచో నాచెవిని పడ్డది. ఎటు చూచినా ఈ శబ్దం ఎక్కడనుంచి వచ్చిందో అర్థంకాలేదు. అంత మధురంగా పలికిన వ్యక్తి తలుపు మాటున దాగడమెందుకో, అంత కంటే అర్థంకాలేదు. మా అత్తగారు కూతురు మాటవిని కాబోలు వస్తున్న నవ్వు ఆపుకొని, అంతతొందరేమొచ్చింది. ఇంతకూ ఎన్నాళ్ళయిందనివచ్చి మరో రెండురోజులు ఉండి వెళ్ళవచ్చుకదా? అన్నది. నెమ్మదిగా.

అబ్బెబ్బే ఇప్పటికే పదిహేను రోజులయింది. ఇంటిదగ్గర బోలెడన్ని పనులు. మా నాన్న ఒక్కరూ తంటాలుపడుతున్నారు. అందుకని వెళ్ళక తప్పదు. మరొకమాటు వస్తాను. రాక ఏమవుతాను అన్నాను. ఆకర్షణ యంత్రం ఒకటి ఇక్కడ ఉన్నదికదా అని అర్థోక్తిలో నాకు తెలియకుండానే నోరుజారి అని ఉంటాను. మా అత్తగారికి ఇది వినపడిఉండదని ఆశించాను.

తలుపువెనుకనుంచి కిలకిలమని సెలయేటి గానంలాంటిది నాచెవిని పడ్డది. నేను వెనక్కి తిరిగి వేళ్ళబోతుంటే ఈ పూట ప్రయాణం తప్పనిసరి అయితే భోజనం చేసి వెళ్ళవచ్చును. ఏదికానివేళ ఇప్పుడు ప్రయాణం కొంచెం ఇబ్బందిగా ఉంటుంది అన్నారు. నేనేమాటా సమాధానం చెప్పకుండా, నాకు వినపడనట్లే తొందరగా అవతలికి వెళ్ళాను.

నేను గదిలోకి వెళ్ళేటప్పటికి అల్లరిపిల్ల అక్కడ నా బట్టలు తీసి మడతపెడుతూ, పెట్టిన మడతలు మళ్ళీ విప్పుతూ నవ్వుకుంటూ ఆడు కుంటూన్నట్లు కనబడ్డది నాకు. "ఏమిటిమరి నాబట్టలు ఏవీ" అన్నాను.

వాటికోసమే వెతుకుతున్నానంది.

సరె త్వరగా చూడు. ఆలస్యమవుతోంది. అన్నాను.

"మీరు భోజనము చేసి చల్లబడ్డ తరువాత కాని వెళ్ళరని మా అమ్మ అన్నది. పైగా మీరు స్నానం చేసిన పంచా తువ్వాలు ఇంకా ఆరనేలేదు. తడిబట్టలు ఎలా తీసుకువెడతారని లాయరు ప్రశ్న ఒకటి వేసింది.

"ఇంతకూ మా నాన్నగారితోటి చెప్పారా లేదా" అన్నది.

"ఎందుకూ మీ అమ్మగారూ, నువ్వూ చెబితే చాలదా" అన్నాను.

"అదేం బాగుంటుందండీ, మీరిక్కడ నుంచి హాలులో కూర్చున్న వారితోటి మాటమాత్రం చెప్పకుండా వెళ్ళడం ఏమంత మర్యాద. మీకంత తొందరపనివుంటే వారు మటుకు వద్దంటారా, చెప్పకుండా వెడితే మట్టుకు ఇలా చెప్పకుండా వెళ్ళిపోయాడేమిటి అని తప్పక అనుకుంటారు" అన్నది మందహాసం చేస్తూ.

"ఇలారా ఒక్కమాటు" అన్నాను.

"నేను యిక్కడ మీ బట్టలు సర్దుతున్నాను. అక్కడ కూర్చునిమీరు చెప్పినా నాకిక్కడకు వినపడుతుంది" అన్నది తలెత్తకుండా.

నీ మాటలకే ఎదురు చెప్పలేకుండా వున్నాను. రేపింక కోర్టులో నేనెలా వాదిస్తానా అని ఆలోచిస్తున్నాను. అన్నాను.

"మీరు తడుముకోకుండా మాట అందివ్వడానికి నన్ను కూడా కోర్టుకు తీసుకెళితే సరి" అన్నది.

"అయితే నువ్వు కూడా బి.యల్. చదువు. ఆపరీక్షయేవరకూ నిన్ను మా యింటికి రమ్మని తొందరపెట్టను. అప్పుడు ఇద్దరం జాయింటుగా ప్రాక్టీసుచేద్దాం" అన్నాను. తలెత్తి ఒక్కక్షణం నిదానంగా, అమాయకంగా నా కళ్ళలోకి చూస్తూ.

"ఏమిటి" అన్నది.

నేను గభీమని లేచాను. లేడి లాగ చెంగున అవతలికి పరుగెత్తింది.

నేను నా సంతోషాన్ని అణచిపెట్టి, సావిట్లోకి వెళ్ళి మా మామ గారితో నా ప్రయాణం సంగతి నెమ్మదిగా మనవి చేశాను.

"అదేమిటి వచ్చిన వ్యవధేది? వెడుదుగానిలే" అన్నారు.

'చాలా రోజులయింది వచ్చి. మానాన్నగారి దగ్గర నుంచి వర్తమానం కూడా వచ్చింది.' అన్నాను.

'సరే అయితే నేను కోర్టునుంచి వచ్చిన తరువాతను ఆలోచిద్దాము' అన్నారు.

'అప్పటికి ఆలస్యమై ప్రయాణం సాగడం కష్టం అవుతుం'దన్నాను.

'నీకదంతా ఎందుకు, నేను వచ్చి అన్ని ఏర్పాట్లూ చేస్తానుకదా' అని ఆయన కాగితాలు చూసుకుంటూ వారి పనిలో నిమగ్నులయ్యారు.

నేనేమీ అనలేక తలవంచుకుని అడుగులు లెక్కపెట్టుకుంటూ గది లోకి వెళ్ళాను. నేదు గదిలోకి వెళ్ళేసరికి నా ప్రేయసి అక్కడవే ఉన్నది.

'ఏమండీ ఇప్పుడే ప్రయాణమా. బండికి కబురు చెయ్యమని మా నాన్నగారితో చెప్పకపోయారా? అన్నది ఎంతో గంభీరంగా.

'ఆ ఏర్పాట్లన్నీ మీ నాన్నగారే చేస్తామన్నారు' అన్నాను. అంత కంటే గంభీరంగా.

ఒక్క క్షణం మౌనంగా వూరుకొని ఊహూ, సరే అయితే ప్రయాణం ఇప్పుడు కాదన్న సంగతి తేలిందన్నమాట. చెపితే వింటారా? "బాలాదపి సుభాషితం" అన్నమాట వూరికేపోతుందంటారా! అన్నది.

గత్యంతరం లేక భోజనం చేసి విశ్రాంతి తీసుకున్నాను. ఈరాత్రో రేపు ఉదయాన్నో నేను వెడతున్నానని కాబోలు మా అత్తగారు అంత స్వల్ప వ్యవధిలోనూ నాకు పిండి వంటలు కూడా చేశారు. భోజనం కొంచెం ఉదాత్తమే అయింది. కాస్సేపు విశ్రమిద్దామనుకుంటే నా అర్ధాంగి నన్ను విశ్రమించనిస్తేగా. నా శరీరంలో సగభాగం కలకంటూ కికకిలలతో రోదన చేస్తూంటే విశ్రమించడం ఎలాగ.



అందుకని ఆ కలకలా కిలకిలారావాలతో శృతికలపక తప్పిందికాదు నాకు. ఇలా ఎన్ని గంటలు జరిగాయో తెలియదుగాని, హఠాత్తుగా నా సగిభాగం మౌనంగా ఉన్నట్లు గ్రహించి ప్రక్కక చూస్తే ఆ అమ్మాయి అక్కడలేదు. ఎక్కడి కెళ్ళిందో వెదకి తీసుకువద్దామని లేవబోతూంటే, మహేంద్రసభలో ఎవరో దివ్యాంగన ఫలహారముల పళ్ళెంతో నాట్యభంగిమతో ప్రవేశించినట్లు, నా అర్ధాంగి కూని రాగంతీస్తూ వెండి పళ్ళెంలో ఫలహారమూ, వెండి చెంబుతో మంచి నీళ్ళూ పట్టుకుని ప్రత్యక్షమైంది. నా కొంత భారంగా ఉన్నా వద్దని అనలేక పంపిన వారికీ, తెచ్చినవారికీ ఉత్సాహం భంగం చేయడం సుతరామూ యిష్టం లేక నెమ్మదిగా లేచి కూర్చుని ఫలహారములు మేముభయులమూ కలిసిమాయం చేశాము.

ఈ కార్యక్రమం ముగించిలేచి ముఖప్రక్షాళనాదికము ముగించుకొని రాజుతో చెప్పివద్దామని బయలుదేరబోతుంటే మా మామగారు కోర్టునుంచి వచ్చి "నాయనా. పార్వాతీశం నీ ప్రయాణం తెల్లవారుఝామునవే శన్యూషములో బాగుంటుందని నిశ్చయించాను. అప్పటికి కారు కూడా ఏర్పాటు చేసాను. దానిమీదను తొందరగా వెళ్ళిపోవచ్చును." అన్నారు.

ఇంక ఏమనను? మాట్లాడకుండా తలవంచుకుని తిన్నగా రాజుదగ్గరికి వెళ్ళిపోయాను. సుమారు ఎనిమిది గంటలకు రాజుకు గుడ్‌బైచెప్పి ఇంటికి వచ్చాను. భోజనానంతరం సరే ఆ గొడవెందుకులెండి.

తెల్లవారుఝామున ఇంట్లో సందడి విని మెలకువ వచ్చి దంతతావనము చేసుకున్నాను. మా అత్తగారు ఫలహారమూ పాలూ తీసుకువచ్చి స్వయంగా ఇచ్చారు. అది పూర్తయ్యేసరికి మా మామగారు నూతన వస్త్రములు తీసుకువచ్చి తాంబూలంతో నాకందించారు.

"ఇవ్వెందుకండీ ఇప్పుడు ఇలా ఇస్తుంటే వారానికోసారి రావాలనిపిస్తుందేమో" అన్నాను.

'మంచిదేనయ్యా అలా రావలెననేకదూ మా కోరిక. వారానికోసారికాదు. దినం విడిచి దినం వచ్చినా సంతోషమే.' అన్నారు నవ్వుతూ.

ఆయనకు నేను పాదాభివందనంచేశాను. ఆశీర్వదించి ఆయన అవతలకు వెళ్ళారు. వాకిట్లో కారుచప్పుడు వినపడ్డది, నా సరస్వతి నాపక్కను వచ్చి నిలబడ్డది. మామూలు పద్ధతిని వీడ్కోలు చెప్పాను. ఆ అమ్మాయి కళ్ళలో నీళ్ళు కనపడ్డాయి. నేనక్కడ నిలబడలేక ముందుకు అడుగువేశాను. తను కళ్ళుతుడుచుకుంటూ..

'మానాన్నగారన్నమాట జ్ఞాపకముంచుకోండి' అన్నది నెమ్మదిగా.

'ఏమిటన్నా'ను.

'దినం విడిచి దినం రమ్మన్నారు కదా! పెద్దలమాట పాటించాలి' అన్నది.

నేనామె చెక్కిలిమీద చిటికవేసి అక్కడ నిలబడితే ప్రయాణం ఆగి పోతుందనే భయముతో తొందరగా వీధిలోకి వచ్చాను.

నేను వాకిట్లోకి రావడముతోనే మా మామగారు, అత్తగారుకూడా కారుదాకా వచ్చారు. నేను కారు ఎక్కబోతుంటే మా మావగారు నాభుజం మీంచెయ్యివేసి,

'చూడు నాయనా! మనలో మనకు ఏ మర్యాదలూ, లాంఛనాలూ అవసరంలేదు. నేను నిన్ను రమ్మని ఉత్తరం వ్రాయలేదని సందేహించవద్దు. నీకు వీలైనప్పుడల్లా వెంటనే బయలుదేరి రమ్మని మా అందరి కోరికాను. ఇక ముందు ఈ వూరు ఎప్పుడు ఏపనిమీదవచ్చినా, ఇక్కడ తప్ప మరొక చోట మకాంపెట్టడం మర్యాదకాదు. మళ్ళీ త్వరలోనే వీలుచేసుకుని ఒక్క సారి వస్తే నీవు ఎన్‌రోల్ కావడం వగైరా మనవృత్తికి సంబంధించిన విషయాలు, సావకాశంగా మాట్లాడుకుందాము. అదీ ఎప్పుడో ఒకప్పుడు తప్పనిదే కదా శుభస్యశీఘ్రం అన్నారు. వెంటనే చేరినా చేరకపోయినా వచ్చినప్పుడల్లా పదిపదిహేనురోజులు నాదగ్గర కూర్చుని చూస్తూఉంటే మన వృత్తిధర్మం, లోకధర్మం, కొంత అవగాహన అవుతుంది. అందుచేతను మొహమాటపడకుండా వస్తూఉండు. మీనాన్నగారికీ, అమ్మగారికీ మా నమస్కారములని చెప్పు' అని నేను కారులో కూర్చోగానే, కారుతలుపు వారు వెయ్యడం, కారు వెంటనే బయలుదేరడం జరిగింది. నేను కిటికీలోనుంచి ఇంటివైపు చూస్తే నాప్రియ కిటికీ దగ్గర నుంచుని కళ్ళు ఒత్తుకుంటూ నావేపుచూసి జాలిగా చెయ్యివూపింది. నాకూ ఎంతో బాధకలిగింది. ఏం చెయ్యను?

జాము పొద్దెక్కకుండానే మొగల్తుర్రు చేరుకున్నాం. కారు మా యింటివైపుకు మళ్ళేసరికి అవతలి వైపునుంచి మానాన్నగారు పొలం నుంచి వస్తూ, స్నానంచేసివచ్చి గుమ్మం ఎక్కబోతూ కారు అటురావటం చూచి ఎవరా అనుకుని కాబోలు, గుమ్మంలోనే ఆగిపోయారు. క్షణం లోనే గుమ్మంలో కారాగడం, నేను పైకిరావడం చూచి, మా నాన్నగారు కొంచెం నవ్వుకుని,

'వచ్చావా నాయనా! మీ మామగారు నీకు వాహనయోగం పట్టించారా ఏమిటి' అన్నారు నవ్వుతూ.

'అవును నాన్నా వద్దంటే విన్నారుకాదు' అన్నాను.

'అవును నాయనా ఇంకా కొత్తకదా! కొన్నాళ్ళవరకూ వారలా మర్యాదలు చేస్తూనే ఉంటారు. అయితే ఇంత హడావిడిగా పరిగెత్తుకొచ్చావేమి. నేను నీ యోగక్షేమం వ్రాయమన్నానుకాని నిన్నురమ్మని వ్రాయలేదే' అన్నారు. ఇంతలో మా అమ్మకూడా లోపలనుంచి వచ్చింది. నేను కారు డ్రైవరుకు అయిదురూపాయలు చేతిలోపెట్టాను. అతను వద్దంటూనే ఎంతో సంతోషంతో అందుకున్నాడు. మా అమ్మ ఇవతలికి వస్తూనే నాయనా కారు అతన్ని భోజనంచేసి వెళ్ళమను. లేకపోతే అక్కడికి వెళ్ళేటప్పటికి ఆలస్యమవుతుంది అన్నది.

ఆ మాటవిని అతను వద్దంటూనే 'నేను పన్నెండు గంటల లోపున అక్కడికి వెళ్ళిపోతానండీ. నాకాట్టే ఆలస్యంకాదు. మా యజమాని కని పెట్టుకుని ఉంటారు కూడాను' అని సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

'ఏం నాయనా నీ ప్రయాణానికి మీ ఆవిడ సెలవు ఇచ్చిందా ఇప్పుడే నిన్నింత కట్టిపడేసుకున్నది. ఇంకను ముందు ఇల్లరికమే చెయ్యమంటుందేమో' అన్నది నవ్వుతూ.

'మరి నాన్నగారు అలాంటిదాన్ని ఎందుకు చెయ్యాలి. నేనేం కావాలని పట్టుపట్టానా' అన్నాను లోపలికి నడుస్తూ.

'నువ్వేమీ పట్టుపట్టలేదు. నేనే నీ మనసెరికి నిశ్చయంచేశాను. నీకు చాలా అనుకూలవతీ, రూపవతీ, గుణవతీ అయిన కన్య ఈమె అని మనోనిశ్చయము కలిగి, నేనంగీకరించాను. నీకన్నివిధాల సరిపోయినపిల్లే. సందేహం ఎంతమాత్రం లేదు. ఆ అమ్మాయి వచ్చిన వేళావిశేషం చేతను నీకు సమస్తశుభములు, సమస్త సుఖములూ, సమస్త సంతోషములూ కలుగుతవని నాదృఢ విశ్వాసం' అంటూ ఆయన పూజకు వెళ్ళిపోయారు.

మా అమ్మ ముఖం వికసిత పద్మమే అయింది. నేను నిలువెల్లా పులకించి పొంగిపోయాను. భీమవరంలో కిటికీ వెనుకనుంచి అర్ధనిమీలనయనములతో నన్ను చూచి చేయి వూపిన దృశ్యం నా కళ్ళఎదుట కదులుతుంటే తదేక దీక్షతో చూస్తూ అలా కూర్చునిపోయాను. ఇంతలో మానాన్న దేవతార్చన కావచ్చినదన్న విషయం స్ఫురణకొచ్చి నేను స్నానానికి లేచాను.

# 15

మళ్ళీ రెండుమూడు మాసములు నిర్వ్యాపారముగా గడపవలసి వచ్చింది. ఏమీ తోచేదికాదు. ఏపనీ చెయ్యబుద్ధి పుట్టేదికాదు. ఏ పుస్తకమూ చదవవలె ననిపించేదికాదు. మనిషొకచోట. మనసొకచోట అన్నట్లు ఉన్నది నా స్థితి. అప్పుడప్పుడు పొలమూ వెడుతుండేవాడిని. అక్కడ పచ్చని వరిచేలూ, చెరువుగట్టునో, చేలగట్లనో, పూల మొక్కలూ, పూతీగలూ చూస్తూంటే, మనసు నన్నక్కడ కూలవేసి, తనెక్కడెక్కడో తిరిగివచ్చేది. ఏమిటీ వెర్రి నాకనుకునేవాడిని. ఈ అనుభవము జనసామాన్య మందరిదీనా? నా ఒక్కడి అదృష్టమూనా అనుకునేవాడిని.

చిన్ననాడూ విదేశాల్లోనూ, ఊహించుకున్న వ్యూహాలూ నిర్ణయించుకున్న నిర్ణయాలు ఈ వేలెడుపిల్ల నాదగ్గరకు రాగానే అన్నీ తలక్రిందులై ఊరుకున్నాయి. నాలో తిష్టవేసుకుని తనే సర్వమై వూరుకున్నది. ఏమిటీ వింత? ఇదివరకు చదివిన కావ్యాల్లోనూ ప్రబంధాల్లోనూ నాయికా నాయకుల వియోగబాధలు చదువుతుంటే ఎంతో అతిశయోక్తులుగానూ, కొంచెం హాస్యజనకంగానూ ఉండేవి. ఈనాడు నేను నాయకుడను కాకపోయినా, వారికున్నంత సౌకుమార్యం నాలో లేకపోయినా, ఈ స్పందనా? వేదనా, మట్టుకు నాలోనూ కలగడం కొంచెం ఆశ్చర్యం అనిపిస్తోంది. కాలక్షేపం కోసం మధ్యమధ్య నర్సాపురం వెళ్ళి వస్తుండేవాడిని, అక్కడ బార్‌లో ఉన్న కుర్రకారు నన్ను అక్కడ క్లబ్బులో మెంబరుగా చేర్పించి, అప్పుడప్పుడు వస్తూవుండమనేవారు. అక్కడికి వెడితే కబుర్లతోనూ, క్రీడలతోనూ కాలక్షేపం జరిగేది మళ్ళీ యింటికివస్తే యథాస్థితే.

ఇటువంటి అయోమయ స్థితిలో ఉండగా ఒకరోజు మధ్యాహ్నం ఫలహారం చేస్తూండగా

ఏమే, ఏం చేస్తున్నావు. నీకో శుభవర్తమానం. కోడలు రజస్వల అయినదట. నక్షత్రం వగైరా అన్నీ మంచివేనట. ఈ సాయంత్రమో, ఉదయానికో ఎవరో దిగుతారు నిన్ను తీసుకువెళ్లడానికి. మీ అన్నగారు నీకూ వాహనయోగం పట్టిస్తారు. తప్పదు అంటే మాఅమ్మ నవ్వుకున్న నవ్వుకూడా నాకు వినపడ్డది. ఈ శుభవర్తమానం వినగానే నాకూ ఎందుకో పట్టరాని ఆనందం వచ్చింది. అక్కడ కూర్చున్నవాణ్ణి కూర్చుండగానే, తేలిపోతున్న భావన కలిగింది. విన్నావుట్రా అబ్బాయీ. అని ఎంతోసంతోషంతో ఈ వార్త చెప్పడానికి నా దగ్గరకు వచ్చింది. ఎంతో

సంతోషంతో మాట కాస్తా నాచెవిని పడేసింది. నా సంతోషం పైకి రానివ్వకుండా లోపలనే అణచిపెట్టుకుని దానికెంత హడావిడీ సంతోషం ఎందుకమ్మా. ఆడజన్మ ఎత్తిన తరువాత ప్రతివాళ్ళకూ జరిగేదేకదా. నీకో డలు ఎందుకో యింతకాలం ఊరుకున్నది కాని పెళ్ళయిన తరువాతకూడా అలాగే ఉంటుందనుకున్నావా అన్నాను ఏమీ ఏరగనట్టు.

'చాల్లేరా నీ కబుర్లూ నువ్వునూ, పెద్దమనిషి అయింది. కోడలు నట్టింటికి వస్తుంది. మహాలక్ష్మిలా యింట్లో తిరుగుతుంటే చూడాలని సంతోషంతో నేనువుంటే'.

'అయితే అమ్మా తెలియకడుగుతాను. నీకంటే అందంగా వుంటుందా? నీవు సాక్షాత్తూ నా కళ్ళకు పార్వతీదేవిలా కనిపిస్తూంటావు. పార్వతికంటే మహాలక్ష్మి ఎక్కువ అందమైనదా అమ్మా'

'బావుంది నీ సందేహాలు, నువ్వూనూ ఎన్ని ఏళ్ళు వచ్చినా ఒకటే మోస్తరు అది యిక్కడకు వచ్చిన తరువాతను ఎవరందమైనవారో నేన డక్కుండాను నువ్వు చెప్పకుండాను నాకే తెలుస్తుంది. రేపు నువ్వుకూడా రావాలిరోయ్ నాతోటి' అన్నది.

'ఏమిటమ్మోయ్ నేనుకూడా ఎందుకు ఆ ఆడమళయాళంలోకి కొంపతీసె నేనూ ఆడదానినై ఊరుకుంటే ప్రమాదిస్తుంది' అన్నాను.

ఆవిడ 'వెర్రినాయనా ఎప్పుడూ ఒక్కటే మోస్తరు' అని నవ్వు కుంటూ చక్కా పోయింది.

మా నాన్న అన్నట్టుగానే జాముర్రాత్రయ్యేసరికి భీమవరం నుంచి కారూ, కార్లో మాఅత్తవారితరపున బంధువులు ఒకాయనా, ఆయన భార్యా మా అమ్మను తీసుకువెళ్ళడానికి వచ్చారు. మా అమ్మ గబగబా అప్పుడు వంటచేసి, వారికి భోజనం పెట్టి, పడకకు ఏర్పాటు చేసింది. తెల్లవారుఝామునే ఆమె ప్రయాణమట. నన్ను కూడా వారు చాలా బలవంతం చేశారు. సుతరామూ రానుగాక రానన్నాను. నాకు ఉదయాన్నే నర్సాపురంలో అర్జంటుపని ఉన్నదన్నాను. అప్పుడింకేమీ సమాధానం చెప్ప లేక ఎవరిమట్టుకు వారుపడుకున్నారు. నేనూ పడుకున్నాను. తక్కిన వాళ్ళకు క్షణంలో నిద్రముంచుకుని వచ్చింది. నాకు మట్టుకు ఆ క్షణం నుంచి నిద్రదూరమైంది. అనేక వ్యూహాలు తలలో సుడులు సుడులుగా తిరగనారంభించాయి. అందులో ఏ ఒక్కటే చెప్పమంటే చెప్పలేను. తెల్లవారురుఝామున మూడు గంటలకే లేచి యింటిపనులన్నీ చక్కపెట్టి

కుని, వచ్చి బంధువులకు స్నానమునకు వేడినీళ్ళు వగైరా ఏర్పాటుచేసింది మా అమ్మ. వారి అవశిష్టములూ అయాక ప్రయాణసన్నద్ధులు అయ్యారు. మళ్ళీ నన్నొకసారి మేలుకున్నవాడినే లేపి తమతో దయచేయమని మా మామగారు అత్తగారు మరీమరీ చెప్పారని బలవంతపెట్టారు. నాకిప్పుడు రావడానికి తీరిక లేదనీ మరొకప్పుడు సావకాశంగా వస్తాననీ వారికి నచ్చచెప్పి పంపించాను ఉదయాన్నే నాకు నర్సాపురంలో పనివున్నదని మానాన్నతో చెప్పి చక్కాపోయాను. పాపం మా నాన్న స్వహస్తపాకం చేసుకుని ఇబ్బంది పడవలసివచ్చింది.

మూడవనాడు సూర్యోదయమయ్యేసరికి మా అమ్మ భీమవరంనుంచి కారులో వచ్చేసింది. కూడా మాఅత్తగారి తాలూకు పదిహేనేళ్ళ కుర్రవాడు సహాయం వచ్చాడు. అప్పటికే మా నాన్న లేచి పొలం వెళ్ళారు. నేను దంత ధావన ప్రయత్నంలో ఉండగా కారుచప్పుడువిని వీధిలోకి వచ్చాను. తలుపు తీసేసరికి మా అమ్మ ఎదురుగా కనపడగానే ప్రాణానికెంతో హాయి అనిపించింది. ఈ రెండురోజులకే ఇలా ఉంటే మూడేళ్ళు మా అమ్మను విడిచి పెట్టి విదేశాలలో ఎలా కాలక్షేపం చేశానా అదే ఆలోచనవచ్చింది. ఒక్కసారి గుండెఝల్లుమన్నది.

నాయనా వచ్చావ్రా. వాళ్ళు యింకోపూట ఉండమని ఎంతో బల వంతం చేశారుకాని, మీరిక్కడ యిబ్బందిపడతారని ఉండనుగాక ఉండనని వెంటనే వచ్చేశాను. వద్దుమొర్రో అంటే వినిపించుకోక మీ మామగారు రథం ఒకటి ఏర్పాటు చేశారునాకు. వాళ్ళందరూకూడా ఎంత మంచివా ళ్ళనుకున్నావ్? నన్ను ఎంత మర్యాద చేశారనుకున్నావ్? నువ్వు రాలేదని వాళ్ళెంత యిబ్బంది పడ్డారనుకున్నావ్?

"ఎవరమ్మా" అన్నాను నాలో నేను నవ్వుకుంటూ. నేనన్నమాట మా అమ్మ వెంటనే గ్రహించుకోలేక

'ఎవరనుకుంటారురా మీ అత్తగారూ మీ మామగారూను' అంది.

'అవునులే ఇంకెవరున్నారు' అన్నాను. అప్పటికే మా అమ్మ నా ఊహ గ్రహించి ఒక పెద్ద నవ్వు నవ్వి,

'ఊహూ దాని సంగతి చెప్పలేదనా నీ ఉద్దేశం. అది వచ్చి నాదగ్గిర చెబుతుందిట్రా. ఎంత వెర్రివాడవురా. దాని సంగతి నువ్వు అడగనూ అక్కరలేదు. నేను చెప్పను అక్కరలేదు. కారుశబ్దం వినగానే దూరంగా ఉన్న పిల్లకూడా కళ్ళుమట్టుకు వీధిగుమ్మంలో పెట్టుకుని, ఎవరొచ్చారా

అని రెప్పవాల్చకుండా చూస్తూ కూర్చుంది. నేను ఒకర్తెను రావటం చూచి, యెంత నిరుత్సాహపడ్డదో! పాపం దాని మొహం చూస్తే యెంతో జాలి వేసింది నాకు. మన అదృష్టం కొద్దీ మన ప్రయత్నమేమీ లేకుండానే రత్నంలాంటి పిల్లని ప్రసాదించాడు దేవుడు' అన్నది.

'అవునమ్మా అదే నేను అనుకుంటున్నాను. నీవు చాలా అదృష్టవంతురాలవు కనుకనే నీకొడుకు యెలాంటివాడైనా కోడలేనా యోగ్యురాలు వచ్చింది. చాలా సంతోషం.' అన్నాను లేచి గాంభీర్యము ముఖంలోకి తెచ్చుకుని.

'ఓరి వెర్రినాగమ్మా! యెప్పుడూ ఒక మోస్తరుగానే ఉన్నావ్. ఈ వచ్చిన భార్య నిన్ను సంతోషపెట్టి, 'నేను అదృష్టవంతుడను' అనిపించడమే నా అదృష్టం. అంతకంటే వేరే అదృష్టం నాకేం ఉంటుంది నాయనా' అని ఆవిడ లోపలికి వెళ్ళిపోయి గృహకృత్యాలలో నిమగ్నురాలయింది.

ఆవచ్చిన అబ్బాయిని కూర్చోమని ముఖం కడుక్కోమని చెప్పినేను స్నానాదికములు పూర్తిచేసుకున్నాను. మా అమ్మకూడా గబగబా ఎప్పుడు స్నానం చేసిందో ఎలా చేసిందోకాని, ఏదో ఫలహారమూ కాసిని పాలూ తనకు తోడుగా వచ్చిన కుర్రవాడికి, నాకు యిచ్చి వీధిలోఉన్న కారు మనిషికికూడ తీసుకువెళ్ళి ఇచ్చింది. పాపం, ఆ మనిషి ఎంత సంతోషించాడో, ఫలహారం ముగించుకుని మేము ఎన్నివిధాల చెప్పినా వినకుండా మా నాన్న యింటికి రాకుండానే ఆ కుర్రవాడు కార్లోకూర్చుని తుర్రుమని భీమవరం వెళ్ళిపోయాడు.

మా అమ్మరాకతో నా మనస్సు మళ్ళీ కొంచెం వికలమైంది. నేను కూడా ఒక్కమాటు భీమవరం వెళ్ళిఉంటే బాగుండునేమోననిపించింది. ఇక తరువాతనేమిటి? మామూలు లాంఛనాలన్నీ మామూలుపద్ధతిలో జరగవలసినదేనా లేకపోతే..

ఇలావెర్రిగా ఏదో ఆలోచిస్తుంటే మానాన్న హడావిడిగా చక్కా వచ్చారు. మా అమ్మవచ్చిన సంగతి తెలియక వంటకు ఆలస్యమవుతుందని కంగారుగా వచ్చినట్టున్నారు! వీధిగుమ్మంలోకి రాగానే అక్కడ పరిశుభ్రత తీర్చి పెట్టినట్టున్న ముగ్గూ, లోపల మా అమ్మ తిరుగుతున్న సందడీ విని.

'అమ్మ వచ్చిదేమిట్రా అబ్బాయీ' అన్నారు.

'రావడం స్నానం చేయడం, వంటచేయడం కూడా చాలభాగం

అయిపోయిందన్నాను.

ఆయన ఎంతో సంతృప్తితో లోపలికి వెళ్ళారు. నేను మామూలుగా పుస్తకం చేతపుచ్చుకుని ముఖానికడ్డుపెట్టుకుని అంబరవీధిలో విహరిస్తున్న మనస్సును వెనక్కులాగలేక విశ్వప్రయత్నం చేస్తూ కూర్చున్నాను. ఇంతలో మా నాన్న దేవతార్చన పూర్తికావడం, నన్ను భోజనానికి లేవమని మా అమ్మ పిలుపు రావడంతో, నా చేతిలో ఉన్న పుస్తకం విసిరి అవతలపారేసి భోజనానికి తయారయ్యాను.

మళ్ళీ రెండు మూడు మాసములు స్థిమితంలేని మనస్సుతో, చైతన్యంలేని శరీరంతో, బరువెక్కిన హృదయంతో, అర్థంలేని ఆవేదనతో, ఎక్కడికి వెళ్ళడానికీ, ఏమి చేయడానికీ, తోచక కాలం ఎలాగో గడుపుకుంటూ ఉన్న సమయంలో మామగారి సలహా ఒకటి జ్ఞప్తికి వచ్చింది. అప్పుడప్పుడు అక్కడకు వచ్చినవారితో కచేరీలో కూర్చుంటే కోర్టువ్యవహారపద్ధతులూ, కోర్టుకు వచ్చేవారి మనస్తత్వాలూ, కొంతవరకు అవగాహన అవుతుందన్న మాట స్ఫురణకు వచ్చింది. ఆ సలహా మంచిదే ననిపించింది కూడాను. ఇంట్లో ఏపనీ లేకుండా ఆఖరుకు ఒక పుస్తకంకూడా ముట్టుకోకుండా కూర్చుంటే మనసు మొద్దుబారి ఎందుకూ పనికిరాకుండాపోతానేమో ననిపించింది. అందుకని ఈ విషయం నాన్నతోచెప్పి పదిరోజులపాటు భీమవరం వెళ్ళటం మంచిదా అనే ఆలోచన కలిగింది. దాని మంచి చెడ్డల విషయమై ఏ నిర్ణయమూ చేసుకోకుండానే టపాబంట్రోతు కేకవిని, వాకిట్లోకి వచ్చి, అతను అందిచ్చిన ఉత్తరం తీసుకుని అపరిచితమైన దస్తూరి అందులోనూ స్త్రీ హస్తంలా కనబడుతున్న ఉత్తరం చూచి మనకు రాసే ఆడవాళ్ళెవరా అని ఒక్కక్షణం ఆలోచించి ఉత్తరం తెరుస్తే తేల్తుందికదా అని నిశ్చయించేసుకుని నెమ్మదిగా కవరుచింపి ఆలోచిస్తూనే లోపల ఉత్తరం నెమ్మదిగా తీసి తెరవడంతోనే ఉత్తరంలో వున్న సంబోధన చూచుకుని నిశ్చేష్టుడనై, పులకాంకితుడనై, అనంత పరవశుడనై ఒక్కక్షణం ఆ ఆనందాన్ని అనుభవించి, తొందరగా లోపలకు పరుగెత్తి నా మంచంమీద కూర్చుని, సావకాశంగా ప్రతి అక్షరమూ, ప్రతి మాటా ఎంతో శ్రద్ధతో, అప్యాయతతో, ఆనందంతో చదువుకున్నాను. ఇంతలోనే మా అమ్మ,

'ఏమిరా నాయనా, ఎక్కడనుంచి ఉత్తరం. ఎన్నిసార్లు పిలిచినా పల కలేదేమి? ఎక్కడ నుంచి వచ్చినా అంతా క్షేమమేకదా' అన్నమాటలు విని ఉలిక్కిపడి,

'అంతా క్షేమమేనమ్మా, భీమవరంనుంచి వచ్చింది. కిందటి మాటు నేను వచ్చేటప్పుడు మా మామగారు నన్ను అప్పుడప్పుడు వచ్చి తనతో పనివేళ కూర్చుంటే, కోర్టువ్యవహారాలన్నీ తెలుస్తాయని హెచ్చరిక చేశారు. ఆమాటే ఇప్పుడు జ్ఞాపకంచేస్తూ కోడలి దగ్గరనుంచి వచ్చిందని చెప్పినా వద్దా అని సందేహిస్తూ ఇంతవరకు ఆడిన అబద్ధం చాలునని అనుకొని కూతురుచేతను మామగారు రాయించారు. మీ కోడలు, నీకూ, నాన్నగా రికి నమస్కారములని చెప్పమని వ్రాసినది' అన్నాను.

ఊహూ అదా సంగతి. అందుకనా నేను నాలుగైదుసార్లు పిలిచినా వినబడకపోవడం, ఆమాట చెప్పడానికి ఇంత కల్పనెందుకురా నాయనా? ఇంకా ఏం రాసింది? సరే పోనీ నాకెందుకులే అని నవ్వుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

మా అమ్మ పిలిచిన సంగతే నాకు తెలియదు. ఆ ఉత్తరంలో వున్న పది పంక్తులూ ఒక్కసారే చదివాననుకున్నానుగాని, బహుశ గాయత్రీ మంత్రంలాగ వెయ్యిన్నూటపదహార్లు అననుగాని నూటఎనిమిది సార్లేనా చదివి వుండాలి. అయినా మళ్ళీ ఒక్కసారి ఎందుకో చదవబుద్ధిపుట్టి చదివి ఈమాటు సమాధిలోనే పడినట్టున్నాను. అలా ఎంతసేపు కూర్చున్నానో తెలియదుగాని మా అమ్మవచ్చి.

'నిద్రా ఏమిట్రా నాయనా! కూర్చుని నిద్రపోతున్నట్టున్నావు. లేచి ఒక్క మాటు కాళ్ళూ, చేతులూ ముఖం కడుక్కుంటే, ఆ బద్ధకం తీరుతుంది. ఫలహారము చేద్దువుగాని' అన్నది.

ఆ దెబ్బతో నా సమాధిలోంచి బయటపడి ఈ లోకంలోకి వచ్చి ఆవిడ చెప్పినట్టుగానే కాళ్ళూ చేతులు కడుక్కుని మామూలు పద్ధతిని ఫలహారం చేశాను. ఎప్పుడూ లేనిది మా అమ్మ అక్కడే నుంచుని నా ముఖ కవళికలు చూస్తూ నా వూహలు తెలుసుకోడానికి ప్రయత్నించింది.

"మీ మామగారు యింకేమన్నా రాయించారా?" అన్నది.

"ఇంకేమున్నది రాయించడానికి" అన్నాను.

"తరువాత సంగతి ఏమన్నా సూచన చేశారా ఏమిటి" అన్నది.

"అదేమీలేదమ్మా. వెర్రిదానవు కాకపోతే ఆ వుద్దేశం ఆయనకు కలిగినప్పుడు నాన్నగారిపేర ఆయన స్వయంగా రాస్తారుగాని, కూతురుచేత రాయిస్తారా! అలాంటివేమీ లేవులే. దానికిప్పుడు వచ్చిన తొందరా ఏమీ లేదు అన్నాను. ఏమీ ఎరగనట్టు. మా అమ్మ ముసిముసినవ్వులు నవ్వు కుంటూ తాను తెచ్చిన ఫలహారం పళ్ళెం వగైరాలు తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది.

మళ్ళీ ఏమిటి చిత్రం అనుకున్నాను. నేను వెళ్ళవలెనని సంకల్పం చేసుకోవడం, ఆ క్షణంలోనే నన్ను ఎలాగైనా అక్కడకు వచ్చి వాలమని పిలుపురావడం చాలా చిత్రమనిపించింది. యదార్థంచేతను అక్కడకు వెళ్ళి నా భార్యను చూడవలెననే కుతూహలము నాకు కలిగినట్టుగానే నన్ను మళ్ళీ ఒకసారి చూడవలెననే వాంఛ అక్కడ నా సరస్వతికి కలిగి వుండ వచ్చుకదా. యెటొచ్చీ ఈ పిల్ల కావ్యాలలోకన్యకాదు కనుక, ఈనాటి ముగ్ధగనుక. అందులోనూ ఆంగ్లం చదువుకుంటున్నది. కనుక తను ముగ్ధ నన్న సంగతి మరచిపోయి ప్రియురాలిగా మంచి ముహూర్తం చూసుకొని మొట్టమొదటి ప్రణయలేఖ వ్రాయసాహసించింది. అనుకుంటూ మధాక మాటు ఆ ఉత్తరం తీసి, ఆమూలాగ్రంగా పదిసార్లు చదువుకొని, ఆ వ్రాతతీరూ అక్షరముల సొంపూ, మాటల్లోనేర్పూ అన్నీ తలుచుకుంటూ ఇలా ఇంట్లో కూర్చుని కాలయాపన చేయడంకంటే ఒక్కసారి బయటికి వెళ్ళి, నిర్జనంగా ఉన్న ఏ చెరువు గట్టునో, చేసుగట్టునో కూర్చుని ప్రకృతి సౌందర్యమును తిలకిస్తూ నా సతీమణిసౌందర్యమును మరింత స్ఫుటంగాజ్ఞ ప్తికి తెచ్చుకోవచ్చునని నిశ్చయించుకుని బయటకు వెళ్ళాను.

నేను యింటికి వచ్చేటప్పటికి చాలా ఆలస్యమైంది. బాగా చీకటి పడిపోయింది. వూరంతా చాలా వరకు మాటుమణిగిపోయింది. నేను వచ్చ సరికి మా నాన్న భోజనం కూడా అయిపోయింది. ఆయన చేయి కడుక్కుని ఇవతలికి వస్తుంటే నేను లోపలికి అడుగు పెట్టేను.

"ఏమిరా అబ్బాయీ. ఇంత ఆలస్యమైనదేమి, నర్సాపురం వెళ్ళే వేమో అనుకుని నా భోజనం కూడా ముగించాను." అన్నారు.

"లేకపోతే మట్టుకు నాకోసం కనిపెట్టుకుండాలా ఏమిటినాన్నా. నేను నర్సాపురం వెళ్ళలేదు. కాని వూళ్ళోనే చెరువుగట్టుని ఏదో పరధ్యానంగా ఆలోచిస్తూ కూర్చున్నాను" అన్నాను.

"ఇంత చీకటి పడేవరకూ అలాటిచోట కూర్చోడం మంచిదికాదు. పురుగూ పుట్రా తిరుగుతుంటాయి. నాటి తిండికోసం అవి తిరుగు

తుంటే మనం అక్కడ వుండకూడదు.” అన్నారు.

“మరేం ఫరవాలేదు. వాటి జోలికి పోతేతప్ప అవి మనజోలికిరావు కదా ఏదో పరధ్యానంగా ఆలోచిస్తూ కూర్చున్నాను చీకటిపడ్డ విషయం కూడా ఇప్పుడే గమనించి ఇంతసేపు కూర్చున్నాను ఏమిటని హడావిడిగా వచ్చేశాను అన్నాను.

“అత తీవ్రమైన విషయం ఏమిటి” అన్నారు.

“మరేం లేదు నా భవిష్యత్తు సంగతి - ఆ మధ్యను భీమవరం వెళ్ళినప్పుడు మా మామగారు నన్ను మధ్య మధ్యను వచ్చి వారి దగ్గ రుండి ప్లీడరీవృత్తికి సంబంధించిన విషయాలుకొంచెం తెలుసుకుని, వృత్తిలో ప్రవేశించమని సలహా యిచ్చారు. దాని గురించే ఇంతసేపూ ఆలోచి స్తున్నాను. వెళ్ళడమా? మానటమా? అవి కొంతసేపు లేక అసలు మానేసి మీ దగ్గరే ఉండి మీకు చేదోడు వాదోడుగా ఉండడమా అని కొంతసేపూ ఆలోచిస్తూ కూర్చున్నాను. ఏ నిర్ణయానికిరాలేకపోయినా నాకోసం కాలం ఆగకుండా దానిదారి అది పోయింది. అప్పటికి కళ్ళు తెరచి చూచేటప్పటికి ఇంత ఆలస్యమైనదా అనుకుని వచ్చాను” అన్నాను.

“అయితే ఏ నిర్ణయానికి రాలేదన్నమాట.” అంటున్న మా నాన్న గారిమాట పూర్తికాకుండానే -

“రా నాయనా వడ్డించాను. ఇప్పటికే చాలా ఆలస్యమైనది.” అన్న మా అమ్మ పిలుపు వినపడ్డది.

నేను లోపలికి వెళ్ళబోతుంటే

“మీ మామగారు చెప్పిన సలహా బాగానే ఉంది. ముందు పదిరో జులు ఆయన దగ్గిర కూర్చుని చూస్తుంటే ఇందులో సులువు బలువులు తెలుస్తాయి. దానినిబట్టి నీ నిర్ణయం చేసుకోవడం తేలికవుతుంది. వెళ్ళా లని వుంటే రేపు బయలుదేరి వెళ్ళు” అని మానాన్న లేచారు.

నేను భోజనానికి లోపలికి వెళ్ళాను.

ఆ పని కాగానే సుఖంగా పడుకున్నా, నా ఆలోచనలు నన్నువదల లేదు. తెల్లవార్లూ నన్ను వేధిస్తూనే ఉన్నాయి. అభ్యంతరాలులేని ఆలో చనలతో బుర్రవేడెక్కి మొద్దుబారి ఏ కోడికూత వేళోకన్నుమూశాను కాబోలు లేకపోతే మా ఆవిడ ఎలా కనపడుతుంది. కనపడడమేకాదు. ‘ఇక్కడికి రావడానికి ఇంత ఆలోచన ఎందుకండీ మీరెలాగూ రావలెనను కుంటున్నారు కదా. అయినా మీరు మొహమాట పడతారని నేను వుత్తరం

కూడా రాస్తినికదా! మీరు చెయ్యవలసినపని నేనుచేస్తే ఇంకా ఆలోచన ఎందుకు? అర్థంలేని ఆలోచనలు కట్టిపెట్టి దయచేయండి త్వరగా. మెళుకు వవచ్చిందా ఇంకా దగ్గిరకు వచ్చిలేపమన్నారా? మా వాళ్ళు మీ రాకకోసం ఎదురు చూస్తూనేఉన్నారు. మరిలేవండి. ఈపాటికి అయినా మొగాళ్ళ కికూడా ఇంత సిగ్గేమిటమ్మా' అనినవ్వుతూ నాకుగడ్డంకింది, మెడమీదా చక్కలిగింతలు పెట్టి, నేను లేవబోతూంటే హడలి బెదిరిపోయినట్లు పారి పోయింది. నేను నిజంగానే వులిక్కిపడి కూర్చున్నాను. మంచంమీదనుంచి తొందరగా దిగి నాలుగుమూలలా పరకాయించి చూచాను కూడాను. ఏదీ నా ప్రేయసి? ఇట్టే కల అనే నిజం స్ఫురించింది. మళ్ళీ మంచం మీద చతికిలబడి నాలో నేను ఒక్కసారి నవ్వుకుని నన్ను తొందరగా ప్రయాణం కమ్మని హెచ్చరికకదా ఇది అని లేచి ప్రయాణ సన్నాహం చేసుకున్నాను. మా అమ్మ నా వేగిరపాటు గమనించి

'ఇప్పుడే ప్రయాణమా నాయనా' అన్నది.

అవును అన్నాను.

ఆమె మాట్లాడకుండా వెళ్ళిపోయింది. నేను బట్టలు సవరించుకునే సరికి నాకు తొందరగా ఫలహారం, పాలూ అందించింది. మా నాన్న అప్పటికి లేచి పొలం వెళ్ళిపోయారు. నేను మా అమ్మతో చెప్పి బయలు దేరాను. మా అమ్మ నన్ను ఆశీర్వదించి అక్కడవారు నా కార్యం సంగతి ఏమైనా తలపెడితే

"నువ్వేమీ ఇప్పుడు కాదనీ అప్పుడు కాదనీ అనక మాట్లాడక ఊరుకో," అని నా సమాధానం వినిపించుకోకుండా నవ్వుకుంటూ లోపలకు చక్కా పోయింది.

"నీ కోడల్ని ఇంటికి తెచ్చుకోవాలని తొందరగా వుంటే నువ్వు తెచ్చుకో నా అభ్యంతరం యేమీలేదు. నా సంగతి నే చూసుకుంటానులే" అని నేను వీధిలోకి వచ్చి భీమవరం ప్రయాణం సాగించాను.

# 16

భీమవరం చేరేటప్పటికి దాదాపు రెండుజాములయింది. మా మామ గారు అప్పటికే భోజనంచేసి కోర్టుకు వెళ్ళిపోయారు. బండి గుమ్మంలో ఆగేసరికి నా మనోహరి వీధిగుమ్మంలో నుంచుని నారాకకు ఎదురుచె న్నులు చూస్తూ గుమ్మంలో నాబండి ఆగి నేను బండిలోనుంచి దిగగానే

నన్ను చూసి వికసితపద్మం అయి ఊరుకుంది.

మామూలు లాంఛనాలూ, యోగక్షేమాలూ అయిన తరువాత, నా స్నానమూ, భోజనాదికములూ కూడా ముగించుకొని గదిలోకి వెళ్ళి కూర్చుని సాయంకాలం మూడుగంటలవరకూ విరామంలేకుండా ఏదో కలకలారావము చేస్తూనే ఉన్నది. అంతసేపూ తనొక్కతే మాట్లాడిందో నేను కూడా మాట్లాడేనో, ఇంతకూ ఎవరేమి మాట్లాడేమో జ్ఞాపకం రావడం లేదు. ఎవరో పిలిచినట్లుగా హఠాత్తుగా నాభార్య లోపలకు వెళ్ళి, ఫలహారం తీసుకువచ్చి అక్కడ పెట్టింది. అదిముగించి, నేను దుస్తులు మార్చుకుని నా స్నేహితుడు రాజును చూడటానికి వెళ్ళాను. మేమిద్దరం అక్కడా, అక్కడా తిరిగి బాగా చీకటిపడ్డ తరువాత ఇటికివచ్చేసరికి మా మామగారు నాకోసం కనిపెట్టుకున్నారు. మేముభయులమూ భోజనంచేసివాలాసేపు ఆకబురూ, ఈకబురూ చెప్పుకుంటూ రాత్రి పొద్దుపొయ్యేవరకూ కాలక్షేపం చేసుకుని ఎవరిదారినివారు పడుకోడానికి వెళ్ళిపోయాము. మా మామగారి వివిధ విషయ పరిజ్ఞానం, భాషాపాండిత్యం, లోకజ్ఞానమూ వీటన్నిటికీ తోడు, వారి సౌమ్యతా చూచి ముగ్ధుడినయ్యాను. అవన్నీ తలచుకుంటూ ఉంటే ఎంతోసేపటికి కాని నిద్రాదేవికి నాపై దయరాలేదు. ఎప్పుడో నాకు తెలియకుండానే సుషుప్తి అవస్థలో పడిపోయాను.

నేను మామూలు వేళకంటే కొంచెం పెందలాడే లేచి, ప్రభాత విధులన్నీ తీర్చుకుని మా మామగారి దగ్గర కూర్చుని వారి వ్యవహారిపద్ధతులూ, లోకము రీతీ, వారు చెప్పినట్టు కొంత గమనిద్దామని వాకిట్లోకి వచ్చేసరికి మా మామగారు ఆక్షణంలో తమకుర్చీలో కూర్చోబోతూ నన్ను చూచి

'రా నాయనా పార్వతీశం, కూర్చో అలాగ, ఇంకో రెండుమూడు క్షణాలలో మన గుమాస్తాగారూ, వారివెనుకను పక్షీంద్రులూ, పక్షులు కొందరూ దిగుతారు.

వారి సంభాషణాక్రమం, వచోనైపుణ్యం, పదునైన గడసరితనం చూచి, విని, ఆనందించు. ఇది ప్రధమపాఠం. యిది విజ్ఞానదాయకమూ, వినోదకరముగానూ కూడా వుంటుంది. మధ్యనెక్కడేనా చటుక్కున నీకు సమాధానం చెప్పవలెననే బుద్ధిపుడుతుందికాని, ఆపనిమట్టుకు చేయకు. ఈరకం మనుష్యులదగ్గర నిగ్రహం చాలా అవసరం' అని వారంటుండగానే గుమాస్తాగారు పనిచేసి యజమానికి నమస్కరించి, నావేపు ఒక మందహాసం విసిరి, అక్కడి కాగితాల కట్టలు కొన్ని తీసుకుని, వారి గదిలోకి

వారు నిష్క్రమించబోతుంటే, ముగ్గురు ముతా ఒకటి, తరువాత మరో నలుగురైదుగురు వేరేజట్టుగానూవచ్చి, నమస్కరించి, సందేహిస్తూ కొందరు నిలబడ్డా, తక్కినవాళ్ళు సాహసించి కుర్చీలపై సుఖాసీనులయ్యారు. వారిలో ఒకరిద్దరు పెద్ద భూస్వాములున్నా తక్కినవారంతా సామాన్య రైతులో, రైతు కూలీలో అయినట్టు కనిపించారు. అందరిలోనూ కొంత

వినయమూ భయమూ కనిపించినా, అందరిలోను కూడా మనం డబ్బుఇచ్చి పోషిస్తున్న ఈ ప్లీడరు మనదగ్గిరే ఇంత గొప్పలు పోతాడేమిటి అన్న భావం అందరి ముఖాల్లోనూ కొట్టవచ్చినట్లు కనబడుతుంది. ఇదంతా నడమంత్రపుసరి లక్షణం కాబోలు అనుకున్నాను. ఆంగ్లంలో the new rich అంటారు. ఇంక నక్కడనుంచి మా మామగారు చెప్పి నట్టు సుమారు మూడుగంటలసేపు అక్కడికివచ్చి ప్లీడరుగారి సలహాలు అర్థించినవారూ, వారికే సలహా లివ్వబోయినవారూ, అడ్డదిడ్డంగా వాదిం చేవారూ తమలో తాము వాదించుకునేవారూ, ఎంతో గడుసుతనంగా మాట్లాడబోయి ప్లీడరు గారి మాటలవల్ల ముఖం బద్దలయ్యేటట్టు బోల్తా కొట్టినవాళ్ళు ప్లీడరుగారు అతి సూక్ష్మమైన వ్యవహార రహస్యమును బయ టపెట్టినప్పుడో, లేక తమరు తలలు బద్దలు కొట్టుకున్నా విడగొట్టలేని చిక్కుసమస్యను గోరుతో మీటినట్లు ఒక్కమాటలో ఆయన విడమర్చి చెప్పినప్పుడో వాళ్ళందరూ సంభ్రమాశ్చర్యాలతో 'ఓరి దీనమ్మ ... ఇంత గడ్డు విషయాన్ని ఈ బేమ్మడొకమాటలో యిట్టే లాగిపారేశాడు. సూశేవా? అందుకనే ఆయన పీడరయ్యేడు. యిప్పటికి అన్నెల్లనుంచి మనం బుర్రలు బద్దలు కొట్టుకుంటున్నాం, ఎదవబుర్రలు, బుర్రలెంటీ ఇయి మట్టిముద్దలు కాని ఈ మాత్రం మనకి తోచకూడదూ లెగండిపోదాం' అని అందరూ లేచి నిలబడ్డారు.

ఇంతలో గుమాస్తాగారు భూమిలోంచి పైకి లేచినట్టు హఠాత్తుగా ప్రత్యక్షమై, అందులో యిద్దరినీ చెరోరెక్కా పట్టుకుని తన గదిలోకి తీసుకువెళ్ళి నెమ్మదిగా, వాళ్ళకాట్టే బాధ కలగకుండా, ప్లీడరుగారి ఫీజూ, తన మామూలు ఏ నొప్పి తెలియకుండా దంతమూడదీసినట్లు, వాళ్ళ జేబుల్లోనుంచి తీసుకుని వాళ్ళను విడుదల చేశాడు. వాళ్ళు వెర్రిమొహాలే సుకుని

'రండిహై పోదాం చేశారు నిలవోకం ఎలాగైతేనేం. ఈయాలకిది సాలులెగండి' అని వీధిలోకి వాళ్ళిద్దరూ దారితీయడంతో ఆమురా అంతా నిశ్శబ్దంగా బయటకే వెళ్ళిపోయారు సెలవేనా తీసుకోకుండా.

అక్కడున్న ఆ మూడు గంటల్లోనూ ఇంకా ఎతెంతమందో, ఎన్నెన్ని రకాలో, పెద్దా చిన్నా వర్తకులు, ఉద్యోగులు, నిరుద్యోగులు, రకరకాల వారంతా వారి వారి ఇబ్బందులు ఏకరువు పెట్టుకుని ప్లీడరుగారి సానుభూతినీ సలహానూ సంపాదిచుకుని, సంతృప్తితో వెళ్ళిపోయారు. మా మామ గారన్నట్లు ఇది చాలా వినోదకరంగానూ, విజ్ఞానదాయకంగానూ ఉన్నమాట వాస్తవమే.

కొంతసేపైన తరువాతను మా మామగారు తలవంచుకుని ఏదో వ్రాసుకుంటూండగా నేను నెమ్మదిగా లోపలికి జారాను. ఒక అరగంట తరువాతను మళ్ళీ భోజనాల దగ్గర కలుసుకున్నాము. ఆయన నవ్వుతూ

'ఏమండీ బారిష్టరుగారూ మీ ప్రథమపాఠం ఏలాఉన్నది' అన్నారు.

'చాలా కనువిప్పుగా ఉన్నదండి' అన్నాను.

'చాలా సంతోషం. తలనొప్పిగా ఉందని అంటావేమో అనుకున్నాను అని భోజనానికుపక్రమించి ముగింపయ్యేవరకూ వారే సంభాషణా చెయ్యలేదు.

భోజనంచేసి వారిదారిన వారు కోర్టుకు వెళ్ళారు. నేనేదో కాలక్షేపానికి పుస్తకం పుచ్చుకుని చదువుతున్న కొంతసేపటికి, హఠాత్తుగా పుస్తకం గాలిలోకి ఎగిరివెళ్ళి ఎదర బల్ల మీద పడింది. ఏమిటీవింత అని నేనాశ్చర్యముతో వెనక్కి చూచేసరికి నా హృదయేశ్వరి చాలా అమాయకంగా నా వెనుకనేదో సవరిస్తున్నట్లు నిలబడ్డది. ఓహో! ఈవిడగారి పనా అనుకుని 'ఏమిటి అమ్మాయ్ ఈ అల్లరేమిటి. చిన్నా పెద్దా లేకుండాను? నేనెవరనుకుంటున్నావ్' అన్నాను కనుబొమ్మల మీద కోపమూ, పెదవుల మీద హాసముతో.

'అదే నేనూ ఆలోచిస్తున్నానండీ. ఏదీకాని వేళ ఇంత సావకాశంగా బయిరాయించిన ఈ ధీరుడెవరా అని ఆలోచిస్తున్నాను' అన్నది.

'అలాగేం పాపం. సంతోషించాను, ఇలా దయచేయి' అన్నాను.

'ఇంతకూ తమరెవరో సెలవిచ్చారు గారు. పరాయివాళ్ళు ఎవరో వచ్చి ఇంత గౌరవంగా దయచేయమని ఆహ్వానించినా వెళ్ళే ఆనవాయితీ మా యింటావంటాలేదు. అందుచేత తమరే దయచేయండి' అన్నది.

'సరే అయితే.' అని గబుక్కున నేను లేచేసరికి నాకంటే తొందరగా తను వచ్చి నా కుర్చీలో చతికిలపడ్డది.

'అమ్మదొంగా' అని - మేమేదో పావుగంటో అరగంటో పకపకల

తోటీ, వికవికలతోటీ, కబుర్లతోటీ కాలక్షేపం చేసుకుంటూండగా, హఠాత్తుగా నాభార్య వులిక్కిపడి నన్ను తప్పించుకుని లోపలికి పరుగెత్తింది. నేను తలెవత్తి గడియారం చూసేసరికి మూడుగంటలయింది. వెధవగడియారం ఇలా పరుగెడుతుందేమిటీ, ఎవ్వరికీ లేని తొందర ఈ గడియారానికేమి టనుకున్నాను.

ఒకమాటు అద్దందగ్గర నుంచుని నా క్రాపింగ్ సవరించుకుంటూ ఉండగా మా అత్తగారు నెమ్మదిగా లోపలికి వచ్చి నిలబడ్డారు. ఎప్పుడూ మామూలు లేనిది వీరిలా ఎందుకొచ్చారా అనుకుని అదేమిటి నిలబడ్డా రేమిటి? ఇలా కూర్చోండి అన్నాను.

'ఫరవాలేదు నాయనా, మా అమ్మాయి వినకుడా ఒక్కమాట నీ చెవిని వేసి వెడదామని వచ్చాను' అన్నారు.

'అంత మీ అమ్మాయి వినకూడని మాట ఏమిటో' అని నాలో నేను అనుకున్నట్లు మెల్లగా అన్నాను. అత్తగారికి వినిపించిందో లేదో తెలియదు కాని,

'చూడు నాయనా. అమ్మాయి వ్యక్తురాలయింది. కనుక త్వరగా ఆ తరువాయి తీర్చేసి మీయింటికి తీసుకువెడితే బాగుంటుందని అనుకుం టున్నాను' అన్నారు.

'దాన్నడిగారా,' అన్నాను.

'దాని మొహం దానికేం తెలుస్తుంది. చిన్నతనం కదా' అన్నారు ఆవిడ.

'నా ఉద్దేశంకూడా అదేనండీ చిన్నతనం కదా. ఇంకో రెండు మూడేళ్ళు వూరుకుంటే దాని చదువూ పూర్తవుతుంది. అప్పటికి సరియైన పెద్దతనమూ వస్తుంది' అన్నాను.

'అదేమిటీ, దానికింకా చదువెందుకూ? ఈ చదువు చాలదా. మన వాళ్ళలో ఇంతవరకూ చదివినవాళ్ళు కూడా చాలా తక్కువ. ఇంకా పై చదువులెందుకు నాయనా, ఉద్యోగాలు చేయాలా ఊళ్ళుఏలాలా' అన్నారు. ఆవిడ.

'చదువుకున్నంతమాత్రాన ఉద్యోగాలు చేయాలనీ, వూళ్ళు ఏలాలనీ ఏమున్నది, నన్నేనా ఏలాలికదా! మీ అమ్మాయికి చదువుకోవాలనే కుతూహలం ఉన్నన్నాళ్ళూ చదువుకోనివ్వండి పాపం. మీరన్నట్లు ఇంకో

రెండేళ్ళయినా పోయేదాకా నా కళ్ళకు చిన్నపిల్లాగనే కనిపిస్తుంది. అందుచే తను మరేమీ తొందర పెట్టవద్దని నా అభిప్రాయం. వయసూ, మనసూ ఎదుగుతేనే కాని సంసార బాధ్యతలు పిల్లలనెత్తిన పెట్టడం అంత మంచిది కాదేమో ననుకుంటాను' అన్నాను.

'నిజమే కావచ్చు. ఆడదానికి ఎప్పటికైనా తప్పనిదేకదా, ఇంతకూ అదేమంత బొత్తిగా చిన్నపిల్ల గనకనా. పదిహేనేళ్ళు కూడా వెళ్ళవచ్చినాయి కదా ఇంక ఎన్నాళ్ళు చెప్పు నాయనా, మనమెలాగో సరిపెట్టుకున్నాలోకం ఊరుకోదుకదా' అన్నారు.

'పోనీలెండి లోకం మన్నేమీ ఉద్ధరించదు. మీ అమ్మాయిని వివాహ మాడినది నేనుకాని లోకం కాదుగదా. అందుచేతను మన సౌకర్యం మనం చూసుకోవాలిగాని, లోకమనేవన్నీ మనం పట్టించుకుని కూర్చుంటే, ఒక్క అడుగు ముందుకు వెయ్యలేము, ఒక్కక్షణం బ్రతకనూలేము. అందుచేతను మీ అమ్మాయిని వెంటనే చదువు మానిపించవద్దు. కాపురానికీ పంపవద్దు. అని నా ప్రార్థన, మీ ఉద్దేశమే మా అమ్మగారూ వ్యక్తపరిచారు. కాని ఆమెతోనూ ఇలాగే అన్నాను, చదువుకోనివ్వండి పాపం దానిని' అన్నాను. ఆవిడ ఏమీ అనలేక తల వంచుకుని

'ఏమో నాయనా ఇవన్నీ నాకేం తెలుసు? మీ మామగారు ఏమంటారో, మీ నాన్నగారేమంటారో, మా ఆడవాళ్ళ తొందరలు ఇలాగే ఉంటాయి' అని గదిలోనుంచి నిష్క్రమిస్తుండగా, మా ఆవిడ ఫలహారం పళ్ళెం పట్టుకుని వస్తూ ఒకమాటు తల్లికేసి, ఒకమాటు నాకేసీ ప్రశ్నార్థకంగా చూచి ఒక చిరునవ్వు నవ్వి తలూపి, మూతితిప్పి, 'ఇంక ఫలహారం చెయ్యండి పాపం' అనిపళ్ళెం అక్కడపెట్టి వెనక్కు వెళ్ళబోతున్న దానిని రెక్కపట్టుకుని దగ్గర కూర్చోపెట్టుకుని

'నీతో అత్యవసరంగా చర్చించవలసిన విషయాలు ఫలహారంకంటే మధురాతి మధురములైన కొన్ని ఉన్నాయి. సావధానంగా చిత్తంతో విను' అని నేను పై మాట చెప్పబోతుంటే

'సారీ, నాకిప్పుడు సావధానం లేదండే. మళ్ళీ వస్తాలెండి' అని ఒక్క పరుగున అవతలికి దాటేసింది.

సాయంకాలం మా రాజు దగ్గరకు వెళ్ళి కాస్సేపు కబుర్లు చెప్పుకుని ఊరంతా బలాదూరు తిరిగి బాగా చీకటిపడ్డ తరువాత ఇంటికి చేరుకున్నాను. భోజనానంతరం మా మామగారు దగ్గిర కూర్చోపెట్టుకుని కాస్సేపు

కోర్టుకబుర్లు కులాసాగా చెప్పారు. నాకు తెలియకుండానే గంటసేపు ఈ బాతాఖానీ సాగింది. తరువాత నాకు సెలవిచ్చి మరికొంచెం సేపు వారు కాగితాలు చూసుకుంటూ కూర్చున్నారు. నేను వెళ్ళేసరికి మా ఆవిడ నాకు పక్కాగిక్కా వేసి ఏదో గ్రంథ కాలక్షేపం చేస్తోంది. నేను వెళ్ళి కూర్చున్న తరువాతను ఒక పావుగంటో, అరగంటో ఆమాటా, ఈమాటా చెప్పకుంటుండగా

'మధ్యాహ్నం ఏదో చాలా అత్యవసరమైన విషయం మాట్లాడవలెన న్నారు' అన్నాది.

అదేమిటో. అదేదో అత్యవసరమైనదే కాని, ఈ సమయంలో ప్రస్తావించి చర్చించవలసిన విషయంకాదు. దానివల్ల కొన్ని ఉద్రేకాలూ, తొందరపాట్లూ కలిగే ప్రమాదం ఉందికనుక ఆ చర్చ రేపు మధ్యాహ్నం వరకూ వాయిదా వేయడమైనది. ఇంతటితో కోర్టుకూడా ఎడ్జర్న్ చేయడమైనది.

అయితే సెలవు అని ఆ ముద్దులగుమ్మ నన్ను మురిపిస్తూ ఒక్కసారి నిదానంగా చూసి, గిర్రున వెనక్కి తిరిగింది. నేను నా నిగ్రహం మర్చిపోయి రెండుభుజాలూ పట్టుకుని నావైపు తిప్పుకుని దగ్గరగా, ఎంతో దగ్గరగా లాక్కుని గాఢంగా కౌగలించుకుని, ఒక్కసారి ముద్దుపెట్టుకున్నాను.



ఒక్కసారి నవ్వుకుని ముఖమంతా గులాబీగుచ్ఛంలా చేసుకుని, వుద్రేకాలకీ, ఉత్సాహాలకీ సమయంకాదని సవినయంగా కోర్టువారికి మనవి చేసుకుంటూ మరొక విషయంకూడా కోర్టువారికి విన్నవించుకుంటున్నాను. నేను అబలను విశేషించి బాలను కూడాను. శరీర ధర్మాన్ని అనుసరించి వ్యక్తురాలను అయినా నాకింకా వ్యక్తిత్వం రాలేదు.

నేనింకా మీ ఎదుట కాకపోయినా మిగతా సమయాల్లో కన్యనే అను

కుంటున్నాను. నాకు చదువు మీద మొదటి నుంచీ ఉన్న వ్యామోహం ఇంకా సంసారం మీదకి మళ్ళలేదు. ఇక నా భవిష్యత్తేమిటి? చదువుకి స్వస్తిచెప్పి సంసారం ప్రారంభం చేయడమా, లేక కొంతకాలం ఈ చదువు సాగించడమా అనే మీమాంసలో పడ్డాను. మా అమ్మా, మా బంధుజనం మిత్రబృందం అందరూ చేసేపనే నన్నూ చేయమని తొందరచేస్తున్నారు. నా చదువు నన్నేమీ ఉద్ధరించదనీ, నాకెందుకూ ఉపకరించదనీ జనవాక్యంగా తేలింది.

ఈ సందిగ్ధ సమయంలో కోర్టువారి సలహా ఏమిటో తెలుసుకోవలెననే కుతూహలంగానూ, ఆదుర్దాగాను ఉన్నది. అని తలవంచుకుని కొంచెము నామీదకు ఒరిగి నేలమీద బొటనవ్రేలితో రాస్తూ నిలబడింది.

ఆ అమ్మాయి మాటలు వింటుంటే ఆమెమీద ఆదరమూ అభి మానమూ 'నా భార్యేనా ఈ మాట్లాడుతున్న ముగ్ధ' అనే గర్వం ఉవ్వెత్తున సముద్ర తరంగములా లేచింది.

'సరే కోర్టువారు సావధానంగా నీ మనవి విన్నారు. సావకాశంగా ఆలోచించి తీర్పు రేపు చెప్పడమవుతుంది' అని ఆ ముగ్ధను మళ్ళీ నా కౌగిటిలో అదిమిపట్టి మళ్ళీ ఆమె ముఖపద్మం చుంబించి ఎంతసేపో అలాగే కూర్చుండిపోయాను. మాలో ఏ ఒక్కరమూ ఏమీ మాట్లాడలేదు. ఆ నిశీధిలో ఆ నిశ్శబ్దంలో ఊపిరికూడా విడుస్తున్నామో లేదో తెలియని స్థితిలో కాలగమనం కూడా మరచి అలాఉండగా, కొంతసేపటికి నా కౌగిలి పట్టునుంచి నెమ్మదిగాజారి, మాట్లాడకుండా, వెనుతిరిగి చూడకుండా వెళ్ళిపోయింది సరస్వతి. నే నేకాకినై పెల్లుబికి వస్తున్న భావతరంగము లపై తేలిపోతూ, తెల్లవారే వరకూ నన్ను నేను మరచి, నడుమువాల్చనేనా వాల్చకుండా అలాగే కూర్చుంటే ఇంట్లో ఏదో అలికిడి వినపడి కిటికీలోంచి వస్తున్న వెలుతురుని చూచి తెల్లవారినదనే జ్ఞానం కలిగి మామూలు కాల కృత్యాలకి లేచాను.

# 17

సుమారు వారం పదిరోజుల వరకూ భీమవరంలోనే ఉండిపోయాను. గంట గంటన్నరసేపు ఉదయం, రాత్రి భోజనానంతరం మళ్ళీమరొక గంట, మా మామగారితో కాలక్షేపం జరిగేది. మధ్య వ్యవధిలో ఎక్కువసేపు గ్రంథ కాలక్షేపం చేసేవాడిని. సాయంత్రం రాజుతో గ్రామసంచారం. ఇదీ

కార్యక్రమం. ఈవారం పదిరోజులలో నా ప్రేయసి నాకు దూరంగానే వుంటూ వుండేది. ఇకను 1,2 రోజులలో మళ్లీ యింటికి వెడదామని నిశ్చయం చేసుకున్నాను. ఇంకా ఈ మాట ఎవరిదగ్గరా అనలేదు. ఆమ ధ్యాహ్నం భోజనంఅయి సావకాశంగా కూర్చుండగా సరస్వతి నా దగ్గరకు నెమ్మదిగా వచ్చి, నాకుర్చీ చేతిమీద కూర్చుని, నా మెడమీద చెయ్యి వేసి, నా ముఖం తన వేపుకు తిప్పుకుని, 'నేను వారం రోజుల క్రితం చేసుకున్న మనవి కోర్టువారు సావకాశంగా ఆలోచించి తీర్పు చెబుతామని సెలవిచ్చారు ఇంతవరకూ ఆ ఆలోచన తేలినట్లు కనబడలేదు. తమ వరస చూస్తే ఏమాటా చెప్పకుండానే, రేపో ఎల్లుండో జండా ఎత్తేసేటట్టు న్నారు. అందుకని మీ అభిప్రాయం సెలవిస్తే సంతోషిస్తాను" అన్నది నా నుదుటిమీద పడుతున్న జుట్టుపై కెగదోస్తూ.

నా ప్రయాణం సంగతి అప్పుడే ఈ పిల్ల ఎలా పసికట్టిందా అని ఆశ్చర్యపోతూ, రెండునిమిషాలు ఈమాట ఎలా చెప్పనా అని ఆలోచిస్తూ కూర్చున్నాను. ఆ అమ్మాయి మళ్ళీ నా గడ్డం పట్టుకుని ముఖం పైకెత్తి,

'ఏమండీ ఇంకా మీరే నిర్ణయానికి రాలేదా. దానికింత దీర్ఘాలోచ నెందుకు మీ నిర్ణయం ప్రకారమే నడుచుకుంటాను. ఆవిషయంలో మీకేమీ సందేహం అక్కరలేదు' అన్నది తన చెక్కిలి నా చెక్కిలికి ఆనించి.

'నా మనోభావాలు హృద్గత భావాలూ ఇట్టే చదవగలుగుతున్నావు కదా. ఈ విషయంలో మట్టుకు నా అభిప్రాయమేదో నీవు తెలుసుకోలేక పోయావా నీవు అడగకముందే నేనో నిర్ణయానికి వచ్చాను, ఈ ఊరికి బయలుదేరుతున్నప్పుడు మా అమ్మ ప్రశంసచేసి తన అభిప్రాయం చెప్పింది. వారం రోజులక్రితం మీ అమ్మగారు కూడా అదే అభిప్రాయం వెలిబు చ్చారు. వారుభయులకూ కూడా నా సమాధానం వెంటనే చెప్పాను.'

అదేమిటో చెప్పకో అన్నాను. నెమ్మదిగా నా చేతిని ఆమె నడుం చుట్టూ పోనిచ్చి కొంచెం దగ్గరకు తీసుకుని.

'పోనీలెండి మీ అభిప్రాయాలన్నీ నాకెలా తెలుస్తాయి. ఆమాటే నాచెవిని కూడా వేస్తే మీ ముఖతా విన్నాననే తృప్తి నాకుంటుంది కదా' అన్నది.

'సరే అయితే విను. విదేశాలనుంచి ఇంటికి రాగానే, మా నాన్నగారు నాకు వివాహప్రయత్నం చేశారు అన్వేషణలు సాగించారు. నేనప్పుడు రజ

స్వల కాని పిల్లను వివాహమాడడం నా అభిమతం కాదని స్పష్టంగా చెప్పి వారి ఆగ్రహానికి గురి అయ్యాను కూడాను. కాని నిన్ను చూచిన క్షణంలో నా అభిప్రాయాలూ, ఆశయాలూ అన్నీ మర్చిపోయాను. వాటినే కాదు నన్ను నేనే మరచిపోయాను, నీ కళ్ళలో ఇంద్రజాలమేదో ఉంది. నీ వాక్కులో మంత్రశక్తి ఉన్నట్టుంది. అందుచేతను నేను నీవాడిని అయిపో యాను. ఇప్పుడు మట్టుకు కొంచెం తెలివి తెచ్చుకొని నా పూర్వపుటాశ యాలు జ్ఞప్తికి రాగా, నీ చదువు పూర్తయ్యేవరకూ నీ జోలికి రాకూడదు, దూరంగానే ఉండవలెనని నిశ్చయం చేసుకున్నాను. నిన్ను పూర్తిగా నా దానినిగా చేసుకోవలెననే బలీయమైన వాంఛను ఎంతో నిగ్రహముతో ఆపు కుంటున్నాను. ఈమాటే మా అమ్మతోనూ, మీ అమ్మతోనూ కూడా చెప్పాను. ఈ నిర్ణయానికి మన తండ్రులుకూడా కట్టుబడి వుంటారనే నా నమ్మకం. అందుచేతను నువ్వేమీ భయపడకు. హాయిగా నిశ్చింతగా చదువుకో. చదువుతప్ప తక్కినవన్నీ మర్చిపో. ఈ తక్కినవన్నీ అన్న జాబితాలో నన్ను మట్టుకు చేర్చక అమ్మాయి' అన్నాను ఆమె కళ్ళలోకి చూస్తూ. ఆశ్చర్యం ఆపిల్ల కళ్ళలో కన్నీటి తెరలు కనపడ్డాయి. నా మాటలు వినగానే మొదటిసారిగా నాకు స్వయం గ్రాహమిచ్చింది.

రాత్రి భోజనానంతరం మామూలుగా ఆఫీసుగదిలో కూర్చుని రెండు మూడునిమిషాలు లోకాభిరామాయణం అయిపోయిన తరువాత, మామూ లుగా చెప్పే కోర్టుకబుర్లు చెప్పకుండా, మామగారు చాలా సందేహంతో కూతురికి మల్లేనే ఆయనా ఈ ప్రశంస ఎత్తారు. నాకాశ్చర్యమేసింది. తండ్రికూతుళ్ళు సంప్రదించుకున్నారా ఎవరికి వారు ఈ సంగతేమిటో తేల్చుకోవలె ననుకున్నారా! అనుకుని ఒక్కక్షణం తటపటాయించి, కూతు రుతో చెప్పినంత ధైర్యంగా కాకపోయినా కొంచెం నిశ్చింతగానే అధమం ఇంకొక రెండు సంవత్సరములేనా ఆ అమ్మాయి చదువుకోవడం నా అభి ప్రాయమనీ ఈలోపున నేనెక్కడో ఒకచోట ప్రాక్టీసుపెట్టి నిలదొక్కుకునే అవకాశం కూడా ఏర్పడుతుందనీ, అందుచేత వారు తొందరపడి నన్ను తొందర పెట్టవద్దనీ అన్నాను. ఆయనేమంటారో అని సందేహించానుకాని, వారు సంతోషంతో ఒక నిట్టూర్పు విడిచి,

'నీ నిర్ణయం బాగుందోయ్, మనలో మాట. నా అభిప్రాయం కూడా అదే. మా అమ్మాయి పైకి అనలేక సందేహిస్తున్నా, చదువు కోవలెననే దానికీ ఉన్నదని నాకూ తెలుసు. ఎటొచ్చీ మా ఆడవాళ్ళూ, బంధువర్గం, ఏదో చాదస్తులు కదా. పూర్వకాలపు పద్ధతినే అన్నీ జరగవ

లెనంటారు. సరే కానీ చూద్దాం' అని మరికాస్సేపు మామూలుపద్ధతిని కోర్టుకబుర్లు చెప్పి నాకు సెలవిచ్చారు. నేను వెళ్ళేసరికి మామూలుగా నాభార్య నాకోసం వేచి ఉన్నది. నేను శుభవర్తమానం చెప్పగానే చాలా సంతోషించి, తన సంతోషం కేవలం మాటల్లో చెప్పలేక చేతల్లో చూపించింది.

ఆ మరునాడే వాళ్ళందరూ ఏకగ్రీవంగా వద్దంటున్నా వినిపించుకోక మొగల్తుర్రు ప్రయాణం కట్టాను. ఇంటికి చేరగానే మా అమ్మ నాకేసి ప్రశ్నార్థకంగా చూచింది. ఆమెకు సమాధానమేమీ దొరకలేదనుకుంటాను. ఆ మధ్యాహ్నం ఫలహారం వేళ మానాన్న ఇంట్లోలేకుండా చూచి,

'ఏమిరా నాయనా ఏం జరిగిం'దంది, ఎంతో ఆతృతతో.

జరగడానికేముంది. మామూలుగానే వెళ్ళివచ్చాను అన్నాను.

ఆమె ప్రశ్న నాకర్థం కానట్టు ఆవిడ నవ్వుకుని,

'పోదూ నీ గడుసుతనం నువ్వూనూ, ఏమి ఎరుగవు పాపం. నీ కార్యం సంగతి నేనడుగుతూంట' అన్నది.

'కార్యమేమిటీ! అక్కడ ఏ కార్యమూ జరగలేదు' అన్నాను అమాయకంగా.

'ఒరేయ్ నిన్ను' అని కోపంగా అటూఇటూ చూసింది ఏదేనా దొరుకుతే అది నామీదకు విసురుదామనే వుద్దేశంతో.

'అదికాదమ్మా తెలిసిందిలే ఇప్పుడు నీ అభిప్రాయం. నీవు శ్రమపడి ఏ రాయోరప్పో వెతికి నామీదకి విసరడం నేను ఇల్లూ దొడ్డీ అంతా పరుగెత్తడం అవన్నీ ఎందుకులే, మా అత్తగారు నువ్వన్నట్టుగానే ఏదో ఆలోచన చేసింది. ఆరోజున నీకు చెప్పిన సమాధానమే ఆవిడకి చెప్పాను. ఆవిడా విని ఊరుకుంది. నీకు మల్లే రాయీ రప్పా వెతకలేదు నన్ను కొట్టడానికి. నిజం చెప్పవద్దు మరి. తరువాతను మామగారు కూడా ఈ ప్రశంసచేశారు. కొంత అయిష్టంతో వారితోకూడా ఇంకొక రెండుమూడు సంవత్సరములు వారి అమ్మాయిని స్వేచ్ఛగా చదువుకోనిచ్చి నేను నా ప్రాక్టీసు ప్రారంభించి నిలబడేదాకా అవకాశం యిస్తే బాగుంటుందన్నాను. ఆయన ఇది నిజమేనని ఒప్పుకొని నా తెలివి తేటలకి చాలా సంతోషించారు కూడా' అన్నాను నవ్వుతూ.

"సంతోషించారేం పాపం. అల్లుడికి తగ్గ మామగారూ మామగారికి

తగిన అల్లుడూ దొరికేరు ఎలాగైతేనేం. అయితే నా కోడలు కూడా మీకు వంతపాడిందా" అన్నది.

"లేదమ్మా ఏమాటకామాటే అనుకోవాలి కదూ. అది ఒట్టి వెర్రి మొహం. శుద్ధ అమాయకురాః వట్టి సత్యకాలపు మనిషి, నాలాగే అదేం చెబుతుంది. చెప్పమ్మా నీ వెర్రికాని,ఈ విషయంలో అనగా మనకార్యం సందర్భంలో నీఅభిప్రాయమేమిటని నేను దానిని అడుగుతాననుకున్నావా? మీరేమంటారని అది నన్ను అడుగుతుందనుకున్నావా, ఇంత వెర్రిదానివేమి టమ్మా" అన్నాను.

మా అమ్మ మారు మాటాడకుండా కోపంగా నాకేసి చూసి "ఇంత డబ్బు తగలేసి దేశంకాని దేశాలకు వెళ్లి నేర్చుకొచ్చావు ఎలాగైతేనేం" అని విసవిస వెళ్ళిపోయింది.

నేనొక్కమాటు నవ్వుకుని "అమ్మా మాట. నీ కోడలు నీతోఒక్క మాట చెప్పమంది. తనకింకా కొన్నాళ్ళు చదువుకోవలెనని ఉన్నదికాని, మీరెప్పుడు రమ్మంటే అప్పుడు వస్తానుసుమండీ. అని చెప్పమన్నది నీతో."

'నిజమేనట్రా నాయనా వెర్రిపిల్ల అలా అందాపాపం. నేననుకుం టూనే ఉన్నాను. అది నాలాటిదేనని. ఇదంతా నువ్వూ మీ మామగారూ చేసిన గూడుపురాణీ అన్నమాట. సరే నాకెందుకీ గొడవ. మీ నాన్న ఉండనే ఉన్నారు కదా' అని వెళ్ళిపోయింది విసురుతగ్గించి.

నేను నెమ్మదిగా లేచి అలా పొలంవేపు షికారుకెళ్ళి బాగా చీకటి పడ్డ తరువాతను ఇంటికి వచ్చాను. అప్పుడే మా నాన్న సాయం సంధ్య ముగించుకుని, భోజనానికి ఉపక్రమించబోతున్నారు. నేను వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కుని పట్టుబట్ట కట్టుకుని నెమ్మదిగా ఆయన పంక్తిని వెళ్ళి కూర్చున్నాను. భోజనానంతరం మా నాన్న వాకిట్లో బల్లమీద కూర్చుని

'ఏమిట్రా భీమవరం విశేషాలు, మీ మామగారు కులాసాగా ఉన్నారా? నీ ప్రాక్టీసు సంగతి అది ఏమన్నా చెప్పారా అన్నారు. నేనేమీ ఎరగనట్టు రోజూ,ఉదయం ఒకగంట ఆయనదగ్గర కూర్చుని కోర్టు వ్యవహారాలూ వాట్లపద్ధతులూ, దావాలకొచ్చే మనుష్యులూ, వాళ్ళస్వభావాలూ, ప్లీడర్లూ వాళ్ళతో మాట్లాడే వాళ్ళకు నచ్చచెప్పే నేర్పూ, గడసరి తనం, అన్నీ గమ నిస్తూ కూర్చునే వాడిని. రాత్రి మళ్ళీ భోజనానంతరం ఒక గంట ఆయన ఈ కేసులూ వాటిలో ఉండే చిక్కులూ క్లయింట్లు చేసే మోసాలూ చెప్పే అబద్ధాలు, తీర్పు చెప్పవలసిన అధికారులుపడే ఇక్కట్లూ, మొదలై

వన్నీ ఎంతో వివరంగా సానుభూతితో సరదాగా వివరించి చెప్పేవారు. ఈ పదిరోజుల పారం ప్రస్తుతానికి చాలుననుకుని ఇంటికి వచ్చేశాను అన్నాను.'

"బాగుంది. చాలా బాగుంది. అయితే నిన్ను ఆ వూళ్ళో ప్రాక్టీసు పెట్టమనీ, చేయమనీ, ఏమీ అనలేదన్నమాట. సరే అయితే పిల్లను పంపించడం మాట ఏమన్నా అన్నారా" అన్నారు.

"అన్నారండీ. మామగారూ, అత్తగారూ కూడా ఆ ప్రశంసచేశారు. చేయలేకపోలేదు. కానయితే మా అత్తగారు వెంటనే తీసుకు వెళ్ళమని సూచించారు. మా మామగారు కొంచెం సందేహిస్తూ ఈ ప్రశంస యెత్తి మా పిల్ల ఇంకా కొన్నాళ్ళు చదువుకోవలెనని అనునుంటున్నట్టున్నది. అయినా మీ అభిప్రాయం ఎలా వుంటే అలా చేయవచ్చును." అన్నారు. గడుసుతనంగా వారభిప్రాయం కూడా అదే అయినట్టు వారి మాటలలో ధ్వనించింది. తరువాతను ఆ అమ్మాయి కూడా ఇంకా చదువుకోవలెననే కుతూహలం కూడా వ్యక్తంచేస్తూ మీరెలా చేయమంటే అలా చేస్తానని భారం నామీదనే వేసింది.

"అలాగా! తండ్రి గడుసుదనం అంతా కూతురికి అబ్బిందన్నమాట. అయితే నీవే నిర్ణయానికి వచ్చావు? అన్నారు.

ఆ అమ్మాయి యింకా కొంతకాలం చదువుకోవలెనని అనుకోవలెనని అనుకోవడం సబబుగానే కనిపించింది. ఈ లోపున నేనూ ప్రాక్టసు పెట్టుకోడం, కొంచెం నిలదొక్కుకోవడం, వగైరాలన్నీ చూసుకోవడానికి వీలుగా ఉంటుంది కదా అన్నాను.

"ఆఁహాఁ సరే ఇంక నేచెప్పవలసినదేముంది? నాకోరికనూ, అభిప్రాయాన్నీ గౌరవించి శాస్త్ర సహితంగా వివాహం చేసుకున్నావు. అందుకు నేను సంతోషించాను. తరువాత కార్యం ఎప్పుడన్న సంగతి ఏ శాస్త్రమూ చెప్పినట్టులేదు. నీవాలోచించుకుని ఆ అమ్మాయి అభిప్రాయం తెలుసుకుని ఎప్పుడనుకున్నా సంతోషమే." అన్నారు.

ఆ మాట విని నాకెంతో ఆశ్చర్యమేసింది. ఆయన ఔదార్యం, హృదయ వైశాల్యం ఎదుటి వాళ్ళ యెడల సానుభూతి, వాళ్ళ భావనా గ్రహణశక్తి అన్నీ తలుచుకుని నీరైపోయాను. మనసులోనే అనేక వందన సహస్రములు అర్పించాను. ఆయనింకేమీ అనకుండా లేచి వెళ్ళిపోయారు. నేనూ నా గదికి వెళ్ళాను.

ఇదంతా ఆలోచించుకుంటూ ఎంతసేపు కూర్చున్నానో నాకే తెలీదు.

అసలు నిద్రపోయానో లేదో, ఎప్పుడు పోయానో కూడా తెలియదు. ఉదయాన్నే మట్టుకు నిశ్చింతగా నిర్వికారంగా ఎంతో తేలికగా లేచాను.

ఇలా రెండు మూడు మాసములు ఏమీ తోచకుండా ఏమీ చెయ్యకుండా గడిచింది. ఈ పద్ధతి బాగుంది కాదు. ఒక్కసారి మదరాసు వెళ్ళి అక్కడ హైకోర్టు పద్ధులన్నీ ఒక్కసారి చూసి వస్తే కోర్టు ప్రొసీజరు క్షుణ్ణంగా అవగాహన అవుతుందనే భావంతో మా నాన్నగారితో ఈప్రస్తావన చేశాను. ఆయనకూడా వెళ్ళిరా అన్నారు. అనడమే కాకుండా.

"నీ వృత్తికి ఇది అవసరమనుకుంటే తప్పకుండా వెళ్ళు" అని మరి రెండురోజులలో ఆయనే ముహూర్తం పెట్టాడు కూడాను ఆ సాయంకాలమే నేనేమీ అడగకుండానే ఖర్చుకేది సరిపోతుందా నాయనా అని ఒక వందరూపాయలు ఇచ్చారు.

"సరిపోతుంది. కావలిస్తే మళ్ళీ అడుగుతాను లెండి" అని ఆయన పెట్టిన ముహూర్తానికి బయలుదేరి ముందు భీమవరం వెళ్ళాను. అక్కడ మా మామగారితోనూ నా భార్యతోనూ కూడా ఈ సంగతి చెప్పి వెంటనే రాజు దగ్గరకు కూడా వెళ్ళి నాకు తోడుగా ఉండడానికి అతనిచేత కూడా ప్రయాణం కట్టించాను. ఇంటికి వచ్చి నా భార్యను పిలిచి నీ చదువు సంగతి ఏమైందని అన్నాను.

చుట్టుపట్ల ఎక్కడా అందుబాటులో కాలేజీలు లేవుకదా. నన్ను ఒంటరిగా ఏ రాజమహేంద్రవరమో, కాకినాడో పంపడానికి వీలుకుదరక మా వాళ్ళు ఇక్కడే నాకు ముగ్గురు ప్రైవేటు మాష్టర్లను ఏర్పాటు చేశారు, చదువు బాగానే సాగుతోంది. నాకూ ఎంతో ఉత్సాహంగా ఉంది అన్నది.

ఆ మాటలు విని నేనూ సంతోషంతో ఆ మరునాడే రాజును కూడా తీసుకుని బెజవాడకు ప్రయాణమయ్యాను.

అక్కడ రామచంద్రరావు అని నా స్నేహితుడు చాలా కులాసా అయినవాడూ ఏ పనీపాటా లేనివాడూ ఒకతను వున్నాడు. అతనిని కూడా తీసుకువెళితే ప్రయాణం సౌకర్యంగానూ కాలక్షేపంగానూ, ఉత్సాహంగానూ ఉంటుందని నా ఉద్దేశం. మేమెలాగో తంటాలుపడి విజయవాడ సుమారు రెండు జాములవేళకు చేరుకున్నాము. మేము వెళ్ళేసరికి రామచంద్రరావు చాలా బుద్ధిమంతుడుగానూ యోగ్యుడుగానూ ఉన్నట్లు కనపడ్డాడు. ఇంట్లో ఏవో మంత్రములు వినబడుతున్నాయి. మేము తలుపు తోసుకుని లోపలకు వెళ్ళగానే మంత్రములు చెప్పే బ్రాహ్మణుల మధ్య కూర్చు

న్నాడు. అనగా రామచంద్రరావు. మమ్మల్ని చూచి సంతోషం పట్టలేక తను మడికట్టుకున్న సంగతిగూడా మరచి.

'ఉండండి. ఉండండి అలా వెళ్ళకండి' అని మంత్రం చెబుతున్న బ్రాహ్మణులూ, తన భార్యా ఎంతగా హెచ్చరించినా వినిపించుకోక ఒక్క పరుగున వచ్చి నన్ను కౌగలించుకుని.

'ఏరోయ్ పార్వతీశం. ఎక్కడనుంచి ఇలా ఊడిపడ్డావ్! ఇదేమిటి రాజుగాడినిగూడా తీసుకొచ్చావే. మీరు వస్తున్నారన్న సంగతి తెలిస్తే మిమ్మల్నే దర్జాగా భోక్తలుగా కూర్చోబెట్టేవాడిని' అన్నాడు.

'భోక్తలు ఏమిటి' అన్నాడు రాజు. నాకు నవ్వాగలేదు.

ఈవేళ మా దత్త తండ్రిగారి తద్దినం. ఆయన ఇటువంటి వెర్రివెర్రి వైదిక పట్టింపులు కలవాడుకాదు.అందుచేతను భోక్తగా ఎవడు కూర్చున్నా ఆయన బాధపడేవాడుకాదు అన్నాడు.

ఇంతలో మంత్రం చెబుతున్న బ్రాహ్మణుడు పరుగెత్తుకొచ్చి

బాబూ తమరు వెంటనే రెండుచెంబులు నీళ్ళుపోసుకుని మళ్ళీమడి కట్టుకుని రావాలి. ఇంక అట్టే ఆలస్యములేదు అన్నాడు. బ్రతిమలాడు తున్నట్టు.

'అదేమిటి మళ్ళీ స్నానమేమిటి, మడేమిటి, మా పార్వతీశం పవిత్ర మైన బ్రాహ్మణుడు. అందులోనూ మరీవట్టి వైదికపీనుగ వాడు నిత్యశు ద్ధుడు. వాడినిముట్టుకుంటే ఆడా మగా అందరూ పవిత్రమవుతారుకాని, అపవిత్రులుకారు, అలా విదేశాల్లో ఎంతోమంది, ఆంగ్లయువతులను పవిత్రం చేశాడు. నామాట అబద్ధమయితే వాడినే అడగండి. లేకపోతే ముంగిలా నిలబడ్డ ఆ రాజుగాడిని అడిగినాసరే. వీడికంటే పవిత్రుడువాడు' అన్నాడు.

ఆ బ్రాహ్మణుడు ఏంచేయడానికి తోచక నవ్వుతే కూడా ఆపంతులు అనగా మా చంద్రుడికి కోపం వస్తుందేమోనని హడలిపోతూ నిలబడ్డాడు.

"ఏడిశావులే మంచి గుడ్‌బాయ్‌లాగ త్వరగా స్నానం తగలడు. మాక డుపులో కాలుకొస్తోంది." అని చంద్రుణ్ణి లోపలకు పంపించాను. వాడు నిజంగా స్నానం చేశాడో లేదోకాని లోపలికి వెళ్ళి అరనిమిషములో బట్టలు మార్చుకుని వచ్చాడు.

ఇంటి నౌకరు ఆ సామాను ఒక గదిలో పెట్టి మమ్మల్ని స్నానానికి దయచేమన్నాడు. మా స్నానం ముగించుకునేటప్పటికి మా చంద్రుడు

మంత్రం చెప్పే బ్రాహ్మణుడితో ఏదో పేచీ పడుతున్నాడు.

'ఏమండోయ్, మాకు తొందరలేమీ లేదు. కాని,మీరేదో నిశ్చయం చేసుకుని ఒక్కమాటమీద నిలబడాలి. అంతేగాని దర్బ ఇటుచూపించి అటు పడేయమని చేతులిటుతిప్పి ముఖం వెనక్కి పెట్టి నమస్కారం చేయమని చెబుతే చేసేవాడిని కాదు. నాదగ్గర ఇన్ని మాటలు పనికిరావు. తరువాత మీ యిష్టం' అన్నాడు.

'అదికాదు బాబూ అని బ్రాహ్మణుడేదో అనబోతుంటే పోనీ మీయిష్టం వచ్చినట్టు మంత్రా లేకరవు పెట్టండి. ఆ చేయవలసిన అవకతవకలేవో మీరే చెయ్యండిగాని, ఒకటిచెప్పి ఒకటి చెయ్యమంటే చేసేవాడిని కాను. అసలీమాటునుంచి ఈ మంత్రాలూ, ఈ గొడవలూ లేకుండా మీరు వచ్చి సుఖంగా భోజనంచేసి, సంభావన పుచ్చుకుని వెడుతూ ఉండండి. ఈ మంత్రాల గొడవ మానినందుకు పరిహారంగా కావలిస్తే ఇంకో రెండురూపాయలు సంభావన ఎక్కువ తీసుకోండి. అదీ కాదన్నారూ, నెలకొకసారి వచ్చి భోజనం చేసి వెళ్ళండి' అన్నాడు.

మేము ఇక్కడ విరగబడి నవ్వుతూ కూర్చున్నాం. తరువాయి తంతు అంతా అనగా భోక్తల భోజనం. పిండ ప్రదానం వగైరా ఎలాగో పదినిమిషాల్లో ముగించి వాళ్ళను పంపించి ఇంట్లో వాళ్ళను తొందరగా వడ్డించమని కంగారుపెట్టి అసలు భోక్తలు దయచేయండి అన్నాడు మమ్మల్ని.

ఇలా ఆరోజూ, మర్నాడూ అక్కడ కులాసాగా కాలక్షేపంచేసి ఆ మరునాడు నేను రానుమొర్రో అని ఎంత ఏడ్చినా విడిచి పెట్టకుండా చంద్రుణ్ణి కూడా తీసుకుని మదరాసు ప్రయాణం కట్టాను.

మద్రాసు చేరుకుని జార్జిటౌనుకు వెళ్ళి అక్కడొక హోటల్లో మేము ముగ్గురం కలిసి ఒక గది తీసుకున్నాము. మూడు నాలుగు సంవత్సరముల క్రితము ఇంగ్లండు ప్రయాణం హడావుడిలో మదరాసులో రెండుపూటలు ఆగడమేకాని మళ్ళీ మదరాసు ఎప్పుడూ చూచి ఎరుగను. అప్పుడే మదరాసు మీద చాలా అసహ్యం కలిగింది. పాపం మదరాసు ఇప్పటికీ అలాగేఉంది ఎటొచ్చీ ఒక పదివేలో, పాతికవేలో జనభా పెరిగి ఉండవచ్చు. కొంచెం వ్యాపారం ఎక్కువై ఉండవచ్చు, వీధులంటతిరిగే అలగాజనమూ ఎక్కువ కావచ్చు. దానివల్ల మరింత గందరగోళం, రొద, వీధులలో గలీజూ, కేకలూ, గొడవలూ ఎక్కువయాయన్న మాటేకాని, అంతకంటే విశేషమైన మార్పు అట్టేకనపడలేదు. ఇంకను మేము బస

చేసిన హోటల్ సంగతి చెప్పనే అక్కరలేదు. నేను స్వదేశానికి తిరిగి వచ్చిన రోజున బొంబాయిలో చూసిన హోటలు ఎంతో అర్ధనగ్నంగా ఉన్న దని బాధపడితే ఇప్పుడు హోటలు అంతకంటే పదిరెట్లు దరిద్రంగా ఉంది. మురికి వాసన, మశక మత్కుణాదులబాధ వగైరాలతో ఎంతో బాధాక రంగా ఉన్నా ఇంతకంటె మంచి హోటలు మరొకటి లేదని చాలామంది చెప్పగా విని ఎంతో బాగుంటుందని ఇక్కడికి చేరుకున్నాము. చేరుకున్న తరువాతను ఏదైనా అనుభవించక తప్పదుకదా అని నోరు మూసుకుని మనసుకు సరిపెట్టుకున్నాము. నాలుగు రోజులు మరొక ఆలోచన ఏమీ లేకుండా అక్కడున్న వింతలూ, వేడుకలూ చూస్తూ ఊరంతా ఎలా దూర్‌గా తిరిగాను. ఇక్కడా కొన్ని దర్శనీయ ప్రదేశములు లేకపోలేదు. ఉదయాన్ని బయలుదేరి అవసరమొచ్చినప్పుడల్లా ఎక్కడ హోటలు కనపడితే అక్కడ కాస్త ధారకం పుచ్చుకుంటూ కాళ్ళు పడిపోయేటట్లు సాయంకాలం వరకూ తిరిగి అప్పటికి సముద్ర తీరానికి చేరుకునేవాళ్ళం. అక్కడ సైకతం మీద కూర్చుంటే చల్లని నీటిమీదిగాలి తగులుతుంటే, సముద్ర గానం వింటూంటే ప్రాణానికి ఎంతో హాయిగావుండి పగలంతా పడ్డపాటు మరచిపోయే వాళ్ళం. మాకుమల్లేనే వచ్చిన వేలాది జనం స్త్రీ పురుషాదులను చూస్తుంటే, తీరాన్ని అనుకుని వున్న రోడ్డుమీద మైలుమైలున్నర పొడుగున వరుసలో నిలబడిన రకరకాల గుర్రంబళ్ళు. ఎంతో రాజఠీవిలో నిలబడ్డ రక రకాల గుర్రాలు, అందులో ముఖ్యంగా పెగూ, పోనీలు అనబడే పొట్టిరకం గుర్రాలు ఎతో అందంగా ఉండే ఈ దృశ్యాన్ని అంతనూ మాటా మంచీ లేకుండా వాక్‌స్తంభమైనట్లు చూస్తూ మౌనంగా కొన్ని గంటలు అలాకూ ర్చునేవాళ్ళం. అలాకొంతసేపటికి రోడ్డుమీద బళ్ళూ, క్రిందకూర్చున్నజనం గృహోన్ముఖులు కావడం మాకు తెలిసేదికాదు. మరికొంత సేపటికి మేము ఒకళ్ళమే మిగిలినట్లూ ఇంకా మీరు కదలరేమి అని సముద్రం రొదచే స్తున్నట్లూ భావనకలిగి తెలివి తెచ్చుకుని నెమ్మదిగా బసకు చేరుకునే వాళ్ళం.

ఇలా నాలుగైదు రోజులయిన తరువాతను ఒకనాడు హైకోర్టుఅంతా తిరిగి అక్కడ వకీళ్ల వేషభాషలు చూస్తూ, కోర్టుకువచ్చే రకరకాలతగ వులమారులను చూస్తూ, కోర్టులో జరిగే న్యాయ విచారణా పద్ధతులను శ్రద్ధగా చూస్తూ, రెండు రోజులు గడిపాను. ఆ తరువాతను మదరాసులో వున్న ప్రాంతీయులైన పెద్దలూ, పేరు ప్రఖ్యాతులు సంపాదించిన శ్రీ పేరి నారాయణమూర్తిగారనే వకీలు వద్దకు నేను ఒంటరిగా వెళ్లి నన్ను నేను పరిచయం చేసుకుని, ఇక్కడ హైకోర్టులో వ్యవహార పద్ధతులూ తెలుసు

కుందామని నేను ఎక్కడ ప్రాక్టీసు పెడితే బాగుంటుందో తమ సలహా తీసుకుందామనీ ధైర్యంచేసి తమవద్దకు వచ్చాననీ, సవినయంగా మనవి చేశాను. ఆయన చాలా సంతోషించి ఆపూట అక్కడ భోజనం చేస్తేనే గాని వల్లకాదని బలవంతపెట్టి, నాతో సావకాశంగా ఎంతో అప్యాయతతో, ఆత్మీయతతో రెండు మూడు గంటలసేపు ఎన్నెన్నో విషయాలుమాట్లాడేరు. ఆవూళ్ళో ఉన్నన్నాళ్ళూ వచ్చి తన యింటనే ఉండమని యెంతో బలవంతం పెట్టారు కూడాను. నేను ఇంకో ఇద్దరు స్నేహితులతో కూడా వచ్చాననీ, ఈసారి వచ్చినప్పుడు తప్పక అక్కడికే వస్తాననీ నా ఆత్మ బంధువులు ఎవరితోనో చెప్పినట్లుగా చెప్పి వచ్చేశాను. మన పెద్దలలో తరచు కనబడే ఆర్ద్రతా, అభిమానమూ, పరశ్రేయోభిలాషా మరెక్కడేనా ఉంటుందా అనుకుని, ఎంతో ఉత్సాహంతో, మా మిత్రులతో జరిగినదంతా చెప్పాను. వాళ్ళు చాలా సంతోషించారు.

తరువాత రెండు రోజులు ఊరమ్మట బలాదూరు తిరిగి, అక్కడ టంగుటూరు ప్రకాశంగారు అనే తెలుగు బారిష్టరు బాగా ప్రసిద్ధిలోకి వస్తున్నవారు ఉన్నారని విని వారి దర్శనం కూడా చేసుకుందామని మరునాడు ఉదయాన్నే వెళ్ళాను. అంతక్రితం చూసిన శ్రీ నారాయణమూర్తి గారికి వీరికి ఎంతో తేడా కనిపించింది. నారాయణమూర్తిగారు వయోవృద్ధులు. వీరు నలభై ఏళ్ళలోపు వారనిపించింది. నారాయణగారి ముఖంలో సౌమ్యతా, అప్యాయతా చిందులాడుతూ వుండేది. ప్రకాశంగారిని చూడ్డంతోనే ఎలాటి వాళ్ళకేనా కొంచెం బెదురుగా ఉండేది. వారి ముఖం ఎంతో గంభీరంగా భయభ్రాంతంగా ఉండేది. వారినిచూస్తే పులిలా ఉంటారని ఒకరిద్దరు చెప్పకోగా విన్నాను. వారి ముఖంలాగానే వారి వాక్కు కూడా చాలా గంభీరమైనది. వారు మాట్లాడుతుంటే నాదం ఎక్కడ నుంచో వచ్చినట్టు ఉండేది.

నేను వెళ్ళేసరికి కాగితాలేవో చూసుకుంటున్నారు. ఇంకా క్లయింట్సు ఎవ్వరూ రాలేదు. నేను బల్ల దగ్గరకు వెళ్ళి నిలబడగానే వారు నన్ను ఒక్కసారి ఎగాదిగా చూచి, నేను "నమస్కారమండీ" అని అంటుండగానే ఉరిమినట్లు,

"ఆఁ నువ్వెవరవోయ్. పొద్దున్నే ఎక్కడ నుంచి దిగావు. ఇంత చిన్నతనంలో ఏ క్రిమినల్ కేసులో ఇరుక్కున్నావు. చూస్తే అటువంటి రకంలా కనబడదే" అన్నారు.

నేనేం చెప్పనా అని ఆలోచిస్తుంటే.

"కూర్చో తరువాత బోనులో ఎలాగూ నిలబడాలి. అందాకా కూర్చో" అన్నారు.

నాకు వస్తున్న నవ్వు ఆపుకుని నెమ్మదిగా కూర్చుంటూ.

'నేను బోనులో నిలబడ్డానికి రాలేదండి. ఆ అవసరం ఎప్పటికి కలదనే అనుకుంటాను. అధమం అంత త్వరలో కలగదని ధైర్యంగా చెప్పగలను. నేనూ పై వృత్తిలో ప్రవేశించి జీవితం గడపాలనుకుంటున్నాను.' అని నేను పై వాక్యము అందుకోబోతుంటే. తుపాకీ పేల్చినట్లు.

"ఆఁ" అని కుర్చీలో వెనక్కు జార్లపడి ఒక పెద్దనవ్వు నవ్వి.

"ఏమి! నువ్వు వకీలు కాబోతున్నావా? ఇక్కడనే చదివినావా? బి.యల్. ఫస్టుగ్రేడా, లా ఎందుకు చదివావు అప్పా" అన్నారు.

"రెండూ కాదండి. నేను బార్ - యట్ - లా పాసయ్యానండి, మన తెలుగు వారిలో ఈ డిగ్రీ తీసుకున్నవారు తమరే ప్రథములు అందులోనూ అగ్రగణ్యులూ అని విని తమ దర్శనానికి వచ్చానండి" అన్నాను. మళ్ళీ ఆయన నా సమాధానానికి ఆశ్చర్యం వెలిబుచ్చుతూ.

"అరి పిడుగా అసాధ్యుడవేనే. నువ్వూ బారిష్టరువా? నాతో పోటీకి రావాలనుకుంటున్నావా! సరే కాని చూస్తాం" అని మళ్ళీ కుర్చీ వెనక్కు జార్లపడి చేతిలో కలం టేబుల్ మీదపెట్టి "ఊఁ ఇప్పుడు చెప్పు నువ్వు ఎక్కడ నుండి వచ్చినావు. ఎక్కడ బల్లకట్టావు. ఎన్నాళ్ళయింది ప్రాక్టీసు ప్రారంభించి అని " ఇంకా ఏదో వారు అనబోతుంటే నేనుచటుక్కున.'

"నేనెంతవాడినండి తమతో పోటీకి రావడానికి ఎవరు వచ్చినా పర్వతాన్ని ఢీ కొన్నట్టుగానే ఉంటుంది" అన్నాను ఆయన మళ్ళీ కొంచెం మందహాసం చేసి.

"ఓ ఫరవాలేదు. గట్టివాడవేనే. పిట్టకొంచమైనా కూత ఘనంగానే ఉంది. అయితే ఇక్కడనే పెట్టావా ప్రాక్టీసు" అన్నారు.

"లేదండి ఇంకా ఎక్కడా పెట్టలేదు. ఏ నిర్ణయానికీ రానూలేదు. మాది మొగల్తుర్రు అండి. అందుచేతను మాకు దగ్గరలో నర్సాపురంలోనో, భీమవరంలోనో పెట్టవలెననుకుంటున్నాను. ఇంకా ఏ నిర్ణయమూ చేసుకోలేదు". ఆయన పెదవి చప్పరించి

"పోనిద్దూ అక్కడేమిటి అక్కడ ఎన్నాళ్ళున్నా ఎంతకష్టపడినా నీకు ఎదుగు బొదుగులుండవు. డబ్బు రావచ్చుకాని నీ ప్రతిభా, ప్రజ్ఞాపాటవ

ములు పైకి వచ్చి రాణించే అవకాశం తక్కువగా ఉంటుంది. ఇక్కడ హైకోర్టులోనే ప్రాక్టీసు చేస్తే పెద్దల పరిచయమూ కావలసినంత అనుభవమూను. కింద కోర్టుల నుంచి ఇక్కడకు వచ్చే అప్పీళ్ళు చేపట్టినప్పుడు నీ తెలివి తేటలు ప్రదర్శించటానికి నీబుద్ధి నైశిత్యం చూపించటానికి వీలుగా ఉంటుంది. నీ వీలూ సాలూ ఆలోచించుకుని నిర్ణయం చేసుకోవచ్చు. ఇక్కడికే రాదలచుకుంటే కావలెనంటే నా దగ్గర అప్రెంటిస్‌గా కూడా చేరవచ్చును. తరువాత నీ యిష్టం బాగా ఆలోచించి, నిర్ణయించుకో" అన్నారు.

ఇంకో పది నిమిషాలు ఆ మాటా ఈ మాటా చెప్పి నాకు సెలవిప్పించారు.

నేను ఎంతో సంతోషంతో నా బసకు చేరి నా మిత్రులను కలుసుకుని జరిగినదంతా వాళ్ళతో చెప్పాను. వాళ్ళూ చాలా సంతోషించి ఏమైనా సరే "నువ్విక్కడనే ఆరంభించాలిరా ప్రాక్టీసు. ప్రకాశంగారి లాంటి వారు నిన్ను అప్రెంటిసుగా తీసుకుంటామని వారినోటంట వారు అన్నారంటే నీకంత కన్నా కావలసినదేముంది. ఇంకో ఆలోచన పెట్టుకోకు. మద్రాసు నివాసం నీకు తప్పదు. త్రీ ఛీయర్సు అవసరమైనప్పుడు నీకు నైతిక బలం చేకూర్చుడానికి మధ్య మధ్యను మేము వస్తూంటాములే నీకేం భయంలేదు." అని ఏకగ్రీవంగా నా మిత్రులిద్దరూ అభయమిచ్చారు. యింక వచ్చిన పని అయింది కనుక మూటా ముల్లే సర్దుకుని రాత్రి మెయిలుకి తిరుగు ప్రయాణానికి నిశ్చయం చేసుకున్నాను.

# 18

నేను మదరాసునుంచి వచ్చిన తరువాత కాలగమనం మళ్ళీ మందగించింది. ఏమీ తోచేది కాదు. ఏమీ కాలక్షేపం అయ్యేదికాదు. ఊళ్ళో ఎవరితోనయినా కొంచెంసేపు మాట్లాడుదామూ అంటే "లండను కబుర్లు ఏమన్నా చెప్పండి" అని ఏవో వెర్రిమొర్రి ప్రశ్నలు "అక్కడ పెళ్ళిళ్ళు అవుతాయా అండీ" అనీ, "పిల్లలూ వాళ్ళూ మామూలుగాపుడతారా" అనీ "వాళ్ళకి పుట్టగానే ఇంగ్లీషు ఎలా వస్తుంద"ని తమరక్కడ ఎవ్వరినీ పెళ్ళి చేసుకోకుండా వచ్చేశారేమనీ, ఇలా ఏవేవో చవట ప్రశ్నలు వేసి నన్నెలాగేనా బోల్తా కొట్టించి నా చేతను ఏవేవో రహస్యాలు పలికించాలని ప్రయత్నం చేసేవాళ్ళు నేనేదో కొన్ని రహస్యాలు నలుగురిలోనూ చెప్పకూ

డనివి దాచుకుని ఉంటాననీ, అవి ఎలాగైనా నాచేతను తమరు తెలివిగా ప్రశ్నలు వేసి పైకి కక్కించాలనీ వాళ్ళ ఉద్దేశం. అందుకెన్ని రకాలుగానో ప్రశ్నలు వేస్తూండేవారు వాళ్ళ ధోరణీ, వాళ్ళు ప్రశ్నలడిగే తీరూ వాళ్ళ ఒడుపూ, నేర్పూ అన్నీ చూస్తే వీళ్ళందరు కూడా ఏ చదువుసంధ్యలూ తెలివితేటలూ లేకపోయినా తమ పనో, ఇతరుల పనో, భుజాన వేసుకుని మున్నూటఅరవై అయిదు రోజులూ ప్లీడర్ల ఇళ్ళచుట్టూ తిరగడం బాగా అలవాటనీ, ఈ వాక్చాతుర్యమూ, తమరు కోరిన సమాధానం కోసం అను వయిన ప్రశ్నలు వేయడమూ బాగా నేర్చుకున్నారనే, ఎవరైనా వెళ్ళడంకావి ఎవరితోటే అనవసరంగా బాతాఖానీ వేయడంకాని మానుకున్నాను.

మదరాసునుంచి వచ్చేటప్పుడు చాలా రకాలు పుస్తకాలూ, కొన్ని కొత్తవీ, కొన్ని పాతవీ కొనుక్కొచ్చాను. అందులో అమూల్యమైన గ్రంథం సావర్కార్ వ్రాసిన (భారత స్వాతంత్ర్య సమరం) Indian war of Indipendence అనేపుస్తకం కొంతశిథిలమైనా ఎలాగో దొరికింది. ఆ పుస్తకమూ అనిబిసెంట్ అమ్మగారి హోమ్‌రూల్ ఉద్యమాన్ని గురించి వ్రాసిన పుస్తకాలూ, అలాగే గోఖలే, మాలవీయా, లజపతిరాయ్, నౌరోజీ మొదలైన భారతీయుల పుస్తకాలూ కొన్ని సంపాదించాను. ఇంకా రకారకాల సాహిత్య గ్రంధాలూ, సాంస్కృతిక సంబంధమైన పుస్తకాలు కూడా ఎన్నో కొనుక్కొచ్చాను. ఇవన్నీ ముందువేసుకుని రాత్రింబళ్ళు M.A పరీక్షకు చదివినంత దీక్షతో చదవడం ప్రారంభించాను. చదివినకొద్దీ ఎంతో ఉత్సాహజనకంగానూ, విజ్ఞానదాయకంగానూ, ఇంకా ఇంకా చదు వవలెననే ఆసక్తి కలిగించేటట్టుగానూ ఉన్నాయి. ఇలాకొన్ని మాసములు గడిచింది. తాత్కాలికోపయోగములేని గ్రంథములు ఎన్ని ఎంతకాలం చద వగలను? అందుచేతను మళ్ళీ ఏమిచెయ్యడమూ, ఎక్కడ ఉండడమూ అనే తర్జనభర్జనలు నాలో బయలుదేరినాయి. ఈ లోపున నాకు తెలియ కుండా నాభార్యను పదిరోజులపాటు ఇక్కడ ఉండేపద్ధతిని పంపించమని మా అమ్మ మానాన్న చేతను ఉత్తరం వ్రాయించిందట. అందుచేతను ఒకరోజు తెల్లవారేసరికి ఈవిడ ప్రత్యక్షమైంది హఠాత్తుగా. నేను తెల్లబోయి సూర్యోదయం అవుతున్న సమయంలో చంద్రోదయం ఎలా అయిందా అను కుని నిశ్చేష్టుడనయి చంద్రబింబంకేసి చూస్తూ నిలబడిపోయాను. ఇంతలో ఇంకా మెలకువరాలేదా అని మందరస్థాయిలో మధురవాక్కు చెవినిపడ్డది. అప్పటికి పూర్తిగా మెలకువా, చైతన్యమూ వచ్చినవి కలిగిన చైతన్యం ప్రదర్శిద్దామనుకుంటుంటే, నా వూహ గ్రహించి ఆ అమ్మాయి తుర్రు మని మా అమ్మదగ్గరకు పరుగెత్తింది. నాకు పొంగివచ్చిన ఉత్సాహము

సగం చల్లారింది.

కొన్నాళ్ళు మళ్లీ కాలం వేగం పుంజుకుని పరుగెత్తసాగింది. పదిహేను రోజులు పదిహేను నిమిషాలులాగ గడిచిపోయాయి. మాామాటలు, చేష్టలు ఒకక్రమంలో వ్రాసిపెడితే ఎలా ఉంటుందో అని భావన చాలా సార్లు కలిగి, ఆ ప్రయత్నంకోసం కాగితం కలం పుచ్చుకునేటప్పటికి ఏదో వికసితవందనం విడీవిడని, గులాబి మొగ్గలు. అందని లోతులు. కనపర్చే ఇందీవరాలు. చిలుక పలుకులు. కోకిలగానం వగైరా ఏవేవో కనపడ్డమూ వినపడ్డమే కాని విస్పష్టంగా చెప్పడానికీ, వ్రాయడానికీ, ఏఒక్కమాటా జ్ఞప్తికి వచ్చేదికాదు. అందుచేతను ప్రాణంవిసిగి, ఆ కాగితమూ కలమూ అక్కడ పడవేసి, నా వాస్తవిక స్వప్నంలోకిదిగి జారిపోయేవాడిని. పదిహేను రోజులు కాగానే ఆ కలలు, ఆశలు రేకెత్తించిన మనిషీ ఇట్టే మాయమయింది. ఒక రోజు సూర్యోదయానికి అంధకారమే మిగిలింది.

మరో పదిహేనురోజులు ఏమీ తోచక, కాలవగట్లనూ, చెరువుగట్లనూ చేల గట్లనూ సంచారం చేస్తూ కాలక్షేపం చేసుకున్నాను. అప్పటికి మనస్సు కుదుటపరచుకుని మా మాతాపితలకు అంతయిష్టము లేకపోయినా మదరాసుకు ప్రయాణంకట్టి, అక్కడ మైలాపూరులో ఒక యింట్లో వసతి ఏర్పాటుచేసుకుని మంచి రోజు చూసి నా ప్లీడరీవృత్తి ప్రారంభించవలెనని సంకల్పంతో బల్లకట్టాను.

బల్ల అంటే చులాగ్గా కట్టానుగాని తక్కినవన్నీ అంత తేలికగానూ, త్వరగానూ ఎలా జరుగుతాయి? మదరాసులో ప్రవేశించగానే పేరినారాయణమూర్తిగారి దర్శనంచేసుకుని, కొంతకాలం మదరాసులో ఉండనిశ్చయించుకున్నానని, అది స్థిరమైనా కాకపోయినా కొంతకాలం వారి ఆఫీసులోనే జూనియర్‌గా చేర్చుకోవలసిందిగా అర్థించాను.

"చాలా సంతోషం బాబూ. మీరెప్పుడో తప్పకవస్తారనే అనుకుంటున్నాను. మీరు వచ్చారు. చాలా సంతోషం. మీరేమీ ప్రస్తుతం ఎక్కువ శ్రమపడనక్కరలేదు. రోజూ ఉదయాన్నే వచ్చి, తొమ్మిది గంటలవరకు యిక్కడ కూర్చుంటూ ఉండండి. వచ్చిన ప్రతి కేసూ మీరుకూడా శ్రద్ధగా గమనిస్తూ ఉండండి. ప్రతికేసూ పూర్తిగా అవగాహన చేసుకోవడానికి ప్రయత్నించండి. ఆ కేసుకు అవసరమైన విషయములూ యిటువంటి కేసులలో పూర్వపు తీర్పులు ఎలా ఉన్నవో ఆ తీర్పులు ఏపుస్తకాల్లో దొరుకుతాయో చూడటం తెలుసుకోండి. దానిపైన ఈ కేసుమీద మీ కెటువంటి వ్యూహాలు అభిప్రాయాలు కలిగాయో మీరు ఒక కాగితం మీద వ్రాసి సాయం కాలంగాని,

రాత్రిగాని నాకొకసారి చూపించండి ఆ కేసు విచారణ అయ్యేరోజున శ్రద్ధగా ఉభయ పార్టీల వాదనలు వినండి. ఈ పద్ధతిని అయిదారు మాసములు మీరు ఓపిగ్గా జాగ్రత్తగా అనుసరిస్తే, యిక్కడి ప ద్ధతులుచాలా వరకు మీకు అవగాహనఅవుతాయి. మధ్యమధ్యను మీకుత్సాహంగా ఉంటే కోర్టు లోకూడా నాదగ్గర కూర్చుని నాకు కావలసిన రెఫరెన్సులుకాని పాయింట్లు కాని అందిస్తూ ఉందురుగాని, ఏమంటారు? ఈ పద్ధతి మీకేమయినా నచ్చిందా? ఇది మామూలుగా జరిగే పద్ధతికాదు. మీ విషయంలో మీకు త్వరగా స్వతంత్రవ్యూహలూ, ఆలోచనలూ పెంపొందింపచేయడానికి ఈ ఏర్పాటు చేస్తున్నాను. లేకపోతే మీకువేరే అభిప్రాయాలేమైనావుంటే చెప్పండి నాతో. అలాగే చేద్దాం" అన్నారు నవ్వుతూ.

వారి ఆదరానికీ, వాత్సల్యానికి నేనెంతో ముగ్ధుడనైపోయి చాలా బాగున్నదండీ ఈ పద్ధతి. తమరు సెలవిచ్చినట్లు అన్నిటిలోనూ స్వతం త్రంగా ఆలోచించే శక్తి నాకు త్వరగా అలవడుతుందని అనిపిస్తోంది. రేప టినుంచే ఇక్కడకు వస్తూ వుంటాను. మీ అవ్యాజ ఆదరాభిమానాలకు కృతజ్ఞుడను సెలవు అని నమస్కరించి వచ్చేశాను.

ఆరోజు అస్తమానమూ వ్యూహా ప్రపంచంలోనే వుండిపోయాను. సాయంకాలము నెమ్మదిగా బయలుదేరి ఆ పేటతోనూ, వీధులతోనూ కొంచెం పరిచయం చేసుకుని సాయంత్రానికి సముద్రతీరానికి చేరుకున్నాను. ఈ రీతిగా మదరాసు జీవితం ప్రారంభమైంది. విదేశాలలో మూడు సంవత్సరములూ ఇక్కడికొచ్చిన తరువాతను గడచిన కాలములోనూ ఒంట రితనం ఎప్పుడూ అనిపించలేదుకాని, ఈ విశాలమహానగరంలో మట్టుకు నేనేకాకినైపోయాను. మాట్లాడడానికేనా ఎరుగున్న వారెవ్వరూ కనపడ లేదు. ముందుముందుకూడా ఆఫీసుకువచ్చే క్లయింట్లు ఎవ్వరూ నాకు పరిచయం, స్నేహం అయ్యే అవకాశం అంతకన్నా కనపడలేదు. నేనూ ఒక యింటివాడినయ్యాను. నాకూ ఒక అర్ధాంగి, నా గృహలక్ష్మి నాకు ఉత్సాహము, ఆనందమూ యిచ్చే శక్తి ఒకచోటా, కేవలం జడంగానే నేనొ కచోటా ఉంటడమేమిటి, ఇలా ఎంతకాలం అనేభావం ప్రప్రథమంగా కొట్టొ చ్చినట్లు సముద్రతీరాన కూర్చుండగా తోచింది. కొంత వేదన కలిగింది. చీకటిపడ్డ తరువాత గృహోన్ముఖుడనై, కాదు కాదు హోటలోన్ముఖుడనై క్కడ సాంబారు రసాదుల అనుపానంతో నాలుగు మెతుకులు చప్పరించి, బసకు వచ్చి పడుకునే వరకూ అనగా అర్ధరాత్రి దాటేవరకూ, మనసు కొంచెం కొంచెమేమిటి చాలా యిబ్బంది పెట్టింది.

ఉదయాన్నే లేచి ఏడుగంటలకల్లా శ్రీ నారాయణమూర్తిగారి ఆఫీసులో హాజరయ్యాను. నేవెళ్ళేసరికి అప్పుడేవారూ స్నానాదికములు ముగించుకుని కాగితములు చూసుకుంటున్నారు. పార్టీలు కొంతమంది అప్పటికే తయారుగా కూర్చున్నారు. నారాయణమూర్తిగారు నా నమస్కారం అందుకుని ఆశీర్వదిస్తూ, మందహాసంతో నన్ను రమ్మని సుఖాసీనుణ్ణి చేశారు. ఆ క్షణం నుంచి నా ప్లీడరువృత్తి ప్రారంభ మైందన్నమాట. అక్కడ జరుగుతున్న ప్రతివిషయమూ యెంతో శ్రద్ధగా గమనిస్తూ అన్నీ ఆకళింపు చేసుకుంటూ చాలా మంచి విద్యార్థిలా కూర్చున్నాను. ఆరోజుఅక్కడనేనన్ను భోజనం చెయ్యమని వారు చాలా బలవంతం చేశారు. తరువాత వారి గుర్రబ్బండిలో నన్ను తమతో కూడా హైకోర్టుకు తీసుకు వెళ్ళారు. అంతేకాకుండా బార్ రూములోకి నన్నుకూడా తీసుకువెళ్ళి మన తెలుగు లాయర్లు చాలామందికి ఇద్దరు ముగ్గురు ఆంగ్ల సొలిసిటర్లకూ, నేను కొత్తగా వచ్చిన లండను బారిష్టరుననీ, చాలా చురుకైన వాడిననీ అతి శీఘ్రంగా పైకి రావలసినవాడిననీ, నన్ను పరిచయం చేయగా వారందరూ నా నమస్కారాలందుకుని నన్నాశీర్వదించినట్టుగా నా కరచాలనం చేస్తుంటే, నాకెంతో వింత ఆనందం కలిగింది. ఆ రోజుంతా నేనెక్కడా నేలమీద నడచినట్టులేదు. గాలిలో తేలిపోతున్నట్లే అనిపించింది. ఇంతలో క్రిందటిమాటువచ్చినప్పుడు నేను దర్శించిన ప్రకారం పంతులుగారు కూడా గబగబవచ్చి ఒక్కమాటు నన్ను చూచి,

"ఆఁ ఏమీ అప్పా పార్వతీశం. వచ్చావా? ఇక్కడనే ఉంటావా? బాగుంది. మంచిపనిచేశావు" అని కులాసాగా నావీపు తట్టారు. నారాయణమూర్తిగారు యిది చూచి,

"ఏమండీ పంతులుగారూ నేనీ కుర్రవాణ్ని మీకు పరిచయం చేద్దామనుకుంటుంటే మీకు పూర్వ పరచితుడులా మాట్లాడేస్తున్నారే. ఇది చాలా శుభ దాయకం అతనికి" అన్నారు నవ్వుతూ. ప్రకాశంగారు కూడా ఒక్కసారి గట్టిగా నవ్వి,

"మన చేతుల్లో పడ్డ తర్వాత ఇంకా అతను కుర్రవాడేమిటి. అ మధ్యను వచ్చి అతను కనబడినప్పుడే మైనారిటీ వదిలిపోయినట్టు లెక్క. ఇక ఈనాటి నుంచి మనలో ఒకరు, ఏం పార్వతీశం అంతేనా" అన్నారు.

"చిత్తం" అన్నాను ఇంకేమనాలో తోచక. ఈ రకంగా నా ప్లీడరీ వృత్తి ప్రారంభమైంది.

నాలుగైదు మాసములవరకూ ఊపిరాడకుండా మరొక ఆలోచనకు వ్యవధి లేకుండా ఈ వృత్తి విద్యలో ఈ శిష్యరికంలో నిమగ్నుడనై కాలక్షేపం చేసుకున్నాను. అప్పుడప్పుడు మాయింటి దగ్గరనుంచీ, మా మామగారి దగ్గర నుంచీ ఉత్తరాలూ వస్తునే ఉండేవి. నా అర్ధాంగి ఉత్తరాలు వ్రాస్తున్నా దూరంగా సైలెంట్ పార్ట్నరుగానూ, యాబ్సెంట్ పార్ట్నరుగానూ ఉండిపోయింది. ఆవిషయమై మా నాన్నగారూ, మామగారూ కూడా రెండుమూడుసార్లు సాధ్యమైనంత త్వరలో అక్కడ అట్టే యిబ్బంది పడ కుండా వచ్చి నా భార్యను తీసుకువెళ్ళవలసిందని హెచ్చరిస్తూ ఉత్తరాలు వ్రాశారు కూడాను. కాని ఆ విషయం ఎక్కువగా పట్టించుకోవడానికి ఆలోచించుకోడానికి తీరికలేకపోయింది. ఈ శిక్షణలో ఎన్నెన్నో పుస్తకాలు చదివాను. ఎన్నెన్నో విషయాలు నేర్చుకున్నాను. ప్లీడరీ అంటే కేవలం మాటలూ, మూటలూ డబాయింపులూ కాదని తెల్సుకున్నాను. ఎన్ని రకాల మనష్యులనో, ఎన్నోరకాల స్వభావాలనో చూచాను. న్యాయంగా న్యాయవాదవృత్తి చెయ్యవలెనూ అంటే ఎంతకష్టపడాలో, ఎటువంటి కఠిన పరీక్షల నెదుర్కోవాలో, కొంతవరకూ తెలుసుకున్నాను. ఆ పరీక్షలన్ని టికీ నిలిచి, వృత్తి, ధర్మం సరిగా నిర్వహించగలుగుతే, ఆ వృత్తికి ఎంతటి ఔన్నత్యం కలిగించవచ్చునో తనే ఏ ఉన్నత శిఖరాలను అందుకోవచ్చునో కూడా అర్థమైంది. నా కళ్ళ ఎదుట ఏదో విశాలమైన నూతన ప్రపంచం కనబడ్డట్టు అయింది. ఈ రకమైన వూహ కలిగినప్పుడల్లా నాకంతులేని ఆనందం కలిగేది.

ఈ ఆరుమాసములలో నారాయణమూర్తిగారికీ, ప్రకాశంగారికీ చాలా ప్రియశిష్యుడనయ్యాను. నారాయణమూర్తిగారివద్ద సివిల్ కోర్టు వ్యవహార మంతా నేర్చుకున్నాను. ప్రకాశంగారి దగ్గర ఎక్కువగా క్రిమినల్ వర్కు నేర్చుకునే అవకాశం కలిగింది. వీరుభయులూ వారి వృత్తులలో ఉన్నత శ్రేణిని అందుకున్నవారే. వారుభయుల్లోనూ అతి సౌమ్యులు, శాంత స్వభావులు శ్రీ నారాయణమూర్తిగారు. ప్రకాశంగారు చాలా గంభీరులు. ఒక్కమా టతోనూ, ఒక్క చూపుతోనూ ఎదుటివారిని గజగజలాడించగలిగినవారు. ఎంతటివారైనా తుదకు జడ్జీలక్కూడా ప్రకాశంగారంటే పక్క బెదురని అనుకునేవారు. తదనుగుణంగా రెండుసార్లు ఈ విషయం నాకే ఋజువైంది కూడాను. ఒకరోజున పెద్ద ఫోర్జరీ కేసు అనుకుంటాను జరుగుతున్నది. మిట్టమధ్యాహ్నం అయింది. ప్రకాశంగారి గంభీరవాదన జరుగుతోంది. ఉరు ములూ, సింహగర్జనల్లా ఆయన వాదనలు పైవాళ్ళకు వినపడుతున్నాయి. అటువంటి సమయంలో ఇది జోలపాట అయినట్లు జడ్జిగారి కొకరికి

కునికిపాట్లు వచ్చినాయి, ఇది గమనించిన ప్రకాశంగారు తన చెబుతున్న వాక్యం ముగించకుండానే గభీమని తమకుర్చీలో చతికిలబడ్డారు. రెండుమూడునిమిషాలు కోర్టు అంతా నిశ్శబ్దం. అప్పటికి జోలపాట వినిపించటం లేదేమా అని జడ్జిగారు కళ్ళు తెరిచి కొంచెం సిగ్గుపడి.

"కానివ్వండి ప్రకాశంగారూ కూర్చున్నారే" అన్నాడు.

ప్రకాశంగారు టక్కున లేచి "కోర్టువారికి నిద్రాభంగం కలిగించడం యిష్టంలేకను కూర్చున్నాను. కోర్టువారి సెలవైనది గనక" అని అక్కడున్న వారందరూ నవ్వుతుండగా తాను సగం చెప్పిన వాక్యం మళ్ళీ అందుకుని తనవాదన ముగించేవరకూ జడ్జీలకు లంచిటైమైనా ప్రకాశంగారు వాదన పూర్తయ్యే వరకూ కదల్లేదు పాపం. జడ్జిలనుకూడా అదుపు ఆజ్ఞలలో పెట్టగల సమర్థులు కొంతమంది ఉంటారని అనాడు తెలుసుకున్నాను. ఇటువంటిదే మరొక విచిత్ర సన్నివేశం జరిగిందని విన్నాను. ప్రకాశంగారో, మరొకరో ఇలాగనే వాదిస్తూంటే జడ్జిగారికి జోగు వచ్చింది. అది వేసవికాలం, కోర్టువారి సౌకర్యం కోసం పంకాలాగడానికి ఓ నౌకరు ఏర్పాటై వుండేవాడు. ఆనాడు ఆ పంకాలాగే నౌకరుకు కూడా యజమానికి తగులుతున్న శీతలవాయువు తగలకపోయినా, అతనికీ జోగు వచ్చింది. ఇటువంటి సందర్భాలలో కోర్టువారికి ఆగ్రహం రాకుండా వారిని మేల్కొలిపే పద్ధతులు రెండుమూడున్నాయని విన్నాను. ఒకటి ఏదో విలువైన పుస్తకం పొరపాటున చెయ్యి జారిపోయినట్లు దబీమని చప్పుడయ్యేటట్లు క్రిందపడెయ్యడం ఏ కుర్చీయో చప్పుడయేటట్లు అటూ యిటూ లాగడం, లేదా క్లయింటునో నౌకరునో కొప్పడుతున్నట్లు ప్లీడరు పెద్దకేకవేయుడం, ఇందులో ఏదో ఒక ప్రయోగానికి ఎంత హైకోర్టు జడ్జీ అయినా మెలకువ వచ్చి తీరుతుందని విన్నాను. ఆనాడు అలాగే పంకా లాగుతున్న నౌకరు మీదను ప్రకాశంగారే అనుకుంటాను.

వెధవా, నీకూ నిద్రేనా నువ్వెంత నీ వుద్యోగమెంత నువ్వేమన్నా హైకోర్టు జడ్జీఅనుకుంటున్నావా అని కేకలు వేసేటప్పటికి జడ్జీగారు వులిక్కిపడిలేచి అందరితోపాటూ, ఆయనకూడా నవ్వుకుని,

ఫరవాలేదండి మేము నిద్రపోవటం లేదు. వాదప్రతివాదనలు చేసే లాయర్లకు కొంత విశ్రాంతి కలిగిద్దామని ఇలా నటిస్తూ వుంటాం మధ్య మధ్యను అన్నారుట. అక్కడున్న జనమంతా ఒక్కసారిగొల్లున నవ్వారు. ఆ పూటకు అంతటితో పనిముగించుకుని నెమ్మదిగా బసకు చేరుకున్నాను. తలుపుతీసి లోపలికి వెళ్ళేటప్పటికి యింటివద్దనుంచి మా నాన్న

వ్రాసిన వుత్తరం లోపలపడి వున్నది.

క్రింద వున్న ఉత్తరం తీసి బల్లమీద పెట్టి బట్టలు మార్చుకుని ముఖప్రక్షాళనాదికము ముగించుకుని సావకాశంగా కూర్చుని వుత్తరం విప్పి చదువుతున్నాను. అనుకున్నంతా అయింది. వుత్తర సారాంశం ఏమిటంటే నేనిక్కడ ఇలా హోటలు మెతుకులు తింటూ ఆరోగ్యం పాడుచేసుకోవడమున్నూ, అక్కడి భీమవరములో కోడలు నీకోసం బెంగపెట్టుకుంటూ వుండడమున్నూ యేమీ బాగాలేదు. కనుక, నన్ను వెంటనే ఇంటికి వచ్చి పునస్సధానం కానిచ్చుకుని నన్ను మద్రాసులో కాపురం పెట్టుకోక తప్పదనీ ఇది శిరసావహించక తప్పదనీ మా నాన్నగారి కఠోర శాసనం.

ఆ ఉత్తరం చూసుకుని ఏమనాలో కాదు ఏమనుకోవాలో తోచలేదు. మా నాన్న ఎప్పుడూ ఏ శాసనం జారీచేసినా అదిధిక్కరించేదిగా, లేక, ధిక్కరించవలసినదిగా ఎప్పుడూ వుండదు. మామూలు లా పుస్తకాలలో ఏ శాసనాన్ని గురించేనా అభిప్రాయ భేదాలు వుండడానికి అవకాశంవుంటుంది కాని మా నాన్న నోటివెంటవచ్చే శాసనానికి ఆ అవకాశం ఎప్పుడూ వుండడానికి వీలులేకపోవడం దాని విశిష్టత. ఇలా అనుకుంటూ ఏమి చెయ్యడమా అని ఆలోచిస్తూ ఎంత సేపో మూగనై స్తబ్ధుగా అలాగే కూర్చుండిపోయాను. కొంతసేపటికి ఆయన చేసిన నిర్ణయము సబబేననిపించింది. అందుకు కారణం బహుశా మానసికంగా కొద్దిరోజుల క్రితమే నేననుకోకుండానే నేనూ ఈ నిర్ణయానికి వచ్చి ఉంటాను అనుకున్నాను. సరే ఇంకదానికంత ఆలోచనెందుకు, ముందు వెళ్ళి ఓ కప్పు కాఫీ కడుపులో పడితే కొంచెం మాంద్యం వదలి ఏదో నిర్ణయానికి రావచ్చునని నిశ్చయం చేసుకుని, మా అయ్యరు దగ్గరకు బయలుదేరాను. అక్కడ మామూలు కంటే ఎక్కువ మోతాదు పడినా ఇంకా ఏ నిశ్చయానికీ రాలేక బీచ్‌కి వెళ్ళేను. శూన్యమనస్సుతో సుమారు రెండుగంటలసేపు అక్కడే కూర్చున్నాను. ఒంటరిగా అక్కడ సముద్రపు హోరూ, శీతల పవనం దగ్గరనుంచీ, దూరాన్నుంచి గాలిలో కొట్టుకువచ్చి నా చెవిని పడుతున్న ముద్దుల ముచ్చట్లు ఆ ముచ్చట్లలో నవ్వులూ, ఆ నవ్వులవెనుక హాయీ, ఆ హాయి వెనుకనున్న ఆనందమూ అన్నీ నాలో అనుకోని వింత చైతన్యాన్ని కలిగించినాయి. ఇన్నాళ్ళు ఈ సంగతి ఎందుకు మరచిపోయాను? లేక మరచినట్టు నన్ను నేను మోసగించుకుంటున్నానా అనే భావం కలిగి ఉలిక్కిపడి నలువైపులా చూస్తే పరస్పర ఆలింగన చుంబనాదులతో పరవశులైన మిధునములు తప్ప జంటకాని, ఒంటరులు ఒక్కరూ

కనపడలేదు నేను తప్ప. నా అనిశ్చితస్థితి వదిలిపోయింది.

ఎప్పటివలెనే మా నాన్న శాసనం అవశ్య మనుసరణీయమే అనే నిశ్చయానికి వచ్చి తిన్నగా మా ప్లీడరు గురువుల దగ్గరకు వెళ్ళాను. వారితో నేను వారం పదిరోజులపాటు అత్యవసర కార్యముమీద యింటికి వెడుతున్నాననీ సెలవిప్పించమనీ కొంచెం సిగ్గుపడుతూ అడిగాను. వారొక్కసారి నా ముఖంకేసి నిలకడగా చూచి మందహాసం చేస్తూ,

'అయితే తెలియకడుగుతున్నాను. అచ్యుతరామయ్యగారమ్మాయి ఇంకా కాపురానికి రాలేదా? చెప్పారుకారూ ఈ పొరపాటు ఎవరివల్ల జరిగిందో! సరే ఎవరివలన అయితేనేమి వెంటనే వెళ్ళి ఆవ్యవహారం త్వరలో రైటు చేసుకుని మళ్ళీ మరచిపోయి ఒంటరిగారాక, ఆ అమ్మాయినికూడా ఆ అమ్మాయి పేరు సరస్వతి అని కాదూ - అన్నారూ - వెంటబెట్టుకునిరండి. మీ వృత్తిలో సరస్వతీ సహాయం, కటాక్షమూ లేకపోతే పైకి రావడం కష్టం. శుభం భవతు' అన్నారు నేను మూడింతలై నోటమాటరాక మౌనం గానే నమస్కరించి బయటపడ్డాను. మరునాడు ఇంక వారికి కనపడకుండానే ఏవేవో వూహించుకుంటూ, ఏవేవోకొంటూ, కంటూ తుదకు బసకుచేరుకుని రెండు మెతుకులు ఎలాగో నోట్లోవేసుకొని, కొన్నవన్నీ మరచిపోకుండా చేతపట్టుకుని, గాలిలో తేలుతూ స్టేషను చేరుకున్నాను అలా గాలిలోనే మొగల్తుర్రు వెడతాననుకున్నాను కాని రైలు ఎక్కక తప్పలేదు. మరునాటి మధ్యాహ్నానికి మొగల్తుర్రు చేరుకున్నాను.

నేను యింటికి చేరేసరికి మావాళ్ళ భోజనాలు అయిపోయినాయి. ఉత్తరం అదిన వెంటనే బయలుదేరుతానని మావాళ్ళు అనుకోలేదనుకుంటాను. ఏమైతేనేమి మానాన్న సంతోషం గంభీరంగా ముఖంలో కనపర్చారు. మా అమ్మ సంతోషంపట్టలేక నేను స్నానం చేసేటప్పుడూ, భోజనం చేసేటప్పుడూ కూడా ప్రక్కనే ఉండి ఏవేవో అంతులేని, విసుగులేని మాటలు చెబుతూనే ఉంది. మా అమ్మకిన్ని మాటలు వచ్చునా? అనుకున్నాను.

రెండుమూడురోజులు ఊపిరాడకుండా మానాన్న నర్సాపురం వెళ్ళి అక్కడ బట్టలదుకాణాలకు బంగారు పనివాళ్ళ యిళ్ళకూ కాలికి చక్రాలు కట్టుకున్నట్టు అలా తిరుగుతూనే, కొనే వస్తువులు కొంటూ, చేయించేవి చేయిస్తూ, యితరపనులు పురమాయించే వాళ్లకు పురామాయిస్తూ, నాకు మట్టుకు ఏపనీ చెప్పకుండా వెయ్యిచేతులూ, వెయ్యి కాళ్ళూ వున్నట్టుగా అన్నిటికే తానొక్కడే అయి, ఎక్కడ ఏలోటూ రాకుండా సమస్తమైన ఏర్పాట్లూ చేసుకొచ్చాడు.

నాల్గవరోజున సూర్యాస్తమయానికే భోజనాదికములు ముగించుకుని వచ్చిన కొద్దిబందువులతో, నాలుగైదు రెండెడ్లబళ్ళు కట్టించుకుని భీమవరం తెల్లవారేసరికి చేరుకున్నాం. పెళ్ళికి తరలి వెళ్ళడమంటే అదోదర్జాగానూ, సరదాగానూ ఉన్నదికాని నేడీకార్యానికి బంధువులను మనము పిలవడమూ బాగాలేదు. ఉత్తరము అందగానే వాళ్ళందరూ పరుగెత్తుకుని తగుదునమ్మాని తయారు కావడం అంతకంటే బాగా లేదు. ఇంతమంది కట్టుకట్టుకుని వెళ్ళడం నాకెంత మాత్రం బాగాలేదు సరికదా, ఎంతో సిగ్గుగా కూడా ఉన్నది వాళ్ళక్కడ ఏం చేస్తారూ. మూడురోజులు వీళ్ళకు కాలక్షేపం ఎలా అవుతుంది అని ఒక్కసారి అనుకుని నవ్వుకునీ నా భావనా ప్రపంచంలోకి వెళ్ళిపోయి మధురాతి మధురమైన కలలుకంటూ భీమవరంచేరాము. వూరు బయటనే మా రాకకై నిరీక్షిస్తున్న మా మామగారి గుమాస్తాలూ, నౌకర్లూ నాకు స్వాగతం చెప్పి వూళ్ళోకి తీసుకు వెళ్ళారు. ఇకనక్కడ జరగవలసిన వన్నీ యధావిధిగా ఏలోటూ లేకుండా జరిగినట్టే



నా అనుమానం.

ఏమంటే ఏమి జరిగినదో నాకేమీ తెలియదు. మూడు రోజులు మూడురోజులని అన్నారు కనుక కాబోలనుకున్నాను. నేను మూడు నిమిషాలే అనుకున్నాను.

'ఏమర్రా ఆ దంపతులు ఇంకా ఊడిరారేం' అని ఆ పురోహితుడు కేకవేస్తుంటే నా సరస్వతి నా భుజంమీదకు తలవంచి, బుగ్గలు గులాబీలు పులుముకుని ముసిముసినవ్వులు నవ్వుతూంటే, మేము ఒక్కరమే అనుకుంటూంటే యిద్దరంటాడేమిటీ వెర్రిముండాకొడుకు అనుకున్నాను కూడాను. ఏమండీ ఈమాటలు ఆమాటలంటే మాటదక్కదు సుమండీ అని అందామనుకున్నాను కూడాను. సరే అదంతా ఎందుకు కాని, నాలుగవనాడు పెందలాడే విందులారగించి మా మామగారి పలుకుబడివల్ల వచ్చి వాకిట్లోవున్న నాలుగు కార్లలోనూ మేమంతా సర్దుకుని సాయంకాలానికి మొగల్తుర్రు చేరుకున్నాం. అప్పటికప్పుడే మాకు ఫలహారాలు వగైరా అన్నీ అమర్చి వుంచారు. మా ముసలివారు కొంతమందీ ఇద్దరు వంట బ్రాహ్మలూ కలసి ఏ ఆలస్యమూ, ఏ లోటూ లేకుండా మేము పాద ప్రక్షాళన చేసుకోవడం తడువుగా అన్నీ అందించారు. మళ్ళీ యిక్కడా మాకేమీ ఎవరూ చెప్పకుండా, చెయ్యకుండా మూడురోజులూ అయిందన్నారు. వచ్చిన బంధువులు చాలా సంతోషించి - దేనికో తెలియదు - మేమిచ్చిన బహుమతులు అందుకుని-

'శ్రీఘ్రమేవ సుపుత్రాప్రాప్తిరస్తు' అని ఆశీర్వదించి వాళ్ళదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

'వెడుతూ వెడుతూ వీళ్ళకీ తొందర మాటలెందుక'న్నాను. సరస్వతి వచ్చే నవ్వును ఆపుకుంటూ తుర్రుమని లోపలికి పరుగెత్తింది.

మరొకవారం రోజులు - అని మావాళ్ళు అంటూండగా విన్నాను. సరే కాలంతో నిమిత్తంలేకుండా, దివారాత్రములు తెలియకుండా, మజ్జన భోజనాదుల సంగతికూడా మరచి మరోలోకంలో మేముండగా, ఆ సాయంకాలమే మేము భీమవరం వెళ్ళి అక్కడనుంచి మదరాసు ప్రయాణానికి వీలుగా వుంటుందని మా నాన్నగారు నిశ్చయించి, అన్నీ ఏర్పాట్లు చేసి మా కొత్త కాపురానికి కావలసిన వస్తు సామగ్రినంతా సేకరించి, ప్రయాణానికి సిద్ధముకమ్మని నన్ను హెచ్చరించారు. నేనువులిక్కిపడి సరస్వతితో ఈ సంగతి చెప్పి సాయంకాలానికి అన్నీ సవరించుకుని ప్రయాణానికి సన్న

ద్ధులమయ్యాము.

భీమవరంలో మరి రెండు రోజులుండి మా అత్తగారు మా కందించిన బహుమతులు, తినుబండారాలూ, వూరగాయలు సంసారాని కవసరమైన పాత్రసామగ్రి వగైరా సామగ్రితోను మాకు కాదు సరస్వతికి సహాయంగా ఉండడానికి వారి బంధువులలో ఒంటరిగానూ ఆర్థికంగా ఇబ్బంది పడు తున్న ఒక విశ్వస్తతోనూ మదరాసుకు బయలుదేరాము. (మహానుభావుడు పానుగంటివారు కుంకుమభరణితో విభూతిపండు అన్నట్లు.)

ప.గా మామగారు అనేక విధాల మదరాసు కాపురము ప్రాక్టీసు ప్రస్తు తానికి వాయిదావేసి కొంతకాలం యిక్కడనే ఉండి కొంత అనుభవం సంపాదించిన మీదట మదరాసులో ప్రాక్టీసు పెడితే చాలా అనుకూలం గానూ, వీలుగానూ ఉంటుందని ఎన్నోవిధాల చెప్పారు. కాని నాకామాట నచ్చలేదు. మొదటినుంచీ హైకోర్టులోనే ప్రారంభిస్తే విశాల దృక్పథం సుని శిత పరిశీలనాజ్ఞానం పెద్ద పెద్ద న్యాయమూర్తులకు కూడా నచ్చచెప్పగల నేర్పూ, అలవాటవుతుందని అనేకమంది చెప్పగా వినడమేకాక ఈ కొద్ది మాసముల అనుభవంలో నాకు తోచినవి

విషయం కూడా అదేనని మా మామగారికి నచ్చచెప్పి మదరాసుకు బయలుదేరాము.

# 19

మదరాసు చేరిన వారం పదిరోజులవరకూ నేనదివరకు తీసుకొన్న చిన్న వాటాలోనే కాలక్షేపం చేసుకోవలసి వచ్చింది. అక్కడ ముగ్గు రకూ ఎంత యిబ్బందిగా వున్నా, అలాగే కాలక్షేపం చేసుకుని త్వరలోనే మరికొంచెం పెద్దయిల్లు సంపాదించగలిగాను.

రోజూ సకాలంలో కోర్టుకి వెళ్ళడమేకాక మా సీనియర్ల ఆఫీసులకు వెడుతూ పని అంతా జాగ్రత్తగా అలవరచుకున్నాను. మా నారాయణ మూర్తిగారు నా శ్రద్ధాసక్తులను చూచి చాలా సంతోషించారు.

'బాబూ, యికనేదేనా కేసు నీవు స్వతంత్రంగా తీసుకుని వాది స్తుంటే చూడవలెనని కుతూహలంగా ఉన్నది' అంటూ ఒక రోజున అప్పీలు ఒకటి నాచేత పెట్టించారు.

'ఇది ఎల్లుండి విచారణకొస్తుంది. నీవు శ్రద్ధగా చదివి అవగాహన

చేసుకో. ఇందులో ఒక సూక్ష్మమైన లా పాయింటుంది. అది నీవు తెలుసుకో గలుగుతే ఈ కేసు నువ్వు గెలుస్తావు. లేకపోతే పోతుంది. దానిని గురించి నన్నేమీ అడగవద్దు. నేను నీ ప్రక్కనే ఉంటాను. నీ వాదన వింటాను. నేననుకున్న పాయింటు నీవు చెప్పలేకపోతే అప్పుడు నీకు ఆ పాయింటు కాగితంమీద వ్రాసి అందిస్తాను. మన క్లయింటు కేసు మనం పోగొట్టకూడదుకదా' అన్నారు నవ్వుతూ.

నీవు సరిగానే ఈ కేసు అర్థం చేసుకుంటావనీ నేననుకున్న పాయింటు నీవు తప్పక చెప్పగలవనీ ధైర్యమున్నది. ఏమంటావు? అన్నారు.

'చిత్తం ఇంక అనడానికేమున్నది! తప్పక ప్రయత్నం చేస్తాను. మీ యోచనాపద్ధతులు కొన్ని అవగాహన చేసుకున్నానుకదా! అందుచేతను అంతా సవ్యంగానే జరుగుతుందని ఆశిస్తాను.' అని వారిదగ్గర సెలవు తీసుకుని నా బసకు వెళ్ళిపోయాను. మరునాడు వారింటికి వెళ్ళకుండా కోర్టులోనే వారిని కలుసుకున్నాను. మూడవనాడు కూడా అంతే. ఆరో జునే ఈ కేసు విచారణ.

నా జీవితంలో మొదటిసారిగా కోర్టులో - హైకోర్టులో - నిలబడి మహా మేధావులైన జడ్జిల ఎదుట నేను వాదించడం జరిగింది. ఒక్కసారి నేను లేచి నిలబడి గౌను సరిగా భుజాలమీదకు సర్దుకుని తలపైకెత్తి జడ్జిగారి వైపు చూసేసరికి ఆయన తీక్షణంగా ఎవరీ యువకుడు? అన్నట్లు నాకేసి చూస్తున్నారు. నేను నమస్కారసూచకంగా తలవంచి, ప్లీడరువైపు తిరిగేట ప్పటికి చాలామంది కేవలం నన్ను చూడడానికి, నా వాదన వినడానికే వచ్చినట్టు యువకులు చాలామంది కనబడ్డారు. నేను చిరునవ్వుతో కన పడీ, కనపడకుండా వారివైపుకూడా తలవంచి నావాదన ప్రారంభించాను. కోర్టుహాలంతా నిశ్శబ్దమైనది ఆంగ్లభాషలో నిస్సంకోచంగా. వ్యర్థవాక్యాలేవీ లేకుండా, ఎన్ని సంవత్సరాల అనుభవమో ఉన్నట్టుగా మాట్లాడే నన్ను చూస్తూ కూర్చున్నారు. సుమారు అరుగంటలయిన తరువాత పరీక్షాసమ యమన్నట్లు ఈ వాదనలో క్లిష్టమైన ఘట్టందగ్గిరికి వచ్చాము. నేనవలీ లగా, అప్రయత్నంగా, అనాలోచితంగా చెప్పినట్టుగానే, రెండు ముఖ్యమైన పాయింట్లు చెప్పి నా వాదను ముగించి న్యాయాధిపతుల వైపు తిరిగి మళ్ళీ నమస్కారసూచకంగా తలవంచి కూర్చున్నాను. నారాయణమూర్తి గారు బ్రహ్మానందపడ్డారు. మిగతా వకీళ్ళంతా శహభాష్ అనే భావం తమ ముఖాలలో వ్యక్తం చేశారు. ప్రతివాది ఒక పది నిమిషాలు నా వాదనకు ప్రతివాదనచేశారు. అందులో స్వారస్యంలేదని నాకుకూడా అర్థ

మైంది. నేను బయటికి వస్తుంటే నారాయణమూర్తిగారు నా భుజంమీద చెయ్యివేసి రెండడుగులు నాతో వేస్తూ,

'చాలా బాగా చెప్పావు నాయనా, నేననుకున్నవన్నీ అనుకున్నట్లుగా నాకంటే బాగా చెప్పావు. చాలా సంతోషంగా ఉంది. నీవు చాలా పెద్ద వాడవవుతావు' అని నా వీపుతట్టి వారిదారిన వారు వెళ్ళారు వారి కిపాదాభివందనం చేద్దామనిపించింది. అక్కడ జన సమూహంలో ఆపని చేయలేకపోయాను. మరి రెండురోజులకు కోర్టువారు నేను వాదించిన కేసులో మా క్లయింటుకు అనుకూలంగా, నిర్ద్వంద్వంగా తీర్పు చేప్పారు. తీర్పులో నన్నభినందించారు కూడాను.

ఇలా కొన్నాళ్ళూ అప్పుడప్పుడు ఏదోకేసు నారాయణమూర్తిగారు నాకు ధైర్యంగా వప్పచెప్పడమే కాకుండా కొన్ని కేసులు, అనగా అప్పీళ్ళుమన వేపునుంచి తిన్నగా నాదగ్గరికి రావడం మొదలెట్టాయి. నా ఖ్యాతి అంతవరకూ వ్యాపించి నాకు కేసులు ఎవరు పంపిస్తున్నారా అనుకున్నాను మొదట. మా మామగారు యిక్కడ నాగురించి వాకబులుచేసి, నాప్రయో జకత్వం తెలుసుకుని, సాదరంగా నమ్మకంగా వారితాలూకూ, స్నేహితుల తాలూకూ అప్పీళ్ళను నాదగ్గరకు తిన్నగా పంపిస్తున్నారని తెలుసుకున్నాను.

ఇక నింటివద్దను రోజు రోజూ కోర్టు వ్యవహారాల్లోనూ, లా పుస్తకా ల్లోనూ నిమగ్నుడనై క్లయింట్లతోనే ఎక్కువ కాలక్షేపం చేస్తుంటే మా సరస్వతికి ఏ కాలక్షేపం కాక కొంచెం అలగడం, చిరుకోపం ప్రదర్శించడం మొదలెట్టింది. అందుచేతను విధిగా సాయంకాలం తెరిపిచేసుకుని బీచ్‌కి షికారు తీసుకువెళ్ళడం మొదలెట్టాను. మొదటి రోజున ఎంతో హాయిగా ఉన్నదనుకొన్నది. మరి రెండురోజులయిన తరువాతను,

'ఏమిటండి యిక్కడ ఇంత సమ్మర్దమూ ఇంత సమూహమూను ఎక్కడా ప్రశాంతంగా కూర్చోడానికేనా చోటుకనపడదేం? ఈ మదరాసు వాస్తవ్యులకు యిళ్ళూ, వాకిళ్ళూ ఉండవా ఏమిటి? పైగా యిదేమిటండీ వచ్చినవాళ్ళేదో కాస్సేపు కూర్చుని యింటికి పోకుండా ఇంతా బాహాటంగా స్త్రీ పురుషులు అంత అలా ఒకళ్ళనొకళ్ళు ఊపిరాడకుండా ఆ కౌగి లింతలేమిటీ? ఆ ముద్దులేమిటీ? ఆ సరసాలేమిటండి' అన్నది ఎంతో ఆశ్చర్యంతో.

మదరాసు వచ్చినప్పటినుంచి నేటివరకూ ఆమెను బీచ్‌కి తీసుకురా లేదన్న విషయం స్ఫురణకువచ్చింది. నేను పరధ్యానంగా మఃఎకొంటిమూాం

నడిపించి, నీటికి దగ్గరా నాకు దగ్గరగా కూర్చోపెట్టుకుని, ఆమాటా ఈ మాటా చెబుతూ, ఆమె నడుముచుట్టూ చెయ్యివేసి, ఆమెకు తెలిసీ, తెలియకుండా అంతకంతకు మరీదగ్గరకు తీసుకుని, తలనిమురుతూ, తను కొంచెం పరాకుగా ఉన్నట్టు ఉండగా నా గుండెకు హత్తుకుని, గాఢంగా ముద్దుపెట్టుకున్నాను. మొదట ఊరుకుని మరొక నిమిషానికి చుంబనం పూర్తయ్యేసరికి తెలివి తెచ్చుకుని, వులిక్కిపడి నన్నవతలకి తొయ్యడానికి ప్రయత్నించి, నాల్గువైపులా చూచి,

'ఇదేమి అన్యాయమండీ వాళ్ళుచూస్తే ఏమనుకుంటారు? లేకపోతే వాళ్ళనుచూచి మీకూ మతిపోతుందా' అంది కొంచెం కోపం ప్రదర్శిస్తూ. దానికి సమాధానంగా ఓ చేత్తో ఆమె గడ్డం పట్టుకుని పైకెత్తి, మళ్ళీ ఒక్కమాటు గాఢంగా ముద్దుపెట్టుకున్నాను. మళ్ళీ నన్ను తప్పించుకో బోతుంటే,

'కంగారుపడకు సరస్వతీ మనగొడవ ఎవ్వరకీ అక్కరలేదిక్కడ వాళ్ళ పనులు వాళ్ళ చేతులనిండా ఉండనే ఉన్నాయి, తెలిసిందా? ఇక్కడ పండువెన్నెలలోనూ, చిమ్మచీకటిలోనూ, మందపవనంలోనూ, సముద్ర గానం వింటూ కూర్చున్న దంపతులకు యిక్కడ కలిగే ఉత్సాహమూ, ఉన్మాదమూ యిదోరకం, ఇంటి దగ్గర వేరు, ఇంత మంది యిక్కడికి ఎందుకు వస్తున్నారో, ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నారో ఇప్పుడేనా తెలిసిందా! 'కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనా చేతనేషు' అనే వాక్యం నీకు స్ఫురణకు రావడంలేదా' అన్నాను. సరస్వతి మాట్లాడకుండా చిరు నవ్వుతో నా మెడచుట్టూ చేతులువేసి నాముఖం తన ముఖంమీదకి వంచుకున్నది.

ఇంటిదగ్గర తను మళ్ళీ చదువవనెని ఉన్నదనీ, ఎవరినేనా ప్రయివేటు చెప్పడానికి చూడమనీ నాలుగైదుసార్లు అనగా, అనగా,

'ఆపొరాతే నేనూ చెబుతానంటున్నాను. నాలుగు రోజులు చెప్పి చూస్తే చూడు. నీకు నచ్చకపోతే ఓమిస్సమ్మ నెవరినేనా చూస్తాను' అన్నాను.

'మిస్సమ్మ వద్దులెండి. మీరు చెబితేచాలు. పాఠ్యగ్రంథాలు చెప్పేటప్పుడు అందులో విషయాలుతప్ప మరో ప్రస్తావనలేమీ తేకూడదని గమనించ ప్రార్థన' అన్నది.

నానాటికీ నా ప్రాక్టీసు దినదిన ప్రవర్ధమానంగా పెరుగుతూనే ఉన్నది. ఒకసారి ప్రకాశంపంతులుగారు కూడా ఒక క్రిమినల్ కేసుయిచ్చి

ఆయన పర్యవేక్షణలో కేసు అంతా నన్ను నడపమన్నారు. చేయవలెనని కుతూహలముగా ఉన్నదికాని కొంచెం సందేహిస్తూ వెంటనే సమాధానం చెప్పలేక పోయాను. పంతులుగారు నాకేసి నిదానంగా చూచి,

"ఏమప్పా! పార్వతీశం, ఏమి సందేహిస్తున్నావు. నీవేమీ భయపడ కూడదు. ఈ కేసు నీవు చాలా బాగా చేస్తావని నాకు తెలుసు నేను కూడా వచ్చి నీ పక్కనే కూర్చుంటాను. ఏమీ ఫరవాలేదు. ఈకేసంతా జాగర్తగా చదువు. దీని కీలకమంతా ఒక్క పాయింటుమీద ఆధారపడి ఉన్నది. అది ఒక్కటీ నీవు గ్రహించగలిగినట్లయితే ఢంకా మీద దెబ్బకొట్టి దిగ్విజయంగా బయటపడతావు. నీవు ఒక్కడివే ఈ కేసు చూడగలవని నా నమ్మకం. జాగర్తగా చదువు" అని దాని సంబంధమైన కాగితాలన్నీ పంతులుగారు స్వయంగా నా చేతిలో పెట్టారు.

ఆయన ప్రశంసా వాక్యాలకు నేనుబ్బి తబ్బిబ్బయ్యాను. కాగితాలం దుకుని ఆయనదగ్గర సెలవు తీసుకుని నా బసకు చేరుకున్నాను. నాలుగు రోజులు నిర్విరామంగా దానిని గురించే చాలా తీవ్రంగా ఆలోచించాను. అయిదవరోజు కేసు విచారణకు రానే వచ్చింది.

నేను నిందితుడు తరపున కేసువాదించాలి. కిందికోర్టులో ఇతను నేరస్థుడని ఋజువైనదని ఇతనికి శిక్ష విధించారు. కింది కోర్టులో ఇతనిమీద నేరం రుజువు కాలేదని నా వాదన. అతనికి వ్యతిరేకంగా వచ్చిన సాక్ష్య మేదీ రూఢైనది కాదనీ, బలంగా లేదనీ, కిందికోర్టువారుకూడా కొంతవరకు అంగీకరించారు. ఒక్కమనిషి తను ప్రత్యక్షంగా ఇతను నేరం చేస్తుంటే చూచానని కోర్టువారిని నమ్మించాడు. ఈ ఒక్క సాక్ష్య బలంచేతనూ నా క్లయింటు శిక్షార్హుడని నిర్ణయించి చాలా కఠిన శిక్ష వేశారు. ఇప్పుడు అతను ప్రత్యక్షంగా చూచానని చెప్పినది కూడా నమ్మదగినదికాదని నేను రుజువు చేయాలి. తక్కిన సాక్ష్యం విచారణ పూర్తయింది. వారిలో ఏ ఒక్కరూ నిజం చెప్పలేదని కోర్టువారిని నమ్మించ గలిగాననుకుంటాను. ఇంకను ప్రధాన సాక్షిని బోనులో నిలబెట్టి క్రాసు పరీక్ష చేయడం ఆరం భించాను. మొదట చెప్పినట్టుగానే తూచా తప్పకుండా చాలా ధీమాగా చెప్పడం మొదలెట్టాడు. నేను నెమ్మదిగా అతని దగ్గిరకు వెళ్ళి అతను పెట్టుకున్న కళ్ళజోడు ఒక్కసారి యిమ్మని నెమ్మదిగా అడిగి తీసుకుని, ఆమాటా ఈమాటా మాట్లాడుతూ ఆ కళ్ళజోడు నేను పెట్టుకుని ఏవో కాగితాలు చూస్తూ ఒక్కక్షణం ఆగి,

"ఏమయ్యా ఇందాక ఆ నేరస్థుడు గదిలోకి వెళ్ళడం, మళ్ళీ తొందర

తొందరగా ఇవతలకు వచ్చి పారిపోవడం నీవు చూచానన్నావుకదూ" అన్నాను.

'చూచానండి' అన్నాడు ధీమాగా బోనులో వున్న ఆసామీ.

"నీవు నుంచున్నచోటికి ఆ గదిగుమ్మం ఎంతదూరంలో వుంటుంది" అన్నాను.

"సరిగా చెప్పలేను కానీండి పదిహేను అడుగులో, ఇరవై అడుగులో ఉండవచ్చునండి" అన్నాడు.

"అయితే యిప్పుడు నీకూ జూరీకి వున్నంత దూరం ఉంటుందా?" అన్నాను.

అబ్బో యింతకంటే చాలాదూరమేనండి. నేను హాల్లోకి రాబోతు న్నానండి ఆ మనిషి ఆ చివరి గుమ్మంలో నుంచి పరుగెత్తుకు రావడం చూచానండి అతని ముఖం చూడడంతోటే నాకు భయం కూడా వేసిం దండీ అన్నాడు.

"అంతస్పష్టంగా కనబడ్డదా" అన్నాను.

'కనపడ్డదండి' అన్నాడు మరోమాటు. అంతటితో ఊరుకోక "నా కళ్ళ ఎదుటనే జరిగినది ఎందుకు కనపడదండీ" అన్నాడు.

"నిజమే సుమా. నాదే పొరపాటు. అంతస్పష్టంగా కనపడ్డదికాదని నేనుమట్టుకు ఎలా అనగలను" అన్నాను. "అయితే చూడూ, ఈ జూరీలో ఎడమనుంచి నాలుగో మనిషి నీ సాక్ష్యం వినిపించుకోకుండా చేతులో ఏదో పుస్తకం చదువుతూ కూర్చున్నాడేమిటి." అది కోర్టువారు గమనించరనుకున్నారు కాబోలు అన్నాను. ఈకేసుకేదీ సంబంధంలేని విష యంలాగ.

"చిత్తం అదేనండీ నేనూ చూస్తున్నాను. ఏమిటిలా కూర్చున్నాడ నుకున్నాను కూడానండీ" అన్నాడు మందహాసంచిందిస్తూ.

"అనుకున్నావూ! అయితే బాధలేదు. అన్నట్టు పాపం నీకళ్ళజోడు యివ్వడం మరచేపోయాను." అని అతని కందించాను.

'ఫరవాలేదండయ్యా అని తీసుకున్నాడు.'

ఇంక నువ్వువెళ్ళవచ్చునన్నాను. కోర్టు అంతా ఒక్కక్షణం సూగింజ నేలమీదపడినా వినపడేటంత నిశ్శబ్దం. వెంటనే ఒక్కసారి కోర్టు అంతా

ఒక పెద్దనిట్టూర్పు విడిచినంత శబ్దం. ప్రాసిక్యూషను వకీలు కుదేలై పేడ కుప్పలా కుర్చీలో కూలబడ్డాను. కొద్ది క్షణాలలో కేసు ముగిసింది. మరి రెండు రోజులలో దోషి నిర్దోషని కోర్టువారి తీర్పు.

నేనా సాక్షిని పరీక్షిస్తుండగానే పంతులుగారు చేటంత ముఖం చేసు కుని ఎంతో సంతోషంతో కోర్టులో నుంచే బయటకు వెళ్ళిపోయారు, తీర్పు చెప్పిన రోజున వారుకూడా దయచేసి తీర్పు విని నన్నమాంతం ఎత్తుకున్నంత పనిచేశారు.

భేష్ పార్వతీశం. ఆనాడు నేను చెప్పితిని కదయ్యా నీవు గెలుస్తా వనీ, నామాటే నిజమైంది. చూశావా. భేషుగ్గా వుంది. చాలా సంతోషం, అంటూాండగా అక్కడున్న వకీళ్ళందరూ గబగబా వచ్చి నన్నభినందించి నా కరచాలనంచేశారు.

నేను గాలిలో తేలిపోతూ యింటికి వెళ్ళి గౌనూ, కోటూ విప్పి కుర్చీలో కూర్చుని జోడువిప్పుకుంటూ సరస్వతితో నా కథంతా విజయ గర్వంతో చెప్పాను. సరస్వతి ఒక్క అంగలో నా దగ్గరకువచ్చి ప్రకాశం గారు చేసినంతపనీ తనూ చేయబోయి ఆ ఉత్సాహంలో నావళ్ళోచతికిలబడి గాఢాలింగనం చేసుకుని.

మరో నిమిషానికి "త్వరగా దయచేయండి" ఫలహారం, కాఫీచల్లారి పోతున్నాయి. అనే పిలుపు వినబడ్డది.

కోర్టులో వాతావరణం ఎంత గంభీరంగా ఉన్నా యింటికి రాగానే యిటువంటి వినోద కార్యక్రమం ఎంతో ఆనంద జనకంగా ఉంటుంది. ప్రాణం లేచి వస్తుంది.

ఇంటిదగ్గరే కాకుండా కోర్టులో కూడా అప్పుడప్పుడూ ప్రమోదకర ములైన సంఘటనలు జరుగుతుండడం కద్దు. ఒకసారి నేను క్రిమినల్ కేసులో నేరస్థుడి తరపున మేజిస్ట్రేటు కోర్టులో వాదించవలసి వచ్చింది. నేరస్థుడు వయసు ముదిరినవాడే. పైకి చాలా పెద్దమనిషిలా కూడా కన పడ్డాడు తన విషయమంతా నాతో ఎంతో జాలిగా చెప్పుకున్నాడు. నేనది చెయ్యడానికి ఒప్పుకున్నాను. ఒక పెద్దమనిషి చాలా ధనికుడు. రైలు స్టేష నులో మొదటి తరగతి పెట్టెలో యెక్కుతున్న సమయంలో అతనిచేతి గడియారం బహు నేర్పుగా సంగ్రహించి పారిపోతుంటే పట్టుబడ్డాడనీ, అతను పట్టుబడేలోపున ఆ గడియారం మరొకరికి అందించాడనీ, ఇతని మీద వచ్చిన కేసు. నేను చాలా శ్రమపడి ఇతను నేరస్థుడుకాడని ఎలాగో

కోర్టువారికి నమ్మించగలిగాను. కోర్టువారు కేసు కొట్టేశారు.

ఆ సాయంకాలం ఎనిమిది గంటలకు భోజనానికి లేవబోతుంటే ఈయనగారు ప్రత్యక్షమయ్యాడు.

"ఏమయ్యా ఇలా వచ్చావేమిటి? యింటికెళ్ళేలోపున మళ్ళీ ఏమన్నా నేరం చెయ్యబోయావా ఏమిటి! " అన్నాను.

"లేదండయ్యగారూ! ఇంకనెప్పుడూ అలా చెయ్యనండి తమరానాడు నాకు చేసిన ఉపకారం నేనెన్నడూ మరువలేనండి తమకు నేను ఫీజు ఏమీ ఇచ్చుకోలేనండి" అన్నాడు ముకుళిత హస్తాలతో ప్రాధేయపూర్వకంగా.

"అవునయ్యా ఇప్పుడు ఫీజు సంగతెందుకు మనము మొదట యేమీ అనుకోలేదుగా" అన్నాను.

'చిత్తం అదేనండీ. అయినా తమవుపకారం మరవలేక ఒక చిన్న బహుమానం తమకు సమర్పించుకుందామని వచ్చానండ'న్నాడు.

'నాకేం బహుమానం అక్కరలేదుకానీ. నువ్వింకనుంచి జాగర్తగా ఉంటేచాలు. అదే నే నాశించే బహుమానం' అన్నాను

'కాదండి బాబయ్యా తమరిది తీసుకుంటేనేగాని నా మనసుకితృప్తి ఉండదండి' అంటూ సిగ్గుపడుతూ భయపడుతూ ఒక బంగారపు రిస్టువాచీ నా చేతికి యివ్వబోయాడు.

"నేను తెల్లబోయి నాకెందుకయ్యా ఈ గడియారం? ఇదెప్పుడు సంపాదించా" వన్నాను.

నాలుగు రోజులయిందండి. ఇందాకటికేసులో గడియారమిదేనండి అన్నాడు.

నేను నిర్ఘాంతపోయి 'ఇదెలా వచ్చింది నీకు' అన్నాను.

'నేను తీసినమాట వాస్తవమేనండి తమ దగ్గిర ఉద్యోగం ఎరుగుదునండి కాని ఈవేళ తమ వాదనవల్ల ఈ దొంగతనం చేయలేదని కోర్టువారికే కాకుండా నేను గూడా నమ్మవలసి వచ్చిందండి. ఆ సంతోషం పట్టలేక. ఇంకనీ దొంగసొమ్ము నా దగ్గిర ఉంచుకోలేక. తమకు బహుమతి చేస్తున్నాను. అన్నాడు.

"నేను ఒక్క నవ్వునవ్వి అయితే యిక్కడనుండి తిన్నగా పోలీసు వారి దగ్గిరకెళ్ళి దొంగిలింపబడిన గడియారం ప్లీడరుగారి దగ్గర దొరుకుతుం

దని చెపుతావాయేమిటి" అన్నాను.

అమ్మమ్మ ఎంతమాట సెలవిచారూ! ఛస్తే అలాటి పనిచేసే వాడిని కాదండి. నామాట నమ్మండి. బుద్ధివచ్చిందండి. ఇంకెప్పుడూ దొంగతనం కూడా చెయ్యనండి. అని అక్కడనుంచోకుండా పరుగందుకున్నాడు. నేను మరునాడు అవాచీ పోలీసువారికి రిజిష్టరుపోస్టులో పంపించాను.

మరొకరోజున వినోదంగా మారిన విషాదగాథ ఒకటి జరిగింది. ఒక సీనియరు వకీలు అపెలెట్ కోర్టులో ఒక ముఖ్యమైన కేసులో వాదించవలసి ఉన్నది. ఆరోజునే అక్కడికి ముప్ఫైమైళ్ళ దూరంలో ఉన్న మునసబు కోర్టులోకూడా కేసు నడపవలసి ఉన్నది. తనదగ్గిర జూనియర్‌గా పనిచేస్తున్న వకీలుని పిలిచి పరిస్థితి అంతా అతనికి చెప్పి కోర్టువారు ఈవేళ ఈకేసు విచారణకు తీసుకోరనే ధైర్యంనాకు. నేను ఫలానావూరికి వెళ్ళి, రెండుగంటలలకల్లా తిరిగివస్తాను. ఈ లోపున మనకర్మంకాలి మనకేసుని విచారణకు పిలిస్తే అత్యవసరమైన కేసులో నేను వెళ్ళానని మళ్ళీ రెండు గంటలకు వస్తాననీ అంతవరకూ వ్యవధి యిప్పించమని ప్రాధేయపూర్వకంగా కోరాననీ, కోర్టువారికి మనవిచెయ్యి అని ఆయన దారిన ఆయన వెళ్ళారు. తరువాత కోర్టువారు మూడునాలుగు కేసులు పిలిచినా ఏదో ఒక పార్టీ సిద్ధంగా లేని కారణంచే ఏ కేసూ విచారణకు రాలేదు. తప్పనిసరిగా జడ్జీగారు ఈ వూరికి వెళ్ళిన వకీలు కేసే విచారణ చేస్తామన్నారు ఆ యజమాని తరపున రెండుగంటలవరకూ వ్యవధియిమ్మని కోరాడు. ఆయన అగ్నిహోత్రుడై వ్యవధి యివ్వడానికి వీలులేదు. ఎంతమాత్రమూ వీలు లేదు. ఈ సీనియర్లంతా తమరేదో గొప్పవారమనీ, జడ్జీలందరూ తమకు హడలిపోతూ ఉంటారనీ అనుకుంటున్నారు కాబోలు. ఈక్షణంలో వారు కోర్టులోకి రాకపోతే నేను కేసు కొట్టివేయవలసి ఉంటుంది అని అంటున్న జడ్జీగారి వాక్యం పూర్తికాకుండానే ఒకగుమాస్తా పరుగుపరుగునవచ్చి ఒక కాగితం జడ్జీగారికి అందించాడు. వారు అది చూచుకుని నిర్ఘాంతపోయి 'ఓహ్' అని కుర్చీలో వెనక్కు జార్లబడి రెండునిమిషాలు మాటలేకుండా ఉండిపోయారు. ఇదేమిటా అని అక్కడున్న కొద్దిమందీ కంగారుపడ్డారు. అప్పటికి జడ్జీగారు తేరుకుని లేచి నిలబడి,

'మిత్రులారా! మీకొక ఘోరా విషాదవార్త వినిపించవలసి వచ్చినందుకు చాలా విచారిస్తున్నాను. ఈనాడు ఈకోర్టులో మీ ఎదుట వాదించ వలసిన వకీలుగారు ఆయనతో వెళ్ళిన మరొక వకీలుగారూ యిక్కడికి తొందరగా తిరిగి వస్తుండగా మార్గమధ్యమున కారు ప్రమా

దంలో నిహతులైనట్లు యిప్పుడే విషాదవార్త అందినది. పరమేశ్వరుడు వారి ఆత్మకు శాంతిని అనుగ్రహించుగాక వారివారి కుటుంబములకు మా సానుభూతి' అన్నారు.

అందరం నిశ్చేష్టులమయ్యాము. ఎవ్వరి నోటంటా మాటలేదు. ఈ వర్తమానం వారివారి యిళ్ళకు కూడా అప్పుడే అందచేయడమైనది. వారి తాలూకువారు, వివరములు తెలుసుకుందామని విచారిస్తూ కోర్టుకి పరుగెత్తుకు వచ్చారు. వచ్చినవారిని సముదాయించి కోర్టుకింకా వివరాలు ఏమీ అందలేదని తెలియగానే వర్తమానం చేస్తామని చెపుతుండగా ఈ చనిపోయిన వకీళ్ళు యిద్దరూ చెట్టాపట్టాలేసుకుని కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ చక్కా వచ్చారు. మాలో ఒకరిద్దరు.

'వీరప్పుడే దెయ్యాలెలా అయ్యారు' అని దెయ్యాలైనాకాని నల్లకోట్లూ గౌనులూ, తలగుడ్డలూ తప్పవా అని మీమాంస పడుతుండగా అక్కడ స్తంభించి పోయిన వాతావరణం చూచి ఈ చచ్చి వచ్చిన వకీళ్ళు తమ సరస సల్లాపాలు కట్టిపెట్టి,

'ఏమిటిసార్ ఏమైంది' అని కంగారుగా అక్కడ ఉన్నవాళ్ళ ముఖాలకేసి చూచి అడుగుతే ఎవరూ ఏమీ సమాధానం చెప్పలేక,

'ముందు సంగతి మీరు సజీవులో, నిర్జీవులో నిజం చెప్పండి అది తేలక మధ్య మేము చస్తున్నాం' అన్నారు. జడ్జీగారు వారికేమీ అర్థంకాక తెల్లపోయి చూస్తుంటే, జూనియర్ వకీలు జరిగిన గాధంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. వాళ్ళు అమాంతం కుర్చీలో కూలబడి కోర్టుహాలు మారుమ్రోగేటట్లు విరగబడినవ్వారు. ఇంతలో ఒక పోలీసు ఇనస్పెక్టరు పరుగు పరుగునవచ్చి జడ్జిగారికి ఒక సలాంకొట్టి నిలబడ్డాడు.

జడ్జిగారు 'మళ్ళీ ఏమొచ్చిందయ్యా నీవు వచ్చావు' అన్నారు. అతను కంగారుపడుతూ.

'ఒక పొరపాటు జరిగిందండి. ఈరోజు ఉదయం సుమారు పదకొండు గంటలవేళ ఈ వకీళ్ళిద్దరూ పైవూరు వెళ్ళడం చూచామండి. వీరు మళ్ళీ ముప్పావుగంటక్రితం కార్లో తిరిగి మద్రాసు వెళ్ళడంకూడా చూచామండి. వీరు వెళ్ళిన పావుగంటలో సమీప గ్రామంనుంచి కారు ప్రమాదం జరిగిందని ఇద్దరు నల్లకోట్ల వకీళ్ళు ఆ ప్రమాదంలో చనిపోయారనీ వర్తమానం వచ్చిందండి. పాపం మేము చూచిన వకీళ్ళే పరమపదించారని కోర్టుకి వర్తమానంచేసి మేము ప్రమాదం జరిగిన చోటికి పరుగెత్తామండి.

కోట్లు తొడుక్కున్న మనుష్యులేకాని ప్లీడర్లు ఎంతమాత్రం కాదని తెల్సుకుని మా పొరపాటు మన్నించమని చెప్పకోడానికి ఇక్కడికి హుటాహుటీ పరుగెత్తుకొచ్చానండి' అన్నాడు.

మేమంతా నవ్వుకున్నాము. ఈ చచ్చి బ్రతికిన వకీళ్ళు వారికోసం విచారిస్తున్న వారి సతీమణులను పరామర్శించడానికి పరుగెత్తారు.

ఇలా చెప్పవలెనంటే ఎన్నో సంఘటనలు నా స్వల్ప అనుభవంలో జ్ఞప్తికి వస్తుంటాయి.

# 20

కోర్టు వ్యవహారాలు చాలా సంతృప్తికరంగానే జరుగుతున్నాయి. చాలా ఉత్సాహంగానే ఉంటున్నది. తీరిక వున్నప్పుడల్లా సరస్వతికి పాఠాలు చెప్పడము పరీక్షకవసరమైనదిమట్టుకు జరుగుతూనే వున్నది. ఆమెకవసరమైన పుస్తకములు తెచ్చి అందిస్తూనే ఉన్నాను. శ్రద్ధగా చదువుతూనూ ఉన్నది. ఆమె చదువు పని ఆమెది. నా కోర్టుపనినాది. ఇలా ఒకరి పనులు ఒకరు అడ్డురాకుండా టైమ్‌టేబిల్ ప్రకారం కాలక్షేపం చేసుకుంటూ, సమానావసరములు వచ్చినప్పుడు మట్టుకు - మీరనుకుంటున్నదికాదు భోజనాదికములన్నమాట అప్పుడు మట్టుకు కలుసుకుంటూ ఏ పొరపొచ్చమూ లేకుండా సంసారం సాగించుకుంటూంటే, మా సరస్వతికి పరీక్షలు సమీపించడం ఆమె కాలమంతా చదువుకే వినియోగించుకోడం, భోజనాదికములు నేను తయారుచెయ్యడమో, లేక నాకూ తీరికలేనపుడు ఉభయులకూ హోటలునుంచి తెప్పించడమో - ఏమి జరుగుతున్నదో, వేళకి భోజనము ఎలా వస్తున్నదో, మొదలైన విమర్శలకు కూడా వ్యవధిలేకుండా, ఉక్కిరిబిక్కిరై పరీక్షలేలాగో - కాదు - చాలా సంతృప్తికరంగానే పూర్తిచేసుకుని, అలసిసొలసి, వాడివత్తయి, రెండుమూడు రోజులు వరుసగా నిద్రపోయింది సరస్వతి. ఏ శోషా రాకుండా మధ్యమధ్యను నేను ఫలహారపుంలో, పానీయములో కోర్టుపని మానుకొని ప్రక్కన కూర్చొని అందిస్తున్న సంగతి కూడా గమనించకుండా గడిపింది. ఎలాగైతేనేమి, నాలుగోరోజున చాలా తేలిగ్గా హాయిగాలేచి కోకిల్లా పాడుతూ, పువ్వులా నవ్వుతూ, ఉదయాన్నే ఫలహారం పళ్ళెంతో ప్రత్యక్షమై నాకు మేలుకొలుపులు పాడింది.

మరి రెండు మాసములకు పరీక్షలో ఉత్తీర్ణురాలైనట్టు వార్త తెలిసింది కాబోలు. నేనా సాయంకాలం యింటి వచ్చేసరికి గంధర్వకన్య

ఎవరో పాడుతున్నట్టు గానం వినిపించింది. ఏమిటి విశేషం అని తొందరగా వెళ్ళి తలుపుతట్టబోతుంటే ఎవరో అప్సరస నాట్యం చేస్తూ తలుపుతీసి నా కరగ్రహణం చేసి నన్నమాంతం కౌగలించుకుని, అప్పటికెలాగో తప్పించుకొని ఇదికలయో, వైష్ణవమాయో తెలుసుకుందామని కన్నెత్తి చూసేసరికి కలకలలాడుతూ, కిలకిల నవ్వుతూ.

'ఏమిటలా తెల్లబోయి చూస్తారు? నేనేనండీ. మీ సరస్వతిని మీ అర్ధాంగిని త్వరగా తయారుకండి. మిమ్మల్ని ఇవేళ అలా బీచికి తీసికెళ్ళ దలుచుకున్నాను. అప్పటికికాని నా ఆనందం పూర్తికాదు, ఇంకా అలా చూస్తారేమిటి? నేను మొదట తరగతిలో మొన్న పరీక్షలో ఉత్తీర్ణురాలనయ్యాను. గురుదక్షిణగా సమస్తోపచారాలూ మీకు చేయ ప్రయత్నిస్తూంటే, అలా గుడ్లప్పజెప్పి చూస్తారేం? ఈ మొగుడెక్కడ దొరికేడోయ్ బాబూ! అందుకనే పుణ్యం కొద్దీ పురుషుడన్నారు. రండి త్వరగా ఆ బట్టలు విడిచేయండి'

'ఏమిటీ' అంటుండగా వెనకాలే తరుముకు వచ్చింది సరస్వతి.

ఒకవారం పదిరోజులు నాకేపనీ తోచకుండా, ఊపిరి తీసుకోనివ్వకుండా ఊరంతా నన్ను తనవేలికి చుట్టుకుని తిరుగుతూనే ఉంది. అప్పటికి లాయరు చెప్పే ఆక్షేపణలు చెవిని పట్టించుకున్న జడ్జిలాగ, నా మాటలువిని నా పనులు ఉన్నను చూసుకోనిచ్చింది.

ఆనాటి సాయంకాలం యింటికి వచ్చేసరికి మరునాటి వుదయానికి గాంధీ - మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ- అనే రాజకీయవేత్త, మదరాసు రేపుదయం వస్తున్నాడనే వార్త పత్రికల్లో వచ్చేసింది. నేను ఎడెంబరోలో చదువుకుంటూండగానే ఆనాటి ప్రపంచ యుద్ధంలో, నిస్సహాయులై సిహతులవుతున్న వేలాది భారతీయ సైనికుల సహాయార్థం, ఈయన ప్రత్యేకంగా భారతీయ రెడ్‌క్రాస్ సంస్థ నేర్పాటు చెయ్యడం నేనెరుగుదును. ఇప్పుడు కొన్ని మాసములనుంచి జాతీయోద్యమం పెద్ద పెట్టున ఏర్పాటు చేస్తున్నట్టు పత్రికల్లో వార్తలు వస్తూనే ఉన్నాయి. నేను సరస్వతితో చెప్పకుండా ఉదయాన్నే అవసరములు తీర్చుకొని తొందరగా సెంట్రల్ స్టేషనుకువెళ్ళాను. స్టేషనులోనూ, బయటనూ జనం క్రిక్కిరిసిపోయి, ఇసుకేస్తే రాలకుండా నిలబడి ఉన్నారు. వీరందరినీ వరుసవారీగా నిలబెట్టడానికి స్వచ్ఛంద సేవకులు విశ్వప్రయత్నం చేస్తున్నారు. నేనెలాగో నెమ్మదిగా జనసమూహాన్ని తప్పించుకుని నేనూ ఒక నాయకుడనైనట్టు నెమ్మదిగా లోపలికి వెళ్ళాను. అక్కడ అనుకోకుండా ఎడింబరోలో ఒకసభలో నాచేత

పద్యాలు చదివించి అప్పటినుంచి నాకెంతో ఆప్తులైన దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు,

'అరే! పార్వతీశం, నువ్విక్కడ ఉన్నావటోయ్! చెప్పావుకావూ, తెలిసివుంటే మీ ఇంటికే వచ్చివుండేవాడినికదా! పోన్లె సమయానికి వచ్చావు. రా' అని నా రెక్కపట్టుకుని ముందుకు తీసుకువెళ్ళి, యిద్దరు ముగ్గురు కవులకూ, కొందరూ రాజకీయ వేత్తలకూ యిలా గబగబా ఎంతమందికో నన్ను పరిచయం చేశారు. వారు నన్నంత యిదిగా పరిచయం చేస్తుంటే, వాళ్ళందరూ నన్ను ఏ స్థాయిలో ఉంచాలో నిర్ణయించుకోలేక నేనూ ఏదో పెద్దవాడినయ్యే వుంటానని నిశ్చయం చేసుకుని, నన్నుకూడా గోపాల కృష్ణయ్యతోపాటు ముందుకే పోనిచ్చారు.

సుమారు తొమ్మిది గంటలకు పెద్దహోరుతో మెయిలు స్టేషనులోకి వచ్చింది. ఆ శబ్దం వినడంతోనే స్టేషనులోనూ, బయటా వేచివున్న సుమారు నూరువేలమంది, ఏక కంఠంతో, గాంధీకిజై. భరతమాతకు జై అనే ధ్వని మిన్నుముట్టేటట్టునినదించారు. లోపలున్నజనం యావన్మందీ యిన్ని వేలమందీ - రైలు మీద విరుచుకు పడవనన్నంత ఆదుర్దాతో ముందుకు తోసుకు వస్తూంటే, యీ సమూహాన్ని ఆపడానికి అక్కడ ఏర్పాటైన రక్షక భటులకూ స్వచ్ఛంద సేవకులకూ చచ్చినంత పనయింది. ఈ సమ్మర్దంలో, వచ్చిన అతిథి గాంధీగారికి ఏ ప్రమాదమూ జరగకుండా, వారి శిష్యాగ్రగణ్యులూ, ఆజానుబాహువులునూ అయిన షౌకతాలీ మహమ్మదాలీ అనే మహమ్మదీయ సోదరులు, గాంధీగారిని తమ చేతులమీద కూర్చోపెట్టుకుని, సుమారు వందమంది వీరిచుట్టూ ఉండి, మరికొంతమంది జనాన్ని తప్పించి మార్గం ఏర్పాటు చేయగా, నెమ్మదిగా మా ముందునుంచే వాని కారుదాకా తీసుకు వెళ్ళారు. గాంధీగారా జనాన్ని చూచి, దేవతా విగ్రహంలా మందహాసంతో ప్రజల నమస్కారాలను అందుకుంటున్నారు. వెనుకనున్న జనం వారిననుసరించి వీధిలోకి వెళ్ళిపోయారు. వారుకూర్చున్న కారు బయలుదేరి మందమందంగా సాగుతూ కనుమరుగయ్యేవరకూ ప్రజలు జయజయధ్వానాలు చేస్తూనే ఉన్నారు. ఆ కారుతోపాటు యింత మందీ కోలాహలంగా నడిచి వెడుతూనే ఉన్నారు. గోపాలకృష్ణయ్యా, నేనూ మరి ముగ్గురు కవి మిత్రులూ మట్టుకు స్టేషనులోనే పరధ్యానంగా అలాగే నిలబడిపోయాం. సుమారు అరగంటవరకూ, అంతకంతకూ క్రమేణా తగ్గుతున్న స్థాయిలో ఆ జయ శబ్దాలు మా చెవిని పడుతూ మరొక క్షణానికి మదరాసు పట్టణమంతా నిర్జనమైనంత నిశ్శబ్దం

మా చెవినిపడ్డది, అప్పటికి మేము మెలకువ తెచ్చుకుని బయటికి వచ్చాము.

"చూశావోయ్ పార్వతీశం? జనాదరణా, జనామోదం అంటే ఏమిటో చూశావా? ఎప్పటికేనా మనమూ అలా అవాలి" అన్నాడు.

'ఈ మనం బహువచనమా అంటుండగా, ఏకవచనమా' అన్నాను.

ఆయన నవ్వుతూ రెండూకాదు. ద్వివచనం అన్నారు.

ఇంకనేమీ మాటలు లేకుండానే పైకివచ్చి ఎవరిదారిన వారు విడిపోతుంటే,

గోపాలకృష్ణయ్యగారు 'పార్వతీశం! నువ్వు సాయంకాలానికి బీచ్‌కి వస్తావా? అక్కడ గాంధీగారి జాతీయ ప్రబోధము వినవచ్చును. కొంచెముః తొందరగావస్తే మనం కాస్సేపు మాట్లాడుకోవచ్చు. నీతో మాట్లాడాలి ఎలాగైనా' అన్నారు.

'సరే'నని నెమ్మదిగా నా బసకు చేరుకునేప్పటికి భోజనం వేళ దాటిపోయి నేనేమయ్యానా, ఎక్కడికి వెళ్ళానా, భోజనం వేళా, కోర్టు వేళాకూడా దాటిపోయిందే. అని మా ఆవిడ కంగారు పడుతూ వీధి గుమ్మంలో ఎదురు తెన్నులు చూస్తూ నిలబడ్డది. అప్పటికి నేనెంత ఆల స్యంగా వచ్చినదీ నాకర్థమైంది. నేనెప్పుడు హడావిడిగా రెండడుగులలో మా గుమ్మంలోకి పరుగెత్తి భయభ్రాంతురాలైన నా సరస్వతిని నడుముచుట్టూ చెయ్యివేసి పొదివిపట్టుకుని లోపలికి తీసుకువెళ్ళి జరిగినసంగతంతా వర్ణించి చెప్పాను.

సాంతంవిని 'అమ్మయ్య' అని ఒక నిట్టూర్పువిడిచి 'పోనీ నన్ను కూడా తీసుకువెడితే నేనూ ఆ మహనీయుణ్ణి చూచి ఉందునుకదా' అంది.

'ఇక చూడలేక పోతావా. అంత సమూహంలో నీవు అసలు నిలబడ లేకపోయేదానవు. పోనీ సాయంత్రం బీచిలో జరుగనున్న సభకు వెడదాము' అన్నాను. అప్పటికి స్తిమితపడి సంతోషించి నన్ను స్నానం చెయ్యమని తొందరచేసి తను వడ్డన ప్రయత్నం కోసం వంటయింట్లోకి వెళ్ళిపోయింది.

సాయంకాలం తొందరగా అన్ని ముగించుకుని, అయిదు గంటలయ్యేస రికి బీచికివెళ్ళాం. స్టేషనులో స్థలంకుశలం కనుక అంత సమూహం. అంత తొడతొక్కిడీ, పడ్డదికాని, యింత విశాలమైన సముద్రతీరంలో ఎంతమంది కూర్చున్నా పెద్ద సమూహంలా మనకంటికి ఆనదనుకుంటూ వచ్చేసరికి,

అక్కడ ఎటుచూచినా లక్షలాది మనుష్యులు తప్ప మరేమీ కంటికి ఆన లేదు. ఇంతజనాభా అసలు మదరాసులో వున్నారా అనిపించింది. ఎలాగో కూర్చున్నవారినీ, నుంచున్నవారినీ, నెమ్మదిగా తప్పించుకుని ముందు సాగు తున్న మమ్ములను, మా కోసమే వెతుకుతున్నట్టు గోపాలకృష్ణయ్యగారు ఎలాగో దూరాన్నుంచి చూచి, తను మా కెదురొచ్చి,

'రావోయ్ పార్వతీశం, నీకోసమే చూస్తున్నాను' అంటూ నాభుజం మీద చెయ్యివేసి హఠాత్తుగా నన్ను అంటిపెట్టుకుని అనుసరిస్తున్న నా భార్యను చూచి,

ఈ మూకలోకి పాపం ఈ అమ్మాయిని కూడా తీసుకొచ్చావే మిటి? నీ భార్యేనా? అదృష్టవంతుడవు' అన్నాడు నవ్వుతూ.

ఇంతలో నా భార్య నమస్కారాన్ని అందుకుని, ఆశీర్వదించి, మమ్ము లను నెమ్మదిగా సమూహం నుంచి కొంచెం దూరంగా నీటి ఒడ్డుకి తీసుకు వెళ్ళాడు. 'కూర్చోండయ్యా ఇంకా సభకు చాలా వ్యవధి ఉన్నది.' అని, తను ముందుకూర్చున్నాడు. మేమూ అతని కెదురుగా కూర్చున్నాము. అక్కడ చాలామంది ఉన్నా ఆ సమూహంలోనే మాకు ఏకాంతము దొరి కినట్లయింది. చాలాసేపు గోపాలకృష్ణయ్య గంభీరముద్రతో ప్రస్తుత రాజ కీయ పరిస్థితులను గురించీ, గాంధిజాతీయోద్యమాన్ని గురించీ, భవిష్యత్ పరిణామాన్ని గురించీ ఎంతోసేపు మాట్లాడి, 'మనమంతా కలిసి పరస్పర సహాయముతో ఈ ఉద్యమాన్ని కొనసాగించాలి సుమా. ఎన్నెన్నో బాధ లుపడాలి, కష్టనిష్టూరాలకి ఓర్వాలి. ఇది మనకు అగ్ని పరీక్ష. అయినా మనం వెనకాడకూడదు. మనమందరమూ ఏకమై, ఒక్క మనిషిలా నిల బడాలి. ఆంధ్రులంటే ఏమిటో, కార్యదీక్షా, శౌర్యపరాక్రమాదులు ఎటు వంటివో, అవి ఈనాటికీ సమసిపోలేదనీ, మాసిపోలేదనీ, మనం ఋజువు చేయాలి సుమా' అని అంటుండగనే దూరాన్నుంచి గాంధీగారు సభకు వస్తున్న గందరగోళం వినిపించింది. మా సంభాషణ అంతటితో ముగించి, తనతోపాటు గోపాలకృష్ణయ్యగారు మమ్ములనుకూడా నెమ్మదిగాముందుకు ఉపన్యాస వేదికకు బాగా సమీపంగా తీసుకువెళ్ళి, అందరూ మమ్మల్ని 'వీరెవరా' అని ఆశ్చర్యంతో చూస్తుండగా సుఖాసీనులను చేశాడు.

ఇంకను ఆనాటి ఉపన్యాసం జన్మ జన్మలకూ మరపురానిది. ఇన్ని వేలు లేక లక్షలమంది జనంలోనూ, ఉచ్ఛ్వాస, నిశ్వాసముల శబ్దమూ వెనుకను సముద్రపుఘోషాతప్ప. మరే శబ్దమూ వినబడలేదు. కంగున కంచుగంటలా గాంధిగారి గాత్రం ఒక్కటే. ఏ ఒక్క అక్షరమూ లోపించ

కుండా శ్రోతల కందరికీ అంతసేపూ వినపడ్డది. సభాసమ్మోహనమంటే ఏమిటో ఆనాడు తెలిసింది. ఆయన ఉపన్యాసము అయిపోయిందనే భావమే అక్కడున్న ఏ ఒక్కరికీ కలుగలేదు. అప్పటికందరికీ ఒక్కసారి మెలకువ వచ్చినట్లు. అందరూ ఏకమై ఏక కంఠంతో జయజయధ్వానాలు, కరతాళ ధ్వనులు రెండు మూడు నిమిషాలవరకూ పరవశులై చేశారు. ఈ శబ్దంలో సముద్రంతన ఘోషకూడా మరచి ఇదివింటూ కూర్చున్నదా అనించింది. ఈ చప్పట్లు చల్లారే లోపున జనమంతా ఈ సందడిలో ఉండగానే గాంధీగారిని నెమ్మదిగా అవతలికి తీసుకువెళ్లి కారెక్కించారు. అప్పటికి తెలివి తెచ్చుకుని జనం చప్పట్లు మాని పెద్ద పెద్ద గొంతుకలతో 'అడడడా' అని 'అబ్బబా' అని 'ఏమి ఉపన్యాసమనీ' 'ఏప్పేడేపేసేనార్' అనే ఆశ్చర్యార్థకాలతో సముద్ర తీరమంతా గృహోన్ముఖమయింది.

గృహోన్ముఖమయిన జనసమ్మర్దం కొంత తగ్గేవరకూ మేముభయ లమూ అలాగే నిలబడిపోయాము. ఇంతలో మమ్మల్ని వెతుక్కుంటూ గోపాలకృష్ణయ్యగారు. 'ఇక్కడున్నారా మీరు' అంటూ మాదగ్గిరికివచ్చారు.

"పార్వతీశంఎలావుంది. మనకర్తవ్యమేమిటో తేల్చేశారు. గాంధిగారు మనం ఆలోచించడానికి, నిర్ణయించడానికి ఏమీలేదు. టెన్నిసన్ కవివాక్కు "Their's not to reason why theirs but to do and die" అనే హెచ్చరిక జ్ఞాపకం ఉన్నదా! మనలనూ ఆ స్థితిలో పడేశాడే గాంధీ దేవాంతకుడు. ఇంకమనం నడుంకట్టి సర్వసంగ పరిత్యాగం చేసి, అస్త్రధారణచేసి, ఆయ న్ననుసరించవలసిందే. వెళ్ళిరండి. రేపు మళ్ళీ ఒక్కసారి మనం యిక్కడ కలుసుకొని మాట్లాడుకుందాం' అని నా సమాధానం ఏమీ అవసరం లేదన్నట్లు తల పైకెత్తి ఛాతీ విరిచి ఓ చెయ్యి వీపు వెనుక ఉంచుకుని కుడిచేత్తో కర్ర ఝాడిస్తూ, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

మేమిద్దరమూ ఒకరి ముఖం ఒకరు చూసుకుంటూ, యింటికి చేరటా నికి ఏ వాహనమూ దొరక్క నెమ్మదిగాకాలికిబుద్ధిచెప్పాము. ఇల్లుచేరేవరకూ ఎప్పుడూ కలకలలాడుతూ, కిలకిలనవ్వుతూ, గణగణలాడుతూ మాట్లాడే సరస్వతి ఎందుచేతనో ఉలుకు, పలుకు లేకుండా నాచెయ్యి పట్టుకుని, నా కూడా నడిచివచ్చి మాయింటి గుమ్మం ఎక్కి తలుపు తీసుకునేవరకూ, ఆ తరువాతనూ కూడా ఆమె సంభాషణా ప్రయత్నమేమీ చెయ్యలేదు. ఈ మౌనం నాకు కొంచెం యిబ్బందనిపించింది.

'ఏం మౌన ముద్రాలంకారా! పొరపాటు అలంకారా, కలంకారా' అన్నాను.

'నేనేమీ అలంకారినీకాదు, కలంకారినీకాదు. నా ముఖంలో ఉండేది అప్పుడు వికసించిన పద్మంలోని అరుణారుణిమ, నల్లకలువలోని నీలిమ మేలిమి బంగారంతోని పసిమి, తెలిసిందాండి. ఇదేమీ కలంకారీ అద్దకం సరుకు కాదు. తెలిసిందాండే' అన్నది.

'నిజంగా! చెప్పావుకావూ, ఏది సరిగ్గా చూడనీ' అన్నాను. రెండు భుజాలూ పట్టుకుని నా కెదురుగుండా తిప్పుకుని,

ఆ సాయంకాలం, విన్న గోపాలకృష్ణయ్యగారి సూచనను జ్ఞప్తికి తెచ్చు కుని నిన్న సభ జరిగిన చోటికి వెళ్ళాను. అప్పటికే ఆయన నాకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. నన్ను దూరాన్నుంచి చూసి ఎంతో సంతో షంతో నా కెదురొచ్చి నా భుజంమీద చెయ్యివేసి నీటిదరికి తీసుకువెళ్ళి కూర్చోపెట్టాడు. మేము చాలాసేపు భారత భవిష్యత్తుకు సంబంధించిన అనే విషయాలు కొన్ని గంటలు చర్చించుకుని, అదివరకు ఉన్న హోమ్ రూలు, స్వరాజ్య, కాంగ్రెసు మొదలైన వాటిని గురించి, గాంధీ పథమే మనకు శరణ్యమనే నిశ్చయానికి వచ్చాము. అప్పటికే చాలా ఆలస్యమైం దనీ యిద్దరం లేచాము గృహోన్ముఖులమయ్యాము మా యింటికి రమ్మని చాలా బలవంతం చేశాను. ఆయన అందుకు అంగీకరించలేదు. ఈ మాటు వచ్చినప్పుడు తప్పక వస్తానని అప్పటికే తప్పించుకున్నారు.

'వస్తానోయ్, ఇంక నువ్వు నీ వ్యవహారాలన్నీ చక్కపెట్టుకుని, సాధ్య మైనంత త్వరలో రంగంలోకి దిగాలి తప్పదు తప్పదు' అని వెళ్ళిపోయారు.

నేను నెమ్మదిగా అడుగులు లెక్కపెట్టుకుంటూ యోచనా నిమగ్ను డనై యింటికి చేరుకున్నాను. నా భార్య నా రాకకు ఎదురుచూస్తూ కూర్చున్నది. నా గాంభీర్య మౌనం చూచి కొంచెం కంగారుపడింది కూడాను. తొందరగా ఎన్నేమీ పలకరించలేదు. నేను పాదప్రక్షాళనాదికము కానిచ్చుకుని బట్టలు మార్చుకునేసరికి 'రండి భోంచేద్దాం' అనే ఆహ్వానం చెవిని పడగానే నేనూ మౌనం మరచి మామూలు మనిషి నయ్యాను.

మా భోజనములూ సవరణలు తొందరగా ముగించుకుని, మామూలు చిల్లర పాటలు, చిలిపిచేష్టలు కట్టిపెట్టి నిన్నటి గాంధీగారు చెప్పినది కొంత చర్చించుకుని నేడు గోపాలకృష్ణయ్య విశదీకరించినది విమర్శ చేసు కుంటూ, ఎంతో పెద్ద రాజకీయవేత్తలలా మాట్లాడుకుని, ఏమంటావు? అని 'మనం చేయవలసినది ఏమిటు'ని సరస్వతి నడిగాను.

'ఏమిటని మీరు నన్ను అడగడమేమిటి? మీకు అసలు సందేహం ఎందుకు కలిగింది? నా కొక్కటే మార్గం. అదే రాజమార్గం, గాంధిసూచించిన మార్గమే ఆ రాజమార్గం. మనకు ఆలోచించడానికి ఏమీలేదు. అన్నీ ఆయనే ఆలోచించి పెట్టాడు మనకి. ఇంక మనం ఆలోచించడం కాదు అనుసరించడమే' అన్నది ఎంతో ధైర్యంగా ఏ నదురూ, బెదురూ, సంకోచమూ లేకుండా.



'సరే అయితే. ఇంక నా ప్రయత్నం మీదనే ఉందాం'అని నేను నెమ్మదిగా మంచంమీద ఒరిగాను. ఆపతివ్రత నన్ను అనుసరించింది.

# 21

కొన్ని మాసములు వూపిరి ఆడకుండా కోర్టు వ్యవహారాలు కూడా సరిగా చూసుకోకుండా శివమెత్తినట్లు తిరుగుతూ, పల్లెల్లోనూ, పట్టణాల లోనూ సభలలో మనదేశాన్ని గురించి, ఒకనాటి ఔన్నత్యమూ, నేటి దైన్యమూ దీనికి కారణభూతమైన పరిపాలనా పద్ధతులూ మొదలైనవి ఏవేవో, ప్రజానీకానికి కనువిప్పు కలిగేటట్లు ప్రబోధం చేస్తూ, తిరగడ మారంభించాను, నానాటికి ప్రచారం ముమ్మరంగాసాగించి. ఎసం ఆ బాలవృద్ధులూ తండతండాలుగా ఈ సభలకు రాసాగారు. ఎంతో ఉత్సాహంతోవినడమూ ప్రారంభించారు వారుచూపే శ్రద్ధాసక్తులు మమ్మల్ను మరింత ప్రోత్సాహపరచసాగినవి. నేను యింటిపనీ, కోర్టుపనే కాకుండా, నా భ ‹‹ కూడా నిర్లక్ష్యం చేసి తిరుగుతున్నాననే భావం నాకు తోచనే

లేదు. ఒకనాడు హఠాత్తుగా నేనొక సభలో ఉపన్యసిస్తూ తలనొప్పి, జ్వరం వచ్చినట్టు ఉండి యింటికి వచ్చేసరికి సరస్వతి యింటివద్దలేదు. తలుపు తాళం వేసుకొని నేను రాత్రి ఏ పదిగంటలకో కాని రాననుకొని తాళం చెవి కూడా తీసుకుని వెళ్ళి పోయింది. నాకేమీ తోచక హోటలులో కాఫీ తీసుకుని దగ్గిరలో వున్న మా స్నేహితుల యింటికివెళ్ళి, తొమ్మిది గంటలవరకూ కాలక్షేపంచేసి, నెమ్మదిగా నా బసకు చేరుకున్నాను. వచ్చి చూసేసరికి అప్పటికీ తాళం తాళంగానే ఉండిపోయింది. మళ్ళీ ఎక్కడికీ వెళ్లె ఓపికలేక అక్కడేకూర్చున్నాను. ఒక అరగంటలో హడావుడిగాస రస్వతివచ్చింది. అరుగుమీదనన్ను చూచి నిర్ఘాంతపోయి గబుక్కున నా దగ్గరకు ఒక్క అంగలో వచ్చి నా రెండు భుజాలమీద తన రెండు చేతులూ వేసి నా ముఖంకేసి చూస్తూ.

"ఏమండీ ఇదేమిటి, ఎంతసేపైంది మీరు వచ్చి. అలా ఉన్నారేమి?" అని నా బుగ్గలమీద వంటిమీదా చెయ్యివేసి "అయ్యో జ్వరం తగిలినట్టుందే" అన్నది.

"సరేలే! ముందు తలుపుతియ్యి" అన్నాను.

"అయ్యో నా మందమతి" అనుకుని గబుక్కున తలుపుతీసి, దీపారాధన చేసి, మళ్ళీ వాకిట్లోకి వచ్చి నన్ను చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకువెళ్లి మంచంమీద పడుకోబెట్టి,

"మీరు పడుకోండి క్షణంలో కాఫీ తీసుకు వస్తాను." అని లోపలికి పరుగెత్తింది.

నేను వద్దనినడానికికూడా ఓపికలేక మాట్లాడకుండాపడుకున్నాను. అన్నట్లుగానే అయిదు నిమిషాల్లో ఘుమ ఘుమలాడుతున్న వేడి కాఫీ తీసుకువచ్చి నాకందించింది. అది నెమ్మదిగా పూర్తిచేసే వరకూ ఏమీ మాట్లాడకుండా నామీద చెయ్యి వేసి నా ముఖం కేసి ఆదుర్దాగా చూస్తూ కూర్చుంది. నేను కాఫీ పూర్తిగా తీసుకోగానే నా చేతిలో పాత్ర అందుకుని,

'ఎంత పొరపాటయిందండీ. ఎంతసేపటి నుంచి కూర్చుని బాధపడుతున్నారో పాపం. మీరు పదిగంటలవరకు రారుకదా అనే ధీమాతో ఆలస్యంగా వచ్చాను" అన్నది, తలవంచుకుని ఏదో నేరం చేసినట్టు.

"పోనీలే ఫరవాలేదు కానీ, ఇంతకు నువ్వు ఎక్కడికి వెళ్ళినట్లు. ఆ మాట చెప్పావు కావేం" అన్నాను. వంచిన తల ఎత్తకుండానే కొంచెం చిరునవ్వు తెచ్చుకుని.

"మీరు చేస్తున్న పనే నేనూ చేస్తున్నాను." అన్నది. నేను ఉలిక్కిపడి సరస్వతి రెండు భుజాలు పట్టుకుని,

"ఏమిటీ" అన్నాను కంగారుగా.

"మరేంలేదు. అంతలా గాభరాపడతారెందుకు? ముందు పడుకోండి. చెప్తాను" అన్నది. తను అవతలకి జరిగి నన్ను పడుకోబెడుతూ.

"సరే అయితే ఇంక జోలపాట ప్రారంభించు" అన్నాను.

"అలాగే పాడతాను కాని మీరు నిద్రపోగూడదు. మరేమో తొందరపడగూడదు"

"మీరు ప్రచారం ప్రారంభించినకొద్దిరోజులకే ఇక్కడ మన మహిళాసంఘంవారు కొందరు నా దగ్గిరకు వచ్చి మహిళలుకూడా వెనకదెగడి ఉండిపోకుండా పురుషులతో పాటు ముందుకువచ్చి ప్రచార ప్రబోధనలుసాగిస్తూ స్త్రీ లోకాన్ని కూడా ఈ నిద్రాణ స్థితిలో నుంచి మేల్కొలిపి వారు కూడా రాజకీయ రంగంలో, ఈ స్వరాజ్య సమరంలో, పురుషులతోపాటు కృషిచేస్తేనే తప్ప మన ఆదర్శం అందుకోవడం సాధ్యంకాదని, అందరికీ నచ్చచెప్పి, స్త్రీ లోకాన్ని కార్యరంగంలోకి తీసుకురావలసిన బాధ్యతమనమీద యెంతేనా ఉన్నది, మీరు చదువుకున్న వారూ పట్టభద్రులు కూడాను. మీ బోంట్ల సహాయం మాకెంతేనా అవసరం. మీరు మాతో రావాలని బలవంతంచేశారు. మీ అనుమతి తీసుకోడానికి గూడా నాకు వ్యవధి యివ్వలేదు. అందుచేతను నాటి నుంచి వాళ్ళతోపాటు నేను వూరూరూ తిరుగుతూ ప్రచారం సాగిస్తున్నాను. అన్నది.

నేను నిశ్చేష్టుడనై సమాధానమేమీ చెప్పలేక అలాగే తెల్లబోయి చూస్తూ కూర్చున్నాను.

"ఏమిటలా తెల్లబోయి చూస్తారు? కొంపతీసి నేనుచేసినపని బాగా లేదంటారా! తప్పంటారా? త్వరగా ఏదో ఒకటి అనండి మీ మౌనం చాలా యిబ్బందిగా వున్నది. చెప్పండి నేను తప్పచేస్తున్నా నంటారా? మీ అర్ధాంగిని కదా యిద్దరిదీ చెరోదారీ అయితే ఏం బాగుంటుంది చెప్పండి, మీరుకూడా ఇలా సంకుచితంగా ఆలోచిస్తారనుకోలేదు. ఏమంటారు? ఏమిటి మీ ఉద్దేశ్యం" అన్నది నాకేసి చూస్తూ.

"ఓయి వెర్రీ! ఇప్పుడా ఉపన్యాసమంతా నాకు ఒప్పచెప్పకు. వినే ఓపికలేదు. నీవీపని చెయ్యడం తప్పని నేనెంతమాత్రం అనడంలేదు. నా

సరస్వతి యింత చురుకైనదా, ఇంత పెద్దదైనదా అనే సంతోషం. నా ఆనందానికి అవధిలేదనుకో" అన్నాను. అమాంతం తనను దగ్గరకు తీసుకుని....

'ఉండండి మీకు జ్వరం వచ్చిందికదూ. మాత్ర ఏదైనా తీసుకువస్తాను, అంటూ గబుక్కున మంచం మీదనుంచి కిందకి ఉరికింది. నేను నవ్వుకుంటూ వెల్లకిలా పడిపోయాను.

మరునాడు లేచేసరికి జ్వరం తగ్గిందికానీ, నీరసం చాలా ఎక్కువగా ఉండి బయటికెక్కడికీ వెళ్ళలేదు. కోర్టుపని చూడబుద్ధికూడా పుట్టలేదు. వంటపని చూసుకోవలెనని తొందరలోనూ, నాకేమి కావలెనో, ఎలా ఉన్నదో అనే ఆదుర్దాలోనూ సరస్వతి వంటయిల్లూ నా గది మధ్యను తారట్లాడుతోంది. ఇంతలో కొంతసేపటికి నాకు నిద్రకూడా పట్టినది. సుమారు పదకొండు గంటలవరకూ నిద్రపోయినట్టున్నాను.

అప్పుడు మెలకువ వచ్చి నా భార్య వద్దంటున్నా, స్నానం చేసి భోజనానికి పెడుతుండగా టపావచ్చింది ఇంటివద్దనుంచి మానాన్న వుత్తరం వ్రాశాడు. ఆయనకెలా తెలిసెంతో ఏమోగాని యిక్కడ నా. దినచర్యంతా తెలుసుకున్నట్టున్నారు. అందుకని గడుసుతనంగా "మనము పరస్పరం యింతదూరంగా ఉండడం బాగాలేదని ఆ ప్రాక్టీసు నర్సాపురంలోగాని, భీమవరంలోగాని పెట్టుకుంటే బాగుంటుందనీ, ప్రయత్నం వెంటనే చేయవలసెందనీ" ఉత్తరం సారాంశం. ఆ మధ్యాహ్నం మేముభయులమూ నాన్నగారి ఉత్తరం రెండుమూడుసార్లు చదువుకుని కర్తవ్యమేమిటని మేముభయులమూ విడివిడిగానూ, జాయింటుగానూ ఆలోచించుకుని సాయంకాలం వరకూ తర్జన భర్జనలు చేసుకుంటూ కూర్చున్నాము. కొంతసేపయ్యేసరికి,

"ఇప్పుడున్నపరిస్థితులలో మనము మనముగా చేపట్టినకార్యక్రమం సాగించవలెనంటే మీ వృత్తికీ, దానికీ లంగరు అందేటట్టు కనిపించడంలేదు. అందుకని మనం మంచిరోజుచూసి నర్సాపురంలోనో, భీమవరం లోనో మన కార్య క్రమానికి కేంద్రమేర్పాటుచేసుకుని, అక్కడనుంచే మన పని కొనసాగించుకోవచ్చు. ఈ ప్రచారమంతా మన ప్రాంతాల్లోనే ఎక్కువ అవసరమేమో అనిపిస్తుంది. అలాచేస్తే మన స్వేచ్ఛకు కొంతభంగం కలిగినా మీ నాన్నగారికి కొంచెం తృప్తిగానూ ఉంటుంది. మన ప్రచారఫలితమూ ఎక్కువ ఉండవచ్చుననిపిస్తోంది" అన్నది. అంతవరకూ నేను పైకితేలకపోయినా, నేనూ ఆ ఉద్దేశంతోనే వున్నాను. ఇక మా ఉభయుల అభిప్రాయాలు ఏకమైనప్పుడు 'జై పరమేశ్వరా' అని యిక్కడ నుంచి సంచి

రోజుచూసి జండాఎత్తడమే అవశ్యకర్తవ్యమని నిశ్చయించేసుకున్నాము.

ఇక్కడ కార్యకలాపాలూ, కోర్టువ్యవహారాలూ, అన్నీ సర్దుబాటుచేసి నెలతిరక్కుండా మాయింటికి చేరుకున్నాము. మా అమ్మా నాన్నా చాలా సంతోషించారు మళ్లీ కొన్నాళ్ళు ఒకచిన్న రౌండుటేబుల్ సమావేశంజరిపిముందు భీమవరంలోనే బల్ల కట్టడానికి నిశ్చయించాము. ఆ నిశ్చయంతో ఒకనాటి ప్రభాతవేళ భీమవరంచేరి మా అత్తగారింటి ముందు మాఆగమనం తెలుపకుండా ప్రత్యక్షమయ్యేసరికి మా అత్తమామలిద్దరూ సంతోషాశ్చర్యములతో స్వాగతం చెప్పారు. రెండు మూడురోజులు విశ్రాంతి అయిన తరువాతను మా మామగారు ఒకరోజున మదరాసు జీవితం, అక్కడ నా ప్రాక్టీసు వగైరా విషయాలూ ఒకటొకటే అడిగించుకోవడమెందుకని నేనే పూస గ్రుచ్చినట్టు జరిగినదంతా చెప్పి, యిప్పుడిక్కడికి వచ్చిన కారణం కూడా నిర్మొహమాటంగా మనవి చేసుకున్నాను. వారు చాలా సంతోషించారు. అక్కడికి వచ్చినందుకే కాదు మదరాసులో మేము ప్రారంభించిన ప్రచార ప్రబోధ కార్యక్రమం కూడా సవ్యమైనదేనని సంతసించారు. వారి ఆమోదం వినగానే నాకూ పునరుత్సాహము కలిగింది. మరి రెండురోజులకు వారుకూడా ప్రాక్టీసు వదలుకోకుండానే యిటువంటి కార్యక్రమంలో నిమగ్నులై యున్నారని తెలుసుకు చాలా సంతోషించాను.

నేనిక్కడ వేరే యింట్లో కాపురం పెడదామని అనుకుంటుంటే మా మామగారు సుతరామూ పనికిరాదనీ, యిక్కడనే ఉండి తీరవలెననీ బలవంతం చేశారు. అందుకని తప్పనిసరియై మామగారి బోర్డు ప్రక్కనే నేనూ బోర్డుకట్టి ఇల్లరికం ప్రారంభించాను. అనుకోకుండా నాలుగురోజులయ్యేసరికి మా మామగారు కొంచెం యించుమించుగా ప్రాక్టీసు విరమించుకున్నట్టేనని అర్థమైంది. ఎటొచ్చీ మరోబల్ల అక్కడ కనబడడంతోటే పూర్వపు ఖాతాదారులు మా మామగారిని వదలుకోలేక నాచేతనేనా తమపని చేయించు కుందామని ఆశపడ్డారు. మా మామగారు వాళ్ళతో ఏకీభవించి ఆ వ్యవహారములన్నీ నన్నే చూడమని నాకు ఒప్పచెప్పారు. దానితో మళ్ళీ ఈ తమలాటముల్లో తగులుకొనక తప్పిందికాదు. అక్కడికీ సాధ్యమైనంత వరకూ తెరిపి చేసుకుని ప్రచార కార్యక్రమంలో కూడా పాల్గొంటూనే ఉన్నాను. ఇక సరస్వతి సర్వస్వతంత్రురాలై తన కాలమంతా తండ్రితోపాటూ, మహిళా సమాజంతోపాటూ ప్రచారంలోనే వినియోగించ నారంభించింది.

ప్రచారం నానాటికీ ముమ్మరం కాసాగింది. చూస్తూనుకాదీ అతా.

శ్చర్యకరంగా వుంది. పల్లెల్లోనూ, పట్టణాలలోనూ కూడా వాళ్ళకేం తెలిసిందో, ఏ ఉద్రేకం కలిగిందో, ఏ పరివర్తన వచ్చిందో తెలియదు. కానీ వేలాది లక్షలాది జనం ఈ ఉద్యమంలోకి ఏ ఆశలూ, కోరికలూ లేకుండా ఏ పరిణామాలూ, ఫలితాలు వస్తాయో తెలియకుండా, ఉన్నవాళ్ళు ఉన్నదంతా వదులుకుని లేనివాళ్ళు ఇంకా లేమి అనుభవించడానికి కూడా సంకోచించకుండా, యిదివరకు 'జై పరమేశ్వరా' అనేవాళ్ళు కూడా ఆ మాటేమర్చిపోయినట్టు 'గాంధీకి జై' అనే నినాదంతో ముందుకువచ్చి పడుతుంటే ఎవ్వరూ, ఎన్నడూ వూహించని ఈ సంచలనం చూస్తూంటే, యావద్భారతం సంభ్రమాశ్చర్య చకితయై పోయింది. ఇక అధికారుల గుండెల్లో రైళ్ళు పరుగు లెత్తడం అరంభించినాయి. వారందరికీ దడా, ఒణుకు పుట్టుకొచ్చాయి. ఇది ఎంతవరకు తీసుకు వెడుతుందో వూహించడానికి కూడా భయపడి యింక నెలాగైనా మొదట్లోనే త్రుంచివెయ్యడం మంచిదని నిశ్చయించుకుని ఆ ప్రయత్నం ప్రారంభించేసరికి వీరు మొదలనుకున్నది అప్పుడే మానుగా తయారయిందని తెలుసుకుని, దండోపాయమే ప్రారంభించవలసి వచ్చింది. దానితో ప్రజలు మరీ రెచ్చిపోయి కోపోద్రిక్తులు కాజొచ్చారు. అప్పుడే గాంధీగారు చెప్పిన.

'కోపానికి విరుగుడు కోపంకాదు శాంతమనీ, అధికారులు యెంత దౌర్జన్యం చేసినా, ఎంతపశుబలం ప్రయోగించినా, ప్రజలుమట్టుకు ప్రశాంతంగానే ఉండాలి. దెబ్బకు దెబ్బతీసే మనస్తత్వం పెంచుకోకూడదు. మనం ఎన్ని దెబ్బలు తిన్నా, ఎన్ని ప్రాణములు మనవి పోయినా, శాంతం విడనాడకూడదు' అనే ప్రబోధం అద్భుతంగా పనిచేసింది.

ఇన్నిరకాల, ఇన్నికోట్ల జనంలో ఏ ఒక్కరూ తొందరపడి ఏ దౌర్జన్యానికి దిగకుండా, యెంతెంత వుద్రిక్త పరిస్థితులు వచ్చినా, ఏ తొందరపాటూ లేకుండానే ఎంతో ఓరిమితో, ఏ విద్వేషమూ పెంచుకోకుండా సంచరిస్తున్నారో, చూచినవాళ్ళము మేమే ఎంతో ఆశ్చర్యపడ్డాము. సాటిమనిషి, ఒక్కని మాటలకు యింత మహాశక్తి ఎక్కడనుంచి ఎలా వచ్చిందా అని ఆశ్చర్యపోయాం. ఇంతశక్తి సంపన్నుడైన గాంధీ ఆయన లేవదీసిన ఉద్యమం జయప్రదంకాక తప్పదని ఆయన చెప్పినదంతా అక్షరాలా ఆచరణలో పెట్టగలుగుతే, ఆయన చెప్పిన సంవత్సర కాలంలోనే స్వరాజ్యం వచ్చి తీరుతుంది అనే మనో నిశ్చయం మాలో ప్రతి ఒక్కళ్ళకీ కలిగింది.

ఉద్యమం ప్రారంభించిన కొలది మాసములకే ఈ ఉద్యమంలో చేరినా చేరకపోయినా; యావద్భారతంలోనూ అధికారులమీదా, వారు చెలాయించే

అధికారం మీదా రెండు మూడు శతాబ్దములనుంచీ వుంటున్న గౌరవమూ, భయమూ క్షణంలో మాయమయిపోయినాయి. గాంధీగారు ప్రారంభించిన దౌర్జన్యరహిత సంగ్రామంలో సాధించిన తొలి విజయం ఇది అని ఉభయ పక్షాలవాంకీ నమ్మిక కలిగింది. ఎంత నిర్లక్ష్యమూ, అధికారులమీద అగౌరవమూ కాకపోతే చాలాసామాన్యురాలు అయిన దువ్వూరి సుబ్బమ్మలాంటి అసహాయురాలైన ఒక వితంతువు, సూర్యుడస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూలద్రోయడానికి కుట్రపన్నిందని రక్షకభటులు ఆమెను తీసుకువచ్చి కోర్టులో నిలబెడితే, జనంతో క్రిక్కిరిసిఉన్న కోర్టులో రక్షకభటులు చుట్టుముట్టి వుండగా, జిల్లా మేజిస్ట్రేటు ఎదుట ఎలా తలపైనున్న ముసుగు తీసి తన బోడితల ప్రదర్శించి కలెక్టరు నుద్దేశించి 'మన యిద్దరి తలలూ బోడులే, నీవేదో దుస్తులు ధరించి ఆ ఉన్నతాసనంమీద కూర్చున్నంత మాత్రాన నాకన్న ఎక్కువ శక్తివంతుడవు కావు నీవు. నన్నేమీచేయలేవు' అనీ ధీమాగా అనగలుగుతుందా? ఆమాటలువిన్న జనం ఒక్కమాటు గుండె ఝల్లుమనగా గగుర్పాటుతో ఆనంద బాష్పాలతో కోర్టు దద్దరిల్లేటట్లు 'గాంధీకి జై, దువ్వూరి సుబ్బమ్మకు జై పరాయి ప్రభుత్వం నశించాలి' అనే నినాదాలు చేశారు. అటువంటి దృశ్యాలు వేలాది ప్రదర్శితమయినాయి. మా నేత్రములూ, గుండెలు ఆర్ద్రమయినాయి. అధికారులు గుండెలు దిగజారినాయి. ఇటువంటి దృశ్యాలు ప్రతి నిత్యమూ ప్రతి వూళ్ళోనూ అసంఖ్యాకంగా జరుగుతుంటే అధికారులకు మతులుపోయి, కోపోద్రిక్తులయి అర్థంలేని దౌర్జన్య చర్యలు ప్రారంభించారు. వందలాది జనాన్ని రోజూ అరెస్టు చేస్తూండడం, కోర్టులో వారందరూ శిక్షార్హులని నిర్ణయించి జైళ్ళకు పంపించడం. వాళ్ళనక్కడ నానా హింసలూ పెట్టడం అక్కడవాళ్ళు తిరుగుబాటులాంటి సత్యాగ్రహం చేయడం, యిటువంటి సంఘటనలవల్ల అధికారుల అధికారం నానాటికి నవ్వులపాలు కాజొచ్చింది.

ఏ వీధిలో చూచినా, ఏచతుష్పధంలో చూచినా, ఏరచ్చసావిళ్ళలో, సత్రాలలో, దేవాలయాలలో చూచినా, మార్గత్వేనా వచ్చేవారంతా గుమికూడి ఆరోజున ఎంతమందికి శిక్షపడ్డదో, ఏనాయకులు ఉపన్యాసాలిచ్చారో, పోలీసులు ఏరకంగా వీళ్ళని హింసలు పెట్టారో, ఎక్కడెక్కడ కొట్లాటలు జరిగినవో, మొదలైన విషయాలుతప్ప మరొకరకమైన సంభాషణేమీ చెవిని పడడం మానేసింది. పోలీసు వారికెక్కడా ఊపిరి సలపడంలేదు నిద్రాహారాలకు తీరికే ఉండడంలేదు పాపంవాళ్ళకు ఈ హడావిడిలో వనా మామూలే. ఏదో గ్రామంలో అరెస్టయి ఒకనాటి సాయంకాలానికి వారిని

భీమవరం తీసుకువచ్చారన్న వార్త ఊరంతా వ్యాపించింది. ఊళ్ళో అశేషజనమూ, యిరుగుపొరుగు గ్రామాలకు ఈ వార్తఅందినంతవరకూ ఆయాగ్రామవాసులు నలభైయాభై వేలమందివరకూ పోలీసుస్టేషన్ను చుట్టుముట్టారు. అచ్యుతరామయ్యగారిని చూడాలి అని గందరగోళం చేశారు. వీలులేదన్నారు పోలీసుజవానులు. ఎందుకు వీలులేదో చూస్తామని యింతమందీ ఒక్కసారి పదిఅడుగులు ముందుకివేశారు. దానితో పోలీసువారికి దడపట్టుకుంది. తొందరపడకండి అని కొందరు ఈ సమూహాన్ని శాంతపరచ ప్రయత్నించారు. ఇంతలోనే ఒక పోలీసు ఇన్‌స్పెక్టరు లోపలికి పరుగెత్తుకెళ్ళి అచ్యుతరామయ్యగారిని యివతలకు తీసుకువచ్చి ప్రజలఎదుట హాజరుపరచాడు. ప్రజలు అమితానందంతో జయజయధ్వానాలు చేశారు. అచ్యుతరామయ్యగారిని రాత్రికి యింటికి పంపించమనీ మరునాడు కోర్టులో వారిని హాజరుపరచే బాధ్యత తామే వహిస్తామనీ కేకలుపెట్టారు. పోలీసువారేదో సమాధానం చెప్పబోతుంటే, అచ్యుతరామయ్యగారు ముందుకువచ్చి

'నన్నింటికి పంపించమని అడగడం మీకు ధర్మంకాదు. పంపించడం వారికీ ధర్మంకాదు. అది చట్టవిరుద్ధమైనపని. ఈ ఒక్క రాత్రి నేను యింట్లో పడుకుంటేనేమి, పోలీసుస్టేషనులో పడుకుంటేనేమి నేను చట్టవిరుద్ధంగా ప్రవర్తించానని కొంతకాలం కొన్ని మాసములో సంవత్సరాలో జైలులో ఉండక తప్పదని రేపు కోర్టులో న్యాయమూర్తులెలాగూ తీర్పుచెబుతారు. అప్పుడేనా భూతలశయనం తప్పనిదేకదా. మీరు తొందరపడకూడదు. శాంతం వహించాలి. మన ఉద్యమంలో యిది మొదటిమెట్టేనన్న సంగతి మీరు మరువకూడదు. అనవసరంగా - అనవసరమేకాదు అవసరమున్నా - మీరు కోపోద్రిక్తులు కాకూడదు. మలనది శాంతిసమరం. రాగద్వేషాలకు మనమతీతులమై ఉండవలెననే ప్రథమ సూత్రం మనము. ఏనాడూ, ఏపరిస్థితిలోనూ విస్మరించకూడదు. మీరుశాంతంగా మీమీయిళ్ళకు వెళ్ళి హాయిగా నిద్రపోండి. రేపటినుంచి మీలో ఎవరో ఒకరు లేక వందమందో, పదిమందో నా స్థానం ఆక్రమించి ఈ సమరం సాగించాలిసుమండీ, వెళ్ళిరండి. పరమేశ్వరుడు మనయందున్నాడు ఇకవెళ్ళండి మరి అన్నారు చేతులు జోడించి. దానితో ఎవ్వరూ కిక్కురుమనకుండా ఈ మందంతా నిశ్శబ్దంగా వెనక్కుమళ్ళింది. 'రక్షించారు బాబయ్యా' అని పోలీసువారు ఒక్క నమస్కారంచేసి, అచ్యుతరామయ్యగారిని లోపలికి తీసుకువెళ్ళారు.

ఇటువంటి దృశ్యాలు మాకు నిత్యవ్యవహారంలో ఒక భాగమైనాయి. ఇక అచ్యుతరామయ్యగారు జైలుకు వెళ్ళడంతో నాకు ఊపిరాడకుండాకోర్టుపని ఎక్కువైంది. అయినా మధ్యమధ్య తెరిపిచేసుకునిప్రచార కార్యక్రమమూ సాగిస్తూనే ఉన్నాను. ఇక సరస్వతి కూడా ఒక్కొక్కప్పుడు రాత్రులుకూడా యింటిపట్టున ఉండకుండా, ఎక్కడచూచినా తానే! ఎక్కడ వినపడ్డా తనమాటే మోహినీరూపంలో ఉన్న భద్రకాళిలా ఉపన్యసిస్తూ, ఉత్సాహప రుస్తూ, ఉద్రేకపరుస్తూ తిరుగుతుంటే, నే నాశ్చర్యచకితుడనై, పరవశించి, నే నామెతో సమానంగా తిరగలేక కోర్టులవెంట తిరగడమేమిటి? ఇదే మికర్మ అని ఎంతో బాధపడుతుండేవాడిని. కోర్టులో కానైతే నేను చాలా తెలివైనవాడననీ, మంచివాడననీ, న్యాయమైన న్యాయవాదిననీ పేరువచ్చిన మాట వాస్తవమే. ఆ పేరుకుతగ్గ అర్జనా కనపడుతూనేఉన్నది. అయినా నా మనసు కెంతమాత్రమూ తృప్తిగాలేదు. ఈ అసంతృప్తి నానాటికే పెరుగుతూనే ఉన్నది. దీనికి మొదటికారణం కోర్టులో అన్నప్పుడూ జరుగు తున్నది న్యాయంకాదు అనే భావం బాధించడం మొదలుపెట్టింది. మదరా సులో వున్నప్పుడే హైకోర్టులో నా వృత్తి సాగిస్తున్న రోజుల్లోనే నాకీభావం బాధిస్తుండగా, ఒకరోజున I C S జడ్జిగారితో సాహసించి,

'ఈ కోర్టులలో జరుగుతున్నది న్యాయంకంటే, అన్యాయమే ఎక్కువ కనిపిస్తున్నది' అని ధైర్యంగా అనేశాను.

ఆయన నాపైన అగ్రహించకుండా చిరునవ్వు నవ్వుతూ, 'మీరన్నది నిజమేకావచ్చు పార్వతీశంగారూ! ఈ కోర్టులలో మేమిచ్చే తీర్పులు కొందరు పెద్దలు ఏర్పాటుచేసిన చట్టాలకూ, సూత్రాలకూ విరుద్ధంకాకుండా ఉండవ లెననే చూస్తాముగాని కేవలం యిదేన్యాయమూ, ధర్మమూ అని చెప్పడం కష్టమేన'న్నాడు.

(We administer law sir, not justice) ఆ మాటవిని ఆయనను సాష్టాంగ ప్రణామం చేసినంత పనిచేశాను.

ఆయన నవ్వుకుంటూ" మీరీవృత్తి అట్టేకాలం కొనసాగించగలరని అనుకోను Good luck and god bless you," అని నా భుజం తట్టి వెళ్ళిపోయాడు.

ఈ భావం యిలా ఉండగా నా సాటి లాయర్లలో చాలామందిలో

ఉండే లేకే గుణాలు, అనుమానాలు, విద్వేషాలు నాకీవృత్తిమీద వైముఖ్యం కలిగించడానికి రెండవ కారణం అనుకుంటాను. కోర్టులో ఉన్నంతసేపూ వాద ప్రతివాదుల వకీళ్ళు కుక్కల్లా కాట్లాడుకున్నా యివతలకొచ్చిన తరువాత వారివారి స్నేహాలు విస్మరించకూడదు. కాని నా అనుభవం దానికి వ్యతిరేకంగా అనేకసార్లు కనపడ్డది. మా మామగారు కార్యాంతరులై ఉండడంచేతను నామీద నెందుకో సహజంగా కొంతమందికి అభిమానం కలగడం చేతను నేను ఫీసుపరం వచ్చిన కొలదిమాసములకే నాకూ పేరూ, అర్థనా ఎక్కువ కావొచ్చింది. ఇది నా ప్రయోజకత్వమని నేనెప్పుడూ అనుకోలేదు. ఏదో గాలిపాటునో, అదృష్టమనో అనుకునేవాడిని, కాని మా సాటి న్యాయవాదులలో మట్టుకు చాలామందికి నాపైన అసూయ ఎయిలుదేరింది. ఒక్కసారి యిటు కోర్టుపనీ, అటు ప్రచారంపనీ ఎక్కువ కావడంతో, వారంరోజులు లేవలేకపోయాను. ఏ పనీ చూచుకోలేకపోయాను. విపరీతమైన దగ్గూ, జ్వరంతో బాధపడ్డాను. మొత్తంమీద ఎలాగైతేనేమి బ్రతికి బయటపడ్డాను. ఎన్నో అర్జంటు కేసులు వాయిదా వేయించుకోవలసి వచ్చింది. ఈ స్థితిలో ఒకనాడు మా మామగారికి చిరపరిచితుడు చాలా స్నేహితుడు ముఖ్యమైన క్లయింటూ ఆయన రాజుగారు ఒకాయన తెల్లవారేసరికి నన్ను చూడడానికొచ్చారు. వారిది చాలా ముఖ్యమైన వ్యవహారము నా చేతుల్లో ఉన్నది. నా అనారోగ్యంవల్ల వాయిదాలు పడుతున్నవి. ఆ సందర్భంలో వూరికే చూడడానికి వచ్చారు కాబోలు అనుకున్నాను. కొంతసేపైన తరువాతను వారు సెలవు తీసుకుంటానని లేచారు. నేనూ లేచి వీధి గుమ్మందాకా వారిని సాగనంపుతూ 'రెండు మూడురోజులలో నేను కోర్టుకువచ్చి వారం పదిరోజులలో మన వ్యవహారం పూర్తిచేస్తాను. అంతా మనకు అనుకూలంగానే ఉన్నది. మీరేమీ సందేహించనక్కరలేదు' అన్నాను.

'చిత్తం' అని వెళ్ళకుండా మరొక్షణం కదలకుండా అక్కడే నిలబడ్డారు వారు.

'ఏమిటి రాజుగారూ! ఏదో వేరే పనిమీద కూడా వచ్చినట్టున్నారు. మీరు నా దగ్గర ఏదో సందేహంతో నిలబడ్డట్టున్నారు. ధర్మమా అది మీకేమీ సందేహం అక్కరలేదు. మీ అభిప్రాయమేమిటో నిస్సందేహంగా

చెప్పవచ్చును. అన్నాను. అయినా వారు మరోక్షణం ఆలోచించి

'నాకేసందేహమూ లేదండి. తమమీదను నాకు పరిపూర్ణ విశ్వాస మున్నది. నిన్నగాక మొన్న ఈ వూరులోనే మరొక ప్లీడరుగారు పేరూ, అర్జనా వున్నవారే నన్ను వారి క్లయింట్లలో చేర్చుకోవలెనని చాలా కాలం నుంచి ప్రయత్నంచేస్తూ యిప్పుడొక అస్త్రం ప్రయోగించారు. తమకు చాలా సుస్తీగా ఉన్నదనీ చాలా ముదిరిన క్షయవ్యాధనీ, ఇక మీరు రెండుమూడు మాసములకంటే జీవించరనీ నా కేసులన్నీ సమయం మించకుండా మరొ కరికి ఒప్పచెప్పడం అనగా తమకు ఒప్పజెప్పడం మంచిదనే ఉద్దేశ్యంతో నాకు కబురు చేశారు. నేను నిర్ఘాంతపోయాను. ఈ పెద్దవారు అనట దేవారికి కూడా యింత నీచమైన ఆలోచనలు ఉంటవా అని నిశ్చేష్టుడనై చాలా బాధపడ్డాను. ఈ సంగతి మీ చెవిని వేద్దామని వచ్చానుగాని, మీ ఆరోగ్యాన్ని గురించి వారిచ్చినరిపోర్టు నమ్మిమట్టుకు కాదుసుమండీ" అని ఒకనమస్కారంచేసి ఇక నిలబడకుండా వెళ్ళిపోయారు. నేను లోపలికివచ్చి మానవస్వభావాన్ని గురించి ఆలోచిస్తూ ఎంతోసేపు అలాగే పడుకునుం డిపోయాను.

ఇది జరిగిన మూడోనాడు కోర్టులో నేను కనబడేటప్పటికి ఆ పెద్దప్లీడరు గారు ఆశ్చర్యపోయారు. ఏమండీ ఆరోగ్యంగా ఉన్నదా! అని మామూలుగా అనే మాట అనటంకూడా మర్చిపోయారు. మరి నాలు గైదు రోజులలో మా రాజుగారి కేసు విచారణ జరగడం ఆ కేసు రాజుగారి పక్షమే కావడంలోఆ ప్లీడరుగారికి పక్షవాతం వచ్చినంతపని అయింది.

## 22

నాకు కోర్టుపని ఎక్కువైనకొద్దీ నా వృత్తిమీద నాకెంతో నిరుత్సా హము. అసహ్యమూ కలుగనారంభించింది. ఇక్కడజరిగే అవకతవకలూ, ప్లీడర్ల మనస్తత్వాలు, క్లయింట్ల పేచీకోరు స్వభావాలు, ఏవిధనా పై ఒక్క అంగుళం మేరయినా పరులాస్తినపహరించవలెననే ఆతృతా, చేడకో పావ లాకో కక్కుర్తిపడే వాదితరపునో, ప్రతివాది తరపునో కోర్టుకు హాజరై 'దేవుని ఎదుట నిజం చెబుతాను. అబద్ధం చెప్పను' అని ఖరాగా ప్రమాణం చేసి, నిర్మొహమాటంగా తప్పుడు సాక్ష్యం చెప్పటే వృత్తిగా

పెట్టుకొన్న మనుష్యులను చూస్తూంటే, తమ ఉద్యోగానికి గవర్నమెంటు యిచ్చే జీవన భృతికి తృప్తిపడక రహస్యంగా చెయ్యిజాపి సంపాదించి తమరు ప్రతి నిత్యంచేసే న్యాయవిరుద్ధ కార్యకలాపాలను విస్మరించి ఆ నేరములే మరొకడు చేశాడనే అభియోగం కోర్టులో వస్తే ఆ మనిషి శిక్షార్హుడని నిర్మొహమాటంగా నిర్ణయించి, శిక్ష విధించే అధికారులను చూస్తే నేను నేర్చిన విద్యమీదా, సంపాదించే డబ్బుమీదనూ, వుద్యోగంచేసే న్యాయమూర్తులమీదనూ సాటి ఆంధ్రుల మీదను అసలు మానవ జాతిమీదనే, ఈ నాగరికతమీదనే ద్వేషము అహస్యమూ బయలుదేరి ఈ వృత్తి ఎప్పుడు వదులుకుందామా అనే తొందరపాటు ఎక్కువ కాజొచ్చింది. గాంధీగారు న్యాయవాదులంతా ఈ న్యాయస్థానాలను, విద్యార్థులంతా విద్యాలయాలను విడిచి దేశసేవకై కంకణం కట్టుకుని జీవితాలు స్వరాజ్య సంపాదనకు అంకితం చేసుకోమని చెప్పిన ప్రబోధంలో ఎంత సత్యమూ, ఔచిత్యమూ ఉన్నదో రోజు రోజూ రుజువవుతూ వచ్చింది. నేను కోర్టుపని తగ్గించుకుని ఎక్కువగా కాలక్షేపం చేస్తూ వచ్చాను. ఈ బాధపడలేక క్లయింట్లు వేరే ప్లీడర్ల దగ్గరికి వెళ్ళక తప్పిందికాదు. నేనీ ప్రచార పర్యటనలో ఒక రోజున అరెస్టుకాకనూ తప్పలేదు. గవర్నమెంటు ధర్మమా అని ఆరుమాసములు రాజమండ్రి జైలులో విశ్రాంతి తీసుకోమన్నారు. 'న్యాయమూర్తులు కరుణామయులు, తమ ఆజ్ఞ అవశ్య మనుసరణీయము, నేనందులకు కృతజ్ఞుడను, అని నమస్కరించి బోనులోనుంచి దిగేసరికి అక్కడ గుమిగూడిన జనమంతా హర్షధ్వానాలు చేస్తుంటే న్యాయస్థానంలో కూర్చున్న అధికారి నిశ్చేష్టుడై సిగ్గుతో తలవంచుకున్నాడు.

ఇంకనక్కడను విచారణచూడటానికి వచ్చిన జనమంతా నాతోటి కూడా బయటకువచ్చి జైలుదాకా నన్ననుసరించి కొత్తకోడలును అత్తింటికి పంపేనట్లు ఆనందాశ్రువులతో నన్ను నూతనగృహప్రవేశంచేయించి, వారి దారిన వారు మౌనంగా వెళ్ళిపోయారు. జైలుకెళ్ళడం అంటే అప్పుడే అందరికీ భయంపోయింది. భయం పోవడమే కాకుండా ప్రతివాళ్ళూ కనపడ్డ పోలీసుజవాను దగ్గరికి వెళ్ళి 'చేతనయితే నన్ను అరెస్టుచెయ్యి ఏ మాత్రం చేస్తావో చూస్తాను' అన్న సవాలు చేసేంతవరకూ ప్రతివాడికీ ధైర్యం వచ్చింది. ఇక జైలుకి వెళ్ళినవాళ్ళు జైలు జీవనం చాలా హాయిగా ఉందనీ పైకివచ్చి కబుర్లు చెబుతుంటే చాలా మంది యువకులు [illegible]

కథలనుకునే వాళ్ళు. చూస్తే చాలావరకూ వాళ్ళమాటలూ నిజమే నని పించిందిప్పుడు. ఏమంటే ఇప్పుడు జైళ్ళలో బయిరాయించుకుని కూర్చున్న వాళ్ళంతా చాలా చాలా చదువుకున్నవాళ్ళూ, ఆస్తిపరులూ, పెద్ద పెద్ద సంపాదనలకు అలవాటు పడిన వాళ్ళూనూ, వాళ్ళందరూ జైల్లోకివచ్చినా, పూర్వపుటలవాటులను మరువలేక, మార్చుకోలేక అక్కడక్కడా కావల సిన సౌకర్యాలు ఏర్పాట్లు చేసవకోవడం మొదలెట్టారు. అనగా కావలసిన రకరకాల ఫలహారాలూ, టీలూ, కాఫీలూ, సిగరెట్లూ మొదలైనవన్నీ జైలు గోడల లోపలకు తెప్పించుకోకూడదన్న సంగతి తెలిసికూడా, తమకు కావలసిన సదుపాయములన్నీ చాల్లా వరకు ఎలాగో ఒకలాగున తెప్పించు కోవడం అలవాటు చేసుకున్నారు. ఒకరోజున ఒక తమాషా జరిగింది. మా అందరిలోకి పెద్దనాయకుడికి ఈ చేష్టలు ఏవీ యిష్టం ఉండేవికాదు. ఒకరోజున ఎవరో ఓయింటిదగ్గర నుంచో, మరొకచోటనుంచో, మంచి జిలే బీచేయించి తెప్పించారు. తెప్పించడమేకాక అది అందరికీ పంచిపెట్టారు కూడాను. ఈ నాయకుడు యిక్కడికెలా వచ్చింది అని ప్రశ్నించకుం డానే, నిర్మొహమాటంగా తమకు కావలసినంత పుచ్చుకొని అది అందించిన వారిని మెచ్చుకున్నారుకూడాను. ఆ మరునాడు ఏదో పండగని పేరు పెట్టి నాలుగైదు రకాల ఫలహారాలూ, కాఫీలూ, టీలూ హోటలునుంచి ఒక పెద్దమనిషి తెప్పించి అందరికీ విందు చేయించాడు. మా నాయకుడు వచ్చి ఈ ఏర్పాటంతా చూచి,

'ఇదందా చట్టవిరుద్ధం. ఎవరు ఏర్పాటుచేశారు? ఇవన్నీ ఇక్కడకు ఎలా వచ్చినాయి' అని కొంచెం తీవ్రంగా ప్రశ్నించారు.

ఎవరూ కిక్కురుమనలేదు. అందరూ తెల్లబోయి మూగబోయి కూర్చున్నారు.

'ఏమండీ ఎవరూ మాట్లాడరేం?' అని ఆయన మళ్ళీ మరింత తీవ్రంగా అడిగారు.

నేనూరుకోలేక దానికి సమాధానంగా 'కానయితే నేను చూడలేదు కానీండి. బహుశా నిన్నటి జిలేబిలు వచ్చినదారినే యివీ వచ్చివుంటాయని నా వూహ'న్నాను చాలా గంభీరంగా.

అక్కడ ఉన్నవాళ్ళంతా పకాలున నవ్వేరు. ఆయనకు విపరీతమైన

కోపంవచ్చి ఆవిందులో పాల్గొనకుండా చక్కాపోయారు. ఇలాటి కాలక్షేపా లేవో తరచు జరుగుతూ మాబాధలను మరిపిస్తుండేవి. ఇవికాక ప్రతిరోజూ సాయంకాలమో, రాత్రో పురాణ కాలక్షేపములో, రాజకీయ ఉపన్యాసా లలో శాస్త్రీయ

విషయములపై చర్చలో జరుపుతుండేవారు ఆయా విషయాలలో ఆరితేరినవారు. అందుచేత మాకు వినోదానికీ. విజ్ఞానానికీ లోటూ లేకుండా కులాసాగానే జైల్లోరోజులు ఏ బాధా తెలియకుండా గడుపుకొచ్చే వాళ్ళం.

నాకు తెలియకుండానే యిట్టే ఆరునెలలు గడిచిపోయినాయి. ఒక రోజు ఉదయాన్నే పోలీసు జవానువచ్చి,

"అయ్యా తమరింక ఇక్కడ ఒక్కక్షణంకూడా ఉండడానికి వీలు లేదనీ, వెంటనే తమరింటికి దయచేయవలసిందనీ, సూపరెంటుగారు తమతో మనవి చెయ్యమన్నారని కాళ్ళు రెండూ రక్కుమని శబ్దంచేస్తూ దగ్గరకుచేర్చి, సలాంచేసి, వెళ్ళిపోయాడు.

మిత్రులంతా నన్నభినందించి పునఃపునః శీఘ్రమేవ జైలుప్రాప్తిరస్తు' అన్నారు. అలాగే నిలబడి యింటికి వెడదామని వెనక్కుతిరిగేసరికి, మా మామగారు నవ్వుతూ అక్కడ నిలబడివున్నారు.

"ఏం నాయనా పార్వతీశం ప్రధమ పరీక్ష అయిందా! బాగానే రాసినట్టున్నావే? దా వెడదాం" అని నా భుజంమీద చెయ్యివేసి అక్కడున్న గుర్రబ్బండిలో నన్ను కూర్చోపెట్టి ఆయనకూడా పక్కన కూర్చుని, యింటికి తీసుకువెళ్ళారు. నేను కులాసాగా మాట్లాడుతూ'సరస్వతి గుమ్మం దగ్గర నాకోసం నిరీక్షిస్తూ ఉంటుందనే కలలుకంటూ యింటివద్దకు వచ్చే సరికి గుమ్మంలో మా అత్తగారు మటుకు నిలబడివుండటంచూచి, నాకు కాళ్ళు చల్లబడ్డాయి, హృదయం బరువెక్కింది. మనస్సు వికలమైంది. ఈ మార్పులన్నీ మామగారికి నా ముఖంలో కనబడ్డవి కాబోలు. ఆయనెంతో సానుభూతితో నెమ్మదిగా నా భుజంమీద చెయ్యివేసి "సరస్వతికూడా ఆ మధ్యను అరెస్టు అయిందోయ్. దానికి మూడు నెల్లు శిక్ష వేశారు." ఒక వారం రోజులలో అది తిరిగి వస్తుంది. నీకు తెలిసే ఉంటుందని ముందు చెప్పలేదు నీతో'అన్నారు.

'ఆహా అలాగండీ చెప్పకపోతే మట్టుకు మునిగిపోయిందేమున్నది? ఇలా జరుగుతుందని నేను ఊహించి ఉండవలసింది' అన్నాను.

బండిదిగి తిన్నగా ఇంకేమీ సంభాషణ లేకుండా నా గదిలోకివెళ్ళి పోయాను. చట్టసమ్మతమైనవీ కానివీ కావలసిన సదుపాయాలేవో ప్రయత్నంచేసి సాధించుకున్నా, జైలు జీవితమే అలాటిది. పాపం సరస్వతి ఏలా భరిస్తుందో అనే అలోచన వొచ్చేసరికి పట్టరాని దుఃఖం వచ్చింది. వెంటనే ఆమె సాహసం కార్యదీక్షా తలుచుకుంటే ఎంతో ఆనందమూ కలిగింది. ఆశ్చర్యం! ఒక్కమనిషి మాటవల్ల జాతి, మత, లింగ వయో భేదంలేకుండా అశేష ప్రజానీకానికీ ఇంత భావోద్రేకం ఒక్కమాటు కలిగిందంటే ఎంత ఆశ్చర్యం!

నానాటికీ ఉద్యమం తీవ్రం కాజొచ్చింది. పోలీసు జులుమూ, దౌర్జన్యము మతిమీరిపోతున్నది. ప్రతిరోజూ వందలాది వేలాది జనం ఈ బాధ లనుభవిస్తున్నారు. అంతకు పదిరెట్ల జనం, నిర్భయంగా చిరునవ్వుతో జైలుకు వెడుతున్నారు. లాఠీ దెబ్బలు తింటూనూ వున్నారు కాళ్ళూ చేతులూ విరగ్గొట్టుకుని వికలాంగులవుతూనూ వున్నారు. కొంత మంది మృత్యువు వాతను కూడా బడ్డారు. ఏమైనా, నదురూ, బెదురూ, భీతిలేకుండా వెనుతిరగడమనే మాటే లేకుండా ముందుకే వేలాది, లక్షలాదిజనంతోసుకు వస్తున్నారు. జైళ్ళలో ఎక్కడా ఖాళీ కనపడ్డంలేదు. దెబ్బలుతిన్నవాళ్ళతో అస్పత్రులూ నిండిపోతున్నాయి. ఇలా యావద్భారతం ఒక్కుమ్మడిగా ముందుకు తోసుకు వస్తుంటే, పాలకవర్గం భయభ్రాంతులై ఈ ప్రవాహాన్ని, ఈ వుద్రేకాన్ని ఎలా అరికట్టాలో ఏకొట్టాలో తెలియక ఉక్కిరిబిక్కిరి కాసాగారు. అధికారులు ఏమి చేయడానికి తోచక, ఈ తుఫాను అరికట్టే ఉపాయము తోచక, దౌర్జన్యకాండకు దిగారు. జైల్లోపడ్డ స్త్రీ పురుషాదులను రకరకాలుగా హింసలు పెట్టారు. అది చాలక మన మతానికి వర్ణవ్యవస్థకూ అపార్థాలు కల్పించి వర్ణ విద్వేషం రెచ్చగొట్టి ఈ ద్వేషం శాశ్వతంగా ఉండడానికి ఒక ప్రత్యేకపు రాజకీయ పార్టీకి నాయకులుగా తయారుచేశారు. ఫలితం వెంటనే కనిపించింది. వారాశించిందంతా అనుకున్నదంతా జరగనే జరిగింది. భరతఖండమంతా ఒక్కటవుతుందనీ, పునరుజ్జీవనము పొంది పూర్వపు ఔన్నత్యం పుంజుకుంటుంది, అనే ఆశాకి

రణాలుకనబడుతున్నాయనుకున్న సమయంలో పాలకులు నాటిన విషబీజాలు మహావృక్షాలై విషవాయువులను దేశం నలుదిక్కులా ప్రసరింపచేసి మతకల్లోలాలూ, కులవిద్వేషాలూ ఎక్కడ చూచినా బయలుదేరదీసి, మళ్ళీకొన్ని దశాబ్దాలవరకూ ఈ దేశం లేవకుండా నడుము విరగ్గొట్టేనంతపనిజరిగింది. కాంగ్రెసు ఉపన్యాసాలు ఉత్సవాలు, ఊరేగింపులు ఎక్కడ బయలుదేరినా, వాటికడ్డుతగలడానికి, చెదరగొట్టడానికీ పోలీసులు లారీలు అక్కర లేకుండా ఈపార్టీ వారు తమబలగం కొద్దయినా, రౌడీమూకలను వెంటపెట్టుకొచ్చి వీరిని చెదరగొట్టడం ఒక పరిపాటయిపోయింది. ప్రతి వర్గంలోనూ, ప్రతి శాఖలోనూ ఇక నిన్నిమాట లెందుకు ప్రతి ఇంటా తండ్రీ కొడుకులకు, భార్యా భర్తలకు సోదరీసోదరులకూ మధ్య నీ వైషమ్యాలు ప్రబలిపోయి దేశం చిన్నాభిన్నమయ్యే స్థితికే వచ్చింది దుర్భరమైన ఈ విభిన్నత్వానికి దారితీసినవారూ ప్రోత్సహించినవారూ, పెద్దలు చదువుకున్నవారూ, విజ్ఞానవేత్తలేకాని సామాన్యులు కారు. ఇక ని పరిస్థితులు ఎలావున్నా ఎంత బాధాకరంగా ఉన్నా మన లక్ష్యం మరువకూడదు. గమ్యం చేరవలసినదే. చేరి తీరుతాం అనేకాంగ్రెసు నాయకుల శంఖారావాలు మరింత ధీమాగా దేశం అంతటా ప్రతి ధ్వనించసాగాయి. ప్రజల ధైర్యస్థయిర్యములు సడలిపోకుండా ప్రచారం, ప్రబోధం ఎక్కువవుతున్నాయి. కొత్తకొత్త పన్నాగాలు పన్నడ మారంభించారు గాంధీగారు. అధికారులమీదా, న్యాయస్థానాలమీదా రోజురోజుకూ ఏ కించిత్తు గౌరవంకూడా లేకుండా పోవనారంభించింది. అధికారులు ఏ మాటన్నా, ఏపని చేసినా దాని కపార్థాలు కల్పించి అల్లరిచేయ నారంభించారు కాంగ్రెసువారు. నేను మూడవసారి జైలుకి వెళ్ళినప్పుడు వెనక చెప్పిన దువ్వూరి సుబ్బమ్మగారు కూడా ఆ జైలులోకె వచ్చారు. మమ్ములను చూడడానికి ఫ్వూళ్ళోనుంచి కొందరు మిత్రులు వచ్చి మాటలమధ్యను సంగీతాలు, సాహిత్యాలు పద్యాలు ప్రారంభించారు. మాకు కొంచెంఎడంగా వున్న స్త్రీల విభాగంలో దువ్వూరి సుబ్బమ్మగారు ఈ సంగీతం విని మా విభాగంలోకొచ్చి,

'ఎవరు నాయునా ఆ పద్యాలు పదివేది' అన్నది. ఆవిడ ప్రూర్విరాలపు వితంతు స్వరూపం చూచి మా మిత్రులలో ఒకతను,

'మొగాళ్ళలెండే యిక్కడ, పాడుతున్నారు' అన్నాడు.

'అలాగా నాయనా. నేను పొరపాటు పడ్డానన్నమాట. ఏదో వెర్రి ముండని నాకేం తెలుసునూ, నాకు తెలిసిందల్లా ఒక్కటే. ఈ రోజుల్లో మగాళ్లయితే కార్యరంగంలోకి దిగి, వారూ మాకు మల్లే జైల్లో వుండే వారనుకున్నాను. ఇక్కడా అక్కడా వెర్రిమొర్రి పాటలు లల్లాయి సంగీతాలు పాడుతూ సుఖంగా తిరుగుతూ వుంటారనుకోలేక పోయాను' అని గిరుక్కున తిరిగి చక్కాపోయింది ఆవిడ.

ఆ దెబ్బతో వీళ్ళనోళ్ళు కట్టుబడ్డాయి. ఎవడిముఖాన్ని కత్తివేటు వేసినా నెత్తురుచుక్క రాదనుకున్నాను. వీళ్ళుకూడా ఇంకనక్కడ విలువ లేక ఘూటామంతీ లేకుండా సెలవనికూడా అనకుండా మవునంగా వెళ్ళి పోయారు. ఇటువంటి సంఘటనలు ప్రతినిత్యం ఏన్నో జరుగుతుండేవి.

పూర్వం న్యాయవాదులకు, న్యాయమూర్తులమీద ఎంతో గౌరవముం డేది. వారూ న్యాయవాదులయెడల ఆదరమూ, అభిమానమూ, గౌరవమూ ప్రదర్శించేవారు. ఇప్పుడవన్నీ పోయినాయి. అందులోనూ ఆంగ్లేయులు అధికార స్థానంలో వుంటే వారియెడల మరీ నిర్లక్ష్యం చూపేవారు మన న్యాయవాదులు. ఒకసారి బెజవాడ న్యాయవాది ఒకరు నాలా సమర్థుడూ, నిజమైన న్యాయవాదీ, దగ్గిరవున్న ఒక వూరువెళ్ళి అక్కడ సబ్ కలెక్టరు దగ్గర వాదించవలసి వచ్చింది. ఈయనెంతో శ్రమపడి అక్కడకు వెళ్ళేసరికి కలెక్టరుగారు ఎక్కడికో వెళ్ళడానికిక సైకిలెక్కబోతున్నారు. ఈయన్ను చూచి సైకిలుమీద పెట్టిన కాలు దింపుకుండానే,

'ఏమండి వచ్చారా?' అన్నాడు.

'అవునండీ తమవద్ద కేసున్నదికదా యిప్పుడు. అందులో వాదించడా నికి వచ్చాన'న్నాడు.

ఆయన పైకిలెక్కుతూ 'అయితే వాదిస్తూఉండండి. నాకు కొంచెం పని ఉన్నది మరొకచోట అలా వెళ్ళివస్తాను' అన్నారు కలెక్టరుదొరవారు.

'అయితే తమరు దయ చేసేవరకూ వేచివుంటాన'న్నాడు ప్లీడరుగారు.

'అక్కర్లేదండీ మీ వాదన కానివ్వండి' అన్నాడు ఆయన.

'పోనీ మరో రోజున వస్తానులెండి' అన్నారు వకీలుగారు.

'అక్కరలేదయ్యా, నీ వాదన కానిమ్మంటూంటేని కదా' అన్నాడు కొంచెం చిరాకుగా,

ఈయనకు వళ్ళుమండింది. 'మీరు లేనప్పుడు నన్నీ గోడలకు వాదించమని చెప్పడం చాలా హాస్యాస్పదం. నేను వెడుతున్నాను సెలవు' అన్నాడు వకీలుగారు.

కలెక్టరుగారు ఆగ్రహావేశులై 'మీరిప్పుడిక్కడ మీ వాదన సాగించకపోతే మీరిక్కడ ఎప్పుడూ వాదించడం జరగనే జరగద'న్నాడాయన.

'అదే నా మనవికూడా' అని మారుమాటలేకుండా వెళ్ళిపోయాడు. గాంధీగారి స్వాతంత్ర్యోద్యమ ప్రభావమే ఇది. హైకోర్టులోకూడా మా గురువుగారు ప్రకాశంగారు ఇటువంటిదే మరో తమాషా చేశారు. ఒకసారి దొమ్మీ కేసులాంటిది వచ్చింది. సుమారు యాభైమంది ముద్దాయిలు. వారందరి తరఫునా వకాలత్తు పుచ్చుకుని ప్రకాశంగారు ముద్దాయిల తరపున వాదించడానికి హాజరయ్యారు. జడ్జిగారుకూడా చాలా తెలివైనవారూ, న్యాయమూర్తులూను. ఆయన కేసంతా ముందే క్షుణ్ణంగా చదివి ఒకరీతిగా న్యాయం చెప్పవలెనని నిర్ణయానికొచ్చారు. కోర్టులో న్యాయస్థానంలో కూర్చుని ప్రకాశంగారిని ముద్దాయిలకేసు చెప్పమన్నారు. ప్రకాశంగారు ప్రారంభించిన కొన్ని నిమిషాలకు

'ఇకను చెప్పక్కరలేదు రెండోది చెప్పమ'న్నారు.

ప్రకాశంగారు అదే వాదన మళ్ళీ చెప్ప నారంభించారు. జడ్జీగారు రెండు నిమిషాలు కాగానే,

'చాలును. తరువాత కేసు' అన్నారు.

ఇలా ఏడెనిమిదిసార్లు అయిన తరువాత జడ్జీగారు కొంచెం చిరాకుగా 'ఏమిటండీ మీ వుద్దేశం ఎన్నిసార్లు అడిగినా మరొకటేమీ చెప్పకుండా అదేవాదన సాగిస్తారు. మీకింక చెప్పడానికేమీ లేకపోతే మానెయ్యకూడదా' అన్నాడు.

ప్రకాశంగారు, జడ్జీగారు చూపిన తొందరపాటును తమరు గమనించనట్టే ఎంతో ప్రశాంతంగా,

'అయ్యా ఈ కేసులో ముద్దాయిలు యాభైమంది. అందరిమీదనూ ఒకే నిందారోపణ జరిగింది. అందుచేతను యాభైమంది తరఫునా నేను వకాలతు తీసుకున్నాను. కనుక నా వాదన కూడా ఒకేరకంగా ఉంటుంది. తమరు కాస్త ఓపికతో ఒక్కవాదననైనా పూర్తిగా వినివుంటే మన ఉభయులకూ ఏ యిబ్బందీ లేకుండా ఉండేది. తమరీకేసుపై పైన చదివిన ఒక తీర్మానానికి వచ్చి మా వాదన వినకుండానే తీర్పు చెప్పేటట్లు కనిపిస్తుంది. ప్రభువులు విన్నా వినకపోయినా ఈ యాభైమంది తరఫునా మా వాదన సాగించి తీరుతాను' అని తన వాదన ప్రారంభించారు. న్యాయమూర్తులు గత్యంతరంలేక చెవులప్పగించి కూర్చున్నారు. చిత్రమేమిటంటే అన్ని కేసులూ వినేసరికి జడ్జీగారు తమ అభిప్రాయం తప్పని తెలుసుకుని వీరి వాదనలో న్యాయం గుర్తించి వీరికనుకూలమైన తీర్పుచెప్పారు.

మరొక హైకోర్టులోనే ఆంగ్లన్యాయమూర్తి, కోర్టులో వాదన జరుగుతుండగా తను న్యాయాధిపతిగా తనతోకూడా తెచ్చుకున్న ఒక కుక్కపిల్లను ఒళ్ళోపెట్టుకుని దానిని ఆడిస్తూ, లాలిస్తూ కూర్చున్నాడు. అదిచూచి న్యాయవాది తను చెబుతున్న వాదన విరమించుకుని మాట్లాడకుండా కూర్చున్నాడు. న్యాయమూర్తి ఒళ్ళోఉన్న కుక్కపిల్లను నిమురుతూ తల పైకెత్తకుండానే,

'ఏం కూర్చున్నారేం? వాదనయిపోయిందా?' అన్నారు.

న్యాయవాది నదురూబెదురూ లేకుండా, ఒక లిప్తకాలమేనా తడుముకోకుండా 'ప్రభువులు సాగిస్తున్న సమాలోచనలు పూర్తికాగానే నా వాదన సాగించవచ్చునని కూర్చున్నాను' అన్నాడు.

దానితో జడ్జీ సిగ్గుతో తలవంచుకుని, వెంటనే నౌకరుని పిలిచి కుక్కపిల్లను తీసుకుపొమ్మని అప్పజెప్పి, 'తమరింక మీ వాదన పూర్తి చేయండి' అన్నాడు.

ఇంతింత పెద్ద హోదాలలో ఉన్న ఆంగ్లాధికారులను ధిక్కరించగల సామర్థ్యం స్వాతంత్ర్యోద్యమానికి పూర్వం ఏ ఒకరిద్దరికో తప్ప అందరికీ ఉండేది కాదు. దొరలనగానే భయపడడం, దూరదూరంగా తొలగిపోవడము వగైరా. ఈనాడు అనగా ఈ ఉద్యమం ప్రారంభించిన తరువాతనే ప్రతిరోజూ ఎక్కడపడితే అక్కడ కనపడడం పరిపాటయింది. ఈపరిణామం

అనూహ్యం, ఉత్సాహజనకమూ, భవిష్యత్ శుభసూచకమూనూ.

నానాటికీ ఉద్యమం తీవ్రతరం కాజొచ్చింది. ఆంగ్లాధికారుల మీద నిర్లక్ష్యం. నిరసన ప్రబలమవుతూ వచ్చింది. ఈ పరిస్థితులలో ఎంత కాలము ఈ అధికారము నిలవకలదిక్కడ అనే ఆలోచన ప్రతివారిలోనూ బయలుదేరింది. అధికారము తమచేతిలోనున్న వారు పోలీసుదళంచేతను, అనేక దౌర్జన్యాలు తమరు ప్రోత్సహిస్తూ తమ ప్రోత్సాహం లేకపోయినా వారు చేస్తున్న క్రౌర్యాలనూ, అన్యాయాలనూ, చూచీచూడనట్టు ఊరుకుంటున్నారు. పోలీసులు బెదిరింపులు వదలి లాఠీచార్జీలూ, ఆపైన కన్నీరు కార్పించే విషవాయువు ప్రయోగములూ, ఆపైన తుపాకులూ, బాకులూ మొదలైనవన్నీ నిర్భయంగా ఉపయోగించనారంభించారు. అనేక మంది వికలాంగులుగా తయారయ్యారు. వందలాది జనం అక్కడికక్కడే మరణించారు. పోలీసును మించిన ప్రజాసమూహము కనబడితే సైనికబలాన్నే తీసుకువచ్చారు గవర్నమెంటువారు. ఇదంతా ఒక ఎత్తు. దీనిని మించిన ఎత్తు మరొకటి ప్రయోగించారు. పైన చెప్పిన విధముగా మన నుబాధించిన వారంతా మన బహిశ్శత్రువులుకాగా అంతకంటే ప్రబలమైన మన అంతశ్శత్రువులను కొంతమందిని లేవదీశారు. పనీ, పాటా తిండీ తిప్పలూ లేక వీధులంట తిరిగే రౌడీమూకలను కాంగ్రెసు సభలలో అల్లరిచేయడానికీ, ఉపన్యాసకుల పైన రాళ్ళూ వగైరా రువ్వడానికీ, ఇంకా ఎన్నెన్నో రకాల చెప్పకూడని అల్లర్లు చేయడానికీ ఉపయోగించుకున్నారు. ఇంతకంటే దారుణము మనలోనే ఉన్న కుల మత వైషమ్యాలు రెచ్చకొట్టి వారిలో చెప్పశక్యంకానీ, నిలుప శక్యంకానీ, ఎన్నటికీ మానశక్యంగానీ ప్రజల విద్వేషాన్ని రెచ్చకొట్టి మనలో సుమారు సగపాలు పైగా జనాన్ని విడదీసి మనకు శాశ్వత శత్రు సైన్యంగా తయారుచేశారు వీరిని తయారుచేసిన అధికారులూ వారి అధికారాలూ పలాయనం చిత్తగించినా, వీరుమట్టుకు తమ కృషి ఎన్నో వెర్రితలలు వేసినా, నిర్విరామంగా సాగిస్తూనే వుంటారనిపించింది. లక్షలాది జనాన్ని జైలుకు పంపిస్తూనే ఉన్నారు. వీరిపైన చేసే ఆరోపణలు ఎంత హాస్యాస్పదంగా ఉంటాయో ఈవెళ్ళిన ఖైదీలు అధికారులను ఎంత చులకనగా చూచి హాస్యాస్పదులను చేశారో ఒక్క ఉదాహరణ చెబుతాను.

ఒక బిచ్చ మెత్తుకునే గ్రుడ్డి బ్రాహ్మణుడు అరవై ఏళ్ళు పైబడిన వాడు ఈ వుద్యమ ప్రభావానికి లొంగి ఎవరో ధర్మంచేసిన పాత ఖద్దరు గుడ్డలు కట్టుకుని "కల్లుమానండోయ్ బాబూ కళ్ళు తెరవండోయ్" అనీ, "మాకొద్దు తెల్లదొరతనమనీ" జాతీయగీతాలు ప్రభోదాత్మక గీతాలు పాడు కుంటూ, అడుక్కుతింటున్న ఈ అంధుణ్ణి సూర్యుడస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూల్చద్రోయటానికి కుట్రపన్నుతున్నాడని ఆరోపణ చేసి కోర్టుముందు హాజరుపరిచారు. బోనులో ఇతనిని నిలబెట్టి కోర్టుగుమస్తా ఈ ఆరోపణ ముద్దాయికి చదివి వినిపించాడు. న్యాయమూర్తి 'ఈ ఆరోపణకు నీ సమాధానమేమి' టన్నారు.

"అయ్యా నేను పుట్టు గుడ్డిని. తలిదండ్రులు, పోషకులు, సంరక్షకులు ఎవరూ లేనివాడిని. నాబోటివాడు, ఈ పుట్టంధువు. నిరక్షరకుక్షి, బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూల్చద్రోయ ప్రయత్నిస్తున్నానని తమరు నమ్ముతున్నారా బాబూ! అలా తమరు నమ్ముతుంటే నేనీనాటికి ఇంతవాడినయ్యానని చాలా గర్విస్తున్నాను. తమరే శిక్ష విధించినా అనుభవించగలను. నాకది సుఖా నుభవం తమకది దుఃఖానుభవం కాగలదేమో ఆలోచించుకోండి" అన్నాడు.

అక్కడ గుమిగూడిన సమూహంలో ప్రతిఒక్కరిగుండె ఒక్కమాటు ఝల్లుమన్నది. అందరూ దిశలు మారుమ్రోగే హర్షద్వానాలు చేస్తూ ఆనంద బాష్పాలు విడిచి నిశ్శబ్దంగా వెళ్ళిపోయారు. న్యాయాధికారి తల వంచుకుని ఆ అంధుడైన ఈ ప్రబల విరోధికి ఆరు మాసములు కఠినశిక్ష విధించాడు.

మరొకసారి యిటువంటి తమాషాయే జరిగినది గుర్తుకొస్తున్నది. ఒక పెద్ద ముత్తైదువ అర్ధశతాబ్దం దాటిన వయస్సుగల ఆమెను ఈ ఉద్యమంలో యెంతో కృషి చేస్తున్నామెను అరెస్టుచేసి కోర్టులో హాజరు పరిచారు. న్యాయాధికారి ఆమెను ఏ ప్రశ్న వేయకుండానే,

"ఈవిడనెక్కడినుండి తీసుకొచ్చారయ్యా పొమ్మనండి అవతలికి. యింటికెళ్ళి ఆవిడపనేదో చూసుకోమనండి. రాజకీయాల్లోకి అడుగుపె ట్టవద్దని చెప్పండి. ఈ కోర్టులోకి ఇంకవస్తే మాట దక్కదనండి" అన్నాడు తీవ్రంగా.

వెంటనే ఆమె రెప్పపాటు వ్యవధి కూడా లేకుండా, ఏమీ తడు

ముకోకుండా "ఇంకొకరెవరో నాకు చెప్పడమెందుకూ? తమరు చెప్పిన మాటలే ఖంగున వినబడుతుంటేనూ, తమరు నాకు చెప్పమన్న మాటలే నేనూ తమతో చెబుదామనే వచ్చాను. నాకంతకంటే ఇక్కడ ఇంకో పనేంలేదు." అని గిర్రున వెనక్కి తిరిగి మారుమాటలేకుండా బయటకు నడిచింది. పోలీసులు ఆవిడ వెంట పరుగెత్తారు.

న్యాయాధికారికి విపరీతమైన ఆగ్రహం వచ్చి ఆవిడను చావగొడదా మన్నంత వుద్రేకంతో లేవబోతుంటే కోర్టులో ఉన్న జనమంతా చప్పట్లు కొడుతుంటే తన హోదా జ్ఞప్తికి తెచ్చుకుని తలవంచుకొని తన స్థానంలో చతికిలతడ్డాడు.

ఇలా ఎన్నెన్నో చిత్ర విచిత్ర సంఘటనలు జరుగుతుంటే పన్నులు కట్టకూడదు. అనే వుద్యమం, ఉప్పు సత్యాగ్రహం లాంటి వుద్యమం, కల్లు గీతకు తాళ్ళూ, ఈతలూ యివ్వకూడదనే వుద్యమం; యిలాంటి వెన్నో వుద్యమాలు ఒకదానికంటే ఒకటి ప్రబలమైనవి సాగుతుంటే, వాటిని ప్రతి ఘటించడానికి సాధ్యమైనంత దౌర్జన్యకాండ జరపడం, అదిచాలక మన అంత శ్శత్రువులను రెచ్చగొట్టి అంతర్యుద్ధాలు ప్రోత్సాహించడం వగైరా సమరం విశ్రాంతి లేకుండా జరుగుతుండగా, ఇది చాలనట్లు ప్రపంచ మహా సంగ్రా మమే బయలుదేరింది. మన పరిపాలకులు మనవాళ్ళందరినీ యుద్ధంలోకి మళ్ళించడానికి ప్రయత్నం చేయడం, ఏ ఒక్కరూ సైన్యంలో చేరడం యెంతమాత్ర దేశహితం కాదని కాంగ్రెసు హితబోధ చేయడం, ఇది అంతా బూటకమనీ తప్పకుండా సైన్యంలో చేరితీరడం ప్రతి పురుషుడికీ విధ్యుక్త ధర్మమనీ జస్టిసైట్లూ, ముస్లిములు, రాయిస్టులూ, రప్పిస్టులూ రక రకాలుగా ఉపన్యాసాలతో నాటకాలతో, బూటకాలతో, ధనాశతో, ప్రజలను సైన్యంలోకి లాగడానికి ప్రయత్నాలు సాగించడం, ఈ పరిస్థితులలో అంత దూరాన్నుండి ఇంతదేశాన్ని పరిపాలించడం దుస్సాధ్యం అనే వుద్దేశ్యం ఆంగ్లేయునకు ప్రబలం కావడం ఎన్నెన్నో అడ్డంకులు, యిబ్బందులు కష్టాలు, నష్టాలు, మారణాలు కల్పించి ఆంగ్లేయులు మనదేశం చిన్నాభిన్నం చేసి కొంతయినా మనకు ఒప్పగించి వెళ్ళిపోవడం అందరినీ విభ్రాంతుల్ని చేసింది. ఇక మా బోంట్లం అనగా సామాన్య కాంగ్రెసు వీరులంతా ఏమి చేయాలో తోచక నానా అవస్థలు రకరకాలైన యిబ్బందులు

పడడం చూసి, కొన్నాళ్ళు వాళ్ళకు సానుభూతి చూపుతూ కొన్ని కొన్ని హితబోధలు చేస్తూ కాలక్షేపం చేశాము నేనూ, సరస్వతీ, అచ్యుతరామయ్యగారూనూ. అచ్యుతరామయ్యగారు ప్రాక్టీసు పూర్తిగా విరమించుకుని ఆవనంతా నన్ను చూడమన్నారు. ఈ ఉద్యమం కారణం కాకుండానే నాకేనాడో ఈ కోర్టు మీదా ప్రాక్టీసుమీదా అసహ్యం తత్కారణంగా విరక్తి కలిగిందని నేనింక మళ్ళీ ప్రాక్టీసు పెట్టడం అసంభవమనీ మా మామగారికి నచ్చచెప్పాను. ఇంటికి వచ్చి, యింకే ఉద్యమంలో చేరే ప్రయత్నం చెయ్యకుండా ఉన్న భూమీ, పుట్రా చూచుకొని బాగుచేసుకోమని మా నాన్న వచ్చి చెప్పాడు. ప్రస్తుత పరిస్థితులలో అదే కర్తవ్యమేమోనని నిశ్చయం చేసుకుని నేనూ, సరస్వతి మొగల్తుర్రు చేరాము.



# తుదిపలుకు

ఎలాగైతేనేమీ, ఈనాటికి పార్వతీశం మూడవ భాగం కూడా పూర్తి చేయగలిగాను. ఇందులో నా ప్రయోజకత్వం ఏమీలేదని నా మనవి. ఏదో అనాలోచితమైన ఒక శుభముహూర్తాన చిరంజీవి పురాణం సుబ్రమణ్యశర్మ యాధాలాపంగా చేసిన సూచన వినీవిననట్లు ఏని, నాకు సలహా రూపంలో అనుశాసన చేశారు శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారు. నా వల్ల కాదు బాబూ అంటూనే, మిత్రులమాట తీసెయ్యలేక, సహృదయులూ, సాహితీ ప్రియులైన వేలాది మిత్రులకు సమాధానం చెప్పలేక, ప్రారంభించిన ముహూర్తబలం, నార్ల వారి సంకల్పబలం ఏకమై ఇంతవరకూ నా కృషి జయప్రదంగా సాగించింది.

బాగోగులు నిర్ణయించవలసినవారు సహృదయులైన చదువరులు కదా! వారిలో కొంచెం అభిప్రాయభేదమేర్పడ్డది. చాలామంది బాగున్నదన్నారు. కొందరుమట్టుకు మొదటిభాగం కంటే రెండవభాగంలోనూ రెండవభాగము కంటే మూడవభాగంలోనూ హాస్యం తగ్గుతూ వచ్చిందన్నారు. కావచ్చు. దానికి సమాధానం రెండవభాగం

చివర చెప్పాను. ఇప్పుడూ అదే సమాధానం చెప్పనవసరం లేదనుకుంటాను. అదికాక, మరొక రెండుమాటలు చెప్పవలెనని తోచింది.

పార్వతీశం పడవలో బయలుదేరిన నాటికంటే అతను విద్య పూర్తి చేసుకుని, ఒక ఇంటివాడై, పెద్ద లాయరై దేశభక్తుడై, నాయకుడు కానున్న సమయంలో అన్నీ వదలుకొన్ననాటికి మధ్యలో సుమారు ఒక పుష్కరం అనగా పండ్రెండు సంవత్సరములకాలం, అతిత్వరితంగా పరుగుతీసింది. ఈ వ్యవధిలో పార్వతీశం చాలా పెద్దవాడయ్యాడు. శారీరకంగానే కాదు, మానసికంగా, నైతికంగా చాలా పెరిగాడు. విద్య విజ్ఞానం చాలా సంపాదించాడు. తన వృత్తిలో చాలా పేరు ప్రతిష్ఠలు, అతిశీఘ్రంగా సంపాదించుకున్నాడు. కార్యదక్షుడూ, కర్మవీరుడూ కూడా అయ్యాడు. భక్తుడూ, యోచనాపరుడూ అయ్యాడు. విద్యావేత్తా, విజ్ఞానవేత్తా కూడా అయ్యాడు. అంతటితో ఆగక జ్ఞాని కాబోయే లక్షణాలు కూడా ప్రదర్శితమవుతుండేవి అతనిలో. అందుచే తను రచయిత కూడా ఈ పరిణామాన్ని గుర్తించి, తదనుగుణ్యంగా రచన సాగించవలెకదా!

ఆదిని నర్సాపురం నుంచి పడవలో బయలుదేరి లండను చేరే వరకు ఇతని అనాగరిక వేషమువలనా, తరువాత నితని అజ్ఞానకృత వికృత చేష్టల వలనా ఇతడు హాస్యనిలయుడయ్యాడు. ఇతనిని చూచిన వాళ్ళంతా విరగబడి నవ్వేవాళ్ళు, లండను చేరేసరికి, అతనికి సహజమైన తెలివితేటలతో, తన తప్పులు దిద్దుకుంటూ ఎదుటివాళ్ళను చూచి నవ్వ నేర్చాడు. ఈ రీతిగా అతని మనస్సు పెరుగుతుంటే అతని హాస్యదృష్టి, హాస్య తత్వజ్ఞానమూ కూడా పెరగక తప్పదు కదా!

సాధారణంగా మనిషి నవ్వేటప్పుడు ఎందుకు నవ్వుతున్నాడో ఆలోచించడానికి వ్యవధి లేకున్నా, ఉన్నా ఆలోచించకుండానే నవ్వేస్తాడు. సృష్టింపబడ్డ అనంత జీవకోటిలోనూ నవ్వగలవాడు మానవుడొక్కడే. నవ్వగలగడమేకాకుండా ఎందుకు నవ్వుతున్నామనే ఆలోచించగల శక్తి అతనుపయోగించుకున్నా లేకపోయినా- అతనిలో ఉండడం మటుకు

యదార్థం. ఎదుటివాడిలో ఉండే వికృత వేష భాషలు చూచి సాధారణంగా మానవుడు నవ్వుతాడని మన ఆలంకారికమతం. కేవలం ఆ వేషభాషల వికృతి చూచే కాకుండా పైకి ప్రస్ఫుటముకాని అస్త వ్యస్తలూ, అవకతవకలూ అనాలోచిత కార్యకలాపాలూ మొదలైనవన్నీ కూడా హాస్యజనకములేనని మనం తెలుసుకోవాలి. ఇవి తెలుసుకొని నవ్వినా కూడా, కారణమూహించకుండానే నవ్వుతాడు. కానీ వీట న్నిటికీ కారణం లేకపోలేదు. ఎదుటివాడిలో ఉండే అజ్ఞానాన్ని చూచి నేను చాలా తెలివైన వాడిని; నేనే అయితే అటువంటి వెర్రివేషాలూ, వికారపు చేష్టలూ, తెలివి తక్కువ పనులూ చేస్తానా అనే అహంకారం అతనికి తెలియకుండానే అతనిలో హాస్యాన్ని ప్రేరేపించగా ఒకమాటు నవ్వేసి, దానిని గురించి ఇంక ఆలోచించకుండా తనదారిని తను పోతాడు. ఇది అనగా ఈ అహంకారము నవ్వుకు కారణమని Hazlitt మొదలు Anthony ludovichi వరకు పాశ్చాత్య తత్త్వవేత్త లనేకులు అభిప్రాయపడ్డారు. తరువాత, తరువాత మానవుడు యోచనాపరుడై అంతర్ముఖుడైననాడు అహమికలన్నీ నశించి జ్ఞానియై మానవసహజమైన రాగద్వేషములకు అతీతుడై, స్వస్వరూప జ్ఞానము కలిగి, ఎదుటివాళ్ళ దౌర్బల్యములపై జాలితో అయ్యో పాపం అనుకుని నవ్వుతాడు. ఇది మన సిసలైన సిద్ధాంతమని నా నమ్మకం అందుచేతను పార్వతీశం ఎదుగుతున్న కొద్దీ మనస్సు పరిపక్వమవుతున్నదనీ సాధారణులకు అందని ఆలోచనలు అలవరచుకోగలుగుతాడనీ ఆ కారణం చేతను అతని హాసము ఎక్కువ సునిశితమై, నాజూకవుతుందనీ, ఆ రీతిగా అతనిని రూపొందించ ప్రయత్నించాను. ఇంతకంటే విపులముగా చర్చించటా నికి ఇది అదనుకాదు గనుక యిప్పటి కీ సమాధానముతో విమర్శకులు తృప్తి పడతారని ఆశిస్తున్నాను.

ఇంకను ఆఖరిసారిగా, పత్రికా ప్రచురణ ప్రారంభిస్తే నరసింహ శాస్త్రి గారు రెండు మూడు భాగములు కూడా వ్రాయగలుగుతారేమో అని మొదట సూచించిన చిరంజీవి పురాణం సుబ్రమణ్యశర్మకూ, ఆ

సూచనను వెంటనే అందుకుని నన్ను ప్రోత్సహించి బలపంత పెట్టి నా లేఖినిని నడిపించిన మిత్రులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారికీ, నాకు మొదటినుంచి కుడిచేయిగా సాయపడిన చిరంజీవి కుమారి కప్పగంతు రాజరాజేశ్వరికీ, చిరంజీవి ఇంద్రగంటి శ్రీకాంత శర్మకూ, మరొకమారు నా కృతజ్ఞతలు తెలుపుకుంటూ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిరస్తు అని ఆశీర్వదిస్తూ, సెలవుతీసుకుంటాను.

మొక్కపాటి నరసింహశాస్త్రి